

డాక్టర్ బాబాసాహెబ్ అంబేడ్కర్

ఎం.ఎ., పి.హెచ్.డి., డి.ఎస్.సి., బార్–ఎట్–లా, జె.పి., ఎల్.ఎల్.డి., డి. లిట్.

జననం : 14 ఏప్రిల్, 1891

పరినిర్వాణం : 6 డిసెంబర్, 1956

# డాక్టర్ బాబాసాహెబ్ అంబేద్కర్
## రచనలు - ప్రసంగాలు
### సంపుటి - 5

తన ప్రేమలోనూ, ద్వేషంలోనూ దృఢంగా లేని వారెవ్వరైనా తన కాలం పై తన ముద్రను వేయలేదు; ఉన్నత సూత్రాలకూ, పోరాట ధ్యేయాలకూ చేయవలసినంత దోహదం చేయలేదు. అన్యాయం, నిరంకుశం, ఆడంబరం, మోసం – వాటిని నేను ద్వేషిస్తాను. నా ద్వేషం, వీటిని పాటించే నేరస్థులందరిపైకీ ప్రసరిస్తుంది. నా ద్వేష భావనలు ఒక వాస్తవిక శక్తిగా నేను భావిస్తానని నా విమర్శకులకు చెప్పాలి. అవి కేవలం నేను నమ్మిన ఆదర్శాల వల్ల నాకున్న ప్రేమ యొక్క ప్రతి చర్యలే.

డా॥ బి.ఆర్. అంబేద్కర్

రెనడే గాంధీ, జిన్నా"కు రాసిన ముందుమాటలో.

# డా॥ బాబాసాహెబ్ అంబేద్కర్
# రచనలు – ప్రసంగాలు
## సంపుటం – 5


ప్రధాన సంపాదకులు

ఆచార్య పేర్వారం జగన్నాథం
ఉపాధ్యక్షులు, తెలుగు విశ్వవిద్యాలయం

సంపాదకులు

ఆచార్య కోవెల సుప్రసన్నాచార్య
ఆచార్య మాదిరాజు రంగారావు
శ్రీ జానపట్ల ఎల్లయ్య

అనువాదం
కాకతీయ విశ్వవిద్యాలయం
సారథ్యం
తెలుగు విశ్వవిద్యాలయం
కన్వీనర్
ప్రొఫెసర్ జయధీర్ తిరుమలరావు



ప్రచురణ
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం
1994

# Dr. BABASAHEB AMBEDKAR

# RACHANALU - PRASANGALU VOL - V



Compiled in English : **Vasant Moon**

***First Print***
April, 1994

Copies : 2,000
Library Edition Rs. 80/-
Popular Edition Rs. 50/-

General Editor
**Prof. PERVARAM JAGANNADHAM**

Editors:
**Prof. Kovela Suprasannacharya**
**Prof. Madiraju Ranga Rao**
**Sri. Janapatla Ellaiah**

Convenor
**Prof. JAYADHIR THIRUMAL RAO**

Copies can be had from
**Registrar,**
**Telugu University**
**Lalitha Kala Kshetram**
**Public Gardens**
**Hyderabad.**

Cover: **E. Krishna**

Printed at
**Printorium**, Hyderabad.

# ముందు మాట

భారత రాజ్యాంగ నిర్మాతగా, దళిత వర్గాల నాయకుడిగా, రాజనీతి కోవిదుడుగా, న్యాయశాస్త్ర పారంగతుడుగా, ప్రజాభిమానాన్ని చూరగొన్న మనీషి డాక్టర్ బాబా సాహెబ్ అంబేద్కర్. కుల వ్యవస్థలో కూరుకుపోయిన వారికి డా॥అంబేద్కర్ ఒక ఆశాజ్యోతి. ఒక చైతన్య కేతనం, స్వేచ్ఛ, స్వాతంత్ర్యం, సమానత్వం, సౌభ్రాతృత్వాల మేలు కలయికగా ఉండే సమాజం అంబేద్కర్ లక్ష్యం.

మహర్ కులంలో జన్మించిన అంబేద్కర్ విద్యార్థి దశ నుండే సమాజం చేత దుర్భరమైన అవమానాలను ఎదుర్కొన్నారు. దానితో చిన్నతనంలోనే ఆయన సంఘ సంస్కరణ, పీడిత జనోద్ధరణే పరమ లక్ష్యంగా ఎన్నుకొన్నారు. ఆయన ఏ వృత్తి చేపట్టినా ఆ లక్ష్యానికి దూరం కాలేదు. ఆ లక్ష్య సాధన కోసం కార్యక్రమాలను కొనసాగించారు. ఆ క్రమంలోనే రచనలు చేయడం, ప్రసంగాలు చేయడం ద్వారా ప్రచారం చేయడం వంటి ప్రధాన మార్గాలను ఎంచుకున్నారు.

బలహీన వర్గాలలో చైతన్యాన్ని రగిలించి వారికి నాయకత్వం వహించి డా॥ అంబ్కేదర్ తన రాజకీయ మహా ప్రస్థానానికి శ్రీకారం చుట్టారు. బొంబాయి రాష్ట్ర శాసన సభ సభ్యత్వం, రాజనీతి శాస్త్రంలో విశేష పరిజ్ఞానం డా॥అంబేద్కర్ కృషికి ఎంతగానో దోహదం చేశాయి.

డా॥ అంబేద్కర్ అహర్నిశలు ప్రతి దశలోనూ దళితుల అభ్యున్నతి కోసం కృషి చేశారు. రాజ్యాంగంలో దళితుల కోసం ఏర్పాటయిన ప్రత్యేక హక్కులు, వసతుల కోసం నిర్విరామంగా కృషి చేసిన విషయం లోక విదితమే.

దళిత జనాభ్యున్నతి కోసం ఆయన సాగించిన అవిశ్రాంత పోరాటానికి వెన్నుదన్నుగా భారత చరిత్ర,ం శృతి స్మృతి పురాణాది ప్రాచీన వాఙ్మయాన్ని, అందుకు సంబంధించిన ఆధార గ్రంథాల్ని క్షుణ్ణంగా ఆకళింపు చేసుకున్నారు. తాను చేపట్టిన మహత్తర సంస్కరణోద్యమాన్ని శక్తివంతంగా నడిపించారు.

డా॥ అంబేద్కర్ ఏ రంగంలో కృషి చేసినా రచనా వ్యాసంగాన్ని విడనాడలేదు. రాజకీయం, ఆర్థిక ధార్మిక విషయాలపై అసాధారణ ప్రతిభతో ఆయన రాసిన రచనలు, చేసిన ప్రసంగాలు అంబేద్కర్ జ్ఞాన సంపదకు మణిహారాలు.

అమూల్యమైన అంబేద్కర్ రచనలు - ప్రసంగాలను సేకరించేందుకు 1976లో మహారాష్ట్ర ప్రభుత్వం ఒక నిపుణుల సంఘాన్ని ఏర్పాటు చేసింది.

ఫలితంగా డా॥అంబేద్కర్ గ్రంథావళిని మహారాష్ట్ర ప్రభుత్వం 1979లో డా॥ బాబాసాహెబ్ అంబేద్కర్ జన్మదినాన ఆంగ్లంలో వెలువరించి భారతావనికి అందించిది.

ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం డా॥ అంబేద్కర్ శత జయంతి ఉత్సవాల సందర్భంగా ఆయన రచనలు, ప్రసంగాలను తెలుగులోకి అనువదించాలని నిర్ణయించింది. ఈ విషయంలో అప్పటి రాష్ట్ర ముఖ్యమంత్రి మాన్యశ్రీ నేదురుమల్లి జనార్ధన రెడ్డిగారి ఆసక్తి, ఉత్సాహం అనువాద కార్యక్రమానికి ప్రేరకాలయినాయి. వారు నిధులను కూడా సమకూర్చినారు.

అనంత కాలంలో ముఖ్యమంత్రి మాన్యశ్రీ కోట్ల విజయ భాస్కర రెడ్డిగారు డా॥అంబేద్కర్ రచనల అనువాద కార్యక్రమానికి మరింత చేయూత అందించినారు. అందుకు రాష్ట్ర ప్రభుత్వానికి ధన్యవాదాలు తెలుపుతున్నాం.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఈ అనువాద కార్యక్రమ నిర్వహణకు సారథ్య సంస్థగా తెలుగు విశ్వవిద్యాలయాన్ని నియమించింది. తెలుగు శాఖలు ఉన్న కొన్ని విశ్వ విద్యాలయాలు,ఇతర ముఖ్య సంస్థలను ఈ అనువాద కార్యక్రమంలో భాగస్వాములను చేసి తెలుగు విశ్వవిద్యాలయం పూర్వ ఉపాధ్యక్షులు పద్మభూషణ్ ఆచార్య సి.నారాయణరెడ్డిగారు ఈ ప్రణాళికకు రూపకల్పన చేశారు. వారి నేతృత్వంలో అనువాద కార్యక్రమానికి ఆరంభం జరిగింది.

పైన పేర్కొన్న వివిధ సంస్థలు డా॥అంబేద్కర్ రచనల అనువాద కార్యక్రమాన్ని బాధ్యతాయుతంగా స్వీకరించినాయి. అంతే కాదు ఆయా సంస్థలకి చెందిన వ్యక్తులే సంపాదక బాధ్యతలు నిర్వహించినారు. వివిధ రచయితలు, పండితులు చేసిన అనువాదాల్లో

సంపాదకులు ఎంత ప్రయత్నించినప్పటికీ కొంత భిన్నత, అనువాద శైలీ భేదాలు చోటు చేసుకోక తప్పలేదు.

డా॥అంబేద్కర్ రచనల్లో చేసిన ప్రసంగాల్లో వాడిన పదాలకి ఆయా సందర్భాల ననుసరించి కనిపించే కొన్ని అర్థాలు నేడు వాడుకలో కనిపించడం లేదు. ఆ విధంగా డా॥అంబేద్కర్ ఉపయోగించిన పదాలకు వివిధ శాస్త్రాలకు సంబంధించి రకరకాల అర్థచ్ఛాయలు కనిపిస్తాయి. ఆంగ్ల పదాలకు సరిసమానమైన ఒకే పారిభాషిక పదం అన్నిసందర్భాల్లో అన్వయించక పోవడం మరో ఇబ్బంది. అందుకే సందర్భాన్ని అనుసరించి అర్థం చెడకుండా తెలుగులో వివిధ పదాలను వాడడం తప్పని సరిఅయింది.

డా॥అంబేద్కర్ రచనలు - ప్రసంగాల అనువాద కార్యక్రమానికి తగిన సలహాలు సూచనలు ఇచ్చేందుకు ఒక పరిశీలన సంఘం ఏర్పాటయింది. పార్లమెంటు మాజీ సభ్యులు శ్రీ కోట పున్నయ్య, ప్రముఖ విద్యావేత్త డా॥టి.వి. నారాయణ, ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ న్యాయశాఖ మాజీ కార్యదర్శి శ్రీ జె.వీరాస్వామి సభ్యులుగా ఉన్నారు. పరిశీలనా సంఘ సభ్యులు చేసిన సూచనలననుసరించి,వారి మార్గదర్శక సూత్రాలను దృష్టిలో ఉంచుకొని సారథ్య సంఘంగా తెలుగు విశ్వవిద్యాలయం అనువాద కార్యక్రమాన్ని ముందుకు నడిపిస్తున్నది. ఈ సందర్భంగా వారికి నా ప్రత్యేక ధన్యవాదాలు తెలుపుతున్నాను.

డా॥అంబేద్కర్ రచనలు - ప్రసంగాలు సంపుటాలను అనువదించే బాధ్యతను తెలుగు విశ్వవిద్యాలయం వెంటనే వివిధ విశ్వవిద్యాలయాలకు, కొన్ని సంస్థలకూ అప్పగించింది. ఈ సందర్భంలో రాష్ట్ర ప్రభుత్వ విద్యాశాఖ, సాంఘిక సంక్షేమ శాఖలు ఏర్పాటు చేసిన సమావేశాలకు హాజరయి తెలుగు విశ్వవిద్యాలయం రిజిస్ట్రార్ డా॥ తాళ్ల వెంకటరెడ్డి ప్రచురణల కార్యక్రమాన్ని క్రమబద్ధం చేశారు.

డా॥అంబేద్కర్ శత జయంతి ఉత్సవాలను పురస్కరించుకొని తెలుగు విశ్వవిద్యాలయం అనువదించి, ముద్రింపచేసిన ఏడవ సంపుటం తిరుపతిలో 14.4.1992 నాడు ఆవిష్కృతమైంది.

డా॥అంబేద్కర్ జయంతిని పురస్కరించుకొని డా॥అంబేద్కర్ పీపుల్స్ ఎడ్యుకే ట్రస్ట్ వారు అనువదించిన మొదటి సంపుటం హైదరాబాదులో 14.4.1993న ఆవిష్కృతమైంది.

డా॥అంబేద్కర్ పీపుల్స్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్ వారు అనువదించిన నాల్గవ సంపుటం, డా॥అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయం వారు అనువదించిన ఎనిమిదో సంపుటం, శ్రీ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం వారు అనువదించిన తొమ్మిదో సంపుటం మరియు తెలుగు విశ్వవిద్యాలయంవారు అనువదించిన పదకొండవ సంపుటం హైదరాబాదులో తేదీ 25.1.1994నాడు ఆవిష్కృతమైనవి.

ప్రస్తుత సంపుటం డా॥అంబేద్కర్ గ్రంథావళిలో అయిదవది. దీని అనువాదాన్ని కాకతీయ విశ్వవిద్యాలయం వారు నిర్వహించినారు. ఈ గ్రంథంలో అస్పృశ్యులు, నాగరికత, అస్పృశ్యులు ఇతరులు, కులశాపము, అస్పృశ్యులు వారి తిరుగుబాటు, గాంధీ మరియు అతని ఉపవాసం, అస్పృశ్యులకు హెచ్చరిక, కులం మరియు మార్పు, అస్పృశ్యులను క్రైస్తవీకరణం చేయడం, మతేతరుల పరిస్థితి మొదలగు విషయాల విశ్లేషణాత్మకంగా చర్చించినారు.

ఈ 5వ సంపుటం అనువాదాన్ని కాకతీయ విశ్వవిద్యాలయ తెలుగు శాఖ ప్రముఖ రచయితలకు., అనువాదకులకు అప్పగించింది. అనువాదాన్ని సకాలంలో అప్పగించడానికి విశేషంగా తోడ్పడిన ఆచార్యకోవెల సుప్రసన్నాచార్య, ఆచార్య జి. శ్రీనివాసరెడ్డిగారికి శ్రీ వి. శ్రీనివాస్, శ్రీ జి. భద్రు, డా॥ కె. సీతారామారావు, డా॥ ఎం. ఎర్రగట్టు స్వామి, ప్రొ॥ ఎన్. లింగమూర్తి, ప్రొ॥ బి. వెంకటేశ్వర్లు, ప్రొ॥ సి. శివరామకృష్ణారావు, డా॥ బి. జనార్ధనరావు, శ్రీ టి. సత్యనారాయణ, డా॥ కె. దేవమాణిక్యం, శ్రీ వి. వెంకట్రామారావు, డా॥ వై. సుదర్శనరావు, డా॥ కె. వెంకటనారాయణ, డా॥ సి.హెచ్. సమ్మయ్య డా॥పి.కృష్ణమాచారి గారికి ధన్యవాదాలు.

ఈ సంపుటం అనువాదం ఆంగ్ల మూలంతో సరిచూసి, కొన్ని పేజీలు అనువదించి ప్రూఫ్‌లు చూసి శ్రమించిన వి.రాజీవ్ గారికి ప్రత్యేక ధన్యవాదాలు.

దీక్షతో, దక్షతతో త్వరితగతిన అనువాదం చేసిన రచయితలకూ, అనువాదానికి మెరుగులు దిద్దిన సంపాదకులు ఆచార్య కోవెల సుప్రసన్నాచార్య, ఆచార్య మాదిరాజు రంగారావు శ్రీ జానపట్ల ఎల్లయ్యగార్లకు నా అభినందనలు తెలియజేస్తున్నాను.

డా॥ అంబేద్కర్ రచనల అనువాద కార్యక్రమాన్ని ప్రోత్సహించి, ఉత్సాహంతో ముందుకు నడిపిస్తున్న సాంఘిక సంక్షేమ శాఖాధికారులకీ, ఉన్నత విద్యాశాఖాధికారులకు కృతజ్ఞతలు.

ఈ గ్రంథాన్ని సకాలంలో అందంగా ముద్రించిన ప్రింటోరియం ప్రెస్, హైదరాబాద్‌వారికి కృతజ్ఞతలు.

ఈ సంపుటి అందరి హృదయాలను చూరగొంటుందని విశ్వసిస్తున్నాను.

ఆచార్య పేర్వారం జగన్నాథం
ఉపాధ్యక్షులు, తెలుగు విశ్వవిద్యాలయం
మరియు
ప్రధాన సంపాదకులు

12-4-1994

# ప్రస్తావన

ఇది ఆధునిక భారత దేశపు అత్యంత ప్రతిభావంతుడైన న్యాయశాస్త్ర కోవిదుడూ, రాజ్యాంగ వేత్తా అయిన డా॥ బి.ఆర్. అంబేద్కర్ రచనల ఐదవ సంపుటి. అస్పృశ్యుల పైన డా॥ అంబేద్కర్ చేసిన అముద్రిత రచనలను ఈ సంపుటంలో చేర్చడం జరిగింది. భారత దేశాన్ని, సమకాలీన వస్తువులతో పాటు సమకాలీనం కాని వస్తువులు కూడా కలగలిపి ప్రదర్శించే సామాజిక వస్తు ప్రదర్శనశాల (Sociological Museum) అని అంటూ వుంటారు. అది సరైనదే. అసంబద్ధమైన కుల వ్యవస్థనీ, దానిలో పుట్టుకతో నిర్ణయించబడే హోదా వల్ల ఉత్పన్నమయ్యే మౌలిక అసమానత్వాన్ని డా॥ అంబేద్కర్ ఎత్తి చూపారు. సర్ హెన్రీ మెయిన్ (Sir Henry Maine) తన "ప్రాచీన న్యాయ శాస్త్రం" (Ancient Law) అనే పుస్తకంలో, పురోగమిస్తున్న సమాజాల గమనం హోదా (Status) నుంచి ఒప్పందం (Contract) వైపుకు వుంటుందని చెప్పాడు. భారత రాజ్యాంగం ప్రాథమిక హక్కులకు అగ్ర స్థానాన్నిచ్చి, వాటిని అమలు చేయడానికి కావలసిన యంత్రాంగాన్ని సమకూర్చి తద్వారా సామాజిక, ఆర్థిక ప్రగతికి లక్ష్యంగా వ్యక్తి యొక్క గౌరవాన్ని నిలబెట్టింది. అందువల్ల భారత రాజ్యాంగం కలలు గన్న నూతన సామాజిక వ్యవస్థను ఏర్పరచే సందర్భంలో డా॥ అంబేద్కర్ రచనలు సమకాలీన ప్రాధాన్యతను కలిగి వున్నాయి.

భారత రాజ్యాంగం 20వ శతాబ్దపు మధ్యలో జరిగిన ఘటన. ప్రజాస్వామిక సంస్థల కార్యాచరణలో ఇతర దేశాల అనుభవాల నుంచి అది చాలా గ్రహించింది. అనుభవాన్ని బట్టి చూస్తే మన రాజ్యాంగం విజయవంతంగా పని చేసిందని చెప్పక తప్పదు.

ఈనాడు న్యాయమైన సామాజిక వ్యవస్థను స్థాపించడానికి ప్రభుత్వం కట్టుబడి వుంది. అన్ని జీవిత రంగాలలోనూ సామాన్య మానవుని అభివృద్ధి కోసం కొత్త

కార్యక్రమాలు కనబడుతూనే ఉన్నాయి. హోదా నుంచి ఒప్పందానికికి, చలన రాహిత్యం నుంచి చలనానికీ, గతాన్ని ఒక ఆదర్శంగా భావించే ధోరణి నుంచి సమానత్వ సౌభ్రాతృత్వాలనే సామ్యవాద ఆదర్శాలపై ఆధారపడిన భవిష్యదాశకూ నేడు పరిణామం జరుగుతున్నది. ఇవి స్వతంత్రభారత దేశపు సాంఘిక ఆర్థిక చిత్రంలోని ముఖ్యాంశాలు. వీటిని రూపు దిద్దడంలో డా॥ అంబేద్కర్ తత్వశాస్త్రమూ, ఆదర్శాలూ ఒక విమర్శనాత్మక పాత్రను పోషించాయి.

పట్టణాల్లో కులం బలహీనపడుతున్న సూచనలు కొంత సంతృప్తినిచ్చినప్పటికీ మనం నిశ్చింతగా ఉండడానికి వీలు లేదు. కుల దురాచార నిర్మూలన కోసం మన ప్రయత్నాలు కొనసాగాలి. అయితే, గ్రామాలలో ఇంకా అస్పృశ్యత ఛాయలు వున్నాయని ఒప్పుకోక తప్పదు. ఇప్పటికీ గ్రామమే మన పరిపాలనా ప్రమాణం మన భవిష్యత్ కార్యక్రమం అక్కడే జరగాలి.

రాజకీయ విషయాల కంటే సామాజిక సమస్యలకు ప్రాధాన్యతనిచ్చే వారికి ఈ అయిదవ సంపుటంలో కూర్చిన డా॥ అంబేద్కర్ అముద్రిత రచనలు, నిలకడగా సామాజిక చైతన్యాన్ని పెంపొందించడానికి ప్రేరణనిస్తాయి. రాజకీయాలు ప్రజాస్వామికమైన ఒత్తిళ్లకూ, ఆకాంక్షలకూ సంబంధించినవైతే సామాజిక చైతన్యం మానవీయ అవగాహనను పెంపొందించగల విలువల్లో దృక్పథాలలో ఒక నిశ్శబ్దమైన విప్లవాన్ని తెస్తుంది. ఈ సంపుటం మహారాష్ట్రలోనూ, బయటా వున్న అటువంటి సమాజ సేవకుల అవసరాలను తీరుస్తుందని నా విశ్వాసం.

**(శరద్ పవార్)**

ఏప్రిల్ 14, 1989

మహారాష్ట్ర ముఖ్యమంత్రి.

# ఉపోద్ఘాతం

"జీవిత కాలానికి అతీతమైన జీవితం కోసం భద్రపరిచి, పరిరక్షించబడినటువంటి, ఒక గొప్ప ఆత్మ యొక్క అమూల్యమైన జీవధాతువు ఒక మంచి పుస్తకం" అని అంటాడు మిల్టన్.

"భారత దేశపు డా॥ జాన్సన్ గా విదేశీ విమర్శకుల చేతా, పరిశీలకుల చేతా కీర్తించబడిన రాజ్యాంగ వేత్తా, న్యాయశాస్త్ర కోవిదుడూ అయిన డా॥ అంబేద్కర్ అముద్రిత రచనల్ని ప్రచురించడం ద్వారా రాష్ట్ర ప్రభుత్వం ఆయనకు చిన్న నివాళిని అర్పిస్తోంది.

భారత ప్రజలకు పాశ్చాత్య నాగరికతతోనూ, దాని ఉదారవాద విలువలతోనూ, దాని విమర్శనాత్మక అన్వేషణలోనూ, దాని శాస్త్రీయ విశ్లేషణ, పురోగమనా న్వేషణలతోనూ పరిచయం కలగడం వల్ల ఉత్పన్నమైన సాంఘిక పరిణామాలను పరిశోధించదలచుకున్న వారికి ఈ సంపుటంలోని డా॥ అంబేద్కర్ రచనలు విలువైన సమాచారాన్ని, వివరాల్ని అందిస్తాయి.

పాశ్చాత్య విమర్శనాత్మక సంప్రదాయంలోని ఉత్తమమైన వాటన్నింటినీ, ప్రాచ్య తత్వశాస్త్రంపై లోతైన అవగాహననీ డా॥ అంబేద్కర్ తన వ్యక్తిత్వంలో కలిపారు. ఆయన హిందూ సమాజ సంస్కరణకు నిబద్ధుడైన నిర్మాణాత్మక విమర్శకుడు. జస్టిస్ రెనడే, మహాత్మా పూలే, గోఖలేల వంటి మహాత్ముల సంస్కరణ తత్వాన్ని పంచుకున్నవాడు. అందువల్ల ఒక విధంగా డా॥ అంబేద్కర్ మహారాష్ట్రలో పునరుజ్జీవనానికి ప్రతినిధి.

అస్పృశ్యత, హిందూ సమాజంలోని బాధాకరమైన విషయం. దానికి ఉనికి ప్రాచీన భారత దేశపు ప్రత్యేకత అయిన మానవతావాద తత్వపు సహనానికి మౌలికంగా విరుద్ధమైనది.

1956లో హిందూ చట్టానికీ, హిందూ వారసత్వ చట్టానికీ జర్గిగిన సవరణలు, ఆచారాలపై శాసనాలు సాధించిన గొప్ప విజయం. బ్రిటిష్ పాలకులకు భారత దేశం శాసన ప్రయోగాల ప్రయోగశాలగా వుండేది. గత శతాబ్దపు సాంఘిక జీవితంలోని అనేక రంగాలలో శాసనాలు సాధించిన విజయాలు - చట్టాలు ఒక శక్తివంతమైన చైతన్య సాధనాలని రుజువు చేసే ప్రోత్సాహకర సూచనలు. భారత రాజ్యాంగం, సామాజిక నిర్మాణంలో ఒక ప్రయోగం. అది నాగరికత యొక్క కొన్ని మౌలికమైన న్యాయ భావనలకు చట్టబద్ధమైన గుర్తింపునిస్తుంది. సమానత్వమూ, స్వేచ్ఛా అనే ఆదర్శాలను సాధించేందుకు తీసుకోవలసిన సాంఘిక-ఆర్థిక కార్యక్రమానికి ఉపోద్ఘాతంగా ఈ సంపుటంలో ప్రచురించబడిన డా॥అంబేద్కర్ రచనలు ఆలోచనా సామగ్రిని అందిస్తాయి.

సాధారణ పాఠకులూ, మేధావులూ కూడా ఈ రచనలను తమ ఆసక్తికి తగినవిగా భావిస్తారని నా నమ్మకం.

(కమల్‌కిషోర్ కదమ్)

విద్యాశాఖా మంత్రి, మహారాష్ట్ర

# సంపాదకీయం

డా॥ బాబాసాహెబ్ అంబేద్కర్ మూల రచనల ప్రచురణ కమిటీ సభ్యులు మహారాష్ట్ర ప్రభుత్వం తరపున ఈ డా॥ బాబాసాహెబ్ అంబేద్కర్ రచనల అయిదవ సంపుటిని సమర్పిస్తున్నందుకు సంతోషిస్తున్నారు. ఎన్నో రకాలుగా ఈ సంపుటి ప్రాముఖ్యత గలదీ, విశిష్టమైనదీ. మొదటగా ఈ సంపుటిలోని రచనలు ఇంతవరకూ అజ్ఞాతంగా వున్నాయి. అంబేద్కర్ ఆస్తుల సంరక్షకుడు (custodian), అడ్మినిస్ట్రేటివ్ జనరల్‌ల ఆధ్వర్యంలో ఈ అముద్రిత రచనలు ఇప్పటివరకూ వున్నాయి. అంబేద్కర్ రచనల విద్యార్థులూ, ఆయనను అనుసరించేవారూ ఈ రచనలను చదవాలనే ఆత్రుతతో వుండేవారు కొందరు అనుయాయులు - ఈ రాత ప్రతులు తమ ఆధీనంలో లేనప్పటికీ - వీటి ప్రచురణకు అనుమతి కోసం కోర్టుకు వెళ్ళారు. ఆ విధంగా ఈ రచనలు ఎంత ప్రాముఖ్యతను సంతరించుకున్నాయంటే వీటిని నాశనం చేయడమో, పోగొట్టుకోవడమో జరిగిందనే భయాలు కూడా వచ్చాయి.

ఈ సంపుటికి సంబంధించిన మరొక ముఖ్యమైన అంశమేమంటే అస్పృశ్యుల సమస్యకు, అస్పృశ్యతకూ సంబంధించిన వివిధ అంశాల్ని ఈసంపుటి చర్చిస్తుంది. అస్పృశ్యుల పుట్టుక గురించిన సిద్ధాంతాన్ని డా॥అంబేద్కర్ తన "అస్పృశ్యులు" (The Untouchables) అనే పుస్తకంలో చర్చించినప్పటికీ, ప్రస్తుత సంపుటిలోని వ్యాసాలు హిందూ సమాజానికి పట్టిన ఈ పీడ గురించిన వివిధ సమస్యల్ని చర్చిస్తాయి. ఈ ప్రపంచంలో వివిధ రకాలైన బానిసత్వాన్ని మానవజాతి చూసింది. ఇతర చోట్ల బానిసత్వం ఎలా అంతమయిందనే విషయాన్ని, అది ఇంకా భారత దేశంలో ఎందుకు వున్నదనే ప్రశ్ననూ ఈసంపుటిలో డా॥అంబేద్కర్ చర్చించి సమాధానాలు ఇచ్చారు.

సమానత్వమూ, స్వేచ్ఛా, న్యాయమూ, సర్వజన సౌభ్రాతృత్వమూ అనే మానవీయ విలువలపై ఆధారపడిన ఏకజాతిగా హిందూ సమాజాన్ని రూపొందించేందుకు డా॥ అంబేద్కర్ కుల వ్యవస్థపై, అస్పృశ్యతపై, హిందూ సామాజిక వ్యవస్థపై చేసిన విశ్లేషణలు ఉద్దేశించబడ్డాయి

ఈ రచనలను ప్రచురణకోసం ఈ సంఘానికి అప్పగించిన విషయమై ఈ సందర్భంలో కొన్ని మాటలు చెప్పటం అప్రస్తుతంకాదు. డా॥ అంబేద్కర్ తన జీవితకాలంలో చాలా పుస్తకాలు ప్రచురించాడు, అంతేకాదు, చాలా వాటి గురించి పథకాలు తయారు చేశాడు. తన ఆత్మకథను, మహాత్మా పూలే జీవిత చరిత్రనూ, భారత సేనా చరిత్రనూ రాయాలనే ఉద్దేశాన్ని కూడా వ్యక్తం చేశాడు, కాని ఆ అంశాలపై పరిశోధన పత్రాలేమీ రాసిపెట్టిన దాఖలాలు లేవు.

1956లో ఆయన మరణానంతరం, ఆయన అముద్రిత రచనలతో పాటు అన్ని పత్రాలను ఢిల్లీ హైకోర్టు కస్టోడియన్ అధీనంలోకి తీసుకున్నారు. దరిమిలా, ఈ కాగితాలను మహారాష్ట్ర ప్రభుత్వ అడ్మినిస్ట్రేటర్ జనరల్‌కు బదిలీ చేశారు. అప్పటి నుంచీ డా॥ అంబేద్కర్ అముద్రిత రచనల రాతప్రతులు ఉన్న పెట్టెలు ఇంకా అనేక ఇతర పత్రాలు అడ్మినిస్ట్రేటర్ జనరల్ అధీనంలో ఉన్నాయి.

జనరల్ అధీనంలో ఉన్నాయి.

నాగపూర్‌కు చెందిన అడ్వొకేట్ శ్రీ జె.బి. బాన్సోడ్ (J.b. Bansod) నాగపూర్‌లో ఉన్న బొంబాయి హైకోర్టు ధర్మాసనంలో మహారాష్ట్ర ప్రభుత్వం మీద ఒక దావా వేశాడు. ఆ తర్వాత దానిని బొంబాయి హైకోర్టుకు బదిలీ చేశారు. అర్జీదారుడు కోరినది చాలా చిన్న కోరిక, అదేమంటే డా॥ అంబేద్కర్ అముద్రిత రచనలు జాతీయ ప్రాముఖ్యాన్ని సంతరించుకున్నాయి కాబట్టి వాటిని ముద్రించటానికి తనకైనా అనుమతి ఇవ్వాలని లేదా ప్రభుత్వమైనా వాటిని ప్రచురించాలనీ ఆయన కోరాడు. ఈ వ్యాజ్యం బొంబాయి హైకోర్టులో చాలా సంవత్సరాలు నిలిచిపోయింది.

ఈ సంఘం ఏర్పడిన తర్వాత, 1978లో శ్రీ వి. డబ్ల్యు. మూన్ ప్రత్యేక అధికారిగా నియామకం అయిన తర్వాత, డా॥ అంబేద్కర్ అముద్రిత రచనలు సేకరించి చారిత్రక ప్రాముఖ్యం గల ఆధారాలుగా వాటిని ప్రచురించాలని భావించటం జరిగింది. శ్రీ మూన్ డా॥ అంబేద్కర్ వారసులను, అడ్మినిస్ట్రేటర్ జనరల్‌ని స్వయంగా కలుసుకున్నారు. తమతో సహకరించవలసిందిగా శ్రీ బాన్సోడ్ అడ్వొకేట్‌ని కోరడం కూడా జరిగింది.

శ్రీమతి సవిత అంబేద్కర్, శ్రీ ప్రకాష్ అంబేద్కర్ వారి కుటుంబ సభ్యులు, అడ్వొకేట్ శ్రీ బాన్సోడ్, ఎంతో ఆసక్తి కనపరిచి, ముద్రణకై ప్రభుత్వ పథకంతో అంగీకరించి, డా॥ అంబేద్కర్ రచనలు ఉన్న పెట్టెలు అన్నింటినీ ప్రభుత్వానికి అప్పగించటానికి అంగీకరించినందుకు వారిని తప్పక అభినందించాలి. చివరకు అయిదు ఇనుప పెట్టెలలో ఉన్న అంబేద్కర్ రచనలు అన్నింటినీ ఈ కమిటీకి అప్పగించటానికి అడ్మినిస్ట్రేటర్ జనరల్ అంగీకరించారు. దాని ప్రకారం ఆ పెట్టెలు అన్నింటినీ ప్రభుత్వం తరఫున శ్రీ వసంతమూన్ 18.9.1981నాడు స్వాధీనం చేసుకున్నారు. ఈ అయిదు ఇనుప పెట్టెలను మంత్రాలయం (సచివాలయం)లోని విద్యాశాఖలో అధికారుల గదిలో భద్రంగా ఉంచటమైంది.

డా॥ అంబేద్కర్‌కు చాలా సన్నిహితుడిగా ఉండటం వల్ల శ్రీ/ఎం.బి. చిట్నిస్ ఆయన చేతివ్రాత బాగా గుర్తు పట్టగలడు. ఆయన ఆ సమయంలో సంపాదకవర్గ అధ్యక్షుడు. వ్రాతప్రతులు అందినమీదట వాటినన్నిటినీ ఆయన ఒక పక్షం రోజులు పరిశీలించి ఏవి డా॥ అంబేద్కర్ వ్రాతప్రతులో నిర్ధారణ చేశాడు. గుర్తుపట్టటం అనే ప్రాథమిక కార్యం అయిన మీదట, వ్రాతప్రతులు చదవటం, వ్యాఖ్యానించటం, దొరికిన వాటిలో వ్రాతప్రతులను సరి చూసుకోవటం, పాఠకులకు ఏ రూపంలో, ఏ క్రమంలో వీటిని అందించాలనే బృహత్కార్యక్రమం మిగిలిపోయింది.

1981లో ఈ పథకం ప్రత్యేకాధికారి శ్రీ మూన్ పనిలోకి దిగాడు. దేనికదే చేర్చి పెట్టుకోవటం, వేరు పరచి పెట్టుకోవటం అనే పని చాలా సున్నితమైనదీ, కష్టమైనదీ, చాలా సమయం పట్టేదీ అయింది. డా॥ అంబేద్కర్ పూర్తి చేయాలని భావించిన ఎన్నో రచనలు అసంపూర్తిగా మిగిలిపోయి, వ్రాతప్రతుల రూపంలో అక్కడ కొన్ని, ఇక్కడ కొన్నిగా, చెల్లా

చెదరయిపోయాయి. చెల్లాచెదరైన భాగాలను ఒకచోట చేర్చి ఒకదానితో ఒకటి పోల్చుకొని ఒక క్రమపద్ధతిలో చేర్చే పని చేపట్టవలసిన అవసరం ఏర్పడింది. ఎన్నో గంటలు ఈ వ్రాతప్రతులనే కాకుండా ఇదివరకే డా॥ అంబేద్కర్ రచనలుగా ప్రసిద్ధి చెందినవాటిని చదివి, ఎంపిక చేసి, తులనాత్మక పరిశీలన చేసిన మీదట మాత్రమే ఈ ప్రస్తుత ఎంపిక ప్రకారం, వ్రాతప్రతులను ఒక క్రమంలో పెట్టటానికి శ్రీ మూన్‌కు సాధ్యమైంది.

ఈ వ్రాతప్రతులు ఉన్న పరిస్థితి దృష్ట్యా ఈ పని మేధోపరంగా కష్టమైనది కావటమే కాకుండా, భౌతికంగా కూడా చాలా కష్టమయింది. ఈ వ్రాతప్రతులన్నీ 30 ఏళ్లపాటు పెట్టెలో పెట్టి మూసి ఉంచారు. వాటిమీద క్రిమిసంహారకాలను స్ప్రే చేసినందువల్ల ఈ కాగితాల నుంచి చాలా విషపూరితమైన దుర్వాసన వచ్చేది. శ్రీ మూన్, ఆయన సహచరులకు కొన్ని చర్మవ్యాధులు సోకి చికిత్స చేయించుకోవలసి వచ్చింది.

రెండు సంవత్సరాలు తీవ్రంగా పరిశ్రమించిన మీదట, ఈ పత్రాలన్నీ ముద్రించవలసిన అవసరం ఉండటంవల్ల, వాటిని ఒక క్రమపద్ధతిలో అమర్చి సమర్పించవలసిన విషయమై శ్రీ మూన్ 17.9.83న సంపాదకవర్గానికి ఒక వివరణాత్మకమైన నివేదికను సమర్పించారు. ప్రస్తుత సంపుటి దాదాపు ఈ సూచనలకు అనుగుణంగానే ఉన్నది.

చాలా శ్రమతో కూడిన ఈ పనిలో స్టెనోగ్రాఫర్లుగా పనిచేసిన శ్రీ అనిల్‌కవాలే, శ్రీ ఎల్.ఆర్. మెహెర్, గుమాస్తాగా ఉన్న శ్రీ ఎస్.ఏ. ముంగేకర్‌లు అమూల్యమైన సహాయం అందించారు.

ప్రతిపాదించిన ఏర్పాట్లను డా॥ బాబాసాహెబ్ మూల రచనల ప్రచురణ సంపాదక మండలి 23-9-1986లో జరిగిన సమావేశంలో అంగీకరించిన తర్వాత, శ్రీ మూన్, వారి సిబ్బంది, ప్రచురణ పనిలోకి అంటే, ప్రూఫ్‌లు దిద్దటం, సూచిక తయారు చేయటంలాంటి పని లోకి దిగారు.

సంపాదక మండలి పరిశీలించిన పత్రాలలో అముద్రిత రచనలు 51 వరకు ఉన్నాయి. ('రిడిల్స్ ఇన్ హిందూయిజం' శీర్షికన ఉన్న 26తో కలిపి). వీటికి అదనంగా బొంబాయిలోని సిద్ధార్థ కాలేజిలో లైబ్రేరియన్‌గా పనిచేసిన శ్రీ ఎస్.ఎస్. రెగే, డా॥ అంబేద్కర్‌గారి అముద్రిత వ్యాసాలు 14 పంపించారు. క్రింద ఇచ్చిన జాబితాలో శ్రీ రెగే అందజేసిన వ్యాసాలను '*' గుర్తుతో చూపటం జరిగింది. ఈ వ్యాసాలు అన్నీ సంపూర్ణంగా లేవు. ఈ వ్యాసాలు అన్నింటిని మూడు సంపుటాలుగా కూర్చటం జరిగింది.

**మూడో సంపుటం**

1. ఫిలాసఫీ ఆఫ్ హిందూయిజం
2. ది హిందూ సోషల్ ఆర్డర్ : ఇట్స్ ఎసెన్షియల్ ప్రిన్స్‌పుల్స్
3. ది హిందూ సోషల్ ఆర్డర్ : ఇట్స్ యునీక్ ఫీచర్స్
4. సింబల్స్ ఆఫ్ హిందూయిజం

5. ఏన్షెంట్ ఇండియా ఆన్ ఎగ్జ్యుమేషన్
6. ది ఏన్షెంట్ రెజిమ్ - ది స్టేట్ ఆఫ్ ది ఆర్యన్ సొసైటీ
7. ఎ సంకెన్ ప్రీస్ట్‌హుడ్
8. రిఫార్మర్స్ అండ్ దెయిర్ ఫేట్
9.* ది డిక్లైన్ అండ్ ఫాల్ ఆఫ్ బుద్ధిజం
10. ది లిటరేచర్ ఆఫ్ బ్రాహ్మణిజం
11.* ది ట్రయింఫ్ ఆఫ్ బ్రాహ్మణిజం
12 ది మోరల్స్ ఆఫ్ ది హౌస్ - మనుస్మృతి ఆర్ ది గాస్పెల్ ఆఫ్ కౌంటర్ రివల్యూషన్
13. ది ఫిలసాఫిక్ డిఫెన్స్ ఆఫ్ కౌంటర్ - రివల్యూషన్ : కృష్ణ అండ్ హిజ్ గీతా
14. ఎనలిటికల్ నోట్స్ ఆఫ్ విరాట్ పర్వ అండ్ ఉద్యోగపర్వ
15. బ్రాహ్మిణ్స్ వెర్సెస్ క్షత్రియాస్
16. శూద్రాస్ అండ్ కౌంటర్ రివల్యూషన్
17. ది వుమన్ అండ్ కౌంటర్ రివల్యూషన్
18. బుద్దా ఆర్ కార్ల్‌మార్క్స్
19. స్కీమ్స్ ఆఫ్ బుక్స్

**నాలుగో సంపుటం**

రిడిల్స్ ఇన్ హిందూయిజం (మొదటిదానితో కలిపి 27 అధ్యాయాలు. శ్రీ ఎస్.ఎస్. రెగే పంపించినవి).

(ఈ సంపుటిని ముద్రించాలనుకున్నప్పుడు 24 రిడిల్స్, 8 అనుబంధాలతో కలిపి మొత్తం 32 వచ్చాయి).

**అయిదో సంపుటం**

1. అన్‌టచబుల్స్ ఆర్ ఛిల్డ్రన్ ఆఫ్ ఇండియాస్ ఘెట్టో
2.* ది హౌస్ ది హిందూస్ హేవ్ బిల్ట్
3.* ది రాక్ ఆన్ విచ్ ఇటీస్ బిల్ట్
4.* వై లాలెస్‌నెస్ ఈజ్ లాఫుల్?
5.* టచబుల్స్ వెర్సెస్ అన్‌టచబుల్స్
6.* హిందూయిజం అండ్ ది లెగసీ ఆఫ్ బ్రాహ్మణిజం
7.* పేరలల్ కేసెస్
8. సివిలైజేషన్ ఆర్ ఫెలొనీ
9. ది ఆరిజిన్ ఆఫ్ అంటచబిలిటీ
10. ది కర్స్ ఆఫ్ కేస్ట్
11.* ఫ్రమ్ మిలియన్స్ టు ఫ్రేక్షన్స్
12. ది రివోల్ట్ ఆఫ్ అన్‌టచబుల్స్

13. హెల్త్ ఎట్ బే
14. ఎవే ఫ్రమ్ ది హిందూస్
15. ఎ వార్నింగ్ టు ది అన్‌టచబుల్స్
16. క్రేస్ట్ అండ్ కన్‌వర్షన్
17.* క్రిస్టియనైజింగ్ ది అన్‌టచబుల్స్
18.* ది కండిషన్ ఆఫ్ ది కన్వర్ట్
19.* అండర్ ది ప్రావిడెన్స్ ఆఫ్ మిస్టర్ గాంధీ
20.* గాంధీ అండ్ హిజ్ ఫాస్ట్

డా॥ అంబేడ్కర్ అసలు రచనల ప్రచురణల విషయంలో రేగిన అన్ని అనుమానాలను తీర్చటం కోసం వ్రాతప్రతుల విషయంలో లేవనెత్తిన అన్ని ప్రశ్నల విషయం ఈ ఉపోద్ఘాతంలో ప్రస్తావించాలనుకున్నాం.

డా॥ అంబేడ్కర్ (1) రిడిల్స్ ఆఫ్ హిందూయిజం, (2) ది బుద్ధా అండ్ కార్ల్ మార్క్స్ (3) రివల్యూషన్ అండ్ కౌంటర్ రివల్యూషన్ అనే మూడు గ్రంథాలను పూర్తి చేశారని సాధారణంగా డా॥ అంబేడ్కర్ అనుయాయులు విశ్వసిస్తున్నారు. "రిడిల్స్ ఆఫ్ హిందూయిజం" వ్రాతప్రతులు వేరే ఒక ఫైలులో కట్టకట్టి ఉన్నాయి. వీటిలో డా॥ అంబేడ్కర్ చేతితో స్వయంగా చేసిన కొట్టివేతలు, చెరిపివేతలు, మార్పులు మొదలైనవి ఉన్నాయి. అదృష్టవశాత్తు ఈ పుస్తకానికి డా॥ అంబేడ్కర్ రాసిన ఉపోద్ఘాతం కూడా లభ్యంగా ఉన్నది. అయినప్పటికీ, ఈ సంపుటం తుది ప్రతి లభ్యం కాలేదని చెప్పటానికి విచారిస్తున్నాం. ఈ పుస్తకానికి ఉపోద్ఘాతంలో డా॥ అంబేడ్కర్ పెట్టిన "రిడిల్స్ ఇన్ హిందూయిజం" అనే పేరును కమిటీ అంగీకరించింది.

"ది బుద్ధా అండ్ కార్ల్‌మార్క్స్" పుస్తకం కూడా డా॥ అంబేడ్కర్ పూర్తి చేసినట్టు చెపుతారు. కాని వ్రాతప్రతులలో ఆ పుస్తకం మాకు దొరకలేదు. అయితే "గౌతమ ది బుద్ధా అండ్ కార్ల్‌మార్క్స్" (ఏ క్రిటిక్ అండ్ కంపేరిటివ్ స్టడీ ఆఫ్ దెయిర్ సిస్టమ్స్ ఆఫ్ ఫిలాసఫీ) అనే పేరు మీద లూక్ (Leuke) రాసిన పుస్తకం (విజయ పబ్లిషింగ్ హౌస్, కొలంబో - ప్రచురణ సంవత్సరం పేర్కొనలేదు) టైపు ప్రతి ఒకటి అందులో ఉన్నది. అయితే "బుద్ధ ఆర్ కార్ల్ మార్క్స్" అనే పేరు మీద డా॥ అంబేడ్కర్ రాసిన 34 పేజీల చిన్న వ్యాసం ఒకటి దొరికింది. దానిని మూడో సంపుటిలో చేర్చాం. "రివల్యూషన్ అండ్ కౌంటర్ రివల్యూషన్" అనే పుస్తకాన్ని కూడా డా॥ అంబేడ్కర్ పూర్తి చేశారనే విశ్వాసం ఉన్నది. కమిటీ వారికి అందిన పత్రాలలో ఈ గ్రంథానికి ఆయన తయారు చేసి ముద్రించుకున్న పథకం మాత్రం దొరికింది. ఒకేసారి అనేక అధ్యాయాలు రాయటం డా॥ అంబేడ్కర్ మొదలుపెట్టి ఉంటారు. పెట్టెలలో చెల్లాచెదరయిన పుటలు చాలా దొరికాయి. వాటిని ఒకచోటికి చేర్చటం జరిగింది.

ఒక పుస్తకం రాయటానికి డాక్టర్ అంబేడ్కర్ ఎంత గొప్ప మహత్తరమైన కృషి చేస్తారో పాఠకులకు తెలియజేయటానికి డా॥ అంబేడ్కర్ అసలు పుస్తకం రాసే విధానం అంతా తెలియ జేయాలనే కోరిక మాకు కలిగింది. ఆయనకు తనదంటూ ఒక క్రమశిక్షణ ఉండేది. గ్రంథ

రచనకు ఉపక్రమించే ముందు మొత్తం పుస్తకంలో ఏమేమి ఉండాలో, ఎలా ఉండాలో తయారు చేసుకొని ఉంచుకొనేవారు. ఆయనే సిద్ధం చేసుకున్నట్టి, అటువంటి పథకాలు సంపాదకమండలికి దొరికాయి. అవి : "ఇండియా అండ్ కమ్యూనిజం", "రిడిల్స్ ఇన్ హిందూయిజం", "కెన్ ఐ బి ఎ హిందూ?", "రివల్యూషన్ అండ్ కౌంటర్ రివల్యూషన్", "వాట్ బ్రాహ్మిన్స్ హేవ్ డన్ టు అన్‌టచబుల్స్", "ఎస్సేస్ ఆన్ భగవద్గీత", "బుద్ధా అండ్ కార్ల్‌మార్క్స్" మొదలైనవి. కాని ఇందులో కొన్ని అసలు మొదలు పెట్టనే లేదు. మొదలు పెట్టినవి పూర్తి చేయనూ లేదు. ఒక ఉదాహరణ చెప్పటం చాలా ఆసక్తికరంగా ఉంటుంది. డా॥ అంబేడ్కర్ "ఇండియా అండ్ కమ్యూనిజం" అనే పుస్తకానికి మొత్తం వివరాలు, పథకం రూపొందించుకున్నారు. వివరాలు ఇలా ఉన్నాయి :

| | | |
|---|---|---|
| **మొదటి భాగం** | - | ది ప్రీ రిక్విజిట్స్ ఆఫ్ కమ్యూనిజం |
| అధ్యాయం 1 | - | ది బర్త్ ప్లేస్ ఆఫ్ కమ్యూనిజం |
| అధ్యాయం 2 | - | కమ్యూనిజం అండ్ డెమొక్రసీ |
| అధ్యాయం 3 | - | కమ్యూనిజం అండ్ సోషల్ ఆర్డర్ |
| **రెండో భాగం** | - | ఇండియా అండ్ ది ప్రీ రిక్విజిట్స్ ఆఫ్ కమ్యూనిజం |
| అధ్యాయం 4 | - | ది హిందూ సోషల్ ఆర్డర్ |
| అధ్యాయం 5 | - | ది బేసిస్ ఆఫ్ ది హిందూ సోషల్ ఆర్డర్ |
| అధ్యాయం 6 | - | ఇంపెడిమెంట్స్ టు కమ్యూనిజం ఎరైజింగ్ ఫ్రమ్ ది సోషల్ ఆర్డర్ |
| **మూడో భాగం** | - | వాట్ దెన్ షల్ ఉయ్ డు? |
| అధ్యాయం 1 | - | మార్క్స్ అండ్ ది యూరోపియన్ సోషల్ ఆర్డర్ |
| అధ్యాయం 2 | - | మను అండ్ ది హిందూ సోషల్ ఆర్డర్ |

ఈ పథకంలో నాలుగు, అయిదు అధ్యాయాలను మాత్రం అంటే "ది హిందూ సోషల్ ఆర్డర్", "ది బేసిస్ ఆఫ్ ది హిందూ సోషల్ ఆర్డర్" అనే రెండింటిని మాత్రం డా॥ అంబేడ్కర్ పూర్తి చేశారు. మూడో భాగంలో ఇంకో రెండు అంశాల గురించి రాయాలని ఆయనకు అనిపించినప్పుడు ఆ రెండు అంశాలను ఆయన స్వయంగా రాసి టైపు చేసిన పేజీలో చేర్చారు. టైపు చేసి చక్కగా కట్టిపెట్టిన ఫైలులో, "కెన్ ఐ బి ఎ హిందూ?" అనే శీర్షికతో ఆయన పెన్సిలుతో సంతకం చేసి పెట్టుకున్న ఒక పుట కనిపించింది. తర్వాత పుటలో రాసి ఉన్న విషయ క్రమపట్టిక ఇలా ఉన్నది.

ఉపోద్ఘాతం
సింబల్స్ ఆఫ్ హిందూయిజం
**మొదటి భాగం** - కులం

సభ్యులకూ మేము కృతజ్ఞతలు తెలియజేసుకుంటున్నాం. అడ్మినిస్ట్రేటర్ జనరల్, డా॥ అంబేడ్కర్స్ ఎస్టేట్ కస్టోడియనూ అయిన శ్రీ వై.ఐ. దేశాయ్ ప్రభుత్వానికి వ్రాతప్రతులను అందజేసినందుకు అభినందనీయుడు. అలాగే కమిటీతో సహకరించినందుకు అడ్వొకేట్ శ్రీ జె.బి. లాన్స్‌డ్ కూడా అభినందనీయుడే. ఆరోగ్యం సరిగా లేకపోయినా సమయాన్ని శ్రమను వెచ్చించి సలహాలు ఇచ్చినందుకు కీర్తిశేషులు శ్రీ ఎం.బి. చిట్నిస్‌గారికి కృతజ్ఞతలు తెలియజేస్తున్నాం.

వ్రాతప్రతులు అన్నింటినీ ముద్రించటానికి నిర్ణయం తీసుకున్నందుకు మహారాష్ట్ర ముఖ్యమంత్రి, గౌరవనీయులు, శ్రీ శరద్ పవార్, విద్యాశాఖామంత్రి కమల్ కిషోర్ కదం విద్యాశాఖ సహాయమంత్రి ప్రొ. జావెద్ ఖాన్ లకు కృతజ్ఞతలు తెలియజేస్తున్నాం. ఎంతో చొరవ తీసుకొని, సలహాలు అందిస్తూ కమిటీ సమస్యలను పరిష్కరించటంలో అమూల్యమైన ప్రయత్నాలు చేసిన కమిటీ ఉపాధ్యక్షులు ఎం.ఎల్.సి. శ్రీ ఆర్.ఎస్. గవాయ్‌కు ధన్యవాదాలు తెలియజేస్తున్నాం. మహారాష్ట్ర ప్రభుత్వ విద్యాశాఖ కార్యదర్శి శ్రీ మధుసూదన్ కొల్హాట్‌కర్‌కు వారి అమూల్యమైన సలహాలకు ధన్యవాదాలు. విద్యాశాఖ డైరెక్టర్ శ్రీ ఆర్.ఎస్. జంభూలే, జాయింట్ డైరెక్టర్ శ్రీ ఎస్.ఏ. దేవ్‌కర్, అసిస్టెంట్ సెక్రటరీ శ్రీ జె.బి. కుల్‌కర్ణి, డిప్యూటీ డైరెక్టర్ శ్రీ ఎం.ఎం. అవాతే, సూపరింటెండెంట్ శ్రీ ఎం. మేశ్రాం గార్లకు, ప్రచురణ కార్యక్రమంలో అత్యంత శ్రద్ధాసక్తులు కనపరిచిన విద్యాశాఖ ఉద్యోగులందరికీ ధన్యవాదాలు.

కమిటీ సభ్యులైన డా॥ పి.టి. బొరాలే, శ్రీ ఎస్.ఎస్. రెగే, డా॥ బి.డి. ఫాడ్కే, శ్రీ దయా పవార్‌లు ఎన్నోసార్లు సమావేశమై ఈ సంపుటం సంపాదకత్వంలో అమూల్యమైన సలహాలు అందించినందుకు ప్రత్యేకంగా పేర్కొనవలసి ఉన్నది. వారి సహాయానికి ప్రగాఢమైన అభినందనలు తెలియజేస్తున్నాం.

కమిటీ సభ్యులైన శ్రీ ఎస్.ఎస్. రెగే తన వద్ద ఎన్నో ఏళ్లుగా ఉండిపోయిన డా॥ అంబేడ్కర్ 14 వ్యాసాలను మాకు దయతో అందజేశారు. ఈ మూడు సంపుటాలలో కూర్చిన విషయాలకు ఆ వ్యాసాలు వన్నె తెచ్చాయి. వారి దయకు కమిటీ సభ్యులు ఎంతో ఋణపడి ఉన్నారు.

ముద్రణ పనిని ఎంతో జాగ్రత్తతోనూ, చిత్త శుద్ధితోనూ నిర్వహించిన ముద్రణ శాఖ డైరెక్టర్ శ్రీ ఆర్.బి అల్వా, డిప్యూటి డైరెక్టర్ శ్రీ జి.డి. ధోండ్, మేనేజర్ శ్రీ పి.మోర్, డిప్యూటి మేనేజర్లు శ్రీ ఎ.పి.సయ్యద్, శ్రీ ఆర్.జె.మహాటేకర్, ఆపరేటర్ ఫిల్మ్‌సెట్టర్ శ్రీ జె.ఎస్. నగ్వేకర్ గారలు, ప్రింటింగ్ అండ్ స్టేషనరీ శాఖ సిబ్బంది అందరూ అభినందనీయులు.

సంపాదకులు

డాక్టర్ బాబాసాహెబ్ అంబేద్కర్ సోర్స్
మెటీరియల్ పబ్లికేషన్ కమిటీ
మహారాష్ట్ర

బొంబాయి,

4 ఏప్రిల్ 1987

రెండో భాగం - కల్ట్స్ - వర్షిప్ ఆఫ్ డెయిటీస్
మూడో భాగం - సూపర్ మ్యాన్

మూడో పుటలో అంశాల ఉప శీర్షికలు ఇలా ఉన్నాయి :

1. సింబల్స్ రిప్రజెంట్ ది సోల్ ఆఫ్ ఎ థింగ్
2. సింబల్స్ ఆఫ్ క్రిస్టియానిటీ
3. సింబల్స్ ఆఫ్ ఇస్లామ్
4. సింబల్స్ ఆఫ్ జైనిజం
5. సింబల్స్ ఆఫ్ బుద్ధిజం
6. సింబల్స్ ఆఫ్ హిందూయిజం
7. వాట్ ఆర్ ది సింబల్స్ ఆఫ్ హిందూయిజం ?

మూడు

1. కేస్ట్
2. కల్ట్స్
   1) రామా
   2) కృష్ణా
   3) శివ
   4) విష్ణు
   5) సర్వీస్ ఆఫ్ సూపర్‌మ్యాన్

పై విధంగా రూపొందించిన పథకంలో "సింబల్స్ ఆఫ్ హిందూయిజం" అధ్యాయం తప్ప మిగిలినవి అసంపూర్ణంగా మిగిలిపోయాయి.

'బహుశా) "రిడిల్స్ ఇన్ హిందూయిజం" అనే సంపుటి కోసం ఉద్దేశించిన "రిడిల్స్ ఆఫ్ రామా అండ్ కృష్ణా" అనే అధ్యాయం, సంపాదక వర్గానికి దొరికింది. మొదటి పథకంలో అనుకున్న 24 రిడిల్స్ (చిక్కుముడులు) తరచూ పథకం నిర్మాణంలో మారుతూ ఉండేవి. విషయానుక్రమణిక, అధ్యాయాలు, ఫైలు కూర్పు పొసిగేది కాదు. పుస్తకం విషయసూచికలో రాముడు కృష్ణుని మీది అధ్యాయం చోటు చేసుకోలేదు. అయినప్పటికీ రిడిల్స్ ఉన్న సంపుటిలో దీనిని మేము చేర్చుతున్నాం.

డా॥ అంబేడ్కర్ రచనలలో ఇంతవరకూ ప్రచురితం కాని వాటిని సక్రమమైన రీతిలో ముద్రించి సాధారణ జనావళికీ, ఆసక్తిగల పండితులకూ అందుబాటులోకి తెచ్చినపుడు, మేము అందుకై పడిన శ్రమ, వెచ్చించిన కాలమూ వృధాగా పోవనే విశ్వాసం మాకు ఉన్నది.

డా॥ అంబేడ్కర్ సంపూర్ణ రచనలను ముద్రించటానికి ప్రభుత్వానికి అనుమతి ఇచ్చినందుకు శ్రీమతి సవిత అంబేడ్కర్, శ్రీ ప్రకాష్ అంబేడ్కర్ గార్లకూ, వారి కుటుంబ

# విషయసూచిక

## రెండవ పుస్తకం – సామాజికం



## మూడవ పుస్తకం – రాజకీయం



## నాల్గవ పుస్తకం – మతపరమైనవి

# మొదటి పుస్తకం

# అస్పృశ్యులు లేదా భారతావనిలో బహిష్కృతుల సంతతి*

ఇది 208 పేజీల రాతప్రతి (రెండవ కాపీ) ఇది "అస్పృశ్యులు లేదా భారతావనిలో బహిష్కృతుల సంతతి" అనే పేరుకింద ఉన్నది. మొత్తం రాతప్రతి ఒక స్వతంత్రమైన పుస్తకం. దీనికి ఒక 'విషయ సూచిక' - నాలుగు భాగాలుగా విభజించబడి ఉన్నది. ఆ నాలుగు భాగాలూ 14 అధ్యాయాలుగా పునర్విభక్తమై వున్నాయి. 'విషయ సూచిక' కు అనుగుణంగా అధ్యాయాల క్రమంలో చిన్న చిన్న మార్పులు చేయవలసి వచ్చింది. అధ్యాయాల పేర్లలో కొన్ని సవరణలు తప్ప మొత్తం రాతప్రతిలో రచయిత ఎక్కడా మార్పులు చేయలేదు. ---సంపాదకులు.

---

* డా॥ అంబేద్కర్ వాడిన పదం "Ghetto" దీనికి అర్థం నగరంలో విడిగా వుండే మురికివాడ (Slum) అని. యూదులు నివసించే పేట అనేది దీని వ్యుత్పత్తి అర్థం. 'బహిష్కృత సీమ', 'బహిష్కృతభూమి'గా దీన్ని అనువదించడం జరిగింది - అను)

# మొదటి భాగం

# అస్పృశ్యులుగా ఉండటమంటే ఏమిటి?

## అధ్యాయం - 1

## అస్పృశ్యత - దాని మూలం

అస్పృశ్యుల దుర్భర పరిస్థితులకు చలించిపోయే వాళ్ళు "అస్పృశ్యుల కోసం ఏదో ఒకటి చేసి తీరాలి" అని నినదించి తమ భారాన్ని దించుకోవడం మనం తరచూ వింటూ వుంటాం. ఈ సమస్యపై ఆసక్తి వున్న వాళ్ళు ఎవరైనా "స్పృశ్య హిందువులను మార్చడానికి ఏదో ఒకటి చేయాలి" అని అనడం మాత్రం మనకెక్కడా వినబడదు. మనం బాగు చేసుకోవలసినది అస్పృశ్యులనేనని మినహాయింపులు లేకుండా అందరి అభిప్రాయం. ఒక ఉద్యమమేదన్నా ఉంటే అది అస్పృశ్యుల గురించి మాత్రమేననీ, అస్పృశ్యులకు జబ్బు కుదిరిస్తే అస్పృశ్యత మాయమవుతుందనీ వాళ్ళ నమ్మకం. స్పృశ్య హిందువులు చేయవలసిందేమీ లేదు. వారి మనసుల్లో, ప్రవర్తనల్లో, నైతికతలో అన్నీ సవ్యంగా వున్నాయి. అతడు పరిపూర్ణుడు. అతనిలో ఏలోపమూలేదు. ఈ అభిప్రాయం సరైనదేనా? సరైనదైనా, కాకపోయినా దీన్నే పట్టుకు వేళ్ళాడడానికి హిందువులు ఇష్టపడుతున్నారు. ఎందుకంటే ఈ అభిప్రాయంలో, అస్పృశ్యుల సమస్యకు తాము బాధ్యులం కామని తమను తాము సంతృప్తి పరచుకోవడానికి గొప్ప అవకాశం వుంది.

ఈ విధమైన ప్రవృత్తి ఎంత సహజమైనదో యూదుల (Jews) పట్ల యూదేతరుల (Gentile) దృక్పథాన్ని బట్టి వివరించుకోవచ్చు. హిందువుల మాదిరిగానే యూదేతరులు కూడా యూదుల సమస్య మౌలికంగా యూదేతరుల సమస్య అని అంగీకరించరు. ఇక్కడ లూయిూ గౌల్డింగ్ పరిశీలనలు ఎంతో విలువయినవి. యూదుల సమస్య ఏవిధంగా అసలు యూదేతరుల సమస్యో చూపించడానికి ఆయన ఇలా అన్నారుః

"యూదుల సమస్య మౌలికంగా యూదేతరుల సమస్య అని చూపించే ఒ సామాన్య వుదాహరణను మీ ముందుంచుతున్నాను. నా మిత్రుడు జాన్‌స్మిత్‌కి అత్యం ప్రియమైన ఉత్తమజాతి ఐరిష్ కుక్క వుంది. దాని పేరు పాడీ. దీనికి స్కాచ్ కుక్కలంటే ఇష్టం ఉండదు. ఓ ఇరవై గజాల దూరంనుంచి ఒక స్కాచ్ కుక్క వెళ్తూందంటే చా ఈ పాడీ, చుట్టు పక్కల వాళ్ళ చెవులు గళ్లు పడేలా మొరుగుతూ వాటిని అవమానకరం సవాలు చేసేది. ఇది జాన్‌స్మిత్‌కి ఇబ్బందిగా వుండి, దాన్ని ఆపడానికి ప్రయత్నించేవాడ పైగా పాడీ ఆగ్రహానికి గురైన కుక్కలు చాలావరకూ మెతక ప్రాణులు. చాలా అరుద అరిచేవి. తనకు పాడీ మీద ఎంత ప్రేమ వున్నా స్మిత్, పాడీ యొక్క ఈ ప్రవర్త మూలం పాడీలోనే ఉన్న లోపమని నాలాగే భావించేవాడు. ఇది స్కాచ్ కుక్కల సమ అని మనకింకా సూచన అందలేదు. హాయిగా సాయంకాలపు గాలుల్ని అనుభవిస్తు ఒక పొరుగు మనిషిపై దాడిచేయడంలో, తన ఉనికి ద్వారా పాడీని రెచ్చగొట్టినంద ఆ పొరుగు మనిషినే నిందించాలని కూడా ఎవరూ అనలేరు".

ఇక్కడ యూదుల సమస్యకూ, అస్పృశ్యుల సమస్యకూ మధ్య పూర్తి సామ వుంది. స్కాచ్ కుక్కలకు పాడీ ఎట్లాంటిదో, యూదులకు యూదేతరులట్లాంటివా హిందువు అస్పృశ్యులకు అట్లాంటివాడు. కానీ యూదుల సమస్యకూ, యూదేత సమస్యకూ తేడా వుంది. యూదులకూ, యూదేతరులకూ విశ్వాసాలకు (cre సంబంధించిన శతృత్వం వుంది. యూదుల విశ్వాసాలు యూదేతరుల విశ్వాస వ్యతిరేకమైనవి. హిందువులకూ, అస్పృశ్యులకూ మధ్య ఈ రకమైన వ్యతిరేకత లే వీరందరూ ఒకే విశ్వాసాలతో ఒకే ఉపాసనా విధానాలను (cults) అనుసరిస్తారు

మరొక విషయమేమంటే యూదేతరులనుంచి వేరుగా వుండడానికి యూద కోరుకోవడం. మొదటి అంశానికి దురహంకారం కారణం కాగా దీనికి పునాది చారి సత్యం. యూదులను తమలో కలుపుకోవడానికి యూదేతరులు గతంలో , ప్రయత్నాలు చేశారు కానీ యూదులు ఆ ప్రయత్నాలను ప్రతిఘటించారు. ఇం రెండు ఉదాహరణలను ప్రస్తావించుకోవచ్చు.

మొదటిది నెపోలియన్ కాలానికి సంబంధించింది. ఫ్రాన్సు జాతీయ విధాన (National Assembly of France) యూదులకు మానవ హక్కులను ప్రకటించ

అంగీకరించింది. దాంతో అల్యాక్ (Alyace) కు చెందిన మత మౌఢ్యంగల వారూ (religious reactionaries), వ్యాపార సంస్థల వారూ (guild merchants) యూదుల సమస్యను తిరిగి లేవనెత్తారు. ఈ విషయాన్ని గురించి యూదులే ఆలోచించాలని నెపోలియన్ అభిప్రాయం. ఆయన ఫ్రాన్స్, ఇటలీ, జర్మనీలలోని యూదు ప్రముఖుల సమావేశం ఒకటి ఏర్పాటు చేశాడు. జూడాయిజం సూత్రాలు పౌరసత్వానికి కావలసిన అర్హతకు ఎంత వరకూ అనుగుణంగా వుంటాయనే విషయాన్ని నిర్ణయించాలని ఆయన ఆలోచన. యూదులను అధిక సంఖ్యాక ప్రజల జీవన స్రవంతిలో కలపాలనేది ఆయన కోర్కె. 1806 జూలై 25న 111 మంది యూదు ప్రముఖులు పారిస్ నగర భవనంలో సమావేశమై యూదుల దేశభక్తి, యూదుల యూదేతరుల మధ్య వివాహ సంబంధాలు, అధిక వడ్డీల చట్టబద్ధత వంటి విషయాలకు సంబంధించిన 12 ప్రశ్నలకు సమాధానాలు తయారు చేశారు. ఆ సమావేశం చేసిన ప్రకటనలతో పొంగిపోయిన నెపోలియన్, జెరూసలెంలోని ప్రాచీన సంఘం వంటి మత సమావేశం (sanhedrin) ఏర్పాటుకు పిలుపునిచ్చాడు. మొదటి సమావేశపు ప్రకటనను విధాన నిర్ణయంగా మార్చడం దాని ఉద్దేశ్యం. రబీ సిన్ హైమ్ అధ్యక్షతన ఫ్రాన్సు ,జర్మనీ, ఇటలీ, హాలెండులకు చెందిన 71 మంది యూదు ప్రముఖులు 1807 ఫిబ్రవరి 9న స్ట్రాస్‌బర్గ్‌లో సమావేశమయ్యారు. ఫ్రాన్సును తమ పితృదేశంగా భావించమనీ, దాని పౌరులను సోదరులుగా వ్యవహరించమనీ, ఫ్రెంచి భాషను మాట్లాడమనీ యూదుల్ని కోరుతూ ఒక విధాన ప్రకటనను ఈ సమావేశం విడుదల చేసింది. తమ మతపీఠం (Synagogue) యూదు-క్రైస్తవ వివాహాలను అనుమతించదని ప్రకటిస్తూనే, ఆ రకం వివాహాల పట్ల సహనంతో వ్యవహరించమని కోరింది. ఇక్కడ, యూదు-యూదేతరుల వివాహాలను అనుమతించడానికి యూదులు తిరస్కరించారనే విషయం గుర్తించాలి. వాళ్ళు కేవలం సహనంగా వుండడానికి మాత్రం అంగీకరించారు.

రెండవది 1795లో బటావియన్ రిపబ్లిక్ ఏర్పడినప్పుడు జరిగింది. కొందరు ఉత్సాహవంతులయిన యూదులు, తమను ఇబ్బంది పెడుతున్న అనేక విచక్షణలను నిర్మూలించాలని ఒత్తిడి తెచ్చారు. కానీ ఈ అభ్యుదయ కాముకులైన యూదులు కోరే పూర్తి పౌరసత్వ హక్కులకు వ్యతిరేకత మొట్టమొదటగా వచ్చినది-విచిత్రంగా ఆమ్‌స్టర్‌డామ్ కమ్యూనిటీ నాయకులనుంచి. పౌర సమానత్వం జూడాయిజపు పరిరక్షణకు వ్యతిరేకంగా

పని చేస్తుందని వారి భయం. అందువల్ల, మత విశ్వాసాలకు కట్టుబడి వుండడంకోసం తమ సహ యూదులు పౌరసత్వ హక్కులను వదులుకుంటున్నట్లు వాళ్లు ప్రకటించారు. దీనివల్లి యూదులు మొత్తం సమూహంలో భాగంగా కాక విడిగా, బయటివారుగా వుండడానికి ఇష్టపడినట్లు స్పష్టమవుతుంది.

తమ వివరణల విలువ ఎలా వున్నా యూదేతరులు, యూదుల పట్ల తమ అసహజ ప్రవర్తనకు కారణం చూపించుకోవాలన్న బాధ్యతను కనీసం గుర్తించనైనా గుర్తించారు. కానీ హిందువులు తాము అస్పృశ్యుల పట్ల వ్యవహరిస్తున్న తీరును సమర్థించుకోవాలనే బాధ్యతను ఎప్పుడూ గుర్తించలేదు. హిందువులకి బాధ్యత ఎక్కువగా ఉంటుంది. ఎందుకంటే అస్పృశ్యుల విషయంలో తమ ప్రవర్తనను సమర్థించుకునేందుకు ఏ వివరణనివ్వడమూ సాధ్యం కాదు. అస్పృశ్యుడు ఒక కుష్టువాడనో, ప్రమాదకరమైన పరమనీచుడనో చెప్పడం కుదరదు. తమకూ, అస్పృశ్యులకూ మధ్య పూడ్చడానికి వీలులేని మత విభేదాలున్నాయనీ చెప్పలేదు. అస్పృశ్యులే హిందూ సమాజంలో కలసిపోవడానికి ఇష్టపడడంలేదని వాదించడం కూడా కుదరదు.

కానీ అస్పృశ్యుల పరిస్థితి ఇలా లేదు. ఒక విధంగా చెప్పాలంటే వారు కూడా ఇతరుల నుండి విడిగా ఎదిగిన అనాది జాతే. కానీ ఈ విడిగా వుండడం, ఈ వేర్పాటుతనమూ వారు కోరుకున్నది కాదు. వారు కలవలేకపోయినందుకు కాక, కలవడానికి ప్రయత్నించినందుకు శిక్షింపబడుతున్నారు. మరొక విధంగా చెప్పాలంటే యూదుల్ల సమస్యకూ, అస్పృశ్యుల సమస్యకూ స్వాభావికంగా పోలిక – ఈ రెండూ ఇతరులు సృష్టించిన సమస్యలు అనే పోలికవున్నా, ఈ రెండు మౌలికంగా భిన్నమైనవి. యూదులు ఇచ్ఛానుసారంగా విడిగా ఉండడానికి ప్రయత్నిస్తారు. అస్పృశ్యులు బలవంతాన వేరుగా వుంచబడ్డారు. అస్పృశ్యత అనేది ఇతరులు రుద్దిన శిక్ష, ఇష్టపడి ఎంచుకున్నది కాదు.

అనువాదం : ప్రొ॥ కోవెల సంపత్కుమారాచార్య

అధ్యాయం 2

# అస్పృశ్యులు – వారి సంఖ్య

అస్పృశ్యులుగా వుండటమంటే ఏమిటో తెలుసుకునేముందు భారతదేశంలో వారి సంఖ్య ఎంతో తెలుసుకోవాలి. అందుకోసం జనాభా లెక్కల నివేదికలను చూడాలి.

మొట్టమొదటిసారిగా భారతదేశంలో జనాభా లెక్కల సేకరణ 1881 లో ఆరంభమయింది. దేశంలోని వేరు వేరు కులాల, తెగల పట్టిక తయారు చేయటం, ఆయా కులాల, తెగలకు చెందిన వారి సంఖ్యలను జమ చేయటం, తద్వారా దేశంలోని మొత్తం జనాభా సంఖ్యను తేల్చడానికి మించి 1881 నాటి జనాభాలెక్కలు చేసిందేమీలేదు. హిందువులలోని వేరు వేరు కులాల్లో కింది కులాలివి, పై కులాలివి అనిగానీ, స్పృశ్యులు-అస్పృశ్యులు అనిగానీ వర్గీకరించే ప్రయత్నం ఆనాడు జరగలేదు. భారతదేశంలో రెండవ జనాభా లెక్కల సేకరణ 1891లో జరిగింది. ఈ సారి జనాభా లెక్కలలో మాత్రం దేశ జనాభాను కులాలు, జాతులు, వాటి స్థాయి ప్రాతిపాదికగా వర్గీకరించే ప్రయతం మొదటిసారి జనాభా లెక్కల కమీషనరు ద్వారా జరిగింది. అయితే అది కేవలం ప్రయత్నంగానే మిగిలిపోయింది.

భారత దేశంలో మూడవ సారి జనాభా లెక్కల సేకరణ 1901లో జరిగింది. "దేశీయ ప్రజల అభిప్రాయానుసారం గుర్తింపబడిన తీరులో సామాజిక వర్గీకరణ" అనే కొత్త సూత్రం అనుసరించబడింది. కులాల ప్రాతిపదికగా జనాభాను లెక్కించడాన్ని అగ్రకులాల హిందువులు తీవ్రంగా వ్యతిరేకించారు. కులానికి సంబంధించిన ప్రశ్నను వదిలివేయాలని వారు ఒత్తిడి చేశారు.

కానీ, జనాభా లెక్కల కమీషనరుపై ఈ ఒత్తిడి ప్రభావం ఏమాత్రమూ పడలేదు. ఆయన కులాల వారీగా జనాభాను లెక్కించడం చాలా ముఖ్యమూ, అవసరమూనని అభిప్రాయపడ్డాడు. ఆయన వాదన ప్రకారం "ఒక సామాజిక వ్యవస్థగా కులంతో వుండే సౌకర్యాలూ, అసౌకర్యాల గురించి ఎవరేమనుకున్నా గూడా, కులాన్ని ఒక ప్రధాన అంశంగా స్వీకరించకుండా భారతదేశంలో జనాభా గురించిన ఏ ప్రయోజనవంతమైన చర్చనైనా

ఊహించడం సాధ్యం కాదు. కులం అనేది ఇప్పటికీ, 'భారత సామాజిక నిర్మాణపు పునాది' గానే ఉంది. అందువల్ల కులాలకు సంబంధించిన సమాచారం 'భారతీయ సమాజంలోని విభిన్న సామాజిక స్థాయిలలో వస్తున్న మార్పులకు' ఉత్తమమైన మార్గదర్శకం. ప్రతి హిందువూ (ఈ పదాన్ని విస్తృతార్థంలో ఉపయోగిస్తే) ఏదో కులంలో జన్మిస్తాడు. కులం– అతని మతాన్ని, సామాజిక, ఆర్థిక, కౌటుంబిక జీవితాన్నీ పుట్టుక నుంచి చావు దాకా నిర్ధారిస్తున్నది. పాశ్చాత్య దేశాల్లో సామాజికంగా విభిన్న స్థాయీ భేదాలను నిర్ధారించే ధనం, విద్య,వృత్తి మొదలైన ప్రధానాంశాల్లో చాలా వెసులుబాటూ, సార్వజనీనతావున్నాయి. అవి జన్మ, వారసత్వం వల్ల కలిగే స్థాయీ భేదాలను సడలింప జేస్తాయి. భారత దేశంలో ఆధ్యాత్మికమూ, సామాజికమూ అయిన కట్టుబాటూ, సాంప్రదాయిక వృత్తులూ ఇతర అంశాలన్నిటిపైనా ప్రాధాన్యతను చలాయిస్తాయి. అందువల్ల పాశ్చాత్య దేశాల్లో ఆర్థికపరంగా, వృత్తి పరంగా జనాభాను వర్గీకరించే జనాభాలెక్కల విధానం అక్కడి జనజీవన గణాంకాల (Demographic statistics) సమ్మేళనానికి ప్రాతిపదిక కల్పించగా, భారతదేశంలో ఆ విధమయిన ప్రాతిపదికను కులమతాల ప్రత్యేక విభజన కల్పిస్తున్నది. జాతీయ, సామాజిక వ్యవస్థగా కులాన్ని గూర్చిన అభిప్రాయాలు ఏవైనా, దాన్ని చూడకుండా ఊరుకోవడం నిష్ప్రయోజనకరం. పైగా పదవీపరంగా, సామాజికంగా ఒక వ్యక్తి గుర్తింపును నిర్ధారించే ఒక అంశంగా కులం ఉపయోగపడుతూ ఉన్నంతకాలం ,జనాభా లెక్కలు ఒక అవాంఛనీయ వ్యవస్థను నిరంతరంగా కొనసాగిస్తాయని చెప్పడానికి వీలు లేదు".

1901 నాటి జనాభా లెక్కలు అస్పృశ్యుల జనాభాకు సంబంధించి ఏ ఖచ్చితమైన సంఖ్యనూ నిర్ణయించలేక పోయాయి. ఇందుకు కారణాలు రెండు. మొదటిది: అస్పృశ్యులెవరనేది నిర్ణయించడానికి ఏ ఖచ్చితమైన సూత్రాలూ అనుసరించబడలేదు. రెండవది: జనాభాలో ఆర్థికంగానూ, విద్యాపరంగానూ వెనుకబడిన ఒక వర్గం - వారు అస్పృశ్యులు కాకున్నా- అస్పృశ్యుల్లో కలిపి వేయబడింది.

1911నాటి జనాభా లెక్కలు మరొక అడుగు ముందుకు వేసి స్పృశ్యులనుంచి అస్పృశ్యులను వేరు చేయడానికి పది పరీక్షలను రూపొందించింది. ఈ క్రింది లక్షణాలు గల కులాలు, తెగల జనాభాను జనాభా సూపరింటెండెంట్లు విడిగా లెక్కించారు. ఆ లక్షణాలు : 1) బ్రాహ్మణుల అధిక్యతను నిరాకరించిన వారు; 2) బ్రాహ్మణుల నుంచిగానీ,

ఇతర గుర్తించబడిన హిందూ గురువుల నుంచి గానీ మంత్రాలు పొందని వారు ;3) వేద ప్రామాణ్యాన్ని నిరాకరించిన వారు; 4) ప్రధాన హిందూ దేవతలను పూజించని వారు; 5) ఉత్తమ బ్రాహ్మణులచే (పూజలు, కర్మలు మొ॥ వాటిలో) పని చేయించుకోని వారు; 6) అసలు బ్రాహ్మణ పురోహితులే లేని వారు; 7) మామూలు హిందూ దేవాలయాలలోకి ప్రవేశం లేని వారు; 8) మైలను కలుగజేసేవారు; 9) మరణించిన తమ వారిని పూడ్చి పెట్టేవారు;10)ఆవును పూజించని వారు,ఆవు మాంసం తినే వారు.

1910, జనవరి 27న ప్రభుత్వానికి సమర్పించిన ఒక విజ్ఞాపనలో హిందువుల నుంచి అస్పృశ్యులను వేరు చేయాలని ముస్లింలు గట్టిగా కోరారు. ఆ విజ్ఞాపనలో, స్పృశ్య హిందువుల జనాభాతో తమ నిష్పత్తిని బట్టి దేశ రాజకీయ సంస్థలలో తమ ప్రాతినిధ్యం వుండాలనీ, మొత్తం హిందువులతో తమ నిష్పత్తిని లెక్క వేయవద్దనీ కోరారు. ఎందుకంటే వారి నిర్ధారణ ప్రకారం అస్పృశ్యులు హిందువులు కారు.

ఇది ఇలా వుంచితే 1911 నాటి జనాభా లెక్కలు అస్పృశ్యుల జనాభాను నిర్ధారించడాన్ని మొదలు పెట్టాయి. 1921, 1931 జనాభాలెక్కల్లో ఈ ప్రయత్నం ఇదే మార్గంలో ముందుకు సాగింది.

ఈ ప్రయత్నాల ఫలితంగా1930లో భారత దేశానికి వచ్చిన సైమన్ కమీషన్ బ్రిటిష్ ఇండియాలోని అస్పృశ్యుల మొత్తం జనాభా 44.5 మిలియన్లు అని కొంత వరకూ నమ్మకంతోనే చెప్పగలిగింది.

అయితే, 1932లో లోథియన్ కమిటీ సంస్కరించబడిన శాసన సభల ఎన్నికల సమస్యను పరిశీలించడానికి వచ్చి తన పని మొదలు పెట్టగానే హఠాత్తుగా హిందువులు తిరస్కార ధోరణిని అవలంబించి, సైమన్ కమీషన్ చెప్పిన సంఖ్యను భారత దేశంలో అస్పృశ్యుల నిజమైన సంఖ్యగా అంగీకరించడానికి తిరస్కరించారు. కొన్ని ప్రాంతాల్లో హిందువులు అక్కడ అసలు అస్పృశ్యులే లేరనేంత దాకా వెళ్లారు. ఇందుకు కారణ అస్పృశ్యుల ఉనికిని గుర్తించడంలో ఉన్న ప్రమాదాన్ని హిందువులు గుర్తించారు. ఎందుకం ఇన్నాళ్లూ హిందువులు అనుభవిస్తున్న ప్రాతినిధ్యంలో కొంత భాగాన్ని అస్పృశ్యులకు ధారాదత్తం చేయవలసి వస్తుంది.

1941 నాటి జనాభా లెక్కలు యుద్ధ సమయంలో తీసుకున్నవి కాబట్టి, అవి కేవలం ఉజ్జాయింపు లెక్కలే కాబట్టి వాటిని అంతగా పట్టించుకోనవసరంలేదు.

ఇటీవలి జనాభా లెక్కలు 1951లో సేకరించబడ్డాయి. ఈ క్రింది అంకెలు జనాభా లెక్కల కమీషనర్ నివేదిక నుండి తీసుకోబడ్డాయి. భారత దేశంలోని అనుసూచిత (Scheduled) కులాల జనాభా 513 లక్షలని జనాభా లెక్కల కమీషనర్ అంటారు.

1951 జనాభా లెక్కల ప్రకారం భారత దేశపు మొత్తం జనాభా 3,567 లక్షలు. అయితే జలంధర్‌లోని జనాభా కార్యాలయంలో అగ్ని ప్రమాదం వల్ల దగ్ధమయిన రికార్డులలో నమోదయి ఉండిన 1.35 లక్షల మంది వివరాలు ఈ సంఖ్యలో చేరలేదు.

మొత్తం 3,567 లక్షల జనాభాలో 2,949 లక్షల మంది పల్లె ప్రాంతాలలోనూ, 618 లక్షల మంది పట్టణ ప్రాంతాలలోనూ జీవిస్తున్నారు. పల్లె ప్రాంతాలలోని అనుసూచిత కులాల వారి సంఖ్య 462 లక్షలు కాగా, పట్టణ ప్రాంతాల్లో వారి సంఖ్య 51 లక్షలు.

మొత్తం జనాభాలో వ్యవసాయేతర వర్గాల వారి సంఖ్య 1,076 లక్షలు, అనుసూచిత కులాల వారి సంఖ్య 132 లక్షలు.

మొత్తంగానో, ప్రధానంగానో భూమి కలిగిన వ్యవసాయదారులూ, వారిపై ఆధారపడిన వారి మొత్తం సంఖ్య 1,674 లక్షలు. వీరిలో అనుసూచిత కులాలకు చెందిన వారు 174 లక్షలు.

మొత్తంగానో, ప్రధానంగానో భూమి లేని వ్యవసాయదారులూ, వారిమీద ఆధారపడిన వారూ మొత్తం జనాభాలో 316 లక్షలు కాగా వీరిలో అనుసూచిత కులాల వారు 56 లక్షలు.

వ్యవసాయ కూలీలు,వారిమీద ఆధారపడిన వారూ మొత్తం జనాభాలో 448 లక్షలు కాగా వారిలో అనుసూచిత కులాల వారు 148 లక్షలు.

వ్యవసాయేతర వృత్తుల వారి సంఖ్యలు ఈ క్రింది విధంగా ఉన్నాయి.

వ్యవసాయేతర ఉత్పత్తులలో: మొత్తం 377 లక్షలు, వీరిలో అనుసూచిత కులాలు

53 లక్షలు.

వ్యాపారం: మొత్తం 213 లక్షలు, అనుసూచిత కులాలు 6 లక్షలు.

రవాణా: మొత్తం 56 లక్షలు అనుసూచిత కులాలు 6 లక్షలు.

ఇతర సేవలు, ఇతర మార్గాలు: మొత్తం 430 లక్షలు, అనుసూచిత కులాలు 64 లక్షలు.

మొత్తం అనుసూచిత కులాల జనాభా 513 లక్షలు కాగా వీరిలో 114 లక్షల మంది ఉత్తర భారతం (ఉత్తర్ ప్రదేశ్)లో నివసిస్తారు. 128 లక్షలు తూర్పు భారతం (బీహార్, ఒరిస్సా, పశ్చిమ బెంగాల్, అస్సాం, మణిపూర్, త్రిపుర)లో; 110 లక్షలు దక్షిణ భారత దేశం (మద్రాసు, మైసూరు, తిరువాన్కూర్, కొచ్చిన్, కూర్గు)లో; 31 లక్షలు పశ్చిమ భారతం (బొంబాయి, సౌరాష్ట్ర, కచ్ )లో; 76 లక్షలు మధ్య భారత దేశం (మధ్య ప్రదేశ్, మధ్య భారత్, హైదరాబాద్, భోపాల్, వింధ్య ప్రదేశ్ )లో; 52 లక్షలు పశ్చిమోత్తర భారతం (రాజస్థాన్, పంజాబ్, పాటియాలా, తూర్పు పంజాబు ప్రాంతాల సమాఖ్య, అజ్మీర్, ఢిల్లీ, బిలాస్‌పూర్, హిమాచల్ ప్రదేశ్ )లోనూ నివసిస్తున్నారు.

అనువాదం: ప్రొ॥ కోవెల సంపత్కుమారాచార్య

అధ్యాయం - 3

# బానిసలు - అస్పృశ్యులు

అస్పృశ్యతను గురించి సిగ్గు పడాల్సింది పోయి హిందువులు దాన్ని సమర్థించ ప్రయత్నిస్తారు. వారి సమర్థన ఎలా ఉంటుందంటే, ఇతర దేశాలు చేసినట్లు హిందువులు బానిసత్వాన్ని ఎప్పుడూ సమర్థించలేదు. పైగా అస్పృశ్యత బానిసత్వం కంటే నీచమైనదేమీ కాదు. ఈ రకమైన వాదన చేసింది మామూలు వ్యక్తులేమీ కాదు. కీర్తిశేషులు లాలా లజపతి రాయ్ తన 'విచారగ్రస్త భారతం" (Unhappy India) అనే పుస్తకంలో ఈ వాదన చేశారు. ఇలాంటి ప్రత్యారోపణను తిప్పి కొట్టడానికి కాలం వ్యర్థం చేయడం అవసరం ఉండేది కాదు కానీ దాన్ని అలాగే వదిలేస్తే బానిసత్వం కంటే హేయమైనదేదీ చూడని బాహ్య ప్రపంచం, అస్పృశ్యత బానిసత్వం కంటె చెడ్డదేం కాదని విశ్వసించే వీలుంది.

హిందువులు బానిస వ్యవస్థను గుర్తించలేదనడం పచ్చి అబద్ధమనేది ఈ ప్రత్యారోపణకు మొదటి జవాబు.బానిస వ్యవస్థ అనేది హిందువులలోని అతి పురాతన వ్యవస్థ. హిందూ ధర్మశాస్త్ర కారుడైన మనువు దీనిని గుర్తించగా, ఇతర స్మృతికర్తలు దానిని విపులీకరించి క్రమబద్ధం చేశారు. హిందువుల్లో బానిసత్వం కేవలం అతి పురాతన కాలంలో మాత్రమే వున్నది కాదు. భారత చరిత్ర పొడువునా, 1843 వరకూ కొనసాగిన వ్యవస్థ ఇది. బ్రిటిష్ ప్రభుత్వం గనక ఆ సంవత్సరంలో దానిని రద్దు చేయకుండా వుంటే అది ఈ నాటికీ కొనసాగేది.

అస్పృశ్యత, బానిసత్వం - ఈ రెండింటి సాపేక్ష విలువల విషయానికి వస్తే, ఈ ప్రత్యారోపణను ఖండించడానికి ఉత్తమ మార్గం అస్పృశ్యతకూ, ప్రాచీన రోమ్, ఆధునిక అమెరికాలలో వున్న బానిస వ్యవస్థలకూ మధ్య వున్న సామ్య భేదాలను పరిశీలించడం.

రోమన్ సామ్రాజ్యంలోని బానిసల అసలు పరిస్థితి ఏమిటి ? నాకు తెలిసినంత వరకూ దీని సరియైన వర్ణన బారో రాసిన "రోమన్ సామ్రాజ్యంలో బానిసత్వం" అనే గ్రంథంలో దొరుకుతుంది. బారో [1] ఇలా అంటారు:

"ఇంతవరకూ వర్ణించింది గృహస్థ బానిసత్వపు జుగుప్సాకరమైన పార్శ్వం. దానికి ఇంకో పార్శ్వం ఉంది. సాహిత్యాధారాల్ని బట్టి చూస్తే పెద్ద పెద్ద గృహస్థాలు (Households) అప్పట్లో మామూలుగా వుండేవని తెలుస్తుంది. కానీ అవి మినహాయింపులు మాత్రమే. భారీ బానిస సిబ్బంది ఉండడం నిస్సందేహమే కాని అవి సాధారణంగా రోమ్‌లోనే వుండేవి. ఇటలీలోనూ, ప్రావిన్సులలోనూ బయటికి ప్రదర్శించుకోవాల్సిన అవసరం అంతగా ఉండేది కాదు. అక్కడి భవంతులలోని సిబ్బందిలో ఎక్కువ భాగం భూమికీ, దాని ఉత్పత్తులకూ సంబంధించిన ఉత్పాదక శ్రమ చేసేవారు. బానిసలకూ, మేస్త్రీలకూ వున్న పాత సంబంధం అలాగే కొనసాగినా, తరచుగా బానిస తన తోటి పనివాడుగా ఉండేవాడు. ప్లినీ తన సిబ్బంది పట్ల కనబరిచిన దయార్ద్రత లోక విదితమే. స్వంత ఔదార్యాన్ని ప్రదర్శించుకోవడానికో, తన ఉత్తరాలు చదవబోయే భావితరాల వారి మెప్పు పొందడం కోసమో ఆయన తన బానిసల అనారోగ్యం పట్లా, మరణాల పట్లా తన వ్యథను వ్యక్తీకరించలేదు. ప్లినీ గృహస్థం ఒక బానిసల గణతంత్రం. బానిసలతో తాను వ్యవహరించిన తీరును గురించి ప్లినీ చెప్పినది ఆనాటి పరిస్థితుల్ని ప్రతిబింబించేది కాదని కొందరు భావిస్తున్నారు. కానీ అలాంటి దృష్టికి కారణం లేదు.

"సాహిత్యాభిరుచి వల్లనైతేనేమి, తమ గొప్పతనాన్ని చాటుకోవాలనే తపన వల్లనైతేనేమి నాటి సంపన్న కుటుంబాలు సాహిత్యంలో, లలిత కళల్లో శిక్షణ పొందిన బానిసల్ని పోషించేవారు. హోమర్, హేసియడ్‌లతో పాటు మరి తొమ్మిది మంది లిరికల్ కవుల కృతుల్ని కంఠోపాఠంగా చెప్పగలిగిన పదకొండు మంది బానిసలు క్లావిస్యోస్ సబినస్ వద్ద వున్నారని సెనెడా పేర్కొన్నాడు. "పుస్తకాల పేటికలు ఇంతకంటే చవక" అన్న ఒక మిత్రుని దుడుకు వ్యాఖ్యకు "గృహస్థానికున్నంత తెలివి గృహ యజమానికి వుంటుంది" అనే జవాబు వచ్చింది. అలాంటి వాటిని పక్కకు పెడితే అచ్చు యంత్రాలు లేని ఆ రోజుల్లో చదువుకున్న బానిసల అవసరం ఉండి ఉంటుంది.... బాగా పని కలిగిన వకీళ్ళు, కవులు, తత్వ శాస్త్రజ్ఞులు, సాహిత్యాభిమానులు - వీళ్ళకు నకళ్లు రాసే వాళ్ళూ, చదివి వినిపించే వాళ్ళూ, కార్యదర్శులూ వంటి వారి అవసరం ఉండేది. అలాంటి వారు సహజంగానే భాషా ప్రవీణులై వుండేవారు. ఇరవయ్యో ఏట మరణించిన ఒక లిబ్రేరియస్ (Librarius) తాను లాటిన్ భాషా సాహిత్యాలలో దిట్టనని గొప్పలు చెప్పుకున్నాడు. అమాన్యుయెన్సులు (Amanuences) ఆనాడు సర్వ సాధారణం. ప్రభుత్వ, ప్రభుత్వేతర

గ్రంథాలయాలలో గ్రంథాలయ సిబ్బంది ఉండేవారు. షార్టు హ్యాండు లిపిని వాడడం సామ్రాజ్యంలో సర్వ సాధారణం. బానిసలు నోటరీలుగా పని చేయడమూ మామూలే. స్వెటోనియస్ తన తన విశిష్ట గ్రంథంలో ఎందరో విముక్తి పొందిన బానిసల్ని, భాషా శాస్త్రజ్ఞుల్ని (Rhetoricians), వైయాకరణుల్ని గురించి ప్రస్తావించాడు. ఆస్టస్ మనుమలకు పాఠాలు చెప్పిన మెరియస్ ఫ్లాకస్ మరణానంతరం ఆయన స్మృతికి గౌరవ చిహ్నంగా శిలా విగ్రహాన్ని స్థాపించారు. ఆర్బీలియస్‌కు బానిసా, శిష్యుడూ అయిన స్క్రెబోనియస్ ఆఫ్రొడైటస్, తరువాత స్క్రెబోనియా చేత విముక్తి పొందాడు. పాలటైన్ గ్రంథాలయాధికారిగ వున్న హైజినస్ తర్వాత ఆపదవి అతని నుంచే స్వేచ్ఛ పొందిన జూలియస్ మాడెస్టస్‌కు సంక్రమించింది. తన యజమానితోనూ, బానిస స్నేహితులతోనూ, విముక్తులైన వాస్తు శిల్పులతోనూ వాదించడానికి ప్రోత్సాహం పొందిన ఒక బానిస తత్వవేత్త గురించి ఒక విముక్త బానిస చరిత్ర కారుడు రాశాడని వింటూ వుంటాం. విముక్త బానిసలు వైద్యులుగా మనకు అనేక ఉల్లేఖనాలలో కనిపిస్తారు. వారిలో కొందరు స్పెషలిస్టులు కూడా. వారు పెద్ద పెద్ద గృహస్థాలలో బానిసలుగా తర్ఫీదు పొందిన వాళ్లు. మాన్యుమిషన్ తర్వాత వారు పైకొచ్చి, అధిక ఫీజులు లాగేవారనే అపఖ్యాతి గడించారు".

సమాజంలోని కొన్ని వర్గాల అవసరాల్ని తీర్చడానికి నర్తకులు, గాయకులు, విచిత్ర వేషధారులు, క్రీడా వ్యాయామ శిక్షకులు, పెద్ద మనుషులు అవసరమయ్యారు. వీరందరూ బానిసల్లో ఉండేవారు. వీరి శిక్షణ చాలా వరకు కొంత పేరు ప్రఖ్యాతులున్న గురువుల ఆధ్వర్యంలో జరిగేది[2].

"అగస్టస్ కాలంలో వాణిజ్య, పారిశ్రామిక విస్తరణా యుగం ప్రారంభమైంది. (లలిత కళల్లోనూ, చేతి వృత్తులలోనూ) బానిసలు ఇంతకు ముందు నుంచే పని చేస్తున్నప్పటికీ, వాణిజ్యంలో హఠాత్తుగా వచ్చిన పెరుగుదల వల్ల వారి ఉద్యోగాల సంఖ్య ఎంతో పెరిగింది. వాణిజ్య, పారిశ్రామిక రంగాల్లో రోమన్లు మరింత స్వేచ్ఛగా, మరింత బహిరంగంగా పాల్గొన్నారు. వాణిజ్య కార్యక్రమాలు పెరగడంతో వ్యాపారంలో ఏజెంట్ల పాత్ర పెరిగింది. అటువంటి ఏజెంట్లు దాదాపుగా అందరూ బానిసలే... (ఎందుకంటే) బానిసత్వపు నిబంధనలు (వెసులుబాటు గలవి). (అవి ఎలా ఉండేవంటే) డబ్బు, స్వేచ్ఛల ఆశ చూపించి బానిసతో పని చేయించేంత సడలించడానికి, బానిస తన తప్పుల ద్వారా

యజమానికి నష్టం కలిగించకుండా జాగ్రత్త పడేందుకు అవసరమైనంతగా బిగించడానికి వీలుగా వుండేవి. బానిసకూ యజమానికీ, బానిసకూ మూడో వ్యక్తికీ మధ్య ఒప్పందాలు జరగడం అప్పుడు మామూలు విషయంగా కనిపిస్తుంది. ఈ లావాదేవీల్లో లాభాలు బాగానే ఉండేవి... బానిసలకు భూమిని కౌలుకివ్వడం ఇంతకు ముందే గుర్తించబడింది. పరిశ్రమల్లో కూడా ఇలాంటి పద్ధతే అమలయింది. బానిసకు కమీషన్ ఇచ్చే ప్రాతిపదికనగాని, యజమానికి నిర్దిష్టమైన కప్పం చెల్లించే షరతు మీద గానీ బానిసలకు బ్యాంకుల్ని, ఓడల్ని నడిపే వ్యాపారాన్ని అద్దెకిచ్చేవారు[3].

"బానిసలార్జించిన డబ్బు చట్టప్రకారం వారి స్వంతం (Peculium) దాన్ని వారు ఎందుకైనా ఖర్చు పెట్టవచ్చు. చాలా సందర్భాలలో దీనిని తిండికీ, వినోదాలకూ ఖర్చు పెట్టినా ఈ స్వంతడబ్బును అప్రయత్నంగా సంపాదించి జులాయిగా ఖర్చు పెట్టే చిల్లర పొదుపుగా భావించకూడదు. యజమానికి లాభాలు సంపాదించి పెట్టే బానిసలు తమ లాభాలు కూడా చూసుకుని, తమ డబ్బును జాగ్రత్తగా మదుపు చేసేవారు. చాలా సార్లు ఆ డబ్బుని యజమాని వ్యాపారంలో గానీ, ఇతర రంగాలలో గాని పెట్టుబడి పెట్టేవారు. బానిస తన యజమానితో వ్యాపార లావాదేవీలు నడపవచ్చు. వారిద్దరినీ వేరు వేరు వ్యక్తులుగానే చూసేవారు. బానిసకు మరొక వ్యక్తితో కూడా లావాదేవీలు జరిపే హక్కు ఉండేది. తన ఆస్తిని, ప్రయోజనాల్ని కాపాడేందుకు అతడు ప్రొక్యురేటర్లను నియమించుకోవచ్చు. ఈ విధంగా బానిసలకు స్వంత డబ్బుతో బాటు భూములు, ఇళ్లు, దుకాణాలే కాక హక్కు భుక్తాలు కూడా వుండేవి.

"వాణిజ్యంలో బానిసలు చేసిన పనులు అనేకం. కొందరు రొట్టెలు, మాంసం, ఉప్పు, ఎండుచేపలు, సారాయి, కూరగాయలు, చిక్కుళ్లు, ఆపైన్(aupine) గింజలు, తేనె, పెరుగు, మేక మాంసం, బాతులు, పచ్చి చేపలు మొ॥ అన్ని రకాల తిండి పదార్థాలు అమ్మేవారు. మరికొందరు చెప్పులు, గౌన్లు, మొ॥ వస్త్రాలను అమ్మేవారు. రోమ్ నగరంలో వారి వర్తకం సర్కస్ మాక్సిమస్ వద్ద, పోర్టికస్ ట్రిజెమినస్, ఎస్క్విలైన్ మార్కెట్, కావొలియన్ కొండమీదున్న గ్రేట్ మార్ట్ లేక సబర్రా ప్రాంతాలలో జరిగేది." [4]

బానిస కార్యదర్శులూ, ఏజెంట్లూ తమ యజమానుల కోసం ఏమేరకు పని చేశారో, పాంపేలోని కైసిలస్ జకుండస్ ఇంట్లో దొరికిన రసీదులనుంచి తెలుస్తుంది[5].

ఈ పరిస్థితుల్లో ప్రభుత్వం బానిసల్ని కలిగి వుండడం ఆశ్చర్యకరం కాదు. యుద్ధం చేసేది రాజ్యమే కాబట్టి బందీలందరూ రాజ్యపు ఆస్తే. ఆశ్చర్యకరమైన దేమిటంటే ప్రభుత్వ బానిసలను వినియోగించుకున్న తీరు, వారు పొందిన అసాధారమైన సామాజిక హోదా....

"రోమన్ సామ్రాజ్యానికి ముందే 'ప్రజా బానిస' అంటే రాజ్యం చేత వివిధ కార్యాలయాల్లో పనికి నియమింపబడిన బానిస అనే అర్థం వుంది. ఆ పదం ఒక నిర్దిష్ట వృత్తిని, చాలా సమయాల్లో హోదాని సూచించేది. రాజ్య బానిసలు, పట్టణ బానిసలు, సీజరు బానిసలూ చేసే పని ఈ నాటి సివిల్ సర్వీసులలో, మున్సిపల్ కార్పొరేషన్ ఉద్యోగులలోని ఉన్నత, కింది శాఖలలోని ఉద్యోగులు చేసే పనిని పోలి ఉంటుంది.... (కోశాగారంలో) కింది స్థాయి ఉద్యోగుల్లోని గుమాస్తాలు, ఆర్థిక అధికారులంతా బానిసలూ, స్వేచ్ఛ పొందిన బానిసలూ వుండేవారు. వారు చేసే పనులు చాలా రకాలుగా ఉండి ఉండాలి. టంకశాల (mint) అధికారిగా ఒక ప్రభువు (knight) వుండేవాడు. నాణాల ముద్రణకు బాధ్యుడుగా ఒక స్వేచ్ఛ పొందిన బానిస ఉండేవాడు. అతని కింద బానిసలూ, స్వేచ్ఛ పొందిన వారూ పని చేసేవారు... రాజ్యంలోని ఒక్క శాఖలోకి మాత్రం బానిసల్ని ఎప్పుడో అత్యవసరాల్లో తప్ప రానిచ్చే వారు కాదు. అది సైనిక శాఖ. యుద్ధం చేసే గౌరవానికి బానిసలు అర్హులు కారని భావించేవారు. వేరే ఉద్దేశాలు కూడా నిస్సందేహంగా ఉన్నాయి. ఎక్కువ సంఖ్యలో బానిసలకు ఆయుధాలు ఉపయోగించే తర్ఫీదునివ్వడం ప్రమాదకరం. యుద్ధంలో అరుదుగా పని చేసినా, బానిసలు యుద్ధ శ్రేణుల వెనకా, సైన్యాధిపత్య విభాగంలో సేవకులుగా, సైన్యం రవాణాలోనూ పెద్ద సంఖ్యలో పని చేసేవారు. నౌకా దళంలో బానిసలు సర్వ సాధారణం." [6]

## II

ఇప్పుడు మనం, బానిసత్వం చట్టబద్ధంగా ఉన్నప్పుడు అమెరికాలో నీగ్రోల అసలు పరిస్థితులెలా ఉండేవో చూద్దాం. ఆ పరిస్థితులను అర్థం చేసుకోవడానికి పనికి వచ్చే వాస్తవాలు ఇవి.[7]

"విప్లవ కాలంలో తెల్లవారూ, నల్లవారూ పెద్ద స్పర్థలు లేకుండా కలిసి పోరాటమూ,

భోజనాలూ చేసేవారని లెఫాయెట్ స్వయానా చూసి చెప్పాడు. దక్షిణ కెరొలినాలోని గ్రాన్‌విల్ కౌంటీలో, ప్రిన్స్‌టన్ విశ్వ విద్యాలయంలో చదివిన బావిస్ అనే నికార్సయిన నీగ్రో, శ్వేత జాతి విద్యార్థులకై ఒక ప్రైవేటు విద్యాలయాన్ని నడిపేవాడు. స్థానిక ప్రెసిటరీ నుండి లైసెన్స్ పొంది రాష్ట్రంలోని శ్వేత జాతి వారి మత పరమైన సమావేశాల్లో మత బోధనలు చేసేవాడు. అతని శిష్యుల్లో ఒకరు దక్షిణ కెరొలినా రాష్ట్ర గవర్నరు కాగా ఇంకొకరు అదే రాష్ట్రంలో విగ్ శాసన సభ్యుడుగా ప్రసిద్ధి చెందాడు. కెరొలినా ప్రధాన న్యాయాధీశుని ఇద్దరు కొడుకులూ ఆయన శిష్యులే. రాష్ట్రంలోని అతి పెద్ద మిలిటరీ అకాడమీ సంస్థాపకుని తండ్రిగారు ఆయన పాఠశాలలో చదవడమే కాక ఆయన ఇంట్లో భోజనం కూడా చేసేవాడు... బానిసల్ని అన్ని రకాల పనుల్లో వినియోగించేవారు. అందులో తెలివైన వారికి చేతి వృత్తుల్లో శిక్షణ ఇచ్చేవారు. కొందరిని అద్దెకిచ్చేవారు. బానిస హస్తకారులు మామూలు హస్తకారుల కంటే రెండింతలు సంపాదించేవారు. చేతి వృత్తుల యజమానులకు స్వంత బానిస పనివాళ్ళుండేవారు. కొందరు యజమానులు వారి బానిస హస్తకారుల చేతి కింద పని చేయడానికి మరికొందరు బానిసల్ని నియమించేవారు. చేతి వృత్తుల్లో పని చేసే బానిసల్లో చాలా మంది ఎక్కువ పని చేయడం వల్ల వచ్చిన డబ్బుతో తమ స్వేచ్ఛను కొనుక్కునేవారు.

"బానిసల అమ్మకాల గురించి, పారిపోయిన బానిసల్ని పట్టుకోవడాన్ని గురించి ఇచ్చిన ప్రకటనలు బానిసల నైపుణ్యానికి సూచికలు. (బానిసలు) పేదవారైన శ్వేత జాతివారితో సమానంగా గానీ, అంతకంటే ఎక్కువగా గానీ కూలీ రేట్లు పొందేవారు. తమ యజమానులకు గల పలుకుబడితో మంచి ఉద్యోగాలు సంపాదించుకునేవారు. 1838వ సంవత్సరం ఏథెన్సు, జార్జియాల్లోని తాపీ, వడ్రంగం పనుల గుత్త దార్లకు నీగ్రో కూలీల పట్ల మొగ్గూ మక్కువలు చూపరాదని అర్జీలు అందాయి. 'చట్టరీత్యా, నైతిక రీత్యా, పౌరసత్వ రీత్యా శ్వేత జాతీయుడు మాత్రమే ఈ దేశానికీ, రాజ్యానికీ అసలైన హక్కుదారు. ఈయజమాన్యపు హక్కు భూమి గుండ్రంగా వుందని ఋజువుచేసిన కొపర్నికస్, గెలీలియో వంటి శ్వేత వర్ణుల నుండి సంక్రమించింది. వీరు ప్రతిపాదించిన భూమి యొక్క గోళాకారపు సిద్ధాంతమే పశ్చిమ దిశగా పోయి భూమిని కనుగొనవచ్చనన్న అభిప్రాయం కొలంబస్‌కు కలగడానికి కారణభూతమయింది. ఈ విధంగా ఈ ఖండం కేవలం శ్వేత జాతీయుల చేతనే కనిపెట్టబడింది. నీగ్రోలను కాపాడుతూ వెనకేసుకొస్తూ,

ఆకలితో అలమటించే ఏ శ్వేత జాతి కుటుంబాలకైతే మీరు పని ఇవ్వకుండా కష్టపెడుతున్నారో వారే దాన్ని కనుగొన్నారు.' అట్లాంటాలో పని చేసే ఇద్దరు శ్వేత మెకానిక్కులు 1858లో వేరే విభాగాల్లో పని చేస్తున్న హస్తకార బానిసల నుండి తమకు రక్షణ కావాలని మహజరు సమర్పించారు. ఆ మరుసటి సంవత్సరమే కొందరు తెల్లవారు తమ మధ్య ఒక నల్లి జాతి దంత వైద్యుడు పని చేయడాన్ని నగర కౌన్సిల్ అనుమతిస్తోందని గగ్గోలు పెడుతూ ఇలా అన్నారు. 'మాకూ, మా ఇరుగు పొరుగుకూ అన్యాయం జరగకుండా ఉండాలంటే దీన్ని వెంటనే ఆపాలి. అట్లాంటా వాసులైన మేము న్యాయం కోసం మిమ్మల్ని అర్థిస్తున్నాము.' 1819వ సంవత్సరంలో రిచ్‌మండ్ కౌంటీలోని జార్జియాలో వేసిన స్వతంత్ర నీగ్రోల జనాభా లెక్కల్లో వారు నౌకల పనివారుగా, గుర్రాల పనివారుగా, జౌళి కార్మికులుగా, మిల్లు పని వారుగా, హెూల్‌స్టర్లుగా, నేత పనివారుగా, కళ్ళాలు, జీనులు చేసే వారుగా రంపపు మిల్లుల సేవకులుగా, ఆవిరి పడవల చోదకులుగా విభిన్న వృత్తులు చేపట్టారు. ఒక నీగ్రో చేసిన బూట్లతోనే మన్రోగారు అధ్యక్ష పదవీ ప్రమాణ స్వీకారం చేసారు. మాంటిసెల్లోలోని థామస్ జెఫర్‌సన్ గారింట్లో ఎంతో అందంగా బానిసలు చేసిన ఫ్లోరింగు పనిని చూసి హేరియట్ మార్టిన్యూ గారెంతో అబ్బుర పడ్డారు. పాత ప్లాంటేషన్ తోటల్లోని పెద్దపెద్ద భవంతుల్లో నీగ్రోల పని తనపు గాఢమైన ఛాయలు ఈనాటికి కనిపిస్తాయి. నూలు వడకడం, నేత పని వంటివాటిలో ప్రావీణ్యమున్న నీగ్రో స్త్రీలు మిల్లుల్లో పని చేసేవారు. ఏథెన్సు, జార్జియాల్లో వారు ఏమాత్రం ఆక్షేపణకు గురికాకుండా శ్వేత జాతి బాలికలతో పాటు పని చేసే వారని 1839లో బకింగ్‌హామ్ పేర్కొన్నాడు. దక్షిణాదిలోని బానిసలుగాని, బానిసత్వం నుండి విముక్తి పొందిన వారుగాని ఉత్తరాది వారికంటే మెరుగుగా బతికారు. ఫిలడెల్ఫియాలో 1856వ సంవత్సరం నమోదైన 1637 మంది నీగ్రో వృత్తిపని వారిలో 'విచక్షణాయుత విద్వేష' కారణంగా మూడింట రెండు వంతుల కంటే తక్కువ మంది మాత్రమే వారి వృత్తుల్ని చేపట్టగలిగారు. పంతొమ్మిదో శతాబ్దం ప్రారంభం నుండి పెద్ద ఎత్తున ఉత్తర అమెరికాలోకి వచ్చిన ఐరిష్ వారికి కూడా దక్షిణాదిన నీగ్రో బానిసలకు ప్రాధాన్యత ఇచ్చిన కారణాల వల్లనే ప్రాధాన్యం ఇవ్వడం జరిగింది. ఐరిష్ క్యాథలిక్కులు తమకున్నదాంతో తృప్తి చెందుతారే తప్ప నీగ్రోల వలె తమ హెూదాను పెంచుకోవాలని వెంపర్లాడరని భావించబడేది. బానిస వ్యాపారం జరుగుతున్న రోజుల్లో పాత కాలపు ప్యూరిటన్ మహాశయుడైన ఆలివర్

క్రాంవెల్, డ్రగ్గెడా హత్యాకాండలో చనిపోగా మిగిలిన ఐరిష్ వారిని బార్బడోస్‌లో అమ్మివేయలేదా? న్యూయార్కు, పెన్సిల్వేనియాల్లోని స్వేచ్ఛపొందిన, పారిపోయి వచ్చిన నీగ్రోలు ఐరిష్ వారితో ఎప్పుడూ గొడవ పడుతుండేవారు. తీవ్రతరమైన నీగ్రో ఐరిష్ స్పర్థలు న్యూయార్కు డ్రాఫ్టు అల్లర్ల రూపంలో బయట పడ్డాయి. ఈ ఐరిష్ వారు భవన నిర్మాణ సామాగ్రి మోసేపనిని, మామూలు కూలీ పనుల్ని తమ చేతుల్లో ఉంచుకొని నీగ్రోల ఉనికిని వ్యతిరేకించారు. ఇందుకు కారణం తమకు అమెరికాలో అంతంత మాత్రంగా వున్న స్థానం, జీవనోపాధి పోతుందని వారు భావించడమే".

# III

రోమన్ బానిసల, అమెరికా నీగ్రోల స్థితిగతులు యథార్థంగా ఇలా ఉండేవి. భారత దేశంలోని అస్పృశ్యుల స్థితికీ, దీనికి పోలిక ఏమాత్రమైనా ఉందా? రోమన్ సామ్రాజ్యంలోని బానిసల స్థితిని అదే కాలంలోని అస్పృశ్యుల స్థితితో పోల్చడం అసమంజసం కాదు. అయినప్పటికీ నాటి రోమన్ సామ్రాజ్యంలోని బానిసల స్థితిని నేటి అస్పృశ్యుల స్థితితో పోల్చినా ఒప్పుకోడానికి కూడా నేను సిద్ధమే. అస్పృశ్యుల విషయంలో ఈనాటి కాలం స్వర్ణయుగంతో సమానం. కావున ఈ పోలికలో అస్పృశ్యుల విషయంలో వారి అత్యుత్తమ కాలాన్ని తీసుకుంటే బానిసల విషయంలో అతి నికృష్ట కాలం తీసుకున్నట్లవుతుంది. అస్పృశ్యుల, బానిసల వాస్తవ పరిస్థితుల పోలిక ఎలా ఉంటుంది? సామ్యమేమిటి? రోమన్ బానిసలవలె ఎందరు అస్పృశ్యులు గ్రంథాలయాధికారులుగా, అమాన్యుయెన్సులుగా, షార్ట్‌హ్యాండు రైటర్లుగా పని చేస్తున్నారు? ఎందరు భాషా వేత్తలుగా, వైయాకరణులుగా, తత్వ శాస్త్రజ్ఞులుగా, ట్యూటర్లుగా, డాక్టర్లుగా కళాకారులుగా పని చేస్తున్నారు? ఏ హిందువైనా గుండెమీద చేయి వేసుకొని ఈ ప్రశ్నల్లో దేనికైనా జవాబివ్వగలడా? బానిసలకెంతగానో అందుబాటులో వున్న ఈ వృత్తుల, పదవుల ద్వారాలు అస్పృశ్యుల విషయంలో పూర్తిగా మూసుకునే వున్నాయి. అస్పృశ్యతను వెనకేసుకు రావడంలో హిందువులు చేసే వాదనలో ఏమాత్రం పసలేదనే విషయం ఇందువల్ల విదిత మౌతున్నది. బానిస విధానంలో ఒక వ్యక్తి లేక వర్గం చావు బ్రతుకులు ఇంకో వ్యక్తి లేక వర్గం చేతుల్లో ఉండే పద్ధతి తప్పు అనే భావన వల్లనే చాలా మంది బానిసత్వాన్ని వ్యతిరేకించడం నిజంగా దురదృష్టకరం. బానిసత్వం లేనప్పటికీ దుర్భరమైన

పీడన, దోపిడి, హింసా ,దౌర్జన్యాలు, నిరాశా, నిస్పృహలుండ వచ్చనే విషయం వీరు మరచి పోతున్నారు. బానిసల అసలు స్థితిగతుల గురించిన పై విషయాల్ని పట్టించుకునే వారెవరైనా కేవలం చట్టపరమైన భావనను బట్టే బానిసత్వాన్ని గుడ్డిగా ఖండించడం పొరపాటని గుర్తిస్తారు. చట్టం అనుమతించిన విషయాలు సమాజంలోని ప్రధానమైన ఆచరణలను ప్రతిసారీ ప్రతిబింబించవు. తమకున్నదంతా బానిసత్వం వల్లనే కల్గిందనే విషయాన్ని బానిసలెందరో నిస్సంకోచంగా ఒప్పుకున్నవారే. వారు ఒప్పుకున్నా ఒప్పుకోకపోయినా వారిలో ఎందరో బానిసత్వం మూలంగానే బ్రతుక గలిగారనేది యథార్థం.

బానిస వ్యవస్థ ఒక స్వేచ్ఛాయుత సామాజిక వ్యవస్థ (free social order) కాదనేది నిజమే. అయితే అస్పృశ్యత మాత్రం స్వేచ్ఛాయుత సామాజిక వ్యవస్థా? అంటరానితనాన్ని సమర్థించే హిందువులు అది స్వేచ్ఛాయుత సామాజిక వ్యవస్థే నంటారు. అస్పృశ్యతకూ, బానిసత్వానికీ మధ్యనఉన్న కొన్ని వ్యత్యాసాల వల్ల అస్పృశ్యత ఎక్కువ హేయమైన స్వేచ్ఛారహిత సామాజిక వ్యవస్థ అవుతుందనే విషయం వారు విస్మరిస్తున్నారు. బానిసత్వం ఎప్పుడూ నిర్బంధమైంది కాదు. కానీ అస్పృశ్యత తప్పించుకో వీలులేనిది. ఒక మనిషిని ఇంకో మనిషి బానిసగా వినియోగించుకోవాలనే నిర్బంధం ఏదీ లేదు. కానీ అస్పృశ్యునికి అలాంటి అవకాశమే లేదు. ఒకసారి అస్పృశ్యుడుగా జన్మించిన వ్యక్తి అన్ని అశక్తతలకూ, వివక్షతలకూ గురియౌతాడు. బానిస చట్టాల్లో బానిసల విముక్తికి వీలుంది. ఒకసారి బానిస అయినంత మాత్రం జీవితాంతం బానిసగా ఉండనవసరంలేదు. కాని అస్పృశ్యత నుండి తప్పించుకునేందుకు ఏ అవకాశమూ లేదు. ఒకసారి అస్పృశ్యుడైతే ఆజన్మాంతం అస్పృశ్యుడే. ఇంకో వ్యత్యాసం ఏమంటే అస్పృశ్యత అనేది పరోక్ష బానిసత్వం కావడం. అందువల్లనే దాన్ని బానిసత్వపు అతి అధమ రూపమని చెప్పవచ్చు. బహిరంగంగానూ, నేరుగానూ స్వేచ్ఛను కోల్పోవడం ద్వారా బానిసగా మారే పద్ధతే మెరుగైన పద్ధతి. దాని వల్ల బానిస తాను బానిసనే విషయం గుర్తించగలిగాడు. స్వేచ్ఛా సాధనకు తన బానిసత్వాన్ని గుర్తించడమే తొలి మెట్టు. ఇందుకు భిన్నంగా, పరోక్షంగా స్వేచ్ఛను కోల్పోయిన వ్యక్తికి తన బానిసత్వాన్ని గురించి స్పృహ వుండదు. అస్పృశ్యత ఒక పరోక్ష బానిసత్వం. అస్పృశ్యులకు మీరు స్వతంత్రులు, మీరు పౌరులు, మీకూ పౌర హక్కులున్నాయని చెప్పి మభ్యపెట్టి వారి మెడ చుట్టూ ఉచ్చు బిగించి ఆ ఆదర్శాలు సాధించుకునే వీలు

లేకుండా చేయడం ఘోరమైన మోసం. అది అస్పృశ్యుల్ని తాము బానిసలమని తెలుసుకోనీకుండా బానిసలుగా ఉంచే పద్ధతి. అది అస్పృశ్యత అయినా బానిసత్వం కూడా. అది పరోక్షమే అయినా వాస్తవం కూడా. అది తెలియకుండా జరిగేది కనక దీర్ఘకాలికమైంది కూడా. ఈ రెండు సామాజిక వ్యవస్థల్లో అస్పృశ్యతే అతి హీనమైందనేది నిశ్చయం.

బానిసత్వం, అస్పృశ్యత రెండూ స్వేచ్ఛాయుత సామాజిక వ్యవస్థలు కావు. ఈ రెంటి మధ్య తేడా చూడాలంటే - నిజానికి అలాంటి తేడా వున్నది - విద్యకు, ఉత్తమత్వానికి, సంతోషానికి, సంస్కృతికి ,సంపదకు ఎందులో ఎక్కువ అవకాశాలుంటాయో చూడాలి. ఇలాంటి కొలబద్దలతో చూస్తే బానిసత్వం నూరు రెట్లు మెరుగైందని ఘంటాపథంగా చెప్పవచ్చు. బానిసత్వంలో పైవన్నీ సాధించుకోవడానికి అవకాశం ఉంది. అస్పృశ్యతలో వీటికెంత మాత్రమూ అవకాశం లేదు. బానిసత్వపు స్వేచ్ఛారహిత సామాజిక వ్యవస్థలో వున్న ప్రయోజనాలేవీ దీనికి లేవు. పోగా స్వేచ్ఛాయుత సామాజిక వ్యవస్థలో వున్న నష్టాలన్నీ దీంట్లో ఉన్నాయి. బానిస వ్యవస్థ వంటి స్వేచ్ఛారహిత సామాజిక క్రమంలో వ్యాపారం, వృత్తి, లలిత కళారంగాలలో బానిసలకు శిక్షణ, అప్రెంటిస్‌షిప్ దొరకడం వల్ల వారు ప్రొఫెసర్ మ్యూర్స్ గారన్నట్లు ఉన్నత సంస్కృతిలో ప్రవేశించవచ్చు. అస్పృశ్యతలో వున్న అణచివేత గాని, వ్యక్తిగత ప్రగతిని నిరోధించే లక్షణంగాని రోమన్ సామ్రాజ్యంలోని బానిస వ్యవస్థ సహజ లక్షణాలుగా ఉండేవి కావు. అలాగని అస్పృశ్యత కంటే బానిస వ్యవస్థ మెరుగనడం తొందరపాటవుతుంది.

ఈ శిక్షణ, తద్వారా లభించిన ఉన్నత సంస్కృతికిలోకి పరిచయ ప్రవేశాలు బానిసలకెంతో ఉపయోగపడగా అందుకు జరిగిన ఖర్చు మాత్రం యజమానులపై పడేది. "బానిసత్వం పొందకముందే విద్యావంతులూ, సుశిక్షితులూ అయిన బానిసలు అరుదుగా దొరికేవారు. ఇలాంటి కొరతను తీర్చడానికి వారికి ఇంటి పనుల్లోనూ, వృత్తుల్లోనూ శిక్షణ ఇవ్వడమే మార్గంగా ఉండేది. సామ్రాజ్య కాలం కంటే ముందు ఇలాగే జరిగేది. కాటో ద ఎల్డర్ ఇందుకు ఒక ఉదాహరణ. బానిసల శిక్షణ యజమాని, అతని సిబ్బంది చేత జరిగేది. .. సంపన్న గృహస్థాల్లో ప్రత్యేకమైన బానిస గురువులుండేవారు. ఈ శిక్షణ అనేది పరిశ్రమలు, వర్తకం, చేతి వృత్తులు ,అక్షరాస్యత వంటి పలువిషయాలకు సంబంధించి ఉండేది".

బానిసల శిక్షణ పట్ల యజమానులింతగా శ్రద్ధ వహించడానికీ, వారిని ఉన్నత శ్రేణి

శ్రామికులుగా, సంస్కారవంతులుగా తీర్చి దిద్దడానికి అసలు కారణం లాభార్జనే అనడంలో సందేహం లేదు. సుశిక్షితుడైన బానిసకు వెల ఎక్కువ. అలాంటి బానిసను అమ్మివేసినా, కూలికి పంపినా ఎక్కువ డబ్బు వస్తుంది. అందుకే బానిసలపై యజమానులీ విధంగా పెట్టిన ఖర్చు పెట్టుబడి వంటిది.

బానిస వ్యవస్థ వంటి స్వేచ్ఛారహిత సామాజిక వ్యవస్థల్లో బానిసల పోషణ, రక్షణలకు సంబంధించిన బాధ్యత యజమానిపై వుంటుంది. తిండి తిప్పలను గురించిగాని, బట్టలు, నివాసం వంటి వాటిని గురించి గాని ఆలోచించవలసిన పని బానిసలకు లేదు. ఇవన్నీ యజమాని విధిగా సమకూర్చిపెడతాడు. ఇలా చేయడం యజమానులకేం బరువు కాదు. ఎందుకంటే వారు చేసిన ఖర్చు కంటే ఎక్కువ సంపాదిస్తారు. స్వేచ్ఛ వున్న వాళ్ళలో ప్రతీ ఒక్కరికీ చీకూ చింతా లేకుండా కూడూ గూడూ లభించవనే విషయం కూలీలకు అనుభవం ద్వారా తెలిసిందే. పని కావాలనుకునే ప్రతి మనిషికీ పని దొరకదు. పని దొరకని మనిషికి తిండి దొరకదు. అయితే పని లేకుండా తిండి లేదనే నియమం బానిసలకు వర్తించదు. వారికి తిండినీ, పనినీ సంపాదించి పెట్టే బాధ్యత యజమానిది. అతని యజమాని కనుక పని ఇప్పించలేకపోయినా, బానిసకు తిండి పొందే హక్కు పోదు. వ్యాపారంలో వచ్చే ఒడిదుడుకుల వల్ల ఎదురయ్యే మంచి రోజులు, గడ్డురోజులు స్వేచ్ఛ గల కూలీలకు తప్పవు. బానిస మాత్రం వీటికి అతీతుడు. వాటి ప్రభావం యజమాని మీదే పడుతుంది. కరువు కాటకాలతో నిమిత్తం లేకుండా అతని అన్న వస్త్రాలు అతనికి ఎప్పటిలాగే లభిస్తాయి.బానిసత్వం వంటి స్వేచ్ఛా రహిత సామాజిక వ్యవస్థలో బానిస ఆరోగ్యం, యోగ క్షేమాల్ని గురించి యజమాని అవశ్యంగా జాగ్రత్త వహిస్తాడు. యజమాని ఆస్తిగా ఉండటం బానిస దౌర్భాగ్యమే కాని ఈ దౌర్భాగ్యమే స్వేచ్ఛాజనులకంటే మెరుగైన స్థితిని వారికి ప్రసాదించింది. బానిస తన ఆస్తి కావడం మూలంగా స్వీయ ప్రయోజనాల్ని ఆశించిన యజమాని వారి ఆరోగ్యం, పోషణల గురించి ఎంతగానో శ్రద్ధ వహించేవాడు. రోమ్‌లోనయితే బానిసల్ని బురదనేలల్లో గాని, మలేరియాగ్రస్త భూముల్లోగాని అసలే పని చేయించేవారు కాదు. అట్లాంటి నేలల్లో స్వేచ్ఛా జనాన్ని మాత్రమే వినియోగించేవారు. అడుసు నేలల్లో, మలేరియాగ్రస్త నేలల్లో బానిసల్నేమాత్రం వినియోగించరాదని కాటో రోమన్ రైతులకు సలహా ఇచ్చాడు. ఇది చిత్రంగానే అనిపించవచ్చుగాని కొద్దిగా ఆలోచిస్తే ఇది యదార్థమే ననిపిస్తుంది. బానిస ఒక విలువైన

ఆస్తి. అందుకే విజ్ఞతగల యజమాని అతన్ని మలేరియా ప్రమాదానికి గురిచేయడు. ఇదే జాగ్రత్త స్వేచ్ఛా జనుల పట్ల తను చూపనవసరం లేదు. వారు బానిసల వలె ఆస్థి కాకపోవడమే ఇందుకు కారణం. ఈ భావనే బానిసలకు పెద్ద రక్షాకవచంగా మారింది.

స్వేచ్ఛా రహిత సామాజిక వ్యవస్థలో వున్న పై లాభాల్లో ఏ ఒక్కటీ అస్పృశ్యతకు లేదు. నాగరికత, సంస్కృతి వంటివి అస్పృశ్యుల అందుబాటులో ఏమాత్రం ఉండవు. అస్పృశ్యుని పని ఎప్పుడూ ఊడ్చడమే. అతడింక వేరే ఏ పనీ చేయరాదు. అతని జీవికకు ఎలాంటి భద్రతాలేదు. అతనికి కూడు, గుడ్డ, గూడుకు సంబంధించిన బాధ్యత హిందువులెవ్వరూ వహించరు. అతని ఆరోగ్యాన్ని కాపాడే బాధ్యత ఎవ్వరూ వహించరు. ఇంతేకాదు, అస్పృశ్యుడు చస్తే పీడ విరగడవుతుందని కూడా భావించబడుతుంది. "అస్పృశ్యుడు చచ్చాడు, మైల భయం చచ్చిం"దనేది హిందువులు చెప్పుకునే సామెత.

ఇవన్నీ కాకుండా ఇంకో ప్రక్క అస్పృశ్యులు స్వేచ్ఛాయుత సామాజిక వ్యవస్థలోని నష్టాలన్నీ భరించాలి. స్వేచ్ఛాయుత సామాజిక వ్యవస్థలోని జీవన పోరాటంలో ఎవరి బాధ్యత వారిదే. ఈ బాధ్యతే స్వేచ్ఛాయుత సామాజిక వ్యవస్థలోని పెద్ద ఇబ్బంది. ఒక వ్యక్తి ఈ బాధ్యత ఏమేరకు నిర్వహించగలుగుతాడనేది అతడి మంచి ప్రారంభం, సమాన అవకాశాలు, అన్యాయం ఎదురుకాక పోవడం వంటి వాటిపై ఆధారపడి ఉంటుంది. అస్పృశ్యుడు స్వేచ్ఛ కలిగిన మనిషే అయినప్పటికీ అతని జీవితం కష్టాలతోనే ప్రారంభమౌతుంది. అతను సమానత్వానికీ, న్యాయానికి నోచుకోడు. ఈ రకంగా చూసినపుడు అస్పృశ్యత బానిసత్వం కంటె చెడ్డదే కాకుండా దానికంటే క్రూరమైంది కూడా. బానిస వ్యవస్థలో బానిసకు పనిని సంపాదించి పెట్టే కర్తవ్యం యజమానిది. స్వేచ్ఛాయుత సామాజిక వ్యవస్థలో ఉపాధికోసం ఒక కూలీతో ఇంకో కూలీ పోటీపడాలి. ఉపాధి కొరకు జరిగే తీవ్ర పోటీ పరిస్థితుల్లో అస్పృశ్యులకేం న్యాయం జరుగుతుంది? టూకీగా చెప్పాలంటే ఇలాంటి పోటీలో సామాజిక విపక్షతా భారంతో బ్రతుకీడుస్తున్న అస్పృశ్యుడు పని సంపాదించుకోవడంలో చివరివాడుగానూ, పని పోగొట్టుకోవడంలో మొదటివాడుగానూ ఉంటాడు. బానిసత్వంతో పోలిస్తే అస్పృశ్యత క్రూరమైంది. జీవనోపాధికి కావలసిన ఏ అవకాశమూ కల్పించకుండానే అస్పృశ్యుణ్ణి తన పోషణకు అతన్నే బాధ్యుణ్ణి చేస్తుంది.

పైన చెప్పిన విషయాల సారాంశం ఇదిః బానిస యజమానుల వలె కాకుండా

విభాగాలతో భారత రాజ్యాంగ వ్యవస్థ నిర్మించాలనీ, ఈ నిర్మాణానికి భారతీయ గ్రామమే పునాదిగా వుండాలనీ వారి వాదన. అస్పృశ్యుల దృక్కోణం నుంచి చూస్తే అంతకు మించిన ప్రమాదం మరొకటి వుండదు. దేవుడి దయవల్ల రాజ్యాంగ సభ ఈ ప్రతిపాదనను ఆమోదించలేదు. ఏదేమయినా భారతీయ గ్రామం ఒక ఆదర్శ సామాజిక వ్యవస్థ అనే నమ్మకాన్ని మాత్రం హిందువులు వదిలిపెట్టరు. ఈ నమ్మకం హిందువులకు సాంప్రదాయికంగా రాలేదు. అలాగే ఇది పూర్వం కాలం నుంచీ రాలేదు. ఇది, ఈస్ట్ ఇండియా కంపెనీలో పని చేసిన సర్ చార్లెస్ మెట్‌కాల్ఫ్ అనే అధికారి అభిప్రాయంనుండి ఎరువు తెచ్చుకున్న భావన. ఆదాయపు శాఖలో పని చేసిన మెట్‌కాల్ఫ్ తన ఆదాయ నివేదిక ఒక దానిలో భారతీయ గ్రామాన్ని ఇలా వర్ణించాడు:[1]

"ఈ గ్రామ సమూహాలు (village Communities) చిన్న చిన్న గణతంత్రాలు (Republics) . తమకు కావలసినవన్నీ దాదాపుగా కలిగి వుండి, బయటి సంబంధాలపై దాదాపుగా ఆధారపడకుండా వుంటాయి. ఏదీ మిగలనపుడు కూడా ఇవి మిగిలే వుంటాయనిపిస్తుంది. ఒక దాని తర్వాత మరొక రాజవంశం పడిపోతుంది. ఒక విప్లవం తర్వాత మరొక విప్లవం వస్తుంది. హిందువులు, పఠానులు, మొగల్‌లు, మరాఠాలు, సిక్కులు, ఆంగ్లేయులు అందరూ ఒకరి తర్వాత ఒకరు అధికారంలోకి వచ్చారు. కానీ ఈగ్రామ సమూహాలు మాత్రం అలాగే ఉన్నాయి. కష్టకాలంలో వారు ఆయుధాలు ధరించి తమను తాము కాపాడుకుంటారు. ఏదైనా శత్రుదేశపుసైన్యం తమ దేశం గుండా ప్రయాణిస్తున్నప్పుడు గ్రామ వ్యవస్థలోని ప్రజలందరు తమ పశువులతో సహా నాలుగు గోడల మధ్య ఉండిపోతారు. ఒక వేళ శత్రువు వారిని కొల్లగొట్టి, నాశనం చేయదలిచాడని తెలిసినపుడు, గ్రామస్తులు తమతో మైత్రీ సంబంధాలు కల గ్రామాలకుపోయి దాక్కుంటారు. లూటీలు,దోపిడీలు పూర్తయి శత్రువులు వెళ్ళినారని తెలుసుకున్నాక తిరిగి గ్రామం చేరుకొని తమ వృత్తులు కొనసాగిస్తారు. కాని, ఈమారణకాండ సంవత్సరాల తరబడి చెలరేగి, గ్రామాలు నివాసయోగ్యం కానపుడు గ్రామస్థులు చెల్లాచెదరై పోతారు. తిరిగి శాంతి భద్రతలు నెలకొన్నప్పుడు వారు తమ స్వగ్రామం చేరుకొంటారు. ఒక తరం వారు చెల్లాచెదరై, ఊళ్లు పట్టిపోయినా వారి తరవాతి తరం వారు తిరిగి వారి గ్రామాలు చేరుకుంటారు. అదే గ్రామం, అవే ఇళ్ళు, అవే పొలాలు, అవే గ్రామ స్థలాలను స్వాధీనం

చేసుకొని తిరిగి జీవనం కొనసాగిస్తారు. తండ్రుల స్థానాన్ని కొడుకులు ఆక్రమించుకుంటారు. అయితే వారు చిన్న చిన్న కారణాల వల్ల గ్రామాన్ని వదిలిపెట్టరు. ఎంతటి విపత్కర పరిస్థితినైనా, మారణకాండనైనా ఎదుర్కొని త్రిప్పికొట్టగల శక్తి భారతీయ గ్రామాలకుంది. ఈ గ్రామ సమూహాల కలయిక- ఇందులో ప్రతి గ్రామం ఒక స్వతంత్ర రాజ్యం - మాత్రమే అనేక విప్లవాలు, మార్పులలో భారత ప్రజల్ని పరిరక్షించడానికి దోహదం చేసిన అతి ప్రధాన కారణంగా నేను భావిస్తున్నాను. ఈ వ్యవస్థ వారి సుఖసంతోషాలకూ, స్వేచ్ఛా స్వాతంత్రాలను అనుభవించడానికీ ఎంతో అనుకూలమైనదని నా భావన".

పాలక వర్గానికి చెందిన ఓ ఉన్నతోద్యోగి భారతీయ గ్రామాల్ని వర్ణించిన విధానం హిందువులకు మైమరుపు కలిగించింది. వారు దీనిని ఒక అభినందనగా స్వీకరించారు. ఈ అభిప్రాయాన్ని వారు స్వీకరించడంలో వారి తెలివితేటలనూ, అవగాహననీ ఉపయోగించలేదు. పాలితులందరికీ ఉండే బలహీనతలే వారు కనబరిచారు. చాలా మంది విదేశీయులు కూడా భారతీయ గ్రామ వ్యవస్థను ఒక ఆదర్శ వ్యవస్థగా భావించేటట్లు ప్రచారం జరిగింది కనుక గ్రామాల్లో కనబడే నిజమైన సాంఘిక వ్యవస్థ గురించి ఒక వాస్తవిక చిత్రాన్ని ఇవ్వడం మంచిది.

భారతీయ గ్రామం ఒకే సామాజిక విభాగం కాదు. అందులో కులాలు ఉంటాయి. కాని మన ప్రయోజానికి ఈ క్రింది వివరాలు సరిపోతాయి.

1. గ్రామంలోని ప్రజలు రెండు వర్గాలుగా విభజింపబడి ఉంటారు.

   i. స్పృశ్యులు ii. అస్పృశ్యులు

2. స్పృశ్యులు హెచ్చు జాతిగానూ, అస్పృశ్యులు హీన జాతిగానూ వుంటారు.

3. స్పృశ్యులు గ్రామంలో నివసించగా, అస్పృశ్యులు గ్రామం వెలుపల ప్రత్యేకించబడిన స్థలాల్లో నివసించాలి.

4. ఆర్థికంగా స్పృశ్యులు శక్తివంతమైన, బలమైన సమూహం. అస్పృశ్యులు వారిపై ఆధారపడిన పేద ప్రజలు.

5. సాంఘికపరంగా స్పృశ్యులు పాలక జాతి కాగా అస్పృశ్యులు పాలిత జాతిగా, వారసత్వ బానిసలుగా వుంటారు.

భారత దేశంలో స్పృశ్యులు, అస్పృశ్యులు కలిసి జీవించడానికి చేసుకున్న సహజీవన నియమాలేమిటి ?

ప్రతీ గ్రామంలో అస్పృశ్యులు అనుసరించాల్సిన ఒక ప్రవర్తనా నియమావళిని స్పృశ్యులు రూపొందించి వుంచారు. అస్పృశ్యులు పాటించవలసిన పద్ధతులను, నడవవలసిన విధానాన్ని చట్టరూపంగా పేర్కొన్నారు. ఎవరైనా ఈ చట్టానికి వ్యతిరేకంగా ప్రవర్తిస్తే దానిని తీవ్ర నేరంగా పరిగణిస్తారు. అటువంటి నేరాలు ఈ క్రింద పేర్కొనబడిన విధంగా ఉంటాయి.

1. అస్పృశ్యులు హిందూ నివాసాలకు దూరంగా, ఊరికి వెలుపల తమకై ప్రత్యేకించిన స్థలాలలోనే నివసించాలి. అస్పృశ్యులు ఈ విభజనా నియమాన్ని ఉల్లంఘించడం నేరం.

2. అస్పృశ్యుల నివాసాలు ఊరికి దక్షిణ దిక్కులోనే ఉండాలి. ఎందుకంటే అన్ని దిక్కుల కెల్లా దక్షిణ దిక్కు చాలా అశుభమైనది. కనుక వారు అక్కడే నివసించాలి. ఈ నియమాన్ని దాటితే అది నేరం.

3. అస్పృశ్యులు మిగిలిన వారినుండి దూరంగా మసలాలి. తమ నీడకూడా సవర్ణులపై (స్పృశ్యులు) సోకకుండా మసలాలి. అలాకాక సవర్ణులను మైలపరిస్తే అది నేరం.

4. అస్పృశ్యులలో ఎవరైనా భూమి, పాడి వంటి సంపదను సంపాదించడం నేరం.

5. అస్పృశ్యులు పెంకుటిళ్ళు కట్టుకోవడం నేరం.

6. అస్పృశ్యుల వర్గానికి చెందిన వారెవరైనా శుభ్రమైన దుస్తులు, కాళ్లకు చెప్పులు, బంగారు ఆభరణాలు, గడియారం ధరిస్తే నేరం.

7. అస్పృశ్యులు తమ పిల్లలకు గొప్పగా వినిపించే పేర్లు పెట్టరాదు. వారి పేర్లు నీచత్వాన్ని సూచించేవిగా వుండాలి.

8. హిందువుల సమక్షంలో అస్పృశ్యుడు కుర్చీపై కూర్చుండడం నేరం.

9. గ్రామంలో అస్పృశ్యుడు గుఱ్ఱపు స్వారీ చేసినా, పల్లకి ఎక్కినా నేరం.

10. అస్పృశ్యుడు తన జాతి వారితో కలిసి గ్రామంలో ఊరేగింపుగా వెళ్ళడం నేరం.

11. అస్పృశ్యులు హిందువులకు నమస్కరించకపోతే నేరం.

12. అస్పృశ్యుడు సంస్కారయుతంగా మాట్లాడితే నేరం.

13. ఏదైనా పవిత్రమైన రోజున, లేక హిందువులు ఉపవాసమాచరించిన రోజున లేక ఉపవాస దీక్షను విరమించు సమయంలో అస్పృశ్యుడు గ్రామంలో [illegible]రాదు. నోరు విప్పి మాట్లాడరాదు. ఎందుకంటే వారి శ్వాస హిందువుల గాలినీ, ఆహారాన్ని మైల పరుస్తుందని నమ్మిక.

14. అస్పృశ్యుడు సవర్ణుడివలె రూపురేఖలు మార్చుకుని చెలామణీ అన్వడం నేరం.

15. అస్పృశ్యుడు తన హీనస్థితిని ప్రజలకు చాటి చెప్పేవిధంగా తనను అస్పృశ్యుడిగా ప్రజలు గుర్తించడానికి వీలుగా ఈ క్రింది గుర్తులు ధరించాలి.

ఎ) నీచమైన పేరుకలిగి ఉండడం.

బి) అశుభ్రమైన దుస్తులు ధరించడం.

సి) ఇంటి పైకప్పుకు పెంకులు వాడకపోవడం.

డి) వెండి, బంగారు ఆభరణాలు ధరించకపోవడం.

పైన నిర్దేశించిన వాటికి విరుద్ధంగా ప్రవర్తిస్తే అది నేరం.

తరువాత అస్పృశ్యులు సవర్ణులకు చేయవలసిన సేవల గురించి వివరించే కట్టుబాట్ల గురించి తెలుసుకుందాం.

1. హిందువుల ఇళ్లలో శుభవార్తలు కాని, మరణవార్తలు కాని వారి వారి బంధువుల ఇండ్లకు అస్పృశ్యుడే చేరవేయాలి. ఎంత దూరమైనా లక్ష్యపెట్టకుండా అస్పృశ్యుడే ఈ పని చేయాలి.

2. హిందువుల ఇండ్లలో శుభకార్యాలు జరుగుతున్నప్పుడు అస్పృశ్యులు అక్కడ పని చేయాలి. కట్టెలు కొట్టడం, చిన్న చిన్న పనులకు తిరగడం మొదలైనవి.

3. హిందువుల ఆడపడుచు అత్తవారింటికి వెళుతున్నప్పుడు అది ఎంత దూరమైనా అస్పృశ్యుడు ఆమెకు తోడు వెళ్ళాలి.

4. గ్రామస్థులందరూ కలసి హోలి, దసరా వంటి పండుగలు, సంబరాలు జరుపుకొంటున్నప్పుడు ప్రధాన ఉత్సవానికి కావలసిన అన్ని పనులు చేయవలసిన బాధ్యత అస్పృశ్యులదే.

5. కొన్ని పండుగలు, జాతరలలో అస్పృశ్యులు తమ స్త్రీలను సవర్ణుల అసభ్యకరమైన ఆనందాల కోసం పంపాలి.

ఎటువంటి జీత భత్యాలు లేకుండానే అస్పృశ్యులు ఈ బాధ్యతలను నిర్వర్తించాలి.

ఈ బాధ్యతల యొక్క ప్రాముఖ్యతను తెలుసుకోవాలంటే అసలు ఇవి ఎలా అమలులోకి వచ్చాయో తెలుసుకోవాలి. గ్రామంలోని ప్రతి హిందువు కూడా తాను అస్పృశ్యుడి కంటే గొప్ప వాడిననే భావిస్తాడు. ఒక యజమానిగా అతడు(హిందువు) తన ప్రతిష్టను నిలబెట్టుకోవాలని ఆశిస్తాడు. తన ఆజ్ఞలకు లోబడి నడుచుకునే పరివారం లేకపోతే అది కుదరదు. అయితే ఎటువంటి ఖర్చు లేకుండా తన కనుసన్నలలో మెసలగలిగే పరివార జనులు అస్పృశ్యులు మాత్రమే. నిస్సహాయులైన అస్పృశ్యులు గత్యంతరం లేక ఈ పనులకు ఒప్పుకుంటారు. తన ప్రతిష్టను పెంపొందించుకొనడానికి అది అవసరం గనక ఆ అసహాయులను ఉపయోగించుకోవడానికి హిందువులు ఏమాత్రం వెనుకాడరు.

బ్రిటిషు వారు నిర్దేశించిన శిక్షా స్మృతిలో ఈ నేరాలు ఎక్కడా కనపడవు. కాని అస్పృశ్యులకు సంబంధించినంత వరకు ఇవి కఠోర వాస్తవాలు. వీటి అమలులో ఎటువంటి తేడా వచ్చినా, అస్పృశ్యులకు శిక్ష తప్పదు. ఇవి ఏరకంగా అమలు చేయబడతాయో ఐదవ, ఆరవ అధ్యాయాలలో స్పష్టంగా తెలుస్తుంది.

ఇంకో ముఖ్యమైన విషయం ఏమిటంటే ఈ శిక్షలు ఎప్పుడూ సామూహికంగానే అమలు జరుపబడతాయి. ఏ ఒక్క అస్పృశ్యుడు నియమాన్ని ఉల్లంఘించినా మొత్తం అస్పృశ్యులందరికీ శిక్షను విధిస్తారు.

మరి ఈ అస్పృశ్యులు ఎలా జీవిస్తారు? వారి జీవనోపాధి ఏమిటి ? వారి జీవనోపాధి మార్గాల గురించి తెలుసుకోకుండా హిందూ సాంఘిక వ్యవస్థలో వారి స్థానాన్ని అంచనా వేయలేం.

వ్యవసాయ ప్రధాన దేశంలో వ్యవసాయమే ముఖ్యవృత్తిగా ఉంటుంది. కానీ ఈ రకమైన వ్యవసాయ వృత్తి అస్పృశ్యులకు అందుబాటులో లేదు. ఇందుకు కారణాలు అనేకం. ముందుగా వారి ఆదాయంతో భూమిని కొనడం అసాధ్యం. ఒక వేళ వారి వద్ద ధనం ఉన్నా వారికి భూమిని కొనే అవకాశం లేదు. చాలా ప్రాంతాల్లో అస్పృశ్యులు భూమిని కొని తమతో పాటు సమహోదా పొందడాన్ని హిందువులు ఇష్టపడరు. ఒక వేళ ఎవరైనా అస్పృశ్యుడు ధైర్యం చేసి భూమిని కొన్నప్పటికీ అందుకు తిరస్కారమే కాక అతడు శిక్ష కూడా అనుభవించవలసి రావచ్చు. కొన్ని ప్రాంతాల్లో అస్పృశ్యులు భూమిని కొనరాదంటూ చట్టాలున్నాయి. ఉదాహరణకు పంజాబు ప్రాంతలో భూపరాధీన చట్టం అనేది ఉంది. ఈ చట్టం ప్రకాం ఏయే జాతుల వారు భూమిని కొనవచ్చునో నిర్దేశించబడింది. వారిలో అస్పృశ్యులు లేరు. ఫలితంగా అస్పృశ్యులు భూమిలేని వ్యవసాయ కూలీలు గానే వుండి పోవాలి. కూలీలుగా వారు న్యాయమైన జీత భత్యాలకై డిమాండ్ చేయలేరు. హిందూ రైతులందరూ కుమ్మక్కై వారి స్వలాభానికై తక్కువ వేతనాలను నిర్దేశిస్తారు. గత్యంతరం లేక నిస్సహాయ స్థితిలో ఉన్న అస్పృశ్యులు, ఇచ్చిన కూలీకి ఒప్పుకోవలసి వుంటుంది. వారికి తమ కూలీ గురించి బేరమాడే అవకాశం లేదు. వారు హిందూ భూస్వాములు నిర్ణయించిన కూలీకి పని చేయాలి. లేకపోతే భూస్వాముల హింసను భరించాలి.

అస్పృశ్యులకిచ్చే కూలీని డబ్బుగా గాని మొక్కజొన్నల రూపంలో గాని ఇస్తారు. ఉత్తర ప్రదేశ్‌లో అస్పృశ్యులకిచ్చే జొన్నలను "గోబరహ" అని పిలుస్తారు. అంటే పశువుల పేడలో వుండే జొన్నలని దీనర్థం. మార్చి -ఏప్రిల్ నెలలో జొన్నలు ఎదిగి పంట కొస్తాయి. కోతకు వచ్చిన పంటను కోసి నూర్పిడికి పంటకళ్ళంలో పరిచి పశువులను వదులుతారు. పశువుల తొక్కిడికి జొన్నలు నూర్చబడతాయి. అయితే నూర్పిడి సమయంలో ఎద్దులు గడ్డితో పాటు జొన్నలను కూడా తింటాయి. జీర్ణంకాని జొన్నలను అవి మరునాడు పేడతో పాటు విసర్జిస్తాయి. పేడను కడిగి వేరు చేసిన ఆ జొన్నలను అంటరాని కూలీలకు భత్యం క్రింద కొలుస్తారు. ఆపేడ జొన్నలను వారు దంపుకొని రొట్టె చేసుకుని తినాలి.

వ్యవసాయపు తరుణం గడిచిన తరువాత ఈ అస్పృశ్యులకు జీవనోపాధి ఏదీ

ఉండదు. చేయడానికి పనులు ఉండవు. ఇటువంటి సమయాలలో వీరు పచ్చగడ్డికోసి, వంట చెరుకు నరికి దగ్గరలోని పట్టణాలలో అమ్ముతూ ఉంటారు. ఇదంతా వన్య రక్షకుడి (Forest Guard) దయాదాక్షిణ్యాలపై ఆధారపడిఉంటుంది. ఈ ఉపాధి సంపాదించు కొనటానికి వారు ముడుపులు చెల్లించాల్సి వుంటుంది. ఇదంతా జరిగాక ఈ గడ్డిని, వంట చెరుకును మార్కెట్లో అమ్మడంకూడా ఒక సమస్యే. కొనేవారిలో అధికులు హిందువులు. వారందరూ కలసి చాలా తక్కువ రేట్లకే కొనేందుకు ప్రయత్నిస్తారు. బేరమాడే అవకాశంలేని అస్పృశ్యులు తాము తెచ్చిన వస్తువులను ఏదో ఒక వెలకు అమ్మాల్సి వస్తుంది. చాలా సార్లు ఈ వస్తువులు అమ్మడానికి వారు అటూ ఇటూ ఇరవై మైళ్ళు కాలినడకను ప్రయాణించాల్సి వస్తుంది

వారికి బ్రతకడానికి ప్రత్యేకమైన వ్యాపారం లేదు. వారి దగ్గర వ్యాపారానికి తగు పెట్టుబడి వుండదు. ఒక వేళ పెట్టుబడి లభించినా వాళ్ళ దగ్గర ఎవరూ కొనరు.

ఈ జీవన మార్గాలన్నీ కూడా అస్థిరమైనవి. వాటిలో రక్షణ లేదు. దేశంలో కొన్ని ప్రాంతాల్లో ఈ అస్పృశ్యులకున్న బ్రతుకు తెరువు ఒకే ఒకటి. అది హిందూ రైతులనుండి అడుక్కునే హక్కు. ప్రతి గ్రామంలోనూ పరిపాలనా యంత్రాంగం వంశపారంపర్యంగా ఉంటుంది. అస్పృశ్యులు ఆ యంత్రాంగంలో నీచమైన చాకిరీలను వంశానుక్రమంగా చేస్తారు. అందుకు వారికిచ్చే ప్రతి ఫలంలో ఒక భాగంగా ఎప్పుడో అనాదిగా నిర్ణయించిన కొంత భూమిని మొత్తం అస్పృశ్యులందరికీ ఇస్తారు. అది పెంచరు. తరతరాలుగా పంపకం [illegible] కాక ముక్కలై పోవడం వల్ల అస్పృశ్యులు దానిని సాగు లేకుండా వదిలేసే వారు. దీనికి తోడు వారికి మిగిలిన ఒకే ఒక హక్కు అడుక్కుతినే హక్కు.

మీకందరికి ఇది చాలా దురాగతంగా కనపడవచ్చు. అయినా సాంప్రదాయికంగా అస్పృశ్యులకు లభించే హక్కు ఇదొక్కటే. అస్పృశ్యులకు ప్రభుత్వోద్యోగం ఇస్తే, యాచన వలన వారికి లభించే ఆహారాన్ని కూడా లెక్కలోనికి తీసుకుని వారి జీతాలు లెక్కగట్టడం జరుగుతుంది.

ఈ విధంగా స్పృశ్యుల (సవర్ణుల) నుండి యాచించుకొనడం దేశంలోని ఆరుకోట్ల మంది అస్పృశ్యుల ప్రధాన జీవనోపాధి. భోజన సమయం అయింతర్వాత ఎవరైనా గ్రామంలోనికి బయల్దేరితే వారికి "మాదాకబళం" అంటూ యాచిస్తూ ఇల్లిల్లూ తిరిగే

అస్పృశ్యుల గుంపులు కనపడతాయి.

ఈ యాచక వృత్తి కూడా ఒక వ్యవస్థగా తయారయింది. మధ్య యూరోప్‌లో ప్రభువులకు -బానిసలకు ఉన్న పద్ధతిలో కొందరు అస్పృశ్యులు, సవర్ణ కుటుంబాలకు అనుబంధంగా ఉంటారు. వారందరూ సవర్ణుల దయా దాక్షిణ్యాలపై ఆధారపడి వుంటారు. ఈ అనుబంధం క్రమేపీ మారి సవర్ణుడు అస్పృశ్యుడ్ని తన బానిసలాగా 'నా మనిషి' అని చెప్పుకునే స్థితికి దారితీసింది. ఈ సంబంధం సవర్ణ కుటుంబాల నుండి అస్పృశ్యులు తమ ఆహారాన్ని యాచించడాన్ని క్రమబద్ధం చేయడానికి దోహదపడింది.

ఇదీ హిందువులు చాలా గర్వంగా చెప్పుకునే ఆదర్శ గ్రామ గణరాజ్యం. ఇందులో అస్పృశ్యుల స్థితి ఏమిటి ? వారు ఆఖరి వారే కాదు, అట్టడుగువారు కూడా. ఈ అస్పృశ్యుణ్ణి హీనుడిగా అణగదొక్కడమే కాక మెజారిటీ సమూహం చేయగల అన్ని పద్ధతులనూ ఉపయోగించి వారిని అదే స్థితిలో వుంచారు. ఈ అల్పత్వం కేవలం ఒక వ్యక్తి తలరాత మాత్రమే కాక ఒక వర్గానికి సంబంధించింది. వయస్సుతో, అర్హతతో సంబంధం లేకుండా అస్పృశ్యులు అందరూ ఈ అధిక జాతి వారికంటే అల్పులుగా ఉన్నారు. చిన్న వాడైన సవర్ణుడు వృద్ధుడైన అస్పృశ్యుడి కన్నా అధికుడు. చదువుకున్న అస్పృశ్యుడు కూడా నిరక్షరాస్యుడైన స్పృశ్యుడి కన్నా హీనుడే.

సవర్ణులు నిర్ణయించిన చట్టమే ఇప్పుడు నడుస్తున్న వ్యవస్థ. ఈపద్ధతిని శిరసావహించటం కన్నా చేయగలిగిందేమీ లేదు.

ఈ అస్పృశ్యులకు, స్పృశ్యులకు వ్యతిరేకంగా ఎటువంటి హక్కులు లేవు. వారికి సమాన హక్కులు కాని, ఏ న్యాయం కాని లేదు. ఏదైనా స్పృశ్యుల దయా దాక్షిణ్యాలపై ఆధారపడే వున్నది. అస్పృశ్యులు ఎటువంటి హక్కులను కోరరాదు. వారు పైవారి దయను, సానుభూతిని యాచించి, ఇచ్చిన దానితో తృప్తిపడాల్సిందే.

చిరకాలంగా నెలకొని వున్న వ్యవస్థ ఒక హెూదాగానే కాకుండా, నిత్య జీవితంలో అమలు పరచబడుతూ తరాల నుండి కొనసాగుతూ వుంది. ఒకసారి స్పృశ్యుడిగా జన్మించినట్లయితే అతడు ఎప్పుడూ స్పృశ్యుడే. అలాగే అస్పృశ్యునిగా జన్మించినట్లయితే జీవితాంతం అంటరాని వాడిగా కొనసాగవలసిందే. బ్రాహ్మణుడు ఎప్పుడూ బ్రాహ్మణుడే.

ఊడ్చేవాడెప్పటికీ ఊడ్చేవాడే. ఈవ్యవస్థలో ఉన్నతుడిగా జన్మిస్తే ఉన్నతుడిగా, హీనుడిగా జన్మిస్తే హీనుడిగా ఉండిపోవాలి. ఇంకో విధంగా చెప్పాలంటే ఈ నిర్దేశించబడిన వ్యవస్థ కర్మ సిద్ధాంతం పై ఆధారపడి వున్నది. విధి, అలాట లిఖితం, కర్మను ఎవ్వరూ మార్చలేరన్న సూత్రాలను ఆధారం చేసుకుని ఈ వ్యవస్థ పని చేస్తున్నది. ఒక వ్యక్తి యొక్క గుణగణాలతో ఎటువంటి ప్రమేయం లేకుండానే అతడి జీవిత విధానం నిర్దేశించబడుతుంది. ఒక అస్పృశ్యుడు నైతికంగా, మానసికంగా ఎంతటి ఉన్నతుడైనా అతడు తనకంటే అల్పుడైన స్పృశ్యునికంటే ఎప్పటికీ అల్పుడే. ఒక స్పృశ్యుడు ఎంత పేదవాడైనా, ధనవంతుడైన అస్పృశ్యునికంటే గొప్పవాడు.

భారతీయ గ్రామంలో నెలకొని ఉన్న అంతర్ దృశ్యమిది. ఈ గణతంత్రంలో ప్రజాస్వామ్యానికి చోటు లేదు. సమానతకు స్థానం లేదు. సౌభ్రాతృత్వానికి తావు లేదు. స్వాతంత్ర్యానికి వీలు లేదు. భారతీయ గ్రామం గణతంత్రానికి అభావం (negation). ఇదే గనుక గణతంత్రం అయితే అది సవర్ణుల కొరకు, సవర్ణులచే నిర్మింపబడిన సవర్ణుల యొక్క రిపబ్లిక్. అది అస్పృశ్యులపై హిందువులు ఏర్పరుచుకున్న రాజ్యం. అస్పృశ్యులను స్వలాభానికి ఉపయోగించుకోవడం కోసం నిర్మించుకున్న ఒక రకమైన వలస. ఇందులో అస్పృశ్యులకు ఎటువంటి హక్కులూ లేవు. వారు కేవలం వేచి వుండి, సేవలు చేసి, తమను తాము సమర్పించుకోవాలి. వారు పనిచేయనైనా చేయాలి లేకుంటే చావాలి. వారు ఈ గణతంత్రం వెలుపల ఉంటారు కాబట్టి వారికి ఏ హక్కులూ లేవు. వారు ఈ 'గణతంత్రం' పేరుతో పిలిచే దానికి వెలుపల వుంటారు కాబట్టి హిందువుల సమాజానికి బయట వుంటారు. ఇదొక విష వలయం. కాని ఇది విస్మరించరాని కఠిన వాస్తవం.

**పాదసూచిక:**

1. "Land System of British India" (vol.I) లో బాడెన్ పొవెల్ చే ఉదాహృతం

అనువాదకుడు: డా॥ సి.హెచ్. నమ్మయ్య

**అధ్యాయం - 5**

# మనుష్యులతో కలవడానికి అనర్హులు

గత అధ్యాయంలో వివరించినట్లుగా అస్పృశ్యులు హిందూ సమాజానికి బయట ఉన్నారు. వారు హిందూ సమాజం నుండి ఎంత దూరం చేయబడ్డారనే విషయం ప్రశ్నగానే మిగిలింది. హిందువులు అస్పృశ్యులను హిందువులుగా కాకపోయినా కనీసం మానవులుగానైనా ఎంతవరకు పరిగణిస్తున్నారు, గౌరవిస్తున్నారు ? ఈ ప్రశ్నలకు సమాధానం లభించనంతకాలం అస్పృశ్యుల జీవితాల గురించి సరియైన అవగాహన ఎవరూ ఏర్పరచుకోలేరు. ఈ విషయాన్ని గురించి అర్థం చేసుకునే ప్రయత్నం చేసే వారికి సమాధానం రెండు విధాలుగా వివరించవచ్చు. మొదటిది ఒక ప్రకటన ద్వారా రెండవది ఉదాహరణల ద్వారా. నేను రెండో విధానాన్ని తీసుకున్నాను. నేను ఎక్కువ ఉదాహరణలతో పాఠకుల్ని విసిగించకుండా ఈ విషయాన్ని బాగా స్పష్టీకరించే కొన్ని కేసులు మాత్రమే ఉదహరిస్తాను.

మొదటి కేసు మద్రాసు రాష్ట్రం నుండి :

1901వ సంవత్సరం మద్రాస్ హైకోర్టులో శ్రీ వెంకటసుబ్బారెడ్డి మరియు ఇతరులు ఒక అప్పీలు వేశారు. భారత శిక్షా స్మృతిలోని 339వ సెక్షన్ ప్రకారం ఫిర్యాదుదారు మరియు అతని అనుచరులకు ఆటంకాలు కల్పించినందుకుగాను తమకు మెజిస్ట్రేటు విధించిన శిక్షకు వ్యతిరేకంగా వారు అప్పీలు చేసుకున్నారు.ఇరుపక్షాలూ హిందువులే. మద్రాసు హైకోర్టు ఇచ్చిన తీర్పు[1] ఈ కేసుకు సంబంధించిన వివరాలనివ్వడమే కాక హిందువుల దృష్టిలో అస్పృశ్యుల పరిస్థితిని కొట్టవచ్చినట్టు వివరిస్తుంది. అందువల్ల ఆ తీర్పు ఉదహరించదగిందే. అది ఇలా ఉంది :

"కొంత మంది పరియా[2] లను రహదారిమీద, ఒక గుడికి దగ్గరగా నిలబెట్టి, తద్వారా ఫిర్యాదు దారుణ్ణి ఆగుడి నుంచి ఊరేగింపు తీయకుండా ఆపడం ద్వారా అక్రమంగా అడ్డగించిన నేరానికి అప్పీదారులకు (వెంకటసుబ్బారెడ్డి, ఇతరులు) శిక్ష విధించడం జరిగింది. ఫిర్యాదు దారుడు, పరియాలకు దగ్గరగా ఊరేగింపు వెళితే మైలపడిపోతామనే భయంతో ఊరేగింపును మానుకొన్నాడనీ; నిందితుడు, ఊరేగింపు తీసే హక్కుగల

ఫిర్యాదుదారుణ్ణి అడ్డగించాలనే దుర్బుద్ధితో పరియాలను అక్కడ నిలబెట్టాడని తెలిసింది.

"నిందితుడు అక్రమంగా అడ్డగించే నేరం చేశాడని మేం భావించడం లేదు. మా అభిప్రాయంలో ఈ చర్య 339వ సెక్షనులోని అర్థంలో అడ్డంకులు కల్పించడం కాదు. పరియాలు అడ్డంకి కాదు. అసలు ఫిర్యాదుదారుని ఊరేగింపు వారి ప్రక్కనుంచి వెళ్ళడానికి అడ్డంకి ఏదీ అక్కడ లేదు. పరియాలకు అక్కడ నిలబడే హక్కు ఉంది. పైగా వాళ్లక్కడ వుండడంలో ఫిర్యాదుదారునికి – వారి ఉనికి వల్ల మైలపడతామనేది తప్ప– శారీరకంగా గాని, మరొక రకంగా గాని ఏ హానీ, బెదిరింపూ ఉద్దేశించబడినట్లు ఏ సూచనా లేదు.

"పరియాల ఉనికి కాక, వారి దగ్గరగా వెళ్ళడానికి ఫిర్యాదుదారు ఇష్టపడక పోవడమే అతన్ను వెళ్ళదల్చుకున్న మార్గంలో వెళ్లడానికి అతనికి అడ్డుపడింది. శ్రీ కుప్పుస్వామి అయ్యర్ చెప్పినట్లు, అతని నిర్ణయమే అతన్ని గుడి నుంచి బయటకు రాకుండా చేసింది. అతను తన అంగీకారంతోనే అక్కడ ఉన్నాడు. ఆ అంగీకారాన్ని స్వేచ్ఛాపూర్వక అంగీకారం కాదనుకోవడానికి వీలు కాదు. ఎందుకంటే భారత శిక్షా స్మృతి నిర్వచించిన పరిధిలో అతనిపై గాయపరుస్తామనే బెదిరింపులేదు. ఇలా చూడకపోతే ఫిర్యాదుధారుని పరిస్థితిలో వున్న ఎవరైనా, చట్ట బద్ధంగా తనపని తాను చూసుకుంటున్న ఏ పరియానైనా దూరం జరగమంటే జరగనందుకుగాను అక్రమంగా అడ్డగించిన నేరం మోపడానికి వీలు కలుగుతుంది. ఎందుకంటే ఆ పరియా దగ్గిరనుంచి వెళితే మైలపడతాననే భయం వాటిని ఆపుతుంది.

"అలాంటి సందర్భాలలో అక్రమమైన అడ్డంకి ఏమాత్రం లేదనేది స్పష్టం. నిందితుడు పరియాలను అక్కడ నిలబడమని నియమించడంవల్ల ఈ పరిస్థితిలో తేడా రాదని భావిస్తున్నాం.[3]

" అందువల్ల ఈ శిక్షనూ, తీర్పునూ రద్దు చేస్తూ, ఏమైనా నష్టపరిహారాలు చెల్లించి వుంటే వాటిని తిరిగి ఇవ్వాలని నిర్దేశిస్తున్నాం".

ఈ కేసు చాలా స్పష్టంగా విషయాలను మనముందుంచుతుంది. ఈ కేసులో రెండు పార్టీలున్నాయి. ఒక పార్టీ నాయకుడు వెంకటసుబ్బారెడ్డి. రెండు పార్టీల వారూ సవర్ణ హిందువులే. ఊరేగింపును పురస్కరించుకుని ఈ రెండు పార్టీల మధ్య ఘర్షణ ఏర్పడ్డది. వెంకటసుబ్బారెడ్డి తన వ్యతిరేక పార్టీ వారి ఊరేగింపును ఆపాలని అనుకున్నాడు.

ఆ ఊరేగింపును ఆపడం కోసం అతడు అస్పృశ్యులను ఉపయోగించుకోవాలనుకున్నాడు. కొంతమంది అస్పృశ్యులను మార్గమధ్యంలో నిలబెట్టడం జరిగింది. దీని ఫలితంగా వ్యతిరేక పార్టీవారు ఊరేగింపు తీయలేదు. కారణం, ఊరేగింపు తీసే దారిలో అస్పృశ్యులు వారు అడ్డంగా ఉన్నారు. ఊరేగింపు వారి దగ్గరకు పోయినట్లయితే మైలపడతామనే భయంతో ఊరేగింపునే మానుకోవడం జరిగింది.

పరియాలను రోడ్డుమీద నిలబెట్టడం న్యాయ శాస్త్రానికి సంబంధించిన అర్థంలో అడ్డంకి కాదని మద్రాసు హైకోర్టు తీర్పునివ్వడం వేరే సంగతి. కానీ పరియాల ఉనికే హిందువులను దూరం తరమడానికి ఉపయోగించుకోవడం అనే పద్ధతి కఠిన వాస్తవం లాగా అలాగే మిగిలిపోతుంది. దీని అర్థం ఏమిటి ? హిందువులకు అస్పృశ్యులపై తీవ్రమైన ఏహ్య భావం వుందని దీని అర్థం.

రెండవ కేసు కూడా ఇంతే స్పష్టంగా విషయాన్ని వివరిస్తోంది.

ఇది కతియార్ లోని ఒక గ్రామంలో అస్పృశ్యుడైన ఒక ఉపాధ్యాయునికి సంబంధించినది. ఈ విషయం శ్రీ గాంధీ ప్రచురించే 'యంగ్ ఇండియా'లో 1929 డిసెంబర్ 12న ఒక లేఖగా ప్రచురితమైంది. ఆ ఉపాధ్యాయుడి భార్య ప్రసవించిన తరువాత కావలసిన వైద్య సహాయం, చికిత్స నిమిత్తం ఒక హిందూ డాక్టర్‌ను ఒప్పించడానికి ఎన్ని విధాలుగా ప్రయత్నం చేశాడో, వైద్య సౌకర్యంలేక ఏ విధంగా అతడు తన భార్యను, శిశువును కోల్పోయాడో ఆ లేఖలో వివరించడం జరిగింది.

"ఈ నెల 5న నాకు శిశువు జన్మించింది. 7న ఆమె జబ్బు పడింది. నీళ్ళ విరోచనాలతో ఆమె శక్తి హరించుకుపోయింది. ఛాతీ వాచిపోయింది. ఆమె ఊపిరి తీసుకోవడం కష్టమై పక్కటెముకల్లో భరించరాని నెప్పి వచ్చింది. నేను డాక్టర్ దగ్గరికి వెళ్ళాను. కాని ఆ డాక్టర్ అస్పృశ్యుల ఇంటికి రానని, శిశువును పరీక్ష చేయడానికి నిరాకరించాడు. అప్పుడు నాగర్ సేఠ్ మరియు గరాసియా దర్బార్‌ల దగ్గిరకు వెళ్ళి సహాయం చేయమని అర్థించాను. డాక్టర్‌కు చెల్లించాల్సిన 2 రూపాయల ఫీజుకు నాగర్‌సేఠ్ హామీ ఇచ్చాడు. అప్పుడు డాక్టర్ హరిజనుల కాలనీకి దూరంగా మాత్రమే వారిని పరీక్షిస్తాననే షరతుతో వచ్చాడు.నేను నాభార్యనూ, అప్పుడే పుట్టిన బిడ్డనూ హరిజన కాలనీకి దూరంగా తీసుకొని వెళ్ళాను. అపుడు డాక్టర్ థర్మామీటర్‌ను ఒక ముస్లింకిచ్చాడు. అతడు

నాకిచ్చాడు. నేను నా భార్యకిచ్చాను. అది ఉపయోగించిన తరువాత అదే మార్గం ద్వారా డాక్టర్‌కు చేరింది. అది దాదాపు 8 గంటల రాత్రి. డాక్టర్ దీపం వెలుగులో థర్మామీటర్‌ను చూసి రోగి 'న్యూమోనియా'తో బాధపడుతోందని నిర్ధారించాడు. ఆ తరువాత డాక్టర్ వెళ్ళి మందులు పంపించాడు. నేను కొన్ని మందులు తెచ్చి రోగికి చికిత్స కొరకు వాడాను. నేను 2 రూపాయల ఫీజు ఇచ్చినప్పటికీ రోగిని మళ్ళీ పరీక్షించేందుకు డాక్టర్ నిరాకరించాడు. రోగం ప్రమాదమైనది. భగవంతుడే కాపాడాలి.

"నా జీవనజ్యోతి ఆరిపోయింది. ఈ రోజు మధ్యాహ్నం రెండు గంటల ప్రాంతంలో నా భార్య చనిపోయింది."

అస్పృశ్యుడైన ఉపాధ్యాయుని పేరు మరియు డాక్టర్ పేరు పేర్కొనలేదు. ఎందుకంటే అస్పృశ్యుడైన ఆ ఉపాధ్యాయుడు తన మీద ఏవైనా ప్రతిచర్యలు జరుగుతాయనే భయంతో ప్రచురించవద్దని కోరాడు. కానీ ఈ వాస్తవాలు మాత్రం కాదనలేనివి.

దీనికి ఏ వివరణా అక్కరలేదు. విద్యావంతుడై వుండి కూడా ఆ డాక్టర్ ప్రమాదస్థితిలో ఉన్న రోగిపై థర్మామీటరు వాడి పరీక్ష చేయడానికి నిరాకరించాడు. అతని నిరాకరణ మూలంగా ఆమె చనిపోయింది. తన వృత్తిలో తప్పకుండా అనుసరించాల్సిన ప్రవర్తనా నియమాలను ప్రక్కకి నెట్టడానికతడు ఏమాత్రం సంకోచించలేదు. అస్పృశ్యులను తాకడంకంటే హిందువులు అమానుషంగా ప్రవర్తించడానికే ఇష్టపడతారు.

మూడవ కేసు. ఇది 1932 ఆగష్టు 23న 'ప్రకాశ్' పత్రికలో ప్రచురితమైంది.

"జపర్‌వాలా తాలూకాలోని జగ్వాల్ గ్రామంలో ఆగష్టు 6న ఒక దూడ బావిలో పడింది. ఆ సమయంలో రాం మహాశయ అనే డోమ్[4] ఆ బావి దగ్గిర ఉన్నాడు. వెంటనే అతడు బావిలోకి దూకి ఆ దూడను పట్టుకున్నాడు. ముగ్గురు నలుగురు మనుషుల సహాయంతో దాన్ని బయటికి తీసి రక్షించారు. దానికి హిందువులు బావి మైలపడిందని గగ్గోలు పెట్టి ఆ అమాయకుణ్ణి శిక్షించబోయారు. అదృష్టవశాత్తు ఒక బారిస్టర్ అక్కడికి వచ్చాడు. సాధూరాంను హింసిస్తున్న వారిని మందలించి బుద్ధి చెప్పాడు. ఆ విధంగా ఆ మనిషి ప్రాణం రక్షించబడింది. లేకపోతే ఏమయ్యేదో ఎవరికీ తెలియదు".

ఏది ముఖ్యం - బావి మైలపడినా అస్పృశ్యుడు దూడను రక్షించడమా? లేక బావి

మైలపడకుండా దూడను చావనివ్వడమా? హిందువుల దృష్టిలో అస్పృశ్యుడు బావిని మైలపరచడం -దూడను రక్షించడం కోసమే ఐనప్పటికీ -కంటే ఆ దూడను చావనివ్వడమే మంచిది.

ఇదే రకమైన మరొక కేసు 'బాంబే సమాచార్'లో 1936 డిసెంబర్ 19న ప్రచురించబడింది.

"కాలికట్‌లోని కంబాడి గ్రామంలో ఒక యువతి బిడ్డ బావిలో పడింది. అప్పుడు ఆయువతి రక్షించమని కేకలుపెట్టినా అక్కడవున్న వారెవ్వరూ కూడా బావిలోకి దూకి ఆ బిడ్డను రక్షించడానికి ముందుకు రాలేదు. అప్పుడు దారిన పోయే ఒక అపరిచితుడు వచ్చి బావిలో దూకి బిడ్డను రక్షించాడు. తరువాత అక్కడున్న ప్రజలు అతను ఎవరు అని అడగ్గా తాను అస్పృశ్యుడనని చెప్పాడు. అప్పుడు వారు అతనికి కృతజ్ఞతలు చెప్పడంపోయి బావిని మైలపరచినందుకు నానా దుర్భాషలాడి కొట్టారు".

హిందువులు అస్పృశ్యులనెంత అసహ్యంతో దగ్గరకు రావడానికి అనర్హులుగా చూస్తారో 1937 జులైలో లక్నో నుంచి వెలువడే "ఆది హిందూ" పత్రికలో వచ్చిన ఈ సంఘటన చూస్తే తెలుస్తుంది.

"ఉన్నత కులానికి చెందిన 'మద్రాస్ అల్మాస్' కంపెనీ ఉద్యోగి ఇటీవల మరణించాడు. శ్మశాన వాటికలో అతని చితికి నిప్పంటించారు. అతని బంధు మిత్రులంతా చితిపై బియ్యం చల్లారు. దురదృష్టవశాత్తు వారిలో మద్రాస్‌లోని ఆది ద్రావిడ కులానికి చెందిన ఒక అంటరాని వాడు కూడా ఆ చితిపై బియ్యం చల్లడం జరిగింది. అప్పుడు ఉన్నత కులానికి చెందిన హిందువులు అతనిని చితిని మైలపరిచినందుకు దుర్భాషలాడారు. దానితో వాదోపవాదాలు పెరిగి చివరకు ఇద్దరు వ్యక్తులు కత్తిపోట్లకు గురైనారు. అందులో ఒకరు ఆస్పత్రికి చేరే లోపలే మరణించారు. మరొకరి పరిస్థితి ఆందోళనకరంగా వుంది".

ఇంతకంటే విషయాన్ని బాగావిపులీకరించే సంఘటన మరొకటి ఉన్నది. 1938 మార్చి 6న బాంబేలోని దాదర్ ప్రాంతం కాసర్‌వాడిలో శ్రీ హిందూలాల్ యాద్నిక్ అధ్యక్షతన భంగీల సమావేశం జరిగింది. అందులో ఒక భంగీ యువకుడు తన అనుభవాన్ని ఈ క్రింది విధంగా వివరించాడు.

"1933 లో నేను స్కూలు ఫైనలు పరీక్ష పాసయ్యాను. నేను నాలుగో స్టాండర్డ్

వరకు ఇంగ్లీష్ చదువుకున్నాను. బాంబే మునిసిపాలిటీలోని స్కూలు కమిటీకి ఉపాధ్యాయ ఉద్యోగానికై దరఖాస్తు చేశాను. అప్పుడు ఖాళీ లేనందున ఉద్యోగం లభించలేదు. తరువాత మళ్ళీ నేను తలాటి (గ్రామ పట్వారి) ఉద్యోగం కోసం అహ్మదాబాద్ వెనుకబడిన తరగతుల ఆఫీసరుకు దరఖాస్తు చేసినాను. నాకు ఆ ఉద్యోగం లభించింది. 1936ఫిబ్రవరి19 నాడు కేడా జిల్లాలోని బోర్సాడ్ తాలూకాలో మామలత్‌దార్ ఆఫీసులో తలాటిగా నియమించబడ్డాను.

"నాకుటుంబం గుజరాత్‌కు చెందినప్పటికీ నేను ఎప్పుడూ గుజరాత్‌లో ఉండలేదు. ఈ సందర్భంగా నేను మొదటిసారిగా అక్కడికి వెళ్ళాను. ప్రభుత్వ కార్యాలయాల్లో అస్పృశ్యతను పాటిస్తారని నాకు అప్పటి వరకు తెలియదు. పైగా నా దరఖాస్తులో నేను హరిజనుణ్ణని రాశాను గనక నాతోటి ఉద్యోగులకు నేనెవరో తెలిసే ఉంటుందనుకున్నాను. అందువల్ల నేను నా ఉద్యోగ బాధ్యతలు స్వీకరించడానికి వెళ్ళినప్పుడు అక్కడి గుమాస్తా వైఖరి నన్నుఆశ్చర్యపరచింది.

"అతను నన్ను అసహ్యంగా 'నువ్వెవరు?' అనడిగాడు. 'నేను హరిజనుణ్ణి' అని నేను బదులిచ్చాను. దాంతో అతను 'అవతలికి పో. దూరంగా నిలబడు. నాకు ఇంత దగ్గరగా నిలబడడానికి నీకెంత ధైర్యం? ఆఫీసులో వున్నావు కాబట్టి సరిపోయింది. ఇదే బయట అయితే నిన్ను ఆరు దెబ్బలు పీకేవాణ్ణి. ఇక్కడికి ఉద్యోగం కొరకు రావడం ఎంత పొగరు!' అన్నాడు తర్వాత ఆ గుమాస్తా నా సర్టిఫికెట్‌ను, నియామక పత్రాన్ని నేలమీద పెట్టమని, ఆ తర్వాత వాటిని తీసుకున్నాడు. బోర్సాడ్‌లోని మామలత్‌దార్ ఆఫీసులో పని చేసినన్నాళ్ళూ నాకు తాగడానికి నీళ్ల సంపాదించుకునే విషయంలో చాలా ఇబ్బందులు ఎదురయ్యాయి. ఆఫీసువరండాలో తాగే నీళ్ళు డబ్బాలలో వుండేవి. ఈ నీళ్ల దగ్గిర ఒక మనిషి ఉండేవాడు. ఆఫీసులోని వాళ్ళు అడిగితే నీళ్ళు అందించడం అతని పని. ఒక వేళ అతను లేకపోతే ఉద్యోగులు తమంతతాము నీళ్ళు తీసుకుని తాగుతారు. కానీ నా విషయంలో అది అసాధ్యం. ఆ నీళ్ల డబ్బాల్ని నేను తాకను కూడా తాకకూడదు. ఎందుకంటే అవి మైలపడతాయి. అందువల్ల నేను నీళ్ళ మనిషి మీద ఆధారపడవలసి వచ్చేది. నా కోసం ఒక చిన్న మురికి పట్టిన ముంతను ఉంచారు. దాన్ని నేను తప్ప ఎవరూ ముట్టుకోవడంగానీ, కడగడం గానీ చేసేవారు కాదు. ఈ

ముంతలో నీళ్ళ మనిషి నాకు నీళ్లని ఎత్తి పోసేవాడు. అయితే ఆ నీళ్ల మనిషి ఉన్నప్పుడే నాకు నీళ్ళు దొరికేవి. అతనికి నాకు నీళ్ళు ఇవ్వడమంటే ఇష్టం వుండేది కాదు. నేను నీళ్ళ కోసం వస్తున్నట్టు కనిపిస్తే అతను ఏదో ఒక విధంగా అక్కణ్ణుంచి మాయమయిపోయేవాడు. అందువల్ల నేను నీళ్లు తాగకుండా వుండవలసి వచ్చేది. అలా నీళ్ళు లేకుండా వున్న రోజులు తక్కువేమీ కాదు.

"ఇంటి విషయంలో కూడా నాకు ఇలాంటి కష్టమే ఎదురైంది. బోర్సాడ్‌లో నేను కొత్తవాణ్ణి. సవర్ణ హిందువులెవ్వరూ నాకు ఇల్లు ఇవ్వరు. హిందువులకు, ఒక హరిజనుడనైన నేను నా స్థాయికి మించిన గుమాస్తా ఉద్యోగం చేయడం ససేమిరా ఇష్టం లేదు. అందువల్ల ఆ హిందువులకు భయపడి అంటరాని వారు కూడా నాకు ఆశ్రయమివ్వలేదు. ఆహార విషయంలో కూడా నాకు ఎక్కడలేని సమస్యలు ఎదురైనాయి. నేను ఊరిబయట 'బాయిూలు' తిని వచ్చి ఆఫీసు వరండాలో పడుకునేవాణ్ణి. ఇలా నాలుగు రోజులు గడిచాయి. దీన్ని భరించలేక బోర్సాడ్‌కు ఆరు కిలోమీటర్ల దూరంలో ఉన్న మా పూర్వీకుల గ్రామమైన జంత్రాల్‌కు వెళ్ళాను. నేను రోజుకు 11 కిలోమీటర్లు నడవాల్సి వచ్చేది. అలా ఒకటిన్నర నెలలు గడిపాను. ఆ తరువాత మామలత్‌దార్ నన్ను ఒక తలాటి వద్దకు శిక్షణ నిమిత్తమై పంపాడు. అతనితో రెండు నెలలు గడిపాను. అతడు నాకు ఏమీ చెప్పలేదు. నన్ను ఎప్పుడూ కూడా ఆఫీసులోకి రానీయలేదు. ముఖ్యంగా గ్రామ పెద్ద మరీ వ్యతిరేకంగా ఉండేవాడు. 'ఒరే! నీతండ్రి, నీ అన్నలు అందరూకూడా స్వీపర్లుగా పనిచేసేవారు. నీవు మాత్రం మాతో సమానంగా కుర్చీమీద కూర్చుంటావా? జాగ్రత్త! ఈ ఉద్యోగాన్ని వదిలిపోతే మంచిది' అని అన్నాడు.

"ఒకనాడు తలాటి నన్ను జనాభా పట్టిక తయారు చేయునిమిత్తం సైజ్‌పూర్ గ్రామానికి పిలిచాడు. అక్కడ గ్రామ పెద్ద మరియు తలాటి కలిసి కార్యాలయంలో పని చేస్తున్నారు. నేను వెళ్ళి తలుపు దగ్గర నిలబడి నమస్కారం చేశాను. కానీ వారు గమనించనట్టే నటించారు. ఆ విధంగా పది నిమిషాలు నిలబడ్డాను. అప్పటికే ఈ జీవితంలో విసిగిపోయి వున్నాను. వారి ప్రవర్తనకూ, అవమానించినందుకూ చాలా ఆవేశపడ్డాను. ఆ తరువాత అక్కడవున్న కుర్చీలో కూర్చున్నాను. దాన్ని చూసి గ్రామ పెద్ద మరియు తలాటి నాతో ఏమీ మాటాడకుండానే వెళ్ళిపోయారు. కొద్దిసేపటి తర్వాత ప్రజలు రావటం

మొదలు పెట్టారు. క్రమంగా పెద్ద జనసమూహం నాచుట్టూ చేరింది. ఆ జన సమూహానికి ఒక లైబ్రేరియన్ నాయకత్వం వహించాడు. చదువుకున్నవాడై వుండి, ఆ లైబ్రేరియన్ ఎందుకు నాయకత్వం వహించాడో నాకర్థం కాలేదు. ఆ తర్వాత తెలిసిందేమిటంటే నేను కూర్చున్న కుర్చీ అతనిది. లైబ్రేరియన్ గ్రామ సేవకునితో ఇలా అన్నాడు.

"ఈ భంగీ కుక్కల కొడుకుని ఈ కుర్చీపై కూర్చోమని చెప్పిందెవరు?' ఆ గ్రామ నౌకరు నన్ను కుర్చీలోంచి లేపి, ఆ కుర్చీని లాగేసుకున్నాడు. నేను నేలపై కూర్చున్నాను. ఆ తరువాత జనం ఆఫీసులోనికి వచ్చి నన్ను నోటికొచ్చినట్లు తిడుతూ ముక్కలు ముక్కలు చేస్తామని బెదిరించారు. నేను వారిని దయతలచమని, క్షమించమని ఎంతో బ్రతిమిలాడాను. అయినప్పటికీ లాభం లేకపోయింది. నన్ను నేను ఎలా రక్షించుకోవాలో నాకర్థం కాలేదు. అప్పుడు నా పరిస్థితి గురించీ, ఒక వేళ ఈ జనం నన్ను చంపితే నా శవాన్ని ఏం చేయాలనే విషయాన్ని తెలుపుతూ మామలత్‌దార్‌కు ఉత్తరం రాయాలనే ఆలోచన వచ్చింది. అంతే కాక నేను మామలత్‌దార్‌కు ఫిర్యాదు చేశానని తెలిసి వాళ్ళు నన్ను వదిలేస్తారనే ఆశ కూడా కలిగింది. ఆ ఉత్తరం రాయడానికి గ్రామసేవకుణ్ణి తెల్లకాగితం అడిగి తీసుకున్నాను. పెద్ద అక్షరాలతో ఈ విధంగా వ్రాసాను.

"మామలత్‌దార్, బోర్సాడ్ తాలూకా గారికి,

"అయ్యా !

"దయచేసి పర్‌మార్‌కాళిదాస్ శివరామ్ సవినయ ప్రమాణాలు స్వీకరించండి. నా మనవి ఏమనగా – ఈ రోజు నామీద మృత్యువు చెయ్యి పడబోతున్నది. నా తల్లిదండ్రులు చెప్పినట్టుగా విని వుంటే నాకీ గతి దాపురించకపోవును. దయచేసి నేను చనిపోతే ఆ విషయాన్ని నా తల్లి దండ్రులకు తెలియజేయండి".

"నేను వ్రాసిన ఈ ఉత్తరాన్ని లైబ్రేరియన్ చదివి చించిపారేయమన్నాడు. అలాగే చేశాను. వాళ్ళు నన్ను నానారకాలుగా అవమానించారు.

"నిన్ను మేం తలాటిగా గుర్తించాలా ? ఒక భంగీవి. నువ్వు ఆఫీస్ లోకి వచ్చి కుర్చీలో కూర్చుంటావా ?" నేను వారిని దయ చూపమని ప్రాథేయపడ్డాను. ఇంకెప్పుడూ ఇలా చేయనని, ఈ ఉద్యోగమే మానేస్తాననీ ప్రమాణం చేశాను. నన్ను అందరూ

వెళ్ళిపోయేదాకా, సాయంత్రం ఏడుగంటల దాకా కదలనివ్వలేదు. అప్పటిదాకా తలాటి, గ్రామాధికారి రానేలేదు. ఆ తర్వాత పదిహేను రోజులు శెలవు పెట్టి బాంబేలో ఉన్న నా తల్లి దండ్రుల దగ్గరకు వెళ్ళిపోయాను."

హిందువులకు అస్పృశ్యుల పట్ల ఉన్న సాంఘిక దృక్పథానికి మరో ముఖం వుంది. దాన్ని మరిచిపోకూడదు. ఈ విషయం ఈ క్రింది కేసులను జాగ్రత్తగా చూస్తే తెలుస్తుంది. 1943 సెప్టెంబరు 8న 'అఫ్జల్'లో ఈ కేసు వుంది.

"సెప్టెంబర్ 1న ఒక గ్రామంలోని హిందువులు ఒక అస్పృశ్య కుటుంబంపై దాడి చేశారని నాసిక్ నుండి సమాచారం అందింది. ఒక వృద్ధురాలి కాళ్ళు, చేతులూ కట్టేసి ఒక కట్టెలకుప్పపై పెట్టి నిప్పంటించారు. ఇదంతా ఎందుకంటే ఆ గ్రామంలో వచ్చిన కలరాకు ఆమె కారణమని హిందువులు భావించారు".

1946 ఆగష్టు 29 నాటి 'టైమ్స్ ఆఫ్ ఇండియా' పత్రికలో ప్రచురితమైన విషయం ప్రకారం:

"కైరా జిల్లాలోని హరిజన కాలనీపై హిందువులంతా - పశువులు చనిపోవడానికి తాంత్రిక పూజలు చేస్తున్నారనే అనుమానంతో దాడి చేశారు.

"రెండు వందలమంది హిందువులు కర్రలతో హరిజన వాడపై దాడిచేసి, ఒక వృద్ధురాలిని చెట్టుకు కట్టి కాళ్లక్రింద మంట పెట్టారు. మరొక స్త్రీని విపరీతంగా కొట్టారని తెలిసింది.

"భయపడిన హరిజనులు ఊరు విడిచి పారిపోయారు. కానీ జిల్లా హరిజన సేవక సంఘ సెక్రటరీ శ్రీ చోటాభాయ్ పటేల్ ఈ విషయం తెలిసి వారిని వెనక్కు తీసుకువచ్చి, వారి రక్షణ కోసం అధికారులకు విజ్ఞప్తి చేశారు".

"ఇటువంటి సంఘటనే మరొక గ్రామంలో జరిగిందనీ, అక్కడ హరిజనులను విపరీతంగా కొట్టారనీ తెలిసింది".

ఈ విషయం ఇంతటితో అయిపోలేదు. హిందువులు అందరూ కలసి మూకుమ్మడిగా హరిజనులపై దాడులు చేస్తున్న సంఘటనలు పదే పదే పునరావృతమౌతున్నాయి.

1946 సెప్టెంబరు 22న "భారతజ్యోతి" పత్రికలో ప్రచురితమైన వార్త ఇలా ఉంది.:

"కైరా జిల్లా బోర్సాద్ తాలూకాలోని ఒక గ్రామంలో 7 బర్రెలు చనిపోయిన కారణంగా వాటి చావుకు హరిజనుల క్షుద్ర విద్యలే కారణమని భావించిన హిందువులు కర్రలతో, లాఠీలతో వారిపై దాడిచేసినపుడు ఒక స్త్రీతో సహా అయిదుగురు హరిజనులు తీవ్రంగా గాయపడ్డారని బోర్సాద్ తాలూకా హరిజన సేవక్ సంఘానికి సమాచారం అందింది. గాయపడిన వారిని హాస్పిటల్‌కు పంపారు. ఆ సంఘటనా స్థలానికి పోలీసులు వచ్చి కొందరిని అరెస్ట్ చేశారు.

"హరిజనులు కనుక పోలీసులకు ఫిర్యాదు చేసినట్లయితే వారిని సజీవ దహనం చేస్తామని హిందువులు బెదిరిస్తున్నట్లు తెలుస్తోంది.

"ఇటువంటి సంఘటనలు కైరాలోని గ్రామాల్లో తరచూ పునరావృతమవుతూనే వున్నాయి. హరిజనులపై జరుగుతున్న ఇలాంటి అత్యాచారాలను ఆపడానికి కట్టుదిట్టమైన చర్యలు తీసుకోవాల్సిందిగా పోలీసు అధికారులకూ ఇతర పాలనాధికారులకూ జిల్లా మెజిస్ట్రేట్ ఆదేశాలిచ్చారు".

ఈ కేసులవలన తెలిసిన కథ స్పష్టం. సులభం. దీనికి ఏ వ్యాఖ్యానమూ అవసరం లేదు. ఒక సామాన్య హిందువు దృష్టిలో అస్పృశ్యులు మానవులతో కలవడానికి అర్హులు కారు. వాళ్లసలు మానవులే కారు. దోషపూరితులు. విసర్జనీయులు.

**పాద సూచికలు :**

1. 'క్రిమినల్ లాజర్నల్' 11వ సంచిక పేజీ. 263.

2. పరియాలు మద్రాసులోని ఒక అస్పృశ్య కులం.

3. విచారించిన మెజిస్ట్రేటు, పరియాలను నిలబెట్టడమే అడ్డుకోవడమనీ, అందువల్ల నిందితుడు నేరస్థుడనీ పేర్కొన్నాడు.

4. డోమ్‌లు యు.పి. బీహార్‌లలో ఉండే అస్పృశ్యులు.

**అనువాదం: డా॥ పి. కృష్ణమాచారి.**

# రెండవ భాగం

## అధ్యాయం - 6

# అస్పృశ్యత - చట్ట రాహిత్యమూ

ఇన్ని అసమానతలు నిండిన సామాజిక వ్యవస్థ ఎలా మనగలిగిందని ఆశ్చర్యపడే వాళ్ళు చాలా మందే ఉంటారు. మరిదీన్ని నిలబెడుతున్న శక్తులేమిటి? ఈ వ్యవస్థను కొనసాగిస్తున్న శక్తులలో అన్నింటికంటే ముఖ్యమైనది దీన్ని ఎలాగైనా కొనసాగించాలనే హిందువుల కృత నిశ్చయం. ఈ వ్యవస్థను కదిలించడానికి అస్పృశ్యులు చేసే చిన్న ప్రయత్నాన్నైనా ఏదో విధంగా అణచి వేయడానికి హిందువులు సిద్ధంగా వుంటారు. అహింసా వాదిగా వుండే సాధారణ హిందువు అస్పృశ్యులపై అత్యంత హింసాత్మకంగా ప్రవర్తించడానికైనా వెనుదీయడు. ఈ వ్యవస్థను కాపాడడానికి వారితో ఎంత క్రూరంగానైనా ప్రవర్తించగలడు. దీన్ని చాలా మంది వెంటనే నమ్మరు. కానీ ఇది ఒక వాస్తవం. ఈ విషయంలో సందేహాలున్నవారి కోసం అస్పృశ్యులపై హిందువులు చేస్తున్న అత్యాచారాల, అణచివేతలకు సంబంధించి పదే పదే పత్రికలలో ప్రచురించబడుతున్న కొన్ని ఉదాహరణాలు ఇస్తున్నాను.

ఈ క్రింది వార్తాంశం 1927 సెప్టెంబర్ 4నాటి 'తేజ్' అనే ఢిల్లీ నుంచి వచ్చే వార్తా పత్రికలో వెలువడింది :

"వైకంలోని శివాలయం, హరిజనులు దానికి దగ్గరగా వెళ్లడంవలన మైలపడింది. ఈ ప్రాంతానికి చెందిన హిందువులు దేవాలయాన్ని పెద్ద ఖర్చుతో శుద్ధి చేయడానికి నిర్ణయించారు." 'ప్రతాప్' పత్రిక విలేఖరి 1932 సెప్టెంబర్ 2 సంచికలో ఈ క్రింది సంఘటనను తెలియజేశారు.

"ఆగష్టు 1932, మీరట్. జన్మాష్టమి రోజున హరిజనులు సవర్ణహిందువుల దేవాలయాలలోకి ప్రవేశించడానికి ప్రయత్నించారు. దీని ఫలితంగా వారికి అశాంతి, కష్టాలు మాత్రమే ఎదురయ్యాయి. ఈ సంవత్సరం స్థానిక దళిత సంఘం వారు,

దేవాలయం తలుపు దర్శనానికి తెరవకపోతే సత్యాగ్రహం చేయాలని నిర్ణయించుకున్నారు. ఈ విషయం హిందువులకు తెలియగానే దళితుల ప్రయత్నాలను వమ్ముచేసే యత్నాలను మొదలుపెట్టారు. చివరకు జన్మాష్టమి రాత్రి హరిజనులు ఊరేగింపుగా బయలుదేరి దేవాలయంలోనికి ప్రవేశించే ప్రయత్నం చేశారు. అప్పుడు పూజారులు, వారికి దేవాలయంలోకి ప్రవేశించేందుకు అనుమతినీయలేదు. వాళ్ళు ఇలా అన్నారు. 'మీరు బయట బజారులో నిలబడి దేవుళ్ళను సేవించవచ్చు.' దీనితో అక్కడ గుంపు గుమికూడింది. పూజారులు దేవాలయంలోకి ప్రవేశించే ప్రయత్నం చేశారు. రెండువర్గాల మధ్య ఘర్షణ ఏర్పడింది కొట్లాటలు జరిగాయి."

హిందువులు అస్పృశ్యులను హిందూ దేవాలయాల్లోకి ప్రవేశించనీయరు. అస్పృశ్యులు తమ స్వంత దేవాలయాలు కట్టుకొని తమ దేవుళ్ళ విగ్రహాలను ప్రతిష్ఠాపన చేసేందుకు హిందువులు అనుమతిస్తారని ఎవ్వరైనా అనుకుంటే అది చాలా పొరపాటు. హిందువులు దాన్ని కూడా అనుమతించరు. ఇందుకు రెండు ఉదాహరణలు ఉదహరిస్తే అర్థమౌతుంది. అందులో ఒకటి 1923 ఫిబ్రవరి 12నాటి 'ప్రతాప్' పత్రికలో వచ్చింది.

"ఆగ్రా జిల్లాలో చామర్ కులానికి చెందిన ఒక వ్యక్తి, ఒక బ్రాహ్మణుడు తన ఇంట్లో విష్ణు విగ్రహాన్ని ప్రతిష్టించి పూజించడం **చూసి** అదే విధంగా తానూ పూజింపసాగాడు. ఈ విషయం తెలిసిన ఆ బ్రాహ్మణుడు కోపోద్రిక్తుడై కొంత మంది గ్రామస్తుల సహాయంతో ఆ దురదృష్టవంతుడైన హరిజనుణ్ణి పట్టుకొని బాగా కొట్టి 'ఎంత ధైర్యం నీకు! విష్ణువుని వశం చేసుకోతలచావు' అని తిట్టి అతని నోట్లో అశుద్ధం కుక్కి వదిలేసారు. నిరాశతో ఆచామర్ హిందూమతాన్ని వదిలి ఇస్లాం మతాన్ని స్వీకరించాడు".

మరో సంఘటన 1939 జులై 4న "హిందూ" పత్రికలో వెలువడింది.

"1939 జులై 4న బళ్ళారి జిల్లా హరిజన సలహామండలి సమావేశం కలెక్టర్ బంగళాలో జరిగింది. సలహా మండలి అధ్యక్షుడూ, కలెక్టరూ అయిన శ్రీ ఎ.డి.క్రాంచీ CIE, ICS ఈ సమావేశానికి అధ్యక్షత వహించారు.

"నారాయణ - దేవగిరికేరి గ్రామ హరిజనుల బాధలను గురించి, నిర్బంధ చాకిరీ, వడ్డీ వ్యాపారుల పీడనలు గురించి ఒక అధికారిక నివేదికను కోరేందుకు నిశ్చయించారు. అవసరమైన చర్యలు తీసుకునే ఉద్దేశ్యంతో ఈ నిర్ణయం తీసుకోవడం జరిగింది.

"కుడిత్తిని గ్రామంలో నివసించే హరిజనుల మత సంబంధమైన ఇబ్బందులను కమిటీ దృష్టికి తీసుకొని రావడం జరిగింది. హరిజనులు తమ కాలనీలో 12 సంవత్సరాల క్రితమే దేవాలయాన్ని నిర్మించినప్పటికీ ఆ దేవాలయంలోనే సిద్ధంగా ఉన్న భగవంతుని విగ్రహాన్ని ప్రతిష్ఠించడానికి వీలు కావడం లేదు. ప్రతిష్ఠాపనకు విగ్రహాన్ని బయటకు తీసిగ్రామంలో ఊరేగించడానికి సవర్ణ హిందువులు అభ్యంతరం తెలపడంవల్ల ఇలాజరిగింది".

# II

హిందువుల బావినుండి నీరు తీసుకోడానికి అస్పృశ్యులు ప్రయత్నిస్తే హిందువులెలా వ్యవహరిస్తారో ఈ క్రింది దృష్టాంతాల వల్ల తెలుస్తుంది. మొదటిది 1923 ఫిబ్రవరి 12న " ప్రతాప్" పత్రికలో వెలువడింది.

"మహాశయ చెడ్డీలాల్‌జీ ఇలా తెలియజేస్తున్నారు: ఒక చామర్, దేవుణ్ణి ఆరాధించడానికి వెళుతున్నాడు. దారిలో అతనికి దాహమైంది. తన వద్దనున్న ఇనుప బొక్కెనతో బావిలో నుండి నీరు తీసుకున్నాడు. ఈ పనికి ఒక సవర్ణ హిందువు అతన్ని బాగా తిట్టాడు,/ కొట్టాడు. ఒక గదిలో బంధించి తాళం వేశాడు. ఆ సంఘటన జరిగినప్పుడు నేను ఆ దారిన పోతున్నాను. అతన్ని ఎందుకు బంధించారని అడిగాను. ఈ మనిషి తన బొక్కెనతో బావిలోని నీళ్ళు తీసుకుని తమ మతాన్ని అపవిత్రం చేయాలనుకున్నాడని దివాన్ సాహెబ్ చెప్పాడు".

హిందువుల బావినుండి అస్పృశ్యులు ఎవరైనా ధైర్యం చేసి నీళ్ళు తీసుకుంటే హిందూ స్త్రీలు కూడా ఏమాత్రం సందేహించకుండా అస్పృశ్యులపై జరిగే దాడుల్లో పాల్గొంటారనేది వాస్తవం. 1932 ఫిబ్రవరి 26న 'ప్రతాప్' పత్రికలో వార్త చూడండి.

"1932 **ఫిబ్రవరి** 19న ఫూల్‌బజ్‌వాన్ గ్రామంలో ఒక విషాదకరమైన సంఘటన జరిగింది. ఈ సంఘటన మహాశయ రాములాల్ ఒక బావినుండి నీరు తీసుకొని రావడానికి పోయినపుడు జరిగింది. ఈ బావిదగ్గరే 1932 జనవరి 13న కొంతమంది రాజ్‌పుట్‌లు మహాశయ రామ్‌లాల్‌ని అతని మిత్రుడు పండిట్ బన్సిలాల్‌ను తీవ్రంగా కొట్టారు. ఈసారి రాజ్‌పుట్ స్త్రీలు అన్ని రకాల ఆయుధాలతో మహాశయను కొట్టిన తీరును వర్ణించడం కష్టం. ఆయన శరీరమంతా రక్తంతో తడిసింది. ఇప్పుడాయన 'పుక్‌లియా' ఆసుపత్రిలో చేర్చబడినాడు".

బావినుండి నీరు తీసుకునే హక్కును ఉపయోగించుకోవడంలో ప్రభుత్వ ఉద్యోగుల అండ ఉన్నప్పటికీ అస్పృశ్యులపై దాడులు ఆగవు. ఈ విషయం దిగువ సంఘటనతో మరింత స్పష్టమౌతుంది. ఈ అంశం జూన్ 7 నాటి "మిలాప్" పత్రికలో వెలువడింది.

"కొన్ని రోజుల క్రితం కెనాల్ డిపార్ట్‌మెంట్ ఆఫీసర్ సభా తహసిల్‌లోని రహియా గ్రామానికి వచ్చాడు. ఆయన కొంత మంది 'మేఘ' తెగకు చెందిన అస్పృశ్యులను పిలిచి బావినుండి నీరు తెమ్మని ఆదేశించాడు. మొదట వారు అంగీకరించలేదు. కానీ ఆఫీసరు వాళ్ళను తిట్టి బలవంతంగా వాళ్ళతో నీళ్ళు తెప్పించాడు. ఆ మరుసటి రోజున హిందువులంతా బావిదగ్గర చేరి, 'మేఘ' అస్పృశ్యులను ఒక చౌకీదారుతో పిలిపించి బావిలోదిగి నీరు తెచ్చేందుకు ఎందుకు తెగించారని నిలదీసారు. అందుకు ఒక 'మేఘ' అస్పృశ్యుడు మేం తప్పనిసరి పరిస్థితిలో నీరు తేవలసి వచ్చిందని, ఇందులో తమ తప్పేమీ లేదని చెప్పాడు. అలా చెప్పే ఆ సాహసం హిందువులు కోపోద్రిక్తులై కర్రలతో అతణ్ణి స్పృహ కోల్పోయేలా కొట్టేట్లు చేసింది. ఈ వార్తను వ్రాస్తున్న సమయానికతడు ఇంకా స్పృహలోకి రాలేదు. డాక్టర్ ఇతనికి స్వల్ప గాయాలు తగిలినవని చెప్పినప్పటికీ, హత్యాయత్నం కేసునూ, చట్ట విరుద్ధంగా సమావేశమైన కేసునూ కొంతమంది పోలీసులకు ఫిర్యాదు చేసారు. కానీ ఈ విషయాన్ని అధికారులు ఉపేక్షించి తగిన చర్యలేమీ తీసుకొనకపోవటం వల్ల 'మేఘ' ప్రజల్లో అభద్రతా భావం ఎక్కువైంది. ఆ గ్రామ ప్రజలు 'మేఘ' ప్రజలను బాగా హింసించడం మాత్రమే కాక వాళ్ళనూ, వాళ్ళ పశువులను కూడా ఊరిలోని బావులనుండి, చెఱువులనుండి నీరు త్రాగనివ్వలేదు."

అస్పృశ్యులు హిందువుల బావినుండి నీరు తీసుకొనకుండా ఉండటమేకాక, వాళ్ళకు స్థోమత ఉన్నప్పటికీ పక్కా ఇటుకలతో బావుల్ని నిర్మించుకోకూడదు. వాళ్ళకు పక్కాబావులు వుండటమనేది వాళ్ళు హిందువుల స్థాయికి ఎదగడమని అర్థం. అస్పృశ్యుల స్థాయి పెరగడం పాతుకుపోయిన వ్యవస్థకు పూర్తి వ్యతిరేకమవుతుంది.

19334 జూన్ 6 నాటి "మిలాప్" పత్రికలో ఈ దిగువ సంఘటనలు ప్రచురింపబడ్డాయి.

"**అఛూత్** ఉద్ధారక్ కమిటీ (పంజాబ్) కార్యదర్శి లాలా రాంప్రసాద్‌జీ ఈ విషయాలు తెలియచేస్తున్నారు:

"ఈ వేసవి కాలంలో నీటి సరఫరా కొరతగా ఉండటం వల్ల అన్ని ప్రాంతాల్లో నీటి ఎద్దడి ఒక పెద్ద సమస్యగా తయ్యారైందని ఫిర్యాదులు వస్తున్నాయి. అణచివేయబడిన వర్గాల వారికి సొంత బావులు లేవు. వారు కుండలు పట్టుకుని నీటి కొరకు బావుల దగ్గర నిలబడాల్సి వుంటుంది. అప్పుడు ఎవరైనా దయతలచి నీరుపోస్తే సరి, లేదా నిస్సహాయంగా అలా ఎదురుచూస్తూ వుండాల్సిందే. కొన్ని ప్రాంతాల్లో డబ్బులిచ్చినా వారికి ఎవరూ నీరు పోయరు. ఎవరైనా అలా నీళ్ళు పోయటానికి ముందుకు వస్తే పెద్ద కొట్లాటలు జరుగుతాయి. వాళ్ళకు గ్రామ బావుల నుండి నీళ్ళు తీసుకోవటం నిషేధం మాత్రమే గాక, తమ సొంత బావులను కూడా తమ ధనంతో త్రవ్వుకోడానికి వీలు లేకుండా వుంది"

ఈలాంటి సంఘటనే 1924 ఏప్రిల్ 21న "తేజ్" పత్రికలో వెలువడింది.

"ఓపాడ్ గ్రామంలో సుమారు 250 మంది చమార్ (అస్పృశ్యుల్లో ఒక తెగ) వారున్నారు.వారు సుమారు ఒకటిన్నర నెలక్రితమే( ఆర్యసమాజ్‌పండితుల సలహామేరకు?) ముస్లింలు తోలుసంచులతో తెచ్చే నీళ్ళను త్రాగడం మానేశారు. అందువల్ల వాళ్ళకు నీటి సరఫరా పెద్ద సమస్యగా తయ్యారైంది. ఆ గ్రామంలోని జాట్ అనబడే అగ్రకులం వారు వారిని గ్రామంలోని బావులనుండి నీళ్ళను తీసుకోనివ్వకుండా చేయడమేకాక, అస్పృశ్యులను తమ స్వంత బావులను కూడా త్రవ్వుకోనివ్వడంలేదు. అప్పుడు ఆ 'చామర్లు' మడుగుల్లో, కుంటల్లో, చెరువుల్లోని నీళ్ళని త్రాగి జీవిస్తున్నారు. నిన్న 'దళిత సుధారక్ కమిటీ' కార్యదర్శి డా॥ సుఖదేవ్‌జీ 'ఓపాడ్' గ్రామానికి దర్యాప్తు చేయడానికి వచ్చి ఇదంతా స్వయంగా తన కళ్ళతో చూచి 'చమార్లు' అనుభవిస్తున్న దురవస్థను మాటలతో చెప్పలేమనీ, వాళ్లను జాట్‌లు విపరీతంగా హింసించే మాట నగ్నసత్యం అనీ చెప్పారు"

ఈ దిగువ సంఘటన 1931 మే 9న "టైమ్స్ ఆఫ్ ఇండియా" పత్రికలో వెలువడింది.

"బరోడా రాజ్యంలో అస్పృశ్యుల స్థితి బ్రిటిష్ ప్రాంతంలోని వారికంటే మెరుగుగా వుందనే అభిప్రాయముంది. ఎందుకంటే ఆ రాష్ట్రం అంత్యజ కులాలవాళ్ళను, సవర్ణులతో సమానంగా చూడాలని చట్టాలు చేసింది. కాని మొన్నఒక అంత్యజ స్త్రీని, తన కొడుకును

ప్రాథమిక పాఠశాలకు పంపినందుకు కొట్టారు. ఆమె పొలంలోని పంటను తగులబెట్టారు. కడిప్రాంతంలోని చనాస్మాగ్రామం నుండి మరో విషాద కథ. చేతి పనివాళ్ళు బావి పూడికను అంత్యజ కులంవాళ్ళు – ఆ బావిని వారు కూడా తర్వాత వాడుకోవచ్చన్న ఒప్పందంతో తీశారు. కాని బావి తయారైన తర్వాత ఆ బావి మీకోసం కాదని చెప్పారు. వాళ్ళు పంచ్ పెద్ద మనుషులకు ఫిర్యాదు చేశారు. ఆ పెద్ద మనుషులు ఉదారంగా ఆ బావికి 500ల అడుగుల పైపు వేయించుకుని దాని చివర తమకు మాత్రమే స్వంతమైన పంపు పెట్టుకుని నీళ్ళను వాడుకోమన్నారు. అనుకోని విధంగా ఒకనాడు పంపువున్న స్థలం యజమానినంటూ ఒకడు వచ్చి ఆపైపును తీసివేయమన్నాడు. అప్పుడు ఆ లైను మార్చి స్థానిక చెఱువు దగ్గరికి మరల్చారు. అప్పుడు చెరువు మైలపడి అక్కడ ఉతికిన బట్టలు మైలపడతాయనే అభ్యంతరం వచ్చి దానిని తీసివేసారు. అందువల్ల ఆ పైపులైను మరోచోట వేసారు. దీనివల్ల వాళ్ళ సమస్య తీరిందా? లేదు. దీనితో రెచ్చిపోయిన సవర్ణులు చాలా పర్యాయాలు ఆ పైపును తెగగొట్టారు. దీని ఫలితంగా అస్పృశ్యులకు త్రాగేందుకు నీళ్ళు లేకుండా పోయాయి. అస్పృశ్యుల పట్ల సహమతస్థుల ఆదరణ ఎంత – శ్రీగాంధీ భాషలో చెబితే- 'సంతృప్తికరంగా' ఉన్నదని అస్పృశ్యులు భావించాలి?"

1928 నవంబర్ 7న శ్రీసంజన్ "టైమ్స్ ఆఫ్ ఇండియా" కు వ్రాసిన ఉత్తరంలో అస్పృశ్యులు నీటికొరకు 1927లో పడిన భయంకరమైన దురవస్థ శ్రీ థక్కర్‌కు ఎలా కనిపించిందో చిత్రించాడు.

"బలసాడ్ తాలూకాలో ఒక నాడు ఒక భంగీ స్త్రీ బావి దగ్గర ఎవరైనా దయామయులైన 'ప్రజలు' తనకు నీళ్ళు పోస్తారని ఎదురు చూస్తూండడాన్ని శ్రీ థక్కర్ గమనించారు. ఆమె ఉదయంనుండి సాయంత్రం వరకూ అక్కడే వేచివున్నా దయామయులైన ప్రజలు ఎవరూ ఆమెకు నీరు పోయలేదు. భంగీలకు నీళ్ళు ఇచ్చే పద్ధతి హిందువుల అసాధారణమైన ఆధ్యాత్మికతను వ్యక్తం చేస్తుంది. నీళ్ళను నేరుగా భంగీల కుండల్లో పోయడానికి వీలు లేదు. అలా చేసిన 'ప్రజలు' మైలపడతారు. శ్రీ థక్కర్ ఇలా చెప్పాడు:

"ఒకసారి మా ఉపాధ్యాయుడు చున్నిభాయి, బకెట్టుతో నేరుగా నీళ్ళను భంగి కుండలో పోసే ధైర్యం చేశాడు. అందుకు అతనికి 'ఇక్కడ అటువంటి పద్ధతి సహించం పంతులూ!' అనే హెచ్చరిక అందింది. బావి వాలుదగ్గర ఒక చిన్న తొట్టిచేసి ఆ తొట్టికి

ఒక వెదురు గొట్టాన్ని అమర్చుతారు. ఎవరికైనా దయ పుట్టినపుడు ఆతొట్టిలో నీళ్ళు పోస్తే అవి గొట్టంద్వారా భంగీల కుండలో పడతాయి. ఈ విధంగా ఆ కుండ నిండడానికి ఒక గంట లేదా అంతకంటే ఎక్కువ సమయం పడుతుంది. ఎందుకంటే శ్రీథక్కర్ చెప్పినట్టు, నీళ్ళు తోడుకుంటున్న స్త్రీ తన బకెట్‌లో అడుగున మిగిలిన నీటిని మాత్రమే ఆ తొట్టిలో పోస్తుంది. అది కూడా ఆ ఎదురు చూచే భంగీ స్త్రీపై దయతలచినపుడు మాత్రమే.

# III

ఈ వ్యవస్థలో అస్పృశ్యులకు చదువుకునే హక్కులేదు. గ్రామ పాఠశాలల్లో చేరే హక్కు ఎంతమాత్రమూ లేదు. అస్పృశ్యులు ఎవరైనా ధైర్యం చేసి ఈ నియమాన్ని ఉల్లంఘిస్తే హిందువులు కఠినంగా వాళ్ళను శిక్షించేవారు. ఎన్నో సంఘటనల్లో కొన్నింటిని మాత్రమే ఇక్కడ వివరిస్తున్నాను.

1921 జూన్ 30న లాహోరు 'ఆర్యగజెట్' నుండిః

"ఒక మహాశయుడు 'యంగ్ ఇండియా' పత్రికలో ఒక వ్యాసం వ్రాసాడు. దానిలో ఆయన ఈ విధంగా వివరించాడు. సూరత్ జిల్లాలో సిసోద్రీ అనే గ్రామం ఉంది. కొద్ది కాలంలోనే ఆ గ్రామం జాతీయవాద పథంలో దేశం మొత్తానికి 'సహాయ నిరాకరణోద్యమ' ఆదర్శంగా చూపగలిగినంత ప్రగతి సాధించింది. ఇంత జరిగినప్పటికీ హరిజనులంటే పాత తృణీకార భావం అలాగే వుంది. ఆ రచయిత చెప్పిన దాని ప్రకారం, ఆ గ్రామంలోని జాతీయోద్యమ పాఠశాలలో 'ఢేడ్' కులానికి చెందిన ఒక బాలుడు తరగతి గదిలో, అతని చూపులతోనే అతడొక అస్పృశ్యకులానికి చెందిన వాడుగా ప్రకటిస్తూ విడిగా ఒక మూలన కూర్చొని ఉన్నాడు. నేను విద్యార్థులను 'మీతోపాటు అతన్ని ఎందుకు కూర్చోనివ్వడం లేదు' అని అడిగితే వాళ్ళు, హరిజనులు మద్యపానం, మాంసం తినడం మాననంతవరకు ఇది జరగదని సమాధానం చెప్పారు. ఆ హరిజన పిల్లవాడు ఒక్కసారి లేచి అవి ఎప్పుడో మానేసినట్లు చెప్పాడు. ఆఉన్నత కులాల విద్యార్థులు ఇక ఏమీ చెప్పలేక పోయారు".

1923 ఫిబ్రవరి 12నాటి 'ప్రతాప్' పత్రికలో నుండిః

"మహాశయ శాంతారాంజీ ఈ విధంగా తెలియజేస్తున్నారు.

"ఇటీవల జరిగిన విషయం ఏమిటంటే ఒక గ్రామంలోని చమార్ పిల్లలకు చ
చెప్పటానికి ప్రభుత్వంచే ఒక బ్రాహ్మణ ఉపాధ్యాయుడు నియమింపబడినాడు. అ
అచ్చటికి వచ్చినపుడు బ్రాహ్మణ, క్షత్రియ మరియు ఇతర కులాల వారు ఉపాధ్యా
బహిష్కరిస్తూ 'నువ్వు ఇక్కడికి వచ్చింది చమార్ పిల్లలకు చదువు చెప్పివాళ్లని
స్థాయికి తీసికొని రావాలనే కదా ? అవునా!' అన్నారు".

1924 ఏప్రిల్ 11 నాటి 'తేజ్' పత్రికనుండిః

"స్వామి శ్రద్ధానందజీ ఇలా వ్రాశారుః

"ఖట్సియాన్‌లో ఒక జాతీయ పాఠశాలను నేను 1921 నవంబర్ ఆఖరు
దర్శించాను. అచ్చట ఎంతమంది హరిజన బాలబాలికలు చదువుతున్నారని విచారిం
ముగ్గురు మాత్రమే చదువుతున్నారు. వాళ్ళు కూడా తరగతి బయట వరంద
కూర్చున్నారని తెలిసింది. నా ఉపన్యాసంలో ఈ పద్ధతికి అభ్యంతరం తెలిపాను. జాతీ
సంస్థల్లో ఈ హరిజన బాలురకు తరగతిలో కలిసి కూర్చునే అవకాశం కల్పిం
సముచితం అన్నాను. పాఠశాల నిర్వహణాధికారి నా సలహా ప్రకారం చేశాడు. ఆమరు
రోజే పాఠశాలలోని బల్లలు ఖాళీ అయినాయి. ఈ రోజు వరకు ఆ జాతీయ పా
మహాభవనం తాళం వేసే ఉంది".

1924 ఏప్రిల్ 18వ తేదీ 'మిలాప్' నుండి ః

"హోషంగాబాద్‌లో జరిగిన సంఘటన ఇది. జిల్లా కౌన్సిల్ హరిజన బాలబాలి
పాఠశాలల్లో చదువు చెప్పాలని ఒక సర్క్యులర్ అన్ని పాఠశాలలకు పం
ప్రధానోపాధ్యాయులు ఆ ఉత్తర్వులను అమలు పరచడం మొదలు పెట్టారు.
పాఠశాలలో హరిజన బాలురను చేర్చుకున్నందుకు అక్కడి గౌరవ మెజిస్ట్రేట్ అది
తప్పుగా భావించి తన పిల్లలను ఆ పాఠశాలనుండి ఉపసంహరించుకున్నాడు.
పిల్లల తల్లితండ్రులు, సంరక్షకులు తమ పిల్లలను పాఠశాల నుండి తీసివేసి స్కూల్
సమావేశాన్ని జరిపించి, హరిజన బాల బాలికలను పాఠశాలలో చేర్చుకొనడం
అభీష్టానికి వ్యతిరేకమని తీర్మానం చేసినారు. బ్రాహ్మణ పిల్లలు, హరిజన పిల్లలు
చదవటం వలన బ్రాహ్మణులు తమ జంధ్యాలను తీసి మార్చవలసి వస్తుంది.
పాఠశాల కమిటీ హరిజన పిల్లలకు చదువు చెప్పే బాధ్యత వహించలేదు. అని అనా

1932 ఏప్రిల్ 1 నాటి "ప్రతాప్" పత్రిక నుండి:

" అహ్మదాబాద్, 1932 ఏప్రిల్ 1. బరోడా రాజ్యం నవగావ్ గ్రామం నుండి ఒక సమాచారం అందింది. అందులో బరోడా రాజ్యంలో హరిజనుల పాఠశాలలను మూసి వేసి హరిజనులకు సాధారణ గ్రామ పాఠశాలలో ప్రవేశానికి అనుమతి నిచ్చినప్పటినుండి, గ్రామస్థులు హరిజనులను అంతులేని హింసలకు గురి చేస్తున్నారు. హరిజన రైతులకు చెందిన వేల కొలది గడ్డి వాములను తగులబెట్టారు. వాళ్ళ బావుల్లో కిరసనాయిల్ చల్లారు. వాళ్ళ ఇండ్లకు కూడా నిప్పంటించుటకు ప్రయత్నించారు. పాఠశాలకు వెళ్ళే మార్గంలో ఒక హరిజన బాలునిపై బడి కొట్టారు. సర్వత్రా హరిజనుల్ని బహిష్కరించాలని ప్రకటించారు".

1939 మే 26 నాటి 'హిందుస్థాన్ టైమ్స్' ప్రకారం:

"చాటిపూర్ జిల్లాలోని ఒక గ్రామంలో రైతులు మరియు ఇతరులకు విద్య గరిపే రాత్రి పాఠశాలపై కొందరు దాడి చేశారు. వారు ఉపాధ్యాయుణ్ణి పట్టుకుని బడి మూయమన్నారు. కారణం, బడికి వచ్చే హరిజన బాలురు చదువుకొని తమను సమానంగా చూడాలని అడుగుతారు గనుక. కానీ పంతులు బడి మూయడానికి నిరాకరించడంతో అతణ్ణి దుడ్డు కర్రతో కొట్టారు. విద్యార్థులందర్నీ పారిపొమ్మని చెప్పారు".

నేను చెప్పదలచుకున్న చివరి సంఘటన బొంబాయి ప్రెసిడెన్సీలోని అహ్మదాబాద్ జిల్లా, ఢోల్కా తాలూకాలోని కవితా గ్రామంలో 1935 ఆగష్టు 8న జరిగింది.

బొంబాయి ప్రభుత్వం, ప్రభుత్వ పాఠశాలల్లో అస్పృశ్యుల బాలబాలికలను చేర్చుకోవాలని ఉత్తర్వు జారీ చేసింది. కవితా గ్రామ హరిజనులు ఈ ఉత్తర్వుల ప్రయోజనాన్ని పొందాలనుకున్నారు. అందువల్ల ఏం జరిగిందో ఈ క్రింద వివరించబడింది.

"1935 ఆగష్టు 8న కవితా గ్రామానికి చెందిన అస్పృశ్యులు తమ నలుగురు పిల్లలను గ్రామ పాఠశాలలో చేర్పించడానికి వెళ్లారు. ఆ గ్రామానికి చెందిన సవర్ణ హిందువులు దీన్ని చూసేందుకు పాఠశాల దగ్గర గుమి కూడారు. ఈ ప్రవేశ సమయం ప్రశాంతంగా గడిచింది. ఎలాంటి అకృత్యమూ జరుగలేదు. కాని మరుసటి రోజు నుండి సవర్ణ హిందువులు తమ పిల్లలు అస్పృశ్యుల ప్రక్కన కూర్చోవడం ఇష్టం లేక తమ పిల్లలు మైలపడతారని వారిని పాఠశాల నుండి ఉపసంహరించుకున్నారు.

"కొంత కాలం తర్వాత 1935 ఆగష్టు 13న ఒక బ్రాహ్మణుడు ఒక అస్పృశ్యుని పై బడి అతణ్ణి కొట్టాడు. అప్పుడు అస్పృశ్యుల మగ వాళ్ళందరూ బ్రాహ్మణునిపై కేసు నమోదు చేయడానికి 'ఢోల్కా' కోర్టుకు వచ్చారు. హరిజనుల్లో పెద్ద వాళ్ళెవరూ లేరన్న విషయం తెలుసుకున్న గ్రామంలోని హిందువులు అస్పృశ్యుల ఇండ్లపై కర్రలు, బరిసెలు మరియు కత్తులతో దాడి చేశారు. హిందూ స్త్రీలు కూడా దాడి చేసిన వారిలో ఉన్నారు. వాళ్ళు అస్పృశ్యుల స్త్రీలనూ, వృద్ధులనూ కొట్టడం మొదలు పెట్టారు. వారిలో కొంత మంది అడవులకు పారిపోయారు. మిగిలిన వారు తలుపులు మూసుకుని ఇండ్లలో దాగారు. హరిజన పిల్లలను గ్రామ పాఠశాలలో చేర్పించటానికి కారణమైన నాయకులపై కక్ష తీర్చుకొనుట వీరి లక్ష్యం. అందువల్ల వాళ్ళు లేక పోవడం చూచి, వాళ్ళ ఇండ్లపై కప్పు పెంకులను, వాసాలను ఊడబెరికి వేసారు.

"భయకంపితులైన ఆ హరిజన స్త్రీలు, వృద్ధులూ ఢోల్కా కోర్టుకు వెళ్ళి ఆరాత్రికి తిరిగి రావలసిన తమ పెద్దల గురించి చాలా భయపడ్డారు. ఈ విషయం తెలిసిన సవర్ణ హిందువులు పొదలు, చిన్న చెట్ల చాటున దాగి వున్నారు. ఈ విషయం గ్రహించిన అస్పృశ్య స్త్రీ ఒకరు ఆ చీకట్లో ధైర్యం చేసి రహస్యంగా వెళ్ళి, హిందువులు ఆయుధాలతో మార్గంలో పొంచి వున్నారని, ఆ గ్రామానికి రావలదని ఆ పెద్దలతో చెప్పింది. వారు అందుకు నిరాకరించారు. ఎందుకంటే తాములేనపుడు సవర్ణ హిందువులు ఎక్కువ హాని చేస్తారేమోనని భయపడినారు. ఆసమయంలో వారు గ్రామానికి వెళితే తమ పై బడి కొట్టవచ్చు. అందుకని ఊరవతల పొలాల్లో అర్థరాత్రి దాటేంత వరకు వేచి వుండడానికి నిశ్చయించుకున్నారు. పొదల్లో పొంచి ఉన్నవారు నిరీక్షించి, నిరీక్షించి చివరకు వెళ్ళిపోయారు. రాత్రి మూడుగంటల తర్వాత హరిజన నాయకులు ఊళ్ళోకి ప్రవేశించారు. మూడు గంటలకు ముందు గనక వచ్చినట్లయితే హంతకులు వారిని చంపి వుండేవారు. తమ వాడలో మనుషులకు, ఆస్థులకూ జరిగిన హానిని చూసి వారందరు తెల్లవారక ముందే అహ్మదాబాద్‌కు వెళ్ళి ఈ విషయాలన్నింటిని శ్రీ గాంధీ చేత హరిజనుల సంక్షేమాన్ని చూచేందుకు ఏర్పాటు చేయబడిన హరిజన సేవక్ సంఘ్ కార్యదర్శికి తెలిపారు. కాని అతడు నిస్సహాయుడై ఏమీ చేయలేకపోయాడు. సవర్ణ హిందువులు హరిజనులపై దాడులు చేయటం మాత్రమే గాక వాళ్ళను అనేక రకాలుగా కష్టాల పాలు చేశారు. వాళ్ళను కూలీలుగా పనిలో పెట్టుకోవడానికి నిరాకరించారు. వాళ్ళకు తినే వస్తువులను దుకాణాదారులు

అమ్మకుండా చేసారు. అక్కడక్కడ హరిజన స్త్రీలపై, పురుషులపై దౌర్జన్యం చేశారు. ఇంతేకాక వారు త్రాగే నీటి బావుల్లో కిరోసిన్ పోసారు. ఇవన్నీ రోజుల తరబడి చేశారు. దీని పర్యవసానం ఏమంటే గ్రామంలోని హరిజనులకు త్రాగేనీరు లేకుండా పోయింది. ఈ విధమైన పరిస్థితులు ఇంత వరకు వచ్చిన తర్వాతకొంత మంది మెజిస్ట్రేట్ కోర్టులో క్రిమినల్ కేసు నమోదు చేయాలని ఆలోచన చేశారు. సవర్ణ హిందువులపై అక్టోబర్ 17న నేర ఫిర్యాదు (Criminal Complaint) చేశారు.

"ఈ కేసులో అసాధారణమైన విషయం ఏమంటే శ్రీ గాంధీ మరియు అతని అనుచరుడు సర్దార్ వల్లభాయి పటేల్ నిర్వహించిన పాత్ర! కవితా గ్రామంలో సవర్ణ హిందువులు అస్పృశ్యులపై చేసిన దౌర్జన్యాలూ, అణచివేతలూ అంతా తెలిసి కూడా శ్రీ గాంధీ చేయదలచిన దేమంటే, ఆ ఊరు వదలి వెళ్ళి పొమ్మని అస్పృశ్యులకు సలహానివ్వడం మాత్రమే. ఆయన కనీసం నేరస్థులమీద కోర్టులో కేసు వేయాలనే సూచన కూడా చేయలేదు. ఇక ఆయన అనుచరుడు శ్రీ వల్లభాయి పటేల్ నిర్వహించిన పాత్ర మరీ విచిత్రమైంది. అస్పృశ్యులపై దాడులు చేయవద్దని సవర్ణ హిందువులకు నచ్చచెప్పడానికి ఆయన కవితా గ్రామానికి వెళ్ళాడు. వాళ్ళు ఆయన మాటలు వినను కూడా వినలేదు. అయినా కూడా ఈ పెద్ద మనిషి వారికి వ్యతిరేకంగా అస్పృశ్యులు కేసు పెట్టడాన్ని, శిక్ష పడేట్టు చేయడాన్ని తీవ్రంగా వ్యతిరేకించాడు. ఆయన వద్దన్నా వినకుండా అస్పృశ్యులు కేసు పెట్టారు. కానీ చివరకు ఆయన చాలా ఒత్తిడి చేసి వాళ్ళ చేత కేసును ఉపసంహరింప జేయించాడు. అగ్ర వర్ణాలతో అస్పృశ్యులపై దాడులు చేయబోమని ఒప్పందంలాంటిది చేసుకున్నట్టు కూడా ప్రదర్శించాడు. ఆ ఒప్పందాన్ని అస్పృశ్యులెలాగూ అమలు చేయించలేరు. ఫలితమేమంటే, అస్పృశ్యులు బాధలు పడ్డారు. వారిని హింసించిన సవర్ణులు మాత్రం శ్రీగాంధీ మిత్రుడైన వల్లభాయి పటేల్ సాయంతో తప్పించుకున్నారు."

## IV

అస్పృశ్యులు కూడా హిందువులేనని హిందువులంటారు. కానీ అస్పృశ్యుని మృత శరీరం హిందువుల శ్మశాన వాటికలలో దహనం చేయకూడదు. 1946 జూన్7న "ఫ్రీ ప్రెస్" ఈ విధంగా నివేదించింది.

"మధురలోని ఇద్దరు హరిజనులపై ఇటీవల నేరారోపణ జరిగి హిందువుల మనోభావాలకు బాధ కల్గించినందుకు వారికి నాలుగు నెలలు కఠిన శిక్ష విధించబడింది. శ్రీ యం.యస్.వైద్యనాథ్ అయ్యర్ పత్రికకు ఇచ్చిన సమాచారం ప్రకారం 'అస్పృశ్యత కారణంగా అస్పృశ్యులు అనుభవించే క్రూరమైన బాధల్ని" పత్రికల ద్వారా ప్రజల దృష్టికి తేవడం జరిగింది.

"శ్రీ వైద్యనాథ్ అయ్యర్ ఇలా చెప్పారు:

"మధురలోని ఒక హరిజనుడు చనిపోయిన తన పెద్ద కుమారుణ్ణి మున్సిపల్ స్థలంలో హరిజనులకు కేటాయించిన స్థలంలో కాకుండా, హిందువులకు కేటాయించిన స్థలంలో దహనం చేసాడు. ఈ విధంగా స్థలం కేటాయించిన విషయం గురించి అతనికి తెలియదనేది ఆ హరిజనుని వాదం. సన్నగా చినుకులు పడుతున్నాయి. ఈ స్థలమూ అనుకూలంగా వుంది. కాబట్టి ఇక్కడే దహనం చేయవలసి వచ్చింది. కాని ఈ విషయం వల్ల ఏ ఒక్క హిందువూ బాధపడినట్లు కాని, అభ్యంతరం తెల్పినట్లు కానీ ఎలాంటి ఆధారాలు లేవు. కానీ ఈ విషయం మధురై పోలీసుల దృష్టికి వచ్చింది. అందుకు చనిపోయిన పిల్లవాని తండ్రిపై, అతని దగ్గరి బంధువులపై అభియోగం మోపారు. ఇది హిందువులకు బాధ కల్గించవచ్చుననే నెపంతో ఆ విధంగా చేసారు. ఎందుకంటే ఆ చనిపోయిన బాలుడు అస్పృశ్యుడు.

"ఈ విషయాన్ని అతడు మద్రాసు రాష్ట్ర మంత్రి వర్గం దృష్టికి తీసికొని వచ్చానని శ్రీ అయ్యర్ తెలియ జేసారు."

1945 ఏప్రిల్ 22న 'సావధాన్' పత్రిక ప్రకారం:

"1945 మార్చి 18న ముజాఫర్ నగర్ జిల్లాలోని ప్లోడా గ్రామంలో ఒక పాకీ పని చేసే మనిషి చనిపోయాడు. ఆ మృత దేహాన్ని తీసుకొని పాకీ వాళ్ళందరూ కలసి దహన వాటికకు తీసుకుని వెళ్ళారు. ఇది ఆగ్రామపు త్యాగి బ్రాహ్మణులను రెచ్చగొట్టింది. ఆ బ్రాహ్మణులు పాకీ వాళ్ళను, ఆ మృత దేహాన్ని సవర్ణుల శ్మశానానికి తీసుకువచ్చినందుకు తిట్టారు. అందుకు సమాధానంగా వాళ్ళు తాము హిందువులం కాబట్టి అక్కడికి తీసికొని వచ్చాం. అక్కడే దహనం చేస్తాం అని అన్నారు. మీరు హిందువులైనా, ముస్లింలైనా

భూస్థాపితం చేయాలి కాని దహనం చేయరాదు; మీరలా చేయకపోతే మేమే పాతి పెడతామని హిందువులు బెదిరించారు. అలా బెదిరించబడి, తన్నులు తింటామనే భయంతో ఆపేద పాకీ వాళ్ళు మృత దేహాన్ని పాతి పెట్టారు".

ఇక్కడ మరొక విషయాన్ని గుర్తించవలసి వుంది. హిందువుల ఔన్నత్యానికి చిహ్నాలైన పద్ధతులను అనుసరించాలనుకోవడం అస్పృశ్యుల అత్యాశ అవుతుంది కాబట్టి వాళ్ళు తమకు ఇష్టం లేకపోయినా సరే చనిపోయిన తమ మనుషులను పాతి పెట్టవలసిందే.

1924 జూన్ 6న "మిలాప్"లో నిర్బంధ ఖననం గురించిన ఉదంతం వివరించబడింది.

"హిందువుల నిరంకుశత్వమే అస్పృశ్యులు జాగరూకులవటానికి ముఖ్య కారణం. దీనిని నేను గమనించలేకపోయినా అనేక మంది కార్యకర్తలనుంచి వచ్చిన నివేదికలు నాకు చాలా బాధ కల్గించాయి. ఒక ప్రాంతం నుండి నాకొచ్చిన సమాచారాన్ని బట్టి ఆ ప్రాంతంలో వున్న అస్పృశ్యులు చనిపోయిన వారిని దహనం చేయడానికి హిందువులు అనుమతించరు. ఈ సంఘటన ఆ ప్రాంతపు పాకీ వాళ్ళలో ఒక కొత్త చైతన్యం కలగడానికి దోహదం చేసింది. అందువల్ల మృత దేహాన్ని బోర్లా పడుకోబెట్టి- వెల్లకిలా పాతిపెట్టే ఇతరులకు భిన్నంగా- భూస్థాపితం చేయ మొదలు పెట్టారు. ఇతరులు చేసేటట్లే చేస్తే తమ్ము తాము తక్కువ చేసుకున్నట్లు అవుతుందని వారి ఉద్దేశ్యం".

## V

జంధ్యం ధరించడం అనేది ఉత్తమ జన్మకు గుర్తు. అస్పృశ్యులు తమను తాము సంస్కరించుకునే నిమిత్తం జంధ్యాన్ని ధరించాలనుకున్నారు. ఉత్తర ప్రదేశ్‌లోని గర్వాల్ జిల్లాలోని రింగ్‌వారి గ్రామంలో అస్పృశ్యులపై సవర్ణ హిందువుల దాడి జూన్ 6 నాటి నేషనల్ హెరాల్డ్ పత్రికలో ప్రకటితమైంది.

"రెండు నెలల పాటు సవర్ణ హిందువుల హింసలకు గురై పారిపోయిన పది కుటుంబాల మొత్తం 33 మంది హరిజనులు జిల్లా అధికారుల సహాయంతో మరల తమ గ్రామానికి రాగలిగారు. వీరు తమ అభ్యున్నతి కోసం శ్రీ గాంధీ మరియు స్వర్గీయ స్వామీ శ్రద్ధానంద నడిపించిన సామాజిక ఉద్యమాన్ని సంపూర్ణంగా ఉపయోగించుకున్నారనే విషయం గుర్తుంచుకోవాలి. హరిజనులు జంధ్యాన్ని స్వీకరించారు. సంధ్యావందనం తమ విధిలో

భాగంగా చేపట్టారు. కాని ఈ విధంగా చేయటం తమహక్కులు, విశేషాధికారాలపై దెబ్బతీయడమే అవుతుందని 'గర్‌వాల్' సవర్ణ హిందువులు ఆగ్రహించారు. ఈ నిరసన ఎన్నో దౌర్జన్యాలకు దారి తీసింది. నిరంతరమైన సాంఘిక ఇబ్బందులకు గురి చేసింది. అంతే గాక హరిజనులు పెండ్లి సమయంలో పాలీలు, మరియు పల్లకీలు ఉపయోగించడం విరమించాలని చెప్పడం జరిగింది. మరోచోట నలుగురు హరిజనుల చేత బలవంతంగా ఒక దున్నపోతును చంపించి దాని పచ్చి మాంసం తినిపించారు. ఈ విధమైనటువంటి అఘాయిత్యాలు రింగ్‌వాల్‌లో అగ్రస్థాయికి చేరుకున్నాయి. సవర్ణ హిందువులకు తల ఒగ్గని హరిజనులకు నీటి చెలమలు, బంజరు భూములు, ఇతర బహిరంగ స్థలాల్లోకి ప్రవేశం నిరాకరించారు. దీని ఫలితంగా ఆ పది కుటుంబాలు ముందు జరుగబోయే హింసలను తప్పించుకొనేందుకు అర్థరాత్రివేళ గ్రామాన్ని వదిలి వెళ్ళి పోవలసి వచ్చింది."

ఇటువంటివే మరికొన్ని ఉదాహరణలు :

1. "ఆర్య సమాజానికి చెందిన వారు కొందరు అస్పృశ్యుల కులాలలను పెంచి వారి సవర్ణత్వానికి గుర్తుగా మత సంబంధమైన జంధ్యాన్ని మెడలో ధరించడానికి ఇచ్చారు. కొందరు సనాతన హిందువులు దీన్ని సహించలేదు. వారు తమ మతాచారాన్ని ఆచరించడం ఒప్పుకోమన్నారు. ఆతాడు వేసుకున్న అస్పృశ్యులను ప్రతి రోజూ ఏదో విధంగా బాధిస్తూనే ఉండేవారు".

2. జమ్మూ రాష్ట్రంలోని మీర్‌పూర్ జిల్లాలోని మొయిలా (Molla) కు చెందిన భగత్ హరిచంద్‌కు ఆర్య సమాజం వారిచే శుద్ధి చేయబడిన తర్వాత జంధ్యాన్ని ధరించుటకు అనుమతి నిచ్చారు. ఆ ప్రాంతానికి చెందిన హిందూ జాట్‌లు అతణ్ణి పట్టుకొని కొట్టి అతని జంధ్యం త్రెంపి వేసారు. దీనికంతటికీ కారణం ఒకటుంది. అది మేఘులు శుద్ధి జరగక ముందు జాట్‌లను 'గరీబ్ నవాజ్' (బీదల సంరక్షకులు) అని సంబోధించేవారు. కానీ వారు శుద్ధులైన తర్వాత కేవలం 'నమస్తే' అని జాట్‌లను సంబోధించడం మొదలుపెట్టారు.

1929 సెప్టెంబరు 14న "ఆర్యగెజెట్"లో ఈ విధంగా ప్రకటితమైంది.

"గురుదాస్ పూర్ జిల్లాలోని బెర్‌హమ్‌పూర్ పట్టణం సమీపంలో రమని(Ramani) గ్రామంలోని హిందూ రాజపుత్రులు ఆ గ్రామంలోని అస్పృశ్యులను ఇళ్ళల్లోంచి పిలిచి

జంధ్యాలను తీసివేయాలనీ, మళ్ళీ ఇక ధరించమని ప్రమాణం చేయాలనీ, లేకపోతే వాళ్ళ బ్రతుకులకే ప్రమాదం అనీ ఆదేశించారు. అందుకు ఆ అస్పృశ్యులు ప్రశాంతంగా సమాధానమిస్తూ 'మహారాజ్! ఎందుకు మీరు మామీద కోపగించుకుంటారు. మీ సొంత సోదరులైన ఆర్య సమాజీకులు ఈ జంధ్యాలను దయతో మామెడలో ధరింపజేసారు. ఎల్లప్పుడూ వీటిని సంరక్షించుకొమ్మని చెప్పారు. అవి హిందూ ధర్మానికి నిజమైన ప్రతీకలని తెలిపిచ్చారు. ఇందుకు మీకు అభ్యంతరం ఉంటే మీ చేతులతో మీరే వాటిని తెంపండి' అన్నారు. ఇట్లా అన్నందుకు రాజపుత్రులు కర్రలతో, లాఠీలతో బీద ప్రజలైన అస్పృశ్యులపై బడి చాలా సేపటిదాకా కొట్టడం సాగించారు. అయినప్పటికి అస్పృశ్యులు ఎంతో ధైర్యంగా బాధల్ని సహించారు. ఏ విధమైన నిరసననూ తెల్పలేదు. ఈ బాధా దృశ్యం జాలి కలిగించకపోగా ముగ్గురు, నలుగురు రాజపుత్రులు కలసి 'గోరిరామ్' అనే హరిజనునిపై బడి, అతని జంధ్యాన్ని తెంచి వేశారు. అతని శరీరం మీద కత్తితో జంధ్యం ఆకారంలో చీరి గాయపరిచారు."

1929 అకోబర్ 12న 'మిలాప్' పత్రికలో ప్రకటితమైంది:

"బమరాని గ్రామంలోని రాజపుత్రులు చాలా కాలం నుండి అస్పృశ్యులకు వ్యతిరేకంగా ఒక కార్యక్రమాన్ని చేపట్టారు. దీనికి కారణం కోర్టులో రెండు కేసులు నడుస్తున్నాయి. ఒకటి జంధ్యాన్ని త్రెంచిన కేసు. మరొకటి 1929 అక్టోబర్ 7న ఒక అస్పృశ్య స్త్రీ పొలంలో పంటను కోయడానికి వెళుతుంటే ఒక రాజపుత్రుడు ఆమెను కొట్టి తీవ్రమైన గాయాలకు గురి చేసాడు. ఆమె స్పృహ తప్పింది. ఇంటికి మంచంపై తీసుకుని వచ్చారు"

## VI

అస్పృశ్యుడు ఒక హిందువు సమక్షంలో మంచంపై కూర్చొని ఉంటే ఏమి జరుగుతుందనే దానికి సమాధానం 1938 జూలై 'జీవన్' పత్రికలో వెలువడింది.

"సతార్‌పూర్ జిల్లాలోని పోలీసుపోస్టు మార్గాంవ్ పచ్చాహెరా గ్రామస్థులైన నందారామ్ మరియు మంగళి ప్రసాద్ సామూహిక విందుకు తమ బంధువులను మిత్రులను ఆహ్వానించారు. అతిథులు మంచాలపై కూర్చుని పొగత్రాగుతున్న సమయంలో ఆ గ్రామ జమీందార్లు ఠాకూర్ సూరజ్ బక్షసింగ్ మరియు హరపాల్‌సింగ్ అచ్చటికి

వచ్చారు. నందారామ్‌ను, మంగళి ప్రసాద్‌ను పిలిపించారు. ఠాకూర్ను పొగత్రాగేవారు ఎవరని అడిగారు. వారు మా బంధువులని మంగళి ప్రసాద్ అన్నాడు. పైగా ఠాకూర్లు మాత్రమే మంచాలపై కూర్చోవాలా? అని ప్రశ్నించాడు. ఈ సమాధానంతో రెచ్చిపోయిన ఠాకూర్లు ఆ ఇద్దరు సోదరులను, వాళ్ళ అనుచరులు వచ్చిన బంధువులను, అతిథులనూ తీవ్రంగా కొట్టారు. దీని ఫలితంగా ఒక పురుషుడు, ఒక స్త్రీ స్పృహ తప్పారు. ఇతరులకు తీవ్రమైన గాయాలు తగిలాయి".

# VII

అస్పృశ్యులు కూడా హిందువులే. వారు కూడా పౌరహక్కులు కల్గిన పౌరులే. కాని నియమితమైన వ్యవస్థలో ఏదైనా నియమంతో సంఘర్షణ వచ్చినపుడు, అస్పృశ్యులు పౌరసత్వ హక్కులను పొందే యోగ్యత కలిగి ఉండరు.

ఉదాహరణకు ఏ అస్పృశ్యుడైనా వసతి గృహాల్లో ఉండకూడదు. ఇవి ప్రజలకు సంబంధించినవే అయినప్పటికీ ప్రవేశంలేదు. ఇలాంటి ఒక సంఘటన ఆగష్టు 1938 'జీవన్' పత్రికలో ఫతేఘర్ గ్రామస్థుడైన కన్హయ్యాలాల్ జాతవ్ అనే అస్పృశ్యుని అనుభవంగా ప్రకటితమైంది.

"నేను ఆగష్టు 15, 1938 సాయంత్రం అలహాబాద్ జంక్షన్ దగ్గరలో ఉన్న ధర్మశాలలో ఉండటానికి ఆ రాత్రి అచ్చటికి వెళ్ళాను. ఒక రూపాయి చెల్లించి మంచం మీద విశ్రాంతి తీసికొన్నాను. అంతవరకూ ఏ ఇబ్బందీ జరుగ లేదు. కానీ రాత్రి 11గం॥ లకు ధర్మశాల నిర్వహణాధికారి వద్దకు లాడ్జిలోని వారంతా వారి వారి చిరునామాలను వ్రాయించేందుకు వెళ్ళారు. ఆ క్రమంలో నాకులం 'జాతవ్' అని వ్రాయించాను. అది విన్న వెంటనే నిర్వహణాధికారి మండిపడి, ధర్మశాలలో తక్కువ కులాల వారు ఉండటానికి వీలు లేదని చెప్పి బయటకు వెళ్ళమని ఆజ్ఞాపించాడు. అప్పుడు నేను ఆయనతో నియమ నిబంధనల ప్రకారం ధర్మశాల హిందువులకు మాత్రమే ఉన్నది కానీ, అస్పృశ్యులకు ప్రవేశములేదని ఎచ్చట ఉందని ప్రశ్నించాను. నేను ఫర్రూకాబాద్ (Farrokabad) నివాసిని, ఈ రాత్రి 11 గంటల సమయంలో ఎచటికి పోవాలి అన్నందుకు నిర్వహణాధికారి కోపోద్రిక్తుడై రామాయణంలో నుండి శ్లోకాలు వల్లిస్తూ (శూద్రులు, చదువురాని వారు, పశువులు దండనకే అర్హులు) తక్కువ కులానికి చెంది ఉండి కూడా నియమనిబంధనల

గూర్చి మాట్లాడుతున్నావు. కాబట్టి నిన్ను కొట్టనిదే బయటకు గెంటి వేయకూడదని, నాపడక దుప్పట్లు ధర్మశాల బయట పార వేయించాడు. అంతలో అచ్చట ఉన్నవారందరు నన్ను కొట్టడానికి సిద్ధపడ్డారు. ఆ పరిస్థితుల్లో తప్పనిసరై తక్షణమే ఆ ధర్మశాలను వదిలి దానికి ఎదురుగా ఉన్న ఒక దుకాణం ముందు గల చెక్కపై నిద్రించాను. అందువల్ల ఆ దుకాణదారునికి ఆ రాత్రి అద్దె క్రింద రెండు అణాలు చెల్లించాను. అందువల్ల షెడ్యూల్డు కులాల సోదరులకు మనవి చేసేదేమిటంటే మీరు అన్ని చోట్లా సమావేశాలు పెట్టి ప్రభుత్వం మన వాళ్ళకు ప్రత్యేకమైన ధర్మశాలలను నిర్మించాలనీ లేదా ఇదివరకున్నటువంటి ధర్మశాలల్లో మనవాళ్ళకు ప్రవేశం కల్పించవలసిందిగా ప్రభుత్వానికి మనవి చేయండని విజ్ఞప్తి చేస్తున్నాను.

## VIII

ఈ పాతుకపోయిన వ్యవస్థలో సాధారణంగా చనిపోయిన జంతువులను తీసివేయడం, పాకీ పని చేయడం హిందువుల స్థాయికి తగని పనులు. అవి అస్పృశ్యులే చేయాలి. కానీ వారు కూడా ఇలాంటి పనులు చేయడం తమ స్థాయికి తగినవి కావని అలా చేయడానికి నిరాకరించడం మొదలు పెట్టారు. హిందువుల బలవంతం వలన, వారి మనసుకు విరుద్ధంగా, వారికి చేయాలనే ఇష్టం లేకున్నా చేయవలసి వస్తుంది. 1938 జూన్‌లో 'జీవన్ పత్రికలో ప్రకటించిన దాని ప్రకారం:

"1938 మేలో ఒక రోజు అలిఘర్ జిల్లా బార్ల పోలీస్ స్టేషన్ పరిధిలోని బిపోలి గ్రామస్థుడైన బజ్జూరాం జాతవ్ ఉదయం 11 గంటల ప్రాంతంలో తన ఇంటి ముందు కూర్చున్నాడు. అప్పుడు ప్రితిక్, హెూదల్, సీతారాం, దేవి మరియు చుని – వీరంతా బ్రాహ్మణ కులానికి చెందిన వారు- కర్రలతో అతని దగ్గరకు వచ్చి, చనిపోయిన పశు కళేబరాన్ని తీసివేయాలని బలవంతం చేసారు. అప్పుడు, అతడు వాళ్ళతో తనకు ఆ పని చేసే అలవాటు లేదనీ ఇంకెవరినైనా పిలవమనీ చెప్పాడు. అందుకు వాళ్ళు కోపోద్రిక్తులై దయాదాక్షిణ్యాలు లేకుండా కర్రలతో అతన్ని కొట్టారు.

అదే పత్రికలో 1938 అక్టోబర్‌లో ఈ వార్త వచ్చింది.

"1938 అక్టోబర్24న ముట్రా జిల్లా సదాబాద్ తాలూకాలో ధారి గ్రామానికి చెందిన బ్రాహ్మణుల పశువులు చనిపోయాయి. వాటిని తీసివేయవలసిందిగా చెప్పినపుడు ఆ

గ్రామపు షెడ్యూల్డు కులాల వారు నిరాకరించారు. అప్పుడు సవర్ణ హిందువులంతా రెచ్చిపోయి షెడ్యూల్డు కులాల వాళ్లను తమ పొలాలకు బహిర్భూమికి పోవద్దనీ, వాళ్ళ పశువులను తమ భూముల్లో మేపవద్దనీ నిషేధించారు."

# IX

అస్పృశ్యులు మంచి దుస్తులను ధరించరాదు, వెండి, బంగారు నగలు కూడా ధరించకూడదు - అనే నిబంధనలను హిందువులు అస్పృశ్యులపై విధించినప్పటికీ కొన్ని సార్లు ఇలాంటి నిబంధనలను అస్పృశ్యులు త్రోసి పుచ్చేవారు. అందుకు హిందువులు వారిని ఎంత మాత్రం సహించక వాళ్ళను శిక్షించటానికి వెనుకాడలేదు. అలాంటి పరిస్థితుల్లో వారు ఎలాంటి పరిణామాలను ఎదుర్కొన్నారో వార్తా పత్రికలలో వెలువడిన సంఘటనల వలన తెలుస్తుంది.

"1922 వరకు బిరార్ జిల్లాలోని 'బున్ది' గ్రామం లోని దలాయి తెగకు చెందిన అస్పృశ్యులు గోధుమలు తినడం నిషేధించబడింది. 1922 ఫిబ్రవరిలో ఒక చమార్ స్త్రీ తన కాళ్ళకు వెండి ఆభరణాలు ధరించినందుకు సకత్‌గర్, జయపూర్‌లో ఆమెపై గుదిబండనెక్కించారు. ఇందుకు కారణంగా చెప్పిందేమిటంటే, ఎక్కువ కులానికి చెందిన వాళ్ళే వెండి ఆభరణాలు ధరించాలనీ, గోధుమలు తినాలనీ అన్నారు. అందువలన తక్కువ కులానికి చెందిన వాళ్ళు ఇలాంటివి ఆశించకూడదు. ఇంత వరకూ ఇలాంటి పురాతన ఆలోచనలు ఇప్పటికే సమసిపోయి వుంటాయి అని అనుకునే వాళ్ళం".

1928 జనవరి 4న "టైమ్స్ ఆఫ్ ఇండియా" లో మధ్య ఇండియాలోని బలాయి అనే అస్పృశ్యులు నగలు, శుభ్రమైన వస్త్రాలు ధరించినందుకు హిందువుల నిరంకుశత్వానికి మరియు పీడనకు ఎలా గురైనారో తెలిపే వార్త వచ్చింది:

"ఇండోర్ జిల్లాలోని కనారియా,బిచోలి, హాఫ్సీ, బిచోలి, మర్దానా, మరియు 15 ఇతర గ్రామాలకు చెందిన కలోటాస్ రాజపుత్రులూ, బ్రాహ్మణులూ (పాటిల్,పట్వారీలతో సహా) తమ తమ గ్రామాలలోని బలాయీలకు తమ గ్రామాల్లో నివసించదలిస్తే ఈ క్రింది నియమాలను అనుసరించాలని తెలియ జేశారు.

1. బలాయిలు బంగారు లేస్ అంచుల ధోవతులు, వస్త్రాలు ధరించరాదు.
2. బలాయిలు ఫ్యాన్సీ రంగులుగల అంచుల ధోవతులు ధరించకూడదు.
3. హిందువులు ఎవరైనా చనిపోతే,వాళ్ళ బంధువులకు వాళ్ళెంత దూరమున్నా, బలాయిలే సమాచారమందించాలి.
4. హిందువుల అన్ని వివాహాల్లో బలాయిలే ఊరేగింపుకు ముందు పెండ్లి వాయిద్యాలు వాయించాలి.
5. బలాయిలు ఫాన్సీ గౌన్లు ధరించరాదు.
6. బలాయిల స్త్రీలు, హిందువుల స్త్రీల ప్రసవ సమయంలో తప్పక పరిచర్యలు చేయాలి.
7. బలాయిలు ఎలాంటి ప్రతిఫలం అడగకుండా పని చేయాలి. హిందువులు ఏమి ఇస్తే దానిని స్వీకరించాలి.
8. బలాయిలు ఈ నియమ నిబంధనలను అంగీకరించకపోతే గ్రామం వదిలి వెళ్ళిపోవాలి.

"బలాయిలు ఈ నిబంధనలను ఒప్పుకోలేదు. అందువల్ల వాళ్ళు గ్రామంలోని బావుల నీళ్ళను తీసుకొనరాదన్నారు. వాళ్ళ పశువుల్ని మేపనీయలేదు. హిందువుల భూముల గుండా బలాయిలు నడచి వెళ్ళటాన్ని కూడా నిషేధించారు. అందువల్ల హిందువుల పొలాల మధ్యన ఉన్న తమ పొలాల దగ్గరకు బలాయిలు వెళ్ళలేకపోయారు. హిందువులు తమ పశువుల్ని బలాయిల పొలాల్లో మేపుతూ ఉండేవారు.

"హిందువులు పెట్టే హింసలను గురించి బలాయిలు ఇండోర్ దర్బార్‌కు ఫిర్యాదు చేశారు. సరైన సమయానికి సహాయం అందనందున ఫలితం లేకపోయింది. హిందువులు బలాయిలను పీడించడం, బాధలు పెట్టడం అంతటితో ఆగలేదు. అందువల్ల బలాయిలు తమ పూర్వీకులు నిర్మించిన ఇండ్లను, ఆస్తులను వదిలి, పిల్లాపాపలతో పాటు పొరుగు రాష్ట్రాలోని గ్రామాలకు వలస వెళ్లవలసి వచ్చింది. ధార్, దివాన్, బాగ్లి, భోపాల్, గ్వాలియర్‌లకూ మరియు ఇతర రాష్ట్రాలకు కూడా వలస వెళ్ళారు.

"కొన్ని రోజుల క్రితం ఇండోరు నగరానికి 8 మైళ్ల దూరంలో వున్న రేవతి గ్రామంలో బలాయిల కొరకు తయారు చేసిన నిబంధనల స్టాంపు కాగితంపై సంతకాలను చేయమని ఆదేశించారు. అందుకు బలాయిలు నిరాకరించారు. వారిలో కొందరిని హిందువులు

కొట్టారని ఆరోపణ. అంతేకాక ఒక బలాయిని బంధించి ఒప్పందం పై సంతకం పెట్టిన తర్వాతనే అతన్ని విడిచి పెట్టారని తెలిసింది"

ఆ తర్వాత జనవరి 21, 1928 నాటి 'ఆర్యగజెట్' ప్రకారంః

"ఇంతవరకు హరిజనులపై జరిగే హింసల బాధాకరమైన కథలు ఎక్కువగా మద్రాసు రాష్ట్రం నుంచే వచ్చాయి. కాని సిమ్లా హిల్స్ మహారాణా వల్ల ఇలాంటి కథలు వినడానికి అంత దూరపోయే అవసరం లేకపోయింది. సిమ్లా జిల్లాలో 'కోర్లీ' అనే కులం వాళ్ళు ఉన్నారు. వారు చాలా అందమైనవారు మరియు శ్రమించి పని చేసే గుణం కలవారు. కానీ హిందువులు వారిని అస్పృశ్యులుగా చూస్తారు - హిందూ మతస్థుల కార్యకలాపాలకు విరుద్ధంగా ఏ పనీ చేయకపోయినప్పటికీ ఈ కులానికి చెందిన వాళ్ళు శక్తిమంతులు, శరీర ధారుఢ్యం కల్గిన వారే కాక చాలా తెలివిగలిగిన వారు కూడా. సిమ్లా ప్రాంతంలో పాడే పాటలన్నీ ఈ కులానికి చెందిన వారు రచించి, రాగాలు కట్టినవే. వారు రోజంతా పని చేస్తారు. బ్రాహ్మణులంటే పూజ్య భావం ఉంది. అయినా కోర్లీ కులానికి చెందిన వారు బ్రాహ్మణుల ఇంటివైపు వెళ్ల కూడదు. వాళ్ళ బాలబాలికలు పాఠశాలల్లో చదవలేరు. మత సంబంధమైన ఆశ్రమ పాఠశాలలకు కూడా వెళ్ళలేరు. వాళ్ళ స్త్రీలు బంగారు నగలు ధరించలేరు. కొంత మంది కోర్లీ కులానికి చెందిన వారు పంజాబుకి వెళ్ళి అక్కడ కూలీ చేసి సంపాదించిన దానిలో బంగారు ఉంగరాలు, చెవుల రింగులు కొనుక్కొని వచ్చినందుకు హిందువులు వాళ్ళని జైల్లో వేయించారని, వీరు తెచ్చిన నగలు ప్రభుత్వాధికారులు పరమయ్యేంత వరకూ వాళ్లను వదల లేదనీ తెలిసింది".

1926 జూన్ 23న 'ప్రతాప్' పత్రికలో ఈ ఉత్తరం ప్రచురించబడింది.

"స్వామి రామానంద్‌జీ సన్యాసి ఇలా రాస్తున్నారుః

"1926 మార్చి 23న సాయంత్రం చమార్ కులానికి చెందిన ఒకరు నావద్దకు వచ్చి జాట్‌ల బారి నుండి తాను తప్పించుకొని బయట పడిన విధాన్ని వివరించాడు. అంతే గాక గుర్‌గావ్ జిల్లా లోని ఫరీదాబాద్ దగ్గరలోని ఖేరీ గ్రామంలో తమ కులం వాళ్ళు ఏ విధంగా బాధపడేది, హిందువులు వాళ్ళను ఏ విధంగా బాధ పెట్టేదీ వివరించాడు. అందు వల్ల ఈ విషయాన్ని విచారణ చేయటానికి ఫరీదాబాద్‌కు మార్చి 24 ఉదయం చేరుకున్నాను. దాని విచారణ ఫలితాలు ఈ విధంగా ఉన్నాయిః

"మార్చి 5న గోర్థీ అనే చమార్ కులస్తుని కూతురు వివాహం జరిగింది. అతని ఆర్థిక స్థితి బాగా ఉన్నందు పై కులాల వాళ్ళు చేసే మాదిరిగా అతిథి మర్యాదలు చేశాడు. అంతేగాక పెండ్లిలో తన కూతురుకు మూడు బంగారు నగలు కూడా ఇచ్చాడు. ఈ విషయం తెలిసిన జాట్ కులస్తులంతా సమావేశమై దీన్ని గురించి చర్చించి ఈలాంటి సంఘటనలు 'పెద్ద కులంవారిని అవమాన పరిచేటట్లు' అనీ, వారు తమతో సమానంగా ఉండాలని ప్రయత్నిస్తున్నారని భావించారు. మార్చి20వ తారీఖు ఉదయాన్నే జాట్‌లు అందరూ గుమికూడి చమార్‌లపై దాడి చేయడానికి నిర్ణయించుకున్నారు. ఆసమయంలోనే రోజూ మాదిరిగా చమార్ కులానికి చెందిన స్త్రీలు, బాల బాలికలు పని కొరకు ఫరీదాబాద్ వెళుతున్నారు. అలా వారు బయటికి వెళ్ళారో లేదో జాట్లు వాళ్ళపై దాడి జరిపి వాళ్ళ చేతులు, నడుములు విరిగేటట్లు బాదారు. స్త్రీలపై చెప్పులు విసిరారు. అంతే గాక వాళ్ళ సామాన్లు కూడా దోచుకున్నారు. ఆ సమయంలో ఒక ముస్లిం వ్యక్తి ఆదారిన వెళ్లుతుండగా జాట్లు అతన్ని పట్టుకుని అతని వద్దనున్న బంగారపు చెవి పోగులను మరియు 28 రూపాయలను దోచుకున్నారు. మార్చి 22వ తారీఖున కొందరు జాట్‌లు చమార్‌ల పొలాలపై పడి, వెయ్యి రూపాయల విలువైన పంటను సర్వనాశనం చేసారు. ఆ సమయంలో కోరీ కుమారుడైన నాన్వా పొలంలో పని చేస్తుండగా అతన్ని కూడా బాగా కొట్టారు. మార్చి 22వ తారీఖున మరోసారి జాట్‌లు గుంపుగా కర్రలు, కత్తులు, దివిటీలతో దాడి జరిపి చామర్‌ల ఇండ్లను తగుల బెట్టేందుకు కిరసనాయిల్ తీసికొని పోయారు. కాని ఆ రోజు తిరిగి వచ్చారు. మార్చి 23న అర్ధరాత్రివేళ ఇదివరకు చెప్పిన పెండ్లయిన అమ్మాయి తాత ఇల్లు తగుల బెట్టారు. ఇంట్లో చెప్పులు తయారు చేయటానికి సిద్ధంగా ఉన్న 90 రూపాయల విలువ గల తోళ్ళు మరియు ఇతర సామానులు కాలిబూడిదయ్యాయి. ఇప్పుడు పరిస్థితి ఏమిటంటే జాట్లు ఊరిని చుట్టుముట్టి ఉన్నారు. చమార్‌లు ఎవరూ బయటికి వెళ్లకుండా చేసారు. బనియాలు కూడా జాట్‌లకు భయపడి ఎవరికీ నిత్యావసర వస్తువుల్ని విక్రయించలేదు. అందువల్ల చమార్‌లు, వాళ్ళ పశువులూ మూడు రోజులుగా ఉపవాసాలున్నారు".

ఇప్పుడు పేర్కొనేది ఇటీవల జరిగిన సంఘటన: ఇది మలబార్ లో జరిగింది. చిరకాల్ తాలూకాలోని చెరుకున్‌లో 1945 జూన్ 5న శ్రీ కె.కన్నన్, యం.యల్.ఏ అధ్యక్షతన మొదటి చిరకాల్ తాలూకా మహాసభ తీర్మానాల ద్వారా ఈ క్రింది వివరాలు తెలిసాయి.:

"ఈ మహాసభ మలబార్ హరిజనులపై హిందువులు, ముస్లింలు, మరియు క్రైస్తవులు జరుపుచున్న అమానుషమైన దాడులను ప్రభుత్వమూ ప్రజలూ వెంటనే పట్టించుకోవాలని కోరుతుంది. ముఖ్యంగా పొన్నాణి తాలూకాలో నున్న నట్టిన్ ఫిర్కాలోని హరిజనులు బంగారపు నగలు ధరించినందుకు, శుభ్రమైన బట్టలు ధరించి, గొడుగులు ఉపయోగిస్తున్నందుకు ప్రతిదినం వారిపై దాడులు జరుపుతున్నారు. ఎన్నో దాడులు జరిగాయి. అందులో ఒక హరిజన పెండ్లి వారిపై దాడి జరిపి పురుషుల చొక్కాలను, స్త్రీల చీరలనూ బలవంతంగా ఊడదీయించారు. 1945 మే 27న వదనప్పిల్లై గ్రామంలో హరిజన విద్యార్థిని నిర్దాక్షిణ్యంగా కొట్టారు. ఈ నాటి సమావేశం ప్రగతి శీల 'తియా' యువతను అభినందించడమేకాక, వారికి అన్ని విధాల నాయకత్వం వహిస్తున్న శ్రీయుతులు సి.యస్. గోపాలన్, యం.యస్.శంకరనారాయణ మరియు పి.సి రామకృష్ణ వైదరును అభినందిస్తుంది. అంతే కాక వారు చేసే పనులు, ముఖ్యంగా హరిజనుల ఎడల చూపే వివక్షతను ఎత్తి చూపడం, తగిన సమయాల్లో హరిజనులకు సహాయాన్ని అందించకపోవడం పై స్థానిక అధికారులకు నిరసన తెలియజేయటంలో వీరు చేస్తున్న కృషిని సమావేశం ప్రశంసించింది.

"పైన చెప్పబడిన అన్ని కేసుల్లో హరిజనులకు పోలీసులనుంచి రక్షణ గాని న్యాయంగాని జరగడం లేదని ఈ మహాసభ ప్రకటిస్తోంది. కొన్ని సందర్భాలలో హరిజనులు సాక్ష్యం చెప్పడానికి ముందుకు వచ్చినపుడు వాళ్లను పోలీసులే నిర్దాక్షిణ్యంగా కొట్టిన సంఘటనలు కూడా వున్నాయి. దీన్ని ఇలా వదిలేస్తే మలబార్‌లో కుల వ్యవస్థను, ఆర్థికపరమైన దోపిడిని ఎదుర్కొనేందుకు ప్రయత్నిస్తూ ఈ సమావేశం భారత ప్రభుత్వానికి, గౌరవనీయులైన బి.ఆర్.అంబేద్కర్‌గారికి మరియు జ్ఞానవంతులైన ప్రజలకూ, హరిజనులు స్వతంత్ర పౌరులుగా, పీడనలేకుండా జీవించేటట్లు చూడాలనీ, ఎప్పుడైనా వారు అన్యాయానికి గురై పాలకుల దగ్గరకు వస్తే వాళ్లను రక్షించాలనీ విజ్ఞాపన చేస్తోంది."

# X

అస్పృశ్యులకు తగిన స్థోమత ఉన్నా పుష్టికరమైన ఆహారం తినకూడదు. ఈ విధంగా వారి స్థాయికి మించిన పద్ధతిలో జీవించడం కూడా పెద్ద నేరం,.

1928 ఫిబ్రవరి 26న 'ప్రతాప్' పత్రికలో ఈ సంఘటన వెలువడింది.

"జోధ్‌పూర్ రాష్ట్రంలోని చందయాల్‌లో మీరు ఇంకా హరిజనులకు హల్వా తినే హక్కు లేదనుకునే మనుషుల్ని చూడవచ్చు. అస్పృశ్యులైన సరగారోలు(Saragaroes) కొంత కాలం క్రితం ఇద్దరు ముగ్గురు బాలికల వివాహ సందర్భంగా పెండ్లి విందుకు హల్వాను తయారు చేశారు. అందుకోసమని మైదా పిండిని ఠాకూర్ సాహెబ్ దుకాణం నుండి తెచ్చి హల్వా తయారు చేశారు. పెండ్లివారు భోజన పంక్తిలో కూర్చునే సమయానికి చాంద్వాలాకు సంబంధించిన 'కన్‌వార్ సాహెబ్' హఠాత్తుగా హల్వా తిన వద్దని సరగారోలకు ఉత్తర్వు పంపాడు. అందుకు కొందరు కాకారాయుళ్ళు రూ॥200 కన్వర్ సాహెబ్‌కు ఇస్తే హల్వా తినటానికి అనుమతి ఇప్పిస్తామని సంప్రదింపులు జరిపారు. అందుకు సరగారోలు కోపోద్రిక్తులై డబ్బు చెల్లించడానికి తిరస్కరించారు."

## XI

పెండ్లి ఊరేగింపు గ్రామంలోని అన్ని ముఖ్య మార్గాల ద్వారా వెళ్ళడం అందరు హిందువుల హక్కు. ఈ విధమైన హక్కును ఉపయోగించుకొనేవారే సమాజంలో గౌరవం కలిగిన వారుగా పరిగణింపడతారు. కాని అస్పృశ్యులకు మాత్రం అటువంటి హక్కు లేదు. అయినప్పటికీ అంటరాని వారు, పెండ్లి ఊరేగింపు ముఖ్యమైన మార్గాల ద్వారా వెళ్ళే హక్కును సాధించడానికి, సమాజంలో తమ స్థాయిని నిలబెట్టుకొనుటకు ప్రయత్నిస్తూనే ఉన్నారు. ఈ క్రింది సంఘటన ద్వారా హిందువులు ఈ విషయంలో ఏ విధంగా వ్యవహరించారో తెలుస్తుంది.

1927 జూలై 'ఆది-హిందూ' పత్రిక నుండి:

"1927 మే 27, బెంగుళూరు: ఏడుగురు బ్రాహ్మణులు పరియా అనే ప్రసిద్ధమైన అస్పృశ్య కులానికి చెందిన వారి ఊరేగింపుపై దాడి జరిపారు. బ్రాహ్మణులు నివసించే మాల్‌కోట రోడ్డు గుండా వెళుతున్నప్పుడు ఈ సంఘటన జరిగింది. మొదటి తరగతి మెజిస్ట్రేట్ వారికి ఒక్కొక్కరికి రూ॥ 100 జరిమానా విధించారు"

1931 అక్టోబరు 25 నాటి 'ప్రతాప్' నుండి:

"ఫర్‌వాలా జిల్లాలోని హరగాంవ్ గ్రామంలో అస్పృశ్యుల పెళ్ళికుమారుణ్ణి పల్లకీలో కూర్చోబెట్టి పెండ్లి వాళ్ళు బయలుదేరడానికి సిద్ధపడుతుండగా హిందువులు ఆవార్త విని, పెద్ద గుంపుగా వచ్చి పెండ్లి వారిని కొట్టారు. వాళ్లని తీవ్రమైన చలిలో 24 గంటలు అన్నంలేకుండా నిలిపివేశారు. పెండ్లి వారి పట్ల హిందువులు చాలా అమానుషంగా ప్రవర్తించారు. అస్పృశ్యులు ఆ పరిస్థితుల నుండి పోలీసులు వచ్చేంతవరకు బయటపడలేక పోయారు".

1931 నవంబర్ 3న లాహెూర్ నుంచి వచ్చే 'సత్యసంవాద్' పత్రికలో వెలువడినది:

"ఢిల్లీకి ఒక పెండ్లివారు పెండ్లి కుమారుణ్ణి పల్లకిలో తీసుకుపోతున్నారు. హిందువులు వారు అలా వెళ్ళటం తప్పుగా భావించారు. అది తమను అవమాన పరిచినట్లు తలచి పెండ్లివారిని రెండు రోజుల వరకు నిలిపి వేసారు. ఆ రెండు రోజులు వారికి భోజనం మరియు త్రాగేందుకు కనీసం నీరు కూడా ఇవ్వలేదు. ఆఖరికి పోలీసులు జోక్యం చేసుకొని ఆ నిర్దయులను తరిమి వేసి పెండ్లి వారిని రక్షించారు."

1938 జూన్‌లో 'జీవన్' అనే హిందూ పత్రిక ఈ విధంగా తెలియ జేసింది:

"1) సెవర గ్రామంలో గోలాలు (పూర్వ ఠాకూర్‌లు) కాంగ్రెసువాదులమని చెప్పుకుంటారు. వాళ్ళు దయా దాక్షిణ్యాలు లేకుండా బల్లాలతోనూ, కర్రలతోనూ ఆ గ్రామంలోని నిరాయుధులైన జాతవ్‌లపై దాడి జరిపారు. అందులో ఐదుగురి చేతులు, ప్రక్కటెముకలు విరిగినందున ఆస్పత్రిలో చేర్చారు. మరియు బన్ని అనే వ్యక్తి తలపగిలి స్పృహ తప్పి పడిపోయాడు. ఇదంతా జరగడానికి కారణం ఏమంటే ఒక పెండ్లి ఊరేగింపులో పెండ్లి కుమారుడు మెరుస్తున్న కిరీటాన్ని (పక్కా మొహర్) ధరించాడు. ఠాకూర్‌లు దీన్ని తప్పుగా భావించారు. పెండ్లి ఊరేగింపుపై దాడి చేయ నిర్ణయించుకున్నారు. ఠాకూర్‌ల బలం పెండ్లి వారి సమూహం కంటే తక్కువగా ఉన్నందున అప్పుడు సాహసించలేదు. అవమానపరిచి ఊరుకున్నారు

"2) ఆగ్రా జిల్లాలోని ఫటేచంద్ తాలూకాలోని డ్రొరా గ్రామంలోని మోతిరాం ఇంటికి రాంపూర్‌నుంచి పెళ్ళికుమారునికి మెరిసే కిరీటాన్ని ధరింప చేసి, మేళంతో, బాణా సంచాలను కాలుస్తూ తీసుకువచ్చారు. ఇది చూసిన సవర్ణ హిందువులు భరించలేక

మేళాన్ని, బాజా సంచాను ఆపివేయాలని అభ్యంతరం చెప్పారు.. అందుకు మోతిరాం ఎదురుతిరిగి మేం కూడా ఇతరులకంటే ఏం తీసిపోలేదని సమాధానం చెప్పాడు. అందుకు వారు మోతిరాంను పట్టుకొని కొట్టి, అతని తలపాగాలో ఉన్న 15 రూపాయలు 1 అణాను తీసికొన్నారు. పెళ్ళి ఊరేగింపుపై దాడి చేసారు.

"3) అలీఘర్ జిల్లాలోని సకిని పోలీస్ స్టేషన్ పరిధిలోని ఖుర్వ గ్రామంలో జాతవ్ ప్రేమసింగ్ ఇంటికి పెండ్లివారు వస్తుండగా సవర్ణ హిందువులు వారిని ఆటంక పరిచారు. బ్యాండ్ మేళాన్ని ఆపివేయాలని, లేని పక్షంలో వాళ్లను చంపి దోచుకుంటామని బెదిరించారు. అయినా లక్ష్యపెట్టక బ్యాండ్ వాయిద్యాలను వాయిస్తూనే వున్నారు. అందుకు హిందువులురెచ్చిపోయి, వారిపై రాళ్లను ఇటుకలను విసిరారు".

1946 మార్చి 24న 'హిందుస్థాన్ టైమ్స్'లో ఇదివరకు జరిగిన సంఘటన వంటిదే ఒకటి ప్రచురితమైంది:

"ధనూరి గ్రామంలోని ఒక శిల్పకార్ పెండ్లి వారు వరుణ్ణి పల్లకీలో కూర్చోబెట్టి మార్థింగ్‌లో వున్న పెండ్లి కుమార్తె ఇంటికి వస్తున్నారు. ఒక మనిషి మాల్ ధంగ్ పట్వారీ మనిషినని చెబుతూ వాళ్ళను వేరే దారిన వెళ్లమనీ, లేకపోతే సవర్ణ హిందువుల వల్ల ఇబ్బందులు ఎదర్కొనవలసి వస్తుందని హెచ్చరించాడు.

"దాంతో పెళ్ళివారు అడవి దారిని పట్టి వెళుతూ ఒక చోట ఆగారు. అప్పుడు 200 మంది హిందువులు వారిపై దాడి జరిపి ఆ పల్లకిని ఎత్తుకొని పోయారు.

"అందువల్ల వారు అనేక ఇబ్బందులకు గురై రెండు రోజుల తర్వాత పెండ్లి కుమార్తె ఇంటికి చేరుకోగలిగారు. మెజిస్ట్రేట్ మరియు పోలీసుల సమక్షంలో ఆ వివాహం జరిగింది. ఈ సందర్భంలో పట్వారీని పదవి నుండి తొలగించారు".

1946 జూన్24న "సివిల్ అండ్ మిలటరీ గెజెట్ ఆఫ్ లాహోర్" లో ఈ విధంగా ప్రచురితమైంది:

"రాజపుట్‌ల గుంపు గొడ్డళ్ళు, కర్రలు మరియు బల్లెములతో గ్వాలియర్ రాష్ట్రంలోని ఒక గ్రామంలో హరిజనులపై దాడి చేసి ఒకరిని చంపి, మిగిలిన నల్గురిని గాయపరిచారు.

"ఎందుకంటే కొంత కాలం నుండి హరిజనులకు, రాజ్‌పుట్‌లకు మధ్య సరైన సంబంధాలు లేవు. కారణం, గ్వాలియర్ దర్బార్‌కు వారసుడు పుట్టిన సందర్భంగా వేడుకలు జరుపుకోటానికి హరిజనులు ఊరేగింపుగా వెళ్ళినపుడు రాజ్‌పుట్లు వ్యతిరేకించారు. హరిజనులు అలాంటి ఉత్సవాలను జరుపుకునేందుకు అనర్హులని నిరాకరించారు.

"అప్పటినుండి వారి మధ్య సంబంధాలు దెబ్బతిన్నాయి.

"గడిచిన నెలలో మహారాజు, ఇతరులతో సమానమైన హక్కులు హరిజనులకు కూడా కల్పిస్తున్నామని అధికారికంగా ప్రకటన చేశాడు".

హరిజనులు హిందువుల పద్ధతుల్ని అనుకరించినా, ఏమాత్రం ఆత్మగౌరవంతోనైనా ప్రవర్తించినా వారితో హిందువులు ఎంత హింసాత్మకంగా ప్రవర్తిస్తారో చూపించే కొన్ని కేసులు ఇక్కడ ఇవ్వబడ్డాయి. ఈ క్రింది సంఘటన 'బాంబే సమాచార్' 1936 నవంబర్ 4 సంచికలో ముద్రింపబడింది.

"ఉట్టపాలెం (మలబార్) లో ఎఝువా కులానికి చెందిన 17 సంవత్సరాల శివరామన్ హిందువుల దుకాణానికి ఉప్పు తెచ్చుకోవడానికి వెళ్ళాడు. అతడు మలయాళంలో 'ఉప్పు' అడిగాడు.మలబారులో ఆచారం ప్రకారం సవర్ణ హిందువులు మాత్రమే 'ఉప్పు' అని పలకాలి. హరిజనులు "పులిచాతన్ " అని పలకాలి. అలా పలకనందుకు ఆ దుకాణదారుడు కోపగించుకుని శివరామన్‌ను బాగా కొట్టాడు.

"ఆ తీవ్రమైన దెబ్బలకు తర్వాత అతను చనిపోయాడు"

'సమత' పత్రికనుండి ఈ క్రింది సంఘటనలు స్వీకరించబడినాయి:

"1.పూనా జిల్లాలోని కతి గ్రామంలో హరిజనులు రాంరాం, నమస్కార్ అని సంబోధిస్తున్నందుకు హిందువులు వాళ్ళను హింసిస్తున్నారు. ఆచారం ప్రకారం వాళ్ళు ఆ అభివాదాలను వాడకూడదు. వాటిని అగ్రకులాలకు చెందిన వారే ఉపయోగించాలి. మహర్‌లు మొదలగు వారు 'జోహార్' లేదా 'పాయలాగూ' (నీపాదాలు స్పృశిస్తా) అని ప్రజలను సంబోధించాలి."

2. "పూనా జిల్లా 'తానూ'కు చెందిన అస్పృశ్యులు, స్పృశ్య హిందువుల వలె ప్రవర్తించడం వల్ల ఆగ్రామాన్ని వదిలి వెళ్ళవలసి వచ్చింది. కొంత మంది బావ్డా గ్రామానికి వలస వెళ్ళారు."

"3. షోలాపూర్ జిల్లా వలాపూర్ లోని మహర్‌లు అగ్రకులాల వారిని 'సాహెబ్' 'పాయలాగు' అని సంబోధించడానికి నిరాకరించినందుకు వారిని హింసించారు."

"4. జామ్‌బాద్(షోలాపూర్ జిల్లాలోని) హిందువుల సరదాల కోసం 'నాచ్ మరియు తమాషా' చేయడానికి నిరాకరించినపుడు అస్పృశ్యులను కొట్టారు. వారి గుడిసెలను పీకివేసి తగుల బెట్టారు. మరియు వారిని గ్రామం పొలిమేరలనుండి గెంటివేసారు"

"5. పూణే జిల్లాలోని బావ్డా గ్రామంలో కొంత మంది అస్పృశ్యులు తమ కులం వారికి పై కులం వారి ఎంగిళ్ళను; మృత జంతువుల మాంసాన్ని భుజించటం, అశుభ్రమైన పనులు చేయటం మానివేయాలని ఉద్బోధ చేసారు. అందుకు ఆ గ్రామ పెద్దలు మహర్‌లు ఇంతవరకు తింటున్న వాటినే తినడం వాళ్ళ ధర్మమని చెప్పారు. మహర్‌లు ప్రాచీన సనాతన ధర్మాన్ని అనుసరించకపోతే వాళ్ళను కర్రలతో కొట్టి గ్రామంనుండి బహిష్కరిస్తామని బెదిరించారు".

# XII

అస్పృశ్యులు పుట్టింది తమకు సేవ చేయడానికే అన్నట్లు హిందువులు వ్యవహరిస్తారు. సేవ చేయటం అంటరాని వారి బాధ్యత గనుక ఎప్పుడు పిలిచినా అప్పుడు వెళ్ళి సేవ చేయాలి. హిందువులు అస్పృశ్యుల చేత బలవంతంగా ఎప్పుడైనా సేవ చేయించుకోవచ్చు నమ్ముతారు. ఈ పద్ధతినే 'బెగర్' లేదా బలవంతపు చాకిరి అంటారు. ఇచ్చట కొన్ని సంఘటనల ద్వారా అస్పృశ్యులు అలాంటి పూర్వ పద్ధతులను నిరాకరించినందుకు అనుభవించిన ఫలితం ఏమిటో తెలుస్తుంది.

1938 డిసెంబర్‌లో 'జీవన్' పత్రికలో వచ్చిన వార్త:

"1938 నవంబర్29న ముత్తర జిల్లా, కొహర్ గ్రామంలోని బ్రాహ్మణులు, ఠాకూర్‌లు మరియు జాట్‌లు, గ్రామంలోని జాతవ్‌లు బెగర్‌కు నిరాకరించడంతో వారిని చిత్రహింసలకు గురి చేసారు.

"ఠాకూర్‌లు మరియు బ్రాహ్మణులు, జాతవ్‌లతో పనులు చేయించుకుంటూ వాళ్ళను బాధించేవారు. కొంత కాలం తర్వాత అలాంటి పనులు ప్రతి ఫలం ఇస్తేనే

చేయాలని నిర్ణయించుకున్నారు. ఇటీవల ఒక ఎద్దు చనిపోయినపుడు ఠాకూర్‌లు మరియు ఇతర హిందువులు దాని కళేబరాన్ని తీసివేయాలని జాతవ్‌లను బలవంతం చేసారు. అప్పుడు వాళ్ళు మేము ఆపని ప్రతిఫలం ఇస్తేనే చేస్తామన్నారు. అందుకు హిందువులు రెచ్చిపోయి జాతవ్‌లను బాధించడం మొదలు పెట్టారు. తమ పొలాలకు బహిర్భూమికి వెళ్లకుండా చేసారు. ఊడ్చేవాళ్ళను (Sweepers) వాళ్ళ బావిలో అశుద్ధాన్ని పడవేయవలసిందిగా ఆజ్ఞాపించారు. జాతవ్‌లు అలా చేయడాన్ని అడ్డగించారు. ఆ ఊడ్చేవారు జాట్‌లను, ఠాకూర్‌లను మరియు బ్రాహ్మణులను పిలిచారు. అప్పటికే దాడి జరపటానికి వారు సిద్ధంగా ఉన్నారు. వెంటనే కర్రలతో దాడి జరిపి జాతవ్‌లను గాయపరిచారు. వాళ్ళ ఇండ్లను కూడా తగుల బెట్టారు. దాని ఫలితంగా ఆ ఇండ్లు బూడిదగా మారాయి. 18 మంది జాతవ్‌లు తీవ్రంగా గాయపడ్డారు. వారి ఇంటి సామాన్లను దోచుకున్నారు. ”

అదే పత్రిక 1939 ఫిబ్రవరి సంచికలో ఇలా ప్రకటించింది.

“ఆగ్రా జిల్లాలోని కిద్వాళి తాలూకా అభయపూర్ గ్రామపు జాట్లు షెడ్యూలు కులాల్లోని బీద వారిని నిర్బంద చాకిరీ చేయమని కోరినపుడు, అందుకు కూలి అడిగితే వాళ్ళను బాగా కొట్టేవారు. కొన్ని నెలల క్రితం జాట్‌ల జాతికి చెందిన సుకి, జాతవ్‌లకు చెందిన సుఖరాం, ఘనశ్యాం మరియు హమ్కులతో పని చేయించుకొని కూలి ఇవ్వలేదు. వీరు హిందువుల దౌర్జన్యానికి తట్టుకోలేక ఆగ్రామాన్ని వదిలి వేరొక గ్రామంలో ఉన్న వారి బంధువుల వద్ద నివసిస్తున్నారు. వారి ఇంట్లో సామాన్లను, పాత్రలను జాట్‌లు దోచుకునిపోయి వాటిని ఒక ధాన్యపు కొట్లో దాచారు.”

‘సావధాన్ ’ 1945 జూన్ 3 సంచిక ఈ క్రింది సంఘటనలు తెలియజేసింది:

“మెహరాజి కోరి అనే షెడ్యూల్డు కులాల స్త్రీ మహబూబ్ ఆలం, నగర మెజిస్ట్రేట్ కోర్టులో 376,341-**A** మరియు 354 సెక్షన్‌లకింద బ్రహ్మసింగ్, సుమాన్, మరియు ఆఫ్‌తాబ్ అనే జిల్లా పోలీసు స్టేషనుకు చెందిన పోలీసులపై దావా వేసినది. ఈ కేసుకు సంబంధించిన పూర్వాపరాలు ఈ విధంగా ఉన్నాయి. 1945 మే 2 తారీఖున సాయంత్రం సుమారు 10.30 గంటలకు ఈ ముగ్గురు పోలీసులు, సుమర్, కహర్, కల్లుబీబీ కొడుకు మరియు కొంత మంది వచ్చి ఆమె ఇంటిని వెదికి ఆమెను పోలీసు స్టేషనుకు తీసికొని

వచ్చి ఒక రాత్రి అచ్చట ఉంచారు. ఉదయం పోలీసులు ఆమెను ఒక చిన్న గదిలోకి తీసికొని వెళ్ళి ఒకరి తర్వాత ఒకరు ఆమెపై అత్యాచారం జరిపారు. ఆ తర్వాత ఆమెను ఇంకొక గదిలోనికి తీసికొని వెళ్ళి ఆమె జననాంగములో బొగ్గు, కాగితాలు పెట్టి వాళ్ళ మర్మావయవమును ఆమె నోటిలో పెట్టారు. ఆమె వస్త్రాలు రక్తసిక్తమై చినిగిపోయాయి మరుసటి రోజున ఆమె తల్లి బలవంతపు చాకిరికి ఒప్పుకుని ఒక రోజంతా బేగర్ చేసినది. ఆరోజు సాయంత్రం 10 గంటలకు వారిరువురుని విడుదల చేశారు.

" మహారాజి భర్త యొక్క చిన్న తమ్ముని భార్య మురళ కూడా ఈ రకమైన ఫిర్యాదు చేసింది. ఆమె కథనం ప్రకారం ఆ పోలీసులే ఆమెను కూడా పోలీస్ స్టేషనుకు తీసుకొని వచ్చి ఆ రాత్రే ఆమెను విడుదల చేసారు. ఇంటికి వచ్చే దారిలో మాదరి తేలి అనేవాడు కుమార్ తోలా సమీపంలో పాడుబడిన ఇంటి దగ్గర తనపై అత్యాచారం చేశాడని ఆరోపించింది. శ్రీయుతులు మున్నానాల్ భూషణ్ మరియు రాం ఛోరాసే అనే అడ్వకేట్లు ఫిర్యాదీల తరపున వాదిస్తున్నారు".

1945 ఏప్రిల్ 15 నాడు క్రింది విషయం "హిందూస్థాన్ టైమ్స్"లో ప్రచురితమైంది.

"అంబాల జిల్లాలోని దూకేరి గ్రామంలోనిర్బంధ చాకిరి చేయ నిరాకరించిన హరిజనులపై రాజపుట్‌లు గుంపుగా దాడి చేసారు. ఇందులో ఒక పురుషుడు, ఒక స్త్రీ (ఇద్దరూ హరిజనులే) చంపబడ్డారు. ఇంతేగాక హరిజనులకు సంబంధించిన చాలా ఇండ్లను దగ్ధం చేసారు. కమీషనరు మరియు డిప్యూటి ఇన్స్‌పెక్టర్ జనరల్‌లకు ఈ కేసును విచారణ చేయాలని టెలిగ్రామ్‌లు పంపించబడినవి."

ఈ సంఘటనలను బట్టి హిందువులు హరిజనులపై ఎంతటి అఘాయిత్యం చేయడానికైనా వెనుకాడరని స్పష్టంగా తెలుస్తుంది. అంతేగాక ఈ పాతుకుపోయిన వ్యవస్థను రక్షించడానికి హరిజనులను చంపటానికైనా వెనుకాడరని తెలుస్తుంది.

శ్రీలాలాల జపతిరాయ్ తన "విషాద భారతము" (Unhappy India) అనే గ్రంథంలో "తల్లి భారతం" (Mother India) రాసిన మిస్ మేయో చేసిన ఆరోపణలను తిప్పికొట్టడానికి అమెరికాలోని నీగ్రో జాతులవారి బాధల్ని, వారిపై కుక్లక్స్‌క్లాన్(Ku Klux Klan) వారి అత్యాచారాల్ని సవివరంగానూ, సుదీర్ఘంగానూ వివరించి ఇలా అడిగారు:

"అయితే ఆమె అడగవలసిన ప్రశ్న ఏమిటంటే, పరియాలపట్ల అన్యాయమైన, క్రూరమైన బ్రాహ్మణుల ధోరణి అమెరికాలో నీగ్రోల పట్ల తెల్లవారి క్రూరత్వం కంటే అన్యాయమైనదా?

"శ్వేత జాతేతరులపై శ్వేతజాతివారు చేస్తున్న క్రూరత్వాలతో పోల్చితే భారతదేశంలోని కుల క్రూరత్వం ఏపాటిది?"

ఆయన కాస్త పరిశోధించి వుంటే అస్పృశ్యులపై హిందువుల అత్యాచారాలు నీగ్రోలపై అమెరికన్ల అత్యాచారాలకంటే ఏమాత్రం తీసిపోవని ఆయనకు అర్థమయ్యేది. భారతదేశంలో హరిజనులపై జరిగే అఘాయిత్యాలు బయటి ప్రపంచానికి తెలియవుకాని, అమెరికాలో జరిగేవి ప్రపంచమంతటికీ తెలుస్తుంటాయి. అందుకే అవి అంత ఘోరంగా కనబడుతున్నాయి. భారతదేశంలోని ఈ సంఘటనలు బయటి ప్రపంచానికి తెలియకపోవడానికి కారణం ప్రతి హిందువూ ఈ సత్యాన్ని గూఢంగా దాచిపెట్టి తన సిగ్గును దాచుకోవడానికి తమ శాయశక్తులా ప్రయత్నించడమే.

పాతుకుపోయిన ఈ వ్యవస్థలోని సనాతన ధర్మాలు, నియమాలు ప్రాచీనమైన గతానికి చెందినవిగా కొందరు అనుకోవచ్చు. ఇది చాలా తప్పు. ఎందుకంటే ఈ పాతుకపోయిన భావాలు ఈనాటికీ ఉన్నాయి. ఆ నియమాలు ఈనాటికీ పనిచేస్తున్నాయి. ఈ క్రింది రెండు సంఘటనలు దీనికి ప్రత్యక్ష సాక్ష్యాలు: మొదటి విషయం 1945 మార్చి 8న 'హిందుస్థాన్ టైమ్స్'లో ప్రచురించబడింది. ఉదయ్‌పూర్‌లోని విద్యాభవన్ పాఠశాల ప్రధానోపాధ్యాయుడైన కేసరి లాల్జి బొర్డియా స్వయంగా చూసి వ్రాసాడు.

"మేవార్‌లోని హరిజనులు అనేక ఇబ్బందులతో జీవిస్తున్నారు. వారికి దేవాలయంలో ప్రవేశం లేదు. మరియు బహిరంగంగా ఉన్న బావులనుండి నీరు తీసుకోగూడదు. సవర్ణ హిందువుల ఊరేగింపుల్లో కూడా పాల్గొన కూడదు. వాళ్ళ ఉత్సవరథయాత్రలు, ఉత్సవ ఊరేగింపులు వేరు వేరు మార్గాల ద్వారా వేరు వేరు తిథులలోనే (Dates) లోనే జరుపుకోవాలి. అంతేగానీ గ్రామాల మధ్య నుండి వెళ్ళకూడదు.

" బంగారు నగలు అలా వుంచి వెండి నగలు కూడా ధరించడానికి హిందువులు ఒప్పుకునేవారు కాదు. దీని పర్యవసానంగా హరిజనులు ఇనుపరేకులు, ఇత్తడి నగలతోనే తృప్తిపడవలసి వచ్చింది. పురాతనమైన ఆచారాల ప్రకారం హరిజనులు తమ పెండ్లి విందులలో వెన్న మరియు బెల్లంవాడకూడదు. భుజింపకూడదని శాసించినారు.

"పాఠశాల్లోను, బహిరంగ సమావేశాల్లోనూ హరిజన బాలురు ఇతర హిందువుల పిల్లలతో కలిసి కూర్చోకూడదు. పాఠశాలల్లో తనిఖీ జరిగినప్పుడు, తనిఖీ చేసే అధికారి ఎలాంటి అసౌకర్యానికి గురికాకుండా హరిజన బాలురను గైర్‌హాజరు కావాలని చెబుతుండేవారు.

"రాష్ట్ర ప్రభుత్వానికి ఈ విషయంలో ఒక వినతి పత్రం సమర్పించబడింది. ప్రభుత్వం సమాజంలో ఉన్న ఈ అసమానతలను స్పష్టంగా ఖండిస్తే, అస్పృశ్యతను నిర్మూలించడంలో కృషి చేస్తున్న అనధికార సంస్థల హస్తాలను మరింత బలపరిచినట్లవుతుంది".

రెండోది ప్రకటన రూపంలో వుంది. అది 'హరిజన సేవక్ సంఘ్' అధ్యక్షుడు చేసింది. మేవార్ రాష్ట్రంలోని అస్పృశ్యుల స్థితిగతులకు సంబంధించింది.

"మేవార్ హరిజన సేవక సంఘం, మేవార్ ప్రభుత్వానికి ఒక వినతి పత్రం సమర్పించింది. ఇందులో హరిజనుల వివిధ దుస్థితులు, వాటి పర్యవసానంగా వచ్చే కష్టాలను ప్రభుత్వం దృష్టికి తీసుకొని వచ్చారు. సవర్ణ హిందువుల ఆచారాలు మరియు పక్షపాత వైఖరి కారణంగా హరిజనుల పౌరహక్కులు ఏ విధంగా తక్కువ జేయబడేదీ ఈ వినతి పత్రంలో పేర్కొనబడింది.

"కొన్ని అన్యాయ పద్ధతులు ఇంకా ఎలా అమలులో ఉన్నదీ, వాటిని నిర్మూలించడానికి ప్రభుత్వం ఏ విధమైన చర్యలు తీసుకోలేదో వాటిని నేను వరుసగా చెబుతాను.

1. హరిజనులు ఏ వస్త్రాలు ధరించాలో నిర్ణయించుకునే స్వాతంత్ర్యంలేదు. బట్టకుట్టించుకునేందుకు పాత పద్ధతులనే పాటించాలి, కానీ వారి అభిరుచులు మరియు ఇష్టాలమేరకు బట్ట కుట్టించుకునే వీలులేదు.

2. పెండ్లి విందులలో వారికిష్టమైన పదార్థాలను ఎన్నిక చేసుకునేందుకు వీల్లేదు మరియు వాళ్ళు డబ్బులు చెల్లించికొన్న ఖరీదైన వస్త్రాలను ఉపయోగించకూడదు.

3. గ్రామంలో హరిజనులు గుఱ్ఱపుస్వారీ చేయకూడదు.

4. ప్రభుత్వ వాహనాల్లో కూర్చునేందుకు అనుమతించరు.

5. మత సంబంధమైన ఉత్సవాల్లో వారి దేవతా విగ్రహాలను నిర్ణీతమైన మార్గాల గుండా మాత్రమే ఊరేగింపులు తీయాలి.

6. వారు హిందువుల బావి నీళ్ళు తీసుకునే వీలులేదు. దేవాలయాల్లోకి ప్రవేశం నిషేధం".

రచయిత ఇంకా కొన్ని చేర్చి ఈ క్రింది విషయాలను పేర్కొన్నాడు.

"మూడు సంవత్సరాలక్రితం థక్కర్‌బాబాతో కల్సి మొత్తం రాష్ట్రమంతా ప్రయాణించి హరిజనుల స్థితిగతులను చూచి వాటిని సంస్కరించాలని ప్రభుత్వానికి ప్రజలకూ విన్నవించాను. పైన చెప్పిన వినతి పత్రంతో పాటు నాకందిన ఇతర నివేదికల ఆధారంగా పరిశీలించాను. కొన్ని సంవత్సరాలనుండి వాళ్ళ స్థితి గతులలో ఎలాంటి మార్పులేదు. ఇది వరకు ఎలా వున్నారో అదే విధంగా ఉన్నారు.

"ఇది చాలా హృదయ విదారకమైంది. ఎందుకనగా కాలం గడచిపోతుంది కాని జరిగేది ఏమి లేదు. అందుకు ఫలితంగా అనాదిగా వస్తున్న దురాచారాలు, వాటి పద్ధతుల్లో ఏమాత్రం మార్పు రాలేదు. ఈ విధమైన కుటిలత్వం నిరకుశత్వానికి, అన్యాయానికి గురి చేస్తుంది. ఇంత అంత అని చెప్పరాని హాని కలిగిస్తుంది. సామాన్య మానవుల విషయం ఎలా వున్నా 20వ శతాబ్దంలోని ప్రభుత్వాలు ఈ విషయంలో బాధ్యత కలిగి వుండాలి".

ఈ సమాచార తేదీలు చాలా ముఖ్యం. అవి 1945వ సంవత్సరంలో జరిగినవి. పాతుకపోయిన ఈ హిందూ వ్యవస్థ ప్రాచీన కాలానికి చెందిందని ఎవరూ అనరు. వాస్తవమేమిటంటే క్రొత్త అంచనాల ప్రకారం భారతదేశంలో పాతుకుపోయిన హిందూ సాంప్రదాయాలు, బ్రిటిష్ పాలనలో అంతమైనాయని అర్థం చేసుకో వీల్లేదు. రాబోయే అధ్యాయాలు అవే. పాతుకపోయిన హిందూపద్ధతులు బ్రిటిష్ ఇండియాలో ఇంకా చక్కగా జీవించివున్నాయనే చెబుతాయి.

1950 ఆగష్టు 31న "టైమ్స్ ఆఫ్ ఇండియా" దినపత్రికలో ఈ క్రింది విషయం ప్రచురింపబడింది.

" ఈ క్రింది వాస్తవాలు అలహాబాద్ హైకోర్టులోని కేసుకు సంబంధించినవి. గ్రామాల్లో ఉన్న తక్కువ కులాలవారి సాంఘిక, ఆర్థిక పరిస్థితుల్ని తెలియజేసేవి.

"చిరంజి చాకలి కులానికి చెందిన వ్యక్తి. ఇటా జిల్లాలోని సర్రస్ గ్రామం నుండి మిలటరీ ఉద్యోగానికి వెళ్ళాడు. నాలుగు లేదా ఐదు సంవత్సరాలు ఆ గ్రామానికి రాలేదు.

ఈ మధ్యనే జరిగిన యుద్ధం నుండి బయటపడి, విడుదలైన తర్వాత తన గ్రామానికి వచ్చి ఉంటున్నాడు. గ్రామంలో తన వృత్తిని మానివేసాడు. బట్టలు ఉతకడం మానివేయడమే కాక తాను మిలటరీ దుస్తులను ధరించి గ్రామంలో సంచరిస్తూ ఉన్నాడు. మరియు సర్రస్ గ్రామంలోని జమిందార్లకు సంబంధించినవారి వస్త్రాలను కూడా శుభ్రం చేయడానికి నిరాకరించాడు. అందుకు గ్రామ వాసులందరు నిరసన వ్యక్త పరిచారు.

"1947 డిసెంబర్ 31న చాకలి తన బట్టలు శుభ్రం చేసుకుంటున్నప్పుడు నలుగురు గ్రామస్థులు- వారిలో రాజు గారి సేవకులు కూడా ఉన్నారు- వాళ్ళు అతని దగ్గరకు వచ్చి తమ బట్టలను కూడా శుభ్రంచేయమన్నారు. అందుకతడు నిరాకరించాడు. అప్పుడు వారు చిరంజీని రాజు ఇంటికి తీసుకొనివచ్చి బాగా కొట్టారు. అతని తల్లి మరియు చెల్లి కూడా వచ్చి అతన్ని విడుదల చేయవలసినందిగా బ్రతిమిలాడారు. వారు వాళ్ళను కూడా కొట్టారు.

"వాళ్ళు చిరంజీని ఒంటరిగా ఉన్న రాంసింగ్ ఆధ్వర్యంలో వదలివెళ్ళిపోయారు. రాంసింగ్‌ను చెంపదెబ్బ వేసి చిరంజి పారిపోయాడని అభియోగం తెచ్చారు. అప్పుడు రాంసింగ్ మరియు రాజు సేవకులు అతన్ని ఇంటివరకు వెంటాడారు. అతడు తలదాచుకున్న ఇంటి దగ్గరకు వెళ్ళి తలుపులు తీయమని కోరారు. అతడు ఎంతకూ తలుపులు తీయకపోవడంతో వాళ్ళు ఆ ఇంటికి నిప్పంటించారు. దాంతో పాటు చుట్టుప్రక్కల ఇళ్ళు కూడా కాలిబూడిదైనాయి. ఆ చాకలి ఈ విషయాన్ని పోలీసులకు ఫిర్యాదు చేశాడు. అయినావారు అతణ్ణి నమ్మలేదు. అతడు అబద్ధం చెబుతున్నాడనుకొని అతని పై నేరం మోపాలనుకున్నారు. నిందితులు ఒక్కొక్కరికి మూడు సంవత్సరాల జైలు శిక్ష విధించబడింది. తర్వాత హైకోర్టు ఆ శిక్షను ధృవపర్చింది.

1950 ఆగష్టు 31న ఈ క్రింది సంఘటనలు 'ఇండియన్ న్యూస్ క్రానికల్' (Indian News Chronicle) లో వచ్చినాయి:

"పెప్సులో హరిజనుల పట్ల అమానుష ప్రవర్తనం -దళితల వర్గాల లీగు ప్రభుత్వానికి సమర్పించిన వినతి పత్రం:

"1950 ఆగష్టు. పాటియాలాలో ఏం చేసినా కోపం తెచ్చుకోని వెనుకబడిన తరగతుల వారిపై అమానుషమైన ప్రవర్తనం, వారి స్త్రీ జనం పై అమానుషమైన అవమానాలు, వారి భూములనుండి ఉద్వాసనం, తప్పులేకుండా రోజుల తరబడి మట్టి ఇండ్లలో హరిజనులను, వారి పశువులను బంధించడం అనేది ఒక సుదీర్ఘమైన కథ. వాళ్ళ బాధల ఆర్తనాదాలు ఇంకా ప్రతిధ్వనిస్తూనే వున్నాయి". ఇంకా ఆ వినతి పత్రంలోని వివరాలు ఈ విధంగా వున్నాయి.

"పెప్సు గ్రామంలో పోలీసుల చొరవవల్ల నేరాలు తగ్గుతున్నప్పటికీ వెనుకబడిన తరగతులలోని కొన్ని వర్గాలవారికి సామాజిక అరాజక శక్తులవల్ల రక్షణ లేకుండా పోయింది. ఈ తరగతులవారు ఆర్థికంగా వెనుకబడిన వారు కావడంవల్ల తమ సమస్యలను పరిష్కరించుకోలేకపోతున్నారు. అధికారులు కూడా ఆపదల్లో ఆదుకునేవారుకాదు" ఈ సమాజంలో వారింకా అదే విధంగా ఉన్న విషయం ప్రస్తావిస్తూ పెప్సు హరిజనులు ఎంత అమానుషత్వానికి గురి కాబడినారో మరో ఉదంతాన్ని ఉదహరించడం జరిగింది.

" చెర్నాల జిల్లాలోని కటుగ్రామంలో చాద్‌సింగ్ అనే హరిజనుడు ఉన్నత కులానికి చెందిన జమీందార్ బావిలోని నీళ్ళు త్రాగినందుకు, ముఖానికి నల్లరంగు పూసి గాడిదపై కూర్చోబెట్టి ఊరంతా ఊరేగించారు. స్వతంత్ర భారతదేశంలో మారుతున్న వాతావరణంలో పెప్సులోని హరిజనులు మాత్రం పెద్దకులాల అసాధారణమైన దమన చర్యలకు గురౌతున్నారు.

"ప్రాంతీయ దళిత వర్గ సమితి (The provincial depressed class league) హరిజనుల సమస్యలను ఎప్పటికప్పుడు పరిష్కరించాలని, దీనికై తగిన సదుపాయాలు కల్గించడానికి జిల్లా మరియు కేంద్ర స్థాయిలో ప్రత్యేక సంఘాలను ఏర్పాటు చేయాలని, వీటికి తగినన్ని అధికారాలు ఇవ్వాలని సూచించింది.

"ముగింపులో లీగ్, రాష్ట్ర ప్రభుత్వాన్ని ఇలా కోరింది. ఈ సందర్భంలో అఖిల భారత చట్టాన్ని గురించిన ఆలోచన జరుపుతూనే, రాష్ట్ర ప్రభుత్వం తాత్కాలికంగానైనా పరిస్థితి ఇంకా దిగజారిపోకుండా గ్రామాల్లో హరిజనులకు సమాన హక్కుల్ని కల్పించవచ్చు".

అనువాదం: **డా॥ దేవమాణిక్యం**

# చట్టరాహిత్యమెలా న్యాయ సమ్మతమవుతుంది?

*(ఈ వ్యాసం శ్రీ ఎస్.ఎస్. రెగే అందజేసినది. దీని పేరు గత అధ్యాయం పేరును పోలి ఉండడం వల్లనూ, ఇది దానిలోని వాదనకు కొనసాగింపుగా ఉన్నందువల్లనూ దీన్ని ఇక్కడ చేర్చడమైనది. సంపాదకులు)*

ఇంతవరకూ జరిగిన చర్చ వల్ల రెండు విషయాలు స్పష్టమయ్యాయి.

ఒకటిః స్పృశ్యులకూ, అస్పృశ్యులకూ మధ్య గల స్పష్టమైన విభజన

రెండుః ఈ రెండు వర్ణాల మధ్య గల తీవ్ర వైషమ్యం.

భారత దేశంలోని ప్రతి గ్రామం, స్పృశ్యుల నివాసాలు, అస్పృశ్యుల నివాసాలనే రెండు భాగాలుగా వుంది. భౌగోళికంగా ఇరువురూ వేరుగా ఉండడమే కాక, వారి మధ్యన ఎప్పుడూ చెప్పుకోదగినంత దూరం ఉంటుంది. సాన్నిహిత్యం గాని, సామీప్యం గాని ఎంత మాత్రమూ సాధ్యం కాదు. అస్పృశ్యుల వాడలకు "మహర్వాడా", "మాంగ్వాడా", "చమ్‌రోటి", "భాట్‌ఖానా" వంటి ప్రత్యేకమైన పేర్లుంటాయి. రెవిన్యూ, పోస్టలు వ్యవహారాల వంటి వాటికి మాత్రమే సూత్రపరంగా (De-jure) అస్పృశ్యుల నివాసాలు గ్రామంలో భాగాలుగా ఎంచబడతాయి. కానీ వాస్తవాల పరంగా (De-facto) అవి గ్రామం నుంచి వేరుగా ఉంటాయి. సవర్ణ హిందువులు గ్రామం గురించి మాట్లాడేటప్పుడు కేవలం తాముండే ప్రాంతమే గ్రామంగా పరిగణిస్తారు. అదే విధంగా స్పృశ్యులు, అస్పృశ్యులు రెండు విభిన్న సమూహాలు. వారి మధ్యన ఏ సామ్యమూ లేదు. వారు ఒకే ప్రజ కారు. ఇది మనం గుర్తుంచుకోవలసిన మొదటి విషయం.

ఈ రెండు సమూహాలూ వాస్తవమైన అస్థిత్వాలు. వాటిలోని వ్యక్తులెవరూ వాటి పరిధిని దాటి తప్పించుకోలేరు. ముందు చెప్పినట్లు, ఒక అమెరికన్‌గాని, ఒక యూరోపియన్ గానీ ఎన్నో రకాల సమూహాలకు చెంది వున్నప్పటికీ అతడు వాటిలో "చేరడం" జరుగుతుంది కాని పుట్టడం వల్ల కాదు. అతనొక కుటుంబంలోనే పుట్టినా తనకు ఇష్టమైతే తప్ప జీవితాంతమూ అందులో వుండడు. తన వృత్తిని, నివాసాన్ని, జీవిత భాగస్వామిని,

రాజకీయ పార్టీని తానే ఎంచుకుంటాడు. తాను చేసిన పనులకు తప్ప ఇతరుల పనులకు సాధారణంగా బాధ్యత వహించడు. ఈ విధంగా తన సంబంధ బాంధవ్యాలను తన కొరకు తానే స్వయంగా నిర్ణయించుకుంటాడు. అందువల్ల అతన్ని నిజమైన అర్థంలో ఒక "వ్యక్తి" గా పరిగణించవచ్చు. ఈ రకంగా చూసినప్పుడు అస్పృశ్యులూ, స్పృశ్యులూ ఎవరూ వ్యక్తులు కారు. ఎందుకంటే వీరి సంబంధ బాంధవ్యాలన్నీ దాదాపుగా వారు పుట్టిన కులాన్ని బట్టి ముందే నిర్ధారించబడి వుంటాయి. ఒక మనిషి చేపట్టే వృత్తి, నివాసం, పూజించే దేవతలు, రాజకీయాలు అన్నీ అతను ఏ సమూహంలో పుట్టాడనే దాన్ని బట్టి నిర్ణయమవుతుంది. స్పృశ్యులూ, అస్పృశ్యులూ ఒకరినొకరు కలుసుకున్నప్పుడు సాటి మనుషులు గానో, తోటి వ్యక్తులు గానో కాక రెండు విభిన్న సమూహాల సభ్యులో, రెండు దేశాల పౌరులో కలుసుకున్నట్టుగా ప్రవర్తిస్తారు.

ఒకే గ్రామంలో నివసించే స్పృశ్యులకూ, అస్పృశ్యులకూ మధ్యగల పరస్పర సంబంధాల పై దీని ప్రభావం ఎంతగానో ఉంటుంది. ఈ సంబంధం ఆదిమ సమాజాల్లో ఒక కుదురుకూ (Clan) మరొక కుదురుకూ మధ్యన ఉండే సంబంధాలను పోలి వుంటుంది. ఆదిమ సమాజాల్లో ఒక కుదురులో సభ్యునిగా వుండే వారికే హక్కులుంటాయి కాని బయటి వారికి వుండవు. ఒక బయటి వ్యక్తి ఆ కుదురులోని వారికి అతిథిగా మర్యాదలు పొందవచ్చును గాని అతను తన కుదురులో తప్ప ఇతరుల నుంచి "న్యాయాన్ని" డిమాండు చేయలేడు. ఒక కుదురుతో మరొక దానికి ఉండే లావాదేవీలు యుద్ధానికో, ఒడంబడికకో సంబంధించనవి కావచ్చు గాని న్యాయానికి సంబంధించినవి కావు. ఏ కుదురులోనూ సభ్యుడు కాని వ్యక్తి "చట్ట బాహ్యుడు" (Out law) అవుతాడు. అందుకే ఈ సమాజాల్లో సిద్ధాంత పరంగా చూసినా, వాస్తవంలో చూసినా ఒక బయటి వ్యక్తి పట్ల చట్ట విరుద్ధంగా గాని, అన్యాయంగా కాని ప్రవర్తించడం న్యాయ సమ్మతమే అవుతుంది. స్పృశ్యులలో ఏ సముదాయానికి చెందకపోవడం వల్ల అస్పృశ్యుడు బయటి వ్యక్తిగా లేక ఆగంతకుడిగా (Stranger) భావించబడతాడు. అతను స్వజాతీయుడు కాలేడు. అతడు చట్ట బాహ్యుడు. అతనికి న్యాయాన్నికోరే అవకాశం లేదు. స్పృశ్యులు ఆమోదించగల ఏ హక్కునూ అతడు కోరలేడు.

ఇక గమనించవలసిన మూడవ విషయమేమంటే, స్పృశ్యులకూ, అస్పృశ్యులకూ మధ్య గల సంబంధం స్థిరంగా నిర్ధారితమైంది. ఈ సంబంధంలో అస్పృశ్యుల స్థానం నీచమైనది, స్పృశ్యుల స్థానం ఉన్నతమైనది. అస్పృశ్యుల నిమ్నతమ హోదాను ఒక సామాజిక ప్రవర్తనా నియమావళిగా వ్యవస్థీకృతం చేయడం జరిగింది. ఈ నియమావళికి అస్పృశ్యులు బద్ధులై వుండాలని కట్టడి చేయబడింది. ఆ నియమావళి ఏమిటో ఇంతకు ముందే స్పష్టం చేశాను. దీనికి కట్టుబడి వుండాలని ఇప్పటి అస్పృశ్యులు భావించడం లేదు. స్పృశ్యులతో తమ సంబంధాన్ని సమ్మతితో కూడిన ఒక ఒప్పందం (Contract) ప్రాతిపదికన నిర్ధారించుకోవాలని అస్పృశ్యుల అభిలాష. కానీ స్పృశ్యులు మాత్రం, తాము విధించిన కట్టుబాట్ల లక్ష్మణ రేఖను దాటి అస్పృశ్యులు బైటికి రాకూడదనీ, పైకి ఎదగకూడదనీ కోరుకుంటున్నారు. ఈ విధంగా, శాశ్వతంగా నిర్ధారితమైపోయాయని స్పృశ్యులు భావించే సంబంధాలను పునర్నిర్ధారించుకునే ప్రయత్నంలో స్పృశ్యులూ, అస్పృశ్యులూ ఘర్షణ పడుతున్నారు. ఈ ఘర్షణకు కేంద్రకం వీరిరువురి మధ్య సంబంధాలు పరస్పర సమ్మతి ఆధారంగా వుండాలా, లేక హోదాను బట్టి, యధాతధంగా వుండాలా ? - అనే ప్రశ్న.

ఈ ప్రశ్న మరికొన్ని ఆసక్తికరమైన ప్రశ్నల్ని లేవనెత్తుతుంది. అవిః అస్పృశ్యులింత నిమ్నాతినిమ్నమైన స్థానానికి ఎలా వచ్చారు? హిందువులెందుకు అస్పృశ్యుల పట్ల ద్వేషాన్నీ, ఏహ్యభావాన్ని పెంచుకున్నారు? అస్పృశ్యుల్ని అణచి వేయడంలో హిందువులు ఇంతటి అరాచకత్వానికీ, చట్ట రాహిత్యానికీ పాల్పడుతూ, వాటిని న్యాయసమ్మతమైనవిగా ఎలా భావిస్తున్నారు?

ఈ ప్రశ్నలకు సంతృప్తికరమైన సమాధానాలకోసం మనం హిందువుల న్యాయశాస్త్రం దగ్గరకు వెళ్ళాలి. హిందూ న్యాయశాస్త్ర నియమాల పరిచయం లేకుండా పై ప్రశ్నలకు జవాబులివ్వడం అసాధ్యం. అయితే ఇందుకోసం హిందూ న్యాయ శాస్త్రాలన్నిటినీ, వాటి శాఖోపశాఖల్నీ పూర్తిగా చూడనవసరం లేదు. హిందూ న్యాయశాస్త్రాల్లోని వ్యష్టి ధర్మానికి (Law of persons) సంబంధించిన భాగాల్ని చూస్తే సరిపోతుంది. మామూలు భాషలో చెప్పాలంటే హిందూ న్యాయ శాస్త్రాల్లో వ్యక్తుల హోదాల్లోని తారతమ్యాలను బట్టి సంక్రమించే హక్కులు, విధులు, స్తోమత వంటి వాటికి సంబంధించిన విషయాలను తెలుసుకుంటే చాలు.

హిందూ న్యాయశాస్త్రంలోని వ్యష్టిధర్మానికి సంబంధించిన నియమాలు హిందువులు ధర్మశాస్త్ర కారులుగా ఆమోదించిన మనువు, యాజ్ఞవల్క్యుడు, నారదుడు, విష్ణువు, కాత్యాయనుడు వంటి వారి గ్రంథాల నుండి తీసుకోవడం జరిగింది. అయితే వీరు పేర్కొన్న నియమాల్ని విడివిడిగా చూస్తే తప్ప హిందువుల వ్యష్టిధర్మం వెనకవున్న మూల సూత్రాలు అర్థం కావు. వీటిని ఒక క్రమ పద్ధతిలో చూసినప్పుడే అవి అర్థం అవుతాయి. అందుకే ఈ సూత్రాలను కొన్ని శీర్షికల క్రింద విడగొట్టడం జరిగింది. ఈ సూత్రాలను వివిధ భాగాలు గల ఒక సంహితగా అమర్చి ఇందులో ఒక్కొక్క భాగంలోనూ ఒక నిర్దిష్ట విషయానికి సంబంధించిన నియమాలు ఉండేటట్లుగా పొందుపరచడం జరిగింది.

## వివిధ వర్గాలు: వాటి పుట్టుక, వాటి విధులూ

1. ఇది (విశ్వం) అంధకారమయంగా, అగోచరంగా, ఆనవాలు లేకుండా, హేతువుకు అందకుండా, అవగాహనకు అశక్యంగా, దీర్ఘనిద్రలో మునిగి వుండేది.(మను : 1.5)

2. అప్పుడు దివ్యాత్మ యొక్క స్వయంభూశక్తి అవ్యక్త రూపం నుంచి వ్యక్తమై క్రమంగా ఈ పంచమహాభూతాలనూ, ఇతరములనూ వ్యక్తం చేస్తూ అంధకారాన్ని అంతం చేస్తూ నిర్నిరోధకమైన సృజన శక్తితో అంతరించాడు.(మను : 1.6)

3. లోక సౌభాగ్యం కోసం ఆయన (సృష్టికర్త) బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులను వరుసగా తన ముఖం, బాహువులు, ఊరువులు, పాదముల నుండి ఉద్భవింప జేశాడు. (మను : 1.31)

4. దివ్య తేజోమూర్తియైన భగవంతుడు విశ్వ కళ్యాణం కోసం తన ముఖం, బాహువులు, ఊరువులు, పాదములనుండి పుట్టిన వారికి వేరు వేరు విధులను మరియు వృత్తులను విధించాడు. (మను : 1.87)

5. బ్రాహ్మణుడు వేదాధ్యయన బోధనలు, యజ్ఞయాగ నిర్వహణ ని స్వపర శ్రేయోనిమిత్తమై (ఇచ్చిపుచ్చుకునే) దానధర్మ విధులను నిర్దేశించాడు. (మను : 1.88)

6. క్షత్రియుడు ప్రజారక్షణం, దానధర్మాలు, యజ్ఞయాగాదులు నిర్వర్తించడం,వేదాధ్యయ:

చేయ్యడం, ఐహిక సుఖాలకు దాసుడుకాకుండా ఉండటం చేయాలని ఆదేశించాడు. (మను : 1.89)

7. వైశ్యుడు పశుపోషణ, యజ్ఞయాగాలు (Sacrifices), దానధర్మాలు, వేదాధ్యయనం, వర్తకం, అప్పులు ఇవ్వడం, సేద్యమూ చేయాలి. (మను : 1.90)

8. భగవంతుడు శూద్రులకు ఒకేపని (వృత్తి)ని నిర్దేశించాడు. అది ఈ (ఇతర) మూడు కులాలను వినయంగా సేవించడం. (మను : 1.91)

9. విద్యార్థిని, శిక్షార్థిని (Apprentice), కూలిసేవకుల్ని, ఉద్యోగిని వీరందరినీ శ్రామికులు (పనివాండ్రు) గా భావించాలి. ఇంట్లో పుట్టిన ఇతరులు బానిసలు. (నారద : 5.3)

10. ధర్మ శాస్త్ర ప్రకారం పరిచారకులు (Attendants) ఉన్నట్లు ఋషులు గుర్తించారు. వీరిలో పైన పేర్కొన్న నాలుగు రకాలపని వారూ వున్నారు. బానిసలు ఐదోరకం పనివాళ్ళు. వీరిలో మళ్ళీ పదిహేను వర్గాలున్నాయి. (నారద : 5.2)

11. యజమాని ఇంట్లో పుట్టినవాడు, కొనబడినవాడు, (బహుమతిగా) పొందబడిన వాడు, వారసత్వంగా సంక్రమించినవాడు, కరువు కాటకాలప్పుడు పోషణపొందినవాడు తమ (చట్టబద్ధమైన) యజమానిచే కుదవ ఉంచబడిన వాడు. (నారద : 5.26)

12. భారీ ఋణం నుండి విముక్తుడైనవాడు, యుద్ధ ఖైదీ, పందెం ఓడినవాడు, నేను 'నీవాణ్ణి' అని ప్రకటించుకొన్నవాడు, దీక్షవదిలిన సాధువు, నిర్ణీత కాలం కొరకుబానిసగా వున్నవాడు. (నారద : 5.27)

13. పోషణకై బానిసగా మారినవాడు, బానిసస్త్రీతో సంబంధం ఉన్న కారణంగా బానిసగా మారినవాడు, తనను తానే అమ్ముకున్నవాడు. 'ధర్మశాస్త్ర రీత్యా వీరే పదిహేను రకాల బానిసలు. (నారద : 5.28)

14. పై వారిలో మొదటి నాలుగు రకాల బానిసల్ని వారి యజమానులు ఇష్టపడితేనే తప్ప విముక్తి చేసే వీలు లేదు. వారి బానిసత్వం వంశపారంపరికమైనది. (నారద : 5.29)

15. వీరందరికీ పరాధీనత అనేది సాధారణం. ఒక్కొక్క వర్గానికి ఉండే స్థానం గాని,

ఆదాయంగాని వారివారి కులాలపైనా, వృత్తులపైనా ఆధారపడి వుంటుందని ఋషులు ప్రకటించారు. (నారద : 5.4)

## చట్టం ముందు సమానత్వం

1. ఇద్దరు వ్యక్తులు పరస్పరం దూషించుకొన్నప్పుడు ఆ ఇద్దరు వ్యక్తుల కులాలు సమానమైతే వారికిచ్చే శిక్షలు సరిసమానంగా వుండాలి. అందులో ఒకరు తక్కువ కులంవాడైతే అతనికిచ్చే శిక్ష రెండింతలుగానూ, ఎక్కువ వాడైతే సాధారణంగా యిచ్చే శిక్షలో సగం గాను వుండాలని నిర్ణయించారు. (బృహస్పతి : 20.5)

2. కులంలోనూ, గుణంలోనూ సమానులైన ఇద్దరు వ్యక్తులు పరస్పరం దూషించుకుంటే న్యాయశాస్త్ర రీత్యా వారికిచ్చే శిక్ష పదమూడున్నర పణాలు. (బృహ : 20.6)

3. బ్రాహ్మణుడు క్షత్రియుల్ని దూషిస్తే అర్ధనూరు (యాభై) పణాలు శిక్ష, వైశ్యుల్ని దూషిస్తే యాభైలో సగం (ఇరవై ఐదు) పణాలు, శూద్రుణ్ని దూషిస్తే పన్నెండు పణాలు శిక్షగా విధించాలి. (బృహ : 20.7)

4. ఈ శిక్ష గుణవంతుడైన నిరపరాధుడైన శూద్రుణ్ణి దూషించినపుడు మాత్రమే వర్తిస్తుంది. గుణహీనుడైన శూద్రుణ్ణి దూషించిన బ్రాహ్మణునికి ఏ నేరమూ ఆపాదించబడదు. (బృహ : 20.8)

5. క్షత్రియుణ్ణి తీవ్రంగా అధిక్షేపించిన వైశ్యునికి వంద (పణాలు) జరిమానా విధించాలి. వైశ్యుణ్ణి ఆక్షేపించిన క్షత్రియుడు అందులో సగం మొత్తం జరిమానాగా చెల్లించాలి. (బృహ : 20.9)

6. శూద్రుణ్ణి తీవ్రంగా అధిక్షేపించినందుకు క్షత్రియుడికి వేసే జుల్మానా ఇరవై పణాలు. వైశ్యుణ్ణి అదే విధంగా చేస్తే అందుకు రెండింతల జరిమానా సవ్యమైంది. (బృహ : 20.10)

7. శూద్రుడు వైశ్య నిందకు పాల్పడితే కనిష్ఠమైన జరిమానా క్షత్రియుణ్ణి దూషిస్తే మధ్యరకం జరిమానా, బ్రాహ్మణుణ్ణి దూషిస్తే గరిష్ఠ తమమైన జరిమానా చెల్లించేటట్లు నిర్బంధించవలెను. (బృహ : 20.11)

8. క్షత్రియుడు బ్రాహ్మణుణ్ణి అపఖ్యాతి పాలు జేసినిచో వంద (పణాలు), వైశ్యుడు అలా చేస్తే నూటయాభై నుండి రెండు వందల పణాలు జుల్మానా చెల్లించాలి. శూద్రుడు

అలాంటి పని చేస్తే దెబ్బల వంటి శారీరక శిక్ష పొందవలసిందే. (మను : 8.267)

9. క్షత్రియుణ్ణి అపఖ్యాతి పాల్జేసిన బ్రాహ్మణునికి యాభై (పణాలు)శిక్ష, వైశ్యుణ్ణి అలా చేస్తే ఇరవై అయిదు, శూద్రుని అలా చేస్తే పన్నెండు (పణాల) శిక్ష విధించాలి. (మను : 8.268)

10. విపరీతమైన దూషణతో ద్విజుణ్ణి అవమానించిన శూద్రుని నాలుక కోసి వేయాలి. ఎందుకంటే అతడు నీచ జన్ముడు. (మను : 8.270)

11. ద్విజుడి కులాన్ని, పేరును అమర్యాదగా ఉచ్చరించిన శూద్రుని నోట్లో పదివేళ్ళ పొడగున్న ఇనుప మేకును ఎర్రగా కాల్చి దూర్చాలి. (మను : 8.271)

12. గర్వంతో బ్రాహ్మణులకు ధర్మాన్ని గురించి బోధించే శూద్రుని చెవుల్లోనూ, నోట్లోనూ మరిగే తైలాన్ని రాజు పోయించాలి. (మను : 8.272)

13. బ్రాహ్మణుడు, క్షత్రియుడు పరస్పరం దూషించుకుంటే విజ్ఞత కలిగిన (రాజు) బ్రాహ్మణునికి కనిష్ఠ దండనను, క్షత్రియునికి మధ్య స్థాయి దండన విధించాలి. (మను : 8.276)

14. (మూడు) ఉన్నత కులాల వారిని నీచకులజుడు ఏ అవయవంతోనైతే గాయ పరుస్తాడో దాన్ని ఖండించి వేయాలి. ఇది మనువు ప్రబోధం. (మను : 8.279)

15. చేయి చేసుకోవడానికి గాని, కొట్టడానికి గాని ప్రయత్నించిన నీచకులజుని హస్తాన్ని నరికి వేయాలి. ఎవరైతే క్రోధావేశంతో తంతాడో అతని కాలు నరికి వేయాలి. (మను:8.280)

16. నీచకులజుడు ఉత్తమ కులజునితో పాటు ఒకే ఆసనం పై ఆసీనుడయ్యే ప్రయత్నం చేసినపుడు తక్కువ కులస్తుని పిరుదులపై వాతలు పెట్టి దేశ బహిష్కరణ చేయించాలి. లేకపోతే రాజు వాని పిరుదులపై కత్తివేట్లు పెట్టించాలి. (మను : 8.281)

17. అతడొకవేళ గర్వంతో పై వారిపై ఉమ్మివేస్తే రాజు అతని రెండు పెదవుల్ని కోయించాలి. ఒకవేళ వారిపై మూత్రం పోస్తే అతని పురుషాంగాన్ని, అతని ముందు అపాన వాయువు వదిలితే అతని మలద్వారాన్ని కోయించాలి. (మను : 8.282)

18. అతడొకవేళ ఉన్నతుని జుట్టు పట్టుకుంటే అతని హస్తాల్ని (రాజు) నిస్సంకోచంగా ఖండించాలి. అదే విధంగా అతని కాళ్ళు పట్టి ఈడిస్తే అతని గడ్డం, మెడ లేదా వృషణాల్ని కత్తిరించాలి. (మను : 2.283)

## వివిధ వర్గాల హోదా, గౌరవమర్యాదల స్థానం

1. మానవుడు (కింది కంటే) శరీరంలో ఊర్ధ్వభాగం (కటినుండి) నాభి పై భాగంలో శుచి కలిగి ఉంటాడు. అందుకే స్వయంభువు తన శరీరంలో అతినిర్మలమూ, స్వచ్ఛమూ అయిన (భాగం) తన ముఖం అని తెలిపాడు. (మను : 1.92)

2. అతని ముఖం నుండి జన్మించడం వల్ల, ముందుగా పుట్టిన వాడవటం వల్లను, వేదాలను కలిగి ఉండటం వల్ల యావత్ సృష్టికి అధిపతియై ఉండే హక్కు బ్రాహ్మణునిదే.

3. దేవతలకు, పితృదేవులకు సమర్పించిన వస్తే యథావిధిగా అందాలని ప్రపంచం నశించకుండా ఉండాలని సంకల్పించి నియమనిష్ఠుడై స్వయంభువు అతన్ని తన ముఖం నుండి తొలుత పుట్టించాడు. (మను : 1.94)

4. ఎవరి ముఖాల నుండైతే దేవతలు నిత్యమూ హోమప్రదమైన ఇష్టాన్నాన్ని, పితృదేవతలు మృతుల పిండ తర్పణాల్ని ఆరగిస్తారో అతన్ని మించిందీ చరాచర సృష్టిలో ఏముంది? (మను : 1.95)

5. సృష్టిలో పరమ శ్రేష్ఠమైనవి ప్రాణులు, ప్రాణికోటిలో పరమోత్కృష్టమైనవి బుద్ధిజీవులు, బుద్ధిజీవుల్లో మానవజాతి సర్వోత్కృష్టమైనదైతే మానవుల్లో సర్వోత్కృష్టులు బ్రాహ్మణులు. (మను : 1.96)

6. బ్రాహ్మణుడు అందరికంటే ఉన్నతంగా జన్మించి సకల సృష్టికి అధినాయకుడుగా ఉంటాడు. (మను : 1.99)

7. ఈ సృష్టిలో సమస్తం బ్రాహ్మణుని సొత్తే. తన సర్వోత్కృష్టమైన జన్మ కారణంగా బ్రాహ్మణుడన్నింటికి అర్హుడే. (మను : 1.100)

8. అగ్ని యజ్ఞంలో ఉపయోగించినా, ఉపయోగించకపోయినా దివ్యమైనట్లే

బ్రాహ్మణుడు అజ్ఞానియైనా, జ్ఞానియైనా సదా దివ్యమూర్తి. (మను : 9.317)

9. బ్రాహ్మణులు ఎంత నీచవృత్తిలో వున్నప్పటికీ వారు దివ్యాత్ములు కావడం చేత వారి యెడ సకల గౌరవ మర్యాదల్ని చూపించాలి. (మను : 9.319)

10. కాని, తండ్రి తన పుత్రుని నామకరణ మహోత్సవాన్ని దశమ దివసాన కాని, ద్వాదశ దివసానగాని, ఒక శుభ చంద్ర మాస దివసాన గాని, ఒక శుభ ముహూర్తానగాని, శుభ నక్షత్రంలో జరుపుగాక లేక జరిపించు గాక! (మను 2.30)

11. బ్రాహ్మణ నామంలోని ప్రప్రథమ భాగం పవిత్ర సూచక మైనదిగా నుండుగాక, క్షత్రియ నామం శక్తి సూచకంగానూ, వైశ్యనామం ధన సూచకంగానూ, శూద్రనామం తిరస్కరణీయంగా నుండుగాక! (మను : 2.31)

12. బ్రాహ్మణ నామంలోని ద్వితీయార్ధం శుభ సూచకమైందిగానూ, క్షత్రియుడిది రక్షణ సూచకంగానూ, శూద్రుడిది సేవా సూచకంగానూ ఉండుగాక! (మను : 2.32)

13. శూద్రులు పాలించే దేశంలో గాని, అధర్మపరులుండే రాజ్యంలోగాని, సనాతన ధర్మవిరోధులతోనూ, నీచకులస్థులతో కూడిన రాజ్యంలోనూ బ్రాహ్మణులుండ: పోవుదురుగాక! (మను : 4.61)

14. రాజు తాను స్వయంగా న్యాయం నిర్ణయం చేయలేనపుడు శాస్త్ర కోవిదుడైన బ్రాహ్మణోత్తముని అందుకు వినియోగించాలి. (కాత్యాయన : 63)

15. ఇందుకు సరియైన బ్రాహ్మణోత్తముడు లభించనపుడు ధర్మ శాస్త్ర పారంగతుడైన క్షత్రియుని గాని, వైశ్యుడినిగాని వినియోగించవచ్చు గాని శూద్రునికి న్యాయనిర్ణేతగా వ్యవహరించే అవకాశం ఏ మాత్రం ఇవ్వరాదు. (కాత్యా : 67)

16. అన్యులు (న్యాయనిర్ణేతలుగా) చేసిన తీర్పు ధర్మ సమ్మతమైనప్పటికీ, అది రాజోద్యోగులు చేసినప్పటికీ దానిని అక్రమమైనదిగానే భావించాలి. (కాత్యా : 68)

17. జన్మతః బ్రాహ్మణుడైన వాడైనా బ్రాహ్మణుడనని చెప్పుకొని చెలామణీ అయ్యేవాడైనా (అతని జాతి సందేహాస్పదమైనప్పటికి) రాజాభీష్టం మేరకు ధర్మసూక్ష్మాల్ని వివరణ చేయవచ్చుగాని ఏ పరిస్థితుల్లోనూ శూద్రుడాకార్యం చేయరాదు. (మను : 8.20)

18. శూద్రుడు న్యాయనిర్ణేతగా వున్నా చూస్తూ ఊరుకున్న రాజు రాజ్యం, ఊబిలో కూరుకుపోయిన గోవువలె పతనమై పోతుంది. (మను : 8.21)

19. ధర్మం తెలిసిన బ్రాహ్మణుడు ఏ నేరాన్నీ రాజు దృష్టికి తీసుకుపోనవసరం లేదు. అతడు తన స్వశక్తితోనే తనకు నష్టం చేసిన వారిని శిక్షించగలడు. (మను : 11.31)

20. బ్రాహ్మణుని శక్తి రాజు శక్తి కంటే ఉన్నతం. అందుకే అతడు తనను గాయపరచిన శత్రువుల్ని తన స్వీయ శక్తితోనే దండింపగలడు. (మను : 11.32)

21. బ్రాహ్మణుడు (సృష్టి) కర్తయని, దండనాధికారియని, గురుదేవుడని, సృష్టిలోని యావత్తుకూ ప్రదాత (Benefactor) అని ఘోషించబడింది. (అందుకే) అతనితో ఎవ్వరూ అప్రియంగాగాని, పరుషంగాగాని మాట్లాడరాదు. (మను : 11.35)

# వర్గాల మధ్య అంతస్సంబంధాలు

## I

1. చాతుర్వర్ణాల మధ్య విలోమక్రమంలో బానిసత్వం ఉండాలని ప్రకటించబడలేదు. (నారద : 5.39)

2. క్రింది మూడు వర్ణాల వారు బానిసలు కావచ్చు గాని బ్రాహ్మణుడెప్పుడూ బానిసకానేరడు. (క్రింది) మూడు వర్ణాల మధ్య బానిసత్వం వారి ప్రత్యక్ష క్రమంలో వుంటుంది కానీ విలోమక్రమంలో కాదు. ఉన్నత వర్ణాల వారిని క్రింది వర్ణం వారు బానిసలుగా వుంచుకో వీలు లేదు శూద్రుడు మాత్రం ఏ వర్ణానికి చెందిన వాడికైనా బానిసకావచ్చు. వైశ్యుడు మూడు ఉన్నత వర్ణాల్లో ఎవ్వరికైనా బానిస కావచ్చు. క్షత్రియుడు బ్రాహ్మణునికి గాని క్షత్రియునికి గాని బానిసగా ఉండవచ్చు తప్ప వైశ్య, శూద్రులకు బానిసగా ఉండటం సమ్మతం కాదు. (కాత్యా : 715,716)

3. బ్రాహ్మణుడు కూడా మరొక బ్రాహ్మణుణ్ణి ఏ పరిస్థితుల్లోనూ బానిసగా చేసుకోగూడదు. క్షత్రియ, వైశ్య, శూద్రులు సవర్ణులకు కొన్ని సందర్భాల్లో దాస్యం చెయ్యవచ్చు. బ్రాహ్మణునితో ఏ పరిస్థితిలోనూ బానిస చేసే పనిని చేయించరాదు. (కాత్యా : 717,718)

# II

4. ద్విజపురుషుల ప్రథమ వివాహానికి తత్సమాన కులస్త్రీలనే వధువులుగా చేసుకోవాలిగాని అదనపు వివాహాలు చేసుకోవభిలషించినవారు ఈక్రింది కులక్రమం ప్రకారం కన్యలను ఎంచుకోవడం ఎంతో ఆమోదనీయం. (మను : 3.12)

5. శూద్ర కన్య మాత్రమే శూద్రుని భార్యగా వుండాలనీ, శూద్ర స్త్రీతో పాటు వైశ్యస్త్రీ వైశ్య పత్నులుగాను, వీరిరువురితో పాటు అతని కులానికే చెందిన స్త్రీ క్షత్రియుని పత్నులు గాను, పై ముగ్గురితో పాటు స్వకుల స్త్రీ బ్రాహ్మణ వధువులుగాను ఉండవలెనని ఘోషించబడింది. (మను : 3.13)

6. ద్విజులు స్వకుల స్త్రీలతో పాటు అన్య (నిమ్న) కుల కాంతల్ని కూడా వివాహమాడినపుడు వారి మధ్య పెద్దరికం, హెూదా, గౌరవ మర్యాదలు, వసతిసౌకర్యాలు వారి కులాలను బట్టి నిశ్చయింపబడాలి. (మను : 9.85)

7. (ద్విజ పురుషుల) భార్యలందరిలోనూ సవర్ణ పత్నికి మాత్రమే ఆమె భర్తకు కావాల్సిన వ్యక్తిగత పరిచర్యలు చేయడానికీ, అతని పవిత్ర కర్మలలో సహాయ పడటానికి అధికారం వుంది. (ఇతర కులాలకు చెందిన భార్యలకు ఆ హక్కులేదు) (మను : 9.86)

8. శూద్రుడు ఒక ద్విజస్త్రీతో సంపర్కం జరిపితే (ఈ విధంగా దండించబడాలి). ఆమె సంరక్షణలో లేని స్త్రీ అయిన పక్షంలో నేరస్థుడు తనయావదాస్థినీ, నేరక్రియతో సంబంధమున్న శరీరభాగాన్నీ కోల్పోతాడు. ఆమె సంరక్షణలో వున్న స్త్రీ అయితే తన సర్వస్వాన్నీ (అతని ప్రాణాలతో సహా) కోల్పోతాడు. (మను : 8.374)

9. రక్షిత అయిన బ్రాహ్మణ స్త్రీ తో సంపర్కం కలవైశ్యుడు సంవత్సర కాలం కారాగార శిక్ష అనుభవించిన తదనంతరం తన ఆస్థి సర్వస్వాన్నీ కోల్పోతాడు. క్షత్రియుడైతే వేయి (పణాలు) జరిమానా చెల్లించి, గార్దభ మూత్రంతో శిరోముండనపు దండనను పొందవలెను. (మను : 8.375)

10. ఎవ్వరి సంరక్షణలోను లేని బ్రాహ్మణ స్త్రీ తో అక్రమ సంబంధం పెట్టుకొన్న వైశ్యునికి ఐదువందల (పణాలు), క్షత్రియునికి వేయి (పణాలు) జరిమానా విధించబడుగాక. (మను : 8.376)

11. వైశ్యుడు సంరక్షితయైన క్షత్రియ స్త్రీపొందు చేరినా, క్షత్రియుడు సంరక్షితయైన వైశ్య స్త్రీని చేరినా వారు సంరక్షణలో లేని బ్రాహ్మణ స్త్రీ విషయంలో విధించే శిక్షకు పాత్రులౌతారు. (మను : 8.382).

12. సంరక్షణలోని క్షత్రియ, వైశ్య స్త్రీలతో సంభోగించిన బ్రాహ్మణుని వద్ద వేయి (పణాలు) జరిమానా వసూలు చేయాలి. సంరక్షితయైన శూద్ర స్త్రీతో సంభోగించిన క్షత్రియ, వైశ్యులపై వేయి (పణాలు) దండుగ వేయాలి. (మను : 8.383)

13. సంరక్షణలో లేని క్షత్రియ స్త్రీ తో సంభోగించిన వైశ్యునికి ఐదువందల (పణాలు) జరిమానా, ఇదే తప్పు చేసిన క్షత్రియునికైతే అదే మొత్తం జుల్మానా లేక గార్దభ మూత్రంతో శిరోముండనం చేయాలి. (మను : 8.384)

14. సంరక్షణలో వున్న క్షత్రియ, వైశ్య, శూద్ర స్త్రీల పొందుగోరిన బ్రాహ్మణునికి ఐదువందల (పణాలు), అతి తక్కువ (కులం) స్త్రీతో సంపర్కం చేసిన బ్రాహ్మణునికి వేయి (పణాలు) శిక్ష విధించాలి. (మను : 8.385)

## III

15. గృహస్థుడు తనంత తానుగా వచ్చిన అతిథికి నియమానుసారంగా ఆసనాన్ని, జలాన్ని, తన శక్తి మేరకు పక్వాన్నాన్ని సమర్పించుకోవాలి. (మను : 3.99)

16. బ్రాహ్మణ గృహానికి వచ్చిన క్షత్రియుడు గాని, వైశ్యుడు గాని, శూద్రుడుగాని, వ్యక్తిగత స్నేహితుడు గాని, బంధువు గాని, ఉపాధ్యాయుడుగాని అతిథులుగా భావింపబడరు. (మను : 3.110)

17. క్షత్రియు డొక వేళ బ్రాహ్మణుని గృహానికి అతిథిగా వస్తే (గృహస్థుడు) బ్రాహ్మణుల భోజనానంతరం ఆక్షత్రియునికి తన ఇష్టప్రకారం ఆహారం ఇవ్వవచ్చు. (మను : 3.111)

18. అతిథులుగా వచ్చిన వైశ్య, శూద్రులను బ్రాహ్మణుడు తన సేవకులతో కలసి భుజింపనిచ్చి తన ఔదార్యమును చూపించుకోవచ్చు. (మను : 3.112)

## విధులు, హక్కులు, రక్షణలు, అనర్హతలు

### I

1. బ్రాహ్మణ సాంగత్యాభిలాష గలిగి, తమ విధుల్ని నియమానుసారంగా ఆచరించే బ్రాహ్మణులు ఈ క్రింది క్రమంలో (పేర్కొన్న) ఆరు కర్మలను సక్రమంగా ఆచరిస్తూ జీవించాలి: (మను : 10.74)

2. బోధన, అధ్యయనం,తనకై యజ్ఞాన్ని నిర్వహించటం అనేది బ్రాహ్మణునికి నిర్దేశించిన ఆరు కర్మలు. (మను : 10.75)

3. నిర్దేశించబడిన ఆరు కర్మలలో ఇతరులకై క్రతువులు నిర్వహించుట, బోధన, ఉత్తమ పురుషుల నుండి దాన ధర్మాలు పొందుట అనేమూడు అతని జీవనోపాధికి సంబంధించినవి. (మను : 10.76)

4. క్షత్రియునికి బ్రాహ్మణుడు ఆచరించవలసిన త్రికర్మలైన బోధనా, ఇతరులకై క్రతువులు నిర్వహించుట, దానములు స్వీకరించుట నిషిద్ధములు. (మను : 10.77)

5. ఈపైవి యదావిధిగా వైశ్యునికీ, శూద్రునికీ నిషిద్ధములే అనేది రూఢీ ఐన నియమం. సృష్టికర్త (ప్రజాపతి) యైన మనువు ఆ రెండు జాతుల కవి నిర్దేశించపక పోవడమే ఇందుకు కారణం. (మను : 10.78)

6. క్షత్రియుల మనుగడకై దాడి చేయుట ఆయుధాలను ధరించుట నిర్దేశింపబడినది. వైశ్యులకు వర్తకము, పశుపోషణ, వ్యవసాయం నిర్దేశితాలు. కాని వారి విధులు దాన గుణం, వేదాధ్యయనం, యాగాల నిర్వహణం. (మను : 10.79)

7. వివిధ వృత్తులలో బ్రాహ్మణులకు వేద బోధన, క్షత్రియునికి ప్రజారక్షణ, వైశ్యునికి వర్తకములు అత్యంత అభిలషణీయములు. (మను : 10.80)

8. బ్రాహ్మణుల సేవయే శూద్రునికత్యుత్తమమైన వృత్తి. ఇది కాక వేరేది చేసినా అతనికి ఫలితం శూన్యం. (మను : 10.123)

# II

9. నిజవృత్తి ద్వారా మనుగడ సాధించుట వీలుగాని బ్రాహ్మణుడు తన క్రింది వర్ణమైన క్షత్రియునకు నిర్దేశి+ంచిన ధర్మమునను సరింపవలెను. (మను : 10.81)

10. పై రెండు విధములూ మనుటకు సాధ్యము కానప్పుడు ఏమి చేయాలి ? అన్న ప్రశ్న తలెత్తినప్పుడు అతడు (బ్రాహ్మణుడు) వైశ్య వర్ణ ధర్మమునను సరించి వ్యవసాయము, పశు పోషణము చేయవచ్చును. (మను : 10.82)

11. ఆపదలోనున్న క్షత్రియుడు వైశ్యునికనుమతించిన వృత్తులను ఆచరించి జీవము గడుపవచ్చును. (మను : 10.95)

12. నిజ ధర్మానుసారంగా జీవించలేని వైశ్యుడు తనకు నిషిద్ధమైన వాటికి దూరంగా వుంటూ శూద్ర జీవన విధానమునను సరించి వీలు కలిగిన వెంటనే దానిని త్యజించవలెను. (మను : 10.98)

13. శూద్రుడు ద్విజుల సేవ లభించనపుడు (ఆకలితో) భార్య, పిల్లలు మరణించే స్థితిలో వున్నప్పుడు హస్త కళల ద్వారా జీవించ వచ్చును. (మను : 10.99)

# III

14. క్షత్రియుడెప్పుడునూ గర్వంతో అధికులకై (బ్రాహ్మణులకై) నిర్దేశించిన జీవన విధానమునను సరింప రాదు. (మను : 10.95)

15. వైశ్యుడు వర్తక వాణిజ్యాలు, అప్పులివ్వడం, వ్యవసాయం, పశుపోషణం చేయవలెననీ, శూద్రుడు ద్విజులను సేవించవలెనని (రాజు) శాసించాలి. (మను : 8.410)

16. వైశ్య, శూద్రులు తమ వర్ణ ధర్మములు తప్పితే లోకాన్ని అలజడి పాలు చేసినట్లే అవుతుంది. కనుక వారి నిజ ధర్మములను అనుసరించే విధంగా రాజు జాగ్రత్త వహించవలెను. (మను : 8.418)

# IV

1. అంధుణ్ణి, ఉన్మత్తుణ్ణి, ఊత కర్రతో చలించే (వికలాంగుణ్ణి) డెబ్బై ఏళ్ళు నిండిన వృద్ధుణ్ణి, శ్రోత్రియులకు దాన ములిచ్చిన వాణ్ణి (రాజు) పన్ను చెల్లించేందుకు నిర్బంధించరాదు. (మను : 8.394)

2. లేమితో మరణము దాపురించినను శ్రోత్రియునిపై రాజు పన్ను విధింపరాదు. అతని రాజ్యంలోని ఏ శ్రోత్రియుడూ అన్నార్తుడై మరణించ రాదు. (మను : 7.113)

3. తన పాలనలోని సంచార జీవులైన ప్రజలు ఏదో కొంత పన్ను చెల్లించేటట్లు రాజు ఏర్పాటు చేయాలి. (మను : 7.137)

4. (రాజు) యంత్రకర్ములను (Mechanics), చేతి వృత్తుల వారిని, శరీర కష్టంతో పొట్టపోసుకునే శూద్రుల్ని, మాసానికొక రోజు తన సేవకై వినియోగించుకోవచ్చును. (మను : 7.138)

5. బ్రాహ్మణునకు మరణ దండనము బదులు (శిరో) ముండనం నిర్దేశింపబడినది ఇతర వర్ణముల వారు మరణదండనకు గురి కావలసిందే. (మను : 8.379)

6. చేయదగిన నేరములన్ని చేసినప్పటికీ (రాజు) బ్రాహ్మణునికి శిక్ష విధింపరాదు. అట్లాంటి నేరస్థునిగాని, అతని ఆస్తిని గాని, అతని శరీరమును గాని నష్టపరచకుండా దేశ బహిష్కరణ చేయాలి. (మను : 8.380)

7. బ్రాహ్మణ హత్యను మించిన పాతకము ఈ ప్రపంచంలో మరొకటి లేదు. అందుకే రాజు ఏ పరిస్థితిలోనూ బ్రాహ్మణ హత్యను గూర్చిన ఆలోచనను కూడా తన మనస్సులోకి రానివ్వరాదు. (మను : 8.381)

8. విద్యావంతుడైన బ్రాహ్మణుడు సర్వాధిపతి కావున పురాతన నిధి నిక్షేపము లభించినచో ఆసమస్తమును అతనే తీసుకొనవచ్చును. (మను : 8.37)

9. రాజుకు భూస్థాపిత నిధి-నిక్షేపాలు దొరికినపుడు అందులో సగ భాగం బ్రాహ్మణుల కిచ్చి మిగతా సగ భాగం తన కోశాగారంలో ఉంచుకోవాలి.

# జీవనవిధానం

1. ఉత్తముడై, ఉత్తములసేవ చేస్తూ, మృదు భాషణుడై, నిగర్వియై, నిరంతరము బ్రాహ్మణుల నాశ్రయించి యుండే శూద్రుడు (మరుజన్మలో) ఉత్తమకులంలో జన్మించగలడు. (మను : 9.335)

2. బ్రాహ్మణుని సేవించిన వారికి ఇష్టాదికామ్యములు సిద్ధిస్తాయి. ఇహపరసౌఖ్యము లాశించిన శూద్రుడు బ్రాహ్మణుని సేవించాలి. (మను : 10.122)

3. బ్రాహ్మణుల్ని సేవించడం ద్వారా బ్రతుకు గడవని శూద్రుడు క్షత్రియుణ్ణిగాని, సంపన్నుడైన వైశ్యుణ్ణిగాని ఆశ్రయించవచ్చు. (మను : 10.121)

4. అతనిపై ఆధారపడిన వారి సంఖ్యను, అతని శక్తినీ, శ్రమనూ గుర్తించి పనిని బట్టి(శూద్రునికి) వారి (యజమానుల) ఆస్థిలో నుండి కొంత పోషణ కల్పించాలి. (మను : 10.124)

5. మిగిలిన అన్నం, పాత వస్త్రములు, ధాన్యమందలి చెత్త, గృహంలోని పాత సామానులు వారికి (శూద్రులకు) ఇవ్వాలి. (మను : 10 .125)

6. సంపద కలిగిన శూద్రుడు బ్రాహ్మణుని బాధకు కారణమవుతాడు కావున సమర్థత ఉన్నప్పటికీ శూద్రుడు ధన సముపార్జన చేయరాదు. (మను : 10.129)

7. ధర్మానుసారం జీవించే శూద్రులు నెలకొకసారి (శిరో) ముండనం చేసుకోవాలి. వారు శుద్ధి పొందే విధానం వైశ్యులకు వలెనే ఉంటుంది. వారి ఆహారం ఆర్యులు తినగా మిగిలిన భాగం. (మను : 5.140)

ప్రాచీన ధర్మశాస్త్రకారులు ప్రస్తావించిన సమాజం రెండు భాగాలుగా విభజింపబడి ఉండేది. అందులో ఒక భాగం చాతుర్వర్ణ వ్యవస్థలోని వారితో కూడినదైతే రెండో భాగం వర్ణవ్యవస్థ పరిధిలో లేని వారితో కూడింది. మనువు వారిని బాహ్యులు (చాతుర్వర్ణ వ్యవస్థకు వెలుపల ఉన్నవారు) గా పేర్కొన్నాడు. వారినే నిమ్నకులజులుగా కూడ ప్రస్తావించడం జరిగింది. ఈ నిమ్న కులజాల పుట్టుక గురించి నేనిప్పుడు చెప్పదల్చుకోలేదు. ఒక చిన్న విషయం మాత్రం చెప్పాలి. ప్రాచీన హిందూ ధర్మశాస్త్ర కథనం ప్రకారం ఈ

నిమ్నకులాలు చాతుర్వర్ణంలోని వారి మధ్య జరిగిన అంతర్వివాహాల వల్ల జన్మించిన వారి సంతానం ద్వారా రూపొందినవే. ఇది ఎంతవరకు సరి అయినదో తర్వాత చూడవచ్చు. మనకు ఇక్కడ ముఖ్యమైన విషయం సామాజిక సంబంధాలే గాని సామాజిక వర్గాల పుట్టుక కాదు. చాతుర్వర్ణ వ్యవస్థ పరిధిలోపల ఉన్నవారికి సంబంధించిన శాసనాల్ని (Ordinances) ఇంతవరకు పేర్కొనడం జరిగింది. చాతుర్వర్ణ వ్యవస్థకు బాహ్యులైన, నిమ్నకులాల జీవనాన్ని నిర్ధారించే సూత్రాలు సంఖ్యా పరంగా కొన్ని మాత్రమే అయినప్పటికీ కావల్సిన విషయాలన్నీ వాటిలో కుదించి వున్నాయి. అంతకు మించిన నియమాలూ, శాసనాలూ అవసరం లేదు.

అవి ఈ క్రింది విధంగా వున్నాయి.

1. (బ్రహ్మ) ముఖం, బాహువులు, ఊరువులు, పాదాల నుండి జన్మించిన వారు మినహాయించి లోకం లోని ఇతర తెగల వారిని - వారు మ్లేచ్ఛ భాష మాట్లాడినా, ఆర్య భాష మాట్లాడినా - దస్యులంటారు. (మను : 10.45)

2. వీరు (ఈ తెగలు) మహావృక్షాలవద్ద శ్మశానాలవద్ద కొండలపైన, తోపులలో నివసిస్తూ (కొన్ని గుర్తులద్వారా) గుర్తించబడుతూ వృత్తులను ఆచరిస్తూ ఉందురుగాక. (మను : 10.50)

3. చండాలుల, శ్వాపకుల నివాసం గ్రామం వెలుపల ఉండాలి. వారిని అపపాత్రులను చేయాలి. కుక్కలు, గాడిదలు వారి సంపద. (మను : 10.51)

4. వారు శవాలవలె దుస్తుల్ని ధరించాలి. పగిలిన పాత్రలలో అన్నం తినాలి. నల్ల ఇనుము ఆభరణాలు ధరించాలి. వారు నిరంతరమూ ద్రిమ్మరులుగా వుండాలి. (మను : 10.52)

5. మతపరమైన విధిని నిర్వర్తించే మనిషి వీరితో సంపర్కం పెట్టుకోరాదు. వారి ఇచ్చిపుచ్చుకునే వ్యవహారాలు వారి మధ్యనే వుండాలి. వారి వివాహాలు సరి సమానులతోనే జరగాలి. (మను : 10.53)

6. వారి ఆహారాన్ని ఆర్యులు కాకుండా ఇతరులు, ఒక పగిలిన పాత్రలో ఇవ్వాలి. వారు రాత్రి వేళల్లో ఊరిలో గాని పట్టణంలోగాని తిరుగరాదు. (మను : 10.54)

7. పగలు వారు రాజాజ్ఞ మేరకు గుర్తింపు చిహ్నాలతో వారి పనులకు పోవలెను. బంధువులు లేకుండా అనాధలుగా మరణించిన శవాలను మోసుకుపోవడం నిశ్చయంగా వారి పనే. (మను : 10.55)

8. రాజాజ్ఞ మేరకు ధర్మశాస్త్రానుసారంగా నేరస్తులను వధించి వారి దుస్తులను, పక్కబట్టలను, తీసుకొనవచ్చు. (మను : 10.56)

9. తక్కువ జాతి స్త్రీతో సంబంధమున్న వ్యక్తిని వధించాలి. (విష్ణు : 5.43)

10. (చండాలలేక ఇతర నీచకులస్థుడైన) అంటరాని వాడెవరైనా ఉద్దేశ్యపూర్వకంగా తన స్పర్శ ద్వారా (ద్విజకులాలకు చెందడం వల్ల ఇతర ద్విజులచే) అంటతగిన వాడిని మైల పరిస్తే, వాడిని (ఆ అంటరాని వాడిని) వధించాలి. (విష్ణు : 5.104)

**అనువాదం : ప్రొ / జి. శ్రీనివాసరెడ్డి**

## మూడవ భాగం

# సమస్యకు మూలాలు

## అధ్యాయం – 8

# సమాంతర దృష్టాంతాలు

*1. రోములో బానిసత్వం 2. ఇంగ్లాండ్‌లో విలెనేజి.*
*3. యూదుల (Jews) దాసత్వం 3. నీగ్రోల బానిసత్వం*

సాంఘికమైన అసమానత హిందూ సమాజానికే పరిమితమైంది కాదు. అది ఇతర దేశాల్లో కూడా వుంది. సమాజాన్ని గొప్పవారు, తక్కువవారుగా; స్వతంత్రులు, అస్వతంత్రులుగా; ఆదరణీయులు, అనాదరణీయులుగా చీల్చడానికి కారణభూతమైంది. భారత దేశంలోని అస్పృశ్యుల స్థితిగతుల్ని ఇతర ప్రాచీన, ఆధునిక దేశాల్లోని నిమ్నవర్గాల వారి స్థితి గతులతో పోల్చడం ఉపయోగకరంగా ఉంటుంది. అస్పృశ్యులకు, ఇతర దేశాల్లోని అణగారిన వర్గాలకు మధ్యగల సామ్య భేదాలను తెలుసుకోవాలంటే వీరి చరిత్ర గురించి కొంతైనా తెలుసుకోవడం అవసరం. అయితే ప్రపంచంలోని అన్ని ప్రాంతాల్లో అస్పృశ్యులతో సామ్యం కలిగిన అన్ని వర్గాలను గురించి ఇక్కడ చర్చించడం అసాధ్యం, అనవసరం. కొన్ని ముఖ్యమైన ఉదంతాలను గురించి మాత్రమే ప్రస్తావిస్తే సరిపోతుంది.

హిందువులకూ, అస్పృశ్యులకూ మధ్య వుండే సంబంధాల గురించి చర్చించే సందర్భంలో వెంటనే స్ఫురించే ప్రశ్నలు మూడు. ఇవి, అంటరాని తనం ఎందువల్ల నశించిపోలేదు? అస్పృశ్యుల పట్ల జరిగే న్యాయ రాహిత్యాన్ని హిందువులు సవ్యమూ, న్యాయబద్ధమూ అయిన విషయంగా ఎందుకు భావిస్తారు? హిందువు అస్పృశ్యులతో వ్యవహరించే తీరులో అతని అంతరాత్మ పరితాపాన్ని అనుభవించకుండా ఎలా ఉండగలుగుతుంది?

అస్పృశ్యుల వలె తిరస్కారానికి గురై తక్కువగా చూడబడిన వర్గాలు గతంలో ఇతర సమాజాల్లో కూడా ఉండేవి. ఇందుకు ప్రాచీన రోమ్ ఒక ఉదాహరణ ప్రాచీన రోమ్‌లో జనాభా అయిదు వర్గాలుగా విభజింపబడి ఉండేది. అవిః

1. పాట్రిషియన్లు (Patricians) 2. ప్లెబియన్లు (Pleblans) 3. క్లైంటులు (Clients) 4. బానిసలు (Slaves) 5. స్వతంత్ర జనులు (Free men)

వీరిలో పాట్రిషియన్లు అన్ని విధాలుగానూ పూర్తి పౌరులు, పాలకవర్గం వారు మిగతావారు సేవకవర్గాలు. సేవకవర్గాల్లో ప్లెబియన్లు, క్లైంటులు యుద్ధ క్షతగాత్రులు. వీరిలో ఆత్మరక్షణకై ప్రముఖ పాట్రిషియన్ కుటుంబ యజమానుల శరణుజొచ్చి, వారికి అణిగి ఉండ సిద్ధపడిన వారే క్లైంటులు. ఈ విధంగా ప్రైవేటు వ్యక్తుల శరణు కోరడం మూలంగా తమ స్వేచ్ఛ దెబ్బ తింటుందని భావించి సార్వభౌముని ప్రత్యక్ష రక్షణ నాశ్రయించి ఉండే వారినే ప్లెబియన్లు అనేవారు. ప్లెబియన్లకు స్థిరచరాస్థులపై యాజమాన్యానికి, ఆయాజమాన్యాన్ని మార్పిడి చేసేందుకు సంబంధించిన హక్కుతో పాటు, ఆ విషయంలో కోర్టుల ద్వారా రక్షణ పొందే హక్కు కూడా ఉండేది. కాని వారికి నగర ప్రభుత్వం నిర్వహణలో మాత్రం ఎలాంటి భాగముండేది కాదు. ప్లెబియన్లు అర్థ పౌరులు (Civics sine suffragio) వారికి నగరంలోని మత వ్యవహారాల్లో భాగస్వామ్యముండేది కాదు. వారికి పాట్రిషియన్లతో వివాహ సంబంధాల ప్రసక్తి కూడా ఏ మాత్రం ఉండేది కాదు. క్లైంటులు తమ పోషణకు, సహాయానికి గాను తమ దాతలైన పాట్రిషియన్ల పైనే పూర్తిగా ఆధారపడేవారు. క్లైంటులకు వారి భార్యాపిల్లల బతుకులకూ అవసరమైన ఏర్పాట్లు పాట్రిషియన్ దాత చేయవలసి ఉండేది. పాట్రిషియన్ దాతకు, క్లైంటుకు మధ్యగల ఈ సంబంధం అనువంశికంగా ఉండి తండ్రినుండి కొడుక్కి సంక్రమించేది. వారికి పౌరసత్వపు హెూదాలేనందున కోర్టులకు పోయే అధికారం ఉండేది కాదు. న్యాయ స్థానాల ద్వారా పొందే రక్షణకై క్లైంటులు పాట్రిషియన్ల పైనే ఆధారపడేవారు. తన క్లైంటు ఏదైన కేసులలో ఇరుక్కున్నప్పుడు క్లైంటు తరపున దాతయే స్వయంగా న్యాయ స్థానంలో ప్రాతినిధ్యం వహించేవాడు.

ప్రాచీన రోమ్‌లో మిలియన్ల కొలది బానిసలుండేవారు. ఒక్కొక్క సంపన్న భూకామందు వద్ద వందల కొలది బానిసలుండేవారు. ఎక్కువమంది బానిసలు లేని

యజమానులని ఆరోజుల్లో పేదవాని కింద లెక్కించేవారు. బానిసలు కేవలం ఒకరి ఆస్థిగా వుండే వస్తువులు. చట్టం దృష్టిలో వారు పౌరులు కాకపోవడం వల్ల ఎలాంటి హక్కులు ఉండేవి కావు. దయగల యజమానులను కొందర్ని మినహాయిస్తే వారి పట్ల యజమానులెంతో అమానుషంగా ప్రవర్తించేవారు. సెనెకా మాటల్లో చెప్పాలంటే "భోజనాల సమయంలో ఒక బానిస తుమ్మినా, దగ్గినా, తాళం చెవి శబ్దం అయ్యేట్టు క్రిందపడవేసినా మాకు పెద్ద కోపం వస్తుంది. అప్పుడు సాధారణంగా చెయ్యో, కాలో, పండ్లో విరిగేట్టు తంతాం" ఒక సంపన్న రోమన్ యజమాని అజాగ్రత్తగా ప్రవర్తించిన తన బానిసల్ని లాంప్రే (Lampray) చేపలకు ఆహారంగా చెరువులోకి విసిరేవాడు. యజమానుల ఆగ్రహానికి గురియైన బానిసల్ని భూకారాగారాల్లో బంధించేవారు. వాళ్ళ కాళ్ళకు ఇనుప గొలుసులు కట్టి రోజంతా పని చేయించేవారు. కాల్చిన ఇనుప కడ్డీలతో వాతలు పెట్టేవారు. మామూలుగా బానిసలు పనిచేసే మిల్లును ఒక రోమన్ రచయిత ఇలా వర్ణించాడు. "హతవిధీ! ఎంతటి నిర్భాగ్యులు వీరు? కొరడా దెబ్బల వల్ల వాతలు తేలిన శరీరాలు, శ్రమ భారంతో వంగిన నడుములు, బోడితలలు, కాళ్ళకు బరువైన ఇనుప గొలుసులు, మంట వేడికి కందిన వాళ్ళు, పొగలవల్ల కనురెప్పలు మాడిపోయి పెంటకుప్పపై గిరాటేసిన పాడు పడ్డ వస్తువుల్లా గుండేవారు"[1]

ఒకప్పుడు ఇంగ్లాండులో కూడా సేవక వర్గాలు వుండేవి. నార్మన్ దండయాత్ర కాలంలోని ఇంగ్లీషు సమాజమెలా ఉందో తెలుసుకోవాలంటే "డూమ్స్‌డే బుక్" చూస్తే చాలు.

ఈ గ్రంథంలో విజేత విలియం (William the Conqueror) తన విజయానంతరం 1086 సంవత్సరములో ఇంగ్లాండులోని భూములపైన, వివిధ కౌల్దారీ వర్గాలపైనా నిర్వహించిన సాంఘిక సర్వే వివరాలిలావున్నాయి.

ఇందులోని వివరాల ప్రకారం ఆనాటి ఇంగ్లాండు లోని జనాభా ఈ క్రింది వర్గాలుగా విభజింపబడి ఉండేది.

| | | |
|---|---|---|
| 1. పెద్దలు | ప్రధాన కౌలుదార్లు 1,400 | |
| మరియు | | కలిసి 9,300 |
| మతగురువులు | ఆధీన కౌలుదార్లు 7,900 | |

| | | |
|---|---|---|
| 2. స్వతంత్ర కామందులు | ఫ్రీమెన్ (Freemen) 12,000 | |
| మరియు | | కలిసి 9,300 |
| యోమెన్ (Neomen) | సాక్‌మెన్ (Socmen) 7,9003 | |
| 3. అర్థ స్వతంత్రులు | విలెన్లు (villains) 169,000 | |
| మరియు | | కలిసి 259,000 |
| అస్వతంత్రులు | కొట్టర్లు మరియు బోర్డర్లు 90,000 | |
| 4 బానిసలు | | 25,000 |

ఈ విధంగా మొత్తం 3,37,000 గా ఉన్న జనాభాలో 2,84,000 మంది అస్వతంత్రులుగానో, బానిసలుగానో ఉండేవారు.

పైన పేర్కొన్న ఉదాహరణలు మతంతోగాని జాతితో గాని, నిమిత్తం లేకుండా సేవ కత్వానికి, దాస్యానికి సంబంధించిన ఉదాహరణలు. అయితే మత లేక జాతి పరమైన కారణాల వల్ల జరిగిన దాస్యానికి సంబంధించిన చారిత్రక ఉదాహరణలకు కూడా కొదవలేదు. ఇలాంటి ఉదాహరణల్లో ముఖ్యమైంది యూదులకు సంబంధించింది. ఏసుక్రీస్తు మరణానికి యూదులే కారణమనే నమ్మకంవల్ల వారిపై ఎంతో ఊచకోత జరిగింది. మధ్యయుగాల్లో దాదాపు అన్ని యూరోపియన్ నగరాల్లోనూ ఏదో ఒక మూలన ప్రత్యేకించిన పరిమిత ప్రాంతంలోనే యూదులు నివసించాలనే నిర్బంధం ఉండేది. ఈ విధంగా యూదులు నివసించే ప్రాంతాలకే ఘెట్టోలు (Ghettos) అని పేరు వచ్చింది. ఆస్ట్రేలియాలోని కోయంజా(coyanza) కౌన్సిలు క్రీ.శ. 1050వ సంవత్సరంలో చేసిన తీర్మానం ప్రకారం క్రైస్తవులెవరూ యూదులున్న ఇంట్లో నివాసముండరాదు. వారితో కలిసి తినరాదు. ఎవరైనా ఈ నిబంధనను ఉల్లంఘిస్తే వారం రోజులపాటు ప్రాయశ్చిత్త జపం చేయాలి. అలా చేయనంగీకరించని నేరస్థుడు సమాజంలో ఉన్నత వర్గానికి చెందిన వాడైతే అతణ్ణి ఏడాది పాటు వెలివేయాలి. అలగాజనం లోనివాడైతే నూరు కొరడా దెబ్బలు తినాలి. ఇదే విధంగా 1388లో ఫాలెన్షియా (Falencia) కౌన్సిలు "క్రైస్తవులెవ్వరూ కూడా యూదులకూ, మూర్‌లకూ (Moor) ఉద్దేశించిన ప్రాంతాల్లో ఉండరాదు. ఎవరైనా అలావుంటే చర్చిలో ఈ శాసనం ప్రకటించిన రెండు మాసాల్లోపు అక్కడ నుండి మకాం మార్చుకోవాలి. అలా చేయని వారిని మతపరమైన అభిశంసన

ద్వారా తొలగించాలి" అని శాసనం చేసింది. మధ్య యుగాల్లో యూదులు సమిష్టి స్నానాలు చేయాలనే నిర్బంధం ఉండేది. క్రైస్తవులు స్నానం చేసే నీళ్ళలో యూదులెవ్వరూ స్నానాలు చేయకూడదనే నిర్బంధం కూడా ఉండటం వల్ల అయిష్టంగానైనా వారు సమిష్టి స్నానాలు చేయవలసి వచ్చేది. పద్నాలుగవ శతాబ్దంలో ఆగర్సు (Augers) కు చెందిన యూదులు నగరంలోనికి పునః ప్రవేశించడానికి ఎన్నో కఠినమైన షరతులకు తల ఒగ్గవలసి వచ్చింది. అందులో ఒకటి, వారెప్పుడు కూడా మేన్ (Maine) నదిలో స్నానం చేయబోమని అంగీకరించడం. ప్రభుత్వం కూడా వారి మీద కొన్ని ప్రత్యేకమైన పన్నుల్ని విధించేది. ఈ ప్రత్యేక పన్నులు మూడు రకాలు. తలసరి (Poll tax),లావాదేవీలకై గాని ప్రత్యేక సౌకర్యాలు పొందినందుకుగాని కట్టవలసిన అపరాధరుసుములు (Fines), మరియు వసూళ్ళు (Dues) యూదులు తలసరి పన్ను చెల్లించటానికి సంబంధించిన వయోపరిమితిలో దేశాల మధ్య తేడాలున్నప్పటికీ సర్వ సాధారణంగా ఈ పన్ను చాలా చిన్న వయసు నుండే విధించబడేది. స్పెయిన్, ఇంగ్లాండు వంటి దేశాలలో 1273 సం।లో పది సంవత్సరాలు దాటిన ప్రతి యూదుని వద్ద నుంచీ ఈ పన్ను వసూలు చేయబడేది. శాంతి సమయాల్లో సైనికులకు తిండీ, వసతీ ఇచ్చే భారాన్ని యూదులపై పెట్టడం(Billeting) వారిని తరచుగా కొల్లగొట్టేందుకు ప్రభుత్వాలు వాడిన విధానం. మధ్యయుగాల్లో యూదులనుండి నిర్బంధంగా వసూలు చేసిన అపరాధ రుసుముల, దండుగల లెక్కలు తేల్చడం అసాధ్యం. ఈ అగచాట్లన్నీ చాలవన్నట్లు 1215 సంవత్సరంలో ఇన్నోసెంట్ III అనే పోపు క్రైస్తవుల నుండి యూదులను సులభంగా గుర్తించడానికి గాను యూదులందరూ తమ పై దుస్తుల మీద కనిపించేటట్లుగా వుండే బ్యాడ్జీలను ధరించాలని తీర్మానించాడు. లాటర్నన్ కౌన్సిలు కూడా యూదులందరూ బ్యాడ్జిలను ధరించాలని స్పష్టంగా నొక్కి చెప్పి వాటి సైజు, రంగు, రూపం దానిపై ఉండవలసిన న్యూనతా చిహ్నం (Degrading mark) వంటి వివరాలు మాత్రం గవర్నర్ల, రాష్ట్ర ప్రభుత్వాల చిత్త ప్రవృత్తులకు వదిలివేసింది. ఒక్కో రాష్ట్రానికి చెందిన రాష్ట్ర ప్రభుత్వాలు ఒక్కొక్క రకంగా ఈ బ్యాడ్జీని రూపొందించడం జరిగింది. బ్యాడ్జీ సైజు, రంగు, రూపం వంటి విషయాల్లో తరచూ అనేకమైన మార్పులు చేర్పులవల్ల ఆ బ్యాడ్జి నిరుపయోగమై, కొందరు యూదులు దీన్ని ధరించడం నుండి తప్పించుకునే వీలు కలిగింది. అనేక సందర్భాలలో యూదులు ఇది కన్పించకుండా దాచుకునే ప్రయత్నం చేయడం వల్ల క్లెమెంట్ VII అనే పోపు బ్యాడ్జికి

బదులుగా యూదులు పసుపు పచ్చ టోపీని లేక శిరాచ్ఛాదనను ధరించాలని నిబంధనను చేసాడు.

భారత దేశంలోని అస్పృశ్యుల స్థితిని గురించి మాట్లాడితే ఇంగ్లాండులోని కాథలిక్కులు (Catholics) గుర్తుకు వస్తారు. అక్కడి కాథలిక్కులెన్నో రకాల ఆంక్షలకూ, అశక్తతలకూ గురయ్యారు. వారిపై వున్న నిర్బంధాల జాబితా ఇది.

"1.కాథలిక్కుల పెండ్లిండ్లు కాని, కాథలిక్కు మత గురువుల ద్వారా నిర్వహించబడిన వివాహాలు కాని, ప్రస్తుత చట్ట ప్రకారం చెల్లవు. కావున దంపతుల్లో ఒకరి నొకరు ఏ కారణం చేత వదిలినా సంఘము (Parish) నుండి గాని, న్యాయస్థానాలనుండి గాని రక్షణ దొరకదు. కాథలిక్కుల వివాహాన్ని చేసిన మత గురువుకు దేశ బహిష్కరణ గాని జైలు శిక్షగాని పడవచ్చు.

2. మత గురువుల పోషణలకూ, కాథలిక్కుల పూజలకూ నిర్దేశించిన నిధులుగాని, ఆస్థులుగాని ప్రస్తుత చట్ట ప్రకారం మూఢనమ్మకాలకై వినియోగించినట్టవుతుంది. కావున ఆ నిధుల్ని స్వాధీనపరుచుకోవచ్చు. అవి ఎవరైనా దుర్మార్గుని చేతిలో పడినప్పటికీ వాటిని రాబట్టే వీలు చట్ట ప్రకారం లేదు. ఈ విధంగా కాథలిక్కుల నిధులు, ధనం అన్యాక్రాంతమైనటువంటి సంఘటనలెన్నో వున్నాయి.

3. సైన్యంలో పని చేసే కాథలిక్కులైన నావికులు, సైనికుల్ని ఆదివారాలు పండుగరోజుల్లో తమ మత పద్ధతుల ప్రకారం ప్రార్థనలు చేయకుండా నిరోధించి బలవంతంగా ప్రొటెస్టెంటు చర్చిల్లోకి పంపేవారు. ఇలాంటి దుశ్చర్యలవల్ల శత్రువు నెదుర్కొనడానికి ధైర్య సాహసాలు, దేశభక్తి కలిగిన సైనికులకు మనస్తాపం కలిగింది.

4. పదమూడవ చార్లెస్ II లేక కార్పోరేషన్ చట్టం మేరకు వారిని నగరాలకు, కార్పోరేషన్‌లకు సంబంధించిన అన్ని ఉద్యోగాలకూ అనర్హుల్ని చేసారు.

5. ఇరవై ఐదవ చార్లెస్ II లేక టెస్ట్‌యాక్ట్ అనే చట్టం ద్వారా వారిని (కాథలిక్కులను) పౌర, సైనిక ఉద్యోగాలకు అనర్హులుగా చేసారు.

6. 7వ, 8వ విలియం III , C-27, ప్రకారం రోమన్ కాథలిక్కులను ఎన్నికల్లో వోట్లు వేయకుండా చేసే వీలు కలిగించారు.

7. 30 వ చార్లెస్ II, S.2.C.I ప్రకారం రోమన్ కాథలిక్ పెద్దలు పార్లమెంటులో తమ వంశపారంపరికమైన పదవుల్ని పొందడాన్ని నిరోధించడం జరిగింది.

8. పై శాసనం మేరకు కాథలిక్కులు కామన్స్ సభలో కూర్చోవడం నిషేధించడమైనది.

9. అన్యమతస్థులైన యూదులకు కూడా అనుమతించిన మత సంస్థలకు కానుకలు సమర్పించుకునే హక్కును రోమన్ కాథలిక్కులు అనుభవించకుండా పలు చట్టాలు చేయబడినాయి.

10. నావికాదళంలో ఉన్న వారి మతావసరాలు తీర్చడానికి ఎలాంటి ఏర్పాటు చేయకపోగా వారు అధికార చర్చి యొక్క మత కాండలో పాల్గొనకపోతే యుద్ధ నిబంధనల ప్రకారం కఠిన శిక్షలకు పాత్రులవుతారు. యుద్ధ నిబంధనల్లోని ఒకటవ సెక్షన్ ప్రకారం దైవ ప్రార్థనకు, మత బోధనలకు హాజరుకాని సైనికుడు మొదటి తప్పుకు ఒక షిల్లింగు జరిమానా చెల్లించాలి. ఆ తర్వాత చేసిన ప్రతి తప్పుకూ అదనంగా ఒక షిల్లింగు చొప్పున జరిమానాకూ, చేతులకు బేడీలు వేసే శిక్షకూ గురవుతారు. యుద్ధ నిబంధనల్లోని రెండో సెక్షన్ యొక్క 5వ ప్రకరణం ప్రకారం ఉన్నతాధికారి చట్టప్రకారం ఇచ్చిన ఆజ్ఞను ఉల్లంఘిస్తే (దైవ పూజ, మత బోధకు సంబంధించి కూడా ఉన్నతాధికారి ఆజ్ఞనుల్లంఘిస్తే కోర్టు మార్షలు నిర్ణయం మేరకు మరణశిక్ష లేక అటువంటి శిక్షను విధించాలి.

11. దేశంలోని ఇతర ప్రజల వలె రోమన్ కాథలిక్కులు కూడా అధికారమతానికి (Established Religion) లేక ప్రొటెస్టెంటు చర్చికి చందాలిచ్చి సహకరించాలి. ఇది పోను వారివారి మతాధికారులను కూడా పోషించాలి. ఈ విధంగా వారు రెండు మతాల ఖర్చును భరించాలి. అయితే వారు ఈ విషయంలో ఫిర్యాదులేమి చేయకపోయినా ప్రొటెస్టెంటు మతానికి చెందిన ఆదాయాన్ని చట్టబద్ధం చేసినట్లు తమ మతాదాయాన్ని కూడా ఎందుకు చట్టబద్ధం చేయలేదని వారి బాధ.

12. ఆస్పత్రులు, కర్మాగారాలు, ఇతర ప్రజా సంస్థల్లో తమతమ మత శాఖకు చెందిన గురువుల దర్శనసేవలు కొన్ని సందర్భాలల్లో పేద రోమన్ కాథలిక్కులకు నిరాకరించబడింది. పేద రోమన్ కాథలిక్కుల పిల్లల్ని వారి తల్లి దండ్రుల కళ్ళముందే ప్రొటెస్టెంట్ల పాఠశాలల్లో బలవంతంగా చేర్చడం జరుగుతుంది.

కాథలిక్కుల వలెనే అస్పృశ్యులు కూడా ఆంక్షలవల్ల బాధలు పడుతున్నారు.

# II

*(ఈ క్రింది వ్యాసం శ్రీయస్.యస్.రేగే గారు పంపింది. ఈ వ్యాసంలో 'నీగ్రోలు - బానిసత్వం' అనే సమస్య చర్చించబడింది. అధ్యాయంలో పై సమస్య ప్రస్తావనకు వచ్చినప్పటికీ ఇంతవరకు చర్చకు రాలేదు. కావున ఈ వ్యాసాన్ని ఇక్కడ పొందుపరచడం జరిగింది. - సంపాదకుడు)*

ఆసియా, యూరపు దేశాల్లోని నాగరికుల చాకిరీకి కావలసిన నీగ్రోల పెంపకపు నారు మడిగా ఆఫ్రికా ఖండం వుండాలని రాసిపెట్టినట్టుంది. యూరోపియన్లు అమెరికాలో బానిస విధానాన్ని ప్రవేశ పెట్టడానికి చాలా ముందుగానే అరబ్బులు వారిని ఆసియా ఖండానికి దిగుమతి చేసుకున్నారు. ఇది జరిగినప్పటికీ అమెరికాలోనూ, ఇంగ్లీషు వలసల్లోనూ ఉన్న అత్యంత దయనీయమైన నీగ్రోల బానిసత్వపు చరిత్ర ముందు ఆసియాలోని నీగ్రోల బానిసత్వం గురించి మరచిపోవడం సహజంగానే జరిగింది. అమెరికాలో నీగ్రోల బానిసత్వం 16వ శతాబ్దం మొదట్లో ప్రారంభమై 19వ శతాబ్దం మధ్యవరకూ కొనసాగింది.

కొలంబస్ 1492 సం॥ బహామా దీవిలో కాలుమోపిన తర్వాత 50 సంవత్సరాలలో స్పెయిన్ దేశీయులు మెక్సికో నుండి పెరూ గుండా ఉరుగ్వే వరకు (వెస్టిండీస్‌లోని పెద్ద దీవులతో సహా) గల సువిశాల భూభాగాన్ని జయించి కొంత మేరకు ఆక్రమించుకున్నారు. పోర్చుగీసు వారు 1531లో బ్రెజిల్‌ను వలసగా చేసుకోవడం ప్రారంభించారు. క్రొత్తగా వచ్చిన పోర్చుగీసులు, స్పానియార్డులు తమ స్వాధీనంలోని భూభాగాల్లో గల అపారమైన ప్రకృతి సంపదను దోచుకోవడానికీ, గనుల్నుండి బంగారం, వెండిని తీయడానికి, అక్కడి సారవంతమైన భూముల్లో పొగాకు, నీలిమందు, చెరుకుతోటల్ని పెంచడానికి వెంటనే నడుంకట్టారు. అయితే వీరికి ఈ పనులకు అవసరమయ్యే శ్రామిక శక్తి లభించలేదు. ఈ పనులకు భారీ ఎత్తున శ్రామిక శక్తి అవసరం కాగా, కూలీ రేట్లు ఎక్కువగా ఉండటం వల్లనూ, అక్కడి వేడి వాతావరణాన్ని తట్టుకోలేక పోవడంవల్లనూ తెల్ల కార్మికులతో ఆ అవసరం తీర లేదు. తెల్లవారు కాకుండా స్థానికంగా లభించే ప్రత్యామ్నాయ శ్రామిక శక్తి అక్కడున్న స్థానిక ఇండియన్లు (రెడ్ ఇండియన్లు), కాని అప్పటికే వీరిలో అనేకులు పోర్చుగీసు, స్పెయిన్‌ల దండయాత్రలతో మరణించారు. ఇంకొందరు ఆ దండయాత్రలకు భయపడి కొండల్లోకి, అడవుల్లోకి పారిపోయారు. ఇంకా ఎవరైనా మిగిలితే వారిని బానిసలుగా చేసి

గనుల్లో పని చేయించుకున్నారు. దురాక్రమణదారులు పెట్టే హింసల వల్లా, విరామం లేకుండా గనుల్లోనూ తోటల్లోనూ చేసినశ్రమ వల్ల ఎందరో స్థానిక ఇండియన్లు రోగాలపాలయి మరణించారు.



కొలంబస్ మరణానంతరం నికోలస్ డీ ఓవండో (Nicholas De Ovando) నాయకత్వంలో తొలుత వచ్చిన స్పెయిన్ దేశీయులు ఎంతో దయామయుడని పేరుపొందిన బాత్రోలోమి డిలస్‌కసాస్ (Batrolome De las Casas) అనే మత గురువును తమ వెంట తెచ్చుకున్నారు. స్థానికులను క్రైస్తవులుగా మార్చడానికిగాను వారితో ప్రేమ పూర్వకంగా వ్యవహరించాలని స్పెయిన్ దేశపు న్యాయస్థానం లాస్‌కసాస్‌కు ఆదేశించింది. లాస్‌కసాస్ మెక్సికో ప్రథమ బిషప్పు. ఆయన హైతీలో పని చేస్తున్నప్పుడు స్పానిష్ వారు ఇండియన్‌లపై చేస్తున్న దౌర్జన్యాన్ని చూసి చలించి తన జీవితాంతం ఇంకా ప్రాణాలతో మిగిలిన స్థానికులను కాపాడటానికి ఎంతో చిత్త శుద్ధితో ప్రయత్నించాడు. కరిబియన్లుగా పిలువబడే హైతీలోని ఇండియన్లు ఎంతో సాధు స్వభావం, స్నేహ గుణం కలవారు. కొలంబస్ వారి ఉనికిని గురించి కనుగొన్నప్పుడు వారి సంఖ్య పది లక్షలకుపై చిలుకుగా ఉండేది. వారందరు వివిధ రాజ్యాల క్రింద ఉండి వారి వారి కసిక్కుల (Casiques) ద్వారా ఎంతో శాంతియుతంగా పరిపాలన చేసుకొనేవారు. కొలంబస్ తదనంతరం వచ్చిన స్పానిష్ దురాక్రమణదారుల పకడ్బందీ క్రౌర్యం వల్ల వారి సంఖ్య కేవలం అరవై వేలకు పడిపోయింది. ఈ క్రౌర్యం తప్పించుకోవడానికి ఆత్మహత్య చేసుకోవడమే ఏకైక మార్గంగా తలచి గ్రామాలకు గ్రామాలు సామూహికంగా ఆత్మహత్యలు చేసుకొన్నట్లు రికార్డులు తెలుపుతున్నాయి. లాస్‌కసాస్ ఇలాంటి ఎన్నో ఆత్మహత్యలకు ప్రత్యక్ష సాక్షి. వీటిని ఈయన తీవ్రంగా నిరసించినా ఇవేవీ పని చేయలేదు. పని చేయవు కూడా. అడవుల్ని నరకడం, భూముల్ని దున్నడం, గనుల్ని తవ్వడం వంటి పనులు యధావిధిగా నడువ వలసిందే. మరి ఇవన్నీ జరక్కుంటే దేవుడిచ్చిన రాజ్యం మానవుల స్వర్గంగా మారేదెలా? లాస్‌కసాస్ ఇదంతా గుర్తించాడు. కాని ఈ లక్ష్యం నెరవేరడానికై స్థానికులు పడాల్సిన బాధల పరంపరను ఊహించి ఆయన చాలా బాధ పడ్డాడు. ఆయనలోని ఈ ఔదార్య గుణమే ఆయన చేత నీగ్రోల దిగుమతికిగాను అనుమతి నివ్వవలసిందిగా స్పెయిన్ రాజుకు మహజరు సమర్పింప జేసింది. స్పెయిన్ ప్రభుత్వం 1511లో భారీ సంఖ్యలో నూతన ప్రపంచంలోకి నీగ్రోలను తీసుకురావాలనే ఆజ్ఞ జారీ

చేసింది. నూతన ప్రపంచాన్ని భూతల స్వర్గంగా మార్చే ఈ ఆశయం మేరకే నీగ్రో (సరుకు) లతో నిండిన ఓడలు దిగాయి. కొన్ని సంవత్సరాల పాటు స్థానికులతో నీగ్రోలు కూడా స్పెయిన్ వారి క్రింద పని చేశారు. దీనిలో స్థానికుల కంటే నీగ్రోలే దృఢకాయులని తేలింది. ఒక స్పానిష్ పయోనీర్ (అన్వేషకుని) కథనం ప్రకారం సముద్రంలో దుంగల్ని తరలించడానికి కొన్ని వందల మంది ఇండియన్లతో పాటు ముప్పై మంది నీగ్రోల్ని నియమించగా చివరికి ఆపని ముగిసే సరికి అందులో 500 మంది ఇండియన్లు చనిపోయారు. నీగ్రోలు మాత్రం కనీసం ఒక్కరు కూడా చావకపోగా పూర్వం కంటే వారింకా మెరుగయ్యారు. ఇలాంటి అనుభవాల మూలంగానే అక్కడ "నీగ్రో వాణ్ణి ఉరితీస్తే తప్ప చావడని", "అనారోగ్యం వల్ల ఏ నీగ్రోవాడూ చనిపోయిన దాఖలా లేదని" సామెతలు వాడుకలోకి వచ్చాయి. నీగ్రోలు కూడా తాము వ్యవహరించే తీరు, ప్రవర్తనల వల్ల ఇండియన్లు కంటే తామే ఎంతో మెరుగయిన పని ముట్లమనే అభిప్రాయాన్ని కలిగించారు. ఫలితంగా ఇండియన్లను వదిలి నీగ్రోలనే పనికి ఎంచుకోవడం జరిగింది. ఎందుకంటే, భగవంతుడు ఇండియన్లను దుర్బలులుగా పుట్టించి నీగ్రోల్ని దృఢశరీరుల్ని చేశాడు గనుక. మొత్తం మీద పర్యవసానంగా ఇండియన్లు బానిసత్వాన్ని తప్పించుకున్నారు. దైవభక్తుడూ, దయార్ద్ర హృదయుడూ అయిన లాస్‌కసాస్ దయవల్లనూ, దృఢ శరీరులమని వారికి వారే ఋజువు చేసుకోవడం వల్లనూ ఈ బానిసత్వపు దౌర్భాగ్యం నీగ్రోల సొంతమయింది.

"ఒక నీగ్రో నలుగురు ఇండియన్ల కంటే ఎక్కువ పని చేస్తాడు. అనే విషయం ఋజువైన తర్వాత నీగ్రో వ్యాపారం కొరకు ఒక మంచి మార్కెటు తయారయ్యింది. ఆఫ్రికా పశ్చిమ తీరంలో పోర్చుగీసు వారు ప్రారంభించిన బానిస మార్కెట్ అతి త్వరలోనే ఎంతో లాభసాటిగా మారింది. లేకపోతే కొత్త ప్రపంచంలోని అపార సంపదను వెలికి తీసేదెలా ? మనుషులతో చేసే ఈ క్రొత్త వ్యాపారం జనాన్ని ఎంతగా ఆకర్షించిందంటే అందులో తలమునకలైన యూరోపియన్లు ఈమొత్తానికి కారణమైన - తూర్పు దేశాలకు నూతన మార్గాన్ని అన్వేషించే ప్రయత్నాన్ని మరిచే పోయారు.

ఈ సరికొత్త వ్యాపారంలో వాటాల కోసం యూరపు దేశాలు పోటా పోటీలు పడ్డాయి. క్రొత్త ప్రపంచం నుండి వచ్చే సంపదపై స్పెయిన్, పోర్చుగల్ దేశాలకు గుత్తాధికారం ఇస్తూ పోపు ఆదేశంచేసాడు. అమెరికాలోని సంపదపై ఈ గుత్తాధికారం

మొత్తం యూరప్‌కే ప్రమాదమని భావించిన ఇంగ్లీషు, డచ్చి వారు దీని నెట్లాగయినా ప్రతిఘటించాలని పట్టుబట్టారు.

ఇంగ్లీషు వారు ఈ వ్యాపారం మీద పట్టు సంపాదించడంలో కృతకృత్యులయ్యారు. ఇందులో మొదటగా 1553లో ఆఫ్రికా తీరం నుడి తెచ్చిన 24 గురు నీగ్రోల్ని ఇంగ్లీషు మార్కెట్టులో గప్‌చుప్‌గా అమ్మేయడం జరిగింది. ఈ మనుష్యుల దొంగతనంలో జగజ్జెట్టీగానూ, అతి కర్కశుడుగానూచరిత్ర ప్రసిద్ధి కెక్కిన వాడు జాన్ హాకిన్స్ (John Hawkins) మహాశయుడి హస్తముంది. ఎలిజబెత్ హయాంలో ఈయన "జీసస్" అనే పేరుగల ఒక పటిష్టమైన ఓడలో ఆఫ్రికా నుండి నీగ్రోల్ని తెచ్చి స్పానిష్ కాలనీల్లో అమ్మేవాడు. స్పెయిన్ దేశపు గుత్తాధిపత్యాన్ని దెబ్బతీసే పవిత్ర లక్ష్యంతో సర్‌ఫ్రాన్సిస్ డ్రేక్ (Sir Francis Drake) హాకిన్స్‌ను అనుసరించాడు. ఈ వ్యాపారం క్రమంలో జరిగిన సముద్ర దొంగతనాలపై తలెత్తిన అంతర్జాతీయ వివాదాలు స్పానిష్ ఆర్మడా నాశనం చెందేవరకు జరిగాయి. ఈ గొడవలకు సంబంధించి గమనించాల్సిన చిత్రమైన విషయ మేమిటంటే సముద్రాల్లో నీగ్రో బానిసల్ని తస్కరించిన ప్రతి దేశం ఏమాత్రం సిగ్గూ బిడియం లేకుండా తమ దేశ పౌరులు చేసిన ఈ నిర్వాకాలు "ప్రైవేటు వ్యవహారం" కాదు! అవి ప్రభుత్వ మద్దతు ఉన్న "ప్రజా కార్యక్రమాలని" బాహాటంగా ప్రకటించాయి.

"జీసస్" పేరుగల ఓడను బానిసత్వం లోకి దింపడానికి తెచ్చే నీగ్రోల రవాణాకు వాడటంలో ఉన్న క్రూర వ్యంగ్యానికి తోడుగా ఇంకో చిత్రం ఏమంటే మే ఫ్లవర్ (May flower)లోని ప్లైమౌత్‌రాక్ (Plymouth Rock) వద్ద యాత్రిక ఫాదరీలు (Pilgrim Fathers) ఓడ దిగినపుడే వర్జీనియాలోని తొలి ఇంగ్లీషు కాలనీ వ్యవస్థాపకుల ఉపయోగానికై తెచ్చిన ఇరవై మంది నీగ్రోలు ఓడ దిగినారు.

ఈ విధంగా యాత్రిక ఫాదరీలు, నీగ్రోలు దాదాపు ఒకేసారి అమెరికా ఖండంపై కాలు మోపారు. అయితే ఫాదరీలు వచ్చింది తమ స్వేచ్ఛను కాపాడుకోవడానికైతే, నీగ్రోలు మాత్రం అది కోల్పోవడానికే వచ్చారు. చాలాకాలం వరకు అమెరికన్ వలసల్లోని జనాభాలో నీగ్రోలే అధిక సంఖ్యాకులుగా ఉండేవారు. వాస్తవంలో అమెరికా, దాని దీవుల్లోకి తొలుత వలస వచ్చింది ఆఫ్రికా నీగ్రోలే. 1800 సంవత్సరానికి పూర్వం అమెరికాకు తెచ్చిన నీగ్రోల సంఖ్య అమెరికాలోని మొత్తం యూరోపియన్ల సంఖ్యకు ఇరవై రెట్లు.

ఎందుకంటే దీర్ఘకాలిక యుద్ధాల వల్ల ఇది అనివార్యం అయింది. అప్పుడప్పుడే ఒక వెనుకబడ్డ సంస్కృతిలోంచి బయటికి వచ్చినందువల్ల అసలే తక్కువ వున్న యూరప్ జనాభా మరింత తగ్గింది. చాలాకాలం వరకు దిగుమతి యైన నీగ్రోల హోదా నిర్వచించబడలేదు. డచ్చివారు జేమ్స్ టౌన్‌లో దింపిన ఇరవై మంది నీగ్రోలపైన వెంటనే బానిస ముద్ర పడలేదు. దాదాపు వారిని మామూలు సేవకులుగానే లెక్కగట్టారు. వర్జీనియా కాలనీలో 1624, 1625 సంవత్సరాలకు చెందిన పని పట్టికల (Muster Rolls) లో నమోదైన 23 మంది నీగ్రోలు తమ వర్గపు శ్వేత జాతి వారివలెనే "సేవకులుగా" నమోదు అయ్యారు. ఆనాటి రికార్డుల ప్రకారము ఇరవై మంది నీగ్రోలు వచ్చిన 34 సంవత్సరాల తర్వాత అందులో ఒకడైన ఆంథోని జాన్సన్, జాన్ కాస్టర్ అనే తోటి నీగ్రో నుండి శాశ్వతంగా సేవలు అందాలనే విషయంలో కోర్టు కేసు గెలుచుకున్నాడు. ఈ విధంగా దాదాపు యాభై సంవత్సరాల వరకు బానిసల హోదా స్థిర పడలేదు. వీరి హోదా స్థిర పడడం కూడా చాలా నెమ్మదిగా జరిగింది.

మొదట్లో నీగ్రోలూ, శ్వేతజాతీయులనే భేదం లేకుండా అందరికీ వర్తించే చాకిరీ చట్టం (law of servitude) అనే శాసనముండేది. కొంత కాలం తర్వాత నీగ్రో జాతి సేవకులకూ శ్వేత జాతి సేవకులకూ మధ్య వ్యత్యాసం చూపడం మొదలయ్యింది. అది రాను రాను నీగ్రోల సేవకత్వం లేక జీతం లేని బానిసత్వంగా రూపాంతరం చెందింది. ఈ బానిసత్వ విధానం చట్టాల ద్వారా, ఆచారాల ద్వారా బలపడుతూ వచ్చింది. ఇలా సేవకత్వం నుండి బానిసత్వానికి వచ్చిన మార్పు రెండు ముఖ్యమైన చర్యలవల్ల జరిగింది. ఉంచుకునే ఆచారాన్ని అధికారికంగా గుర్తించడం మొదటి చర్య. ముందు చెప్పినట్లు బానిసత్వం అనేది, కేవలం రాజకీయమైన, పౌరసంబంధమైన స్వేచ్ఛను కోల్పోవడానికి మాత్రమే పరిమితం కాదు. అది స్వేచ్ఛా స్వాతంత్ర్యాన్ని శాశ్వతంగా సంపూర్ణంగా కోల్పోవడానికి సంబంధించింది. వీటిని కోల్పోవడం స్వచ్ఛందంగా గాని, బలవంతంగా గాని, ఏ రకంగానైనా జరగవచ్చు. ఈ బానిసత్వం మధ్య యుగాల్లోని వాసలేజి(Vassalage), విలెనేజి (Villeinage) ఆధునిక యుగంలోని అర్ధబానిసత్వం (Serfdom) వంటి స్థానికమైన సేవక రూపాలకంటే మౌలికంగా భిన్నమైంది కాకపోయినప్పటికీ ఇది తీవ్రతలో అన్నింటికంటే భయంకరమైంది. ప్లాంటేషన్ తోటల యజమానులు తమ క్రింద పని చేస్తున్న వారి ఉపాధి నిబంధనల్ని కఠినతరం చేయడానికై చేసిన ప్రయత్నాలు తెల్లజాతి

కార్మికుల విషయంలో విఫలం కాగా నల్లజాతి వారి విషయంలో విజయ వంతమయ్యాయి. ప్రజాభిప్రాయం కూడా నల్లవారి స్వేచ్ఛకు ప్రతికూలంగా నే వుండేది. హద్దు అదుపులు పెట్టకుండా నీగ్రోలకు స్వేచ్ఛను ఇస్తే ప్రమాదముంటుందని సాధారణ ప్రజలు నమ్మేవారు. నీగ్రోల సేవకత్వం బానిసత్వంగా మారడానికి చేసిన రెండో చర్య - తల్లి యొక్క బానిస హెూదా ఆమె పిల్లలకు సంక్రమింపజేయడం. బానిస యజమానులకు తల్లి బానిసలపై గల పెత్తనం ద్వారా వారి పిల్లల్ని కూడా శాసించడం చాలా సహజంగానే జరిగింది. యజమానులకు యావజ్జీవ సేవ చేయడానికి కట్టుబడ్డ బానిసలు వారి పిల్లల పోషణకు ఏమీ చేయడానికి వీలు లేకుండేది. వారికేమైనా కొంత మంచి జరగాలంటే అది పూర్తిగా యజమానుల దయాదాక్షిణ్యాలపై ఆధారపడి వుండేది. 'బానిస పిల్లలు కూడా బానిసలే' అనే శాసనం రావటానికి ఎంతో పూర్వమే ఒక ఆచారంగా ఈ పద్ధతి స్థిరపడింది. ఈ ఆచారానికి అధికారముద్ర అమెరికాలోని వివిధ రాష్ట్రాలలో 1662-1741 మధ్యకాలంలో పడింది.

ఈ విధంగా మొదట్లో సేవకులుగా ఉన్న నీగ్రోలు బానిసలుగా మారటం జరిగింది. అయితే ఆఫ్రికా ఖండంలో అంతకు పూర్వం కూడా బానిసత్వపు ఆచారం (ప్రాచీన కాలం నుండి) ఉండేది. బానిసలు ఈ క్రింది నాలుగు విధాలుగా తయారయ్యేవారు.1.బానిసలు పుట్టడం. 2. ఋణగ్రస్థుడైన కారణంగా అమ్మబడటం, 3. యుద్ధ ఖైదీ కావటం 4. ప్రతీకారం కొరకో ధనకాంక్ష కొరకో ఎత్తుకుపోయి అమ్మబడటం వల్ల. ఈ విధంగా నీగ్రోలకు బానిసత్వంగాని, బానిస యజమానుల ఆగడాలు గాని కొత్తేమీ కాదు. అందుకే నీగ్రోల స్వేచ్ఛను హరించి వారిని బానిసలుగా మార్చినందుకు కొందరికి వారిపట్ల పెద్దగా జాలి కలుగకపోవచ్చు. కాని నూతన ప్రపంచంలో అపరిచితులైన విదేశీ యజమానుల క్రింద చాకిరీ గాండ్లుగా మారిన నీగ్రోల దారుణ స్థితిని చూస్తే ఎవరికైనా ఆగ్రహం కలగకమానదు

నూతన ప్రపంచంలోని నీగ్రోలు ఎలాంటి బాధల్ని అనుభవించారో యూరోపియన్లుగాని, ఆసియన్లుగాని ఊహించలేరు. వీరి కష్టాలను మూడు శీర్షికల కింద వర్ణింపవచ్చు. అవి పట్టుబడ్డప్పుడులేక చేజిక్కినప్పుడు పడ్డ కష్టాలు, రవాణాలో పడ్డకష్టాల, పని చేసేప్పుడు పడ్డ కష్టాలు. మొదట్లో బానిసలుగా చేయడానికై నీగ్రోల్ని పట్టుకొనేటప్పటి కష్టాల గురించి. మొదట్లో తీర ప్రాంతాల్లో ఆకస్మికంగా మెరుపు దాడుల ద్వారా వారిని

బంధించేవారు. రాను రాను నీగ్రోలు ఇది గుర్తించి తీరానికి వచ్చే నౌకల్ని పొదలమాటు నుండి చూసి జాగ్రత్త పడేవారు. ధైర్యం చేసి కొందరు వర్తకులు లోపలి ప్రాంతాల్లోకి పోయి పట్టుకొన్నప్పటికీ, నీగ్రో వ్యాపారులు సాధారణంగా అనుభవజ్ఞులైన బానిస డీలర్ల ద్వారానే ఈ వ్యవహారం జరిపేవారు. ఈ డీలర్లకు యూరపు నుండి చౌకగా తెచ్చిన బట్టలు, పూసలు, లోహపు వస్తువులు, తుపాకులు, మద్యం వంటివి ఇచ్చి వాటికి ప్రతిగా తెగ నాయకుల దగ్గరి బానిసల్ని సేకరించే వారు. తుపాకులు, మద్యం తదితర విదేశీ వస్తువుల మోజులోపడిన నాయకులెవ్వరూ దీన్ని ఎదిరించకపోగా చిన్న చిన్న నేరాలకు కూడా తెగలోని వ్యక్తుల్ని బానిసలుగా మార్చడం ఎక్కువయింది. బానిసల కొరకు స్త్రీ, బాలల్ని తస్కరించడానికి వివిధ తెగలమధ్య యుద్ధాలు బానిస వ్యాపారం పెరగడంతో దైనందిన వ్యవహారాలుగా మారిపోయాయి.

నీగ్రోల్ని అమెరికాకు రవాణా చేసేప్పుడు వారిని పెట్టిన హింసలు తక్కువ కాదు. బానిస నీగ్రోల్ని స్త్రీలు, పురుషులు, బాలురు అందర్నీ కలిపి ఒకమందగా చేసి అందరూ చూసేటట్టుగా వారిని గొలుసులతో బంధించేవారు. మెడను అందులోకి చొరబెట్టి తాళం వేసే పద్ధతిలో ఉండే "బానిస కర్ర" తోవారిని బంధించేవారు. వర్తకులు కొన్న ఆహార దినుసులు, దంతాల వంటి ఉత్పత్తుల్ని,, మూట, ముల్లెల్ని వారి తలలపై పెట్టి నడిపించేవారు. ప్రయాణంలో ఉండే కష్టాల్ని బలహీనులు తట్టుకోలేక పోయేవారు. అనారోగ్యానికి గురైన బానిసల్ని వారి చావుకు వారిని వదిలి వేయడమో లేక చంపడమో చేసేవారు. కావున బానిసలు తరచుగా ప్రయాణం చేసే రహదారులు నీగ్రోల ఎముకలతో నిండి వుండేవి. తీరానికి చేరగానే బానిసల రవాణాకై ప్రత్యేకంగా రూపొందించిన ఓడల్లోకి వారిని తోసేవారు. ఇందులో వారు ఇద్దరేసి చొప్పున (స్త్రీ పురుషుల్ని వేరు చేసి) బానిసల చేతులకు తాళాలు వేసే వారు. ఎందరు బానిసల్ని రవాణా చేస్తే అంత లాభం వస్తుందని వారిని మెడలు కూడా తిప్పి చూడ వీలులేని విధంగా క్రిక్కిరిసిన ఓడల్లో ఎక్కించే వారు. నూట యాభై టన్నుల మోతాదుగల చిన్న ఓడలో 600 బానిసల దాకా రవాణా జరిగేది. బ్రెజిల్ వంటి దగ్గరి ప్రాంతాలకు రవాణా చేసే ఓడ ప్రయాణమైతే ఎక్కువ కాలం పట్టేది కాదు కాని వెస్టిండీస్ వంటి దూర ప్రాంతాలకు ప్రతికూల వాతావరణం వల్ల వారాల కొద్దీ ప్రయాణం కొనసాగేది. ఈ దీర్ఘ ప్రయాణాల్లో వాతావరణం ప్రశాంతంగా ఉన్నప్పుడు బానిసల్ని డెక్కులపై తీసుకువచ్చి కసరత్తుల కొరకై డ్యాన్సులు చేయించేవారు. వాతావరణం

బాగాలేనపుడు ఓడలోని బానిసల పరిస్థితి అతి దుర్భరంగా వుండేది. రోగాలు రొష్టులతో వారు సతమతమయ్యే వారు. తినలేని పరిస్థితిలో ఉన్నవారికి బలవంతంగా తినిపించడానికి, అన్నం నోట్లో కుక్కడానికి కావలసిన పరికరాలు వాడినప్పటికీ దాదాపు ఆరోవంతు బానిసలు రవాణాలోనే మృత్యువాత బడేవారు. ప్రయాణం చివర్లో వారిని పరీక్షించి అమ్మకానికి సిద్ధంగా తయారు చేసేవారు. తుపాకులు తాకిగాని, ఇతర అసౌకర్యాల వల్లగాని కలిగిన గాయాల్ని వీలయినంత వరకు కనపడకుండా చేసేవారు. అలా వీలు కాని గాయాలకు చికిత్స చేసేవారు. రేవులవద్ద ఉండే బానిస ఏజంట్లు మాత్రం ఓడదిగిన నీగ్రోల "సరుకు" చెడిపోయినాయనో, దరిద్రంగా ఉన్నాయనో", చాలా దుర్వినియోగ మయ్యాయనో, ఫిర్యాదులు చేసేవారు. చివరకు ఓడపైనో లేక బానిసల అంగట్లో వారిని వేలం వేసి గాని, బేరానికి గాని అమ్మే వారు. 18వ శతాబ్దిలో ఆరోగ్యంగా వున్న బానిస వెల 60 పౌండ్ల దాకా పెరిగింది. అనారోగ్యంగా వున్న బానిసల్ని, గాయపడి పీలగా వున్న వారిని స్త్రీలతో, పిల్లలతో కలిపి 'తుక్కు' క్రింద తక్కువ ధరకు అమ్మజూపేవారు. ఈ కష్టాలన్నీ దాటి తోటలోకి దిగిన బానిసల కొరకు ఇంకో సమస్యల పరంపర ఎదురు చూసేది. పనిలోకి కొత్తగా వచ్చిన బానిసలు కొత్తపనికి, వాతావరణానికి, తిండికి సర్దుకోలే మూడింట ఒక వంతు దాకా చనిపోయేవారు. ఈ విధంగా ప్రయాణంలోను, ప:: పరిస్థితుల కలవాటుపడే క్రమంలోను చనిపోయిన బానిసల సంఖ్యను ఉదారంగా లెక్కిస్తే బానిసగా సిద్ధమైన ప్రతి ఒక నీగ్రోకి కనీసం మరొక నీగ్రో మరణించి వుండేవాడు. ఇక మూడో విషయం - ఇదంతా తట్టుకొని బతికి బట్టకట్టిన బానిసల బ్రతుకెలా ఉండేదనేది. బానిస యజమానులకు నిరంకుశమైన ఎదురులేని హక్కులు రెండుండేవి. అవి యజమాన్యపు హక్కు, దండించే హక్కు. బానిస కామందు కుండే యాజమాన్యపు హక్కు చాలా విస్తృతమైంది. దీని ప్రకారం యజమానికి బానిసల సేవల్ని పొందే అధికారం తోపాటు వారిని అమ్మడానికి, వారసత్వంగా పుత్ర పౌత్రులకి ఇవ్వడానికి ఇతరత్రా ఇంకే విధంగానైనా తన ఇష్టం వచ్చిన రీతిలో అన్యులకివ్వడానికి హక్కుండేది. హద్దులు లేని ఈయజమాన్యపు హక్కుల వల్ల బానిస పరిస్థితి జీవంలేని ఒక వస్తువు స్థితి కంటే ఎంత మాత్రం మెరుగేమీ కాదు. నీగ్రోల్ని ఆస్తిగా భావించే ఈ హక్కు వల్ల బాకీ పడిన యజమాని అప్పుకింద బానిసల్ని పట్టుకుపోవడం జరిగేది. విముక్తులైన బానిసలను కూడా ఆబానిసల యజమాని వాళ్ళకి విముక్తినివ్వకముందు చేసిన అప్పులకింద మళ్ళీ బానిసలుగా పట్టుకుపోయేవారు.

బానిసను ఒక మనిషిగా కాక ఆస్తిగా పరిగణించే ఈ భావన వల్ల వారి చట్టపరమైన, పౌర సబంధమైన హెూదా భంగపడింది. బానిసలు ఆస్తిని సంపాదించుటకుగాని అనుభవించుటకుగాని అనర్హులు. రోమన్ చట్టం ఇందుకు భిన్నంగా బానిస ఆస్తిని కలిగివుండే వీలునిచ్చింది. ఈ విధంగా వున్న ఆస్తిని స్వంత ధనం (Peculium) అనేవారు రోమన్ బానిసల ఈ హక్కు పరిమితమైందే అయినప్పటికీ ప్రాముఖ్యత కలదిగా పేర్కోవాలి. ఎందుకంటే ఇది బానిసను ఒక ఆస్థిగానే కాక వ్యక్తిగా కూడా గుర్తించింది. చట్టం ముందు వ్యక్తికి ఉండే హెూదా లేకపోవడం వల్ల నీగ్రోలకు వ్యాపారం చేయడానికిగాని పెళ్ళి చేసుకోవడానికిగాని అర్హత ఉండేది కాదు. యజమానులకు తప్పు చేసిన బానిసల్ని శిక్షించేందుకు గాను ఇచ్చిన హక్కు నీగ్రోల విషయంలో చాలా ఘోరంగా అన్వయించారు. ఉత్తర కెరొలినా కోర్టుముందుకు 1829లో వచ్చిన ఒక కేసులో తన బానిసలను కొట్టినందుకుగాను నేరారోపణకు గురైన ఒక యజమానిని నిర్దోషిగా పేర్కొంటూ ప్రధాన న్యాయమూర్తి ఇలా చెప్పారు. "యజమానికి బానిసకుండే సంబంధాలు తండ్రీ కొడుకుల సంబంధం వంటిదని చెప్పటం సబబు కాదు. కొడుకును తీర్చిదిద్దే తండ్రీ అతనికి స్వతంత్ర పౌరునిగా బ్రతకటానికి కావలసిన శిక్షణ ఇస్తాడు. ఇందుకుగాను అతనికి నైతిక బౌద్ధికపరమైన విద్యను బోధిస్తాడు. బానిసల విషయం ఇందుకు పూర్తిగా భిన్నం. అసలు వారి విషయంలో నైతిక విషయాన్ని లేవనెత్తడం అర్థరహితం. బానిసత్వపు మూల ఉద్దేశ్యం యజమాని లాభం, హితం, ప్రజల రక్షణ. ఇంగిత జ్ఞానం లేకపోవడం వల్ల కనీసం కష్ట ఫలితాన్ని తామెలా అనుభవించాలో కూడా తెలియని పరమ మూర్ఖులు, బానిసలు అట్లాంటి వారికి పనిచేయడం అనేది సహజ సిద్ధమైన ప్రవృత్తా, లేక దాని వల్ల ఆత్మ తృప్తి కలుగుతుందా? అని నీతి గురించిన చర్చ చేసి ఏం లాభం? అట్లాంటి సేవలు చేయడానికి స్వతంత్రులుగా ఆలోచించకుండా ఇతరులు చెప్పినట్లుగా విధేయతతో నడుచుకొనేవాడు కావాలి కానీ స్వీయ ఆలోచనాపరుడుకాదు. అట్లాంటి విధేయత బానిస శరీరం మీద సంపూర్ణ అధికారం ఉంటేనే వస్తుంది కాని ఇతరత్రా కాదు. ఇందుకొరకే బానిస పూర్తిగా లొంగి ఉండాలంటే యజమానికి అతనిపై సర్వాధికారాలు నిశ్చయంగా ఉండవలసిందే."

బానిసలపై యజమానులకుండే అధికారాన్ని ఈ విధంగా అన్వయించడంతో యజమానులు చేసే 'చట్టబద్దంగా సరిదిద్దడం' వల్ల జరిగిన బానిసల మరణాలు చట్టం దృష్టిలో మాత్రం దురదృష్టకరమైన చావులుగానో లేక ఆకస్మిక మరణాలుగానో భావించ

బడినాయి. బానిసల్ని శిక్షించడానికి గల హక్కును యజమానులు ఎంత దారుణంగా వాడుకున్నారో తెలియాలంటే 1787 సంవత్సరంలో ఒక ఆంటీనా (Antigna) నివాసి వ్రాసిన ఉత్తరాన్ని చూడాలి ఆ ఉత్తరంలోని వ్రాతలు ఇలా ఉన్నాయి.:

"నీగ్రోల్ని తెల్లవారగానే లేపి 20 నుండి 60 మంది కిపై గా వుండే గుంపులుగా విడదీసి తెల్లజాతి ఓవర్సీర్ల (Overseers) నిఘా క్రింద పని చేయిస్తారు. ఓవర్సీర్లు లేక పర్యవేక్షకులు సాధారణంగా మొదట్లో కాంట్రాక్టు లేబరుగా వచ్చి కష్టపడి పని చేసి తోటల యజమానులుగా కూడా మారిన స్కాటిష్ వారు. ఈ ఓవర్సీర్ల క్రింద నల్ల జాతికి గాని ములటో జాతికి గాని చెంది పరమ నీచులైన డ్రైవర్లుంటారు. వారి చేతుల్లో కొరడాలుంటాయి. వాటిని అలసత్వం ప్రదర్శించిన వారెవరిపైనైనా ఝుళిపించవచ్చు. అలసత్వం కేవలం సోమరితనం వల్ల వచ్చిందా లేక అశక్తత వల్ల వచ్చిందా అని ఆలోచించకుండా, స్త్రీ పురుష వయోభేదం పాటించకుండా కొరడా ప్రయోగం జరిగేది. మధ్యాహ్నం పన్నెండింటికి పని దిగడం, దొరికిందేదో తినడం. ఒకటిన్నరకు మళ్ళీ గంట మ్రోగడంతో మళ్ళీ పని కెళ్ళి చీకటి పడేవరకు పని చేస్తూ పోవడం......

"బానిసలకిచ్చిన శిక్షలు అనేకరకాలుగా పరమ కిరాతకంగా ఉండేవి. ఇందులో కాళ్ళకూ చేతులకూ గలబొటన వేళ్ళను కలిపి కట్టివేసే 'తంబక్రూ' (Thumbacrew) అనే శిక్ష ఒకటి దీని వల్ల మెలికలు తిరిగిపోయే బాధ కలిగేది. మెడలకు పెద్ద పెద్ద బిళ్ళలుగల బరువైన గొలుసుల్ని దిగ వేసేవారు. మెడను ఏమాత్రం కిందికి దించినా విపరీతమైన బాధ కలిగేది. కాలిబూట్లుగా నాలుగు అంగుళాల ప్రమాణంలో ఉండే బరువైన ఇనుప కడియాలుండేవి. ఈ కడియాలకు గొలుసుల్ని కలిపి కట్టివేసేవారు. వీటన్నింటిని మోసుకుని పని చేయాల్సి వచ్చేది. కాలిబూట్లకు, మెడ గొలుసుకు కలిపి కట్టిన ఇనుప సంకెళ్ళతో వున్న ఎందరో నీగ్రోలు పగలు పట్నాల్లో కనిపించేవారు. మూడు నాలుగంగుళాల పొడువుండే మేకులతో కలిపి చేసిన స్పరులనే రింగుల బూట్లను వారితో ధరింపచేసేవారు. వొంటి చుట్టూ గొలుసును తిప్పి దానికి తాళం వేయడం ఈ అణచి వేయబడ్డ జాతివారిపై ప్రయోగించే మరొక హింస."

కొందరు యజమానుల క్రౌర్యాన్ని బట్టి యజమాని వర్గం మొత్తాన్ని అంచనా వేయడం తప్పే కావచ్చు. కొన్ని సందర్భాలలో బానిసలు తమ యజమానుల పట్ల

ఎంతో మైత్రీ భావాన్ని ప్రదర్శించేవారు. యజమానులుకూడా బానిసల పట్ల దయను ప్రదర్శించేవారు. ఇదంతా జరిగినప్పటికీ ఒక వ్యవస్థగా చూసినపుడు బానిసత్వం పూర్తిగా ఆర్థిక ప్రాతిపదికమీద ఏర్పడిన వ్యవస్థయే కావటంవల్ల అనివార్యంగా బానిసల్ని అది కేవలం పనిముట్ల స్థాయికి నెట్టి వేసింది. మానవీయమైన విలువల కందులో తావులేకుండా పోయింది.

స్వేచ్ఛా సమానత్వాలకు, ఎలాంటి హక్కులకూ నోచుకోని అణగారిన వర్గాలు భారదేశంలోనే గాక ప్రపంచంలో ఇతరత్రా కూడా గతంలో ఉన్నాయని నిరూపించడానికి ఇంకా దృష్టాంతాల్ని పేర్కోవాల్సిన అవసరం లేదు. అయితే ముఖ్యమైన విషయమేమంటే భారత దేశానికి బయటి అణగారిన వర్గాలు కాల క్రమంలో అక్కడి సమాజాల్లోని అంతర్భాగంగా కలగలిసి పోయాయి. భారత దేశంలోని అస్పృశ్యత ఈ విధంగా ఎందుకు అంతమొందలేదనే పెద్ద ప్రశ్న.

ఈ అస్పృశ్యత సమసి పోకపోవడానికి అనేకానేక కారణాలున్నాయి. వాటిని తర్వాత ఆధ్యాయాల్లో చర్చించడం జరిగింది.

**అనువాదం : ప్రో జి. శ్రీనివాస రెడ్డి.**

**పాదసూచిక :**

1. సెయిన్‌బ్యోస్ (Seignbbos) "History of Ancient Civilisation

అధ్యాయం – 9

# హిందువులు – ప్రజా స్పందన లోపం

హిందువులు అస్పృశ్యులకు వ్యతిరేకంగా హింసాకాండ జరిపిన సందర్భాలన్నీ అందరికీ స్వేచ్ఛా, సమానత్వం కోసం పోరాటం జరిగిన సందర్భాలే. అస్పృశ్యులు ఒక ఊరేగింపు తీయాలనుకోవడంలో వారికి హిందువులు ఊరేగింపులు తీయడం పట్ల అభ్యంతరం లేదు. అస్పృశ్యులు బంగారు, వెండి నగలు పెట్టుకోవాలనుకున్నప్పుడు, వాళ్ళు హిందువులకూ అదే హక్కు వుండడాన్ని వ్యతిరేకించరు. అస్పృశ్యులు తమ పిల్లలను బడికి పంపాలనుకుంటే వాళ్ళు హిందువుల పిల్లల విద్యను పొందే హక్కుకు వ్యతిరేకులు కారు. అస్పృశ్యులు ఒక బావి నుండి నీరు తీసుకోవాలని కోరుకుంటున్నప్పుడు, హిందువులు ఆ బావి నుండి నీరు తీసుకునే హక్కుకు అభ్యంతరపెట్టరు: ఇలా అనంతంగా చెప్పుకుంటూ పోవచ్చు. అయితే అది అనవసరం. విషయం చాలా సులభమైనది. అస్పృశ్యులు అడుగుతున్న స్వేచ్ఛ, హిందువుల స్వేచ్ఛా సమానత్వాలకు వ్యతిరేకమైనది కాదు. కానీ, హిందువులు ఈ అస్పృశ్యుల అమాయకమైన న్యాయబద్ధమైన చర్యలను అన్యాయంగా ఎందుకు అణచి వేస్తారు? తమ ఈ న్యాయరహితమైన పనులను న్యాయమైనవిగా వారు ఎందుకు పరిగణిస్తారు? అస్పృశ్యులతో వ్యవహరించేటప్పుడు హిందువులు చేసే చర్యల్ని, విధించే నిషేధాలనూ సామాజిక దుశ్చర్యలుగా కాక మరే విధంగానూ చెప్పడానికి వీలులేదన్న సత్యాన్ని చూడలేనివారెవరు ? ఈ చర్యలూ, నిషేధాలూ కేవలం అసమానతలు మాత్రమే కావు. అవి కేవలం అవమానకరమైనవి మాత్రమే కావు. సంఘంలో ఒక మనిషి మరియొక మనిషిపట్ల చూపే అమానుషత్వానికి సాక్ష్యాలు. మనిషిలోని దానవత్వాన్ని ఎత్తి చూపే సందర్భాలు ఇవి. ఒక అస్పృశ్యునికి వైద్యం చేయని డాక్టరు, అంటరాని వారి ఇళ్ళను కాల్చి బూడిద చేసిన హిందూగ్రామాలు, అస్పృశ్యుల బావులలో మానవ అశుద్ధాన్ని కలిపిన హిందువుల చర్యలు అమానుషాలు కాక పోతే ఇంక ఏది అమానుషమవుతుంది? హిందువులకు మనస్సాక్షి ఎందుకు లేదనేది ప్రశ్న?

ఈ ప్రశ్నలన్నింటికీ ఒకే సమాధానముంది. ఇతర దేశాల్లో ఆర్థిక పరిస్థితులు పునాదులుగా వర్గవిభేదాలు ఏర్పడినాయి. మతంలో బానిసత్వం, దాస్యశృంఖలాలకు పునాదులు లేవు. అస్పృశ్యత విధానం వలన హిందువులకు ఆర్థిక పరమైన లాభాలున్నప్పటికీ,

దానికి మూలాధారం మతమే. సాంఘిక పరంగా, ఆర్థిక పరంగా లభించే విధానాల్లో మతపరమైనవి ఉండవు గనక అవి కాలమాన పరిస్థితులకు లోబడే రూపుదిద్దుకొంటాయి. ఇటువంటి కారణాలవలననే బానిసత్వం, దాస్యం కాలక్రమేణా నిర్మూలన చెందాయి. అయితే వీటికంటే అతీతమయిన మత వ్యవస్థనుండి ఆవిర్భవించిన అస్పృశ్యత మాత్రం నిర్మూలన చెందలేదు. హిందువులకు ఇటువంటి దౌర్జన్యాలు జరపడానికి హక్కు మతం నుండే లభిస్తుంది. అస్పృశ్యులను అణగద్రొక్కడానికీ, నిర్దాక్షిణ్యంగానూ, చట్ట వ్యతిరేకంగానూ ప్రవర్తించడానికీ, అస్పృశ్యులు వారికి నియమితమైన కట్టుబాట్లను దాటి ఎదగకుండా నిరోధించడానికి ఒక సాంఘిక ఆచారాన్ని మతమే ఏర్పాటు చేస్తుంది. ఈ ఆచారాన్ని నిలబెట్టవలసిన బాధ్యత కూడా మతమే హిందువులపై ఉంచుతుంది. అస్పృశ్యుల పట్ల హిందువులు అమానుషంగా ఎందుకు ప్రవర్తిస్తారంటే వారి మతం అస్పృశ్యులను మానవులుగా పరిగణించనివ్వదు గనక, సవర్ణులు వారిపట్ల దౌర్జన్యం జరిపినా, లూటీలు జరిపినా, గృహదహనాలు జరిపినా, వీటన్నిటిని కాపాడడానికి ఎంతటి క్రూరమైన పద్ధతినైనా అవలంబించడానికి వారికి మతం అనుమతి లభించింది.

హిందువుల్లో అధికులకు ఈ ఆచారం తమ మతాన్ని అవలంబించడంలో ముఖ్యమైన భాగం అవుతుంది. దానిని కాదనేవారెవరైనా వుంటే, హిందూ ధర్మానికి వాస్తు శిల్పియైన మనువు యొక్క మనుస్మృతిలోని భాష్యాలు చదవమనండి. అస్పృశ్యుల గురించి, వారిపట్ల హిందువులు ప్రవర్తించవలసిన విధానం గురించి ఇలా ఉంది.

1. బ్రహ్మ ముఖం నుండి, బాహువులు, ఊరువులు, పాదాలనుండి జన్మించిన జాతులు తప్ప మిగిలిన వారందరూ, వారు మ్లేచ్ఛ భాష మాట్లాడినా లేక ఆర్యుల భాష మాట్లాడినప్పటికీ వారందరూ దస్యులు. (10-45)

2. వారందరు పెద్ద వృక్షాల క్రింద, శ్మశానాల్లో, పర్వతాల దగ్గర, చెట్ల తొర్రల్లో నివసిస్తూ, వారి ప్రత్యేక వృత్తులకు తగిన విధంగా కొన్ని గుర్తింపు చిహ్నాలను ధరించి సంచరించాలి. (10-50)

3. ఛండాలురు, శ్వపాకులు ఊరివెలుపల అపాత్రులుగా నివసించాలి. వారి ఆస్తులు శునకాలు, గార్దభాలు మాత్రమే. (10-51)

4. వారు సంచార జాతులుగా ఉండి, మృత జీవుల చర్మాలనే ధరించాలి. వారు పగిలి పారవేయబడిన పాత్రల్లోనే ఆహారం తీసుకోవాలి. వారు ధరించే ఆభరణాలు నల్ల ఇనుముతో చేసినవి అయి ఉండాలి. (10-52)

5. మత ధర్మాల ప్రకారం వారితో ఇతరులెవ్వరూ లైంగిక సంబంధాలు కలిగి ఉండరాదు. ఛండాలురు వారిలో వారిని తప్ప మిగిలిన వారెవ్వరిని వివాహపరంగా గ్రహించరాదు. (10-53)

6. వారికి ఆహారం ఇవ్వదలిస్తే (ఆర్యులుకాని వారిచేత) పగిలిన పాత్రల్లోనే ఇప్పించాలి. వారు రాత్రి వేళల గ్రామాల్లో కాని, పట్టణాల్లో కానీ సంచరించరాదు. (10-54)

7. పగలు వారు తమకు నిర్దేశించిన విధులకు, రాజు ఆమోదించిన గుర్తింపు చిహ్నాలు ధరించి హాజరు కావాలి. అనాధ ప్రేతాలకు శవ సంస్కారాలు చేయాలి. ఇది స్థిరపడిన నియమం. (10-65)

8. రాజాజ్ఞ ప్రకారం వారు శిక్షార్హులయిన నేరస్థులను చట్టబద్ధంగా చంపాలి. అటువంటి నేరస్థుల దుస్తులు, పక్కబట్టలు, ఆభరణాలను ఛండాలురు స్వీకరించాలి. (10-56)

9. ఎవరైనా ఇటువంటి నీచ జాతి స్త్రీతో సంబంధం కలిగి ఉంటే వారు మరణ శిక్షకు అర్హులు. (విష్ణు ః 5.43)

10. (ఛండాలురు, మొదలైన అస్పృశ్యులు) ఎవ్వరయినా (ద్విజులను) ఉద్దేశ్యపూర్వకంగా తాకి మైలపరిస్తే వారు మరణదండనకు అర్హులు. (విష్ణు ః 5-104)

మనుస్మృతి చదివిన వారెవ్వరైనా అస్పృశ్యత శాశ్వతమవడానికి, హిందువులకు న్యాయ విచక్షణ లేకపోవడానికి, మనస్సాక్షి లోపించడానికి హిందూమతం కారణం కాదని అనగలరా ? హిందువులు అవలంబించే దురాచారాలన్నిటికి మనుస్మృతియే కారణం. దీనికి హిందువులను నిందించి ఉపయోగం లేదు. మనువు నిర్దేశించిన పది ఆజ్ఞలను వారు అవలంబిస్తారు. ఒక హిందువు అస్పృశ్యుడ్ని తాకకపోయినా, అస్పృశ్యత పాటించినా మూలకారణం పైనుదహరించిన 5 నుండి 10 సూత్రాలే కారణం. అస్పృశ్యులను బహిష్కరించినారంటే అందుకు కారణం 3 వ సిద్ధాంతం. హిందువులు అస్పృశ్యులు

బంగారునగలు ధరించడాన్ని, శుభ్రమైన వస్త్ర ధారణను నిషేధించడానికి ఆధారం 8వ సిద్ధాంతం. అస్పృశ్యులు ఆస్తి, సంపదలను కలిగి ఉండడాన్ని హిందువులు భరించలేకపోవడానికి మనుధర్మ సిద్ధాంతాల్లో మూడవది కారణం.

ఇక ఈ విషయాలన్నీ ఏకరువు పెట్టడం అనవసరం. అస్పృశ్యుల ఈ పరిస్థితికి మూలకారణం హిందూ మతం, ఆమత బోధనలే. క్రైస్తవ మతంలోని బానిసత్వ విధానాన్ని, హిందూమతంలో అస్పృశ్యత విధానాన్ని పరిశీలించినట్లయితే క్రైస్తవ మతం మానవులను ఎంతగా పైకెత్తిందో, హిందూ మతం ఎంతగా దిగజార్చిందో తెలుస్తుంది. బానిసత్వాన్ని అస్పృశ్యతతో పోల్చి చూడాలని ఉబలాట పడేవారు. తాము ఒక విరుద్ధ పరిస్థితిని (Paradox) ఎదుర్కొంటున్న విషయం గ్రహించలేరు. చట్టపరంగాబానిస స్వతంత్రుడు కాడు. కానీ అతడి వ్యక్తిత్వ వికాసానికి కావలసిన స్వేచ్ఛ సామాజికంగా వుంది. చట్టపరంగా అస్పృశ్యుడు స్వేచ్ఛా మానవుడు. కానీ అతడి వ్యక్తిత్వ అభివృద్ధికి కావలసిన స్వేచ్ఛ సామాజికంగా అతడికి లేదు.

ఇది మన కళ్ళకు కొట్టవచ్చినట్లు కనపడే అంతర్గతమైన విరుద్ధ పరిస్థితి. దానికి సమాధానం ఏమిటి ? దీనికి ఒకే వివరణ సాధ్యమవుతుంది. మతం బానిసకు బాసటగా నిలబడింది. కాని, మతమే అస్పృశ్యునికి వ్యతిరేకమైంది. రోమన్ల చట్టం బానిసను స్వేచ్ఛా మానవునిగా పరిగణించక పోయినా, ఆ దేశపు మతం దీనిని ధృవీకరించలేదు. కనీసం ఆ అమానుష సిద్ధాంతాన్ని సాంఘిక జీవనానికి విస్తరించ లేదు. రోమన్ల మతం బానిసను సహవాసిగా ఉండదగిన మనిషిగా గుర్తిస్తుంది. హిందూమతం అస్పృశ్యుణ్ణి మనిషిగా గుర్తించక పోవడమే కాకుండా, ఈ సిద్ధాంతాన్ని సంఘంలో కూడా అమలు పరుస్తుంది. అతన్ని మనిషిగా చూడదు కనుక అస్పృశ్యుడు మానవ హక్కులకు అనర్హుడు. అతన్ని సహవాసిగా పరిగణించరాదు.

రోమ్ మతం బానిసలను - అతడు చట్టపరమైన నీచత్వాన్ని గురియౌతున్నా కూడా - సామాజిక నీచ స్థితిలో పడకుండా కాపాడడం నిస్సందేహం. రోమ్ మతం బానిసలను అటువంటి దిగజారుడు నుండి మూడు విధాలుగా కాపాడింది. బానిసలను మతం గౌరవించి, వారికి అత్యంత పవిత్ర స్థానం పొందడానికి కూడా అవకాశం కల్పించింది.

"...రోమ్ మతం బానిసలను ఎప్పుడూ ద్వేషించలేదు. వారికి ఆలయ ప్రవేశాన్ని ఎన్నడూ నిషేధించలేదు. వారిని ఉత్సవాలనుండి ఎప్పుడూ బహిష్కరించలేదు. బానిసలకు

ప్రవేశ అర్హత లేని ఏ కార్యక్రమాలకైనా, మిగిలిన స్వేచ్ఛాయుతులూ, స్త్రీలూ కూడా అనర్హులే బోనాడియా (Bona Dea), వెస్టా (Vesta), మరియు సిరాస్ (Ceras) కార్యక్రమాలకు పురుషులు హాజరు కారాదు. అలాగే అరా మాక్సిమాలో (Ara Maxima) జరిగే హెర్క్యులెస్ (Hercules) ఉత్సవాలలో స్త్రీలకు ప్రవేశం లేదు. పూర్వపు రోమన్ దేవతార్చనలో కుటుంబ సభ్యులతో బానిసలను కూడా అనధికారికంగా సభ్యులుగా పరిగణించేవారు. తద్వారా తాము ఆకుటుంబ దేవత రక్షణలు ఉన్న వారమనే భావన బానిసలకు కలిగేది. బానిసత్వం నుండి విడులైన స్త్రీలు, వెస్టాదేవత ప్రధాన పూజారిణి పదవికి అర్హులని అగస్టస్ (Agustus) ఆదేశించాడు. బానిస సమాధిని ఇతర సమాధుల్లాగే పవిత్రంగా పరిగణించాలని చట్టం నొక్కి చెప్పింది. బానిసలకు ప్రత్యేకంగా ఉండే స్వర్గ నరకాల ఉనికిని గురించి రోమన్ల పురాణాలు ఎప్పుడూ ప్రస్తావించలేదు. జువెనల్ (Juvenal) కూడా బానిస శరీరం, ఆత్మలు, యజమానులు శరీర, ఆత్మలు ఒకే అంశను కలిగి ఉన్నాయని, అవి సమానమైనవని ఒప్పుకున్నాడు."

రోమ్ మతం బానిసకు చేసిన ఇంకొక సహాయం, వారికి అన్యాయం చేసినట్లయితే పట్టణాధీశునికి తమ బాధలు విన్నవించుకోవడానికి అవకాశం కల్పించడం. ఇది లౌకికమైన పరిష్కారం. ఇంతకు మించిన ఉపశమన మార్గాన్ని మతం కల్పించింది. దాని ప్రకార బానిస తనకు ఇష్టం లేని యజమాని నుండి తనను విడుదల చేసి వేరొక దయగల యజమానికి విక్రయించవలసిందిగా దేవాలయాన్ని కోరవచ్చును.

ఇంకా మూడవ సహాయంగా రోమన్ మతం బానిసల మానవ అస్థిత్వాన్ని ధ్వంసం చేయకుండా చట్టాన్ని నిరోధించింది. మతం వారిని సాంఘికంగా వెలివేయకుండా, వారి పరిపూర్ణ వ్యక్తిత్వ వికాసానికి ఎనలేని దోహదం చేసింది వారి పట్ల ఎటువంటి అస్పృశ్యతా పాటించలేదు. రోమన్ సంఘం అస్పృశ్యత పాటించి ఉన్నట్లయితే, బానిసలనుండి పాలు, వెన్న, కూరగాయలు తీసుకోకూడదని, వారి చేతి నీరు తాగకూడదనే నిషేధం ఉన్నట్లయితే, బానిసలు ఇండ్లలో ప్రవేశించడం, కలసి ప్రయాణించడం చేయకూడదన్న నిషేధాలు ఉన్నట్లయితే అనాగరికతనుండి బానిసలు సాంఘికంగా ఉన్నత స్థానాలకు ఎదిగే వారు కారు. ఈ మార్పుకు కారణం బానిసల పట్ల యజమానులు అస్పృశ్యతను పాటించకుండా వారిని పరిపూర్ణ మానవులుగా వ్యవహరించడమే. తరచి చూచినట్లయితే బానిస యొక్క

మానవత్వాన్ని, వ్యక్తిత్వాన్ని సమాజం గుర్తించింది కనుక అతడు అణగదొక్కబడలేదు. ఇందుకు విరుద్ధంగా హిందూమతం అస్పృశ్యుని వ్యక్తిత్వాన్ని నిర్లక్ష్యం చేసి, గుర్తించలేదు కనుక అతడు అణచబడ్డాడు. హిందూ సంఘం అస్పృశ్యుడి ఆత్మ, వ్యక్తిత్వాలను కూడా అంటరానివిగా పరిగణించడం వల్ల వారు మిగిలిన మానవులతో సహజీవనం సాగించలేక పోతున్నారు.

ఏ విధమైన సాంఘిక, మతపరమైన అగాధాలూ బానిసను ఇతర సంఘం నుండి వేరు చేయలేదు. బాహ్యపరంగా అతడు ఏ విధంగానూ భిన్నంగా వుండేవాడు కాదు. అతడి శరీరం, దుస్తులు బానిసత్వాన్ని చాటే విధంగా ఉండేవి కావు. మిగిలిన స్వేచ్ఛా మానవుల వలెనే అతడు అన్ని రకాల ఆటపాటలలో పాల్గొనేవాడు. ప్రభుత్వ సేవలలో నియమింపబడేవాడు. ఇతరులవలెనే వ్యాపార వాణిజ్యాలలో పాల్గొనే వాడు. చట్టం ముందు వాస్తవంగా గుర్తించబడే హక్కులకంటే పైపై విషయాలలో కనిపించే సమానత్వపు లక్షణాలే వ్యక్తులకు తరచుగా ఎక్కువ ప్రధానమవుతాయి. బానిసలకు, స్వేచ్ఛా మానవులకు మధ్య సామాజిక భేదం పెద్దగా ఉండేది కాదు. బానిసలకు, ఇతరులకు మధ్య వివాహ సంబంధాలు సర్వసమానం. బానిసత్వం అనేది బానిసలోని పురుషత్వానికి ఏవిధమైన మచ్చనూ తెచ్చేది కాదు. బానిస స్పృశ్యుడే కాక గౌరవనీయుడు కూడా. రోమన్ మతం బానిసపట్ల చూపిన ఉదార దృక్పథానికి ఫలితమే ఇది.

క్రైస్తవ మతం బానిసత్వం పట్ల చూపిన వైఖరిని వర్ణించాలంటే ఇక్కడ స్థలం చాలదు. కాని, అది విగ్రహారాధకుల (Pagan) విధానం కన్నా భిన్నమయింది. అమెరికా దేశంలో బానిసత్వం అమలులో ఉన్న రోజుల్లో క్రైస్తవ మతాధికారులు నీగ్రో బానిసలను క్రైస్తవులుగా మార్చడానికి అంగీకరించేవారు కాదు. ఎందుకంటే క్రైస్తవుడు బానిసగా వుండడం తమ మతానికే అవమానమని. క్రైస్తవ మత విధానాన్ని అనుసరించి ఒక క్రైస్తవుడు మరియొక్క క్రైస్తవుణ్ణి బానిసగా చూడరాదు. మతం స్వీకరించిన వారినెవ్వరినైనా విధిగా సహోదరుడిగా పరిగణించవలసి ఉంటుంది.

ముగింపుగా చెప్పాలంటే చట్టం, మతం మానవుని ప్రవర్తనను నిర్దేశించే శక్తులు. కొన్ని సందర్భాలలో అవి రెండు ఒకదానికొకటి సహాయపడుతాయి. ఒక్కొక్కసారి ఒకదానిపై ఒకటి పర్యవేక్షణగా, సరిదిద్దేవిగా ఉపయోగపడతాయి. అయితే ఈ రెంటిలో చట్టం మనిషికి వ్యక్తిగతమైనది కాగా మతం వ్యక్తిగత విషయాలకు అతీతమైనది. చట్టం

వ్యక్తిగతమైనది కాబట్టి ఇందులో అన్యాయం ఉంటుంది. కాని మతం వ్యక్తిగతం కాదు గనక నిష్పక్షపాతంగా వుండగలదు. అలా ఉన్నప్పుడు చట్టపరంగా జరిగే అన్యాయాలను మతం అరికట్టగలదు. రోమ్ మత వ్యవస్థలో జరిగింది ఖచ్చితంగా ఇదే. అందువలననే మతం, మానవుణ్ణి దిగజార్చకుండా ఉన్నతుణ్ణి చేస్తుందని నమ్ముతారు. హిందూమతం దీనికి మినహాయింపు. ఈ మతం అస్పృశ్యుడిని మానవుడి స్థాయినుంచి దిగజార్చి అర్ధమానవుడిగా చేసింది. హిందువులను అమానుషులుగా మార్చింది. ఈ వేళ్ళు తన్నుకు పోయిన వ్యవస్థ నుండి తప్పించుకొనే వీలు ఈ అర్ధమానవునికి కాని, ఆ అమానుషునికి కాని లేకపోయింది.

అనువాదం టి. సత్యనారాయణ

అధ్యాయం – 10

# హిందువులు – వారి సామాజిక స్పృహ రాహిత్యం

అస్పృశ్యుల దయనీయమైన పరిస్థితులను పరిశీలించేవారు "అస్పృశ్యుల కోసం ఏదైనా కొంత చేయాలి." అని మనసులో అనుకోవడం సహజమే ఐనా హిందువుల్లో పరివర్తన తెద్దామన్న యోచన మాత్రం అరుదుగానే వుండే విషయం. అస్పృశ్యుల స్థితికి కారణమువారి తొలిజన్మ పాపమే అన్నట్టు అస్పృశ్యుల సముద్ధరణ కోసం పూనుకోవాలనీ, హిందువుల కోసం చేయాల్సిందేమి లేదనీ, మానసికంగా, నైతికంగా హిందువు అస్పృశ్యునికంటే ఉన్నత స్థితిలోనే ఉన్నాడు. అతడు పాపకార్యాచరణుడేం కాడనీ అనుకుంటారు.

వాస్తవానికి హిందువును తప్పుపట్టాల్సిందేమీ లేదు. కాని కొన్ని విషయాల్లో తప్పుపట్టాల్సి వుంటుంది. క్రైస్తవులు యూదులపై చేసే అమానుష చర్యలను సమర్థించే వారికి హిందువులు అస్పృశ్యుల ఎడల అనుసరించే వైఖరి సబబుగానే అనిపిస్తుంది. అస్పృశ్యుని నేరమంతా అతని అంటరానితనమే.

యూదుల తరఫున నిలబడి క్రైస్తవులను నిలదీసిన లూయీ గౌల్డింగ్ గారికి ఎదురైన హేళన పూర్వక సమాధానాలు అతని మనస్సు నెంతో క్షోభపెట్టిందని ఆయనే స్వయంగా వెల్లడి చేసిన ఈ మాటల ద్వారా అవగతమవుతుంది. "యూదుల సమస్యచాలా సున్నితమైనది. నాస్నేహితుడు జాన్స్మిత్ గారికి "ప్యాడి" అనే పేరుగల ఒక ఐరిష్ జాతి పెంపుడు కుక్క ఉన్నది. స్మిత్‌కు ఆ కుక్క అంటే చాలా ప్రేమ... ఆ కుక్కకు స్కాచ్ జాతి కుక్కలంటే ద్వేషం. స్కాచ్ కుక్కలనుచూడగానే విపరీతంగా మొరిగేది. అసహ్యంగా తలత్రిప్పుకొనేది. ఆ కుక్కలో గల తొలి పాపకృత్యలక్షణాలేనని నిర్ధారించారట".

ఈ ప్యాడీ శునక లక్షణాలను హిందువునకు స్కాచ్ పెంపుడుకుక్క గుణాన్ని అస్పృశ్యులకు అన్వయించి సమీకరణం చేయవచ్చు. గౌల్డింగ్ ఈ సమీకరణాన్ని క్రైస్తవులకు,యూదులకు వర్తింపజేసాడు. గౌల్డింగ్ దృష్టిలో యూదులు క్రైస్తవుల సమస్య. కాబట్టి అస్పృశ్యత ప్రాథమికంగా హిందువుల సమస్యే కదా!

ఇక హిందువుల కెంత పాటి సామాజిక స్పృహ ఉన్నదనేది ప్రశ్న. నిజంగా హిందువులు అస్పృశ్యుల ఎడల సానుభూతితో ఆలోచించారా ?

ఈ విషయంలో నిజానిజాలు తెలియాలంటే కొన్ని అంశాల ద్వారా పరిశీలించాల్సి వుంటుంది.

ముందుగా సాహిత్యపరమైనది. అస్పృశ్యుల స్థితిగతుల గురించి, వారి దయనీయమైన స్థితి గురించి ఎంత సాహిత్యం వెలువడింది? అమెరికాలో నీగ్రోల విషయంలో ఎంతో సాహిత్యం వెలువడింది. కొన్ని వేల కొలది రచనలు, వ్యాసాలు, వివిధ శీర్షికలతో వెలువడ్డాయి. నీగ్రోల సమస్య అనేక కోణాలలో ఎత్తి చూపబడింది. ఈ సాహిత్యాన్ని అధ్యయనం చేశాక తెల్లవారు నీగ్రోల విషయంలో మనస్ఫూర్తిగా వ్యవహరించారని తేలుతుంది. నీగ్రోల పట్ల వెలువడిన వాఙ్మయం అమెరికాలోని అన్ని వర్గాలను, సామాజిక శాస్త్రవేత్తలను, రాజకీయ నాయకులను సైతం కదిలించింది. వారిలో అనేక ఆలోచనలను రేకెత్తించింది.

మరి అస్పృశ్యుల గురించి మన దేశంలో వెలువడ్డ సాహిత్యమెంత? మహా ఎక్కువైతే ఓ అరడజను కరపత్రాల కంటె మించలేదు.

ఇక సాహిత్యాన్ని వదలిపెడదాం. సామాజిక ప్రవర్తన అనే అంశం తీసుకుందాం హిందువు అస్పృశ్యుని ఎడల ప్రవర్తించే తీరుకై కొన్ని ప్రముఖ వార్తా పత్రికల్లో వచ్చిన సంఘటనలు ఉదాహృతాలు.

5.3.1926 నాటి ప్రతాప్ అను పత్రికలో వెలువడిన వార్త ఇలా ఉంది.

"ఫిబ్రవరి 23వ తేదీ ఉదయం 11 గంటలకు లక్నోలో బేగం గంజ్ ప్రాంతం వద్ద సుమారు 12 మంది (ఆడామగా అందరూ కలసి) క్వారీలో పని చేస్తుండగా ప్రమాదవశాత్తు క్వారీ పేలి అందరూ మట్టిలో కూరుకొని పోయారు..అతికష్టంగా వారిని వెలికితీయగా ఒక మహిళ మాత్రం కొన వూపిరితో కొట్టుమిట్టాడుతుందని గ్రహించారు. ఆమె మీర్‌పూర్‌కు చెందిన అస్పృశ్యురాలు. ప్రాణాపాయ స్థితిలో ఉన్న ఆమెను రక్షించడానికి ఎవరూ ముందుకు రాలేదు. మంచమైనా ఇవ్వలేదు. చివరికో ముస్లిం ఆమెకు ఓ మంచం ఇవ్వగా మరో అస్పృశ్యుని ద్వారా ఆమెను ఆ మంచం పైకెక్కించారు".

ఈ సంఘటనతో పాటు హిందువు సామాజిక స్పృహ తెలియపర్చడానికి మరో సంఘటన ఉదహరిస్తాను. "సంగ్రామ్" 9వ సంచిక 10.7.46 లోని విలేఖరి కథనం:

"గోవాలో మాప్సే గ్రామంలో క్రైస్తవులచే నిర్వహించబడే "అజిలో" అను అనాధాశ్రమంలో ఓ మహిళ చనిపోయింది. ఆమె అనాధ అయినందున ఆమె శవదహన సంస్కారం కోసం గ్రామంలోని హిందువులు ముందుకు వచ్చి చందాలు వేసుకొని డబ్బు ప్రోగు చేసారు. అనాధాశ్రమంలోని ఆ శవాన్ని బయటకు తెచ్చారు. అదే సమయానికి అటువైపు వచ్చిన అస్పృశ్యులను గమనించి ఆ శవం అస్పృశ్యులదేనని గ్రహించి దహన సంస్కారం చేయకుండా వెళ్ళిపోయారు. అస్పృశ్యులు అది చూచి తమ వద్ద పాడె కొనడానికి డబ్బు లేనందున చందాల ద్వారా వసూలైన డబ్బును ఇమ్మని ప్రాధేయపడ్డా పెడచెవిన పెట్టి హిందువులు ఆ శవాన్ని అక్కడే వదిలేసి వెళ్ళిపోయారు . ఆమె హిందువు కాదని అస్పృశ్యురాలైనందునే డబ్బు ఇవ్వమని చెప్పి వెళ్ళారు."

ఈ సంఘటన హిందువులు అస్పృశ్యులనెంత బాగా "ప్రేమిస్తారో" తెలియ జేస్తోంది. "మిలాప్" అను పత్రికలో (2.10.1925) లో వచ్చిన మరొక వార్త:

"సెప్టెంబర్ మొదటి వారంలో రుద్ర ప్రయాగ అను గ్రామంలో ఓ నాటి సాయంత్రం ఓ హరిజనుడు రొప్పుతూ పరిగెత్తివచ్చి ఓ సత్రం గేట్లుతీయమని, తననో పెద్దపులి వెంటాడుతోందని, ప్రాణాలు కాపాడమని అరిచాడు. కాని ఆ సత్రాధిపతి గేటు తీయడానికి నిరాకరించాడు. ఇంతలో పులిపై బడింది. బలిష్టుడైన ఆ హరిజనుడు కాసేపు ి పులిని ఎదిరించాడు. రక్షించమని అరచినా ఎవ్వరూ రాకుండా వున్నారు. చివర్లో ఆ పులి తతో తీవ్రగాయాలతో స్పృహ తప్పి పడి, మరునాడు శ్రీనగర్ గార్వాల్ ఆసుపత్రిలో ర్చబడ్డాడు. ఆసుపత్రిలో సైతం "అస్పృశ్యుని"గానే చూడబడ్డాడు."

ఈ సంఘటనలు హిందువుల నిర్దయను, పట్టింపు లేనితనాన్ని వ్యక్తం చేస్తున్నాయి.

ఇక హిందువులు అస్పృశ్యుల ఎడల చూపే సేవాభావము త్యాగ నిరత ఎంతపాటిదో చూద్దాం.

అమెరికాలో తెల్ల వారు నీగ్రోల విద్యా సౌకర్యాల అభివృద్ధి కోసం కొన్ని లక్షల డాలర్లు వెచ్చించారు. ఈ పట్టిక ద్వారా ఈ విషయం తెలుస్తుంది.[1]

| దాత | విరాళం (డాలర్లలో) | దాత | విరాళం (డాలర్లలో) |
|---|---|---|---|
| కేన్ | 50,000 | మేసన్ | 1,00,000 |
| హార్టన్ | 5,000 | నంబర్ట్ | 40,000 |
| ట్రౌటన్ | 1,60,600 | హారిసన్ | 2,30,000 |
| ఒట్టింగార్ | 500 | ముంగర్ | 75,000 |
| గాంబ్లిల్ | 3,500 | రోసెన్‌బానిన్ | 1,000 |
| జారెప్‌కి | 1,000 | బర్టన్ | 1,000 |
| స్ట్రాక్ | 500 | కొ[న్రాయ్ | 1,00,000 |
| కిడ్డర్ | 5,000 | కెంట్ | 10,000 |
| క్లాడిన్ | 10,000 | డ్యూక్ | 1,40,000 |
| వుడీ | 500 | మర్ట్రీలియట్ | 5,000 |
| హార్క్‌నెస్ | 12,50,000 | మాసే | 25,000 |
| బీటి | 2,90,000 | నికొలస్ | 20,000 |
| మర్క్యాంటా | 5,000 | గారెట్‌సన్ | 15,00,000 |
| మ్యాటన్ | 5,000 | మాచర్ | 20,000 |
| ఫిలిప్‌స్కాప్ | 2,80,000 | రైట్ | 10,000 |
| బట్లర్ | 30,000 | | |

నీగ్రోల విద్యకు దాదాపు 10 సంస్థలు నిధులను సమకూర్చాయి. [2] అవి

1. దిఎవరీ ఫండ్
2. ది విలాస్ బిక్వేస్ట్
3. దిఆఫ్రికన్ ఫండ్
4. ది బకింగ్ హ్యామ్ ఫండ్
5. ది జార్జ్ వాషింగ్‌టన్ ఎడ్యుకేషనల్ ఫండ్

6. ది మైనర్ ఫండ్
7. దిస్టివార్డ్ మిషనరీ ఫౌండేషన్
8. దిడేనియల్ హ్యాండ్ ఫండ్
9. ది జాన్ స్లేటర్ ఫండ్
10. ది ఫెల్ప్స్ – స్టోక్స్ ఫండ్.

ఈ నిధులే కాకుండా కార్నిజి కార్పొరేషన్, జులియస్ రోసెస్ వాల్డ్ ఫండ్, దిరాక్ ఫౌండేషన్ వంటి ఘనమైన సంస్థలు కూడా నీగ్రోలకు సహాయంగా వున్నాయి[3]

| దాతలు | Annual Expenditure (Dollars) | Permenant fund Negro Education (Dollars) | Value of Schools plants etc (Dollar |
|---|---|---|---|
| అమెరికా బాప్టిస్ట్ హెూం మిషన్ బోర్డు | 116,247 | 1,597,700 | 3,594,251 |
| అమెరికన్‌చర్చి ఇన్‌స్టిట్యూట్ ఫర్ నీగ్రోస్ | 185,100 | 4,50,000 | 30,00,000 |
| అమెరికన్ మిషనరీ అసోషియేషన్ | 3,68,057 | 3,228,421 | 32,00,000 |
| ర్చ్ ఆఫ్‌క్రైస్ట్ (డిసిపిల్స్) యునైటెడ్ క్రిష్టియన్ మిషనరీ సొసైటీ | 91,072 | -- -- | 5,00,000 |
| లూథరన్ ఎవాంజికల్ సినోడికల్ కాన్ఫరెన్స్ ఆఫ్ నార్త్ అమెరికా బోర్డ్ కలర్డ్‌మిషన్ | 74,900 | -- -- | 1,75,000 |
| మెథడిస్ట్ ఎపిస్కోపల్ చర్చిబోర్డ్ ఆఫ్. ఎడ్యుకేషన్, ఇన్సిట్యూషన్ ఆఫ్ నీగ్రోస్ | 2,59,264 | 19,62,729 | 50,00,000 |
| మెథడిస్ట్ ఎపిస్కోపల్ చర్చి, వుమెన్స్ హెూమ్ మిషనరీ, సొసైటి | 1,04,975 | -- -- | 3,60,000 |
| ప్రెస్ బిటేరియన్ చర్చ్, యు.ఎస్.ఎ డివిజన్ ఆఫ్ మిషన్‌ఫర్ కలర్డ్‌పిపుల్ | 4,05,327 | 19,94,032 | 35,60,000 |
| యునైటెడ్ ప్రెస్ బిటేరియన్ చర్చిబోర్డ్ | | | |

| | | | |
|---|---|---|---|
| ఆఫ్ మిషన్ ఫర్ ఫ్రీమన్ | 98,000 | 6,45,000 | 10,00,000 |

నీగ్రో ఇయర్ బుక్ ప్రకారం 135,000,000 డాలర్లు 1865-1930 మధ్య కాలంలో వెచ్చించబడిందని తెలుస్తుంది.. ఇందులో తెల్లవారి వాటా 85,000,000 డాలర్లు!

అమెరికన్లతో పోలిస్తే హిందువులు అస్పృశ్యులకై వెచ్చించింది ఎంత? వారి సేవా నిరతి ఎంత ?

హిందువులు తాము ఘనంగా బాకా ఊదుకొని చెప్పుకొనే ఏకైక సంస్థ "హరిజన సేవక్ సంఘ్"[4] ఈ సంఘం యొక్క మూలధనం ఎన్నడూ రూ॥ 10 లక్షలు దాటలేదు. ఈ సంఘ వార్షిక వ్యయం వేల సంఖ్య దాటలేదు. ఇది సంక్షేమ నిధే కాదు. ఇది ఒక రాజకీయ నిధి. అస్పృశ్యుల ఓట్లను కొనడానికే ఉద్దేశించబడినది.

అమెరికన్లు నీగ్రోల అభ్యున్నతికై పాటుపడుతున్నారు. హిందువు అస్పృశ్యునికై పాటు పడుతున్నట్లు నటిస్తున్నాడు. కారణం ఒక్కటే. అమెరికన్ల కున్న పాటి సామాజిక స్పృహ హిందువులకు లేకపోవడమే!

అలా అని హిందువులకు యుక్తా యుక్త జ్ఞానం శూన్యమని కాదు. వారి ధార్మిక చింతన, నైతిక విలువలు కొన్ని వర్గాలకే పరిమిత మైనవి.

ఈ విషయాలన్నీ శ్రీ హెచ్.జె.పాటన్[5] గారిలా చెప్పున్నారు. "మానవుడు తనకే చెందిన ఒకానొక సమూహంలో సత్ప్రవర్తకుడే కావచ్చు. అయితే అందరికీ ఆదర్శంగా వుండే ప్రవర్తనే ముఖ్యంగాని ఒక వర్గానికే ఆదర్శుడైతే ప్రయోజనం లేదు. దొంగల గుంపులోగల దొంగ కూడా వారి ఉద్దేశ్యంలో గౌరవార్హుడే. నైతిక విలువలకు కట్టుబడివున్న మనిషి ఒక పరిమిత సమూహంలో మంచి సభ్యుడుగా కాక, అపరిమిత మానవ సమాజంలో – అన్నిసమూహాలనూ, వాటి అన్ని లక్ష్యాలనూ తనలో కలుపుకుని, తనతో సంఘర్షించే మరొక సమాజమేదీ లేని సంపూర్ణ మానవ సమాజంలో – మంచి సభ్యునిగా ఉంటాడని అనిపిస్తుంది".

అస్పృశ్యులు హిందూ సమాజంలోకి రారు. హిందువులు సైతం అస్పృశ్యులను తమ వర్గంలోని ఒక భాగమని భావించరు. ఈ భావన వల్లనే హిందువుల నైతిక శీలాన్ని శంకించాల్సి వస్తుంది.

హిందువుకు సామాజిక స్పృహ లేనంతకాలం అస్పృశ్యులకు జరిగే అన్యాయాన్ని, అవమానాల్ని, అక్రమాలను సరైన దృష్టితో చూడలేడు, పైగా తన దృష్టే సరైనదని భావిస్తాడు.

హిందువులో సామాజిక స్పృహ లేనంత కాలం అది అస్పృశ్యతా నిర్మూలనకు అడ్డంకిగానే మిగిలిపోతుంది.

పాదసూచికలు :

1. నీగ్రో ఇయర్‌బుక్, 1931-32 పేజీ 202
2. Ibid పేజీ 213-18
3. Ibid పేజీ 213
4. వివరాలకు నా పుస్తకం 'కాంగ్రెస్ మరియు గాంధీ అస్పృశ్యులకేమి చేశారు" చూడండి
5. హెచ్.జె.పాటన్, "Good will" పేజీ 281

అనువాదం : టి. సత్యనారాయణ

అధ్యాయము - 11

# హిందువు-కులము పట్ల అతని విశ్వాసము

హిందూ సంఘ సంస్కర్తలలో మితవాదుల వర్గమొకటి ఉన్నది. ఈ వర్గము వారు అస్పృశ్యతను; కుల వ్యవస్థను వేరుగా భావిస్తుంటారు. వారి సిద్ధాంతమేమనగా కుల వ్యవస్థ కెట్టి విఘాతం కలిగించకుండానే అస్పృశ్యతను నిర్మూలించవచ్చునని. మతదృష్టి గల హిందువు కులవ్యవస్థ నిర్మూలనాన్ని ఎంత వ్యతిరేకిస్తాడో, అస్పృశ్యతా నిర్మూలనను కూడా అంతే వ్యతిరేకిస్తాడు. సంఘ సంస్కరణను రెండు అంచెలలో చేసినా, ఒకే సారి చేసినా అతని వ్యతిరేకత అంతే వుంటుంది. కానీ రాజకీయ దృష్టిగల హిందువుకు ఈ భావన చాలా ఇష్టకరంగా వుంటుంది. ఇందుకు రెండు స్పష్టమైన కారణాలున్నాయి. మొదటగా దీని వల్ల హిందువులకు, తాము నిజంగా ఉన్నంతకంటే ఎక్కువ ప్రజాస్వామ్య వాదులుగా ప్రపంచానికి తమను తాము చూపించుకునే అవకాశం వస్తుంది. కుల వ్యవస్థను దాని మానాన దాన్ని వదిలి వేయడం ద్వారా సవర్ణ హిందువులు కాంగ్రెస్‌ను వదిలేసే ప్రమాదాన్ని తొలగించవచ్చు.

కులాన్ని ముట్టుకోకుండా అస్పృశ్యతపైనే దృష్టి సారించేవారికి మనుస్మృతి 10వ అధ్యాయం 4వ శ్లోకం ఆధారం. మనువు నాలుగు వర్ణాలే ఉటంకిస్తాడు. ఐదవ వర్ణమే లేదన్నాడు గనుక నాలుగవ వర్ణంలోనే అస్పృశ్యులను కూడా చేర్చ వచ్చునని, శూద్రులను అంటితే ఎలాంటి అభ్యంతరం లేదు కనుక అస్పృశ్యులకు కూడా ఇది వర్తిస్తుందని వీరి అన్వయం. రాజకీయ దృష్టిగల హిందువులకు ఇది ఎంత నచ్చినా, ఈ అన్వయం మనువు ఉద్దేశించిన అర్థానికి అనుగుణంగానే వున్నది. ఈ శ్లోకాన్ని మరొక రకంగా కూడా అర్థం చేసుకొవచ్చును. చాతుర్వర్ణాన్ని విస్తరించి, దానికి బయట వున్న వారిని అయిదవ వర్ణంగా గుర్తించి పాంచవర్ణం చేయడానికి మనువు ఇష్టపడలేదని కూడా అర్థం చేసుకోవచ్చు. అయిదవ వర్ణం లేదని అనడంలో అతని ఉద్దేశ్యమేమిటంటే, నాలుగు వర్ణాలకు బదులుగా హిందూ సమాజంలో అయిదు వర్ణాలున్నాయని ఒప్పుకుని తద్వారా నాలుగు వర్ణాలలో చేరని వారిని కూడా హిందూ సమాజంలో చేర్చడం తనకు ఇష్టంలేదని. అతని ఉద్దేశ్యం ఇదేననే విషయం ఒక వర్గం ప్రజలను ఆయన బాహ్యులు[1] గానూ, వర్ణబాహ్యులుగానూ వ్యవహరించడం ద్వారా తేటతెల్లమవుతుంది. మనువు గనక మనుషులందరినీనాలుగు

వర్ణాలలో చేర్చే ప్రయత్నం చేస్తే కొందరు మనుషులను వర్ణ బాహ్యులుగా వ్యవహరించవలసిన అవసరమే రాదు. పైగా అతను వర్ణ బాహ్యులలో రెండు ఉపవర్గాలను గుర్తిస్తాడు. వాళ్ళను హీనులనీ[2], అంతేవాసినులనీ[3] పేర్లు పెట్టాడు. ఈ వాస్తవాలను పరిశీలిస్తే, మనుస్మృతిలోని శ్లోకానికి చెప్పే కొత్త భాష్యం ద్వారా అస్పృశ్యత అనేది మనుస్మృతికి వ్యతిరేకమనీ, దాని నిర్మూలన హిందూమత సూత్రాలకు విరుద్ధంకాదనీ చెప్పి సాంప్రదాయిక హిందువును మోసం చేయడం కుదరదు. మనుస్మృతి భాష్యంపై ఆధారపడిన ఈ వాదన సాధారణ, విద్యావంతుడుకాని హిందువుకు అందదు. అతనికి తెలిసినవి రెండు. ఒకటేమిటంటే సాంఘిక వ్యవహారాలలో అతడు మూడు ఆంక్షలను పాటించాలి. అవి 1) ఇతర కులాలవారితో సహపంక్తి భోజనం (Inter-dining) చేయరాదు, 2) కులాంతర వివాహాలు చేసుకోరాదు, 3) కొన్ని కులాలవారిని తాకకూడదు. మొదటి రెండు కులము క్రిందకి వస్తాయి. మూడవది అస్పృశ్యత. మామూలు సవర్ణ హిందువుకు వాటి సంఖ్య ప్రధానం కాదు. వా టిని అనుసరించడమే ప్రధాన సమస్య.

ఈ అవరోధాలను తొలగించుకోవాలన్నపుడే ఎందుకు తొలగించుకోవాలనేది ప్రశ్న ఉత్పన్నమవుతుంది. మొదటి రెండూ అనుసరిస్తున్నపుడు మూడోది అనుసరిస్తే తప్పేమిటన్నది ప్రశ్న.మానసికంగా చూస్తే కులమూ, అస్పృశ్యతా ఒకే వ్యవస్థలోనివే. సవర్ణ హిందువు అస్పృశ్యతను పాటించడానికి కారణం అతనికి కులం పట్ల గల గాఢ విశ్వాసమే.

ఈ దృష్టితో పరిశీలిస్తే కుల వ్యవస్థకు ఎట్టి అఘాతం కలిగించకుండా అస్పృశ్యతను నిర్మూలించాలనే ఆలోచన నిరర్థకమే. "కులము", "అస్పృశ్యత" వేర్వేరనే భావన మిథ్యా భావన. ఇవి రెండూ అవినాభావ సంబంధమున్నవే. అస్పృశ్యత కుల వ్యవస్థకు కొనసాగింపు మాత్రమే. ఇవి రెండూ కలిసే నిలబడతాయి. కూలితే రెండూ ఒకేసారి కూలిపోతాయి.

చట్టపరమైన, లేక హేతుపరమైన వ్యూహాల ద్వారా అస్పృశ్యత నిర్మూలించబడకపోవడానికి మరొక కారణముంది. ఇంతకు ముందే ఎత్తి చూపినట్టు, హిందూ సామాజిక వ్యవస్థ అంచెలవారీగా వుండే అసమానతా సూత్రంపై (Principle of Graded inequality) ఆధారపడి వుంది. ఈ సూత్రపు ప్రాధాన్యతను చాలా మంది గుర్తించడంలేదంటే అది అతిశయోక్తి కాదు. అసమానత పై ఆధారపడిన సాంఘిక వ్యవస్థ

అంచెలవారీ అసమానతపై ఆధారపడే సాంఘిక వ్యవస్థకంటే భిన్నమైన పునాదిపై నిర్మించబడి వుంటుంది. మొదటిది బలహీనంగానూ, తనను తాను కాపాడుకోలేనిది గానూ వుంటుంది. రెండవది తనను తాను నిలబెట్టుకునే సామర్థ్యం కలిగి వుంటుంది. అసమానత్వంపై ఆధారపడిన సాంఘిక వ్యవస్థలో నిమ్న వర్గాలవారు కలిసి ఆ వ్యవస్థను కూల్చే అవకాశం వుంటుంది. వారెవరికీ ఆ వ్యవస్థను నిలబెట్టడంలో ఏ ప్రయోజనమూ వుండదు. అంచెలవారీ అసమానత్వం పై ఆధారపడిన వ్యవస్థలో బాధితులందరూ కలిసి వ్యవస్థను ఎదుర్కొనే అవకాశం మృగ్యం. అంచెలవారీ అసమానత్వం వున్న వ్యవస్థలో బాధితులందరూ ఒకే స్థాయిలో వుండరు. పై వారూ, కిందివారూ మాత్రమే వున్న సామాజిక వ్యవస్థలోనే అది సాధ్యం. అంచెలవారీ అసమానత్వం వున్న వ్యవస్థలో అత్యున్నతులు (బ్రాహ్మణులు) ఉంటారు. వారి క్రింద ఉన్నతులు (క్షత్రియులు), వారి కింద కొంత తక్కువ ఉన్నతులు (వైశ్యులు) వారి కింద నిమ్నజాతివారు (శూద్రులు) వుంటారు. నిమ్న జాతికి క్రింద నిమ్నతములు (అస్పృశ్యులు) ఉంటారు. మిగిలిన అందరికీ అత్యున్నతులమీద ఫిర్యాదులు ఉంటాయి. అందరూ వారి పతనాన్ని కోరుకుంటారు. కానీ అందుకోసం వాళ్ళు కలవరు. అత్యున్నతులను వదిలించుకోవాలని ఉన్నతులు కోరుకుంటారు గానీ అందుకోసం తమ కింది వారితో కలవరు. ఎందుకంటే వారు తమతో సమానులై పోతారనే భయం. కొంచెం తక్కువ ఉన్నతులు కూడా అత్యున్నతుల, ఉన్నతుల పతనాన్ని కోరుకుంటారు కానీ నిమ్న, నిమ్నతమ వర్గాలలో కలవరు. కారణం వారు పైకి వచ్చి తమతో సమాన హోదా పొందుతారనే భయం. నిమ్న వర్గంవారు కూడా తమ పై వర్గాలను కూల్చడానికి నిమ్నతమ వర్గంలో కలవరు. కారణం అదే భయం. అంచెలవారీ అసమానత్వం వున్న వ్యవస్థలో సామాజిక నిర్మాణంలో అట్టడుగున వున్న వర్గం తప్ప మరే ఇతర వర్గమూ పూర్తి ఆధిపత్య రహిత స్థితిలో వుండదు. వీరందరి అధికారాలూ, అంచెలవారీగా వుంటాయి.నిమ్న వర్గంకూడా నిమ్నతమవర్గంతో పోల్చినప్పుడు అధికారం కలిగిన వర్గమే. ప్రతి వర్గానికీ ఏదో ఒక రకమైన ఆధిపత్యం వున్నది గనుక ప్రతివర్గానికి ఆ వ్యవస్థను కొనసాగించడంలోఎంతో కొంత స్వార్థం వుంటుంది.

అస్పృశ్యత అస్పృశ్యుల దురదృష్టం కావచ్చు గాని హిందువులకిది అదృష్టమే. వారికి అస్పృశ్యులుండాలి. దీనివల్ల వారికి అగ్రగణ్యత్వము సంప్రాప్తిస్తుంది. హిందువుకు ఎవరికీ

ఏ హోదా లేని వ్యవస్థగానీ, ప్రతివానికీ ఒక సమాన హోదా ఉండే వ్యవస్థగానీ ఇష్టం ఉండదు. తామొక్కరే ప్రత్యేక విశిష్టమైన వ్యక్తులుగా, మిగతావారు గుర్తింపు లేనివారుగా ఉండే వ్యవస్థ హిందువులకు కావల్సింది. అస్పృశ్యులు గుర్తింపులేనివారు. దీనివల్ల హిందువులకు సంఘంలో హోదా, పెద్దరికం లభిస్తుంది. హిందువులకు - ముఖ్యంగా ఏ గుర్తింపూలేని అసంఖ్యాక అనామకులకు - అస్పృశ్యతా నిర్మూలనం ఇష్టం ఉండకపోవడానికి ఇది అదనపు కారణం.

ఈ అస్పృశ్యత మాయమవ్వాలంటే మొత్తం హిందూ సామాజిక వ్యవస్థ, ముఖ్యంగా కులాలు రద్దు కావాలి. ఇది సాధ్యమేనా? ప్రతి వ్యవస్థ కొన్ని నిర్దేశిత సూత్రాల ఆధారంగా కొనసాగుతుంది. మూడు రకాల నిర్దేశాలు సాంఘిక వ్యవస్థలకు జీవాన్ని ఇస్తాయి. నిర్దేశించే శక్తులను బట్టి వ్యవస్థ నిలబడుతుంది. అవి 1. చట్ట బద్ధమైనవి. (2) సాంఘిక పరమైనవి (3) మతపరమైనవి. కులానికి ఆధారమైన భావనలేమిటి ? దురదృష్టవశాత్తూ కులానికి మతపరమైన భావనలు ఆధారం. ఎందుకంటే వర్ణవ్యవస్థ యొక్క కొత్త రూపంగా కుల వ్యవస్థ, దాని సమర్థనలను వేదాలనుంచి తెచ్చుకుంటుంది. వేదాలు హిందూమతానికి పవిత్రగ్రంథాలూ, తిరుగులేనివీ. దురదృష్టవశాత్తూ అని ఎందుకంటున్నానంటే మత పరమైన సమర్థన వున్న ప్రతీదీ పవిత్రమూ, శాశ్వతమూ అవుతుంది. అందువల్ల హిందువులకు కులం పవిత్రమైనదీ, శాశ్వతమైనదీ. కులం నిర్మూలించబడకపోతే ఇక అస్పృశ్యతానిర్మూలనకు అవకాశమేది?

**పాదసూచికలు :**

1. మనుస్మృతి 10-28
2. Ibid 10 - 31
3. Ibid 10-39

అనువాదం : .వి.వెంకట్రామారావు.

నాలుగవ భాగం

# అస్పృశ్యులు ఎదుర్కోవలసినవి

అధ్యాయం – 12

## పాలనా విభాగాల వ్యతిరేకత

భారత శిక్షా స్మృతిలోని రెండవ సెక్షన్ ఇలా చెపుతుంది:

" ఈ చట్టంలో పొందు పరచిన వాటికి వ్యతిరేకంగా చేసే పనులు లేక నిర్దేశించిన విధులను చేయకపోవడం ద్వారా బ్రిటిష్ ఇండియాలో నేరస్థులు అయిన ప్రతి వ్యక్తినీ ఈ శిక్షాస్మృతిని అనుసరించి, మరియు ఈ శిక్షా స్మృతిని అనుసరించి మాత్రమే శిక్షించాలి."

ఈ శిక్షాస్మృతి చిత్తు ప్రతిని తయారు చేసిన కమీషనర్లు దేశ వ్యవహారాల కార్యదర్శికి ఉద్దేశించిన పత్రంలో "ప్రతి వ్యక్తి" అనే పదంపై ప్రత్యేక శ్రద్ధను చూపమని కోరుతూ ఈ విధంగా వివరణనిచ్చారు.

"కంపెనీ సరిహద్దుల లోపల నివసిస్తున్న భారత దేశపు సాంప్రదాయిక రాజవంశాల వారెవరినీ ఈ శిక్షాస్మృతి పరిధినుంచి మినహాయించే ప్రతిపాదన ఏదీ మేము చేయలేదన్న విషయాన్ని మీరు గుర్తించాలి. ప్రస్తుతం వున్న ధర్మశాస్త్రాల గురించి మరింత స్పష్టమైన అవగాహన లేకుండా, వాటిని ఎలా అర్థం చేసుకుంటున్నారో, వాటిపై జరిగే చర్చల చరిత్ర ఏమిటో, ఆ వంశాల శక్తులూ, వారి స్వభావాలూ ఎలాంటివో, వారి పట్ల ప్రజా సమూహపు అభిప్రాయాలు ఎలా వున్నాయో తెలియని మేము ఈ మినహాయింపులు వుండాలా లేదా అనే విషయం నిర్ధారించే ప్రయత్నం చేయలేదు. అయితే, అటువంటి మినహాయింపులనివ్వడం అన్యాయమని మా మనవి. ఏ వ్యక్తి అయినా చట్టానికి అతీతుడుగా ఉండడం తప్పు. అలా చట్టానికి అతీతంగా ఉండడం గొప్ప తనమనీ, ఈర్ష్యపడదగిన స్థితి అనీ ప్రజలకు నేర్పడం అంతకంటే తప్పు. ఇటువంటి సౌకర్యాలను ఎంత ఎక్కువ కాలం కొనసాగిస్తే వాటిని తొలగించడం అంతే ఎక్కువ కష్టమవుతుంది. వివిధ జాతులు, మతాల ప్రజలందరికీ వర్తించే ఒక కొత్త శిక్షా స్మృతిని ప్రభుత్వం ప్రవేశ పెడుతున్న సమయం కంటే అటువంటి సౌకర్యాలను తొలగించడానికి అనువైన

సమయం మరొకటి లేదు. ప్రజలు దృఢంగా విశ్వసించే మత విశ్వాసాలు అడ్డువస్తే తప్ప సమాన న్యాయపు ప్రయోజనాల విషయంలో మరే ఇతర అడ్డంకులనూ లెక్క చేయవలసిన అవసరం లేదేమోనని అభిప్రాయం".

పాతుకుపోయివున్న వ్యవస్థ (Established order) పై ఈ సమాన న్యాయ సూత్రం చావు దెబ్బ తీస్తుందని అనిపించివుండవచ్చు. కానీ వాస్తవంలో ఈ పాతుకుపోయిన వ్యవస్థ ఏ ఇబ్బందీ పడకుండా కొనసాగింది. సమాన న్యాయ సూత్రం ఎందుకు విఫలమైందనే ప్రశ్న రావచ్చును. దానికి సమాధానం సులభం. సమాన న్యాయాన్ని సూత్రీకరించడం వేరు. అమలు పరచడం వేరు. సమాన న్యాయ సూత్రపు ఆచరణాత్మక ప్రభావం దాన్ని అమలు పరచవలసిన ప్రజా పరిపాలనా విభాగాల (civil sevrvices) స్వభావాల మీదా, లక్షణాల మీదా ఆధార పడి ఉంటుంది. పరిపాలనా విభాగాలు, వాటి వర్గ పక్ష పాతాల వల్ల పాత వ్యవస్థకు మద్దతుగా, కొత్త వ్యవస్థకు వ్యతిరేకంగా వుంటే కొత్త వ్యవస్థ అసలు ఏర్పడలేదు. కొత్త వ్యవస్థ ఏదైనా విజయం సాధించడానికి అందుకు అనుగుణంగా రూపొందించబడిన పరిపాలనా విభాగాలు అత్యవసరాలన్న విషయాన్ని 1871లో పారిస్ కమ్యూన్ ఏర్పాటు సందర్భంలో కారల్ మార్క్స్ చెప్పాడు. దాన్ని, సోవియట్ కమ్యూనిజాన్ని ఏర్పరచేటప్పుడు లెనిన్ అనుసరించాడు. దురదృష్టవశాత్తు బ్రిటిష్ ప్రభుత్వం పాలనా విభాగాలలోని మనుషుల గురించి పట్టించుకోలేదు. వాస్తవానికి అది సమానత్వ సూత్రానికి తావులేని పాత వ్యవస్థను నమ్మే వర్గాల వారికే సివిల్ సర్వీసుల ద్వారాలు తెరచి పెట్టింది. అందువల్ల భారత దేశం బ్రిటిష్ వారి పాలనలో వున్నా హిందువుల నిర్వహణలోనే వున్నది. సివిల్ సర్వీసు ఉద్యోగులకు సంబంధించిన గణాంక వివరాలు ఈ విషయాన్ని రుజువు చేస్తాయి.

దేశ రాజధాని నుండి చిన్న గ్రామం వరకూ పరిపాలనా శాఖలన్నీ హిందువులచే ఆక్రమించుకోబడి వున్నాయి. సర్వత్రా వ్యాపించిన దేవుడిలాగా హిందువులు పాలనా వ్యవస్థ (Administration) ను ఆక్రమించుకుని దాని అన్ని శాఖలలోనూ, అన్ని మూలలలోనూ అధికారం కలిగి వున్నారు. పాత వ్యవస్థను వ్యతిరేకించే వారు తప్పించుకునేందుకు ఇందులో ఏ వీలూ లేదు. ఏ శాఖ అయినా - రెవెన్యూ, పోలీసు, లేక న్యాయశాఖ - అన్నింటినీ నడిపించేది హిందువులే. పాతుకుపోయిన వ్యవస్థ ఇంకా కొనసాగడానికి కారణం రాజ్య విభాగాలలోని హిందూ అధికారుల పూర్తి మద్దతు మాత్రమే.

ఈ హిందూ అధికారులు విషయాల మంచి చెడ్డలను బట్టి నిర్ణయాలు తీసుకోవడం లేదు. వాటిలో ఇమిడివున్న పార్టీలను బట్టి వాళ్ళు పాలన సాగిస్తున్నారు. అందరికీ సమాన న్యాయమనేది వాళ్ళ సూత్రం కాదు. పాత వ్యవస్థకు అనుకూలమైన న్యాయమే వారి నినాదం. ఇది అనివార్యం. ఎందుకంటే పాతుక్కుపోయిన వ్యవస్థలో వివిధ వర్గాల పట్ల వున్న అభిప్రాయాలను వారు పాలనా విభాగాలలోనికి తీసుకొని వస్తారు. అస్పృశ్యుల పట్ల రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగుల ప్రవర్తన ఈ విషయాన్ని రుజావు చేస్తుంది.

ఒక సవర్ణునికి వ్యతిరేకంగా ఫిర్యాదును తీసుకొని ఒక అస్పృశ్యుడు గనుక ఒక పోలీసు ఆఫీసరు దగ్గరకు వెళితే అతనికి రక్షణకు బదులుగా చెప్పలేనన్ని తిట్లు లభిస్తాయని ప్రతి అస్పృశ్యుడూ సాక్ష్యమివ్వగలడు. అసలు ఆ ఫిర్యాదును స్వీకరించకుండా అతన్ని తరిమేయడమో, లేక స్పృశ్య నేరస్తుడు తప్పించుకోవడానికి వీలుగా దాన్ని తప్పుగా నమోదు చేసుకోవడమో జరగుతుంది. తనకు అన్యాయం చేసిన వారిని అతడు మెజిస్ట్రేట్ ముందు విచారణకు తెచ్చినా, ఆ విచారణ భవిష్యత్తు ఏమవుతుందో ముందే చెప్పవచ్చు. అస్పృశ్యుల కేసు ఎంత న్యాయమైనదైనా దాన్ని సమర్థించకూడదనే గ్రామస్తుల కుట్రవల్ల అస్పృశ్యుడికి హిందువులెవరూ సాక్షులుగా దొరకరు. అతడు అస్పృశ్యుల నుంచే సాక్షుల్ని తెస్తే మెజిస్ట్రేటు వారి వాంగ్మూలాన్ని స్వీకరించడు. ఎందుకంటే వారు పక్షపాతం గలి, వున్నారనీ, స్వతంత్ర సాక్షులు కారనీ సులభంగా కొట్టి పారెయ్యవచ్చును. వారు నిజంగా స్వతంత్ర సాక్షులే అయినా వారి సాక్ష్యం సత్యమనిపించలేదని చెపుతూ నిందితులను వదిలివేయడానికి సులభమైన మార్గం మెజిస్ట్రేట్‌కు వుంది. ఈ పనిని ఆయన నిర్భయంగా చేయగలడు. ఎందుకంటే విచారణ జరిపిన మెజిస్ట్రేటు ఇచ్చిన తీర్పును పైకోర్టులేవీ - అవి సాక్షులను ప్రత్యక్షంగా పరిశీలించవు గనుక -మార్చకూడదనే నిశ్చితమైన నియమం వుంది.

ఈరకమైన వివక్ష చూపబడుతున్న వాస్తవాన్ని కాంగ్రెస్ వారు సైతం ఆమోదిస్తున్నారు. 1937 సెప్టెంబర్ 30 నాటి తమ వార్షిక నివేదికలో తమిళనాడు హరిజన సేవక సంఘం ఇలా చెపుతున్నది.[1]

"హక్కులను ప్రకటించడం వల్ల హరిజనుల రాజకీయ చైతన్యం పెల్లుబికింది. కానీ పోలీసులే రాజ్యమేలే మారుమూల పల్లెల్లో హరిజనులకు ఇది సులభం కాదు. ఎందుకంటే

తన హక్కులను సాధించుకోవడమంటే సవర్ణులతో ఘర్షణ పడడమే. ఈ ఘర్షణల వల్ల సవర్ణులతో ఘర్షణలకు సహజమైన కొనసాగింపు ఏమిటంటే మెజిస్ట్రేటుకో, పోలీసులకో ఫిర్యాదు చేయడం. మొదటి పద్ధతి హరిజనులకు అందుబాటులో లేనిది. రెండవది చాలా నిష్ప్రయోజనకరమైనది. చాలా సార్లు ఫిర్యాదులపై దర్యాప్తు జరగనే జరగదు. మిగిలిన వాటిలో సవర్ణులకు అనుకూలమైన పరిశీలనలు రాయబడతాయి. పోలీసులకు మేమిచ్చిన ఫిర్యాదులకూ అదేగతి పట్టింది. క్రింది స్థాయి పోలీసుల మనస్తత్వాలలో ఏమార్పూ రాకపోవడమే దీనికి కారణమని మాకు అనిపిస్తోంది. తాను పరిరక్షించవలసిన హరిజనుల హక్కుల గురించి అతనికేమీ తెలియకపోవడమో లేక సవర్ణుల ప్రభావంలో పడిపోవడమో జరుగుతోంది. లేక అతడు పూర్తి నిర్లక్ష్యంతో వుండడం కూడా జరగవచ్చు. కొన్ని ఇతర సందర్భాలలో అతడు సంపన్నులైన సవర్ణుల పక్షం తీసుకోవడానికి కారణం లంచగొండితనం"

దీని వల్ల హిందూ ఉద్యోగి అస్పృశ్యులకు వ్యతిరేకంగా, హిందువులకు అనుకూలంగా ఉన్నాడని తెలుస్తుంది. ఎక్కడైతే అతనికి అధికారం, విచక్షణతో నిర్ణయాలు తీసుకునే అవకాశం వుంటాయో,వాటన్నిటినీ అస్పృశ్యులకు వ్యతిరేకంగానే ఉపయోగిస్తాడు.

పోలీసులూ, మెజిస్ట్రేట్లూ కొన్ని సార్లు లంచగొండులై వుంటారు. వారు కేవలం లంచగొండులే అయితే సమస్య ఇంత తీవ్రంగా వుండేది కాదు. ఎందుకంటే లంచగొండి అయిన అధికారిని ఇరుపక్షాల వారూ కొనుక్కునే అవకాశం వుంటుంది. కానీ పోలీసులూ, మెజిస్ట్రేట్లూ తరచుగా అవినీతికి కాక పక్షపాతానికి పాల్పడుతున్నారు. ఈ పక్షపాతంవల్లనే అస్పృశ్యులకు రక్షణా, న్యాయమూ తిరస్కరించబడుతున్నాయి. ఈ పక్షపాతం ప్రతి హిందువుకు పుట్టుకతో వచ్చే సాంఘిక, మతపరమైన వ్యతిరేకత పై ఆధారపడినది గనుక దీన్ని తొలగించే వీలులేదు. తమ ఉద్దేశ్యాలూ, ప్రయోజనాలూ, పెంపకాల వల్ల పోలీసులకూ, మెజిస్ట్రేట్లకూ అస్పృశ్యులలో పని చేస్తున్న జీవశక్తి పట్ల సానుభూతి వుండదు. అస్పృశ్యులను ప్రేరేపించే కోరికలూ, కష్టాలూ, ఆకాంక్షలూ, కోరికలతో వారు ఉత్తేజితులు కారు. అందువల్ల వారు అస్పృశ్యుల ఆకాంక్షలను బహిరంగంగా తిరస్కరిస్తూ శత్రు దృష్టితో ప్రవర్తిస్తారు. వారి అభివృద్ధికితోడ్పడక పోగా, వారి ప్రయత్నాలను వ్యతిరేకిస్తూ వారిలో ఏమాత్రం గర్వం, ఆత్మాభిమానం కనబడినా దాన్ని తుంచి వేస్తారు. అదే సమయంలో వారు తమ తోటి హిందువుల భావాలను పంచుకుంటూ అస్పృశ్యులపై తమ అధికారాన్ని, ఆధిపత్యాన్ని, గౌరవాన్ని, ఆధిక్యతనూ నిలుపుకోవాలని వారు చేస్తున్న

ప్రయత్నాల పట్ల సానుభూతి చూపిస్తారు. ఇరు వర్గాల మధ్య వచ్చే ఏఘర్షణ లోనైనా వారు హిందువుల బంట్లుగా అస్పృశ్యుల తిరుగుబాటును అణచి వేయడానికి ప్రయత్నిస్తారు. అస్పృశ్యులకు గుణపాఠం నేర్పి వారి పాత స్థానంలోనే అణచి వుంచడానికి హిందువులు చేసే దుష్ట యత్నాలలో మాత్రం వీరంతా సిగ్గువిడిచి, బహిరంగంగా పాల్గొంటారు.

ఈ వేధింపులూ, అన్యాయాలలో దారుణమైనదేమిటంటే, వీటన్నిటినీ చట్టాన్ని అతిక్రమించకుండానే చేయవచ్చును. చట్టాన్ని ఏ మాత్రం ఎదిరించకుండానే ఒక హిందువు అస్పృశ్యులకు పని ఇవ్వననీ, వారికి ఏమీ అమ్మననీ, తన భూమినుంచి అతణ్ణి బహిష్కరిస్తాననీ, తనభూమిలోంచి అస్పృశ్యుల పశువుల్ని తీసుకువెళ్ళరాదనీ అనవచ్చును. అలా చేయడంలో అతడు కేవలం తన హక్కును వాడుకుంటున్నాడు. అతని ఉద్దేశ్యాలేమిటనేది చట్టానికి అవసరంలేదు. దానివల్ల అస్పృశ్యులకు కలిగే నష్టమేమిటో చట్టం పట్టించుకోదు. పోలీసులు తమ అధికారాన్ని దుర్వినియోగం చేయవచ్చు. ఇవ్వని వాంగ్మూలాన్ని రాయడం ద్వారానో లేక ఇచ్చినదానికి భిన్నంగా రాయడం ద్వారానో పోలీసులు ఉద్దేశ్యపూర్వకంగా రికార్డులను తారుమారు చేయవచ్చు. తనకు ఆసక్తి వున్న పక్షానికి అనుకూలంగా సాక్ష్యాలును అందించవచ్చు. అరెస్టు చేయడానికి తిరస్కరించవచ్చు. కేసును బలహీనపరచడానికి కావలసిన వెయ్యి రకాల ప్రయత్నాలు చేయవచ్చు. ఇదంతా పట్టుబడతానేమోననే భయం లేకుండా చేయవచ్చు. చట్టంలో చాలా లోసుగులున్నాయి అతనికవన్నీ తెలుసు. మెజిస్ట్రేటుకు అనేక విచక్షణాధికారాలున్నాయి. వాటిని త. ఇష్టప్రకారం ఉపయోగించుకొనే స్వేచ్ఛ ఆయనకుంది. ఒక కేసులో నిర్ణయం సాక్ష్యం చెప్పగల సాక్షుల పై ఆధారపడి వుంటుంది. అయితే ఆ నిర్ణయం సాక్షి విశ్వసనీయుడా కాదా అనే విషయంపై ఆధారపడి వుంటుంది. ఒక పక్షాన్ని విశ్వసించి, అవతలి పక్షాన్ని నమ్మకుండా వుండే అధికారం మెజిస్ట్రేటుకు వుంటుంది. అలా నమ్మడం ఏకపక్షంగా చేయవచ్చు కానీ అది ఆయనకున్న విచక్షణ. దానిలో ఎవరూ కలగజేసుకోలేరు. అస్పృశ్యులకు వ్యతిరేకంగా, పక్షపాతంతో ఈ విచక్షణాధికారాన్ని ఉపయోగించిన సందర్భాలు కోకొల్లలు. అస్పృశ్యుల సాక్షులు ఎంతనిజం చెప్పినా "ఈ సాక్ష్యాలను నేను నమ్మను" అనే మాటతో మెజిస్ట్రేట్లు కొట్టి పారేస్తారు. ఆ విచక్షణ నెవ్వరూ ప్రశ్నించలేరు. ఏ తీర్పునివ్వాలనే విషయం కూడా మెజిస్ట్రేటుకే వదిలివేయబడింది. కొన్ని తీర్పులపై అపీలు చేసుకునే వీలుంటుంది. అపీలు అనేది తీర్పులో పొరపాట్లను సరిదిద్దే అవకాశం.

కానీ అపీలు చేయడానికి వీలులేని తీర్పునివ్వడం ద్వారా మెజిస్ట్రేటు ఈ మార్గాన్ని మూసివేయవచ్చు.

పాత వ్యవస్థను కొనసాగించేందుకు హిందూ సమాజం తనవంతు పాత్ర నిర్వర్తించినట్లే, ప్రభుత్వంలోని హిందూ ఉద్యోగులు కూడా తమవంతు పాత్ర నిర్వర్తిస్తున్నారు. ఈ రెండూ కలిసి పాతుకు పోయి వున్న వ్యవస్థను అభేద్యంగా తయారు చేశాయి.

**పాదసూచిక :**

1. చూ. హిందూ, మార్చి 7, 1938.

అనువాదం : వి. వెంకట్రామారావు

అధ్యాయం – 13

# వివక్షతా సమస్య

అస్పృశ్యులకు "సాంఘికవెలి" సమస్య అన్నిటికన్నా తీవ్రమైనది. హిందువులు అస్పృశ్యుల పట్ల పాటించే ఈ వివక్షతకు కొలమానం లేదు. నిత్యజీవితంలో అస్పృశ్యుల పట్ల వివక్షత చూపని రంగమే లేదు. మిక్కిలి క్రూరమైన ఈ సమస్యను బయటి వ్యక్తులూహించుకోవడం కూడా అసంభవం.

సాంఘిక సంబంధాలలో ఈ విభేదం అన్ని రంగాలలో అనగా – తినడం, త్రాగడం, ఆటలు, పాటలు, స్నానపానాదులు, దేవతార్చనలు... అన్నింటిలోనూ పాటింపబడుతుంది.

ఇక ప్రజా సౌకర్యాల విషయానికొస్తే ప్రతిచోట ఈ విభేదం ప్రత్యక్షమవుతూనే వుంది. పాఠశాలలు, మంచినీటి బావులు, దేవాలయాలు, ప్రయాణ సాధనాలు, వీటన్నింటిలోనూ అస్పృశ్యులకు ప్రవేశం లేదు. ప్రజాపాలనలో కూడా ఇది వేళ్ళు పాతుకుపోయి వుంటుంది. న్యాయస్థానాలు, ప్రభుత్వ విభాగాలు, కో–ఆపరేటివ్ బ్యాంకులు, మరీ ముఖ్యంగా పోలీస్ వ్యవస్థలో ఈ విభేదం అనునిత్యం పాటింపబడుతూనే వుంది. అస్పృశ్యులు భూమి, రుణాలు, ఉద్యోగాలు పొందటంలో ఈ వివక్షత హద్దులు మీరిన పాత్ర వహిస్తుంది. ఉద్యోగాలలో అస్పృశ్యుల ప్రవేశానికి, పదోన్నతికీ ఎలాంటి నియమనిబంధనలు లేకున్నా అందరూ గుర్తించే నిషేధాలు మాత్రం వుంటాయి. చాలా సార్లు అస్పృశ్యులకు ప్రవేశమే ఉండదు. అన్ని శాఖలూ అస్పృశ్యులకి మొండి చెయ్యి చూపుతాయి. బట్టల మిల్లులలో నేతపనిలో, సైన్యంలో అస్పృశ్యులకు ప్రవేశం లేదు. ఒక వేళ ప్రవేశించినా, అస్పృశ్యుడు తాను ఉండాల్సిన పరిమితుల్లోనే ఉండాలి. ఎంత అనుభవజ్ఞుడైనా, సమర్థుడైనాపైకి ఎదగడానికి అవకాశాలుండవు.

పరిపాలనా వ్యవహారాల్లో హిందువుకన్నా పై స్థానంలో అస్పృశ్యుడిని ఉంచరాదనేది అందరూ పాటించే సూత్రం. ఇందువల్ల అస్పృశ్యులకు ఒక ప్రత్యేకశాఖను కేటాయిస్తే తప్ప ఏ మాత్రం ప్రాముఖ్యత వున్న ఉద్యోగంలోకైనా వారు ప్రవేశించడం కుదరదు. ఒక్క మాటలో చెప్పాలంటే వివక్షత చూపకుండా అస్పృశ్యులను పని చేయనివ్వగలిగేది ఒక్క పాకీ పనిలో మాత్రమే. ఎందుకంటే దాన్ని పూర్తిగా వాళ్ళకే అప్పగించారు, హిందువులెవరూ

దానికి పోటీ పడరు. ఈ రంగంలో కూడా ఉన్నత పదవుల విషయంలో వివక్షత చూపబడుతుంది. అశుభ్రమైనపని మొత్తం అస్పృశ్యులు చేయగా. వారిని పర్యవేక్షించే పని, అధిక జీతాలు వచ్చే, అశుద్ధాన్నితాకనవసరంలేని పని మాత్రం హిందువులకు అప్పగించబడుతుంది. ఇటువంటి వ్యవస్థలో పౌరహక్కులు అంటే అస్పృశ్యుల హక్కులు కావు. ప్రజలచే, ప్రజల కొరకు ఏర్పరచిన ప్రజాస్వామ్య ప్రభుత్వం అస్పృశ్యులకు చెందింది కాదు. అందరికీ సమాన హక్కులంటే అస్పృశ్యులకు సమాన హక్కులుకావు. దేశంలో ప్రతిమూల అస్పృశ్యులు ఇలాంటి కష్టనష్టాలెదుర్కొంటున్నారు. అన్యాయాలను, అవమానాలను దిగమింగుతూనే వున్నారు. వీరు ఎటువంటి హక్కులూ, అధికారాలూ లేని నిర్భాగ్యులు. ఈ పరిస్థితుల్లోని వాస్తవం ఒక్క అస్పృశ్యులకే అర్థమవుతుంది. ఈ వివక్ష అస్పృశ్యుల జీవన విధానంలో అధిగమించలేని అడ్డంకి. ఇది వారిని ప్రతినిత్యం ఏదో ఒక భయంతో క్రుంగిపోయేలా చేస్తుంది. నిరుద్యోగం, అవమానం, దాడి, శిక్ష ఇలా ఏదో ఒక సమస్య వారిని వెన్నాడుతూనే వుంటుంది. వారిది రక్షణ లేని జీవితం.

మరొక రకం వివక్ష సూక్ష్మంగా వున్నా వాస్తవమైనది. అది ప్రజ్ఞతో ఉన్నత స్థానాన్ని పొందిన అస్పృశ్యుణ్ణి ఒక క్రమపద్ధతిలో దిగజార్చటం.

ఒక హిందూ నాయకుడిని ఒక గొప్ప భారతీయ నాయకుడిగా అభివర్ణిస్తారు. అతడు కాశ్మీరీ బ్రాహ్మణుడైనా అతన్ని కాశ్మీర్ బ్రాహ్మణ నాయకుడని పిలవరు. అదే అంటరాని వాడు ఆ స్థానంలో వుంటే అతన్ని పలానా వ్యక్తి, అస్పృశ్యులనాయకుడు అంటారు. ఓ హిందూ వైద్యుణ్ణి భారతీయ వైద్యుడంటారు కానీ "అయ్యంగార్" అని అతని ఎల ప్రస్తావన తీసుకురారు. అదే ఒక అస్పృశ్యుడు వైద్యుడైతే అతనిది అంటరానిజాతిగా ప్రత్యేకించి చెప్పబడుతుంది. ఒక హిందూగాయకుడు భారతీయ గాయకుడుగా పిలువబడుతాడు. కాని ఒక అస్పృశ్యుడు అదే స్థానంలో వుంటే అంటరాని గాయకుడుగా చెప్పబడుతాడు. ఒక హిందూ మల్లయోధుడు భారతీయ మల్లయోధుడుగా పిలువబడుతాడు. కానీ ఒక అంటరానివాణ్ణి అస్పృశ్య మల్లయోధుడనే అంటారు.

ఈ విభేదానికి పునాది హిందూ దృక్పథంలో నుండే జన్మించింది. అస్పృశ్యులు తమ కంటే తక్కువ వారనీ, వారెంత గొప్పవారయినా, మేధావులయినా అస్పృశ్యులలో గొప్పవారిగా పరిగణించాలేకాని, వారు హిందువులకన్న అధికులు, సమానులు ఎన్నటికీ కారనే సాంఘిక వివక్ష, ఆర్థిక విభేదం కన్నా తక్కువ బాధ పెట్టేది కాదు.

వివక్షత అనేది స్వాతంత్ర్యం లేకపోవడానికి మరో పేరుమాత్రమే. శ్రీ టానీ (Tawney)[1] గారి మాటల్లో చెప్పాలంటే "ప్రస్తుత పరిస్థితికీ, కాలానికీ సంబంధించకుండా స్వేచ్ఛ ఎక్కడో బజార్లో దొరకదు. కాగితంపై వ్రాసిన మాటలు, విషయాలు కాకుండా స్వేచ్ఛ అంటే వాస్తవంగా ఉన్నవాటిల్లో ఎన్నుకోగలిగే స్వాతంత్ర్యం కల్గి వుండడం. ఇంకా చెప్పాలంటే కొన్ని నిర్ణీత పరిస్థితుల్లో కొన్ని పనులు చేయగలడం లేకపోతే చేయకుండా ఉండగల్గడం. అలాకానప్పుడు స్వేచ్ఛకు అర్థంలేదు. ఎందుకంటే, మనిషి తనకు తానై ఆలోచించి వ్యవహరించినపుడే సంపూర్ణ మానవుడు. అందువల్ల కవులు చెప్పినట్లుగా స్వేచ్ఛకు బాహ్య సౌకర్యాలు వుండాలి. కాని ప్రతిరోజు వుండే జీవిత వచనంలో స్వేచ్ఛ వాస్తవమైనదిగనూ, అభ్యాస సిద్ధమైనదిగనూ వుండాలి. ప్రతి మనిషికీ నిస్సందేహంగా కొన్ని అవసరాలుంటాయి. అవి బ్రతకడానికి కావల్సిన నిత్యావసరాలనుండి, తన భావాలను వ్యక్తపరుస్తూ మాట్లాడగలగడం, వ్రాయగల్గడం, సంఘకార్యకలాపాలలో పంచుకోగల్గడం, తనకు నచ్చిన పద్ధతిలో దేవుణ్ణి ఆరాధించడం లేదా ఆరాధించకపోవడం, తద్వారా కలిగే అనుభవాల్ని తన పురోగతికి ఉపయోగించుకోవడం - అన్నీ కూడా అవసరాలే. దాని అతి మౌలిక సారానికి కుదిస్తే స్వేచ్ఛ - ప్రకృతికీ, సమాజంలోని ఇతరుల అవసరాలు తీర్చే స్థాయికీ అనుగుణంగా వుండి తన ఈ అవసరాలని తీర్చుకునేందుకు అవసరమైన చర్యలు తీసుకునే అవకాశం కలిగి వుండడం"

ఇప్పటివరకు స్వేచ్ఛా స్వాతంత్ర్యాలపై వున్న జాబితాలకు ఇంకొకటి కలపాలన్నది నా ఉద్దేశ్యం కాదు. కాని ఈ రెండు పరిశీలనలు అందరికీ వర్తిస్తాయి. మొదటుగా హక్కులు అనేవి స్వేచ్ఛ, స్వాతంత్ర్యాలకు సార్థకమైన సూచీలుగా ఉన్నప్పుడు, అది స్తోమత వున్న అందరూ రిట్జ్ హోటల్‌లో భోజనం చేయగల్గే హక్కులాగా వుండకూడదు. అవసరమైనపుడు అందరూ ఉపయోగించుకోగల్గేటట్లు వుండాలి. ఓటు హక్కు మరియు సమావేశం జరిపే హక్కు వాస్తవంలో చాలా వరకు నిరుపయోగంగానే వున్నాయి. సమావేశపు హక్కు అంటే పారద్రోలడం, ఓటు హక్కు అంటే సారాయి నింపడం. ఇలా నిజ జీవితంలో హక్కుల వల్ల లభించే అధికారాలు సన్నగిల్లుతున్నాయి. ఇష్టమైన వృత్తుల లోనికి ప్రవేశించడానికి వెల చెల్లించలేనప్పుడు వృత్తి హక్కు, పేదవాడు న్యాయానికి వెల చెల్లించలేనపుడు, సమాన న్యాయహక్కు, సంతోషంగా బ్రతకడానికి పరిస్థితులు అనుకూలించనపుడు, పుట్టిన బిడ్డలలో ఎక్కువ మంది ఏడాది నిండకుండానే మరణిస్తున్నప్పుడు స్వేచ్ఛా

ఆనందాన్ని పొందే హక్కూ, జీవించగలిగే హక్కూ నిర్వీర్యములూ, జూదంలో పెట్టిన పెట్టుబడులూ అవుతాయి.

ఇక రెండవ విషయానికొస్తే ఈ స్వేచ్ఛ, హక్కులు అనేవి అందరూ అనుభవించగలవిగా వుండాలి కానీ, సమాజంలో ఏ కొద్దిమందికో అందుబాటులో ఉండరాదు. ఒక సాధువు చెప్పినట్లు ఒక దేశంలో 5 శాతం మంది బహు భార్యత్వాన్ని పాటిస్తూ మిగిలిన వారంతా పెళ్ళికాకుండా వుంటే వివాహం ఒక జాతీయ వ్యవస్థ కాలేదు. స్వేచ్ఛ విషయంకూడా అంతే. కొన్ని వర్గాలవారు తమకు చిత్తం వచ్చిన రీతిలో ఆనందంగా జీవిస్తుంటే, మిగిలినవారు వారి జీవితావసరాలలో చాలా కొద్ది వాటినే తీర్చుకుంటున్న సంఘానికి కూడా కొన్ని సుగుణాలు వుంటే వుండవచ్చు. కాని, స్వేచ్ఛ వాటిలో ఒకటి కాదని ఖచ్చితంగా చెప్పగలను. స్వేచ్ఛ అంటే వాస్తవంగా సమాజంలో వుండే వ్యక్తులందరూ వారి అధికారాలనుపయోగించుకొని, సంపూర్ణంగా ఎదిగి, దేనినైతే తమ వృత్తిగా భావిస్తారో దానిని చేపట్టగలగడం. అలాగే స్వేచ్ఛ కఠోరమైనదికాదు. కనుక వారికి అయిష్టమైన వాటిని విడిచి పెట్టగలిగేటట్లు ఉండడమే స్వేచ్ఛ. కాని, ఒక పరిపూర్ణమైన మానవుడిగా జీవించగల్గే హక్కు కొద్ది మందికే అందుబాటులో వున్నప్పుడు దానిని హక్కు అనలేము. అది కొద్ది మందికి మాత్రమే లభించిన విశేషాధికారము.

హిందువులు అస్పృశ్యులపట్ల చూపించే వివక్షత, అభిప్రాయాలు, న్యాయ, పరిపాలనా వ్యవస్థలో కూడా ప్రతిబింబిస్తున్నాయి. అందువల్లనే అస్పృశ్యులు ప్రతిసారీ హీనంగా చూడబడుతూ, అన్యాయానికి గురవుతున్నారు. అస్పృశ్యులకు అవకాశం ఇచ్చినట్లయితే వారు తమకన్నా పై చేయిగా ఉంటారేమోనన్న హిందువుల భయం, సంఘంలో తమ అధికారపీఠానికి భంగం వాటిల్లుతుందేమోనన్న ఆందోళన, అస్పృశ్యులు తమకన్నా పైకి ఎదగరాదనే ఆలోచనలు- ఇవీ ఇలాంటి విభేదాలకు మూల కారణాలు. ఈ హిందూ సాంఘిక వ్యవస్థ కొనసాగినంత కాలం అస్పృశ్యుల పట్ల ఈ వివక్షత కొనసాగుతూనే వుంటుంది.

**పాదసూచిక :**

1. "We mean Freedom in What Labour can do ?" పేజీ 83-85

అనువాదం : టి. సత్యనారాయణ

**అధ్యాయం - 14**

# వేర్పాటు సమస్య

అస్పృశ్యుల ఉద్యమం ఎందుకు సఫలీకృతం కాలేదు? వారికి తోడ్పడేజాతులు లేవా? వారు ఎందుకు సహకరించడం లేదు? అనేవి ఆలోచించాల్సిన ప్రశ్నలు. వీటిని సంపూర్ణంగా అర్థం చేసుకోవాలి. జవాబివ్వడానికి ముందు హిందూ సాంఘిక విధానాన్ని గూర్చి కూలంకషంగా అవగాహన కలిగి వుండాలి.

హిందూ సమాజంలో కుల వ్యవస్థ చాలా సంక్లిష్టమైంది. క్రింద చూపిన పటం ఈ వ్యవస్థను అర్థం చేసుకోవడానికి కొంత సహాయ పడగలదని నేను భావిస్తున్నాను.




పై వర్గీకరణంలో చూపినట్లుగా, లెక్కకు మించిన కులాలు ఉన్నప్పటికీ, అవన్నీ నాలుగు వర్గాలుగా విభజింపబడివున్నాయి. వాటిలో ప్రథమ వర్గం వారు పాలకులు కాగా, మూడవ, నాల్గవ వర్గాలవారు పాలితులు. అయితే, ఈ వర్గాలలో అస్పృశ్యులకు సహజంగా సహాయపడగల వారెవరో పరిశీలిద్దాం.

ప్రథమ వర్గం వారు హిందూ సమాజంలో విశేషాధికారాలు కలవారు. కుల వ్యవస్థ వారిచే సృష్టించబడింది. ఈ వ్యవస్థ నుండి ఎక్కువ లాభం పొందేవారు ఈ వర్గం వారే

కనుక, ఈ వ్యవస్థ సంరక్షకులు కూడా వీరే. కాబట్టి వర్గాన్ని బట్టిగానీ, శ్రద్ధతో కానీ, సిద్ధాంత సామీప్యం వల్ల గానీ ఈ వర్గాలవారు అస్పృశ్యుల మిత్రులు కాలేరు.

నేర ప్రవృత్తి గల జాతులు, ఆదిమజాతుల వారి పరిస్థితి ఏమిటి? హిందూ సాంఘిక వ్యవస్థను కూల దోయడానికి వీరికి బలమైన హేతువు వుంది .

శూద్రుల సంగతి ఏమిటి?

హిందూ వ్యవస్థలోని సాంఘిక ధర్మాలు అస్పృశ్యుల పట్ల ఎంతటి నిరాదరణ కలిగియున్నవో, శూద్రుల పట్ల కూడా అంతటి పరాయీభావాన్ని వ్యక్త పరుస్తున్నాయి. హిందూ సమాజ వ్యవస్థ యొక్క నిర్మాణ శిల్పి అయిన మనువు శూద్రులకు ఇచ్చిన స్థానాన్ని గురించి తెల్సుకోవడం ఆసక్తికరంగా వుంటుంది.

మను ధర్మాలలో శూద్రుని స్థానాన్ని గూర్చిన అంశాలను క్రింద పొందు పరచడమైనది. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య గృహస్థులను మనువు ఈ విధంగా ఆదేశించాడు.

"శూద్రులు పాలకులుగా వున్న రాజ్యంలో అతడు నివసించరాదు'(4-61)

శూద్రుడు ఎన్నటికీ గౌరవ ప్రదమైన స్థానాన్ని పొందలేడు. ఎందుకనే విషయాన్ని మనువు ఇలా చెప్పాడు.

"ఏ విధంగానూ మత పరమైనా, లేక యాగ నిర్వహణ పరంగా కూడా బ్రాహ్మణుడు శూద్రుని నుండి యాచించరాదు" (11-24)

శూద్రులతో వివాహ సంబంధాలు నిషేధింపబడినవి. మిగిలిన మూడు వర్ణాల స్త్రీలను వీరు వివాహమాడరాదు. ఉన్నత వర్గాల స్త్రీలతో శూద్రులు ఎలాంటి సంబంధం కల్గి వుండరాదు. ఇటువంటి వ్యభిచారులకు మరణ దండన విధించేవారు.

"ఉన్నత వర్గాలకు చెందిన స్త్రీలతో లైంగిక సంబంధం కలిగిన శూద్రుల నిలా శిక్షించాలి. ఆ స్త్రీ ఎవ్వరి రక్షణలోనూ లేనట్లయితే, అతడు నేరం చేసిన శరీరభాగాన్ని కోల్పోవల్సి వుంటుంది. ఆ స్త్రీ ఎవరి సంరక్షణలోనైనా ఉన్నట్లయితే అతడికి మరణ దండన విధించబడుతుంది. అతని ఆస్తిజప్తు చేయబడుతుంది" (8-374)

"బ్రాహ్మణుడు కేవలం బ్రాహ్మణ కులంలో జన్మించినంత మాత్రాననే, వేదాలలో నిర్దేశించిన వేవీ చేయకపోయిననూ, ఎటువంటి శాస్త్రాలు చదువకపోయిననూ అతడు రాజాజ్ఞ మేరకు ధర్మ నిర్ణయం చేయగలడు. కాని, శూద్రుడు ఎంత పాండిత్యం సంపాదించుకున్నా ఆ స్థానాన్ని అందుకోలేడు" (8-20)

" ఏ రాజు యొక్క రాజ్యంలో శూద్రుడు ధర్మనిర్ణయం చేస్తాడో, ఆ రాజ్యం ఊబిలోపడిన ఆవువలె క్రుంగిపోతుంది" (8-21)

" ఏ శూద్రుడైనా గర్వంతో మతాన్ని ప్రవచించినచో, ఆతని నోటిలో, చెవులలో మసలుతున్న నూనె పోయంచబడుతుంది" (8-272)

శాస్త్ర, జ్ఞాన సముపార్జనలో మనువు నిర్ణయాలు ఈ విధంగా ఉన్నాయి.

"శూద్రులకు విద్య గరపినవాడు, శూద్ర గురువు వద్ద విద్యాభ్యాసం చేసినవాడు శ్రార్ధ కర్మల నిర్వహణకు అనర్హుడు" (3-156)

"శూద్రుని సమక్షంలో వేదాలు పఠించరాదు" (4-99)

మనువు వారసులు మరింత ముందుకు వెళ్ళి వేదపఠనం చేసిన శూద్రులకు ఇం కఠినమైన శిక్షల్ని నిర్దేశించారు. ఉదాహరణకు కాత్యాయనుని ఆదేశాల ప్రకారం శూద్రుడు వేదాలను పొరపాటునగానీ, పొంచి వుండిగానీ విన్నట్లయితే అతని నాలుక రెండుగా చీల్చబడుతుంది. అతని చెవులలో కరిగించిన సీసం పోయబడ్తుంది. ఇవి రాజాజ్ఞ పై అమలు చేసే శిక్షలు.

ఇక శూద్రుడి ఆస్తి గురించి మనువు ఇలా నిర్దేశించాడు.

"శూద్రుడు ఆస్థి సంపాదించే శక్తి కల్గి ఉన్నప్పటికీ, అతడు తన అవసరాలకు మించిన సొత్తును కలిగి వుండరాదు. అలా సంపాదించి ధనాన్ని కూడబెట్టుకున్నట్లయితే, అతడు అహంకారపూరితుడై, బ్రాహ్మణులను లక్ష్యపెట్టక పోవచ్చును (10-129)

"బ్రాహ్మణుడు తన జీవనానికి ఎలాంటి లోపం ఏర్పడినా, సందేహించకుండా శూద్రుని వస్తు, సంపదలను స్వాధీనం చేసుకోవచ్చు." (8-417)

శూద్రుడు ఒకే వృత్తిని నిర్వహించాలి. మనువు నిర్దేశించిన నిర్ణయాత్మకమైన ధర్మాలలో ఇది ఒకటి.

"భగవంతుడు ఆదేశించినట్లుగా బ్రాహ్మణ, క్షత్రియ వైశ్యజాతులను సేవించడమే శూద్రుల వృత్తి "(1-9)

"బ్రాహ్మణులకు సేవ చేయడం వల్ల జీవనం గడవని శూద్రుడు ధనవంతుడైన వైశ్యునికి సేవ చేయాలి" (10-121)

"బ్రాహ్మణులను సేవించిన శూద్రుడు స్వర్గాన్ని, ఉత్తమగతుల్నీ పొందగలడు (10-122)

"బ్రాహ్మణులకు సేవకులుగా వుండడమే శూద్రులకు తగిన వృత్తి. మరే పని కూడా దీనికి సాటి రాదు" (10-123)

బ్రాహ్మణులను సేవించడాన్ని మనువు శూద్రుని ఇష్టాయిష్టాలకు వదలలేదు. ఏ కారణం చేతనైనా శూద్రుడు బ్రాహ్మణునికి సేవకునిగా ఉండడానికి ఒప్పుకోని పక్షంలో అతనిచే బలవంతంగానైనా పని చేయించడానికి ఈ క్రింది సూత్రాలు పొందుపరచబడ్డాయి.

"బ్రాహ్మణుడు జీత భత్యాలతో నిమిత్తం లేకుండా శూద్రునితో సేవలు చేయించుకోవచ్చు. ఎందుకంటే బ్రాహ్మణులకు బానిసలుగా వుండడానికే భగవంతుడు శూద్రులను సృష్టించాడు" (8-413)

"శూద్రుని శక్తి, సామర్థ్యం, కుటుంబ పరిమాణాన్ని దృష్టిలో వుంచుకొని, వారు అతనికి కొంత ఆస్తిని కేటాయించవలెను" (10-124)

"బ్రాహ్మణులు తమ వద్ద మిగిలిన ఆహారాన్ని, వస్తు సామగ్రిని శూద్రునికివ్వవలెను" (10-125)

శూద్రుడు వేష, భాష, ప్రవర్తనలలో సేవకునివలె ప్రవర్తించాలి.

"ఎవరయినా శూద్రుడు ద్విజుణ్ణి దూషించినట్లయితే అతని నాలుక కత్తిరించబడుతుంది. ఎందుకంటే వాడు తక్కువ జాతివాడు కనుక" (8-270)

"అతడు ద్విజులయొక్క పేర్లు, కులాలను తిరస్కారంగా ప్రస్తావించిన యెడల, పదివేళ్ళ పొడవు గల ఇనుప మేకును ఎర్రగా కాల్చి అతని నోటిలో దిగగొట్టబడుతుంది" (8-271)

మనువు ఇంతటితో తృప్తి పడలేదు. శూద్రుని బానిస స్థితి అతని పేరు, ఇంటిపేరులో కూడా మార్మోగాలని ఆదేశించాడు.

"బ్రాహ్మణుని ఇంటిపేరు శుభప్రదమైనదిగా, క్షత్రియుడి ఇంటిపేరు శక్తిని సూచించేదిగా,వైశ్యుని ఇంటిపేరు ధన సంపత్తిని సూచించేదిగా, శూద్రుని ఇంటిపేరు హేయమైనదిగా ఉండాలి. " (2-31)

"ఇంటి పేరు తర్వాత బ్రాహ్మణుని పేరు సంతోషాన్ని కల్గించేదిగా, క్షత్రియుని పేరు రక్షణకు మారుపేరుగా, వైశ్యుని పేరు వృద్ధిని సూచించేదిగా, శూద్రుని పేరు సేవకవృత్తిని సూచించునట్లుగా ఉండాలి (2-32)

క్రింది మూడు వర్గాలవారు సహజంగా మైత్రి కలిగి ఉండాలి. వారు కలిసి ఏకమై హిందూ సాంఘిక వ్యవస్థను పెకిలించడానికి ఎన్నో అవకాశాలున్నాయి. కాని వారట్లు చేయలేదు. వారు ఒకే త్రాటిపై నడవడానికి ప్రయత్నాలు జరుగలేదని కాదు. హిందూ వ్యవస్థ నిర్మాణకర్తలై, అందుండి అధిక రక్షణను, లాభాలను పొంది, ఆ వ్యవస్థను సంరక్షిస్తున్న వారికి వ్యతిరేకంగా, ఆ సాంఘిక వ్యవస్థను సమూలంగా నాశనం చేయాలని 1919-1935 మధ్యలో బ్రాహ్మణ వ్యతిరేక పార్టీ స్థాపించబడింది.

ఈ ప్రయత్నమే కాక, ఈ మూడు వర్గాల మధ్య ఐకమత్యాన్ని సాధించడానికి కార్మిక నాయకులు, ముఖ్యంగా కమ్యూనిస్టులు ప్రయత్నించారు. కులాలతో నిమిత్తం లేకుండా కార్మికజాతి ఒకటున్నదని ప్రవచించారు. వీరిలో వర్గ సమైక్యత, వర్గ చైతన్యం కావాలనే కోరిక అభివృద్ధి చెంది వుండవచ్చు. వారందరూ ఒక్కటై తమ మహోన్నతమైన సమైక్యతను వినియోగించి, ఆర్థిక వ్యవస్థను ఛేదించి వున్నట్లయితే, తరతరాలుగా వ్రేళ్ళు పాతుకుపోయిన సాంఘిక వ్యవస్థకూడా ఛిన్నాభిన్నమైపోయి ఉండేది. కాని, ఏమయింది? ఏకత్వం సాధింపబడలేదు. శూద్రులు, ఆదిమ జాతులు బ్రాహ్మణులకన్నా ఎక్కువగా అస్పృశ్యులను ద్వేషించసాగారు. నిజానికి బ్రాహ్మణులను అంటరాని వారు ఎదిరించినప్పుడు,

శూద్రులు బ్రాహ్మణులకు రక్షణగా వుండి, అస్పృశ్యుల్ని వెనక్కి తిప్పికొట్టారు. ఇది విచిత్రమైన విషయం. కాని ఇది నిజం. అస్పృశ్యులు తమపై విధించిన ఆంక్షలు, ఆజ్ఞలను దాటి ప్రవర్తించినపుడు వారిపై జరుపబడిన అమానుష కృత్యాలు, గత అధ్యాయాలలో ప్రస్తావించినవన్నీ శూద్రులు నిర్వహించినవే.

సమైక్యత సాధించక పోవడానికి కారణాలు అంత క్లిష్టమైనవి కావు. ఈ అంచెలవారీగా వున్న అసమాన వ్యవస్థలో బ్రాహ్మణులు అందరి కన్నా పై స్థానంలో ఉన్నారు. శూద్రుడు బ్రాహ్మణుని కంటే క్రింద, అస్పృశ్యుడి కంటే పైన ఉన్నాడు.

ఈ హిందూ సాంఘిక వ్యవస్థ అసమానతల మీద ఆధారపడి ఉన్నట్లయితే ఎన్నడో అది మట్టిలో కలిసి వుండేది. కాని ఇది అంచెలవారీగా వున్న అసమానతల పునాది మీద నిలిచి వున్నది. కనుకనే బ్రాహ్మణుణ్ణి క్రింది స్థానానికి దింపాలని శూద్రుడు ఆకాంక్షిస్తాడు. కాని అదే సమయంలో అస్పృశ్యుడు తన స్థాయికి ఎదగడాన్ని అతడు నిరసిస్తాడు. అస్పృశ్యులతో చేతులు కలిపి వ్యవస్థను నిర్మూలించడానికి ప్రయత్నించడానికంటే అతడు బ్రాహ్మణుడు పెట్టే అవమానాలు భరించడానికే సిద్ధపడుతాడు. ఈ కారణంగా అస్పృశ్యుడితో కలిసి సవర్ణులపై పోరాడడానికి ఎవరూ ముందుకు రారు. అతడు ఏకాకి, ఎవరైతే అతనిలాగే అవమానాలను, అమానుషాలను భరిస్తూ, అతడికి సహాయకారిగా వుండగలరో ఆ వర్గాలే అతణ్ణి వ్యతిరేకిస్తున్నాయి. ఈ వేర్పాటు అంటరానితనం నిర్మూలనలో పెద్ద అవరోధంగా నిల్చి వుంది.

అనువాదం : టి. సత్యనారాయణ

మొదటి పుస్తకానికి అనుబంధాలు:–[1]

## అనుబంధం I

# దారుణాలకు దారితీసిన అస్పృశ్యత [2]

జైపూర్ నుండి ఒక విలేఖరి జూన్ 1953న జరిగిన ఓ సంఘటన గురించి ఇలా తెలియజేస్తున్నారు

"జైపూర్ – జూన్ 25: నారపురుగు లేక గినియావర్మ్ రాష్ట్రంలో వ్యాపించి వుంది. ఈ వ్యాధి సోకినట్లయితే రోగి నెలల తరబడి, కొన్ని సార్లు సంవత్సరం, రెండు సంవత్సరాలు బాధ పడుతాడు. చాలా మంది ఈ వ్యాధి సోకిన అవయవాలను కోల్పోవల్సి వుంటుంది.

"ఈ వ్యాధి, త్రాగే నీటి ద్వారా సంక్రమిస్తుంది. వైద్యులు నిరోధానికి మంచి నీటిని కాచి, వడపోసి త్రాగడమే మార్గమని సూచించారు.

"వ్యాధి వర్షాకాల ఆరంభంలో ఎక్కువగా సోకుతుంది. గ్రామీణులు, ముఖ్యంగా రైతులు నాటుకు వెళ్ళే సమయంలో ఈ వ్యాధికి గురై వేరే జీవనోపాధి లేక మంచం పడుతాడు.

"పరిశోధన వలన తేలిందేమిటంటే 'బంస్వారా' దగ్గరలో వున్న కోప్రా గ్రామంలో 57 కుటుంబాలలో 125 మంది నారపురుగు వ్యాధితో బాధపడుతున్నారు. ఆరుగురు సభ్యులున్న ఒక హరిజన కుటుంబంలో అయిదుగురు ఈ జబ్బుతో మంచం పట్టారు. కొద్ది పాటి మాంసం మాత్రమే వారి వద్దనున్న ఆహారం.

"అనేకసార్లు సమాజమే వీరికి సమస్యలు కల్పిస్తుంది. హరిజనులు త్రాగునీరుగా ఉపయోగించే చెరువు నారపురుగులకు నెలవైందని తెల్సుకొని ఈ విషయాన్ని జిల్లా కలెక్టరు దృష్టికి తీసుకురాగా, ఆయన నిర్ఘాంతపోయి, వెంటనే ఆ చెరువును పూడ్చవల్సినది అని ఆదేశాలు జారీ చేసారు.

"సమీపంలో ఒక మంచినీటి బావి ఉంది. ఆ హరిజనులంతా ఆ బావి నీరు వాడుకొనుటకు అనుమతి నివ్వవల్సినదిగా సవర్ణులను కోరినప్పుడు వారందుకు

నిరాకరించారు. కలెక్టర్ హిందువులను "చెరువు నీరు మీరు త్రాగగలరా?" అని ప్రశ్నించినపుడు తాము ఆ నీరు త్రాగలేమని, కాని హరిజనులను బావినీరు తోడుకొనుటకు అనుమతించబోమని చెప్పారు.

"ఈ దారుణ పరిస్థితులలో అమితంగా బాధపడే వారు హరిజనులే. అంటరానితనం వారు చేయని నేరమైంది. అస్పృశ్యత నివారణకు హరిజనసేవక సంఘం ఎంత కృషి చేస్తున్నా, దేశవ్యాప్తంగా హిందువుల హృదయాలలో మార్పు వచ్చిందని చెప్పలేం. రాష్ట్ర ప్రభుత్వాలు కూడా ఏమీ చేయలేకపోతున్నాయని చెప్పవచ్చు."

## అనుబంధం II

సండేటైమ్స్ మార్చ్ 9, 1952ః

# చొక్కా ధరించడం కూడా నేరమా?

దక్షిణ భారతంలో హరిజనుల ఇక్కట్లుః ఒక సంఘసేవకుని అనుభవం.
(స్వామి ఆనంద తీర్థ, ప్రాంతీయాధికారి, భారత హరిజన సేవక సంఘం)

సాంఘిక అసమానతలు పాటించరాదని ఐదు సంవత్సరాల క్రితమే చట్టం అమలులోకి వచ్చినప్పటికీ, హరిజనులను అనేక విషయాలలో అనర్హులుగా పరిగణించడం జరుగుతూనే వుంది. గత తొమ్మిది నెలలుగా మధురై జిల్లాలోని మేలూరులో ఈ సాంఘిక అసమానతలను తొలగించడానికి అఖిల భారత హరిజన సేవక సంఘం తీవ్రంగా కృషి చేస్తున్నది. టీ దుకాణాలు, మంగలి షాపులు, మంచి నీటి బావులు, చెరువులు, గ్రామ చావడుల వద్ద పాటించే అసమానతలు ఈ సందర్భంగా వెలుగులోకి వచ్చాయి. ఈ నూతన చట్టాన్ని గ్రామ మున్సబు ప్రచారం చేసి, అముల పరచవలిసి ఉండగా, ఈ పేద హరిజనులు తమ ప్రాథమిక హక్కుల్ని కూడా వినియోగించుకోకుండా అడ్డు పడేది ఈ గ్రామ మున్సబులే. వేళ్ళూనుకున్న ఇలాంటి దురాచారాలను, సంఘటనలను ఇక్కడ ప్రస్తావిస్తున్నాను.

నాథం దగ్గరలో గల పార్లిలో ఒక హరిజన యువకుడు తనకు కొబ్బరి చిప్పలో కాకుండా, సవర్ణుల కిచ్చినట్లు గాజుగ్లాసులో 'టీ' ఇవ్వమని అడిగినందుకు సవర్ణులాతనిని కొట్టి, నెత్తిన చెప్పులు పెట్టారు. కాగా మేలూరు సబ్‌మెజిస్ట్రేట్ ఆ సవర్ణుడికి కేవలం పది

రూపాయల జరిమానా విధించాడు. కాగా మేలావల్వ్వాలో ఇద్దరు హరిజన యువకులతో కలిసి నేను ఒక టీ దుకాణానికి వెళ్ళినపుడు అక్కడివారు బెదిరించి నన్ను, నాతో వచ్చిన వారినీ వెడలగొట్టారు. ఆ టీ కొట్టుయజమాని కావాలని ఒక గ్లాసు పగులగొట్టి, అందుకు పరిహారం నన్నే చెల్లించమని వేధించాడు. గత్యంతరం లేక నేను సమీపంలోని ఎలిమెంటరీ స్కూల్‌లో తల దాచుకొన్నాను. తర్వాత పంచాయితీ బోర్డు ప్రెసిడెంట్ జోక్యంతో ఆ గుంపు సద్దుమణిగింది.

కెలవాల్వ్వాలో ప్రజలు స్నానానికి, పశువుల్ని కడుగడానికి వాడుకునే మురికినీటిని హరిజనులు త్రాగడానికి ఉపయోగించాలి. గ్రామస్తులు త్రాగడానికి ఉపయోగించే ఊరబావి నీటినే హరిజనులను కూడా వాడుకొమ్మని వారిని ప్రోత్సహించినపుడు, సవర్ణులు వారిని దూషించి, బెదిరించారు. హరిజనులు భయపడి, ఆ బావి ఛాయలకే పోలేదు. కెలవాల్వ్వాలో ఒక పోలీస్ స్టేషనుంది. కాని, ఆ పోలీసులు హరిజనుల సమస్యల్ని పెడచెవిని బెట్టారు. అట్టుకుళంలో హరిజనులను ఊరబావి నుండి నీటిని వాడు కోవల్సిందిగా మేము చెప్పినప్పుడు, సవర్ణులు వారిని ఎదిరించలేక, ఆ బావిలో అశుద్ధాన్ని వేసి మలినం చేసారు. 'ఎట్టిమంగళ' లో హరిజనులు గ్రామ చావడిలోజరుగుతున్న సమావేశానికి వచ్చినందుకు, వారు పోరంబోకు ప్రదేశంలో పెంచుకుంటున్న నారుమడిని సవర్ణులు నాశనం చేసారు ఆ పేద హరిజనులు పోలీసులకు ఫిర్యాదు చేసినా, వారు ఎలాంటి చర్యనూ తీసుకోలే.

తారువాదురులో కూడా హరిజనులను ఊరిబావి నీటిని వాడు కోవల్సిందిగా మేమ ప్రోత్సహించినపుడు, నీరు పట్టుకెళ్తున్న హరిజన గర్భిణి స్త్రీని ఒక సవర్ణ యువకుడు అవమాన పరచి, ఆమె కుండను పగులగొట్టాడు. ఈ విషయమై పోలీసులకు ఫిర్యాదు చేయగా, పోలీసులు అతనిని సబ్ మెజిస్ట్రేట్ ముందు హాజరు పరిచారు. మెజిస్ట్రేటు అతనికి కేవలం పదిహేను రూపాయల జరిమానాను విధించారు. అప్పటి నుండి హరిజనులు ఊరబావి నుండి నీటిని వాడుకోసాగారు.

'కొత్త గుడి'లో ఒక హరిజన బాలునికి క్షవరం చేయడానికి గ్రామ మంగలి నిరాకరించి నపుడు పోలీసులు అతనిని సబ్ మెజిస్ట్రేట్ ముందు హాజరు పరిచారు. తర్వాత హరిజనులను గ్రామ చావిడి వద్దకు పిలిపించి, 'ఇకపైన ఆ మంగలి సేవలను అడిగినట్లయితే, హరిజనులందరి పైనా సామూహిక జరిమానా విధించగలమని'' తీవ్రంగా హెచ్చరించారు.

'కదిరిపట్టి'లో రహదారి గుండా శవాన్ని మోసుకుపోవడానికి హరిజనులకు అనుమతి ఇవ్వలేదు. గ్రామంలోని రోడ్లపై హరిజనులు సైకిల్ తొక్కరాదు. హరిజనుడిని సైకిల్ తొక్కకుండా ఆపినందుకు మేలూరు కోర్టులో ఇంకా కేసు నడుస్తూనే వుంది.

మూలూరు తాలూకా ఆఫీసు నుండి కేవలం మూడు ఫర్లాంగుల దూరంలో వున్న "నంది కోవిల్ పట్టి" లో హరిజనులు ఊరబావి నీటిని వాడుకునే సదుపాయం లేక, మురికి కాలువ నీటిని త్రాగడానికి వాడుకోవడాన్ని చూసి పోలీసులకు రెండు సార్లు ఫిర్యాదులు చేయడం జరిగింది. ఆ తర్వాత హరిజనులను ఊరబావికి రాకుండా ఆపగలిగే ప్రయత్నమేదీ హిందువులు చేయలేదు. 'తెక్కతేరు'లో గ్రామ చావిడిలో సమావేశం జరుగుతున్నప్పుడు చావడిలో కూర్చున్నందుకుగాను, హరిజనులపై రాళ్ళు రువ్వడం జరిగింది.

మేలూరుకు రెండు మైళ్ళ దూరంలో ఉన్న 'నవిని పట్టి' లో సంక్రాంతి పండుగ రోజున శుభ్రమైన దుస్తులు ధరించినందుకు గాను ఇద్దరు హరిజనులను గ్రామ మునసబు అటకాయించి, వారిచే ఆ దుస్తులు విప్పించాడు. పైగా వారితో సాష్టాంగ దండప్రమాణం చేయించుకొని, కేవలం 'గోచి'తో వారిని అక్కడినుండి పంపించాడు.

అన్నింటికంటే హృదయవిదారక సంఘటన మధురై పట్టణానికి పది కిలో మీటర్ల దూరంలో వున్న 'మంకులం'లో జరిగింది. ఈ ఘటన గ్రామ మున్సబు యొక్క ద్వేష భావాన్ని ప్రతిఫలింప జేస్తుంది. ఇద్దరు హరిజన యువకులు 'టీ' దుకాణానికి వెళ్ళగా, వారిని లోనికి రానివ్వలేదు. ఈ విషయమై వారు పోలీసులకు ఫిర్యాదు చేసారు. వారిలో ఒకరిని స్తంభానికి కట్టి వేసారు. గ్రామ పెద్దల ఆదేశం మేరకు ఒక సవర్ణయువకుడు అతడిని చితక బాదాడు. రెండవ వ్యక్తిని గ్రామ మున్సబు నౌకరు కత్తితో బెదిరించాడు. హరిజనులు ఊరబావిలో నీరు తోడుకొన్నందుకు వారిని వెలివేసి, వారికి సరుకులు అమ్మలేదు. రెండు రోజుల పాటు వారు పస్తుపడుకోవల్సి వచ్చింది. రెవెన్యూ డివిజన్ అధికారి జోక్యంతో రిస్థితి మెరుగు పడింది.

ఈ మధ్య నేను ఇద్దరు హరిజన యువకులతో కల్సి చెరువులో స్నానం చేసి చావిడి మురుగా నున్న కాఫీ కొట్టుకు వెళ్ళినందుకు, సవర్ణులు మాపై గొడ్డళ్ళతో దాడి చేసి ంగా గాయ పరిచినారు. తర్వాత మేము మధురై ప్రభుత్వ ఆసుపత్రిలో చేరి, చికిత్స దాల్సి వచ్చింది. నాకు కుడికాలి ఎముక విరిగి, నడవశక్యం కాకుండా పోయింది. గ్రామ

మున్సబుతో సహా 16 మంది పై పోలీసులు కేసు పెట్టినారు. ఈ కేసుతో సంబంధం వున్న కాంగ్రెస్ వ్యక్తులు కొందరు పరిష్కారానికి ప్రయత్నించగా, మరి కొందరు మా పైకై పై అధికారులను కలువడానికి వెళ్ళారు. మహాత్మాగాంధి, హరిజనులను స్వంత అన్నదమ్ముల వలె చూసుకోవల్సినదిగా ప్రవచించారు. కాని, రక్త సంబంధం అన్నింటికంటే తీయనిది కదా!

ఎన్నో త్యాగాల ఫలితంగా లభించిన ఈ స్వరాజ్యం, స్వేచ్ఛ అట్టడుగున మగ్గి పోతున్న వారికి కూడా చెందాలనే మహాత్ముడి కృషికి ఇటువంటి సంఘటనలు నిరుత్సాహాన్ని కల్గిస్తాయి. పోలీస్, రెవెన్యూ శాఖలవారు ఈ అస్పృశ్యతా ఆచారాన్ని రూపుమాపడంలో ఎంతో కృషి చేయగలరు. మహాత్మా గాంధీ కుమారుడు మణిలాల్ దక్షిణాఫ్రికాలో భారతీయుల పట్ల చూపుతున్న వివక్షతకు నిరసనగా సత్యాగ్రహంచేపట్టాడు. కాని మన దేశంలో మహాత్ముడు 'నావాళ్ళు' అని చెప్పుకొన్న హరిజనులపట్ల అదే నివక్షత పాటిస్తున్నాం. ఈ 'అస్పృశ్యత' ను వేళ్ళతో సహా పెకిలించి నిర్మూలించనిదే మహాత్ముడి ఆత్మకు శాంతి ఉండదు. అని గాంధీజీని అభిమానించే ప్రతి హిందువూ, కాంగ్రేస్ వాదీ గుర్తుంచుకోవాలి. ఈ అంటరానితనం నిర్మూలనకు ప్రభుత్వం మరింతగా కృషి చేయాల్సి ఉందని మరువరాదు.

**అనుబంధం III**

# హరిజనులకు వ్యతిరేకంగా అటవిక న్యాయం?

**గ్రామ చావడులు:**

తమిళనాడులోని గ్రామాలలో హరిజనులకు గ్రామ చావడిలోనికి ప్రవేశం ఉండదనే సంగతి అందరికీ తెల్సిందే. సవర్ణులు ఈ చావడిలోనే తగవులు, సమస్యలు పరిష్కరించి, శిక్షలు విధిస్తారు. అస్పృశ్యులు నిరంతరం ప్రాణాలు అరచేతిలో పెట్టుకొని, కాలం గడుపుతూంటారు. సాంఘిక దురాచారాలకు వ్యతిరేకంగా మేము చేపట్టిన ఉద్యమానికి అనుకున్నంత ఆదరణ లభించకపోవడానికి ఈ భయమే కారణం. గ్రామ పెద్ద పెరియంబలగర్ ఆధిపత్యములో హరిజనులను దోషులుగా చిత్రీకరించి, శిక్షలు అమలు చేయడం సర్వసాధారణం. చాలా ప్రాంతాలలో పంచాయితీ నిర్వహణగా పిలువబడే ఈ చావిడి

కోర్టులలో హరిజనులను బానిసలకన్నా హీనంగా హింసించడం మామూలే. ఈ పేద హరిజనులు ఎవరైనా పెరియంబలగర్ ఆజ్ఞలకు ఎదురు చెప్పినట్లయితే వారిని అమానుషంగా కొట్టి హింసించేవారు. పెరియంబలగర్ యొక్క అధికారాన్ని కాదన్న వారి పరిస్థితి ఏమవుతుందో ప్రదర్శించేవారు. ఈ శిక్షలు పెరియంబలగర్, అతడి అనుచరుల ఇష్టాయిష్టాలపై ఆధారపడి వుండేవి. కొరడా దెబ్బలు, జరిమానాల విధింపు, చెల్లించని పక్షంలో ఆస్తిజప్తు చేయడం, కూలీ చెల్లించక పోవడం, సామూహిక కార్యక్రమాలలో వారి సహాయం తీసికొనకపోవడం, బావుల, చెరువుల దారులు మూసేసి, నీటి సౌకర్యం లేకుండా చేయడం, కిరాణా దుకాణాలలో హరిజనులకు సరుకులు అమ్మకపోవడం, ఇలా ఎన్నెన్నో

పంచాయితీల పేరిట ఇలా గ్రామాలలో న్యాయరహితంగా, అక్రమంగా చావిడీలు నిర్వహించడాన్ని ప్రభుత్వం నిషేధించినపుడే హరిజనులకు స్వేచ్ఛ లభిస్తుంది. ఏ ప్రజాస్వామ్య ప్రభుత్వం కూడా ఒక వెనుకబడిన వర్గాన్ని ఈ విధంగా హింసించడాన్ని సహించదు.

## తుంబ పట్టిలో అరాచకాలు:

1953 ఆగస్ట్ ఒకటో తారీఖున తుంబపట్టిలో జరిగిన విచారణను వింటే ఏ హృదయమైనా ద్రవించకమానదు. ప్రముఖ హరిజన నాయకుడు, పార్లమెంటు సభ్యుడు అయిన శ్రీ పి.కక్కన్ జన్మస్థలమైన ఈ గ్రామం మధురై పట్టణానికి 22 మైళ్ళ దూరంలో వుంది. సమాచారాన్ని బట్టి తెల్సినదేమనగా, హరిజనులందరినీ గ్రామ చావిడీ ఎదురుగా నున్న మండై దగ్గరకు రావల్సినదిగా ఆదేశం ఇవ్వడమైంది. సవర్ణులందరూ పెరియంబలగర్‌కు ఆచారం ప్రకారం తమ అష్టఅవయవాలూ నేలకు తాకునట్లుగా సాష్టాంగ ప్రణామం చేసారు. దాదాపు డజను మంది హరిజన యువకులను చిన్న చిన్న నేరాలు ఆరోపించి, విచారణకు పిలిచారు.

కాని యువకులలో సవర్ణులకు విధేయులుగా వుండక, వారి అడుగులకు మడుగులొత్తని వారిని వేరు చేసి, కర్రలతో కొట్టి, తమపై ఆరోపించిన నేరాల్ని ఒప్పుకొనమని బలవంతం చేసారు. మిగిలిన వారిని ప్రశ్నించినపుడు ఆ శిక్షలకు భయపడి నేరాలన్నింటినీ ఆ యువకుల మీదికి నెట్టేసారు. ఆయువకులే నేరస్థులని నిర్ధారించి, చేతులకు సంకెళ్ళు కూడా వేయడం జరిగింది. వారిలో ఒకరు నేరాన్ని ఒప్పుకోకుండా తప్పించుకోవాలని

ప్రయత్నించినట్లు కనుగొన్నారు. గ్రామ చావిడిని అలా అగౌరవ పరచడాన్ని గ్రామస్థులు సహించలేకపోయారు. పెరియంబలగర్ శిక్ష విధించాడు. ఆ ప్రకారంగానే హరిజన యువకులను దయా దాక్షిణ్యాలు లేకుండా దండించారు. హరిజనులంటే అంతో ఇంతో కోపం వున్న ప్రతి వ్యక్తీ తన పగను తీర్చుకున్నాడు. తప్పించుకోజూసిన ఆయువకుడిని కంకర రాళ్ళ దారి పై కాళ్ళు పట్టుకొని ఈడ్చారు. మిగిలిన వారిని చెట్లకు కట్టేసి, కర్రలతో చావ బాదారు. వారి ఎముకలు నుగ్గునుగ్గయ్యే వరకు కొట్టారు. హరిజన సేవకులకు సహకరించిన అందరినీ హెచ్చరించడం జరిగింది.

## తప్పుడు కేసు బనాయింపు:

ఆ తర్వాత గ్రామస్థులు చేసిన పని లజ్జాకరమైనది. హరిజనులపై నేరారోపణ చేయడం, పోలీసులు చర్యతీసుకోవడం సాధారణ విషయం. కాని ఈ హరిజన యువకులు తీవ్రమైన గాయాలతో బాధపడడం చూసిన గ్రామస్థులు తమకు ముప్పు వస్తుందని గ్రహించి 80 సం॥ల శ్రీ పూసారి కక్కన్,( ఈయన పార్లమెంట్ సభ్యుడు శ్రీ పి. కక్కన్ తండ్రి) చే ఒక అబద్ధపు ఫిర్యాదు నమోదు చేయించారు. ఆ ఫిర్యాదు ప్రకారం హరిజన దేవాలయంలో వున్న వస్తువులు కొన్ని అంతకు ముందు రోజు సాయంత్రం నుండి కనబడడం లేదని, ఆ వస్తువులు ఈ హరిజన యువకుల నుండి స్వాధీనం చేసినట్లుగా ఒక నివేదిక పోలీసులకు పంపడం జరిగింది. శ్రీ పూసారి కక్కన్ అతని బంధువు వేరొక గ్రామం తోటి అయిన ఎట్టికక్కన్ ఈ వస్తువులు తెచ్చి మునసబుకిచ్చినట్లు తెలియవచ్చింది. రిపోర్ట్ అందిన వెంటనే పోలీసులు వచ్చి దొంగతనం నేరం క్రింద హరిజన యువకులను అరెస్ట్ చేయడం జరిగింది. వారు గాయపడి వుండడం చేత ఆసుపత్రికి పంపించారు. పోలీసుల చర్యను ఎత్తి చూపాలని కాదు మా ఉద్దేశ్యం. హరిజనులపై గ్రామస్థుల దౌర్జన్యం పోలీసుల కంట బడకపోవడం గూర్చే.

## వెల్లడయిన వాస్తవం

గ్రామస్థులందరూ తమ చర్యను సమర్థించుకుంటూ తమిళనాడు హరిజన సేవక సంఘం అధ్యక్షుడైన శ్రీ వైద్యనాధ అయ్యర్‌కు ఒక విజ్ఞాపన పత్రం పంపారు. అది తర్వాత విచారణ నిమిత్తం నాకు పంపబడింది. వేలూరు తాలుకా కాంగ్రెస్ కమిటి అధ్యక్షుడు, వేలూరు తాలూకా హరిజన సేవక సంఘం సెక్రటరీ, సేవా సమాజం సెక్రటరీ, నేను కలిసి,

చిన్న కమిటీగా ఏర్పడి, విచారణ జరిపినాం. అందులో గ్రామస్థులు దండించినట్లు, పోలీసులు వచ్చే వరకు దాదాపు 8 గం॥ పాటు చెట్లకు కట్టేసారని తెలిసింది. శ్రీ వైద్యనాథ అయ్యర్‌పెరియం బలగర్, పూసారి కక్కన్ చేసిన ఫిర్యాదులను విచారించి, అది నిజం కాదని, కల్పించిందనీ నిర్ధారించారు. పెరియంబలగర్ కూడా హరిజనులపై చేసిన దాడికి విచారం వ్యక్త పరిచినాడు. ఈలోపుగా పోలీసులు కూడా పూసారి కక్కన్ ఇచ్చిన ఫిర్యాదును విచారించి, విషయం కనిపెట్టలేనిదిగా నిర్ధారించారు. కాని గ్రామస్థులపై ఎట్టి కేసును నమోదు చేయలేదు. ఆ హరిజన యువకుల ఎముకలు విరగలేదన్నారు. వారి శరీరాలపై ఆ దెబ్బ లతాలూకు వాతలు, కట్టేసినప్పటి తాళ్ళ గుర్తులూ అనేక రోజులపాటు కనబడుతూనే వున్నాయి. వారిలో ఇద్దరినే రెండు రోజులపాటు ఆసుపత్రిలో వుంచి, వారి కాళ్ళకు ఎక్స్-రే తీయించి ఎముకలు విరిగినట్లుగా నిర్ధారించారు. తర్వాత వారి కాళ్ళకు ప్లాస్టర్ బాండేజీలతో ఇళ్ళకు పంపారు. దాదాపు పక్షం రోజుల వరకు వారు సరిగ్గా నడవలేకపోయారు.

రెండు దర్యాప్తులు జరుపబడినవి

మధురై డిప్యూటి వెల్ఫేర్ ఆఫీసర్ డిప్యూటీ కలెక్టర్ ఉత్తర్వుల మేరకు ఒక దర్యాప్తు. ప్రభుత్వ ఉత్తర్వుల మేరకు ఒక దర్యాప్తు జరిపారు. ఫలితాలు ఇంకా తెలియాల్సి వుంది.

## తుంబపట్టెలో సాంఘిక అసమానతలు

1948లో గ్రామ ఊరబావి నుండి హరిజనులు నీరు తెచ్చుకోవడాన్ని తుంబపట్టి గ్రామస్థులు తీవ్రంగా వ్యతిరేకించారు. అప్పటి వరకు పశువులను కడుగడానికి, స్నానాలకూ ఉపయోగించే చెరువులోని మురికి నీటినే హరిజనులు త్రాగడానికి ఉపయోగించేవారు.

కొంత మంది హరిజన యువకులను తీవ్రంగా కొట్టి, ఇళ్ళకు నిప్పు పెట్టడానికి ప్రయత్నాలు జరిగాయి. గ్రామ మునసబు కొంత మందిని ఈ విషయమై తీవ్రంగా మందలించడం జరిగింది. ఇంకొక సంఘటనలో తుంబపట్టి లో ఒక టీ కొట్టు యజమాని హరిజనుడికి గాజు గ్లాసులో టీ ఇవ్వడానికి నిరాకరించినందుకు గాను 1953 ఆగస్ట్ 19న ఫిర్యాదు చేయగా, సబ్ మెజిస్ట్రేట్ ఆయజమానికి 10 రూ॥ జరిమానా విధించారు. గ్రామమంగలి తాను హరిజనులకు క్షవరం చేయగలనని ప్రకటించాడు. కాని హరిజనులెవ్వరూ

అతని వద్దకు వెళ్ళలేదు. బహుశా హిందువులు హరిజనులకు చేసిన రహస్య హెచ్చరిక కారణంకావచ్చు. 1953 జులై ఒకటిన కొందరు హరిజన యువకులు అతని వద్దకు వెళ్ళారు. 1953 ఆగస్ట్ ఒకటిన హరిజనులపై జరిపిన న్యాయ విచారణ ఈ విషయంపై వారిలో భయాన్ని కల్గించడానికి ఏర్పాటు చేసివుండవచ్చు.

## మా సాధారణ అనుభవాలు

హరిజనులు తమ ప్రాథమిక హక్కులను అనుభవించడానికి ధైర్యంగా ఎటువంటి యత్నంచేసిననూ, వారిని గ్రామ చావిడి వద్దకు రప్పించి, ఏదో ఒక మిషతో వారిని శిక్షించేవారు. ఇట్టి సంఘటనలు మంగళకురువాగులం, అదనూరు, పాతెట్టి గుడి, కరుగకొట్టైలలో సర్వ సాధారణం. కొంత మంది పోలీస్ ఉన్నతాధికారులు ఈ ప్రాంతాలను దర్శించేవారు. వారు ఎప్పుడూ సవర్ణుల పక్షమే వహించేవారు. అందుకే సవర్ణులు చట్ట విరుద్ధంగా, న్యాయ రహితంగా శిక్షలు విధించి హరిజనులలో తాము దాసుల మనే భావనను పెంపొందిచేవారు.

## ఈ పద్ధతిని మనం సహించగలమా?

మన ముందున్న ప్రశ్న ఏమిటంటే ఈ రకమైన వాటిని మనం సహించగలమా? 'జలియన్ వాలాబాగ్'లో జనరల్ డయ్యర్ జరిపిన అమానుష కృత్యాలను తీవ్రంగా వ్యతిరేకించి మనం పోరాడినాం. జలియన్ బాలావాగ్‌లో సమావేశమైన స్త్రీ, పురుషులను విదేశీయులత్యంత క్రూరంగా చంపేసారు. ఇక్కడ అదే విధంగా మన గ్రామస్థులు గ్రామచావిడి వద్ద హరిజనులపై క్రూరత్వాన్ని ప్రదర్శించి, భయాందోళనలు కల్గిస్తున్నారు.

## ప్రభుత్వం ఏం చేయ్యాలి?

హరిజనులకు కూడా సభ్యత్వం గల గ్రామ పంచాయితీలు ప్రతి గ్రామంలోనూ ప్రభుత్వం ఏర్పాటు చేసింది. ఈ పంచాయితీలిలా వుండగా, గ్రామ చావిడులలో సవర్ణ హిందువులు న్యాయ నిర్ణయం చేస్తూ, సమాంతర వ్యవస్థ నెందుకు ఏర్పాటు చేయాలనేది ఎవరికీ అర్థం కాని ప్రశ్న. ఈ చావడి కోర్టులు, పేద వర్గాలవారి సాంఘిక, ఆర్థిక, రాజకీయాభ్యున్నతికి ఆటంకం కల్గిస్తున్నాయి. కనుక వీటిని నిషేధించనిదే హరిజనులకు స్వేచ్ఛ లభించదు. అది జరగకపోతే ఈ సాంఘిక అసమానతలను నిర్మూలించడానికి మేం

చేస్తున్న ప్రయత్నాలన్నీ వ్యర్థమవుతాయి. అస్పృశ్యతా నివారణకు 3 లక్షలు ఖర్చు పెట్టేముందు ప్రభుత్వం ఈ గ్రామ చావిడులను బహిష్కరించాలి. అప్పుడే వారు మనుషులుగా తలఎత్తుకొని జీవించగలరు.

కేరళలో బహిరంగంగా అస్పృశ్యత పాటించడం అన్నది నిన్నటిమాట. ఎందుకంటే అక్కడ ఈ చావిడులనేవి లేవు.

**ఒక విజ్ఞప్తి**

అస్పృశ్యులుగా పరిగణిస్తూ, హీనజాతి వారిగా, నీచంగా చూస్తూ హరిజనులపట్ల ఎంత అవమానకరంగా, అన్యాయంగా ప్రవర్తిసున్నామో, మనకు తెలియజెప్పి కళ్ళు తెరిపించిన వారు మహాత్మాగాంధి. ఆయనే లేకపోతే, ఈ సవర్ణుల హింసాయుత పద్ధతుల నీచమైన ప్రవర్తనను భరించలేక వేలాది హరిజనులు హిందూ సాంఘిక వ్యవస్థను వీడి వెళ్ళిపోయేవారు. హరిజనులకు మద్దతుగా మహాత్మాగాంధీ పూనాలో నిరాహార దీక్ష పూని ఈనాటికి 21 సం॥ అయ్యింది. అప్పటి నుండి హరిజనుల పట్ల కరుణ, హరిజన ఉద్యమాలూ, వాటికి ఆదరణా పెరిగినాయనడంలో సందేహం లేదు. ప్రభుత్వం ఈ అంటరాని తనం నిర్మూలనకు కంకణం కట్టుకున్నది. హరిజనుల అంతస్తును పెంచగల న్యాయపరమైన శాంతియుతమైన మార్గాలను ఎన్నుకొని అమలు చేస్తున్నది. కాని ఇప్పటికి కూడా హరిజనులపట్ల మనకెంతో వ్యతిరేకత వుందని మనం ఒప్పుకోకతప్పదు.

సవర్ణుల హృదయాలలో మార్పు తెచ్చి, హరిజనుడిని సంఘ బహిష్కృతుడిగా చూడకుండా చేయాలని ప్రజాసేవకులందరికీ మనవి చేస్తున్నాను. అస్పృశ్యత నివారణకు కృషి చేయవల్సిందిగా, హరిజనులు కూడా హిందూ సమాజంలో భాగంగా పరిగణించేలా మార్పు తేవాల్సిందిగానూ నాయకులందరికీ మనవి చేస్తున్నాం.

**పాదసూచికలు :**

1. మొదటి పుస్తకానికి అనుబంధంగా ప్రచురించిన వార్తాంశాలు ఈ పుస్తకపు రాతప్రతి చివర చేర్చబడిఉన్నాయి – సం॥

2. ఇది 1953 జూలై 27 నాటి స్టేట్స్‌మెన్‌లో వచ్చింది.

**అనువాదం** ***టి.సత్యనారాయణ***

# రెండవ పుస్తకం

# సామాజికము

'అస్పృశ్యులు లేదా బహిష్కృతుల సంతతి' అనే గ్రంథ ప్రణాళికలో చేరని అస్పృశ్యతను గూర్చి, అస్పృశ్యులను గూర్చిన డాక్టర్ అంబేద్కర్ రచనలు ఎన్నో ఉన్నాయి. వీటిని సామాజిక, రాజకీయ ధార్మిక విభాగాలుగా చేయడం జరిగింది. ఈ రెండవ భాగంలో సామాజిక భాగంలో ఐదు వ్యాసాలు పొందుపరిచాము.

–సంపాదకులు

అధ్యాయం - 15

# నాగరికత లేక మహాపరాధం

I భారతదేశం జనాభా - మరొక కోణం నుండి అవలోకనం

II ఈ దృక్పథంలోంచి చూస్తే అణగదొక్కబడిన వర్గాలు

ఎ) ఆదిమవాసులు బి) నేర ప్రవృత్తి తెగలు

సి) అస్పృశ్యులు

III ఈ వర్గాల పరిస్థితి మీద హిందూ నాగరికత ప్రభావం

IV ఈ వర్గాల సమస్యలలో ఉండే తేడా.

భారత దేశ జనాభా స్థూలంగా మత భాషా ప్రాతిపదికపైన విభజించబడి ఉంది. అనాది నుండి ఈ రెండు రకాల విభజనలు మాత్రమే అమలులో ఉన్నాయి. అందుచేతనే విదేశీయులు, భారతీయులు పాటించే మతాలూ, మాట్లాడే భాషలు మాత్రమే ముఖ్యం అనుకున్నారు. ఈ పాటి ఆసక్తి ఉండడం చేత వారు మన మతాలూ, భాషల గురించి మాత్రమే తెలుసుకుని తృప్తి పడ్డారు. మతంలో ఆసక్తి కలవిదేశీయులు హిందూ మతం, మహమ్మదీయ మతం అనే రెండు మతాలుంటాయనీ మన దేశ ప్రజలు మరాఠీ,గుజరాతీ బెంగాలీ, తమిళం లాంటి భాషలు మాట్లాడతారనీ మాత్రమే గుర్తుంచుకుంటారు.

అయితే ఈ రెండు రకాల విభజనలో విదేశీయులను ఎక్కువగా ఆకట్టుకునేది మతపరమైన విభజన. భాషల కన్నా మతాలు చాలా ఆసక్తిగా కనిపిస్తాయి. విదేశీయులకు భారతీయ మతాల గురించి తెలియక పోయినా హిందూ, మహమ్మదీయుల గురించి తెలుసు. అప్పుడప్పుడు సిక్కుమతం గురించి, ఎప్పుడైనా క్రైస్తవుల గురించి విని ఉండవచ్చుగాని బౌద్ధుల గురించి విని ఉండరు. ఈనాటి భారత దేశంలో బౌద్ధులు లేకపోవడమే దానికి కారణం.[1]

విదేశీయులు భారత దేశంలో హిందూ ముస్లింలు తప్ప వేరే మతస్థుల గురించి పట్టించుకోవాల్సిన అవసరం లేదనుకుంటారు. ఇది సహజమే. హిందూ ముస్లిం ఘర్షణలు

చాలా సంచలనాన్ని సృష్టించాయి. ఈ ఘర్షణ ఎంత తీవ్రమైందో ఇటీవలి సంవత్సరాల్లో జరిగిన మత కలహాలు, అందులో జరిగిన ప్రాణనష్టాలూ చూస్తే అర్థమవుతుంది.

అయితే ఈ సంఘర్షణ ఒక సామ్రాజ్య స్థాపన కోసం జరిపే సంఘర్షణే. ముస్లింలను పాలితులుగా మాత్రమే మిగిల్చే హిందూ మహాసామ్రాజ్యాన్ని స్థాపించాలని పోరాడే హిందువులు ఉన్నారు. ప్రపంచ మంతటా ఇస్లాంను స్థాపించి,భారత దేశాన్ని అందులో ఒక భాగం చేసి హిందువులకు ఖురానో,కత్తివేటో ఏదో ఒకటి మిగల్చాలని కలలు కనే ముస్లింలూ ఉన్నారు. ఈ ఇరువురు తీవ్రవాదుల మధ్య హిందూ ముస్లింలు సమాన భాగస్వాములుగా జీవించగల రాజ్యాన్ని కోరుకునే ఉదాత్తులు, శాంతి ప్రియులు ఉన్నారు. గెలవ బోయేది తీవ్రవాదులో, మితవాదులో కాలమే నిర్ణయిస్తుంది. కాని ఈ లోగా ఇరువర్గాల తీవ్రవాదులు తమ రక్త స్నానాలతో పతాక శీర్షికలనెక్కుతున్నారు. అదలా ఉండగా ఈ సంఘర్షణలో ఏమాత్రం ఆసక్తి లేని వారు అనేకులున్నారని చెప్పదలచుకున్నాను. ఏది ఏమైనా ఇది ఆధిపత్యం కోసం జరిపే పోరాటం. ఒకరిని తలదన్ని, మరొక సామ్రాజ్యాన్ని నిర్మించడానికి జరిపే పోరాటం. మహోన్నత మానవతకు గౌరవాన్ని సంతరింపచేసే పోరాటంలోనూ, అణగారిన జాతుల పోరాటంలోనూ వారికి శ్రద్ధ తక్కువ. ఇంగ్లాండులో విగ్గులకు, టోరీలకు మధ్య జరిగిన ఆనాటి యుద్ధంలో విగ్గుల రాజకీయ విధానాన్ని గురించి చెబుతూ ఫ్రాన్సిస్ ప్లేస్ "వారు ఒక వైపు రాజును, వేరొక వైపు ప్రజలను అణగ దొక్కి సంపన్న పాలక వర్గం వారి ధనిక సామ్రాజ్యాన్ని స్థాపించేందుకు పోరాడుతున్నారు" అన్నాడు. ప్రస్తుత భారత దేశంలో కలహించుకుంటున్న హిందువులూ, ముస్లింలు అదే పద్ధతిని అవలంబిస్తున్నారు. తమ మతస్థుల్లోని ఉన్నత వర్గాలనే అధికార కూటమిలో కూర్చోబెట్టాలని ఇరువర్గాల వారు తాపత్రయ పడుతున్నారు. ఏ మతం వారైనా సామాన్య ప్రజలు తమ అధికారా వర్గాన్ని బలపరచాలనీ, తమనే అనుసరించాలనే ఆశిస్తాయి. కానీ పీడిత ప్రజల అభ్యున్నతి కొరకు అని చెపుతున్న ఈ పోరాటం కేవలం వర్గాల మధ్యనే కాని సామాన్య ప్రజల పోరాటం కాదు.

సామాన్యుల పోరాటంలో ఆసక్తి ఉన్నవారు మన దేశ జనాభాని వేరొక కోణం నుండి చూడడం నేర్చుకోవాలి. కేవలం మత దృష్టితో చూడడం ఆపి సాంఘిక, ఆర్థిక కోణాలతో

చూడాలి. అంటే దానికర్థం భారతీయుల సామాజిక, ఆర్థిక జీవితాన్ని మతం ఏ విధంగా ప్రభావితం చేసిందో పరిశీలించడంకాదు. నిజానికి మతాన్ని దృష్టిలోకి తీసుకోకపోతే వారు హిందువులైనా, ముస్లింలైనా భారతీయుల జీవన స్వరూపాన్ని సమగ్రంగా అవగాహన చేసుకోలేరు. ఇందుకు కారణం మధ్య యుగంలో యూరప్‌లో రోమన్ కాథలిక్ చర్చి ఎంత ఉన్నతస్థానం పొందిందో భారత దేశంలో మతం అంతటి స్థానం పొందింది. బ్రైస్ ప్రజల జీవనం మీద చర్చి ఆధిపత్యాన్ని గురించి చెబుతూ అన్న మాటలు[2] గణనీయమైనవి. "చర్చిలోనూ, చర్చికోసమూ, చర్చిద్వారానే జీవితం అనీ, ప్రాతః సమయంలో దీవెనలంది, ప్రార్థనలతో ప్రారంభమై, నిశీధి నివాళులతో ప్రశాంత నిద్రించేదే జీవితం అనీ, నిరవధికంగా జరిగే పవిత్రోత్సవాలే ఆహారమనీ, పశ్చాత్తాపమే క్షమనీ, ప్రాయశ్చిత్తమే ప్రక్షాళన అనీ, అనునిత్యం విగ్రహారాధనే లక్ష్యమనీ, ఆ మధ్యయుగాల నాటి ప్రగాఢ విశ్వాసం. ఇదే అనేకులు భావించి ఆచరించిన ఆదర్శప్రాయమైన జీవితం"

నేడు భార దేశంలో ప్రజా జీవనం మీద మతానికి ఉన్న ప్రభావం మధ్య యుగాల నాటి చర్చి ఆధిక్యత కంటె ఏమాత్రం తక్కువ కాదు. అందువల్ల మతాన్ని పరిగణనలోకి తీసుకోకపోవడం పొరపాటే అవుతుంది. కాని కేవలం మత ప్రాతిపదిక మీదే అధ్యయనం చేస్తే అది ఒట్టి బాహ్యపరిశీలనే అవుతుంది. భారత దేశంలో ఉన్నత, నిమ్నవర్గాల జీవన సరళి గురించి తెలుసుకోవడమే మనం ముఖ్యంగా చేయాలి. వారి సాంఘిక జీవనాన్ని నిర్ణయించే సామాజిక ఆర్థిక సూత్రాలేమిటి? వాటి మీద మత ప్రభావం ఎంతవరకు ఉంది? అనేవి మనముందున్న ప్రశ్నలు. హిందూ మతం పాటించే వివిధ కులాల, జాతులమధ్య స్థితిని చూస్తే ఈ ప్రశ్నలకు జవాబు దొరుకుతుంది.

## II

ప్రొఫెసర్ మాక్స్‌ముల్లర్ భారత దేశాన్ని దర్శించి ఉంటే సిద్ధాంతాలకు, ఆచరణకు ఉన్న వ్యత్యాసాన్ని చూసి, అందుకుగల కారణాలను వివరించి ఉండేవాడు. కాబట్టి ప్రస్తుతానికి ఆ వ్యత్యాసం ఒక చిక్కుముడి.

బ్రాహ్మణులు చెప్పే పరబ్రహ్మ సిద్ధాంతాన్ని బట్టి చూసినట్లైతే 'బ్రహ్మం' ప్రతి మానవుడిలోనూ ఉంటూ అంతటా వ్యాప్తి చెంది ఉండాలి. బ్రాహ్మణునిలో బ్రహ్మం

ఉంటే మరి నేరస్తులలో, తెగలలో, అంటరాని వారిలో బ్రహ్మం ఉండే ఉండాలి కదా! మరి బ్రహ్మతత్వం అనేది సర్వ వ్యాపకం ఐనప్పుడు మనుషుల్లో ఆదిమవాసులు, అస్పృశ్యులు, నేరస్థుల తెగలు ఉండడాన్ని ఎలా అర్థం చేసుకుంటారు?

ఈ విధంగా అణచబడిన ప్రజలు మూడు రకాలు. వారిలో ఒకరు ఆదిమ వాసులు కాగా వేరొకరు నేరస్థుల తెగలు, మిగిలినవారు అస్పృశ్యులుగా పిలువబడుతున్నవారు.

ఇలా మూడురకాలుగా విభజించబడిన జనాభా కూడా తక్కువేమీ కాదు. 1931 జనాభా లెక్కల ప్రకారం ఆదిమ జాతుల వారు దాదాపు 25 మిలియన్లు ఉన్నారు. నేర ప్రవృత్తి గల జాతులు 4.5 మిలియన్లు. మొత్తం భారత దేశంలో అస్పృశ్యులు 50 మిలియన్లు. ఈమూడు జాతుల వారు మొత్తం 79.5 మిలియన్లు కాగా ఈ 79.5 మిలియన్ల ఆత్మల స్థానమేమిటన్నదే ప్రశ్న.

ముందు ఆదిమజాతుల వారిని తీసుకున్నట్లయితే వారు ఏవిధమైన నాగరిక స్థితిలో ఉన్నారు?

ఆదిమ జాతి అనే పేరు వారున్న ప్రస్తుత స్థితికి దర్పణం. వారు అడవులలో చిన్న చిన్న గుడిసెలు వేసుకొని జీవిస్తారు. అడవి పండ్లు, గింజలు, దుంపలపైన ఆధారపడి జీవిస్తారు. ఆహారానికై చేపలు పట్టడం, వేటాడటం కూడా చేస్తుంటారు. వారి సాంఘిక, ఆర్థిక వ్యవస్థలో వ్యవసాయం చాలా తక్కువ. నికరమైన ఆహార సరఫరా లేకపోవడంతో వారు తప్పని సరిగా సగం ఆకలితో, తరచు పస్తులు ఉంటుంటారు. వారి వస్త్ర ధారణ అధ్వాన్న స్థితిలో ఉంటుంది. వారు దాదాపు నగ్నంగానే సంచరిస్తుంటారు. 'బొండా పొరాజాలు' అనే తెగలో స్త్రీలు ఒక చిన్న వస్త్రాన్ని మాత్రమే కట్టుకొంటారు. ఈ రకమైన కట్టులో మొలకు చుట్టుకున్న బట్ట రెండు అంచులు ఎడమ తొడ పై భాగంలో కలుస్తాయి. ఇదే విధమైన వస్త్రధారణ అస్సాంలోని మొంజాక్ నాగాల్లో కూడా కనిపిస్తుంది. ఈ రకమైన కట్టుబట్టను అడవి చెట్టునుండి తీసిన దారాలతో ఇంటివద్దనే నేస్తారు. ఆడపిల్లలు మెడచుట్టు ధరించిన అనేక పూస ఆభరణాలు మినహాయిస్తే దాదాపు నగ్నంగా సంచరిస్తుంటారు. కొంజాక్ తెగల ఆడవారు కూడా ఇదే విధంగా వస్త్ర ధారణ లేకుండానే ఉంటారు. స్త్రీలు తలను పూర్తిగా గొరిగించుకుంటారు. నిజాం పరిపాలనలోని ఫారాబాద్‌కు

చెందిన చెంచుల గురించి చెప్తూ "వీరి ఇళ్లు స్థూపాకారాల్లో ఉండి, పైన పలుచగా గడ్డికప్పి ఉంటాయి. వారి వస్తు సామగ్రి దాదాపు శూన్యం. ఇక దుస్తులు ఉండిలేనట్లే. మగవారికి ఓ గోచి, ఆడవారికి మొల చుట్టూ ఓ బట్ట పొట్టిగా ఉండే రవిక మాత్రమే వీరి బట్టలు. కొద్ది వంట పాత్రలు, ఒకటో రెండో గంపలు ఉంటాయి. వీటిలో ఎప్పుడైనా ఉంటే కొద్ది పాటి ధాన్యం విలువ చేసుకుంటారు. వీరు పశుపోషణతో, కొద్ది పాటి వ్యవసాయం కూడా చేస్తారు. లేకపోతే తేనె, అడవిలో దొరికే ఇతర వస్తువులపైనే ఆధారపడి ఉంటారు. 'మొరియాలు' అనబడే వేరొక తెగలో మగవారు మొలచుట్టూ ఓ గోచిని మాత్రమే ధరిస్తారు. చాలా రకాలైన పూసల పేర్లు ధరించి,తలపాగాలో కోడి ఈకలు, నెమలి పింఛాలు పెట్టుకొని నృత్యం చేస్తారు. ఆడవారు విరివిగా పచ్చబొట్టును పొడిపించుకుంటారు. ముఖ్యంగా ముఖం మీద,కొందరైతే కాళ్లమీద కూడా పచ్చపొడిపించుకుంటారు. ఈ పచ్చ, వారి వారి ఇష్టాలను బట్టి ముళ్లు, సూదులతో వేయించుకుంటారు. తలలో చెక్కలతో, ఇత్తడితో చేసిన దువ్వెనలు, అడవి కోడి ఈకలు ధరిస్తారు.

వీరి మతారాధనల విషయానికి వస్తే అన్ని రకాల శక్తులతోబాటు మరణించిన పూర్వీకులందరినికూడా వీరు పూజిస్తారు. వీరి మతారాధనలో ప్రధానాంశాలు మంత్రతంత్రాలు, జంతుబలులు, నరబలులు. విద్యలేక పోవటం చేత, మారుతున్న శాస్త్ర విజ్ఞానం పట్ల ఎటువంటి అవగాహన లేకపోవడంవలన, ప్రకృతిని తమకు తగినట్లు మలుచుకోలేకపోవటం చేత, ఈ ఆదిమ వాసులు, మూర్ఖత్వంతో, మూఢనమ్మకాలతో, నాగరికతను తమ దరిదాపుల్లోనికి రానివ్వకుండా జీవిస్తున్నారు. మారుతున్న కాలంతో ముందడుగు వేయకుండా వారు తరతరాలుగా ఉన్నచోటనే ఆగిపోయిన నాగరికతకు గుర్తుగా ఉన్నారు.

నేరం ఉపాధిగా గల తెగలు వృత్తిరీత్యా కూటములుగా, తెగలుగా ఏర్పడి థగ్గులుగా, పిండారీలుగా పిలువబడేవారు. పిండారీలు అనేవారు సాయుధులైన దోపిడీ ముఠాకు చెందినవారు. ఈ దోపిడీ దొంగలముఠాలు వారి వారి నాయకులఆధీనంలో ఉండేవి. వీరందరిలో శక్తివంతుడైన 'చిటూ' నాయకత్వంలో 10,000 గుఱ్ఱాలు, సుశిక్షితులైన 5000 అశ్వికులు, కాల్బలము, తుపాకులు ఉండేవి. వీరిలోని సామర్థ్యాన్ని ఉపయోగించుకొని, ఏకత్వాన్ని సాధించి, సైనిక శిక్షణ, ఉద్యోగావకాశాలు లేకపోవుటచేత

వారు వృత్తిరీత్యా బందిపోట్లుగా మారినారు. ఈ పిండారీల పోరాటానికి లక్ష్యాలు, విజయసాధన అంటూ ఏవీ లేవు. కేవలం కొల్లగొట్టడం మాత్రమే వీరి వ్యాపకం. వారు ఏ ప్రభువునూ గుర్తించలేదు. వారిని కూడా ఏరాజ్యంలోనూ ప్రజలుగా గుర్తించలేదు. వారికి ఏ ఏరాజుపట్లా విధేయత లేదు. ధనిక, పేద విచక్షణ లేకుండా, భయం, పశ్చాత్తాపంవంటివి లేకుండా ప్రతివారినీ దోచుకునే వారు.

థగ్గలు[3] అనేవారు వృత్తిరీత్యా హంతక ముఠాలు. వీరు 10 నుండి 200 వరకు గుంపులుగా ఏర్పడి వివిధ వేషాలతో ధనిక ప్రయాణీకులతో కలిసి ప్రయాణించేవారు. తాము కూడా బాటసారులమని నమ్మకం కలిగించి వారిననుసరించేవారు. సమయం చూసుకొని వారి మెడనులిమి లేక ఉరిబిగించి చంపి వారిని దోచుకున్న తర్వాత అక్కడే పాతిపెట్టేవారు. ఈ కార్యక్రమం అనాదిగా నిర్ణయించిన పద్ధతిలో జరిపేవారు. హత్యకు ఉపయోగించిన కత్తికి ప్రత్యేకంగా పూజలు జరిపేవారు. దుష్టశిక్షకురాలు, వినాశకారిణిగా ఆరాధింపబడే కాళీమాత ఆరాధకులు, ధనార్జనకోసం జరిపే ఈ హత్యలతో మత పరమైన బాధ్యతలు కూడ నిర్వర్తించడంవల్ల ఈ వృత్తి చాలా గౌరవ ప్రదమైనదని థగ్గలు నమ్మేవారు. తాము చేస్తున్నది తప్పు అనే ఆలోచన వారికెన్నడూ రాలేదు. వారికి పశ్చాత్తాపం తెలీదు. తమదేవత తమను ఈ విధంగా ఆజ్ఞాపిస్తే ఆమె గౌరవార్థం ఈ పని చేస్తున్నట్లు, ఆ ఆజ్ఞలు, ఆదేశాలు వివిధ శకునాల ద్వారా తమకు లభించినట్లు వారు విశ్వసిస్తారు. ఈ ఆజ్ఞలకు లోబడే, వారు తాము హత్య చేయబోయే వ్యక్తితో కలిసి అనుసరిస్తూ వందలాది మైళ్ల ప్రయాణిస్తారు. తగిన సమయం ఆసన్నమవగానే అనుకున్న ప్రకారం కార్యక్రమం పూర్తిచేస్తారు. పని పూర్తి కాగానేవారు, ఆ ఆచారం ప్రకారం యిష్టదేవతకు పూజలు జరిపి, దోచుకున్న సొమ్ములో కొంతభాగం ఆమెపేరున తీసివుంచే వారు. థగ్గలకు ప్రత్యేక భాష ఉంది. వారికి తమ జాతివారిని గుర్తించేందుకు కొన్ని గుర్తులు కూడా ఉన్నాయి. వాటి సహాయముతో భారత దేశంలో ఏమారుమూల ఉన్నా, వారు తమ వారిని గుర్తించేవారు. వృద్ధాప్యం వల్ల, అనారోగ్యం వల్ల ఈ కార్యక్రమాల్లో పాల్గొనలేనివారు గూఢచారులుగా, కాపలివారుగా పనిచేసేవారు. వైద్యం కూడా చేసేవారు. వారు తమ పనులలో అత్యంత నైపుణ్యం, భద్రతా, రహస్య విధానాలూ పాటించడం వల్లనూ, తాము జరిపే హత్యలకు మతపరమైన ముసుగు తొడగడంవల్లనూ శతాబ్దాల తరబడి వారు నిరాఘాటంగా తమ పనులు చేసుకుపోయేవారు. ఆశ్చర్యకరమైన

విషయమేమంటే, హిందూ రాజులే కాకుండా ముస్లిం పాదుషాలుకూడా థగ్గులను దోపిడీ వృత్తిగా గల జాతిగా గుర్తించారు. పన్నులు కట్టిన థగ్గులను ఇబ్బంది పెట్టకుండా ప్రభుత్వం వదిలేసిందికూడా.

కాని ఆంగ్లేయులు రాజ్యాధికారం చేపట్టిన తర్వాత పరిస్థితిలో మార్పు వచ్చింది. థగ్గుల అణచివేతకు జరిగిన ప్రయత్నంలో 1835 సంవత్సరంలో 382 మంది థగ్గులను ఉరితీసారు. మరి 986 మందికి దేశ బహిష్కరణ, లేక యావజ్జీవ కారాగారశిక్ష విధించారు. 1879లో 344గురు థగ్గులు ఉన్నట్లు నమోదయింది. 1904 నాటికి ఈ సంఖ్య తగ్గింది. దోపిడీ నిరోధక శాఖ అమలులోకి వచ్చింది. తరువాత ఈ శాఖ నేర పరిశోధక శాఖగా రూపొందింది.

ఈవిధమైన వృత్తిరీత్యా నేరస్థులై బాహాటంగా తిరిగేవారిని అణచివేయటంవల్ల జనానికి వారి బెడద లేకుండా ప్రశాంతత ఏర్పడింది. భారత దేశంలో అక్కడక్కడా ఈరకమైన నేర ప్రవృత్తిగల జాతులను గుర్తించి వారిని నేరస్త జాతుల క్రింద నమోదు చేయటం జరిగింది.

ఈ జాతులవారు మైదాన ప్రాంతాల్లో నాగరికుల మధ్యలో కాపోయినా దగ్గరలో జీవిస్తుంటారు. వారు పద్ధతి ప్రకారం దోపిడీలు, దొంగతనాలు నిర్వహించటంవల్ల వారిని వృత్తి నేరస్తుల తెగలు అని పిలుస్తున్నారు. హెూలియస్ తన "వృత్తి రీత్యా నేరస్థులైన తెగలు-అవిభాజ్యభారతం" అనే గ్రంథంలో వారి కార్యక్రమాల గురించి ఈ విధంగా తెలిపారు. "వారు నేరాలమీదనే ఆధారపడి జీవిస్తారు. వారి అసలు వృత్తి కప్పిపుచ్చుకోవడానికి కొద్దిమంది వ్యవసాయం చేస్తున్నట్లు కనబడుతారు. దోపిడీ, దొంగతనాలూ, దౌర్జన్యాల్లో వారి దుష్టలక్షణాలు కనబడతాయి. కాని, పథకం ప్రకారం హత్యాకాండ జరపడంచేత వారికి ఎటువంటి అడ్డంకి ఉండదు. ఒక ప్రదేశంలో నేరం లేక దోపిడీ జరపాలనుకుంటే వారు తమ గూఢచారులను పంపి, దోపిడికి అనువైన వ్యక్తిని నిర్ణయించి ఆ గ్రామ ప్రజల సాధారణ జీవనం గురించి తెలుసుకుంటారు. అలాగే ఆయింటికి సహాయం చేసి ఇరుగుపొరుగు ఎంత దూరంలో వున్నదీ, అక్కడి మగవారెంతమందీ, వారి వద్దగల తుపాకీలెన్ని అనే వివరాలు పూర్తిగా తెలుసుకొంటారు. ఈ దోపిడీలు సాధారణంగా అర్థరాత్రి జరుగుతాయి. వీరు ముందుగా క్షుణ్ణంగా తెలుసుకొన్న సమాచారాన్ని అనుసరించి

దోపిడీ చేయబడే గ్రామంలో వేరు వేరు ప్రదేశాల్లో నిలబడి తుపాకులు పేల్చి ప్రజల దృష్టిని ప్రధానముఠానుండి తమ వైపుకు మళ్లిస్తారు. ఈలోపుగా ప్రధాన ముఠావారు నిర్ణయించుకొన్న యింటిని లేక యిళ్లను కొల్లగొడ్తారు. ఈ ముఠాలో దాదాపు 30 నుండి 40 వరకు మగవారు ఉంటారు.

"ఈ ప్రజల సాధారణ జీవితంలో నేరం, దోపిడీ, చాలా ప్రధాన పాత్ర వహిస్తాయి. ఒక పిల్లవాడు మాటలు నేర్చి, నడవడం ప్రారంభించగానే అతడికి నేరప్రవృత్తిని అలవరుస్తారు. ఇందుకు కారణం కూడా సబబే. నేరం చేస్తున్నప్పుడు పట్టుబడితే చిన్నపిల్లవాడికి శిక్ష తక్కువగా ఉంటుంది. పెద్ద వారయితే వెంటనే ఖైదు చేయడానికి అవకాశాలు ఎక్కువ. ఈరకమైన దోపిడీల్లో ప్రత్యక్షంగా పాల్గొనకపోయినా, స్త్రీలు చాలా బాధ్యత వహిస్తారు. సామగ్రి తస్కరించడంలోనూ, దోచుకొన్న సొమ్మును అనుమానం రాకుండా మారకం చేయడంలోనూ వీరు చాలా నైపుణ్యం చూపుతారు."

ఈ రకమైన నేరప్రవృత్తిగల తెగలవారివలెనే, అస్పృశ్యులు కూడా సభ్యహిందూ సమాజంలోనే జీవిస్తున్నారు. కాని నేరవృత్తి జాతులకు, ఆదిమవాసులకు లేని సంస్కారం, నాగరికత, నీతిని వీరు కలిగి యున్నారు. ఈ గుణాలు వారిని మిగిలిన రెండుజాతుల నుండి వేరు పరుస్తున్నాయి. వీరు హిందూ సంస్కృతిని అవలంబిస్తారు. మతాచారాలు పాటిస్తారు. హిందువుల పండుగలను జరుపుకుంటారు. కాని ఇందువల్ల వారికి ఎటువంటి ప్రయోజనం లేదు సరికదా, ఇందుకు విరుద్ధంగా వారిని స్పృశించడమే అపరాధంగా భావించి హిందువులు వీరిని వెలివేస్తున్నారు. అందుచేత చాలా అరుదైన సందర్భాలలో మినహాయిస్తే వారిని ఎప్పుడూ సాంఘికంగా బహిష్కరించడం పరిపాటి. వీరు గ్రామం నడిబొడ్డులో కాకుండా ఊరి పొలిమేరల్లో జీవిస్తారు. ప్రతి గ్రామానికి ఈ అస్పృశ్యుల వాడలున్నాయి. అవి గ్రామానికి చెంది ఉన్నా గ్రామంలో భాగం కావు. మిగిలిన హిందువుల నుండి వేరు చేయబడి ఉన్న వీరు ఒక నీచమైన ప్రవర్తనా నియమావళికి లోబడి జీవించవలసి వస్తుంది. ఈ నియమాలననుసరించి ఏ అస్పృశ్యుడూ తానున్న స్థితినుండి మెరుగు పడడానికిఎటువంటి ప్రయత్నం చేయరాదు. తన నీచస్థితిని ప్రతిఫలించే దుస్తులను మాత్రమే ధరించాలి. ఉన్నత వర్గాల స్త్రీలు ధరించే ఆభరణాలను నిమ్నవర్గాల స్త్రీలు ధరించరాదు. మిగిలిన హిందువుల యిళ్లవలె విశాలమైన, సౌకర్యమైన యిళ్లను అస్పృశ్యులు

కలిగి ఉండరాదు. ఏరకంగానైనా సరే అస్పృశ్యుడు పెంకుటింట్లో కాపురముండరాదు. అంటరానివారు హిందువులకు ముందుగా నమస్కరించాలి. వారి ముందు కూర్చోకూడదు. ఒక అస్పృశ్యుడు శుభ్రమైన బట్టలు ధరించడం, రాగి లేక యిత్తడి పాత్రలు వాడడం, వెండి బంగారు నగలు ధరించడం నిషేధం-హిందువుల కుటుంబంలో ఎవరైనా మరణించినపుడు, ఆ వార్త వారి బంధువులకు తెలియపరచడానికి ఒక అస్పృశ్యుడు అనేక మైళ్ల దూరం వెళ్లవలసి ఉంటుంది. మరణవార్తను మనిషి ద్వారా కాకుండా తంతి ద్వారా తెలుపడాన్ని బంధువులు ఆక్షేపిస్తారని హిందువుల అభిప్రాయం. ఉన్నత వర్గ స్త్రీలు పుట్టింటినుండి అత్తవారింటికి వెళ్ళేటప్పుడు లేక తిరిగి వచ్చేటప్పుడు, వారిని అనుసరించటానికి అస్పృశ్యులు తప్పనిసరిగా ఉండాలి. ఎందుకంటే పరివారజనం వెంట ఉండటం ఘనతగా భావించేవారు. అస్పృశ్యులు మాత్రమే ఎటువంటి ఖర్చులు లేకుండా లభించే పరివారం. హిందువుల యిళ్ళల్లో జరిగే ప్రతికార్యానికి అస్పృశ్యులు తప్పనిసరిగా వచ్చి చాకిరీ చేయాలి. అంటరాని వారికి స్వంత భూమి ఉండరాదు. ఎటువంటి పరిస్థితుల్లోనూ అతడు స్వతంత్రంగా జీవించరాదు. హిందువుల యిళ్లలో మిగిలిన ఆహారం , గ్రామంలో చనిపోయిన పశువుల మాంసం అతనికి భుక్తి. ప్రతి సాయంత్రం యింటింటికి తిరిగి అస్పృశ్యుడు అన్నం అడుక్కోవాలి. గ్రామంలో చనిపోయిన జంతువులను ఊరిబయటకు చేర్చవలసిన బాధ్యత అస్పృశ్యునిది. ఎందుకంటే ఏ ఇతర హిందువు ఇటువంటి పనులు చేయడానికి ఒప్పుకోడు. గ్రామంలో హిందువులపై హోదా, అధికారం కలిగించే ఏయితర సేవలను అస్పృశ్యునికి ఇవ్వలేదు. అతడు వినయంతో మసలు కొంటూ, తనకు నిర్దేశించిన నియమావళి ప్రకారం నడుచుకోవాలి. ఏ సౌకర్యం, అధికారం అడగకూడదు. కొంతమంది అస్పృశ్యులు ఈ ప్రవర్తనా నియమావళిని అధిగమించి తామున్న స్థితికన్నా పైకెదిగి ఉన్నత స్థానాలను అందుకున్నారు. కాని ఇంకా చాలా మంది ఈ నీచమైన దాస్యం చేస్తూ దుర్భర దారిద్ర్యంలో కాలం గడుపుతున్నారు.

జనాభాలో 79.5 మిలియన్ల ప్రజల పరిస్థితి అది. మరణించకపోయినా జీవచ్ఛవాల మాదిరిగా మారిన ఈ ఆత్మల సమస్య చిన్నదికాదు. ఈ మూడు జాతుల జనాభా కలిసి, అమెరికా జనాభాలో 60% ఉంటుంది. వారు ఇంగ్లండులోని శ్వేత జాతుల కంటె 9.5మిలియన్లు ఎక్కువ. అలాగే జపాన్ జనాభా కంటె కూడా 9.5 మిలియన్లు ఎక్కువ.

స్వతంత్ర శ్రమకు మధ్యనున్న తేడా ఇక్కడే ఉన్నది. బానిసత్వంలో ఒప్పందాన్ని చెరిపితే నేరం. దానికి శిక్ష జుల్మానా లేదా జైలు. స్వతంత్ర శ్రమ కింద ఒప్పందాన్ని ఉల్లంఘించడం పౌరతప్పిదం. దానికి శ్రామికుడు నష్టపరిహారం మాత్రమే చెల్లించాలి. ఈ కొలమానాన్ని అనుసరించి న్యాయ పరిశీలన చేస్తే పాకీ పని అస్పృశ్యులకై విధింపబడిన తప్పించుకోలేనటువంటి చట్టపరమైన బాధ్యత.

ఈ పరిస్థితులన్నింటిని చూస్తే అస్పృశ్యులు ఈ అశుభ్రమైన పనులను స్వచ్ఛందంగా చేస్తున్నారని ఏ విధంగా ఆరోపించగలం?

అస్పృశ్యులు ఇలాంటి మురికి పనులు చేయడం మూలంగా అస్పృశ్యత అనే శాపాన్ని తమపైకి ఆహ్వానించుకొన్నారని హిందువులు చేస్తున్న ఆరోపణ ఎంతవరకు నిజం? ఇక్కడ గుర్తించాల్సిన ప్రముఖమైన విషయం, మహద్ లో జరిగిన అస్పృశ్యుల మహాసభ హిందువులకు చెందిన చచ్చిన పశువుల తీసుకొని పోయి వాటి మాంసం తినరాదని, వాటి చర్మం తీయరాదని తీర్మానించింది.

ఈ తీర్మానాల లక్ష్యాలు రెండు విధాలు. మొదటి లక్ష్యం అస్పృశ్యుల్లో ఆత్మగౌరవాన్ని నెలకొల్పడం. ఇది చిన్న లక్ష్యం. పెద్ద లక్ష్యం హిందు సమాజ వ్యవస్థను దెబ్బకొట్టడం. హిందువులకు శుభ్రమైన, గౌరవప్రదమైన పనులు, అస్పృశ్యులకు మురికి అయిన తక్కువరకం పనుల ఇవ్వాలనే శ్రమవిభజన పై ఆధారపడ్డదీ హిందూ సమాజవ్యవస్థ- చట్టాలతో రక్షింపబడి అది హిందువులకు గౌరవాన్ని కట్టబెట్టి అస్పృశ్యులను అవమానాలకు గురి చేస్తున్నది. ఈ తీర్మానం హిందు సమాజ వ్యవస్థకు వ్యతిరేకంగా చేసిన తిరుగుబాటు. హిందువులు తమకు సంబంధించిన మురికి పనులను తామే చేసుకోవాలన్నది కూడా దీని లక్ష్యం.

పాతుకుపోయి వున్న వ్యవస్థకు వ్యతిరేకంగా అస్పృశ్యులు చేసిన తిరుగుబాటు చరిత్రకు సంబంధించిన సంక్షిప్త సారాంశమిది. ఇది బొంబాయిలో ఉద్భవించింది కాని భారతదేశంలోని అన్ని ప్రాంతాలకు వ్యాపించింది.

అనువాదం : కె. సీతారామారావు

అధ్యాయం - 22

# దూరంగా ఉంచారు

**I. అస్పృశ్యుల తిరుగుబాటుకు హిందూ ప్రతిస్పందన II. నిర్దాక్షిణ్యమైన పీడనకు న్యాయ రహిత మార్గాలు III. అస్పృశ్యులు – ఒక బలహీన మైన శక్తి IV. సిగ్గులేని అధికారుల పక్షపాతం V. మొక్కబోయిన ఆయుధం.**

## I

నూతనత్వం ధ్వనిస్తుంటే ప్రాచీనత ఎలా నిశ్శబ్దం లోకి జారుకుంటుందో అస్పృశ్యుల తిరుగుబాటు కథనం విశదం చేస్తుంది. ఈ తిరుగుబాటుకు హిందువుల ప్రతిస్పందన ఏమిటి ? దాన్ని గురించి ఏకాస్త తెలిసినవాడైనా ఈ ప్రశ్నకు సమాధానం చెప్పేందుకు వెనుకాడడు. ఎందుకంటే వారు దీన్ని వ్యతిరేకిస్తారనేది స్పష్టమే. హిందువులు దీన్ని ఎందుకు వ్యతిరేకిస్తుంటారో తెలుసుకోవటం కష్టమే కావచ్చు. కాని వాళ్ళు దాన్ని వ్యతిరేకిస్తారనటంలో సందేహం లేదు.

అస్పృశ్యులకు, హిందువులకు మధ్య ప్రస్తుతం నెల కొన్ని వున్న సంబంధాల లక్షణాలను దృష్టిలో ఉంచుకుంటే అస్పృశ్యులు తమ హక్కుల పరిరక్షణ కోసం చేసే పోరాటాన్ని హిందువులు వ్యతిరేకించటానికి గల కారణాలు తెలుసుకోవటం ఏమంత కష్టం కాదు.

ముఖ్యమైనదీ, మొదటిదీ, ఎన్నటికీ మర్చిపోవటానికి వీలు లేనిది స్పృశ్యులకూ అస్పృశ్యులకూ మధ్యగల ఖచ్చితమైన విభజన. ప్రతి గ్రామమూ స్పృశ్యులూ, అస్పృశ్యులు అనే రెండు భాగాలుగా విభజింపబడి ఉంటుంది. భౌగోళికంగా కూడా ఈ రెండు భాగాలు విభజింపబడే ఉంటాయి. రెండిటిమధ్యా చెప్పుకోదగ్గ దూరముంటుంది. ఎట్టి పరిస్థితుల్లోనూ రెండూ దగ్గరగా ఉండవు. అస్పృశ్యులు నివసించే భాగాలకు మహర్ వాడ అనీ, మంగువాడ అనీ, చామ్రోటీ అనీ, కాయకానా అనీ భిన్నమైన పేర్లుంటాయి. శాసన పరంగానూ, రెవెన్యూ, పాలన, తపాలా సర్వీసుల విషయంలో అస్పృశ్యులుండే ప్రాంతం గ్రామంలో భాగంగానే ఉంటుంది. కాని వాస్తవానికి అది గ్రామం నుంచి వేరుపడి ఉంటుంది. హిందువైన గ్రామ వాసి ఎప్పుడైనా గ్రామాన్ని గురించిమాట్లాడుతున్నాడు

అంటే అతను హిందువులు నివసించే భాగాన్నే గ్రామంగా భావిస్తుంటాడు. అలాగే అస్పృశ్యుడెవడైనా కూడా గ్రామాన్ని గురించి మాట్లాడితే తను కూడా అస్పృశ్యులు నివసించే భాగాన్ని విస్మరించే గ్రామాన్ని గురించి మాట్లాడుతాడు. అలా ప్రతి గ్రామంలోనూ స్పృశ్యులూ, అస్పృశ్యులూ రెండు ప్రత్యేకమైన గ్రూపులుగా ఏర్పడి ఉన్నారు. వాళ్ళ మధ్య పోలిక లేనే లేదు. అందరూ కలిసికట్టుగా ఒకే ప్రజగా వుండరు వాళ్లు. ఇది గుర్తుంచుకోవలసిన మొదటి అంశం.

రెండు గ్రూపులుగా విభజింపబడ్డ గ్రామాన్ని గురించి గుర్తుంచుకోవలసిన రెండో విషయం ఏమిటంటే ఏ గ్రూపులోవాడైనా దాన్నుంచి తప్పించుకుని బయటపడే అవకాశంలేదు. ఒక అమెరికన్ గానీ, ఒక యూరోపియన్‌గానీ వివిధ రకాల గ్రూపులకు చెందిన వారే ఐనప్పటికీ వాళ్ళు అన్ని గ్రూపుల్లోను చేరే అవకాశం ఉంటుంది. ఏదో ఒక కుటుంబంలో పుడతాడు కాని తనకు నచ్చితే తప్ప అతను శాశ్వతంగా ఎప్పుడూ అందులో ఉండడు. అతను వృత్తినీ, నివాసాన్ని, భార్యనీ, రాజకీయ పార్టీని తానే ఎంచుకుని, తన ప్రవర్తనకు, తన చర్యకు సాధారణంగా తానే బాధ్యుణ్ణనుకుంటాడు. పరిపూర్ణమైన అర్థంలో అతను తన సంబంధాలను తానే నిర్ణయించుకోగల "వ్యక్తి". భిన్నమైన మానవ సమూహాల్లో పుట్టిన కారణంగా సకల సంబంధాలు ముందే నిర్దేశించబడ్డ స్పృశ్యులు గానీ, అస్పృశ్యులుగానీ ఏ అర్థంలోనూ వ్యక్తులు కారు. వాళ్ళ వృత్తి, నివాసమూ, వాళ్ళ దేవతలూ, వాళ్ళ రాజకీయాలు అన్నీ వాళ్ళ గ్రూపులే వారికి నిర్ధారిస్తాయి. స్పృశ్యుడూ, అస్పృశ్యుడూ ఎప్పుడైనా కలవటం సంభవిస్తే మనిషిని మనిషి కలిసినట్లుగానీ, వ్యక్తిని వ్యక్తి కలుసుకున్నట్లుగాని కలవకుండా భిన్నమైన గ్రూపులకు చెందిన మనుషులుగానో లేదా రెండు భిన్నమైన దేశాల వాళ్ళు కలిసినట్లుగానో కలుస్తారు.

గ్రామంలో స్పృశ్యులకు, అస్పృశ్యులకు మధ్యగల పరస్పర సంబంధాలపై దీని ప్రభావం ఎంతో ప్రముఖమైనటువంటిది. ఈ సంబంధం ఆదిమ సమాజంలో రెండు భిన్నమైన తెగల మధ్యగల సంబంధాన్ని పోలి ఉంటుంది. ఆదిమసమాజంలో ఒక తెగకు సంబంధించిన వ్యక్తి ఆ తెగలో హక్కుదారుడై వుంటాడు. కాని పరాయి వాడెవడికైనా అలాంటి స్థాయి ఉండదు. పరాయి వాణ్ని అతిథిగా చూడవచ్చు కాని అతను తన తెగలో తప్ప మరో తెగనుంచి న్యాయాన్ని ఆశించలేడు. ఒక తెగకు, మరో తెగకు మధ్య

వ్యవహారాలు యుద్ధాలవల్లో, సంప్రదింపులవల్లో తెగుతాయి కాని శాసన పరంగా కాదు. అందువల్ల ఏ తెగకు చెందని వాడు ఏ విధంగా చూసినా భ్రష్టుడే. కాబట్టి తమ తెగకు చెందని అన్యుడిపై ఎలాంటి అన్యాయ పూరితమైన చర్య తీసుకున్నా న్యాయసమ్మతమే. స్పృశ్యుల గ్రూపుకు చెందని అస్పృశ్యుడు అన్యుడే తప్ప సంబంధితుడు కాదు. అతనొక భ్రష్టుడు. స్పృశ్యుని గౌరవపూర్వకమైన హక్కులు గాని, న్యాయాన్ని గానీ అతను కోరలేడు.

గుర్తుంచుకోవలసిన మూడో అంశం ఏమిటంటే స్పృశ్యులకు అస్పృశ్యులకు మధ్యగల సంబంధం నిర్దిష్టంగా నిర్ణయించబడి ఉండటం. ఇది హోదాకు సంబంధించిన అంశం స్పృశ్యులతో పోల్చి చూస్తే అస్పృశ్యుల హోదా నీచస్థానంలో ఉంచబడింది. వాళ్ళు తప్పనిసరి పరిస్థితుల్లో అంగీకరిచవలసి వచ్చిన సామాజిక ప్రవర్తనా రీతిలోనే అస్పృశ్యుల నీచ స్థితి ఇమిడి ఉంది. ఇది ఎలాంటి రీతో ఇంతకు ముందే చెప్పబడింది. అస్పృశ్యుడు ఈ రీతిని అంగీకరించేందుకు ఇప్పుడు సిద్ధంగా లేడు.

అస్పృశ్యుడు ఒప్పందం ద్వారా స్పృశ్యుడితో సంబంధం ఏర్పరచుకోవాలని వాంఛిస్తున్నాడు. స్పృశ్యుడేమో సాంఘిక హోదాకు సంబంధించిన నియమాల ననుసరించి మాత్రమే అస్పృశ్యులు బతకాలనీ, అంతకు మించి ఎదగరాదనీ వాంఛిస్తున్నాడు. ఈ విధంగా గ్రామంలోని రెండు భాగాలు - స్పృశ్యులు, అస్పృశ్యులు - శాశ్వతంగా నిర్ధారితమైపోయిందని స్పృశ్యులు భావించే విషయాన్ని మరొకసారి పునర్నిర్ధారణ చేసే విషయంలో పోరాడుతున్నారు. ఈ విరోధం ఒకే ఒక ప్రశ్న చుట్టూ పరిభ్రమిస్తుంది. సంబంధం ఏర్పడటానికి ఏది మూలం కావాలి? ఒప్పందాన్ననుసరించాలేక హోదాననుసరించా?

హిందువుల్ని వేధిస్తున్న ప్రశ్న ఇదే. తమ సామాజిక, ఆర్థిక జీవనాన్ని మెరుగు పర్చుకునేందుకు చేస్తున్న ప్రయత్నంగా అస్పృశ్యుల పోరాటాన్ని హిందువు అర్థం చేసుకోవటం లేదు. సమానత్వం కోసం ప్రయత్నంగా కాక దాన్ని తనకు వ్యతిరేకంగా ఎక్కుపెట్టబడిందిగా భావిస్తున్నాడు. అందుకే దాన్నతడు వ్యతిరేకిస్తాడు.

## II

హిందువుల వ్యతిరేకత ఈ తిరుగుబాటును ఎలాగైనా అణచి వేయాలనే నిశ్చయాత్మకమైన వ్యతిరేకత. ఈ విషయంలో వాళ్ళు ఎంతకైనా తెగించటానికి, ఏమార్గాలనైనా అనుసరించటానికి సిద్ధమయ్యారు. అస్పృశ్యుల తిరుగుబాటు కూడా హిందూవ్యతిరేకతను ఎదిరించటానికి అంతే ధృఢంగా నిశ్చయించుకుంది. ఈ తిరుగుబాటును అణచి వేయటంలో హిందువులు ఎంతక్రూరంగా ప్రవర్తిస్తున్నారో ఒకటి రెండు కేసులు పరిశీలిస్తే తెలుస్తుంది.

అస్పృశ్యులు మహద్ దగ్గర్లో గల చాదర్ చెరువు నీళ్ళ వాడకం పై తమ హక్కుల్ని ప్రకటించటానికి దాన్ని సమీపించి సమావేశం అవుతున్న సమయంలో ఆసమావేశం పై బడి అస్పృశ్యుల్ని ఎలా కొట్టారో బోంబే క్రానికల్ క్రింది విధంగా వర్ణించింది.

"ఊరేగింపు చాలా ప్రశాంతంగానూ, శాంతియుతంగానూ సాగుతూంది. సుమారు రెండు గంటల గడిచాక ఊళ్ళోని దుష్టనాయకులు కొందరు కలిసి దళితులు గ్రామంలోని విశ్వేశ్వర దేవాలయంలో ప్రవేశించేందుకు ప్రయత్నిస్తున్నారనే పుకారు లేపటంతో ఎంతో మంది వెదురు కర్రలు పుచ్చుకుని సమావేశ స్థలం దగ్గర జమయ్యారు. చూస్తుండగానే ఈ గుంపు పెద్దదై దళితుల రక్తాన్ని కళ్ళజూడాలన్నంత ద్వేషంతో గ్రామమంతా ఒక్క పెట్టున రౌడీమూకల్తో నిండిపోయి దాడికి సిద్ధమైంది.

"సమావేశానికి వచ్చిన దళితులంతా భోంచేసి తమతమ గ్రామాలకు వెళ్ళి పోవటానికి సిద్ధమౌతున్నారు. చాలా మందిని వెళ్ళి పోనిచ్చి ఈ రౌడీమూక ఇంకా భోంచేస్తూ పంటశాలల్లో మిగిలిపోయిన దళితుల మీద పడ్డారు. దళిత నాయకులు అడ్డుపడి తమ గుంపును అదుపు చేయటం వల్ల సరిపోయిందిగాని లేకపోతే పెద్ద కొట్లాట జరిగి రక్తపాతం సంభవించేది. ఇక ఏంచేసేందుకైనా ఏ సాకు దొరక్క ఈ రౌడీ మూకలు చిన్న చిన్న గుంపులుగా తమ తమ గ్రామలకు బయల్దేరి వెళ్ళిపోతున్న దళితుల మీద పడి, బజార్లో వాళ్ళను పట్టుకుని చితకబాదారు. అది చాలక గ్రామంలోని దళితుల ఇళ్ళలో కూడా జొరబడి చితక బాదారు. ఈ దాడిలో 20 మంది దళితులు గాయపడ్డారు. ఈ సంఘటనలో దళితులు ఎంతో సంయమనాన్ని చూపారు. కాని ఉన్నత వర్గాలదే తగని

ప్రవర్తన. ప్రోగైన జనంలో దళితులే ఎక్కువగా ఉన్నారు. రాజ్యాంగ బద్ధంగానే జరపాలని కోరటం వల్ల ఈ దాడిని దళితులు ఎదుర్కోలేకపోయారు. ఎంతగా ఉసిగొల్పబడినా దళితులు తమను తాము అదుపు చేసుకోవటాన్ని చూస్తే వాళ్ళని గురించి ఎంతైనా చెప్పుకోవాలనిపిస్తుంది.

"అందరికీ చెందిన చెరువు నీళ్ళు వాడుకునే అతి సాధారణమైన పౌరహక్కుని కూడా దళితులు అనుభవించే అవకాశాన్ని ఉన్నత వర్గాలు అంగీకరించవనే విషయాన్ని మహద్ సంఘటన స్పష్టం చేసింది.

"కొలబా జిల్లా మహద్ హిందూ ఉన్నత కులస్థుల ప్రవర్తనలోని ఘోరమైన అంశమేమంటే సమావేశం వదిలి తమతమ గ్రామాలకు వెళ్ళిపోయిన దళిత వర్గసభ్యులకి వారి వారి గ్రామాలు చేరటంతో గుణపాఠం చెప్పమని ఆయాగ్రామాలలోని ఉన్నత వర్గాల వారికి వెంటనే వర్తమానాలు పంపబడ్డాయి. దీన్ని ఒక శాసనంగా భావించి సమావేశానంతరం తమతమ గ్రామాలకు చేరి చేరకుండానే అతి తక్కువ సంఖ్యలో ఉన్న మహర్లను ఆయా గ్రామాలలోని ఉన్నత కులాల హిందువులు మహర్ల కన్న అధిక సంఖ్యల్లో చేరి ఎక్కడ దొరికితే అక్కడ వాళ్లను కొట్టారు. తమకు రక్షణ కల్పించవలసిందిగా దళిత నాయకులు అధికార్లకు విన్నపాలు చేశారు. జిల్లా పోలీసు సూపరింటెండెంటుతో సహా అధికార్లు సంఘటనా స్థలాన్ని దర్శించి విచారణ జరుపుతున్నారు. కాని ఇక్కడ ఒక విషయాన్ని గురించి చెప్పాలి. స్థానిక మెజిస్ట్రేట్ రెండు గంటల పాటు కాలయాపన చేయకుండా ఉండినట్టైతే బహుశా కొట్లాటలు జరిగివుండేవికావు".

కాలారామ్ దేవాలయ సత్యాగ్రహం ఫలితంగా అస్పృశ్యులపై జరిపిన దాడికూడా ఇంతకన్నా చిన్నదేమీ కాదు.

ఇక మూడవ సంఘటన ఈ మధ్యే 1935లో బొంబాయి ప్రెసిడెన్సీ,అహమ్మదాబాదు జిల్లా,ఢోల్కా తాలూకాలోని కవితా గ్రామంలో సంభవించింది.

పబ్లిక్ స్కూళ్ళో అస్పృశ్యుల పిల్లలకు అడ్మిషన్లు ఇవ్వాలని ఆజ్ఞల్ని జారీ చేస్తూ బొంబాయి ప్రభుత్వం ఇలా పేర్కొన్నది. (ఢోల్కాలోని నవయుగ మండల్ కార్యదర్శి ఈ సంఘటనను గురించి నాకు స్టేట్‌మెంట్ పంపితే దాన్ని నేను తర్జుమా చేస్తున్నాను)

"ఆగష్టు 8, 1935 కవితా గ్రామంలోని అస్పృశ్యులు తమ పిల్లల్లో నలుగురిని గ్రామ పాఠశాలలో చేర్చేందుకు తీసుకెళ్లారు. గ్రామంలోని చాలామంది హిందూ కులస్థులు ఈ వింత చూసేందుకు అక్కడ గుమికూడారు. పిల్లల్ని చేర్పించే కార్యక్రమం ఏ అవాంతరమూ లేకుండా సజావుగానే సాగిపోయింది.

"కాని మరుసటి రోజున హిందూ కులస్థులంతా తమ పిల్లలు అస్పృశ్యుల పిల్లలతో కలిసి కూర్చుని కల్మషమై పోతారేమోనని పాఠశాలనుంచి తీసికెళ్ళిపోయారు.

"అటుతర్వాత కొన్ని దినాలకు ఒక బ్రాహ్మణుడు గ్రామంలోని అస్పృశ్యుణ్ణి కొట్టాడు. ఆగష్టు 12న గ్రామంలోని అస్పృశ్యుల్లో మగవాళ్ళంతా కలిసి తాలూకా మేజిస్ట్రేట్ కోర్టులో బ్రాహ్మణుడిపై క్రిమినల్ కేసు పెట్టేందుకు ధోల్కా వచ్చారు. ఇది తెలిసి, అస్పృశ్యుల్లో మగవాళ్ళు గ్రామంలో లేకపోవటమే అదనుగా గ్రామంలోని హిందువులు అస్పృశ్యులుండే ప్రాంతంపై కర్రలూ, కత్తులూ, బల్లేలతో దాడి చేశారు. దాడి జరిపిన వారిలో హిందూ కులస్థుల స్త్రీలు కూడా ఉన్నారు. అస్పృశ్యులపై వృద్ధులూ, స్త్రీలు అనే విచక్షణ లేకుండా దాడి జరిగింది. కొందరు పొలాల్లోకి పారిపోతే మిగిలిన వాళ్ళు ఇళ్ళల్లో జొరబడి తలుపులు బిగించుకున్నారు. గ్రామ పాఠశాలలో అడ్మిషన్ల కోసం నాయకత్వం వహించిన అస్పృశ్యులపై దాడి చేసి తమ కసిని, కోపాన్ని వెళ్ళ గక్కారు. వాళ్ళ ఇళ్ళ తలుపులు పగలగొట్టారు. ఇళ్ళలో వాళ్ళు కనబడక పోయేసరికి పెంకు కప్పుల్ని,దూలాల్ని విరగొట్టి వారి ఇండ్లను ధ్వంసం చేశారు. దాడికి గురై దెబ్బలు తిని భయభ్రాంతులైన అస్పృశ్య స్త్రీలు, పురుషులు ధోల్కా వెళ్ళి ఆరాత్రికే వస్తారనుకున్న తమ వాళ్ళు ఏమయ్యారోనని మానసిక వ్యధకు లోనయ్యారు. ధోల్కా వెళ్ళిన అస్పృశ్యుల నాయకులు రాత్రికి ఎప్పటికైనా తిరిగొస్తారని తెలుసుకున్న హిందూ కులస్థులు వాళ్ళమీద దాడిచేయటానికి ఆయుధాల్తో గ్రామం వెలుపల పొదల్లో, చెట్లమాటున మాటు కాచారు. కాని ఒక అస్పృశ్య స్త్రీ చీకట్లో ఎవరికీ తెలియకుండా గ్రామం వెలుపల అస్పృశ్య నాయకుల్ని కలుసుకొని, హిందూ కులస్థులు ఆయుధాల్తో దాడి చేయటానికి మాటుగాచారనీ, కాబట్టి వాళ్ళు గ్రామంలోనికి రావద్దని చెప్పింది. తాము గ్రామంలోకి రాకుంటే హిందూ కులస్థుల వల్ల ఇంకా ఎక్కువ ప్రమాదం జరిగే అవకాశముందని భావించి ఆమహిళ చెప్పిన మాటల్ని ఖాతరు చేయలేదు. అలాగని గ్రామంలోకి వెళితే

తమను కొడతారేమోనని కూడా భయపడ్డారు. అందుకని వాళ్ళు అర్థరాత్రి గడిచేవరకు గ్రామం వెలుపలే పొలాల్లో ఉండి వేచి చూడాలని నిర్ణయించుకున్నారు. ఈ లోపల పొదల్లో మాటు గాచిన హిందూ కులస్థులు చూసి , చూసి ఎవరూ రాకపోవటంతో చివరకు ఎటు వాళ్ళటు వెళ్ళిపోయారు. తెల్లవారు ఝాముున 3 గంటల ప్రాంతంలో అస్పృశ్యుల నాయకులు గ్రామంలో ప్రవేశించారు. అంతకు ముందు గనక వాళ్ళు గ్రామంలో ప్రవేశించే ప్రయత్నం చేసినట్లైతే హంతకుల ముఠా చేతుల్లో చచ్చిపోయుండేవాళ్ళు.

" తమ ప్రాణాలకు, ఆస్థులకు జరిగిన అన్యాయాన్ని విన్నవించుకోవటానికి తెలవారకుండానే వాళ్ళు గ్రామం వదలి అహమ్మదాబాదులోని హరిజన సేవక్ సంఘ్ (ఇది అస్పృశ్యుల సంక్షేమంకోసం శ్రీ గాంధీ ఏర్పాటు చేసిన సంస్థ) కార్యదర్శి దగ్గరకు వెళ్ళారు. కాని ఆకార్యదర్శి నిస్సహాయుడు. హిందూ కులస్థులు అస్పృశ్యుల్ని భౌతికంగా హింసించటమే కాక, వాళ్ళ బ్రతుకుల్నే దుర్భరం చేయటానికి కుట్ర పన్నారు. వాళ్ళకు కూలిపని ఇవ్వలేదు. వాళ్ళకు తిండిగింజలు అమ్మటానికి కూడా నిరాకరించారు. వాళ్ళ పశువుల్ని పొలాల్లో తిరగనివ్వలేదు. అస్పృశ్య స్త్రీల మీద, పురుషుల మీదా అడపా దడపా దాడులు జరగటం మొదలైంది. అంతే కాదు వెర్రి ఆవేశంతో అస్పృశ్యులు నీళ్ళుతోడుకునే బావుల్లో కిరసనాయిలు పోశారు. ఇదేదో ఒక రోజు జరిగింది కాదు, ఎన్నో రోజులు ఇలా జరిగింది. ఫలితంగా అస్పృశ్యులకు గ్రామంలో త్రాగే నీరు కరువయింది. ఈ స్థితిలో అస్పృశ్యులు హిందూకులస్థుల్లో కొందరిని ముద్దాయిలుగా చేస్తూ అక్టోబరు 17న మేజిస్ట్రేటు కోర్టులో కేసు నమోదు చేశారు.

ఈ కేసులో ముఖ్యమైన విషయమేమిటంటే శ్రీ గాంధీ, ఇంకా ఆయన అనుచరుడు వల్లభాయ్ పటేల్ నిర్వహించిన పాత్ర. హిందూ కులస్థులు కవితా గ్రామ అస్పృశ్యులపై జరిపిన క్రౌర్యాన్ని, దౌర్జన్యాన్ని గురించి పూర్తిగా తెలిసికూడా శ్రీ గాంధీ చేద్దామనుకున్నది అస్పృశ్యుల్ని గ్రామం విడిచివెళ్ళమని సలహా ఇవ్వటమే. నేరస్థుల్ని కోర్టుకులాగి విచారిద్దామని కూడా చెప్పలేదాయన. ఇక ఆయన నమ్మిన బంటు వల్లభాయి పటేలుగారు నిర్వహించిన పాత్ర ఇంకా విచిత్రం. ఆయన కవితాగ్రామానికెళ్ళి అస్పృశ్యుల్ని బాధపెట్టకండని హిందూ కులస్థుల్ని బ్రతిమాలాడు. కాని వాళ్ళు ఆయన సలహాను ఏ మాత్రం ఖాతరు చేయలేదు.

ఈ మనిషేదోషుల్ని అరెస్టు చేసి న్యాయస్థానంలో విచారించి శిక్షించేందుకు వ్యతిరేకించాడు. ఆయన వ్యతిరేకతను ఏ మాత్రంఖాతరు చేయకుండా అస్పృశ్యులు కోర్టులో కేసు దాఖలు చేశారు. కాని హిందూ కులస్థుల చేత ఇక తాము వాళ్ళని బాధించమని అస్పృశ్యులకు మాట ఇప్పించి, అస్పృశ్యులు హిందువులపై పెట్టిన కేసును ఉపసంహరించుకునేట్లు చేశాడు. ఇచ్చినమాటను అమలు పరచమని హిందూ కులస్థుల్ని అస్పృశ్యులు ఎన్నడూ అడగనూలేరు, అది జరిగే పనీ కాదు. శ్రీ గాంధీ గారి మిత్రుడైన వల్లభాయి పటేలు గారి సహాయంతో చివరకు జరిగిందేమంటే బాధల్తో మిగిలిన అస్పృశ్యులూ, వాళ్ళను పీడించిన హిందూ కులస్థుల విడుదలా.

"హిందూ కులస్థులు ఒక పథకం ప్రకారం అస్పృశ్యులపై జరుపుతున్న ఈ పీడనాదౌర్జన్యాలు అస్పృశ్యులు మంచి బట్టలు, నగలు ధరించటంలాంటి చిన్న చిన్న విషయాలకు కూడా పాకాయి. రెండు సంఘటనలు ఉదహరిస్తాను".

# III

చివరకు గెలుపెవరిదనేది ఒక ఆసక్తిదాయకమైన ఊహాగానం. దళిత ఉద్యమనాయకులు పరిస్థితిని జాగ్రత్తగా గమనిస్తూనేవున్నారు. అంతిమంగా ఫలితమేమైనా కానివ్వండి ఒక విషయం మాత్రం నిజం. ఈ పోరాటంలో అస్పృశ్యులకు వ్యతిరేకమైన విపత్కర పరిస్థితులే ఎక్కువగావున్నాయి.

హిందువులతో వచ్చిన ఈ సంఘర్షణలో నిరంతరమూ దూరంగా విసిరి వేయబడే వాళ్ళు అస్పృశ్యులే. కుల అరాచకానికి నిస్సహాయులై మిగులుతారు అస్పృశ్యులు. సమస్యేమిటంటే, అస్పృశ్యులే ఎందుకు దెబ్బలు తింటారు? ఎందుకు వాళ్ళు నిరంతరమూ దూరంగా విసిరి వేయబడ్డట్టు ఉంటున్నారు? ఇది చాలా ముఖ్యమైన ప్రశ్న. జవాబు చెప్పవలసిన అవసరం వుంది.

హిందూ కులస్థులతో ఏర్పడిన ఘర్షణలో అస్పృశ్యులులెక్కలోకి రాకపోవటానికి గల కారణాలు విదితమే. సంఖ్యల్లో చూస్తే ఈ రెండు వర్గాలు సమానం కాదు. హిందూ కులస్థులతో పోల్చి చూస్తే ఏ గ్రామంలో నైనా అస్పృశ్యుల సంఖ్య చాలా తక్కువ చాలా చోట్ల కొద్ది కుటుంబాలే వుంటాయి. కుటుంబాల్లో సభ్యుల సంఖ్య కూడా తక్కువే.

అస్పృశ్యుల్ని కూలిపనికి రానివ్వరు. దీని ఫలితంగా అస్పృశ్యులు కరువు కాటకాల పాలవుతారు.

ఒక బ్రతికేందుకు అస్పృశ్యులకు గ్రామంలో వేరే మార్గమేదీ లేదు. పాలమ్ముకోవటమో, కూరగాయలమ్ముకోవటమో లాంటివ్యాపారం చేయలేడతను. ఎవరూ వస్తువుల్ని అతని దగ్గర కొనరు. ఎందుకంటే అతను అస్పృశ్యుడు అతనికొక వృత్తి లేదు. ఎందుకంటే వృత్తులన్నీ వంశ పారంపర్యంగా వస్తున్నవిగాబట్టి అతని సేవల్ని ఎవరూ అంగీకరించరు. హిందువుల మీదనే అతను ఆర్థికంగా పూర్తిగా ఆధారపడటం వల్ల అతనెప్పుడైనా స్పృశ్యుల్ని లెక్క చేయనట్లు కనిపించినా, అవిధేయత ప్రకటించినా హిందువులు దాన్ని అవకాశంగా తీసుకుంటారు. తన జీవనం కోసం స్పృశ్యులపై ఆధారపడటమే కాదు తన కవసరమైన నిత్యావసర వస్తువులు కొనుక్కోటానికి కూడా అస్పృశ్యుడు వారిపైనే ఆధారపడుతున్నాడు. వ్యాపార వ్యవహారాలన్నీ స్పృశ్యుల చేతుల్లోనే ఉన్నాయి, తప్పని సరిగా వుంటాయి గూడా. నిత్యావసర వస్తువులు కొనుక్కోవటానికి అస్పృశ్యుడు స్పృశ్యులైన వ్యాపారుల మీదే ఆధారపడాలి. స్పృశ్య వ్యాపారి ఇష్టపడిసరుకులు అమ్మితేనే అస్పృశ్యుడు కొనగలడు. అలా అమ్మటం స్పృశ్య వ్యాపారికి ఇష్టం లేకపోతే డబ్బులున్నా గాని అస్పృశ్యుడు ఆకలితో మాడిపోవలసిందే. స్పృశ్యులకు, అస్పృశ్యులకు ఏదైనా గొడవ జరిగితే మొట్టమొదటగా స్పృశ్యులు విధిగా చేసేది అస్పృశ్యులకు సరుకులమ్మవద్దని వ్యాపారుల్ని కట్టడి చేయటమే. అస్పృశ్యులతో ఆర్థిక సంబంధాలు తెగ్గొట్టటానికి స్పృశ్యులంతా కలిసి కట్టుగా కుట్ర చేస్తారు. ఇది అస్పృశ్యులపై నిజానికి యుద్ధాన్ని ప్రకటించటమే. "శత్రువు" ను ఇంకా దిగజారి పోయేటట్లు చేసేందుకు, వాణ్ణి శిక్షించే వుద్దేశ్యంతో అస్పృశ్యుల నివాసాల్లోకి గుండాలను పంపి ఇళ్ళను, ఆస్తుల్ని ధ్వంసం చేసి స్త్రీలు, పిల్లలనే విచక్షణ లేకుండా హింసకు గురి చేస్తారు.

సాధారణంగా వాళ్ళు ప్రయోగించే అతిశక్తివంతమైన ఆయుధం అస్పృశ్యులపై పూర్తి వెలివేత అమలు జరపటం. శ్రీ గాంధీ "సహాయనిరాకరణ"కు మారు పేరైన ఈ వెలివేత సృష్టించే భయానక పరిస్థితులు చెప్పనలవి కాదు. వెనక బడిన వర్గాల బాధల్ని విచారించేందుకు బొంబాయి ప్రభుత్వం నియమించిన కమిటీ సాంఘిక బహిష్కరణను గురించి ఇలా అంటుంది:

"ప్రజోపయోగం కోసం ఏర్పడ్డ సంస్థలను అస్పృశ్యులు అనుభవించేందుకు కావలసిన హక్కుల సంరక్షణకు మేము ఎన్నో నివారణోపాయాలు ప్రతిపాదించినప్పటికి భవిష్యత్తులో వాళ్ళు వాటిని అనుభవించటంలో ఎన్ని ఇబ్బందులు ఎదుర్కోవలసివస్తుందో తల్చుకుంటే భయమేస్తుంది. మొదటి ఇబ్బంది ఏమిటంటే సాంప్రదాయక వర్గాలు బహిరంగంగానే హింసకు దిగుతాయేమోననే భయం. ఒక విషయం గుర్తుంచుకోవాలి. ప్రతి గ్రామంలోనూ అస్పృశ్యులు మైనారిటీగా వున్నారు. తమ హొదాను, గౌరవ మర్యాదలను అస్పృశ్యులు ఒక వేళ భంగపరిస్తే ఎంతకైనా తెగించి వాటిని కాపాడుకోవాలనుకుంటున్న సాంప్రదాయక వర్గం వారికెదురు నిలిచి వుంది. పోలీసులు విచారణ చేస్తారేమోనన్న భయమే సాంప్రదాయక వర్గాల హింసాధోరణిని అడ్డుకుంటున్నది".

"ఇక రెండో ఇబ్బంది అస్పృశ్యుల ప్రస్తుత ఆర్థిక పరిస్థితి. ప్రెసిడెన్సీలో చాలా ప్రాంతాలలో అస్పృశ్యులకు ఆర్థిక స్వావలంబన లేదు. సాంప్రదాయక వర్గాల దగ్గర ఎప్పుడైనా తొలగించబడే కౌలుదార్లుగా కొంత మంది అస్పృశ్యులు పని చేస్తున్నారు. ఇక మిగిలిన వాళ్ళు సాంప్రదాయకవర్గాల వద్దే గ్రామసేవకులుగా సేవ చేస్తూ వాళ్ళు పెట్టిందేదో తిని బ్రతుకుతున్నారు. దళిత వర్గాలు తమ హక్కుల్ని కోరినప్పుడల్లా వాళ్ళని కౌలునుంచి తొలగించి, పన్ల నుంచి తీసివేస్తూ గ్రామ సేవకులకు అన్నం కూడా పెట్టకుండా వుండటం లాంటి ఆర్థిక పరమైన ఆయుధాల్ని సాంప్రదాయక వర్గాలవారు దళితులపై ప్రయోగిస్తున్నారన్న విషయాన్ని మేము విన్నాం. అస్పృశ్యుల్ని బజార్లలో నడవకుండా నిరోధించటం, అస్పృశ్యులకు సరుకులు అమ్మకుండా గ్రామంలోని వ్యాపారుల్ని కట్టడి చేయటం దాకా వెళ్తుంది ఈ బహిష్కరణ. ఒక్కొక్కసారి లభించిన ఆధారాలను బట్టి మాకు తెలిసిందేమంటే ఇలాంటి బహిష్కరణ అతి చిన్న కారణాలకు, అతి సాధారణ విషయాల్లో కూడా జరుగుతున్నది. అస్పృశ్యులు మంచినీళ్ళ బావిని వాడుకునే హక్కును కోరినప్పుడు ఇలాంటిది తరుచుగా జరుగుతున్నది. అంతే కాకుండా అస్పృశ్యుడు జందెం వేసుకున్నా, కాస్తోకూస్తో పొలం కొనుక్కున్నా, మంచి బట్టలు గానీ నగలు గానీ ధరించినా, గ్రామ వీధుల గుండా వివాహ వూరేగింపు జరుపుకున్నా బహిష్కరణకు గురి చేసిన కేసులు తక్కువేమీ కాదు.

"అస్పృశ్యుల్ని అణచి వేసేందుకు కనిపెట్టబడ్డ ఈ బహిష్కరణ ఆయుధం కన్నా గొప్ప ఆయుధం మా దృష్టికి రాలేదు. బహిరంగంగా జరిపే హింస దీని ముందు వెలవెల

పోతుంది. ఎందుకంటే దీని ప్రభావం తీవ్రమైనదీ, భయానకమైనదీను. అంగీకరించబడిన ఒప్పందం చేసుకునే స్వేచ్ఛ(Freedom of contract) దృష్ట్యా ఇది న్యాయబద్ధమైన చర్యే కావటం వల్ల ఇది ఎంతో ప్రమాదకమైనటువంటిది. అస్పృశ్యుల అభివృద్ధికి అవసరమైన వాక్స్వాతంత్ర్యాన్ని వారికి గ్యారంటీ చేయాలంటే ఈ మెజారిటీ వర్గ కౌర్యాన్ని నిర్దాక్షిణ్యంగానైనా సరే తొలగించాలనే అంశాన్ని మేము అంగీకరిస్తున్నాము."

## IV

అస్పృశ్యుల నిస్సహాయ స్థితికి తోడైన మూడో అంశం ఏమిటంటే పోలీసుల నుంచి గానీ, న్యాయస్థానాలనుంచి గానీ ఏ కొద్దిమాత్రమైనా రక్షణ పొందటం దుస్సాధ్యమై పోవటం. పోలీసులంతా హిందూ కులస్థులే. మెజిస్ట్రేట్లు కూడా హిందూ కులవర్గాల నుంచి వచ్చినవారే. అస్పృశ్యులపై హిందూకులస్థులకున్న ఈర్ష్యా ద్వేషాలన్నీ వీరికీ వున్నాయి. ఒక వేళ అస్పృశ్యుడెవడైనా హిందూ కులస్థులకు వ్యతిరేకంగా ఏదైనా ఫిర్యాదు పట్టుకుని వెళితే వారికి రక్షణ లభించకపోగా దండిగా తిట్లు తిన వలసి వస్తున్నది.ఫిర్యాదు నమోదు చేయకుండా తరిమేస్తారు. లేదా ఒక వేళ నమోదు చేసినా దాడి చేసినవాడు సులభంగా తప్పించుకొనేందుకు వీలుగా తప్పుడు ఫిర్యాదు నమోదు చేస్తారు. ఒక వేళ మెజిస్ట్రేటు ముందు కేసుపెడితే వచ్చే న్యాయమేదో తేలిగ్గా వూహించవచ్చు. గ్రామమంతా కలిసి కుట్ర పన్నినందువల్ల స్పృశ్యులెవరూ వారికి సాక్షులుగా దొరకరు. ఒకవేళ అస్పృశ్యుల నుండి సాక్షుల్ని తెస్తే మెజిస్ట్రేటు వారి వాఙ్మూలాన్ని ఒప్పుకోడు. ఎందుకంటే వాళ్ళు పక్షపాతులు. స్వతంత్ర సాక్షులుకారు. ఒక వేళ నిష్పక్షపాతులైన సాక్షులైనప్పటికీ వాళ్ళు చెప్పేదాంట్లో సత్యం లేదంటూ ముద్దాయిలు తేలిగ్గా తప్పించుకునేందుకు వీలు కల్పించగలడు మెజిస్ట్రేటు. ఏ మాత్రం భయపడకుండా అతనీ పని చేయగలడు. ఎందుకంటే తాను విచారించిన సాక్షుల వాఙ్మూలాన్ని అనుసరించి క్రింది కోర్టు ఇచ్చిన తీర్పుకు వ్యతిరేకంగా ఏ అప్పీలు న్యాస్థానమూ కేసులను తీర్మానించరాదనేది శాసనం. కాంగ్రెస్‌లోని అస్పృశ్యులు కూడా ఈ వాస్తవాన్ని అంగీకరిస్తున్నారు.

తమిళనాడు హరిజన సేవక్ సంఘ్ తన 1937 సెప్టెంబరు 30 నాటి వార్షిక నివేదికలో ఇలా పేర్కొంది:

"హరిజనుడి రాజకీయ చైతన్యం ఈ హక్కుల వల్ల పెరిగినా, గ్రామాల్లో తన హక్కుల్ని పరిరక్షించుకోవటం అతనికి సాధ్య పడటం లేదు. ఎందుకంటే తన హక్కుల్ని గురించి గట్టిగా మాట్లాడుకోవటమంటే హిందూ కులస్థులతో పోట్లాడటమే. ఇందులో హిందూ కులస్థులదే పైచేయి. పోట్లాట తర్వాత సాధారణంగా జరిగేది పోలీసుకోలేదా మేజిస్ట్రేట్‌కో ఫిర్యాదు చేయటం. ఇందులో మొదటిది ఏమాత్రం ఉపయోగంలేనిదైతే రెండోది హరిజనులకు అందుబాటులో లేనిది. చాలా కేసుల్లో ఫిర్యాదుల్ని విచారించటం లాంటిదే అసలు జరుగదు. మిగిలిన కేసుల్లో తీర్పులు కులస్థులకు అనుకూలంగా వస్తాయి. మేం పోలీసులకు చేసే ఫిర్యాదులకు కూడా ఇదే గతి పడుతున్నది. మా ఉద్దేశ్యంలో గొడవంతా ఎక్కడవస్తున్నదంటే పోలీసుల్లో దిగువ స్థాయి ఉద్యోగుల్లో మానసిక పరివర్తన రాలేదు. హరిజనులకూ హక్కులున్నాయి, వాటికి అతను పరిరక్షకుడనీ పోలీసులకు తెలియదు. లేదా కులస్థుల ప్రభావానికి లొంగుతున్నాడు. ఉదాసీనతకూడా ఒక కారణం కావచ్చు. ఇంకా ఇతర కేసుల్లో ధనిక కులస్థుల వద్ద వాళ్ళు తీసుకునే లంచం కూడా ఒక కారణం (హిందూ, మార్చి 7, 1938)

అధికారి అనేవాడు హిందూ పక్షపాతి, అస్పృశ్యులకు వ్యతిరేకి అని దీనర్థం. అతనికున్న అధికారం ఎల్లవేళలా అస్పృశ్యులపై ద్వేషంతోనే చెలాయిస్తాడు.

పోలీసులు, మేజిస్ట్రేట్‌లు అప్పుడప్పుడు లంచం తీసుకుంటారు. లంచగొండులయితే ఫర్వాలేదు. ఎందుకంటే లంచగొండి అధికారిని ఏ పక్షమైనా లంచంతో కొని పారవేయవచ్చు. లంచగొండితనం కన్నా వాళ్లలో ఉన్న పక్షపాతం ఎక్కువ కష్టాలకు కారణమౌతుంది. అస్పృశ్య వ్యతిరేకతకు కారణం హిందువుల్లో ఉన్న ఈ పక్షపాతమే. ఒకళ్ళంటే పక్షపాతం మరొకళ్ళంటే వ్యతిరేకత. ఈ రోగానికి నివారణోపాయంలేదు. దీని పునాదులు సమాజంలోనూ మతంలోనూ ఉండి ప్రతి హిందువు రక్తంలో ఇది జీర్ణించుకుపోయింది. పోలీసులు, మేజిస్ట్రేట్లకు వాళ్ళ వాళ్ళ భావనల వల్ల, వాళ్ళకున్న అభిలాషల వల్ల పుట్టుక వల్లా అస్పృశ్యుల్లోని జీవ శక్తులు సలిపే పనులంటే జాలీ,దయా, కరుణా ఉండవు. అస్పృశ్యుల బాధలు, వాంఛలు, కోర్కెలు వీరికి తెలియవు. తత్ఫలితంగా వారు అస్పృశ్యుల వాంఛలన్నా, కోర్కెలన్నా బహిరంగంగానే వ్యతిరేకిస్తారు. వాళ్ల అభివృద్ధికి తోడ్పడరు. వాళ్ళ జీవన పోరాటానికి సహాయపడరు. వాళ్ళు గౌరవ మర్యాదలు పొందకుండా అన్నిటికీ అడ్డుకట్ట వేస్తారు. మరో వంక హిందువుల అనుభూతుల్లో పాలు పంచుకుంటారు. వాళ్ళ

అధికారాన్ని, గౌరవ మర్యాదల్ని అస్పృశ్యులపై నిలుపుకోవటానికి హిందువులంటే జాలీ, దయా చూపుతారు. ఈరెండు వర్గాల మధ్య ఘర్షణలేర్పడినప్పుడు అస్పృశ్యులకు వ్యతిరేకంగా ఆ పోరాటాల్ని అణచి వేసి, వాళ్ళని ఎక్కడ పడివున్నారో అక్కడే అణచి వేసే "అస్పృశ్యులకు గుణపాఠం నేర్పే" కార్యక్రమంలో హిందువుల ఏజెంట్లుగా అక్రమ మార్గాలను కూడా అనుసరిస్తూ నిస్సిగ్గుగా పని చేస్తున్నారు.

దీనిలోని దౌష్ట్యం ఎలాంటిదంటే ఈ అన్యాయం, ఈ పీడనా చట్టపరిధిలోనే చేయవచ్చు. అస్పృశ్యుణ్ణి పనిలోకి తీసుకోననీ, అతనికి ఏదీ అమ్మననీ, చేస్తున్న పనిలోంచి తొలగిస్తాననీ, తన భూమిని కౌలుకు దున్ననివ్వననీ, అతని పశువుల్నితన పొలాల గుండా నడవనివ్వననీ హిందువైనవాడు ప్రకటించవచ్చు. ఈ చర్యలన్నీ చట్టంలోని ఏ అంశాన్నైనా కూడా అతిక్రమించకుండానే చేయవచ్చును. ఇలా చేయటంలో అతను కేవలం తన హక్కును మాత్రమే అనుభవిస్తాడు. అతను ఏ ఉద్దేశ్యంతో ఈ పనులు చేస్తున్నాడో చట్టానికి పట్టదు. అస్పృశ్యుడికి దీనివల్ల ఎంత అన్యాయం జరుగుతుందో చట్టానికి కనిపించదు. పోలీసులు తమ అధికారాన్ని, శక్తియుక్తుల్ని దుర్వినియోగం చేయవచ్చు. విషయాన్ని కావాలనే తప్పుడుగా రికార్డు చేయవచ్చు. చెప్పనిదాన్ని చెప్పినట్లు, చెప్పినదాన్ని చెప్పనట్లు నమోదు చేయవచ్చు. తనకు ఏ పార్టీ వాళ్ళు ఇష్టంగా వుంటే వాళ్ళకు ఎదుటిపార్టీవాళ్ళ సాక్ష్యాధారాల్ని చాటుగా అందివ్వవచ్చు. నేరస్థుల్ని అరెస్టు చేయటానికి నిరాకరించవచ్చు. కేసును చెడగొట్టటానికి అతను సవాలక్షపనులు చేయవచ్చు. చట్టానికి దొరుకుతానేమోననే భయామూ, భక్తీ లేకుండా నిర్భయంగా అతనీ పనులన్నీ చేయగలడు. చట్టంలో వున్న లొసుగులు కొల్లలు. అవన్నీ అతనికి బాగా తెలుసు. మెజిస్ట్రేట్లకు ఎన్నోనిరపేక్షాధికారాలు ఇచ్చారు. వాటిని అతను స్వేచ్ఛగా వాడుకోవచ్చు. కేసులో తీర్పు సాక్షులిచ్చే సాక్ష్యంపై ఆధారపడి వుంటుంది. కాని తీర్పులు సాక్షులిచ్చే సాక్ష్యాలు విశ్వసింపదగినవా, కావా అనే అంశంపైన కూడా ఆధాపడి వుంటాయి. ఏ పార్టీ చెప్పింది విశ్వసించదగిందో, ఏ పార్టీ చెప్పింది విశ్వసింపదగనిదో తేల్చుకునేది మెజిస్ట్రేటు మాత్రమే. ఒకళ్ళు చెప్పిందే నిజమని నిర్ధారణకు రావటంలో అతను చాలా నిరంకుశంగా వ్యవహరించవీలుంది. అందులో ఎవ్వరూ జోక్యం చేసుకునేందుకు వీలు లేదు. ఈ నిరపేక్షాధికారాన్ని నెరపటంలో మెజిస్ట్రేట్లు అస్పృశ్యులపై ద్వేషంతో ప్రవర్తించిన కేసులు అసంఖ్యాకం. అస్పృశ్యుల సాక్షాలు ఎంత నిజమైనవైనా మెజిస్ట్రేట్లు

"నేను ఈ సాక్ష్యాల్ని నమ్మను" అని చెప్పటమే సాధారణంగా జరుగుతున్నది. దీన్ని ఇంతవరకు ఎవరూ ప్రశ్నించలేదు. ఏ శిక్ష వేయాలనేది కూడా మెజిస్ట్రేటు తన కున్న నిరపేక్షాధికారంతోనే నిర్ణయిస్తాడు. అప్పీలు చేసుకోవటానికి వీలైన శిక్షలు, అలా చేసుకోవటానికి. వీలులేని శిక్షలూ వుంటాయి. అప్పీలనేది జరిగిన అన్యాయానికి పరిహారమార్గం. అప్పీలు చేసుకొనే వీలు లేని శిక్షను వేసి మెజిస్ట్రేటు ఈ మార్గాన్ని కూడా మూసివేయగలడు.

జీవన పోరాటం చేస్తున్న అస్పృశ్యులపై ఎక్కుపెట్టబడ్డ శక్తులు ఇవీ. వీటిని అధిగమించే మార్గమేదీ లేదు. ఎందుకంటే శాసనాల్ని, చట్టాల్ని త్రోసి రాజనటానికి సిద్ధమైన సమాజాన్ని మొత్తంగా శాసన బద్ధంగా శిక్షించటం సాధ్యంకాని పని.

## V

ఈ ఇబ్బందుల్ని పూర్తిగా అధిగమించే అవకాశం లేదు. కాని వీటిని తగ్గించగల మార్గం ఒకటుంది. ఆ మార్గం రాజకీయంలో వుంది. రాజకీయశక్తిని సరిగా ఉపయోగించటంలో ఈ అవకాశం వుంది అయితే అస్పృశ్యులు ఈ విషయంలో అడ్డగించబడ్డారు.

అనువాదం. కె. సీతారామరావు

అధ్యాయం – 23

# వాళ్ళ వాంఛలే మాకు శాసనాలు

I. ధర్మం కోసం అధర్మం. II. మనువూ–ధర్మమూ III. ఆధునిక ప్రతి రూపాలు IV. శీలమూ, దృక్పథాలపై ధర్మం ప్రభావం.

అస్పృశ్యుల ఉద్యమాన్ని అణచివేయటంలో హిందువులనుసరించే శాసన రాహిత్యాన్ని పరిశీలిస్తున్న వాడెవడైనా తీవ్ర దిగ్భ్రమకు లోనవుతాడని నాకు తెలుసు. హిందువులెందుకు ఇంతటి శాసనరాహిత్యానికి పాల్పడుతున్నారని అతను తప్పకుండా ప్రశ్నిస్తాడు. ఇప్పటి పరిస్థితుల్లో అది సహజమైన ప్రశ్న కాదని ఎవరూ అనరు. అడగవలసిన ప్రశ్నేనని అంటారు. శుభ్రమైన బట్టలు కట్టుకుంటున్నందుకు ఒక అస్పృశ్యుడు ఎందుకు క్రూరత్వానికి బలి కావాలి? అలా కట్టుకున్నందుకు హిందువెందుకు మనస్తాపం చెందాలి. పెంకుతో ఇల్లు కప్పు వేసుకోవాలని ఆశించే అస్పృశ్యుడు ఎందుకు పరాభవానికి గురి కావాలి? అది హిందువుకు ఎందుకు బాధాకరమౌతుంది? చదివించుకోవాలనే తపనతో తన పిల్లల్ని పాఠశాలకు పంపుకోవాలనుకుంటే అస్పృశ్యుణ్ణి ఎందుకు వెలివేతకు గురి చేస్తారు? అలా అతని పిల్లల్ని బడికి పంపినందువల్ల హిందువెందుకు బాధ పడాలి? చచ్చిన జంతువుల కళేబరాలను మోసుకెళ్ళాలని, చచ్చిన జంతువుల మాంసాన్నే తినాలని, ఇళ్లిల్లూ తిరిగి అడుక్కునే తినాలని అస్పృశ్యుడు ఎందుకు వత్తిడి చేయబడాలి? ఇలాంటివి చెయ్యకపోతే హిందువుకు వాటిల్లే నష్టమేమిటి? ఒక అస్పృశ్యుడు తన మతాన్ని మార్చుకోగోరితే హిందువు ఎందుకు అభ్యతరం చెప్పాలి? అలాంటి మతమార్పిడి హిందువును ఎందుకు దిగ్భ్రాంతికి లోనుచేసి అతని స్థితిని తారుమారు చేస్తుంది? గౌరవపూర్వకమైన పేరు పెట్టుకుంటే హిందువైన వాడు ఎందుకు కోపంతో పెట్రేగి పోవాలి? అతను మంచి పేరు పెట్టుకుంటే హిందువుకు ఏవిధంగా హాని జరుగుతుంది. రోడ్డుకు అభిముఖంగా ఏ అస్పృశ్యుడైనా ఇల్లు కట్టుకుంటే హిందువుకు అభ్యంతరమేమిటి? దీనికి అతనెందుకు బాధ పడాలి? కొన్ని ప్రత్యేకమైన దినాలలో అస్పృశ్యుడు చేసే శబ్దమే తమ చెవులకు సోకరాదని ఎందుకు అభ్యతరం పెడతారు హిందువులు? దానివల్ల అతను చెవిటివాడేమీ కాడే. అస్పృశ్యుడేదైనా వృత్తి నవలంబిస్తే, ఏదైనా అధికారం పొందితే, కాస్తో,

కూస్తో పొలం కొనుక్కుంటే, వ్యాపారంలోకి దిగితే, ఆర్థికంగా స్వతంత్రుడుగా మారి సంపన్నుల్లో ఒకడుగా గణించబడితే హిందువెందుకు అయిష్టంగా బాధపడతాడు? హిందువుల్లో అధికారులు, అనధికారులూ అందరూ కలిసి అస్పృశ్యుణ్ణే ఎందుకు అణచివేతకు గురిచేస్తారు? సాధారణ పరిస్థితుల్లో తన్నుకు చచ్చే కుల వర్గాల వాళ్ళు హిందూ మతం పేరుతో ఏకమై అస్పృశ్యుల్ని దూరంగా వుంచేందుకు ఎందుకు కుట్ర పన్నారు?

ఇదంతా కల్పితంగా అనిపించవచ్చు. కాని ఇంతకుముందు అధ్యాయంలో వివరించిన హిందువుల క్రూరత్వాన్ని గురించి చదివిన వారికెవరికైనా ఈ ప్రశ్నల పునాదిలో వాస్తవాలున్నాయని తెలుస్తుంది. వాస్తవాలు కల్పితాల కన్నా చిత్రమైనవి గదా! కాని చిత్రాతిచిత్రమైన విషయమేమిటంటే ఈ చేష్టలన్నీ చేసేది పిరికి పందలనిపించేంత నెమ్మదస్తులైన హిందువులు. సాధారణంగా హిందువులు సున్నిత మనస్కులు. ముస్లింలలో కనిపించే ధీరత్వమూ, కల్లోల మనస్తత్వమూ వాళ్ళల్లో లేవు. కాని ఇలాంటి సున్నిత మనస్కులే స్త్రీలపై, పురుషులపై, పిల్లలపై ఏ మాత్రం దయాదాక్షిణ్యంలేని దోపిడికి, కొల్లగొట్టడానికి, హింసకు దిగి అస్పృశ్యులపై శాసన రాహిత్య చర్యలకు పాల్పడటాన్ని గమనిస్తే హిందువుల్ని ఉన్మత్తులుగా చేస్తున్న తీవ్రమైన, బలవత్తరమైన కారణమేదైనా ఉందేమోనని విశ్వసించవలసి వస్తుంది.

విచిత్రమైన ఈ అమానవీయ చర్యలకు ఏదో వివరణ వుండి తీరాలి. ఏమిటది?

శుచియైన, గౌరవ ప్రదమైన జీవనం కోసం అస్పృశ్యులు చేస్తున్న ప్రయత్నాలను చూసి ఎందుకు ఉన్మత్తుడౌతావని ఏ హిందువునైనా అడిగితే అతనిచ్చే జవాబు చాలా మామూలు జవాబే. అతనిలా అంటాడు : "అస్పృశ్యులు దేనిని సంస్కరణ అంటారో అది సంస్కరణ కాదు. అది మన ధర్మం మీద జరిపే దౌర్జన్యం." అతను చెప్పే ఈ ధర్మం ఎక్కడ రాసుందని మీరడిగితే మళ్ళీ అతని సమాధానం చాలా మామూలు సమాధానమే. అతను "మన ధర్మం, మన శాస్త్రాలలో ఉంది" అంటాడు. మౌలికంగా తప్పుడు పద్ధతుల్లో హిందువులు జరిపే హింస, దోపిడి, దౌర్జన్యాలకు వ్యతిరేకంగా అస్పృశ్యుల న్యాయబద్ధమైన పోరాటాన్ని నిష్పక్షపాతి అయిన వ్యక్తి ఎవరైనా న్యాయబద్ధమైనదేనని భావిస్తాడు. హిందువుల్ని బాగా తెలిసిన మాటల్లో చెప్పాలంటే అతను హిందువును అధర్మాన్ని పాటించే వాడనే అంటాడు. కాని హిందువు దాన్ని ఎప్పటికీ అంగీకరించడు. అస్పృశ్యులే

ధర్మాన్ని నిధనం చేస్తున్నారని హిందువైనవాడి విశ్వాసం. అధర్మ బద్ధమైన అతని శాసన రాహిత్య చర్యలు ధర్మాన్ని రక్షించేందుకు ఉద్దేశించిన పవిత్రమైన చర్యలేనని అతని విశ్వాసం. ఇది హిందువుల మనస్తత్వం తెలిసినవాడెవడైనా కాదన వీలులేని వాస్తవం. కాని ఇది మరొక ప్రశ్నను రేకెత్తిస్తుంది. శాస్త్రాలు నిర్దేశించే ఈ ధర్మాలు ఏమిటి, అవి ఎలాంటి సామాజిక సంబంధ నియమాల్ని పేర్కొంటున్నాయి?

## II

ధర్మం అనేమాట సంస్కృతం నుండి పుట్టింది. ఒకే విధంగా తప్ప మరో విధంగా నిర్వచించటానికి వీలు లేని కొన్ని కొన్ని సంస్కృత పదాల్లో ఇదొకటి. పూర్వ కాలంలో ఈ పదాన్ని సమానార్థాలు గల వేర్వేరు మాటల్లో వుపయోగించేవారు. 'ధర్మం' అనే మాట అర్థాన్ని మార్చుకుంటూ ఎలా పయనించిందో తెలుసుకోవటం చాలా ఆసక్తి దాయకంగా వుంటుంది[1] కాని అదిక్కడ సాధ్యపడదు. ఒక విషయం చెబితేచాలు. ధర్మం అనే మాట అనతి కాలంలోనే అనుమానాలకు తావు లేని ఒక నిశ్చితమైన అర్థాన్ని సాధించుకుంది. 'ధర్మ' అంటే హిందూ సమూహంలో సభ్యుడుగా, ఒక కులంలో సభ్యుడుగా, జీవనగతిలో ప్రత్యేక దశలో ఒక వ్యక్తికి గల ప్రత్యేక హక్కులు, విధులు, భాధ్యతలతో కూడిన ప్రవర్తనానియమావళి.

వేదాలు, స్మృతులు, ఆచారాలు ధర్మానికి ముఖ్యమైన ఆధారాలు. ఇది హిందువులంతా అంగీకరించిందే. ధర్మానికి సంబంధించినంతవరకు వేదాలకు, స్మృతులకు ఒక తేడా వుంది. మనం ఇప్పుడు చూస్తున్న అభివృద్ధి చెందిన రూపంలోని ధర్మ నిబంధనల పునాదులు వేదాల్లోనే వున్నాయి. కాబట్టి ధర్మానికి మూలం వేదాలేనని చెప్పటం న్యాయం. కాని వేదాల్ని ధర్మాన్ని గురించిన లాంఛన ప్రాయమైన గ్రంథాలుగా ఎప్పుడూ చెప్పబడలేదు. ధర్మానికి సంబంధించిన గుణాత్మక నిబంధనలను (విధులు) సంబంధిత విషయాలుగా వేదాలు కలిగిలేవు. సంబంధంలేని విషయాలపై కొన్ని ధర్మప్రకటనలు మాత్రమే అందులో వున్నాయి. మరొక వైపు చూస్తే స్మృతులే ధర్మాన్ని గురించిన లాంఛనప్రాయగ్రంథాలు. ధర్మ సంబంధమైన శాసనాలు వీటిలో వున్నాయి. నిశ్చితార్థంలో ఇవే శాసన బద్ధధర్మంగా ఏర్పడ్డాయి. ఏది ధర్మం, ఏది ధర్మం కాదు (అధర్మం) అనే

వివాదాన్ని స్మృతుల్లో ఉన్న న్యాయాన్ని పరిశీలించటం ద్వారానే నిర్ణయించ వచ్చు. కాబట్టి హిందువులు దేన్ని ధర్మం అని పిలుస్తారో దానికి మూలం స్మృతులే. ఏది ధర్మమో, ఏది ధర్మం కాదో తెల్సుకోవటానికి స్మృతులే సాధికారికమైనవి కాబట్టి ధర్మ సూత్రాలను నిర్దేశించే ఈ శాస్త్రాలను ధర్మ శాస్త్రాలుగా పిలుస్తారు.

పూర్వకాలం నుంచి వచ్చిన స్మృతులను వివిధరకాలుగా పేర్కొంటారు. అతి చిన్న సంఖ్య ఐదు. అతి పెద్ద సంఖ్య వంద. గుర్తుంచుకోవలసిన విషయమేమిటంటే ఇవన్నీ సమానంగా సాధికారికమైనవి కావు. ఇందులో చాలావరకు నిగూఢమైనవి. ఇందులో కొన్నిమాత్రమే వ్యాఖ్యాతలు సాధికారికంగా వ్యాఖ్యానించవీలున్నవిగా భావించబడుతున్నాయి. వ్యాఖ్యానించే సదుపాయాన్ని ఆధారంగా తీసుకుని స్మృతుల ప్రాధాన్యతలను నిర్థారించవలసి వస్తే నిశ్చితమైనవీ, సాధికారికమైనవీ మనుస్మృతీ, యాజవల్క్య స్మృతీ, నారదస్మృతీ ముఖ్యమైన స్మృతులు. వీటిలో మనుస్మృతే అత్యున్నతమైనది. ధర్మానికి ఇదే అతి ముఖ్యమైన ఆధారం.

ఏ ధర్మం కోసం హిందువు అస్పృశ్యులపై యుద్ధానికి తలపడ్డాడో తెలుసుకోవాలంటే స్మృతులలో - ముఖ్యంగా మనుస్మృతిలో-వున్న నియమ నిబంధనలేవో తప్పక తెలుసుకోవాలి. ఈ నియమనిబంధనలను గురించి కొంతవరకైనా తెలుసుకోక పోతే అస్పృశ్యుల ఉద్యమానికి హిందువులవ్యతిరేకతను అర్థం చేసుకోవటం సాధ్యంకాదు. మన ముందిప్పుడున్న విషయాన్ని తెలుసుకోవటానికి స్మృతులన్నిటిలోను నిక్షేపమైయున్న ధర్మానికి సంబంధించిన శాఖలన్నిటినీ గురించి తెలుసుకోవలసిన అవసరంలేదు. ఆధునిక పరిభాషలో వ్యక్తినియమాలను గుర్తించిన ధర్మశాఖను తెలుసుకుంటే చాలు. సాధారణ భాషలో చెప్పాలంటే ఏధర్మశాస్త్ర భాగమైతే హక్కు, విధి లేదా స్థాయిపై ఆధారపడ్డ హోదాను గురించి పేర్కొంటుందో దాన్ని గురించి తెలిస్తేచాలు.

కాబట్టి మనువు గుర్తించిన సామాజిక వ్యవస్థ వివరణకు సంబంధించిన భావాలను, సామాజిక వ్యవస్థలో వివిధ వర్గాలకు ఆయన నిర్దేశించిన హక్కులు, విధులగురించిన మను ధర్మశాస్త్రంలోని విభాగాలను మాత్రమే ఈ క్రింద పేర్కొంటాను.

మనువు నిర్దేశించిన సామాజిక వ్యవస్థను గురించి ఎవరూ సరిగ్గా అర్థం చేసుకోలేదు. అపార్థానికి తావు లేకుండా వుండాలంటే ఒక విషయం మనవిచేయటం అవసరం. మానువులు స్థూలంగా నాలుగు భిన్నమైన వర్గాలుగా విభజింపబడి చాతుర్వర్ణ వ్యవస్థగా పిలువబడుతున్న సామాజిక వ్యవస్థను నిర్దేశించటమే మనువుచేసిన పని అని చెపుతుంటారు, విశ్వసిస్తుంటారు సాధారణంగా. మనువు ప్రతిపాదించిన ధర్మం ఇదేననే తలంపులో వున్నారు చాలామంది. ఇది చాలా పొరపాటు. దీన్ని సరిదిద్దకపోతే మనువు నిజంగా చెప్పిందాన్ని అపార్థం చేసుకోవటానికి దారి తీస్తుంది. ఆయన దేన్ని ఆదర్శ వ్యవస్థ గా భావించాడన్నది కూడా అపార్థాలకు దారి తీస్తుంది.

ఇది మనువును తప్పుగా అధ్యయనం చేయటం వల్ల కావచ్చనుకుంటా. నాలుగు వర్గాల విభజనతో కూడిన చాతుర్వర్ణవ్యవస్థ మనువు ప్రతిపాదనలోని ప్రాథమికమైన విషయం కాదని అంగీకరించవచ్చు. ఒక విధంగా ఈ వర్గీకరణ మనువులో అంతగా ప్రాముఖ్యత లేనిదే. ఆయనకు అది కేవలం చాతుర్వర్ణం లో చేర్చబడ్డ వర్గాలమధ్య అంతర్గత వ్యవస్థీకరణమాత్రమే. ఒకడు బ్రాహ్మణుడా, క్షత్రియుడా, వైశ్యుడా లేకశూద్రుడా అనేది అంత ముఖ్యమైన విషయం కాదు చాలా మందికి. ఈ వర్గీకరణ మనువుకన్న ముందే వుంది. ఈ వర్గీకరణకు ఆయన ఎంతో జోడించాడు, స్థిరీకరించాడు, తీవ్రతరం చేశాడు. ఈ విభజన ఆయన్తో పుట్టలేదు. కాని మనువుతో పుట్టింది : 1. చాతుర్వర్ణ చట్రంలోని వర్గాలకు 2. చాతుర్వర్ణ చట్రానికి బాహ్యంగా వున్న వర్గాలకు మధ్య సృష్టించబడ్డ విభజన. ఈ క్రొత్త విభజన మనువు చేసిన అసలుసిసలైన సృష్టి. హిందువుల ప్రాచీనధర్మానికి ఆయన చేర్చిన కొత్త చేర్పు ఇదీ. ఈ వర్గీకరణం మనువుతోనే ప్రారంభమైంది. ఎందుకంటే దీన్ని ప్రప్రథమంగా ప్రవేశపెట్టి సాధికారిక గుర్తింపును కల్పించింది ఆయనే.

మన చర్చనీయాంశంతో సంబంధమున్న మూలగ్రంథాలను రెండు విభాగాలుగా చేయవచ్చు. అవి 1. చాతుర్వర్ణ పరిధిలో వున్న వారికి సంబంధించిన మూల గ్రంథాలు 2. చాతుర్వర్ణ వ్యవస్థకు బయటవున్న వారికి సంబంధించిన మూలగ్రంథాలు.

## 1. చాతుర్వర్ణం పరిధిలోనివారు – వారి పుట్టుక వారి విధులు :-

1. ఇది (విశ్వం) మహానిద్రలో లీనమై, జ్ఞానానికి అభేద్యమై, హేతువునకు అతీతమై, నిర్దిష్టరూపలక్షణ హీనమై, గ్రహణాతీతమైన అంధకారరూపంతో నిలిచింది. (మనువు 1.5).

2. అప్పుడు తారతమ్యము లేని దేవతాత్మ (స్వయంగా స్వయంభువు) ఆయా మహామూలములన్నింటినీ సృష్టించి, తారతమ్యతను వివేచించి, అంధకారమును చీల్చి మహా (సృష్టి) శక్తితో ప్రత్యక్షమాయెను (మనువు 1.6)

3. కాని విశ్వ కళ్యాణంకోసం ఆయన తననోటినుండి (బ్రాహ్మణులను, తన భుజమునుండి క్షత్రియులను, తొడలనుండి వైశ్యులను తన పాదములనుండి శూద్రులను సృష్టించెను. (మనువు 1.31).

4. కాని మహావైభవోపేతుడైన ఆయన ఈ విశ్వరక్షణార్థం తననోటినుండి, చేతులనుండి, తొడలనుండి, తనపాదములనుండి ఆవిర్భవించిన వారికి ప్రత్యేకమైన విధులను, వృత్తులను నిర్ణయించినాడు (మనువు 1.7)

5. బ్రాహ్మణులకు వారి బాగుకోసం, ఇతరుల మంచికోసం బోధన, అధ్యయనం (వేదాధ్యయనం) యాగాలు(యజ్ఞయాగాదులు నిర్వహించటం) దాన ధర్మాలు చేయటం, అంగీకరించటం (భిక్షాటనం) ఆయన నిర్ణయించాడు. (మనువు 1.88)

6. ప్రజల రక్షణ, బహుమాన ప్రదానం, యాగాలు నిర్వహించటం లేదా అధ్యయనం చేయటం, శారీరక సుఖాలకు అతీతులై ఉండటంగా క్షత్రియులకు నిర్దేశించాడు. (మనువు 1.89)

7. వైశ్యులకు పశుపాలన, బహుమానప్రదానం, యజ్ఞయాగాదులుచేయటం, (వేదాలు) అధ్యయనం చేయటం, వ్యాపారం చేయటం, అప్పులివ్వటం, వ్యవసాయం చేయటంగా నిర్ణయించాడు (మనువు 1.90).

8. శూద్రులకు ఆయన ఒకే ఒక వృత్తిని నిర్ణయించాడు. అది పై మూడు వర్గాలకు మారు మాట్లాడకుండా సేవలు చేయటం (మనువు 1.91)

9. ఒక విద్యార్థి, శిక్షణ పొందుచున్న వాడు, కిరాయి సేవకుడు, ఒక అధికారి–వీరంతా శ్రామికులు. వీరి ఇళ్ళలో పుట్టినవారు, ఇంకా ఇతరులు బానిసలు (నారద V.3)

10. న్యాయ శాసన పరంగా ఋషులు ఐదురకాల భృత్యులను గుర్తించారు. ఇందులో మొదటి నాలుగు రకాలు శ్రామికులు పైన పేర్కొనబడినవారే. బానిసలు ఐదవరకం. ఇందులో పదిహేను జాతులున్నారు. (నారద. V. 2 )

11. (యజమాని) ఇంటిలో పుట్టిన వాడు, కొన బడిన వాడు, బహుమతిగా పొందబడినవాడు, వారసత్వంగా లభించినవాడు, కరువుకాలంలో ఆదుకోబడ్డవాడు, ఒక యజమానిచే మరొకరికి తాకట్టుపెట్టబడినవాడు (నారద V. 26)

12. ఋణాలనుండి ముక్తి చేయబడినవాడు, యుద్ధంలో బంధింపబడిన వాడు, పందెంలో గెలుచుకోబడ్డవాడు, "నేను నీ వాణ్ణి" నని ప్రకటించినవాడు, సన్యాసమును విడిచినవాడు, నిర్ణయించబడిన కాల పరిధిలో బందీగా ఉన్నవాడు. (నారద V. 27)

13. బ్రతుకు దెరువు కు బానిసైనవాడు, ఆడబానిసతో అక్రమ సంబంధం పెట్టుకోవటం వల్ల బందీ ఐన వాడు, తనను తాను అమ్ముకున్నవాడు, –న్యాయశాసనం ద్వారా ప్రకటించబడ్డ 15 రకాల బానిసలు వీళ్ళూ (నారద V. 28)

14. వీళ్ళలో మొట్టమొదట పేర్కొనబడ్డ నాలుగు రకాల వాళ్ళు తమ యజమానులు దయతో వదిలివేస్తే తప్ప బందీలుగానే బ్రతుకుతారు. వారి బానిసత్వం వారసత్వ కట్టుబానిసత్వం (నారద V. 29)

15. వారికి గల జీవనాధారం అందరికీ సమానమేనని ఋషులు ప్రకటించారు, కానీ వారి స్థితి, స్థాయి, ఆదాయం వారి వారి కులం పైన వృత్తిపైన ఆధారపడివుంటుంది. (నారద V. 29).

## II. చాతుర్వర్ణ చట్రం పరిధిలోలేని వారు–వారి పుట్టుక–వారి విధులు

వారి పుట్టుక, వారి విధులను గురించి మనువు చెప్పేది ఇదీ :

1. (బ్రహ్మ) నోటినుండి, చేతులనుండి, తొడలనుండి, పాదములనుండి ఉద్భవించిన వారికి బాహ్యంగా వున్న ఈ ప్రపంచంలోని జాతులన్నీ –వారు మ్లేచ్ఛభాష (ఆటవికుల) మాట్లాడినా ఆర్యభాష మాట్లాడినా-దస్యులు అని పిలవబడతారు. (మనువు x. 45).

2. అందరికీ తెలిసినవృక్షాలక్రింద, స్మశానాల్లో, పర్వతాల పై, చెట్లతోపుల్లో నివసిస్తుంటారు. ప్రత్యేకమైన వృత్తులపై ఆధారపడి బ్రతుకుతారు, వాటి వల్లే వీళ్ళకి గుర్తింపు. కొన్ని గుర్తుల ద్వారా వారిని గుర్తించవచ్చు. (మనువు x. 50)

3. కాని చండాలురు, శ్వాపకుల నివాసాలు ఊరిబయట వుండాలి. వాటిని కర్రవాసాలు, ఆకులతోనే కప్పాలి. కుక్కలు, గాడిదలు వారిసంపదగా ఉండాలి (మనువు x.51).

4. వారు శవాల మీది వస్త్రాలే ధరించాలి. పగిలిన పెంకులలోనే తినాలి. ఇనుప నగలే ధరించాలి. ఒక ప్రదేశంనుండి మరో ప్రదేశానికి తిరుగుతూ వుండాలి (మనువు x . 52)

5. మత నిర్దేశిత విధులు నిర్వర్తించువాడు వాళ్ళతో సంబంధాలు పెట్టుకొన రాదు. వాళ్ళ లావాదేవీలు వాళ్ళలోనే జరగాలి (మనువు x. 53)

6. వాళ్ళు ఇతరులు (ఆర్యులు కాని వారు) పగిలిపోయిన మూకుళ్ళలో పెట్టిన అన్నం మాత్రమే తినాలి. రాత్రిళ్ళు గ్రామంలో గాని, పట్టణంలో గాని సంచరించరాదు, నడవరాదు (మనువు x. 54)

7. పగలు వాళ్ళ శరీరంపై గల గుర్తుల ఆధారంగా రాజు నిర్ణయించే పనులకు వాళ్ళు వెళ్ళాలి. బంధువులు లేని మానవ శవాలను వాళ్ళు మోయాలి. అది నిర్ధారించబడ్డ నిబంధన (మనువు x. 55)

8. రాజుగారి ఆజ్ఞానుసారం, శాసనం ప్రకారం వాళ్ళు నేరస్థులపై శిక్షనములు చేయాలి. ఆయానేరస్తులు వదిలి వెళ్ళిన బట్టలు, పక్క బట్టలు, నగలు వాళ్ళు తీసుకోవాలి (మనువు x. 56)

9. హీన కులస్థురాలైన స్త్రీతో సంబంధం ఏర్పరచుకున్న వ్యక్తికి మరణ దండన విధించాలి (విష్ణు. v 43)

10. ఛండాలుణ్ణి, హీనకులస్థుణ్ణి ఎవరూ తాకరాదు. అలాంటివాడెవడైనా మలిన పర్చే ఉద్దేశ్యంతో ద్విజుణ్ణి తాకితే వాడికి మరణ దండన విధించాలి (విష్ణు v 104)

చాతుర్వర్ణ పరిధిలోని వారు, చాతుర్వర్ణానికి బాహ్యులు అనే వాస్తవమైన విభజన మనువుకు అతి ముఖ్యమైన, వాస్తవమైన విభజనగా ముందే పేర్కొన్నాను. ఇది ఎంత వాస్తవమైనదంటే చాతుర్వర్ణానికి బాహ్యంగా ఉన్నవారిని 'బాహ్యులు' అని పిలిచాడు మనువు. దీనర్థం వెలివేయబడ్డవాళ్ళు అని. చాతుర్వర్ణ వ్యవస్థనుంచి వెలివేయబడ్డవాళ్ళని అర్థం. ఈ విభజనకు ఆయన చాలా తీవ్రమైన పరిణామాలను ఆపాదించాడు. సామాజిక స్థాయిలోనూ, పౌరసత్వంలోనూ విభేదం సృష్టించటమే ఈ వర్గీకరణ లక్షణం. చాతుర్వర్ణ చట్రంలో వున్న వారంతా ఒకే స్థాయిలో వుండరన్న మాట నిజమే. చాతుర్వర్ణవ్యవస్థలోనే బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు బానిసలు వంటి అధమస్థాయిలు, తారతమ్యాలున్నాయి. అయినా వాళ్ళంతా చాతుర్వర్ణ వ్యవస్థ పరిధిలోనే వున్నారు. మను ధర్మం ప్రకారం చాతుర్వర్ణవ్యవస్థలోని వారంతా ఒకస్థితిని, స్థాయిని కలిగి ప్రపంచం దృష్టిలో గౌరవ మర్యాదలు కలిగివుంటారు. దానికి బాహ్యంగా ఉన్న వాళ్ళంతా సమాజం దృష్టిలో గౌరవం మర్యాదలు లేని వారు. పౌరసత్వంలో కూడా ఈ విభేదముంది. చాతుర్వర్ణవ్యవస్థలో వున్న వాళ్ళు అనుభవించటానికి హక్కులున్నాయి. వాటిని రక్షించుకోవటానికి నివారణోపాయాలున్నాయి. చాతుర్వర్ణ వ్యవస్థకు బాహ్యంగా ఉన్న వారికి హక్కులూ లేవు, వాటికి నివారణోపాయాలూలేవు.

చాతుర్వర్ణ వ్యవస్థలోపల వున్నవారికి, దానికి బాహ్యంగా వున్న వారికి మధ్యగల తేడా ప్రాచీన రోమన్ న్యాయశాసనంలో సివిక్స్ అంటే పౌరులకు, ప్రిరెగినిస్ లేదా హెూస్టిస్– అంటే పౌరులు కాని వారికి గల తేడాతో పోలివుంటుంది. మొట్టమొదటి రోమన్

న్యాయశాసనం అవశ్యంగా వ్యక్తి ఆధారితం. భూభాగం ఆధారంగా గలది. ఒక వ్యక్తి రోములోని వ్యవస్థలు, అవి కల్పించిన రక్షితస్థితి వల్ల లబ్దిపొందినాడు అంటే అది అతను రోముభూభాగంలో ఉండటం వల్లకాదు. అందుకు మూలకారణం, అతని వల్ల, అతని కోసమే ఏర్పడ్డ శాసనం లేదా చట్టం వల్ల లభించిన పౌరసత్వ హోదా. ప్రారంభదశలోని రోమన్‌న్యాయసిద్ధాంతం (Jus getium) ప్రకారం విదేశీయుడైన వాడు ఏ దేశంలోతిరుగుతున్నా అతను ఆ దేశపు దయాదాక్షిణ్యాలమీదా, ఆదేశపు ప్రజల మంచితనం మీద ఆధారపడ ప్రతకాలి. అతన్ని బానిసగా కూడా చూసే అవకాశం వుంది. అతని దగ్గరున్న దంతా పరాయిదేశంలో ముందుగా వచ్చి ఎవరు సొంతం చేసుకుంటే వాడిదవుతుంది. ఎందుకంటే న్యాయ శాస్త్రానికతడు బాహ్యుడు. పౌరన్యాయాన్ని (Jus civile) రోమన్ పౌరులకే వర్తించే హక్కుల్ని కోనూబియం, కమర్షియం, ఆక్టియో అనే మూడు భాగాలుగా చెప్పుకోవచ్చు కోనూబియం అనేది వివాహస్థోమత, స్థితికి సంబంధించినది. ఇది వారసుల (Palva protestas) ఉద్భవానికి, తద్వారా పరంపరకొనసాగటానికి, రక్షణకు పునాది ఏర్పరుస్తుంది. కమర్షియం అంటే ఆస్థిసంపాదనకు, దాని పరాయీకరణకు సంబంధించినది. ఆక్టియో అంటే పై రెండింటిద్వారా లభించే హక్కుల్ని, లేదా రాజ్యం తనకు కలిగించిన హక్కుల్ని న్యాయస్థానాల ద్వారా రక్షించుకోవటానికి శక్తిని, స్థోమతను కల్పిస్తుంది. ఈ మూడింటిని రోమన్ పౌరులు మాత్రమే అనుభవించగలరు. రోమన్ పౌరుడు కాని వాడికి ఈ హక్కులుండవు.

చాతుర్వర్ణ వ్యవస్థలోపల వున్న వర్గాలు, దానికి బాహ్యంగా ఉన్న వర్గాల మధ్య గల విభజన నిజమైనదీ, మౌలికమైనదే ఐనప్పటికీ పరిభాషలో వాడుకలోలేనిది. చాతుర్వర్ణవ్యవస్థ ఇప్పుడు శాసనంగా అమలు జరగటం లేదు. కాబట్టి చాతుర్వర్ణ వ్యవస్థలోని వర్గాలు, దానికి బాహ్యంగా ఉన్న వర్గాలు అని చర్చించటం కేవలం జ్ఞానకుతూహలమే అవుతుంది. అయితే ఒక ప్రశ్న అడగవచ్చు. ఈ పురాతన వర్గాల ఆధునిక ప్రతిరూపాలేమిటి? ఈ పురాతన మను ధర్మ శాసనం హిందువుల శాసన రాహిత్య చర్యలకు ప్రస్తుతం ఏమేరకు కారణమో నేను ప్రత్యేకంగా వివరించదలచాను కాబట్టి ఈ ప్రశ్న న్యాయ సమ్మతమైనదే. నేను వాడేభాష వాడుకలో లేనిదే ఐనప్పటికి నాప్రతిపాదన సరియైనదేననిరెండు విషయాలు సూచిస్తాయి. మొదటిది, మనువు ప్రతిపాదించిన ప్రాచీన సామాజిక వర్గీకరణ రూపాలు

ఆధునిక కాలంలో లేకపోలేదు. ఈ ప్రాచీన సామాజిక వర్గీకరణ ఆధునిక ప్రతిరూపాలు హిందువులు, అస్పృశ్యులే. మనువుచే చాతుర్వర్ణంలో చేర్చబడ్డ వాళ్ళంతా ఆధునిక కాలంలోని హిందూవర్గం. మనువు ఎవరిని 'బాహ్యులని' (చాతుర్వర్ణానికి బాహ్యులు) పిలిచాడో వాళ్ళని ప్రస్తుతం భారత దేశంలోని అస్పృశ్యులతో పోల్చవచ్చు. చాతుర్వర్ణంలో చేర్చబడిన బ్రాహ్మణులు,క్షత్రియులు,వైశ్యులు, శూద్రులమధ్యన విభజనరేఖ చెదిరిపోయి వాళ్ళమధ్యచాలవరకు సయోధ్య ఏర్పడింది. కాని చాతుర్వర్ణంలో వున్నవారికి, దానికి బాహ్యంగా ఉన్నవారికి మధ్యమనువు గీచిన విభజన రేఖ ఏమాత్రంచెదరక, ఏప్రభావానికీ లోనుకాకుండా ఇంకాస్పష్టంగానేవుంది. ప్రస్తుతం హిందువుల్ని అస్పృశ్యుల్ని విభజిస్తున్న రేఖదే. ప్రాచీన వర్గీకరణం ఆధునిక కాలంలోకి కూడా జొరబడిందనేది స్పష్టంగా కనిపించే మొదటి అంశం. పేర్లలో తప్ప పెద్దమార్పేమీ లేదు ఇందులో.

ఇక రెండవప్రశ్న. మనువు బాహ్యులకు ప్రతిపాదించిన న్యాయ శాసనం ప్రస్తుతం హిందువులకు, అస్పృశ్యులకు మధ్యగల సామాజిక సంబంధాల ఏర్పాటులో కనిపిస్తుందా? కనిపించదనటంలో ఎవరికైనా అనుమానం వుంటే వాళ్ళను ఈ క్రింద ఉదహరించిన కేసును పరిశీలించమంటాను నేను. ఇది మద్రాసు ప్రెసిడెన్సీలో రాంనాడు జిల్లాలో జరిగింది.

డిసెంబరు 1930లో రాంనాడులో తల్లార్లు ఎనిమిది రకాల నిషేధాజ్ఞలను ప్రకటించారు. వీటిని అస్పృశ్యులు లెక్కచేయకపోవటంతో తల్లార్లు హింసకు దిగారు, వాళ్ళ ఇళ్ళు తగలబెట్టారు, ధాన్యాన్ని, ఆస్తుల్ని నాశనం చేశారు. వాళ్ళ పశువుల్ని దోచుకున్నారు. ఆనిషేధాలేవంటేః

"1. ఆది-ద్రావిడులు బంగారు, వెండి నగలు ధరించరాదు.

2. మగవాళ్ళు మోకాళ్ళ క్రిందికీ, నడుంకు పైనా బట్టలు ధరించరాదు.

3. అస్పృశ్యుల్లో మగవాళ్ళు కోటుగానీ, బనియనుగానీ, చొక్కాగానీ ధరించరాదు.

4. ఆది-ద్రావిడుడైనవాడు జుత్తు కత్తిరించుకోరాదు.

5. ఆది-ద్రావిడులు తమ ఇండ్లలో మట్టిపాత్రలు, మట్టికుండలు తప్ప వేరే పాత్రలు వాడరాదు.

6. వాళ్ళ స్త్రీలు రవికెలు ధరించి శరీరపై భాగాన్ని కప్పుకోరాదు.

7. వాళ్ళ స్త్రీలను పూవులుగానీ, కుంకుమ గానీ వాడనివ్వరాదు.

8. ఎండలో, వానలో వాళ్ళు గొడుగులు వాడరాదు, చెప్పులు ధరించరాదు.

జూన్ 1931 లో ఈ నిషేదాజ్ఞలను బాహ్యులు సంతృప్తికరంగా అమలు జరపకపోవటాన్ని గమనించి తల్లార్లాంతా కలిసి పదకొండు నిషేధాజ్ఞలు తయారుచేశారు. ఇవి పైన పేర్కొన్న ఎనిమిది నిషేధాజ్ఞల తలదన్నేవిగా ఉన్నాయి. వీటిని అమలు జరిపే క్రమంలో హింస ప్రబలింది. ఆ పదకొండు నిషేదాజ్ఞలూ ఇవీ :

1. ఆది ద్రావిడులు, దేవేంద్రకులపు వెల్లార్లు మోకాళ్ళ క్రిందికి బట్టలు కట్టుకోరాదు.

2. పైన పేర్కొన్న దళిత వర్గాల స్త్రీలు బంగారునగలు ధరించరాదు.

3. స్త్రీలు మట్టిపాత్రలలోనే నీళ్ళు మోసుకోవాలి గానీ కంచు, ఇత్తడి పాత్రలు వాడరాదు. నీళ్ళు మోసుకోవటానికి గడ్డిని మాత్రమే వాడాలి, బట్టలు వాడరాదు.

4. వాళ్ళ పిల్లలు చదువరాదు, అక్షరాస్యులు కారాదు.

5. వాళ్ళ పిల్లలు మిరాసిదార్ల పశువుల్ని మాత్రమే కాయాలి.

6. వాళ్ళ మగవాళ్ళు, ఆడవాళ్ళు మిరాసీదార్లపొలాల్లో బానిసలు గా పనిచేయాలి.

7. మిరాసీ దార్లనుండి పొలాల్ని తీసుకుని కౌలుకు దున్నుకోరాదు.

8. ఒకవేళ వాళ్ళు తమపొలాలు అమ్మాలనుకుంటే అతి తక్కువ రేట్లకు వాటిని మిరాసీ దార్లకు మాత్రమే అమ్మాలి, అట్లా చేయకపోతే వాళ్ళ వ్యవసాయానికి నీళ్ళివ్వరు మిరాసీదార్లు. ఒకవేళ వర్షపు నీళ్ళతో ఏదైనా పండించుకుంటే, క[illegible]చ్చాక దొంగతనాలకు గురవుతుంది.

9. వాళ్ళు ఉదయం 7 గంటలనుంచి సాయంత్రం 6 గంటలదాకా మిరాసీ దార్ల క్రింద కూలీలుగా పనిచేయాలి. వాళ్లకు కూలీరూపంలో మగవాళ్ళకు నాలుగణాలు, ఆడవాళ్ళకు రెండణాలు మాత్రమే చెల్లించాలి.

10. ఈ రెండు వర్గాలు వివాహాల్లో గాని ఇతర సంబరాల్లోగాని భారతీయ సంగీతాన్ని (మేళం) వాయించరాదు.

11. వివాహసమయంలో తాళి కట్టటానికెళ్ళేటప్పుడు గుర్రంపై వెళ్ళరాదు. ఊరేగింపులకు పల్లకీలను ఉపయోగించరాదు. అందుకోసం వాళ్ళ ఇంటితలుపుల్నే పల్లకీలుగా వాడుకోవాలి. వాళ్ళు చేసే ఏపనికైనా వాహనాలు వాడరాదు."

రాంనాడులోని హిందువులు విధించిన ఈ నిషేధాజ్ఞల్ని ఇంతకు ముందేనేను ఈ అధ్యాయంలోనే పేర్కొన్న మనుధర్మశాసనంలో అస్పృశ్యులకు వ్యతిరేకంగా పేర్కొన్న అంశాలతో పోల్చి చూడండి.

బాహ్యులకోసం మనువు నిర్దేశించిన న్యాయశాసనానికి తల్లార్లు 1931లో అస్పృశ్యులపై విధించిన నిషేధాజ్ఞలకు ఏమైనా తేడావుందా? ఇది చేసింతర్వాత హిందూవేతరుడికెవడికైనా అధర్మంగా కనిపించే హిందువుల చర్యలు అస్పృశ్యుల్ని కేవలం మనుధర్మం పాటించమనే అడుగుతున్నా యనే విషయంలో అనుమానం ఎందుకుంటుంది?

ఇంకొక కేసు. ఇది మధ్య భారతంలోని బలాయీలకు గురించినది. బలాయిలు అస్పృశ్యులు. 1927 నాటికి తాము సామాజికంగా బాగుపడటం కోసం బలాయిలు కొన్ని నియమాలేర్పరుచుకున్నారు. సామాజికంగా తమను దిగజార్చేకొన్ని పనులు చేయవద్దని, మంచిగా బట్టలేసుకోవాలని నిర్ణయానికొచ్చారు. ఈ నియమాలు హిందూకులస్థుల అక్కరకు ఏవిధంగానూ అడ్డువచ్చేవికావు. కాని ఆచారంగా వస్తున్న తమసామాజిక స్థాయిని విస్మరించి బలాయిలు దిగిపోవాలని ప్రయత్నించటం హిందూకులస్తులకు కోపకారణమైంది. బలాయిల మదమణచటానికి వాళ్ళను చావుదెబ్బకొట్టాలని నిర్ణయించుకున్నారు వాళ్లు. తిరుగుబాటుకు ఉద్యుక్తులైన బలాయిలు హిందూకులస్థులు ఏంచేశారో–వార్తాపత్రికల్లో వచ్చిన రిపోర్టు ఇదీ.

# హిందువుల క్రూరత్వం

## బలాయిలకు నియమనిబంధనలు. జీవన విధానం నిర్ణయించబడింది.

గత మేనెలలో (1927) కలోటాలు, రాజపుట్‌లు, బ్రాహ్మలు, హిందూకులస్థులు, ఇంకా ఇండోర్ జిల్లాలోని కనారియా, బిచోలీ హప్సీ, మర్దానా ఇంకా 15 ఇతరగ్రామాల్లోని పటేళ్ళు, పట్వారీలు కలసి వారివారి గ్రామాల్లోని బలాయిలు బ్రతికి బట్టకట్టాలంటే ఈ క్రింది నిబంధనలను పాటించి తీరాలని తీర్మానించారు :

1. బంగారంతో అల్లిన పగ్రీలను బలాయిలు ధరించరాదు.

2. రంగు రంగు అంచులున్న పంచెలు కట్టుకోరాదు.

3. హిందువుల్లో ఎవరైనా మరణిస్తే మరణవార్తను వారి బంధువులకు ఎంతదూరాన వున్నా తెలిపిరావాలి.

4. హిందువుల వివాహాల్లో, ఊరేగింపుల్లో బలాయిలు మేళం వాయించాలి.

5. బలాయిస్త్రీలు బంగారు, వెండి నగలు ధరించరాదు.

6. హిందూస్త్రీల ప్రసవ సమయాలలో బలాయి స్త్రీలు వారి దగ్గర కాచుకుని ఉండాలి.

7. ఏ ప్రతిఫలమూకోరకుండా బలాయిలు సేవలు చెయ్యాలి, హిందువులు సంతోషంగా ఇచ్చిందేదో పుచ్చుకోవాలి.

8. ఈ నిబంధనలను పాటించని బలాయిలు గ్రామం విడిచి పోవాలి.

## బలాయిలు అంగీకరించ నిరాకరించారు.

"బలాయిలు లొంగేందుకు తిరస్కరించారు. హిందువులు వాళ్ళ సంగతేమిటో తెలుసుకోవాలని బయల్దేరారు. బలాయిలను బావులనుండి నీళ్ళు తోడుకోనివ్వలేదు. వాళ్ళ పశువుల్ని పొలాల్లో తిరగనివ్వలేదు. హిందువుల భూముల్లోంచి బలాయిలను నడవకుండా నిషేధించారు. ఒకవేళ బలాయిల భూముల్ని చుట్టి హిందువుల భూములుంటే

ఇక బలాయి తన భూమిలోకి వెళ్ళే అవకాశమేలేదు. బలాయిల భూముల్లోకి హిందువులు తమ పశువుల్ని తోలారు. హిందువుల వేధింపుచర్యలకు వ్యతిరేకంగా బలాయిలు దర్బారుకు వినతి పత్రం సమర్పించుకున్నారు. కాని తగిన సమయంలో సహాయం అందించనందువల్ల, వేధింపుచర్యలు కొనసాగుతూనే వుండటం వల్ల బలాయిలు వందల సంఖ్యలో భార్యా పిల్లలతో తమపూర్వీకుల కాలంనాటి ఇళ్ళూ వాకిలీ, చివరకు తమ గ్రామాల్నే వదిలి ధర్, దివాస, భోపాల్, గ్వాలియర్ లాంటి రాష్ట్రాలలో వున్న గ్రామాలకు వెళ్ళిపోయారు.

**బలవంతపు అగ్రిమెంటు**

"కేవలం కొద్దిరోజుల క్రితమే ఇండోర్ నగరానికి 7 కి. మీ. దూరంలో వున్న రియోతీ గ్రామంలోని హిందువులు, ఇంతకుముందు ఇతర గ్రామాల్లో బలాయిలకు వ్యతిరేకంగా నిర్దేశించిన నియమనిబంధనలను కోర్టు స్టాంపుపై రాసి ఆ అగ్రిమెంటుపై సంతకాలు చేయమని ఆదేశించారు. బలాయిలు అంగీకరించలేదు. హిందువులు బలాయిలను కొట్టారని కూడా ఆరోపణలు వచ్చాయి. బలాయిని ఒకణ్ణి గుంజకు కట్టేసి అగ్రిమెంటుపై సంతకం పెడితేనే వదిలేస్తామని బెదిరించారు. భయానికి సంతకం చేశాడు. అతణ్ణి వదిలేశారు. మరుసటిరోజే, డిసెంబరు 20న, బలాయిలు కొందరు ప్రధానమంత్రిదగ్గరకు పరుగెత్తారు. రియోతీ గ్రామంలో తమపై హిందువులు జరుపుతున్న వేధింపు చర్యలగురించి మొరపెట్టుకున్నారు. వారిని జిల్లా సుభావద్దకు పంపించాడాయన. ఈ అధికారి, పోలీసుల సహాయంతో గ్రామంలో జరిగిన సంఘటనలగురించి విచారించి హిందువుల్ని ఇండియన్ పీనల్ కోడ్‌లో సెక్షన్లు 342, 147 క్రిందా, బలాయిల్ని సెక్షన్ 147 క్రిందా తగిన చర్య తీసుకోవాలని సిఫారసు చేశాడు.

**బలాయిలు గ్రామాలు వదలి వెళ్ళారు.**

**కుల క్రౌర్యం – శాసన పరిజ్ఞాన రాహిత్యం వల్ల వచ్చిన బలహీనత**

"కొన్నిగ్రామాల్లో హిందూ కులస్థులు బలాయిలను చూసే తీరులో ఏమాత్రమూ మెరుగుదల కనిపించటంలేదు. ఉన్నత హిందూకులస్థులు ఇంకా బలాయిలను వేదనలకు గురిచేస్తూనే వున్నారని వార్తలు వస్తున్నాయి. ఇండోర్ జిల్లాలోని ఒక్క ఖోల్‌పూర్

పరగణాల్లోనే పెద్ద సంఖ్యలో బలాయిలు తమ నివాసాలని వదలి పొరుగురాష్ట్రాల్లో తలదాచుకున్నారు. బలాయిలను బలవంతంగా ఊళ్ళు ఖాళీ చేయించిన గ్రామాలు బడోలి, అఖిర్ ఖరాల్, పిప్లోడా, మోర్చెర్స్, పాలంపూర్, సవనాడా మొ॥వి. పాలంపూర్ గ్రామం పూర్తిగా ఖాళీ అయింది. అక్కడ ఒక్కమగగానీ, ఆడగానీ కనిపించకుండా ఎడారిగా మారింది గ్రామం. ఒక గ్రామంలో నందబలాయిఅనే వ్యక్తిని హిందువులు తీవ్రంగా కొట్టి హింసించినట్లు ఆరోపణలు వచ్చాయి. మరొక గ్రామంలో హిందువులు బలాయిల ఇళ్ళన్నీ తగలబెట్టారనీ రిపోర్టు చెబుతున్నది. నేరస్తుల్ని ఇంకా గుర్తించనేలేదు.

"బలాయిలు అమాయకులైన గ్రామీణులు. వాళ్ళకు చట్టాలను గురించి తెలియదు. సర్కారుకు ఒక వినతి పత్రం సమర్పిస్తే చాలు వాళ్ళు కోరిందేదో జరిగిపోతుందని విశ్వసించేంత అమాయకులు. ఫిర్యాదు చేయవలసిన పద్ధతి గురించి గానీ, దాన్ని నడిపించవలసిన పద్ధతులు గురించిగానీ ఏమాత్రం జ్ఞానం లేని వాళ్లు. కొన్ని కేసుల్ని పరిశీలిస్తే వాళ్ళకు ఫిర్యాదుల్ని నిగ్గుతేల్చేందుకు విచారణ సమయంలో సాక్షుల్ని ప్రవేశ పెట్టాలన్న జ్ఞానంకూడా లేదని తెలుస్తుంది. అట్టి పరిస్థితుల్లో మేజిస్ట్రేటు కేసును వాళ్ళకు వ్యతిరేకంగా కొట్టివేయటం తప్ప ఏమీ చేయగలిగేవాడు కాదు."

ధర్మమూ, అధర్మం అనే కోణాలనుంచి పరిశీలించి చూస్తే అస్పృశ్యుల ఉద్యమాన్ని నిరంకుశంగా అణచివేయడానికి హిందువులను శాసనరాహిత్య చర్యలకు ప్రేరేపిస్తున్న బలమైన కారణమేమంటే వాళ్ళు తమ అణచివేత చర్యలను – తమ ధర్మంపై చెలరేగుతున్న దారుణాన్ని ఆపుచేసే ఒక ఉత్తమమైన కార్యంగా భావించటమే.

మను ధర్మం ఏ మేరకు ఇంకా మిగిలి వుంది అని అడగవచ్చు. తీర్పు లివ్వటంలో కోర్టులు ఆమోదించే నియమనిబంధనల రూపంలో గల శాసనంగా వివాహాలు, వ్యక్తి నడవడికకు సంబంధించిన ఏవో కొన్ని సూత్రాలు తప్ప మనుధర్మం ఏమాత్రం ఉపయోగంలో లేదనే విషయాన్ని అంగీకరించవచ్చు. సామాజిక ప్రవర్తనను, పౌరహక్కును నిర్వచించే శాసనంగా అది కార్య శూన్యమైనదే, ఐతే అది శాసనంగా కనిపించకుండా పోయింది గానీ ఆచారంగా మిగిలే వుంది.

శాసనంతో పోల్చిచూస్తే ఆచారం తక్కువదేమీ కాదు. శాసనాల్ని రాజ్యవ్యవస్థ తన పోలీసువ్యవస్థద్వారా అమలు పర్చుతుందన్న మాట వాస్తవమే. ఆచారం అలాకాదు. కాని వాస్తవానికి ఈ ఏ భేదం భేదమే కాదు. రాజ్యం శాసనాన్ని అమలు పర్చటం కంటే, ఆచారాల్ని ప్రజానీకం శాసనం కన్నా అధికంగా అమలు పరుస్తుంటుంది. ఎందుకంటే ప్రజాశక్తి రాజ్య శక్తి కన్నా గొప్పది.

శాసనంగా లేనంత మాత్రాన అది అమలు జరగటంలో సాంకేతింగా ఆటంకాలేమీ లేకపోవటం అటుంచి కొన్నికొన్ని పరిస్థితుల్లో మొక్కవోని శక్తితో పనిచేస్తుంది మనుధర్మం.

ఈ పరిస్థితుల్లో ఆచారాలకుండే శక్తి ముందుగా వుంటుంది. ప్రతి మానవ సమూహంలోనూ, ఎలా ప్రవర్తించాలి, ఎలా అనుభూతి చెందాలి, ఎలా విశ్వసించాలి, ఎలా విలువకట్టాలి అనే విషయాలకు సంబంధించి, ఇంకా అంగీకార, అనంగీకార విషయాలకు సంబంధించికూడా సమూహపు మానసిక స్థితికి చెందిన కొన్నిఅలవాట్లుంటాయి. సమూహంలో పుట్టిన వాడైనా లేదా కొత్తగా చేర్చుకోబడిన వాడైనా సరే ప్రతిమనిషి ఆ సామూహిక భావనా మాధ్యమానికి పరిచయం చేయబడతాడు. ఈ మాధ్యమం ప్రతి సమూహంలోనూ వ్యక్తుల మానసిక ప్రవృత్తిపై నిరంతరమూ తన ప్రభావాన్ని చూపుతూ అతని దృక్పథాన్ని అతడు సమూహానికి కొత్తవాడైనా సరే-మార్చుతూ వుంటుంది. తద్వారా సమూహం వ్యక్తిని సమాజీకరణకు లోనుచేసి అతని మానసిక స్థితిని, అలవాట్లను రూపు దిద్దుతుంది. సమూహంపై ఆధారపడి జీవించాలి కాబట్టి అతను తన భౌతిక పరిసరాలను అదుపుచేసుకోలేనట్టే సమూహపు మానసికస్థితిని కూడా తిరస్కరించజాలడు. సమూహంపై వ్యక్తి ఎంతగా ఆధారపడతాడంటే నిజానికి దానితో ఏకీభవించటానికి అతను ఎల్లప్పుడూ సిద్ధంగావుండి, అప్పటికి చెలామణిలోవున్న సమూహపు అలవాట్లను, ప్రవర్తననూ మానసికంగా తన అలవాటుగానూ తన ప్రవర్తనగానూ భావించటం మొదలు పెడతాడు. వ్యక్తి యొక్క ఈ సామూహిక సామాజికీకరణ ప్రక్రియను గ్రోట్ (Grote) వర్ణనాత్మకంగా చిత్రించాడు. ఆయనిలా అంటాడు :

"ఒక సమాజంలోని ఈ విశ్వాసాలు మొత్తం-నైతిక మైనవీ, మతపరమైనవీ, కళాసంబంధితమైనవీ, సంఘమర్యాదలకు చెంది ఏది సత్యం, ఏది అసత్యం, ఏది సాధ్యం

ఏది అసాధ్యం, ఏది న్యాయం ఏదన్యాయం, ఏది పవిత్రం ఏదపవిత్రం, ఏది గౌరవించదగినది ఏది నీచమైనది, ఏది సక్రమం ఏది అక్రమం, ఏది పాటించదగినదీ ఏది పాటించదగనిది, ఒక సమాజంలోని ప్రతివ్యక్తి యొక్క స్థాయిని సంబంధాలని, ఇంకా అంగీకార యోగ్యమైన విలాస అలంకారాలుకూడా సమూహంలో పుట్టిన ప్రతి వ్యక్తి చేత పుణికి పుచ్చుకోబడి అతని జీవనాధారాలవుతాయి. అవి ప్రతి వ్యక్తి స్వభావంలోనూ విడదీయరాని భాగాలౌతాయి, అలవాట్లుగా మారతాయి. ఖచ్చితమైన మానసిక ప్రవర్తనాంశాలవుతాయి. వాటి ద్వారానే ఒక వ్యక్తి చేష్టలను ప్రత్యేకంగా విశ్లేషణ చేయటంగానీ, ఇంకా ఇతరులను అభినందించటంగానీ జరుగుతుంది. సమూహంలోని సభ్యుడెవరైనా సమూహపు సంఘటిత సంఘవిశ్వాసాన్ని అభిశంసిస్తే సమూహపు సంఘటిత అసహ్యానికి గురవుతాడు. దాని అసహ్యం భిన్నరూపాల్లో వ్యక్తీకరించబడుతూ వుంటుంది. సంఘంనుంచి దయా, ఆదరణా, మంచితనమూ లభించక వెలివేయబడి అతని జీవనానికి ఏ అండా లభించకుండా పోవటం ఇందులో అతి ముఖ్యమైంది"[3]

కాని ఇది సంభవించటానికి దోహదపడేదేది? దీనికి గ్రోట్ తనే సమాధానం చెప్పాడు. అతని సమాధానం ఏమిటంటే - ఇది (శాసనమూ, ఆచారము) "అందరికీ రాజై" భౌతిక, ఆధ్యాత్మిక విషయాల్లోనూ, వ్యక్తి యొక్క మానసిక వ్యవస్థపైనా, అతని ఆవేశాలను, మేధాశక్తిని రూపు దిద్దటంలోనూ శిక్షా పూర్వకమైన అధికారాన్ని నెరపుతాయి. పైగా వ్యక్తిస్వయం నిర్ణయాలూ లేదా అలవాట్లుగా కనిపిస్తూ అతనిపై అధికారాన్ని చెలాయిస్తాయి.

చివరకు తేలేదేమంటే ఎప్పుడైనా ఏసమూహంలోనైనా నడవడిక, భావోద్రేకం, విశ్వాసం, విలువలు ఆపాదించటం, అంగీకారం, తిరస్కారంలాంటివి ఆచారాలుగా, సాంప్రదాయాల్లాగా స్థిరీకరణచెందితే అవి అమలు కావటానికి శాసనాల ఆమోదం అవసరం లేదు. సమూహంలో సమిష్టి చర్యలద్వారా సృష్టించబడిన అధికారం వీటన్నిటినీ ధిక్కరించబడకుండా చూస్తుంది.

మను ధర్మానికి ఇదే వర్తిస్తుంది. మనువు ప్రవచించిన ఈ ధర్మం తరతరాలుగా పాలన శక్తిగా వస్తూ హిందువుల సాంప్రదాయాల్లో, ఆచారాల్లో విడదీయరాని ముఖ్య

భాగమై పోయింది. అది వారిలో జీర్ణించుకుపోయి వాళ్ళ జీవ శక్తికే మూలమైంది. అది హిందువుల చర్యలన్నిటినీ శాసనం లాగానియంత్రిస్తుంది. ఇప్పుడది ఆచారంగానే మిగిలినా శక్తిలో ఏమి తీసిపోలేదు. నిరంతరం అది మనుషుల శీలాన్ని రూపుదిద్దుతూ వారి ప్రాపంచిక దృక్పథాన్నే నిర్ధారిస్తున్నది.

మను ధర్మం రూపు మాసిపోకుండా ఇంకా బ్రతికే వుండటానికి గల రెండో కారణం శాసనాలు, చట్టాలు దాని ప్రచారానికి అడ్డురాకుండా ఉండటమే. ఇది చాలా మందికి తెలిసినట్లు కనిపించదు. బ్రిటిష్ పాలన రావటంతో ఒక చట్టశాసనంగా మనుస్మృతి నశించిందని చెబుతూ వుంటారు. మనుస్మృతిలోని అంశాలను శాసన నియమ నిబంధనలుగా అమలు పర్చవీలులేక పోవటం ఒక వరమే. మనుస్మృతి వల్ల అణగారిపోయిన వాళ్ళు తప్ప దీనిని ఎవరూ మెచ్చుకోరు. మూర్ఖపు ప్రజలకు సంస్కరణోద్యమం ఎలాంటిదో అస్పృశ్యులకు ఇదీ అలాంటిదే. కాని సంస్కరణోద్యమం వచ్చిన తర్వాత ప్రొటెస్టాంటు విప్లవం వచ్చినట్టైతే ప్రజలకు శాశ్వత లాభాలేమీవుండేవి కావనేది గుర్తుంచుకోవాలి. నాకు తెలిసినంత వరకు ప్రొటెస్టెంట్ విప్లవంలోని ముఖ్యాంశాలేవంటే : (1) రాజ్యమే సమున్నతమైనది. చర్చి దానికి లోబడి వుండాలి (2) దేన్ని ప్రచారం చేయాలన్నా ముందు అది రాజ్యం అనుమతిని పొందాలి. (3) మతాధికారులు రాజ్య సేవకులే. రాజ్య శాసనాలను ధిక్కరించినా, నైతిక విలువలు కోల్పోయినా, రాజ్యానుమతిలేని విషయాలను బోధించినా, ప్రచారం చేసినా రాజ్యంచే శిక్షించ బడతారు కూడా. 'వ్యవస్థీకృత మతం' లో వ్యక్తిగతంగా నాకు విశ్వాసం వుంది. ఎవరూ తప్పుడు మత ప్రచారం చేయకుండా, ఎవరుబడితే వారు హానికరమైన విషయాలను మతమని నమ్మించి బోధించకుండా రక్షణ కల్పించే వ్యవస్థ అది. 'వ్యవస్థీకృత మతాన్ని' వ్యతిరేకించే వాళ్ళు కూడా వున్నారని నాకు తెలుసు. 'స్థాపిత మత వ్యవస్థ' మంచిదా కాదా అనేది వేరే విషయం. కాని వాస్తవం ఏమిటంటే మనువు నిర్దేశించిన ధర్మాన్ని ప్రచారం చేయటంపై శాసన బద్ధమైన నిషేధమేదీలేదు. న్యాయస్థానాలు దాన్ని చట్టంగా గుర్తించవు. కాని చట్టం దాన్ని ఎప్పుడూ కూడా తనకు వ్యతిరేకమైందిగా భావించదు. ప్రతి గ్రామంలో, ప్రతిరోజూ పండితులు తల్లిదండ్రులకు, తల్లిదండ్రులు తమ సంతానానికి నిరంతరమూ మను ధర్మాన్ని బోధిస్తున్నప్పుడు అది ఎలా రూపు మాసిపోతుంది నిజానికి? అనుదినమూ దాన్ని

మననం చేస్తే అస్పృశ్యత తమ ధర్మంలో భాగమనే విశ్వాసాన్ని విస్మరించటానికి ఎవర్నీ అది అనుమతించదు.

అనుదినమూ జరిగే మనుస్మృతి ప్రచారం స్త్రీల, పురుషుల, వృద్ధుల, యువకుల మేధస్సును చెరిచే చీడ పురుగులా తయారయింది. అంతేకాదు అది న్యాయాధికారుల మనస్సులను గూడా కలుషితం చేసింది. కలకత్తాలో జరిగిన సంఘటన ప్రచారంలో వుంది. నొబిన్‌డోమ్ అనే అస్పృశ్యుడొకడు మేకను దొంగిలించినందుకు కోర్టులో వానిపై విచారణ జరిగింది. అందులో వాడు తప్పు చేయలేదని తేలింది. తన మీద ఫిర్యాదు చేసిన వాడి మీద డోమ్ పరువు నష్టం దావా వేశాడు. తక్కువ కులం వాడికి పరువు మర్యాద లేమిటని న్యాయమూర్తి ఆ కేసును కొట్టేశాడు. చట్టం ముందు అందరూ సమానులేనని, మెజిస్ట్రేటు చెప్పిన తీర్పు సరైంది కాదని హైకోర్టు ప్రకటించవలసి వచ్చింది. ఐనప్పటికీ అస్పృశ్యుడికి పరువూ మర్యాద ఉండవనే తన నిర్ణయాన్ని ఎలా ప్రకటించాడా మెజిస్ట్రేటు? అనే ప్రశ్న మిగిలే వుంది. ఇది తప్పనిసరిగా మనుస్మృతి బోధనల ప్రభావమే.

మనువు ప్రబోధించిన ధర్మం కేవలం గత కాలానికి సంబంధించిందేమీకాదు. అది ఇవ్వాళే జారీ చేసిన శాసన మంత కొత్తది. భవిష్యత్తులో కూడా దాని ప్రభావం అమోఘంగానే ఉంటుంది. ఇక మిగిలిన ఒకే ఒక ప్రశ్న ఏమిటంటే దాని ప్రభావం ఒక కాలానికి మాత్రమే పరిమితమా లేక ఎల్లకాలమూ ఉండేదా అని.

**పాదసూచికలు :**

1. చూడు పి.వి. కాణె, History of Dharma Shastra' పేజీ 1-2

2. చూడు Times of India, 10-2-38 & 1-4-38

3. Grote "Plato and the other companions of Socrates", Vol.I పేజీ 249

అనువాదం : కె. సీతారామారావు

అధ్యాయం - 24

# గాంధీగారి నాయకత్వం క్రింద

I. కాంగ్రెస్ ద్వారా ఆయన కార్యకలాపాలు. II. వింతైన స్వాగతం III. చార్జ్ షీట్ IV. చార్జ్ షీట్‌కు ఆధారం V. గాంధీగారి విషాదాంతం VI. భారత దేశానికి మరియు అస్పృశ్యులకు గాంధీగారు యిచ్చిన వారసత్వం

గాంధీగారు భారతదేశ ప్రతినిధిగా లండన్‌లో రెండవ దఫా నిర్వహించబడిన భారత రౌండ్ టేబుల్ సమావేశంలో పాల్గొని 1931 డిసెంబర్ 28న భారత దేశానికి తిరిగి వచ్చారు. ఈ సమావేశంలో గాంధీగారు రాజకీయ పరంగాను, వ్యక్తి పరంగాను పూర్తిగా అవమానకరంగా విఫలమయ్యారు. ఈ విషయంలో హిందువులు నాతో ఏకీభవించరని నాకు తెలుసు. కాని దురదృష్టకరమైన విషయమేమంటే గాంధీగారి దగ్గర సన్నిహితుల అభిప్రాయం, నా అభిప్రాయం ఒక్కటి కావడమే. ఇద్దరి అభిప్రాయాలు నేను ఉదహరిస్తాను. గాంధీగారితో సన్నిహితుడుగా వున్నటువంటి ఎవర్ గారు గాంధీగారు లండన్‌లో రౌండ్ టేబుల్ సమావేశంలో నిర్వహించిన పాత్రను గూర్చి ఇలా రాసారు.

"సెంట్ జేమ్స్ భవనంలో నిర్వహించిన సమావేశంలో గాంధీగారు చూడడానికి గంభీరంగా ఉన్నప్పటికినీ ఆశించిన విధంగా ఫలితాలను సాధించలేక పోయారు."

"వారు స్వాభావిక స్థితికి బహు దూరంగా వున్నట్లు ప్రవర్తించినారు.

★ ★ ★ ★

"కరుణ, అత్యధిక ప్రమాణంలో నమ్రతను కలిగి, మూగబోయిన మిలియన్‌ల కొలది ప్రజలు బాధలను గూర్చిన అంశాలను చర్చించుటలో చెప్పిన విషయాలనే మళ్ళీ వల్లిస్తూ చేసిన మొదటి ఉపన్యాసం నిష్ప్రయోజనకరం. దాని నిజాయితీని ఎవ్వరూ ప్రశ్నించలేదు. కానీ వివరించిన అంశాలన్నీ అప్రస్తుతం, అసందర్భం మరియు నిరాధారమైనటువంటివి. ప్రస్తావించిన అంశాలన్నియు బహుశా సమంజసమైనవే గావచ్చు కానీ ప్రస్తావించినది తగిన చోట కాదని నిస్సందేహంగా చెప్పవచ్చు. అటు పిమ్మట జరిగిన

చర్చలల్లో కూడా వైఫల్యాన్నే చవిచూశారు. అంతేగాక నవ భారత రాజ్యాంగానికి అవసరమైన ప్రణాళికను బ్రిటీష్ ప్రభుత్వం సమకూర్చక పోవడం వలన గాంధీగారి పైన అమితమైన విశ్వాసం కలిగిన కొంతమంది సహచరులకు నిరుత్సాహం కలిగినది. అంతేగాకుండా బ్రిటీష్ పౌండ్‌కు; రూపాయికి మధ్యగల వైరుధ్యాన్ని పరిష్కరించడంలో కూడా అసమర్థతను ప్రదర్శించినారు. స్వాతంత్ర్యం మరియు ఇతర సజాతీయమైన అంశాలపైన జరిగిన చర్చకు పెద్దగా ప్రాధాన్యతను ఇవ్వలేక పోయారు. ఇవి మినహాయిస్తే హిందూ-ముస్లింల మధ్యగల వ్యవహారాలను చక్కబెట్టుటలో కొంత సామర్థ్యాన్ని కనబరచినా, వాటి ఫలితాలు మాత్రం అగమ్యగోచరంగా ఉండెను. సమావేశం జరుగుతున్నంత సేపు వివిధ అంశాలపైన చర్చలు జరుగుతున్నా, మన సమస్యలను ఉత్సాహంగా చర్చించుటకు ముందుకు దూసుకుపోదామనే ధోరణిలో గానీ, ఆలోచనలో గానీ గాంధీగారులేరు. కొన్ని సందర్భాలలో ఏదో మాట్లాడడం, కొన్ని సందర్భాలలో నిశ్శబ్దం, వారికి తెలియకుండానే నిర్ణయాలు జరగడం."

గాంధీగారు రౌండ్ టేబుల్ సమావేశంలో పాల్గొని సాధించిన ఫలితాలను గూర్చి బోల్టన్ (Bolton) గారు వివరించిన అంశాలివి.[1]

రౌండ్ టేబుల్ సమావేశం ముగిసేనాటికి మూడు సమస్యలు పరిష్కరించ కుండా ఉన్నాయి. ఇందులో అల్ప సంఖ్యాకుల సమస్య, ఫెడరల్ నిర్మాణపు సమస్య మరియు రాజ్యాలలో భారతదేశం పాత్ర ఈ మూడు సమస్యలు వివాదస్పదమైనటువంటివే. వీటి పరిష్కారం సామాన్యమైనటువంటిది కాదు. అయితే ఇవి పరిష్కరించబడక పోవడానికి ప్రధాన కారణం రౌండ్ టేబుల్ సమావేశంలో ఈ సమస్యల పరిష్కారం గూర్చి ప్రస్తావించక పోవడమే. రౌండ్ టేబుల్ సమావేశం రెండవ దఫా చర్చల్లో పైన జరిగిన వైఫల్యాలను గాంధీగారు ఏమైనా తొలగించగలిగారా? ఈ సమస్యలను ఏమైనా పరిష్కరించ గలిగారా? ఇవేమి చేయలేకపోగా కొత్తగా అనైక్యతను సృష్టించారని చెప్పడంలో సందేహంలేదని నేననుకొంటాను. భారతీయ ప్రతినిధుల పట్ల గాంధీగారు చిన్న పిల్లవాడిలా ప్రవర్తించడమేగాక వారి నీతి నిజాయితీలను ప్రశ్నించినారు. వారిని కుర్చీకి పరిమితమైన రాజకీయ వాదులుగా, అనుచరులు లేని నాయకులుగా పేర్కొన్నారు. ముస్లింలకు సంబంధించి వారు చేసిన దానికంటే ఎన్నోరెట్లు మేలుకలుగ జేశానని

గాంధీగారు గొప్పలు చెప్పుకొన్నారు. అంతేగాకుండా దళిత వర్గాలకు చెందిన ప్రతినిధుల చొరవ ఏమాత్రం లేకుండానే వారి సంక్షేమం గూర్చి పాటుపడినట్లుగా తనకు తానే చాటుకొన్నారు. ప్రతి సమావేశంలో గాంధీగారు ఈ విషయాలను గూర్చి ఎన్నోసార్లు ప్రస్తావించుకొన్నారు. గాంధీగారు రౌండ్ టేబుల్ సమావేశంలో నిర్వర్తించిన పాత్ర, కాంగ్రెస్ ప్రతినిధుల పట్ల ప్రవర్తించిన తీరును సహించిన కాంగ్రెసేతర ప్రతినిధులు కృతజ్ఞతలకర్హులు. తనతోటి ప్రతినిధుల పట్ల నిర్దయతో ప్రవర్తించిన గాంధీగారు రౌండ్ టేబుల్ సమావేశానికి ఏ ఉద్దేశ్యంతోనైతే హాజరు కావడం జరిగిందో అట్టి పనిని పూర్తి చేసుకొన్నాడా? అంటే ఆ లక్ష్యం పూర్తి కాలేదనే చెప్పాలి. అంతేగాక వారు నిర్వర్తించిన పాత్ర అవమానకరంగా ఉండెను. సమావేశంలో సమస్యలను గూర్చి వాదించుటకు బదులు కొన్ని ప్రధానమైన వాటి విషయంలో ఏ విధమైన చొరవ లేకుండానే అంగీకారాన్ని తెలుపడం జరిగింది. ఇందులో ఫెడరల్ లెజిస్లేచర్ వారికి సంబంధించిన ప్రతినిధులు వారి ద్వారానే నామినేట్ చేయబడతారు, ఎంపిక చేయబడరు అనే విషయంలో, ప్రొవిన్షియల్ స్వయంప్రతిపత్తి కేంద్రీయ బాధ్యతకు సంబంధించిన విషయంలో, లక్షలాది భారతీయులు చెఱసాలకు వెళ్ళిన సంఘటన విషయంలో కన్సర్వేటివ్‌లతో అతి సులభంగా, ఎటువంటి వాదోపవాదాలు లేకుండా గాంధీ తమ సమ్మతిని తెలిపినారు. కేవలం అల్ప సంఖ్యాకుల వారికి సంబంధించిన విషయాలలోనే గాంధీగారు సులభంగా తమ అంగీకారాన్ని తెలుపలేదు.

రౌండ్ టేబుల్ సమావేశం గాంధీగారి పరువు ప్రతిష్ఠలను పెంపొందించుటలో సహాయపడలేదు. ఈ విషయం వారి సన్నిహితులకు ఎంతయో బాధను కల్గించినది. సమావేశంలో గాంధీగారు ఎంతయో మిన్నయైన పాత్రను పోషిస్తారనే వీరి నమ్మకం వమ్ముకావడం జరిగింది. ఇంతవరకు తమ రాజ్యాంగాన్ని నిర్మించుటకు అధ్యయనం, శిక్షణ లేని వ్యక్తిని ఏ రాజ్యమూ తన ప్రతినిధిగా పంపలేదు. రౌండ్ టేబుల్ సమావేశానికి గాంధీగారు సెయింట్ నర్సి మెహతా గారు రచించిన పాటను తమతో తీసుకెళ్ళారు. తులనాత్మక రాజ్యాంగ న్యాయాన్ని వారి భుజస్కంధాలపై మోసుకెళ్ళినట్లయితే వారికి, వారి దేశానికి శ్రేయస్కరంగా ఉండేదేమో! సంబంధిత విషయాలలో పరిజ్ఞాన లోపం వలన బ్రిటిష్ వారు ప్రతిపాదించిన అంశాలను ఛిన్నాభిన్నం చేయడానికి లేదా ప్రత్యామ్నాయాలను సూచించడానికి తగిన స్థోమత లేకపోయింది. దీన్నిబట్టి ప్రతి

విషయంలోనూ గాంధీగారు ఓటమిని చవిచూచి తిరిగి వచ్చారని నిస్సందేహంగా చెప్పుకోవచ్చు.

రౌండ్ టేబుల్ సమావేశం ముగిసిన తర్వాత మాతృభూమికి విచ్చేసిన గాంధీగారు ఏవిధంగా ఆహ్వానించబడ్డాడు? అది గాంధీగారి భక్తులను మినహాయిస్తే ఒక విచిత్రమైన సంఘటన. కానీ బొంబాయి ఓడరేవుకు డిసెంబర్ 28, 1931వ సంవత్సరము ఉదయం 8 గంటలకు లాయడ్ ట్రిస్టిన్‌కు చెందిన ఎస్.ఎస్. పిల్‌సనర్ చేరుకోగానే స్త్రీలు, పిల్లలతో సహా వేలాది మంది గుంపులు గుంపులుగా గాంధీగారికి స్వాగతం, శుభాభినందనలు తెలుపుటకు చేరుకొన్నారు. దీనికి సంబంధించిన "టైమ్స్ ఆఫ్ ఇండియా" మరియు "ఈవెనింగ్ న్యూస్ ఆఫ్ బొంబాయి" పత్రికలు ప్రకటించిన వార్తలు క్రింది విధంగా ఉన్నాయి.

"పిల్‌సనర్ తో ఓడరేవు వద్దకు దేశ సేవికలు (స్త్రీ కాంగ్రెస్ కార్యకర్తలు) కుంకుమ పువ్వు రంగు చీరలు ధరించి పీర్ నుండి కొంత దూరం వరకు లాంచీలపై వెళ్ళడం జరిగింది. పూలమాలలు వేయుటకు పీర్ మీదుగా ఒకటి లేదా రెండు విమానాలు వేయమని కాంగ్రెస్ కమిటీ బొంబాయి ఫ్లైయింగ్ క్లబ్‌ను డిమాండ్ చేసింది. కానీ రాజకీయాలకు దూరంగా ఉండాలనే ఉద్దేశ్యంతో కాంగ్రెస్ డిమాండ్‌ను క్లబ్ త్రోసిపుచ్చింది.

"బల్లార్డ్ పీర్ వద్దగల విశాలమైన కేంద్రీయ హాలు కాంగ్రెస్ జెండాలతో అందంగా అలంకరించబడింది. హాలు మధ్యలో ఒక పెద్ద వేదిక, దాని చుట్టూ వివిధ సంస్థలకు చెందిన స్థానిక, స్థానికేతర ప్రతినిధులు కూర్చోవడానికి సీట్లు ఏర్పాటు చేసి ప్రవేశ పత్రాలు ఇవ్వడం జరిగింది. ఓడ రేవు మరియు నగరం నుండి సమావేశం ఏర్పాటు చేసిన పెద్ద హాలు వరకు గల రెండు ప్రధాన రహదారులలో దేశ సేవికలకు మరియు సమావేశపు హాలుకు సంబంధించి సూచనలు ఇవ్వడానికి స్త్రీ కార్యకర్తలకు బాధ్యతలు అప్పగించినారు."

"గాంధీగారు కాంగ్రెస్ నాయకుల వెంట వేదికను చేరుకొని ఎంతయో ఆహ్లాదకరంగా విజయోత్సాహాన్ని పొందినారు. వారు వేదికపై అడుగిడగానే ఒకరి తర్వాత మరొకరు టెలిగ్రాఫ్ సందేశం వలె స్వాగతం పలికారు."

"వేదికపై నున్న గాంధీగారిని ప్రభుత్వ రంగానికి చెందిన ప్రముఖులైన ప్రతినిధులు (అంతకు ముందే పేర్లు నమోదు చేసుకొని) పూలమాలలతో సత్కరించారు. సమావేశంలో జరిగే కార్యకలాపాలన్నీ పూలమాలలతో సత్కరించడానికి పరిమితమైనాయి."

"అటుపిమ్మట ఊరేగింపు – ఈ ప్రదర్శనలో గాంధీగారిని అందంగా అలంకరించిన కారులో కూర్చోబెట్టినారు. వీరికి ఎడమవైపు వల్లభ్‌భాయ్ పటేల్, కుడివైపున విఠల్‌భాయ్ పటేల్ ఉండగా బొంబాయి ప్రావిన్షియల్ కాంగ్రెస్‌మిటీ అధ్యక్షులైన కె.యఫ్. నారిమన్ ముందు సీటులో కూర్చొన్నారు.

"ఈ కారుకంటే ముందు ఒక పైలట్ కారు: దీనివెంట కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ సభ్యులకు చెందిన ఇతర వాహనాలు వున్నాయి. ఈ ఊరేగింపు బల్లార్డ్‌పీర్ రోడ్ మరియు కల్బాదేవి రోడ్ గుండా వేలాది మందితో మణిభువన్, గామాదేవిలను చేరుకోవడం జరిగింది."

ఈ ఘన స్వాగతోత్సవంలో గాంధీగారు పెదవి విప్పలేదు. ఎందుకంటే ఆరోజు ఆయనకు మౌనవ్రతం. తనకు స్వాగతం ఇవ్వడానికి వచ్చిన ప్రజాసమూహాన్ని పెదవివిప్పి పలకరించక పోవడం అనుచితమని అనిపించిన తరువాతనే ఆయన మాట్లాడారు. ఈ విషయాన్ని పురస్కరించుకొని కాంగ్రెస్ అధికారిక చరిత్రకారుడైన పట్టాభి సీతారామయ్య ఈ వేడులను క్రింది విధంగా అభివర్ణించినారు.[2]

"భారత నేతకు మహోన్నతమైన రీతిలో హార్ధిక స్వాగతం పలుకుటకు దేశం నలుమూలల నుండి ప్రతినిధులు బొంబాయి నగరంలో సమీకృతమైనారు. స్నేహితులను గాంధీగారు అభినందించినారు. కస్టమ్స్ హౌస్ ఒకదానిలో సాంప్రదాయబద్ధంగా స్వాగతం అటుపిమ్మట రాజుల కాలంలో రాజులు తమ రాజ్యంలో ఎంతయో ఆర్భాటంగా జరుపుకొనే విధంగా బొంబాయి నగరంలో ఊరేగింపు జరిగింది."

ఐరిష్ సెయిన్‌ఫెయిన్(Sein Fein) ప్రతినిధులు 1921లో దీనికి 10 సంవత్సరాలకు ముందు ఐరిష్ హోమ్ రూల్ పరిష్కారానికి గాను లాయడ్ జార్జిగారి ఆహ్వానం మేరకు లండన్‌కు ప్రతినిధులుగా విచ్చేసిన సంఘటన ఇక్కడ గుర్తుకు వస్తుంది. ఐరిష్ ప్రతినిధులు బ్రిటిష్ కేబినెట్‌తో ఒక సంధికి సమ్మతించి డిసెంబర్ 8, 1921న సంతకాలు

చేసుకొన్నారు. ఈ సంధి సమ్మతికి చెందిన అంశాలను చర్చించుటకు సెయిన్ ఫేయిన్ పార్టీకి చెందిన పార్లమెంటుకు సమర్పించగా ఆ పార్టీ డిసెంబర్14, 1921 నుండి జనవరి 7, 1922 ల మధ్య కాలంలో సమావేశమైనది. జనవరి 7న సమర్పించిన అంశాలలో ఒక భాగం చర్చించడమైనది. ఈ చర్చలో సంధికి అనుకూలంగా 64 ఓట్లు, ప్రతికూలంగా 57 ఓట్లు లభించినాయి. ఒక దేశానికి చెందిన అంశాలను చర్చించుటలో సంధి చేసి అటువంటి సంధికి అనుకూలతను పొందిన ఐరిష్ ప్రతినిధులకు లభించిన ఆతిధ్యం ఎటువంటిది? ఆర్థర్ గ్రిఫిత్ ఈ ప్రతినిధి బృందానికి నాయకుడు. మైకేల్ కొల్లిన్స్ వారి సహచరుడు. వీరికి లభించిన ఆతిధ్యం ఏమిటంటే "సంధి – వ్యతిరేక" శక్తులు వీరిరువురిని కాల్చి చంపడం. మొదటి వారు ఆగష్టు 12న రెండవ వారు ఆగష్టు 22, 1922న హతమార్చబడినారు. వీరి మరణానికి కారణం వారు బ్రిటీష్ క్యాబినెట్‌తో చేసుకొన్న "సంధి" తో ఐర్లాండ్‌కు అల్‌స్టర్ మరియు రిపబ్లిక్‌ను చేకూర్చలేక పోవడం. సంధి చేసుకొన్నపుడు ఈ విషయాన్ని అనుమతించలేదనేది వాస్తవం. కానీ ఐరిష్ ప్రతినిధులు ఈ అంశాన్ని సమావేశంలో ప్రస్తావించినారు. ఇరు పక్షాల మధ్య సమావేశంలో చర్చ కొనసాగింది. ఈ రెండు అంశాలు ఒడంబడికలో చేర్చక పోవడమనేది బహిర్గతమైన విషయమే గాని దీనికి ఐరిష్ ప్రతినిధుల తప్పిదం ఏమీలేదనే విషయం గుర్తుంచుకోవాలి. ఆర్థర్ గ్రిఫిత్ మరియు మైకేల్ కొల్లిన్స్ పట్ల "సంధి – వ్యతిరేక" శక్తులు అనుసరించిన విధానం అమానుషం. క్షుణ్ణంగా చెప్పాలంటే ఐరిష్ ప్రజలు ఊహించిన దానికంటే ఎన్నో రెట్లు ఎక్కువగానే వారి ప్రతినిధులు చర్చలలో కృషి చేసినారు. కానీ వారికి లభించిన ఆదరణ హతమార్చడం.

పై అంశాలను పురస్కరించుకొంటే గాంధీగారు రౌండ్ టేబుల్ సమావేశం అనంతరం స్వదేశానికి తిరిగి విచ్చేసిన సందర్భంగా ఏర్పాటు చేసిన స్వాగతం వింతైనదిగా ద్యోతకమగును. ఇరుదేశాలకు చెందిన ప్రతినిధులు "స్వరాజ్యం" సాధించుటకై సమావేశానికి హాజరుకావడం జరిగింది. అంటే గ్రిఫిత్‌మరియు కొల్లిన్స్‌లు ఐర్లాండ్ తరపున, గాంధీగారు భారతదేశం తరపున ప్రాతినిధ్యం వహించినారు. ఈ రెండు దేశాలకు చెందిన ప్రతినిధులలో గ్రిఫిత్ మరియు కొల్లిన్స్‌లు సమావేశంలో సుదీర్ఘంగా చర్చించి కొంత వరకు సాఫల్యత చెందారు. ఒక విధంగా విజయాన్ని సాధించినట్లేనని చెప్పవచ్చు. కానీ భారతదేశ ప్రతినిధి ఏమీ

సాధించకుండానే వైఫల్యం చెంది ఓటమితో మరియు అవమానకరమైన రీతిలో తిరిగివచ్చారు. ఇదిలా ఉంటే వాస్తవంగా ఈ ప్రతినిధులకు తర్వాత జరిగిన గౌరవ మర్యాదలను పరిశీలిస్తే ఐర్లాండ్‌కు చెందిన ప్రతినిధుల పరిస్థితి దయనీయంగాను విచారించదగినదిగా ఉంటే ఏమీ సాధించని భారత ప్రతినిధికి జరిగిన సత్కారాలు ఊహించడానికి అంతుపట్టకుండా ఉన్నాయి. అంటే ఐరిష్ ప్రతినిధులు వధించబడితే ఏమీ సాధించకుండా తిరిగి వచ్చిన గాంధీగారికి భారతీయులు రాజుల కాలంలో రాజులు అనుభవించిన రీతిలో ఆతిథ్యం ఇచ్చి ఘనంగా సత్కరించారు. ఈ రెండు దేశాలకు చెందిన ప్రతినిధుల మధ్య ఎంత తారతమ్యం ఉన్నదో మనకు గోచరించుచున్నది. గ్రిఫిత్‌మరియు కొల్లిన్స్ విషయంలో విషాద ఛాయలు చోటు చేసుకొంటే గాంధీ విషయంలో సత్కారాలు, ఆతిథ్యమా? భారత దేశానికి చెందిన స్వదేశీ అభిమానులు, ఐరిష్ దేశానికి చెందిన స్వదేశీ అభిమానుల కంటే విరుద్ధమైన వారా? స్వాగతం పలికిన జన సందోహం దీన్ని గాంధీగారి పైన ఉన్న గ్రుడ్డి నమ్మకంతోనా లేదా గాంధీగారి వైఫల్యం తెలిసి కూడా తెలియనట్లుగా పత్రికలవారి సానుభూతి పొందుట కొరకు చేబట్టినారా? ఈ విషయాలకు నేను అందరికంటే ఎక్కువ సమాధానం చెప్పగలను.

## II

గాంధీగారికి ఏర్పాటు చేసిన ఘనస్వాగతోత్సవాన్ని నిరాకరించుటకు, నిరసనను తెలుపుటకు వేలాదిమందిగా బొంబాయికి చెందిన దళితులు, పీడితులు గాంధీ వారధి (Pier) వద్దకు చేరుకొన్నారు. ఈ ప్రదర్శనను పురస్కరించుకొని వార్తా పత్రికలు క్రింది విధంగా పేర్కొన్నాయి -

"బల్లార్డ్ వారధికి బయటి దృశ్యం ఉద్రిక్తంగా వున్నది. ఒకవైపు అణగద్రొక్కబడిన వర్గం వారు యూనిఫారంలో ఉండి, నల్లజెండాలు ధరించి, గాంధీజీ వైఫల్యాలను బహిర్గతం చేస్తూ నినాదాలిస్తూ ఉంటే మరొకవైపు కాంగ్రెస్ అనుచరులు గాంధీకి అనుకూలంగా ప్రతి నినాదాలు ఇస్తున్నారు."

అట్టడుగు వర్గాలకు చెందిన కార్యకర్తలలో స్త్రీలు మరియు పురుషులు ఎంతయో ఉద్వేగంతో ప్రదర్శనలో పాల్గొన్నారు. ప్రదర్శకుల్లో అందరూ నల్లజెండాలు ధరించి

గాంధీగారిపై వ్యతిరేకతను వ్యక్తపరచినారు. ఈ సమూహం సులభంగా గుర్తించేదిగా ఉండడం వలన ఉన్నత స్థాయిలో ఉన్నటువంటి కాంగ్రెస్ కార్యకర్తలు, అభిమానులు స్వాగతోత్సవ వేదికకు చేరుకోవడంతోనే పెద్ద ఘర్షణ సంభవించి రక్తపాతం జరిగింది. ఈ ఘర్షణలో ఇరువర్గాలకు చెందిన వారు దాదాపుగా 40 మంది మరణించినారు.

దీనిద్వారా అట్టడుగు వర్గం వారు తన పట్ల వ్యతిరేకతను కలిగి యున్నారనే విషయం మొట్టమొదటి సారిగా గాంధీగారు తెలుసుకొన్నారు. ఈ విషయం వారిని తికమక పరచిందని వేరే చెప్పనక్కర్లేదు. ఈ అంశాన్ని మరుసటిరోజు లేవనెత్తగా వారు జరిగిన దానికి కోపంగాను, విచారంగాను లేరని, అట్టడుగు వర్గం వారిపై వారికి ఎటువంటి ద్వేషం లేదని, వారు తన మాంసంలో మాంసం, ఎముకలో ఎముక అని పేర్కొన్నారు. ఇది వాస్తవాన్ని కప్పిపుచ్చుటకు వేసిన ఎత్తుగడయని నేను నిస్సందేహంగా చెప్పగలను. అంతేగాక ఈ విధానం సౌలభ్యం మరియు సాంప్రదాయ సిద్ధమైన ధోరణిలో ఆడిన అబద్ధంగా అభివర్ణించడంలో అతిశయోక్తి లేదు. భారతదేశంలో ఉన్నటువంటి కాంగ్రెస్‌వారు క్రాంవెల్ వంటి వారిని గుర్తుంచుకోక పోవడం దురదృష్టకరం. క్రాంవెల్ యుద్ధభూమి నుండి తిరిగి రాగానే అసంఖ్యాకంగా జనసందోహం వారికి అభివందనాలు తెలుపుటకు దూసుకువచ్చారు. జన సమూహం వారి అపారమైన ఆధిక్యతను చాటి చెప్పుతుంటే వారి మిత్రులు ఎంతయో ముగ్ధులైనారు. కానీ క్రాంవెల్ ఈ విషయాన్ని అతి సులభంగా త్రోసి పుచ్చి ఈ విధంగా అన్నారు. "అవును నేను ఉరితీయబడితే ఇంతకంటే ఎక్కువ మంది నన్ను చూడడానికి వస్తారని నాకు తెలుసు." క్రాంవెల్‌కు ఉన్నటువంటి ఈ గుర్తింపు కాంగ్రెస్ నాయకుల మేధస్సుకు తట్టినట్లు లేదు. ఉరితీయబడే రోజు రానే రాదు. లేదా భారతీయ సమూహం ఆలోచనా పరమైన సమూహం కాదు అనేది వారి నమ్మకం. అయితే భారతీయ సమాజంలో భాగమైన అస్పృశ్యులకు చెందిన ఆలోచనాపరులై ప్రతినిధుల సమూహం ఆగష్టు 28న గాంధీగారికి అభినందనలు తెలుపుటకు నల్లజెండాలు ధరించినారు. ఇచ్చట గాంధీగారిని అస్పృశ్యులు ఎందుకు నిరసించినారు? ఈ ప్రశ్నకు సమాధానంగా ప్రదర్శన నిర్వాహకులు ఇచ్చిన వివరణ క్రింది విధంగావుంది.

"కాంగ్రెస్‌కు మరియు గాంధీకి వ్యతిరేకంగా మా చార్జ్‌షీట్"

"పైపై సానుభూతి, దయాధర్మదృష్టి ఇక చాలు. మాకు కావలసింది న్యాయమూ, నిజాయితీగల వ్యవహారమూ."

"1. వాస్తవంగా కాంగ్రెస్ నిర్మాణాత్మకమైన కార్యకలాపాలలో అస్పృశ్యతా నిర్మూలనను చేర్చడం జరిగింది. కానీ ఈ లక్ష్యం సాధించుటకు కాంగ్రెస్ ఎటువంటి ప్రయత్నం చేయలేదు. ఈ విషయాన్ని మహద్ మరియు నాసిక్ మహాసభలలో చర్చించినపుడు స్థానిక కాంగ్రెస్ నాయకులే వ్యతిరేకతను తెలిపినారు."

"2. లండన్ రౌండ్ టేబుల్ సమావేశంలో మా ప్రతినిధియైన డా॥ బి.ఆర్. అంబేద్కర్ ద్వారా పంపబడిన అణగద్రొక్కబడిన వారి డిమాండ్‌లకు సంబంధించిన అంశాలను ప్రస్తావించడంలో సాఫల్యత చెందలేదు.

"3. ముస్లింల మరియు సిక్కుల ప్రత్యేకమైన డిమాండ్‌ల గూర్చి గాంధీజీ ఒప్పుకొన్నారేగానీ అట్టడుగు వర్గాలవారికి ఎన్నికలలో ప్రత్యేకంగా సీట్లను కేటాయించుటకు సమ్మతిని తెలుపలేదు. అంటరాని వారు ఎటువంటి మర్యాదను పొందుతారు అనే విషయం. మేము హిందూ కులస్థుల దయాదాక్షిణ్యాలపై ఆధారపడి ఉండాల్సిందేనా.

......................

"9. అట్టడుగు వర్గాలకు ప్రత్యేకంగా నియోజకవర్గాన్ని గాంధీజీ వ్యతిరేకించినారు. వీరికి హిందూ సమాజం వేర్వేరుగా చీలిపోవడం ఇష్టంలేదు. కానీ నేడు కాంగ్రెస్ వారి మధ్య వర్గాలను పురికొల్పి వ్యతిరేకతను సృష్టించినది. గాంధీజీ మరియు కాంగ్రెస్ వారిరువురి నటన సాఫీగా లేదు. విశ్వాస ఘాతకుడైన స్నేహితుని కంటే తెలియని శత్రువు మిన్నయని చెప్పవచ్చు.

"10. కాంగ్రెస్ మరియు గాంధీజీలు మాత్రమే అట్టడుగు వర్గాల వారికి ప్రాతినిధ్యం వహిస్తున్నట్లు, వారి క్షేమంకై చర్యలు గైకొంటున్నట్లు చాటుకొన్నారు. దీన్ని బట్టి వాస్తవాలను వెల్లడించడానికి మేము వేలాదిగా ముందుకు రావడం మా బాధ్యత కాదా? ఇదియే గాంధీజీ మరియు కాంగ్రెస్‌పై మేము ఇచ్చే ఛార్జ్‌షీట్.

"ఎవ్వరైనా గ్రుడ్డిగా ఆరాధించనివారు, మరియు గ్రుడ్డిగా ఒక పక్షం చేరనివారు ఉంటే పరిశీలన జరిపి న్యాయం చేకూర్చండి.

ప్రధాన కార్యదర్శి, అట్టడుగు వర్గాల సంస్థ"

# III

ఈ ఛార్జ్‌షీట్ (అభియోగం) వాస్తవమేనా? భారతదేశానికి చెందిన రాజకీయ నాయకుడిగానేకాక అస్పృశ్య వర్గాల ఉద్ధారకుడుగా గాంధీగారు ప్రపంచ దేశాలకు తెలుసు. దీనివలన ఇతర దేశాల ఆదరాభిమానాలను గాంధీగారు చూరగొనగలిగారు. ఉదా: ఇటీవలి కాలంలోనే 'మాంఛెస్టర్ గార్డియన్' సంపాదకీయంలో గాంధీగారు అస్పృశ్యులకు సంబంధించి రచించిన గ్రంథాన్ని ఎంతగానో మెచ్చుకొన్నారు. కాంగ్రెస్ గాంధీగారి చేతుల్లోకి రాకముందు సామాజికపరమైన సమస్యల ప్రస్తావనను అనుమతించలేదు. సామాజిక, రాజకీయ పరమైన అంశాలమధ్య వ్యత్యాసాన్ని సూచించినారు. వీటిలో కాంగ్రెస్ రాజకీయపరమైన అంశాలకే ఎక్కువగా ప్రాధాన్యతను ఇవ్వడం జరిగింది. అంతకు పూర్వం ఉన్నటువంటి కాంగ్రెస్ అస్పృశ్యులను గూర్చి చర్చించుటకు నిరాకరించినది. కానీ ఎంతయో కష్టంగా 1917 వ సంవత్సరంలో అస్పృశ్యుల సమస్యలను చర్చించుటకు అనుమతించి కాంగ్రెస్ ఈ తీర్మానం దయచేసింది.

"అట్టడుగు వర్గాల వారిపై సాంప్రదాయ సిద్ధంగా మోపిన అయోగ్యమైన అసమంజసమైన, అసహ్యకరమైన భారాన్ని తొలగించడంలో ఉన్న న్యాయబద్ధతనూ, సవ్యతనూ దేశ ప్రజలకు కాంగ్రెస్ ప్రబోధిస్తుంది.

1920 వ సంవత్సరంలో కాంగ్రెస్ గాంధీగారి ఆధీనంలోకి రావడం జరిగినది. నాగ్‌పూర్‌లో జరిగిన సాధారణ సమావేశంలో కాంగ్రెస్ క్రింది తీర్మానాలు చేసింది.

## అంతర్‌మత సమైక్యత (Inter communal Unity)

"చివరగా, పంజాబ్ మరియు ఖిలాఫత్‌లో జరిగిన తప్పిదాలను నివారించి ఒక్క సంవత్సరంలోనే "స్వరాజ్" స్థాపించాలి. ప్రభుత్వంతో సహాయ నిరాకరణ మరియు అహింసా విధానాన్ని అనుసరించవలెనని కాంగ్రెస్, దానికి అనుబంధంగా ఉన్నటువంటి, మరియు అనుబంధంగా లేనటువంటి సంస్థలన్నింటిని అర్థించడం జరిగినది. సహాయ నిరాకరణోద్యమం ద్వారా ప్రజల మధ్య సహకారం పెంపొందుతుంది. దీనికి సంబంధించి కాంగ్రెస్ ప్రజాసంఘాలకు హిందు, ముస్లింల సమైక్యతను మెరుగు పరచుటకు పిలుపు

ఇచ్చినది. కాంగ్రెస్‌లో ఉన్నటువంటి హిందూ ప్రతినిధులు బ్రాహ్మణ, మరియు బ్రాహ్మణేతరుల మధ్యగల వివాదాలన్నింటిని పరిష్కరించవలసినదిగా కోరడమైనది. హిందూ మతంలో అస్పృశ్యులపై ఉన్నటువంటి అపవాదాన్ని తొలగించుటకు ప్రత్యేకమైన శ్రద్ధ కనబరచాలి. అంతేగాక హిందూ మతాన్ని సంస్కరించుటకు అట్టడుగు వర్గాల వారికి ప్రస్తుతం ఉన్నటువంటి పరిస్థితులకంటే మెరుగుగా ఉండేందుకు సహకరించవలసినదిగా పెద్దలను కోరడమైనది."

పైగా స్వరాజ్య సాధనకు అస్పృశ్యతను రూపుమాపడం ఒక ముందు షరతుగా గాంధీగారు భావించలేదా? డిసెంబర్ 29, 1920న గాంధీ క్రింది విధంగా వ్యాఖ్యానించారు.

"ప్రభుత్వానికి వ్యతిరేకంగా సహాయనిరాకరణోద్యమం - అనగా పౌరుల మధ్య సహకారం. ఒకవేళ హిందువులు అస్పృశ్యత అనే మహమ్మారిని తొలగించలేకపోతే స్వరాజ్యం ఒక్క సంవత్సరంలో కాదుగదా ఒక వంద సంవత్సరాలు కష్టపడిన సాధ్యపడదు."

మళ్ళీ స్వరాజ్‌కు కావలసిన షరతులకు సంబంధించి "యంగ్ ఇండియా" ఫిబ్రవరి 23, 1921న వ్రాస్తూ-

"సులభతరంగా ఉన్నటువంటి కొన్ని పరిస్థితులను సంతృప్తి పరచగల్గినట్లయితే వచ్చే అక్టోబర్‌కు ముందు "స్వరాజ్" సాధించడం సాధ్యపడవచ్చు.

"సెప్టెంబర్ చివరి వారంలో నేను దేశంలో సాహసయాత్రను చేశాను. దీనిద్వారా మనకున్న వాతావరణ పరిస్థితులు చాలా సాధారణమైనవిగా గమనించాను. గతంలో నేను 5 మాసాలు పొందిన అనుభవం ఈ అభిప్రాయానికి కారణభూతమైనది. తద్వారా అప్పుడున్న పరిస్థితుల దృష్ట్యా దేశంలో "స్వరాజ్యం" స్థాపించడానికి సిద్ధంగా ఉంటుందని నేను అనుకోలేదు."

"కానీ సాధ్యమైనంత వరకు ఖచ్చితమైన పరిస్థితులను తెలుసుకోవడానికి మనకు కావలసినదేమంటే అహింసావిధానం, నీతి, నిజాయితీ,శ్రద్ధాశక్తులు మరియు స్వదేశాభిమానం.

"అటు పిమ్మట ప్రతి గ్రామంలో కాంగ్రెస్ ఏజన్సీని స్థాపించడం!

"అందరికి ఆమోదయోగ్యంగా ఉండేవిధంగా కొన్ని అంశాలున్నాయి. వీటిలో ప్రధానమైనది "స్వదేశీ". అంటే ప్రతి ఇంటిలో రాట్నం ఉండవలె. ప్రతి గ్రామం ఆర్గనైజ్ చేయగల్గాలి మరియు స్వయం మద్దతును కల్పించుకోగల్గాలి"

"ప్రతి స్త్రీ మరియు పురుషుడు "తిలక్ స్వరాజ్" నిధికి కొంత డబ్బును ఇవ్వాలి. అది ఒక పైసాయైనా కావచ్చు. ఉద్యమానికి కావలసిన విత్తంపైననే మేము దృష్టిని కేంద్రీకరించాం.

"హిందూ ముస్లింల ఐక్యత లేకుండా మరియు అంటరానితనం అనే మహమ్మారిని రూపుమాపకుండా మనమేమీ సాధించలేం."

"ఈ చిన్న కార్యక్రమానికి మనం నీతి, నిజాయితీ, శ్రద్ధాశక్తులు మరియు స్వదేశాభిమానం గల వారమేనా? ఇవన్నీ మనకుంటే ఇండియాలో వచ్చే అక్టోబర్ కంటే ముందే స్వరాజ్యం స్థాపించవచ్చు."

అస్పృశ్యులకు ఇంకా కావల్సిందేమిటి? ఇక్కడ గాంధీగారు అస్పృశ్యుల యోగ క్షేమాలు కోరేవారినుండి బయట పడ్డారు. వారు అస్పృశ్యుల సేవకుడిగా ప్రతినిధిగా చాటుకున్నారు. అలాంటప్పుడు అస్పృశ్యులు గాంధీగారి పట్ల ఇంత అవిశ్వాసాన్ని ఎందుకు చూపుతున్నారు? మాటలనుబట్టి చూస్తే అస్పృశ్యుల ఆరోపణ నిరాధారంగానే వుటుంది. కానీ చేసిన పనులను బట్టి చూసినా అలాగే వుంటుందా? గాంధీగారి క్రియలు కొన్నిటిని పరిశీలిద్దాం.

గాంధీగారు చెప్పుకొంటున్నట్లుగా కాంగ్రెస్ వారు మరియు వారి మిత్రులు అస్పృశ్యులకు చేసిన సేవ రెండు కాలాలకు చెందినటువంటిది. ఒకటి - పూనా ఒడంబడికకు ముందున్న కాలం. రెండవది - పూనా ఒడంబడిక అనంతర కాలం. మొదటి కాలాన్ని బార్డోలి కార్యక్రమమని, రెండవ కాలాన్ని హరిజన సేవక్ సంఘ్ కార్యక్రమమని పిలుస్తారు.

## మొదటికాలం

## 1

మొదటుగా బార్డోలి కార్యక్రమకాలము. 'కాంగ్రెసు యొక్క నిర్మాణాత్మక కార్యక్రమంగా' పిలిచే బార్డోలి కార్యక్రమం దేశం యొక్క రాజకీయ కోర్కెల సాధనకై అవలంబించిన ఒక వినూత్న పంథానుండి ఉత్పన్నమైనదే. 1920 సంIIలో నాగపూర్‌లో జరిగిన కాంగ్రెస్ యొక్క సమావేశం ఈ విధంగా ప్రకటించింది :

"భారతదేశ ప్రజానీకమంతా ప్రస్తుతం స్వరాజ్య స్థాపనకై కృతనిశ్చయంతో నున్నారు మరియు

"భారత జాతీయ కాంగ్రెసు ప్రత్యేక సమావేశానికి ముందు భారత ప్రజలు అవలంబించిన పద్ధతులన్నియు వారి హక్కులు మరియు స్వేచ్ఛలకు తగిన గుర్తింపు సాధించడంలో విఫలమయ్యాయి.

"ప్రస్తుత కలకత్తాలో జరిగిన కాంగ్రెసు ప్రత్యేక సమావేశంలో తీర్మానించబడిన అహింసాత్మక సహాయ నిరాకరణను సమర్థిస్తూ, పాక్షికంగాగాని లేదా సంపూర్ణంగాగాని ప్రభుత్వంతో కలిసి పనిచేసే విధానాన్ని విడనాడడం ఒకవైపు, పన్నుల చెల్లింపు నిరాకరణ ఇంకొకవైపు జాతీయ కాంగ్రెసుగాని లేదా అఖిల భారత కాంగ్రెసు సంఘం నిర్ణయించిన సమయంలో వీటిని అమలులో పెట్టడం మరియు ఈ సంధి కాలంలో దేశాన్ని అందుకు అనుగుణంగా సంసిద్ధం చేయడం."

అహ్మదాబాద్ నందు 1921లో జరిగిన కాంగ్రెసు సమావేశం ఈ విధంగా ప్రకటించింది:

"పౌర సహాయ నిరాకరణ మాత్రమే సాయుధ తిరుగుబాటుకు నాగరికమైన మరియు సమర్థవంతమైన ప్రత్యామ్నాయ సాధనంగా ఉంటుందని ఈ కాంగ్రెసు యొక్క ఇంకో భావన. అందువలన వైయక్తిక మరియు సామూహిక పౌర నిరాకరణకు కాంగ్రెస్ కార్యకర్తలను మరియు ఇతరులను సమాయత్తం కావలసిందిగా సలహానివ్వడమైనది."

పౌర అవిధేయత మరియు సహాయ నిరాకరణ విధానానికి అనుగుణంగానే ఫిబ్రవరి 1922లో బార్డోలిలో జరిగిన కాంగ్రెసు కార్యాచరణ సంఘం ప్రజలంతా పాల్గొనే విధంగా

ఈ క్రింద పేర్కొన్న ఆచరణాత్మక కార్యక్రమాన్ని రూపొందించింది.

"ఈ దిగువ పొందుపరచబడిన కార్యక్రమాలలో కాంగ్రెస్ సంస్థలన్నీ పాల్గొనవలసినదిగా కాంగ్రెసు కార్యచరణ సంఘం సలహానిచ్చింది.

"1) కనీసం ఒక కోటి మందిని కాంగ్రెసులో సభ్యులుగా చేర్పించడం.

"2) చేనేత రాట్నానికి ప్రజాదరణను పెంపొందించుతూ చేతితో వడికే మరియు చేతితో నేసే ఖద్దరు ఉత్పత్తిని వ్యవస్థీకృతం చేయవలెను.

"3) జాతీయ పాఠశాలలను స్థాపించవలెను.

"4) బలహీన వర్గాలను మెరుగైన జీవనం కొరకు సంఘటిత పరచడం, వారి సాంఘిక, మానసిక మరియు నైతిక స్థితిగతులను పెంపొందించడం, వారి పిల్లలను జాతీయ పాఠశాలలకు పంపే విధంగా ప్రోత్సాహమిస్తూ ఇతర పౌరులు అనుభవించే సాధారణ సౌకర్యాలను వారికి సమకూర్చడం.

"గమనిక : ఇంకను అస్పృశ్యుల పట్ల విచక్షణను అధికంగా పాటించే ప్రాంతాలలో కాంగ్రెసు నిధులనుండి ప్రత్యేక పాఠశాలలు మరియు నూతులను తప్పనిసరిగా నిర్మింపజేసి, అలాంటి వారి పిల్లలు జాతీయ పాఠశాలలకు వెళ్లేవిధంగా ప్రయత్నాలు చేస్తూ, అస్పృశ్యులను కూడా అందరూ వినియోగించే బావులను తాము కూడా వాడేటట్లు ప్రయత్నాలు జరపవలసి వుంటుంది.

"5) త్రాగుడు అలవాటుకు బానిసలైన ప్రజానీకాన్ని అలవాటు నుండి మాన్పించుటకు ఇల్లిల్లు తిరిగి వారి మనస్సును చూరగొనే విధంగా ప్రచార కార్యక్రమాన్ని అనుసరిస్తూ, వారిని ఇంటి వద్దనే మార్చే ప్రయత్నంపై ఎక్కువ ఆధారపడుతూ, పికెటింగుకు తక్కువ ప్రాముఖ్యత నివ్వాలి.

"6) అన్ని రకాల వివాదాలను న్యాయస్థానాలతో ప్రమేయం లేకుండా ప్రయివేటుగా పరిష్కరించుటకు గ్రామ మరియు పట్టణ పంచాయితీలను వ్యవస్థీకృతం చేసి ప్రజాభిప్రాయమే ప్రాధమికమైనదిగా భావించి పంచాయితీ తీర్మానాలపై

విశ్వసనీయతను కల్పిస్తూ వారిచే ఆమోదింపచేయవలె.

"7) వివిధ వర్గాల్లో మరియు జాతుల్లో ఐకమత్యమును కల్పించి పరస్పర అవగాహనకు ప్రాధాన్యతను ఇవ్వవలె. సహాయ నిరాకరణోద్యమాన్ని విస్తృత పరుస్తూ, అనారోగ్యం మరియు ప్రమాదాల సందర్భాలలో ఎలాంటి విచక్షణకు తావులేకుండా సహాయ సహకారాలు అందించుటకు ఒక సాంఘిక సేవా విభాగాన్ని నెలకొల్పి ఆ విధంగా వ్యవస్థీకృతం చేయవలె.

"8) 'తిలక్ స్మారక స్వరాజ్యనిధి' వసూళ్లను కొనసాగిస్తూ, కాంగ్రెసు వాదులు మరియు సానుభూతి పరులు 1921లో తమకు వచ్చిన ఆదాయంలో కనీసం ఒక శాతం భాగాన్ని నిధికి సమకూర్చాలి. ప్రతి రాష్ట్రం "తిలక్ స్మారక స్వరాజ్యనిధి" ఆదాయం నుండి ప్రతినెల ఇరువై ఐదు శాతం మొత్తాన్ని అఖిల భారత కాంగ్రెసు కమిటీకి అందజేయవలసి వుంటుంది. పై తీర్మానాలన్నీ జరగబోయే అఖిల భారత కాంగ్రెసు కమిటీకి అందజేయవలసి వుంటుంది."

ఈ కార్యాచరణ పథకాన్ని 1922 ఫిబ్రవరి 20 రోజున ఢిల్లీలో జరిగిన అఖిల భారత కాంగ్రెసు కమిటీ ముందుంచి యథాతథంగా ఆమోదించడమైనది. ఈ కార్యక్రమం చాలా విస్తృతమైనది. అయితే ఈ మొత్తం కార్యక్రమం ఏమైనది? దీనిని ఏ విధంగా పరిగణించినారో మరియు ఇది ఏ విధంగా పనిచేసినదో అనే విషయాలతో నాకు ప్రమేయం లేదు. నాకు కేవలం ఒక్క బలహీన వర్గాలకు సంబంధించిన అంశమే ముఖ్యం.

అఖిల భారత కాంగ్రెసు కమిటీ దీనిని నిర్ధారించిన తర్వాత జూన్, 1922లో లక్నోలో జరిగిన కార్యాచరణ సంఘం ఈ దిగువ తీర్మానాన్ని ఆమోదించింది.

"ఈ సంఘం ఇందుమూలంగా స్వామి శ్రద్ధానందజీ, శ్రీమతి సరోజినీ నాయుడు మరియు శ్రీయుతులు ఐ.కె. యాగ్నిక్, జి.బి. దేశ్‌పాండేలతో కూడిన కమిటీని ఏర్పాటు గావించి దేశంలో అస్పృశ్యులుగా పరిగణించే వారందరి స్థితిగతులను మెరుగుపర్చుటకు ఆచరణాత్మకమైన చర్యలు కలిగివుండే ఒక పథకాన్ని రూపకల్పన చేసి వచ్చే సమావేశం

ముందు ఆమోదం కొరకు వుంచాలి. ప్రస్తుతం ఈ కార్యక్రమం కోసం రెండు లక్షల రూపాయల నిధిని ప్రోగుచేయాలి."

ఈ తీర్మానాన్ని 1922 జూన్‌లో లక్నోలో జరిగిన అఖిల భారత కాంగ్రెస్ సంఘం ముందుంచడమైనది. ఇది రెండు లక్షల రూపాయలకు బదులుగా ప్రస్తుతం ఐదు లక్షల రూపాయలు అనే స్వల్ప సవరణతో యథాతథంగా ఆమోదించడమైనది. అస్పృశ్యుల కోసం గాంధీగారు, మరియు కాంగ్రెసు చేసిన పనిని సమీక్షించడానికై ఈ కార్యక్రమం ఎంత వరకు సఫలమైనది, ఏ మేరకు ఆచరణ యోగ్యమైనది మరియు ఏ విధంగా చర్యలు తీసుకోవడమైనదనే ప్రశ్నలు వేసుకోవడం ఆవశ్యం.

కార్యాచరణ సంఘం సమావేశమై ఎలాంటి తీర్మానం చేయకముందే ఆ కమిటీ సభ్యులు శ్రీ స్వామి శ్రద్ధానంద తన సభ్యత్వానికి రాజీనామా సమర్పించడమైనది. కార్యాచరణ సంఘం యొక్క అదే సమావేశంలో ఈ క్రింది మరొక తీర్మానాన్ని ఆమోదించడమైనది.

"స్వామి శ్రద్ధానంద జూన్ 8, 1922 తేదీలో వ్రాసిన ఉత్తరంలో విశదపరచినట్లుగా బలహీన వర్గాలకోసం ఉద్దేశింపబడిన పథకాన్ని రూపొందించడానికి అడ్వాన్సు ఇవ్వాలి. ఇందుకై శ్రీ గంగాధరరావు, శ్రీ బి. దేశ్‌పాండేలుకన్వీనర్‌గా ఉండేటట్లు ఒక ఉపసంఘాన్ని ఏర్పరచి సాధ్యమైనంత త్వరగా ఇందునిమిత్తమై ఒక సమావేశాన్ని ఏర్పాటు గావించి "దానిలో స్వామి శ్రద్ధానంద ఉత్తరాన్ని పరిశీలనకై ఉంచాలి.

బొంబాయిలో 1922 జూలైలో మళ్లీ వర్కింగ్ కమిటీ సమావేశ పరచి ఈ దిగువ తీర్మానం చేసింది.

"కార్యదర్శిగారు స్వామి శ్రద్ధానందను తన రాజీనామా ఉపసంహరణకై పునర్విచారణ చేయాలని కోరుతూ, బలహీన వర్గాల ఉపసంఘానికి కన్వీనర్ అయిన శ్రీ జి.బి. దేశ్‌పాండేకు ఆగంతుక ఖర్చుల నిమిత్తము రూ.॥ 500/- లు ఇవ్వవలెను."

బలహీన వర్గాలకు సంబధించిన బార్డోలి కార్యక్రమములోని అంశం గురించి ఏమీ

చేయకుండానే 1922 గడచిపోయింది. 1923 వచ్చినది. గయలో 1923 జనవరిలో వరిలాగ్ కమిటీ సమావేశమై ఈ దిగువ తీర్మానం చేసింది.

"స్వామి శ్రద్ధానంద రాజీనామాకు సంబంధించి బలహీన వర్గాల ఉప సంఘంలోని మిగిలిన ఇతర సభ్యులు ఒక ఉపసంఘంగా ఏర్పడి శ్రీ యాగ్నిక్ కన్వీనర్‌గా వ్యవహరించ వలసి ఉంటుంది."

1923 ఫిబ్రవరిలో బొంబాయినందు అఖిల భారత కాంగ్రెసు కమిటీ సమావేశమై ఇంతవరకు ఏమీ చేయలేదని తలంచి దిగువ తీర్మానాన్ని చేసింది.

"అస్పృశ్యుల స్థితిగతులకు సంబంధించిన సమస్య విషయంలో కార్యాచరణ సంఘం తగిన చర్యలు తీసుకొనవలసినదిగా తీర్మానం గావించుట జరిగినది."

కార్యాచరణ సంఘం అప్పుడు ఏమి చేసిందంటే ఏప్రిల్ 17, 1923లో పూనాలో సమావేశమై ఈ క్రింది విధంగా తీర్మానించింది.

"అస్పృశ్యులుగా పరిగణించబడే వారి విషయంలో ఇతరుల ప్రవర్తనలో కొంత మెరుగు పరిస్థితులు కాంగ్రెసు విధానాల ద్వారా ప్రభావితం అయ్యాయని భావిస్తూ చేయాల్సినది ఇంక చాలా వుంది కనుక హిందూ సమాజం ఈ విషయమై తీవ్రంగా ఆలోచించాలి. హిందూ సమాజంలోని ఈ చెడును నిర్మూలించుటకు అఖిల భారత హిందూ మహాసభ తగిన చర్యలు తీసుకొనవలసినదిగా కోరడమైనది."

ఈ విధంగా గాంధీగారు మరియు కాంగ్రెసు అస్పృశ్యుల విషయంలో రూపొందించిన నిర్మాణాత్మక కార్యక్రమం ముగిసినది. అస్పృశ్యులకు బార్డోలి కార్యక్రమం ఏరూపం గానూ విప్లవాత్మకమైన కార్యక్రమం కాదు. అస్పృశ్యత నివారణకు ప్రయత్నించింది కాని కుల వ్యవస్థను ఛేదించుటకు కృషి సల్పలేదు. కులాంతర వివాహాలు మరియు సహభోజనాల గురించి ప్రస్తావన లేదు. అస్పృశ్యుల కోసం ప్రత్యేక బావులు మరియు పాఠశాలలు అనే సూత్రాన్ని అంగీకరించినది. ఇది కేవలం పరిస్థితుల మెరుగుదల కార్యక్రమం మాత్రమే. ఇది ఏమాత్రం కష్టతర కార్యక్రమం కాకపోయినప్పటికి కాంగ్రెసు

దీనిని అమలు పర్చడంలో విఫలం చెందినది.

ఇచ్చట మనము ఇంకా గుర్తుంచు కొనవలసిన దేమిటంటే ఇది కాంగ్రెసు యుద్ధ పంథాలో ఉన్న సమయం. బ్రిటీషు సామ్రాజ్యవాదాన్ని ప్రతిఘటించుటకు కృతనిశ్చయంతో అన్ని వర్గాల ప్రజలను తనకనుకూలంగా మార్చుకొని వారు బ్రిటీషు వారితో అనుకూలంగా మారకుండా కాంగ్రెసు ఆతృతతో ఎదురు చూచుచున్న సమయం. వారు ముస్లింల 'రక్షణకు తగిన అభయం ఇచ్చి ఆదుకున్నట్లుగానే అస్పృశ్యులుగా పరిగణించబడేవారిని కూడా ఆదుకోవలసిన పరిస్థితి. హిందువులు అస్పృశ్యుల పట్లగల ఏహ్యాభావాన్ని విడనాడి వారికి తగిన సేవ చేయాలనే తలంపుకు ఇంతకంటే మంచి సమయం లభించదు. కాని ఇలాంటి సదవకాశం కూడా కాంగ్రెసు వారిని అస్పృశ్యుల కోసం చిన్న పని చేయుటకు పురికొల్పలేక పోయింది. స్వాతంత్ర్య సిద్ధి అనే మహత్తర ఆనందంలో కూడా అస్పృశ్యుల పట్ల హిందువులలో కరడుగట్టిన హేయమైన భావాలు సమసి పోలేదు. కాంగ్రెసు వారు అస్పృశ్యులకై తలపెట్టిన కార్యక్రమాన్ని సఫలీకృతం చేయలేనటువంటి సిగ్గుపడే పరిస్థితులలో దానిని అచ్చటనే వదలి వేయడం వల్ల అస్పృశ్యులు ఇంకా దయనీయమైన స్థితికి దిగజారి పోయినారు.

అస్పృశ్యులను ఉద్ధరించే పనిని నికృష్టమైన చేతులకు అప్పగించకుండా ఉండవలసినది. అస్పృశ్యత సమస్యను పరిష్కరించడానికి పనికిరానివారి గురించి వివరించవలెనంటే మొదటగా హిందూ మహాసభను ప్రస్తావించవలసి వుంటుంది. అది ఒక హిందువుల తీవ్రవాద సంస్థ. దానియొక్క లక్ష్యం మరియు ఉద్దేశ్యం హిందూ మతం మరియు సంస్కృతికి సంబంధించిన ప్రతిదానిని సంరక్షించుట. ఇది ఒక సాంఘిక సంస్కరణ సంస్థ కాదు. ఇది కేవలం ఒక రాజకీయ సంస్థ మరియు దానియొక్క ప్రముఖ ఆశయం భారత రాజకీయాలలో ముస్లింల ప్రభావాన్ని అరికట్టుట. కేవలం దానియొక్క రాజకీయ శక్తిని సంరక్షించుకొనుటకు సాంఘిక ఐక్యతను వాంఛిస్తున్నదే కాని కులం గురించి గాని అస్పృశ్యత గురించి గాని ఈ సాంఘిక ఐక్యత ప్రవచించుట లేదు. మరి ఇలాంటి సంస్థను కాంగ్రెసు అస్పృశ్యత నివారణ కార్యక్రమానికి ఏవిధంగా ఎంపిక చేసుకొన్నదో నాకు అవగతమవుటలేదు. దీనిని బట్టి కాంగ్రెసు తమకు అసౌకర్యమైన ఈ సమస్యను ఏదో విధంగా వదిలించుకొని చేతులు దులుపుకున్నదని స్పష్టమవుతుంది. కాంగ్రెసు ఒక

విశిష్టమైన తీర్మానాన్నిచేసి ఎలాంటి ఆర్థిక వనరులను ఏర్పాటు చేయకుండానే హిందూ మహాసభకు ఆ కార్యక్రమాన్ని అప్పగించినది. కాని ఆ సభ దానిని అమలు చేయుటకు ముందుకు రాలేదు. అందువలన ఈ పథకం అస్తవ్యస్తమై, అనామకంగా అంతరించి పోయింది. అయినను వేలాది మంది కాంగ్రెసు వాదులు అస్పృశ్యత గురించి తామెంతో కృషిసల్పినట్లు చెప్పుకొనుటద్వారా అసత్య ప్రచారాన్ని నమ్మారు. మరియు గాంధీగారి స్నేహితుడైనటువంటి చార్లెస్ ఎఫ్. ఆండ్రూస్ అనే విదేశస్థుడు పాశ్చాత్య ప్రపంచంలో దీనిని తెలియపరచి గాంధీగారికి విశేష ఖ్యాతిని సమకూర్చడమే తన జీవిత ధ్యేయంగా పెట్టుకొన్నాడు.[3]

ఈ కార్యక్రమం ఎందుకు విఫలం అయినదో మరియు ఎందుచేత అంతరించిందో తెలుసుకొన్నంత మాత్రాన సరిపోదు. నిర్దేశించబడిన సంఘానికి శ్రీ స్వామి శ్రద్ధానంద ఎందుకు రాజీనామా సమర్పించినాడో మరియు ఏకారణం చేత తన సేవలను అందించుటకు విముఖత చూపినాడో తెలుసుకొనుట అవసరం. ఇందుకు ఒక మంచి కారణం ఉండి తీరాలి. శ్రీ స్వామి శ్రద్ధానంద అత్యంత సంస్కారవంతుడైన ఆర్య సమాజస్థుడు. మరియు అస్పృశ్యతను నిర్మూలించవలెననే దృఢమైన నమ్మకం కలవాడు. ఈ విషయంలో అఖిల భారత కాంగ్రెసు సంఘం జనరల్ సెక్రటరీకి మరియు స్వామీజీకి మధ్య నడచిన ఉత్తర ప్రత్యుత్తరాలు కాంగ్రెసు వారి మనస్తత్వాన్ని వ్యక్తపరుస్తాయి. ఆ విషయాన్ని సమూలంగా ఇచ్చుట పొందు పర్చుటకు నేను క్షమాపణ కోరనవసరం లేదు.

## స్వామీజీ యొక్క ఉత్తరాలు

జనరల్ సెక్రటరీ గారికి,

అఖిల భారత కాంగ్రెస్ కమిటీ,

ఢిల్లీ క్యాంప్.

అస్పృశ్యత గురించి కార్యచరణ సంఘం మరియు అఖిల భారత కాంగ్రెసు సంఘం రూపొందించిన తీర్మానాలు మీ లెటర్ నెంబర్లు 331 మరియు 332 ద్వారా అందినవి.

అందుకు కృతజ్ఞతలు. అఖిల భారత కాంగ్రెసు సంఘం చేసిన తీర్మానాలలోని ప్రస్తుతమున్న పదజాలంలో వర్కింగ్ కమిటీ ఆమోదించినదంతా లేకపోవుట చాలా బాధాకరంగా అన్పించుచున్నది.

వాస్తవాలు ఈ విధంగా నున్నాయి. దిగువ పొందుపరచిన ఉత్తరాన్ని నేను 23 మే 1922 నాడు జనరల్ సెక్రటరీ అయినటువంటి శ్రీ విట్టల్‌భాయ్ పటేల్‌కు పంపాను. దీనిని దేశంలోని ప్రముఖ వార్తా పత్రికలన్నీ ప్రచురించినవి.

ప్రియమైన మిష్టర్ పటేల్, అస్పృశ్యత అనే సమస్యను గాంధీగారు కాంగ్రెసు కార్యక్రమాలలో ప్రప్రథమమైనదిగా పేర్కొన్న రోజులుండేవి (యంగ్ ఇండియా - 25 మే 1921 ప్రకారం) కాని బలహీన వర్గాల సమస్యను ప్రస్తుతం పట్టించుకోకుండా మూలకు పడవేయడం జరిగినదని నా భావన. ఒకవైపు ఖాదీకి విశిష్ట ప్రాధాన్యతను ఇచ్చి దానికై ఉదారంగా నిధులను సమకూర్చుట జరిగినది. ఇంకొకవైపు జాతీయ విద్యావిధానానికి మరియు అందుకవసరమైన ప్రత్యేక నిధుల సమీకరణకు ఒక పటిష్ఠమైన ఉప సంఘాన్ని ఏర్పాటు కావించినారు. కాని అస్పృశ్యత నిర్మూలన సమస్యలకై అహ్మదాబాద్, అహ్మద్ నగర్ మరియు మద్రాసు పట్టణాలకు స్వల్ప నిధులను మాత్రమే కేటాయించినారు. అస్పృశ్యులుగా పరిగణించే అధిక సంఖ్యాకులైన ఆరు కోట్ల సోదరులు ఉద్యోగస్వామ్య విధానాలకు వ్యతిరేకులగుటచే ఖాదీ పథకం కూడా విఫలం అవుతుందని నా భావన. మన బలహీన వర్గాల సోదరులు ఖాదీని విడనాడి ఇంకా తక్కువ ధరకు లభించే విదేశీ వస్త్రాలను కొనుగోలు చేస్తారనే విషయం బహుశా మన వర్కింగ్ కమిటీ సభ్యులకు అవగాహన కాకపోవచ్చు. జూన్ 7న లక్నోలో జరుగబోయే అఖిల భారత కాంగ్రెసు కమిటి సమావేశంలో నేను ఈ దిగువ తీర్మానాన్ని ప్రవేశపెట్టదలచినాను.

"దళిత వర్గాల గురించి ప్రతిపాదించిన తీర్మానాలను ఆచరణాత్మకం చేయుటకు అఖిల భారత కాంగ్రెసు కమిటీ ముగ్గురు సభ్యులచే ఒక ఉప సంఘాన్ని ఏర్పరచి అస్పృశ్యతా నివారణ ప్రచార కార్యక్రమాన్ని కొనసాగించుటకు అయిదులక్షల రూపాయలు కేటాయించి భవిష్యత్‌లో విరాళాల కోసం వచ్చే దరఖాస్తులన్నీ ఈ ఉప సంఘం పరిశీలించి నిర్ణయాలు తీసుకోవలసి ఉంటుంది."

నా ప్రతిపాదనను కార్యాచరణ సంఘం సవరణ చేయగా అది ఈ విధంగా నున్నది.

"యావత్ భారత దేశంలోని అస్పృశ్యుల స్థితిగతులను మెరుగు పర్చుటకు తీసుకోవాల్సిన ఆచరణాత్మక కార్యక్రమాలతో కూడిన ఒక కార్యాచరణ పథకాన్ని రూపొందించి, రానున్న వర్కింగ్ కమిటీ సమావేశం పరిశీలనకై స్వామి శ్రద్ధానంద, శ్రీమతి సరోజిని నాయుడు మరియు సర్వశ్రీ జి.బి. దేశ్‌పాండే మరియు ఐ.కె. యాజ్ఞిక్‌లతో కూడిన ఒక కమిటీని ఏర్పాటు చేసి ఈ పథకానికై ప్రస్తుతం 2 లక్షల రూ॥లను ప్రోగుచేయవలసి ఉంటుంది."

శ్రీ పటేల్ గారు కార్యాచరణ సంఘం తీర్మానాన్ని యదాతథంగా అంగీకరించమని నన్ను కోరినారు. కాని నేను వర్కింగ్ కమిటీ తీర్మానాన్ని అంగీకరించుటకు నిరాకరించినాను. అఖిల భారత కాంగ్రెసు కమిటీ మొదటి సదస్సులో 2 లక్షల రూ॥ లకు బదులుగా 5 లక్షల రూ॥ లుగా మార్పుచేస్తూ, దాని నిధులనుండి ఒక లక్ష రూ॥ లను నగదు రూపంలో మంజూరు చేయమని మిగతా మొత్తాన్ని విడుదల చేయుటకు విజ్ఞాపన చేయడమైనది.

వర్కింగ్ కమిటీ తరపున శ్రీ రాజగోపాలాచారి గారు కాంగ్రెసు కమిటీ నిధుల నుండి నిర్ణీత మొత్తం కేటాయించాలని ప్రస్తుతం నిర్ణయించుటకంటే ఈ పథకాన్ని ఆమోదించినపుడే ఇందుకై ఇవ్వగలిగినంత నగదును సమకూర్చవలెనని ప్రతిపాదన చేసినారు. అప్పటి మాటలు యథాతథంగా జ్ఞప్తికి రావటం లేదు. కాని సవరణ సమర్థించబడినదనేది సత్యం.

ఈ విషయం తర్వాత అఖిల భారత కాంగ్రెసు కమిటీ చేతిలో నగదు నిల్వ ఎంత ఉన్నదో ప్రకటించ వలసినదిగా అన్ని వైపులనుండి అలజడి మరియు ప్రశ్నలు తలెత్తినవి. కాంగ్రెసు అధ్యక్షుడు నన్ను పిలిచి గోప్యంగా అఖిల భారత కాంగ్రెసు కమిటీ వద్ద అతిస్వల్ప నగదు నిల్వలు ఉన్నాయని కావాలంటే అసలు పరిస్థితిని విశదపరచగలనని, కాని ఇది ఇతరులకు మరియు సి.ఐ.డి. వ్యక్తులకు తెలిసిపోయినచో ఉద్యమానికి ప్రమాదకరమని తెలియజేసినాడు. నా ప్రతిపాదనను బలపరచినవారు మరియు నన్ను సమర్థించినవారు అభ్యంతరం తెలిపి నప్పటికి నేను శ్రీ రాజగోపాలాచారి సవరణకు ఆమోదం తెలిపినాను. కాని అటు తర్వాత దిన పత్రికలలో వెలువడిన తీర్మానపు నివేదికలో సవరణ కన్పించక

పోవుటచే నాకు ఆశ్చర్యం కల్గినది.

పై తీర్మానం ఆమోదించిన తర్వాత దళిత వర్గాల కొరకు ఏర్పరచిన కమిటీ కొరకు కన్వీనర్‌ను నియమించాలని అనేకమంది సభ్యులు నన్ను కన్వీనర్‌గా కొనసాగాలని ప్రతిపాదించగా ఆనాటి జనరల్ సెక్రటరీ అయిన శ్రీ విఠల్‌భాయ్ పటేల్ లేచి ఈ విధంగా పల్కినారు. "శ్రీ స్వామి శ్రద్ధానంద పేరు ముందు ఉండుటచే సహజంగానే అతడు కన్వీనర్‌గా కొనసాగుతారు. ఇందుకోసం నూతన తీర్మానం చేయనవసరం ఎంతమాత్రం లేదు."

దేశంలోని అనేక ప్రాంతాల నుండి అచ్చటి అస్పృశ్యుల గురించి వివరాలు అందజేస్తూ నన్ను ఆ ప్రాంతాలు సందర్శించ వలసిందిగా వత్తిడి చేసినారు. ఈ విషయంలో నేను వాగ్దానాలు చేసినాను. కాని అటుతర్వాత ఎలాంటి ఆర్థిక వనరులు లేకుండా ప్రాథమిక విచారణకు గాని, తగిన కార్యాచరణ పథకాన్నిగాని చేపట్టుట సాధ్యం కాదని భావించుట జరిగింది. అలహాబాద్‌లోని "ది ఇండిపెండెంట్" పత్రికకు రూ॥ 25,000 /-లు మరియు ఢిల్లీలోని ఉర్దూ దినపత్రిక అయిన "కాంగ్రెసు" కు రూ॥ 10,000/- లు కేటాయించ వలసినదిగా శ్రీ హకీం ఆజ్మాల్‌ఖాన్ మరియు డా॥ అన్సారీలు దరఖాస్తు చేయగా వర్కింగ్ కమిటీ ఆమోదించినట్లుగా తెలిసినది. దీనిని పురస్కరించుకొని అస్పృశ్యుల కోసం ఏర్పాటు చేసిన సబ్-కమిటీ ప్రాథమిక ఖర్చుల కోసం అడ్వాన్సుగా రూ॥ 10,000/-లు ఇవ్వవలసినదిగా అధ్యక్షునికి లేఖ ద్వారా అభ్యర్థన చేసినాను.

దీనిని పురస్కరించుకొని వర్కింగ్ కమిటీ తీర్మానం చాలా ఆసక్తికరంగా నున్నదని మీరు పంపిన లెటరు నెం. 331 ద్వారా తెలిసినది.

"శ్రీ గంగాధర్‌రావు జి. దేశ్‌పాండేను దళిత వర్గాల సబ్‌కమిటీకి కన్వీనర్‌గా నియుక్తుణ్ణి చేసి అతనితో సాధ్యమైనంత త్వరగా సమావేశం ఏర్పాటు గావించి జూన్ 8, 1922 నాడు శ్రీ స్వామి శ్రద్ధానందగారు వ్రాసిన ఉత్తరాన్ని సబ్‌కమిటీలో సమీక్షించవలె". ఇచ్చట వివరించరానటువంటి విషయం ఒకటి కలదు. నా మొదటి ఉత్తరం అందినట్లుగా తెలిసినది. అటు తర్వాత నేను 3 జూన్, 1922 నాడు హరిద్వార్ నుండి ఈ దిగువ ఉత్తరం

పంపినాను.

"ప్రియమైన పటేల్‌గారు, నేను హరిద్వార్ నుండి ఎల్లుండి బయలుదేరి జూన్ 6 ఉదయం లక్నో చేరుకుంటాను. నేను ప్రస్తుతం దళిత వర్గాల గురించి చాలా ఆందోళన చెందుతున్న విషయం మీకు తెలుసు. కనీసం పంజాబ్‌లో కూడా ఇట్టి విషయమై నిర్మాణాత్మక కార్యక్రమంలో ఒక భాగంగా ఏమాత్రం ఆసక్తిని చూపినట్లుగా నాకు కన్పించుట లేదు. ఉత్తరప్రదేశ్‌లో ఇది చాలా కష్టతరమైన పని. కాని ఇచ్చట ఇంకొక చాలా జటిలమైన సమస్య ఉన్నది.

"బార్డోలి కార్యక్రమంలోని అంశం నాల్గు ప్రకారం వివక్షత అధికంగా ఉన్న ప్రాంతాలలో ప్రత్యేక బావులు మరియు పాఠశాలలు ఏర్పాటుచేసి కాంగ్రెస్ నిధులతో వాటిని నిర్వహించ వలసి వున్నది. కాని దీనిలో ఒక లోపం వున్నది. వివక్షతను పాటించే కాంగ్రెస్ కార్యకర్తలు దళితుల పట్ల అయిష్టతను కల్గి ఈ పనిపట్ల ఉత్సాహాన్ని చూపుటలేదు. పైగా అస్పృశ్యులను సాధారణ బావులలో నీరుతెచ్చుకొనుటకు అనుమతించుటలేదు. బిజునూర్ జిల్లాలో ఇలాంటి వివక్షతను పాటించ కుండా అస్పృశ్యులు అందరూ వినియోగించే బావులను వినియోగించుకొంటున్నారని నాకు తెలిసినది. అయితే బార్డోలి తీర్మానాన్ని పురస్కరించుకొని కొన్ని ప్రాంతాలలో గతంలోలేని వివక్షత తలెత్తు ,చున్నది. నేను ఇటీవల దర్శించిన అంబాలా కంటోన్మెంట్, లూధియానా, బాటాలా, లాహెూర్, అమృతసర్ మరియు జంధ్యాలలో అస్పృశ్యులకున్న అసౌకర్యాలను తొలగించుటను విస్మరించినట్లుగా గోచరమైనది. ఢిల్లీలో మరియు సమీప ప్రాంతంలో నా అధ్యక్షతన గల 'దళితోద్ధరణ సభ' కాంగ్రెస్ వారికంటే ప్రశంసనీయమైన కృషి చేయుచున్నది. నా ఉద్దేశ్యం ప్రకారం బార్డోలి కార్యక్రమంలోని నాల్గవ అంశాన్ని తగిన విధంగా సవరణ చేయకపోయినట్లయితే కాంగ్రెస్ కార్యక్రమాలు అధికంగా నిరూపయోగం అయ్యే ప్రమాదం కలదు."

అధ్యక్షుని ముందు దిగువ ప్రతిపాదనలు దయచేసి ఉంచి, జరుగబోయే అఖిల భారత కాంగ్రెస్ కమిటీ సమావేశంలో వాటిని అతను అనుమతించినట్లయితే నేను బార్డోలి తీర్మానంలోని అంశం నాల్గుకు ప్రత్యామ్నాయంగా దళిత వర్గాల కోర్కెల సాధనకు ఒక నోటు సమర్పించ దలచినాను. ఆ సవరణలు ఈ విధంగా వుంటాయి.

(ఎ) ఇతర వర్గాల పౌరులతో సమానంగా వారుకూడా అదే వేదికపై ఆశీనులగుటకు అనుమతించాలి.

(బి) అందరూ వినియోగించే బావులను వాడుకొనే హక్కును కల్పించాలి.

(సి) దళితుల పిల్లలకు జాతీయ పాఠశాలలు మరియు కళాశాలలలో ప్రవేశం కల్పించి కులస్థులుగా భావించబడే విద్యార్థులలో స్వేచ్ఛగా కలసిపోయే అవకాశం కల్పించాలి.

ఈ విషయాలను అఖిలభారత కాంగ్రెస్ కమిటీ సభ్యులు ప్రాధాన్యత ఇచ్చే విధంగా వారిని ప్రభావితం చేయదలచినాను. ఈ హక్కులను కల్పించక పోయినట్టయితే వున్నత వర్గాలపై తిరుగుబాటు చేస్తూ పరాయి పాలకుల మోసాలకు, ఉద్యోగి స్వామ్యపు యంత్రాంగం యొక్క అనుచిత ప్రభావానికి లోనయ్యే అవకాశాలు కల్గవు. లక్నోలో జూన్ 7 నాడు జరిగిన అఖిల భారత కాంగ్రెస్ కమిటీ సమావేశంలో నా మొదటి ప్రతిపాదనను ఆమోదించిన తర్వాత శ్రీ పటేల్‌ను బార్డోలి కార్యక్రమపు అంశం 4 కు సంబంధించిన సవరణను సమావేశం ముందుంచమని కోరినాను. వర్కింగ్ కమిటీయే సబ్‌కమిటీకి నివేదిస్తుందని ఇట్టి విషయమై తనను వత్తిడి చేయరాదని అతను నాకు చెప్పినాడు. దీనికి నేను అంగీకరించినాను. కాని వర్కింగ్ కమిటీ సబ్‌కమిటీకి అస్పృశ్యత గురించి పంపిన ప్రతిపాదన విషయమై నాకు ఎలాంటి తీర్మానపు ప్రతి అందలేదు.

ఢిల్లీ మరియు పరిసర ప్రాంతాలలో అస్పృశ్యతా సమస్య చాలా తీవ్రంగా నుండుటచే దీని గురించి మరొకసారి ఆందోళన చెందినాను. వర్కింగ్ కమిటీ దేశంలోని ఇతరములైన అనేక రాజకీయ పరిస్థితులకు ప్రాధాన్యత ఇస్తూ కాంగ్రెస్ తరపున అస్పృశ్యతా నివారణకు రాజకీయ మార్గాలు కనుగొనుటలో వెనుకంజ వేయుట వలన సబ్‌కమిటీ అసంపూర్ణంగా ఈ పనిని చేపట్టలేక పోయినది. అందువలన ఈ పరిస్థితులలో నా వలన సబ్‌కమిటీకి ఏమాత్రం ప్రయోజనం లేదని భావిస్తూ, సబ్‌కమిటీ సభ్యత్వానికి రాజీనామా చేస్తున్నాను.

స్థలం : ఢిల్లీ, మీ విధేయుడు

తేది : జనవరి, 30 శ్రద్ధానంద సన్యాసి

సెక్రటరీ యొక్క సమాధానం

ప్రియమైన స్వామీజీ,

మీరు వ్రాసిన జూన్1922 నాటి ఉత్తరం నా కార్యాలయానికి అదే నెలలో 30 నాడు అందింది. జూన్18 నాడు బొంబాయిలో జరిగిన వర్కింగ్ కమిటీ సమావేశపు తీర్మానపు ప్రతిలో వాస్తవాలు వివరిస్తూ మీరు సమర్పించిన రాజీనామా గురించి పునర్విచారణ చేయవలసినదిగా మమ్ములను కోరమని నన్ను ఆదేశిస్తూ ఉత్తరం వ్రాసినారు.

నేను జైలు నుండి విడుదల కాకముందు ఏమి జరిగినదో నాకు తెలియదనే విషయం మీకు అవగతమే. దేశ్‌పాండేగారిని దళితవర్గాల సబ్‌కమిటీకి కన్వీనర్‌గా నియమించుటకు 10-6-1922 నాడు జరిగిన వర్కింగ్ కమిటీ సమావేశంలో నేను కూడా ఉన్నాను. అపుడు ఫలానా వ్యక్తి సబ్‌కమిటీకి కన్వీనర్‌గా కొనసాగవలెననే అవగాహన ఏదీ కుదరలేదు. కాని సొమ్ము చెల్లింపు విషయంలో అవసరమైన లాంఛనాలన్నీ పూర్తి చేయుటకు మొత్తం తీర్మానాన్ని ఆమోదించడమైనది. ఏవిధమైన ఖర్చుల వినియోగానికైనను సబ్‌కమిటీ యొక్క ఆమోదం తెలిపే లాంఛన ప్రాయమైన తీర్మానం జరుగవలెనని భావించడమైనది. ప్రాధమిక ఖర్చులను భరించుటకు రూ॥లు 500/- కేటాయిస్తూ అందుకై దేశ్‌పాండేను తదనుగుణంగా కన్వీనర్‌గా నియమించడమైనది. కాని పొరపాటు వలన ఈ విషయాన్ని దానిలో పేర్కొనుట జరుగలేదు. వాస్తవానికి వర్కింగ్ కమిటీలో అస్పృశ్యతా నివారణ కొరకు రూ॥ 10,000/- లు అనుమతించడం పట్ల ఎలాంటి అయిష్టత లేదు. మీరు ప్రారంభించిన కార్యక్రమం యొక్క ప్రాధాన్యతను అవగాహన చేసుకున్నాము. మీయొక్క విలువైన సలహాలు, సూచనలు ఎపుడు విస్మరించుట జరుగదు. లోగడ పరిగణింప బడని రూ॥ 500/-లు గ్రాంటును మొన్నటి వర్కింగ్ కమిటీ సమావేశం ముందుంచబడినది.

మరియు ఇట్టి విషయాన్ని మీకు తెలియజేయ వలసిందిగా ఆదేశించడమైనది. అస్పృశ్యత గురించి మీకున్న అవగాహనను సబ్‌కమిటీ సక్రమంగా వినియోగించుకొనక పోవుట చాలా విచారకరం. ప్రజాహితాన్ని దృష్టిలో ఉంచుకొని మీరు రాజీనామాను ఉపసంహరించుకొనవలెనని కోరుతున్నాను. ఈ ఉపసంహరణ విషయం అలహాబాద్‌లోని నా ఆఫీసుకు తంతి ద్వారా తెలియజేయ గలరు. మీరు సబ్‌కమిటీలో చేసిన తీర్మానాలకు వర్కింగ్ కమిటీ తగిన ప్రాధాన్యతనిచ్చి తగిన శ్రద్ధ వహించగలదని విశ్వసనీయంగా తెలియపరుచు చున్నాను.

సబ్‌కమిటీలో ప్రత్యేక బావులు మరియు పాఠశాలల గురించి చేసిన తీర్మానపు సవరణలను వర్కింగ్ కమిటీలో తగిన విధంగా సవరణాత్మక తీర్మానాలను ఆమోదించుట జరుగుతుంది.

అలహాబాద్‌లోని 'ది ఇండిపెండెంట్' మరియు ఢిల్లీలోని 'ది కాంగ్రెస్' పత్రికలకు మంజూరు చేసిన గ్రాంటుల విషయంలో మీరు అపార్థం చేసుకొన్నారని భీతి చెందినాను. మొదటి దానికి ఉత్తరప్రదేశ్ ప్రొవిన్షియల్ కమిటీ దరఖాస్తు ననుసరించి గత గ్రాంటుల నుండి రూ॥ 25,000/- లు 'నేషనల్ జర్నలిస్టుల లిమిటెడ్' కు మంజూరు చేయడమైనది. రెండవ దానికి సంబధించిన అప్పుకై గ్రాంటును పూర్తిగా తిరస్కరించడమైనది.

మీ విధేయుడు

మోతీలాల్ నెహ్రూ

జనరల్ సెక్రటరీ.

బొంబాయి,

23 జులై, 1922.

## స్వామీజీ యొక్క ప్రత్యుత్తరం

ప్రియమైన పండిట్ మోతీలాల్ జీ,

అస్పృశ్యతా ఉప సంఘానికి, నేను సమర్పించిన రాజీనామా విషయమై బొంబాయినుండి జులై 23, 1922 తేదినాడు వ్రాసిన ఉత్తరం అందినది. నా మొదటి ఉత్తరంలో పేర్కొన్న అంశాలను అనుచితంగా విస్మరించుటచే నా రాజీనామా విషయమై పునరాలోచన లేదని తెలియచేయుటకు చింతించుచున్నాను.

1) కార్యాచరణ సంఘంచే ఆమోదింపబడిన ఉపసంఘం యొక్క కార్యాచరణ ప్రణాళికను అమలు పరచుటకు అస్పృశ్యతా విభాగానికి అఖిల భారత కాంగ్రెసు కమిటి నిధులనుండి సాధ్యమైనన్ని నిధులను కేటాయించవలసినదిగా మొదటగా కోరినాను. అటు తర్వాత కనీసం ఒక లక్ష రూపాయలు కేటాయించుటకు సవరణ ప్రతిపాదనను ప్రవేశపెట్టమని కోరగా శ్రీరాజగోపాలాచారి గారు ఎందుకు అనుమతించలేదో దయచేసి విచారించగలరు. అటు తర్వాత అధ్యక్షుల వారు ఆర్థిక పరిస్థితి సక్రమంగా లేదని నాకు తెలియజేసినారు. విషయాలు ఈ విధంగా ఉండగా నా సవరణ ఎందుకు తీర్మానంలో చోటు చేసుకోలేదో తెలియజేయగలరు.

2) అఖిల భారత కాంగ్రెసు కమిటీ సభ్యులు నన్ను ఉప సంఘానికి కన్వీనర్‌గా ప్రతిపాదించలేదా? అందుకు విఠల్‌భాయ్ పటేల్ తిరస్కరించలేదా? స్వామి శ్రద్ధానంద పేరు మొదటగా ఉండుటచే అతనే కన్వీనర్‌గా కొనసాగుతాడని, ఇందుకై క్రొత్త ప్రతిపాదన చేయనవసరం లేదని అతను తెలయచేసినాడు. ఈ విషయాన్ని నేను డాక్టరు అన్సారీతో విచారించగా అతను జూన్ 17, 1922 నాడు వ్రాసిన ఉత్తరంలో నేను కన్వీనర్‌గా నియమితుడైనట్లు తెలిసినది. డాక్టర్ అన్సారీ మీ వద్దనే ఉండుటచే అతనితో విచారించగలరు. బహుశా శ్రీ పటేల్‌గారు ఈ విషయాలన్నీ మరచిపోయి ఉండకపోవచ్చు.

3) అస్పృశ్యత గురించి తక్షణమే పనిని ప్రారంభించవలసిన ఆవశ్యకత అధికంగా ఉండుటచే, కారణాలు ఏమైనప్పటికీ దానిని జాప్యం చేయలేను. దయచేసి రాబోయే వర్కింగ్ కమిటీ సమావేశంలో నా రాజీనామాను ఆమోదించగలరు. తత్ఫలితంగా ఈ పనులనుండి స్వేచ్ఛను పొంది అస్పృశ్యత నివారణకై నా స్వంత కార్యక్రమాలను

ప్రారంభించగలను. జులై చివరినాటికి ఇది నాయొక్క స్థితి. అమృత్‌సర్ మరియు మెయిన్‌వాలి జైళ్లలో మరియు ఇతర విధాలుగా సేకరించబడిన సమాచారము ననుసరించి సనాతన ఆర్యనీతి ప్రకారం బ్రహ్మచర్యాన్ని పాటించకుండా సమాజసేవ సాధ్యం కాదు. భారతీయ సమాజంలో అస్పృశ్యత ఒక పరిణామంగా పరిణమించినది. కాంగ్రెసు కాని, దేశభక్తిని కలిగిన ఇతర వ్యవస్థలు కాని స్వరాజ్యం కోసం గట్టి కృషి సల్పుటలేదు. స్వరాజ్యం సిద్ధించనిదే జాతీయతను పెంపొందిచుటగాని జాతీయ స్వావలంబన జరగదు. అందువలన ఒక సన్యాసిగా నా శేషజీవితాన్ని నిజమైన జాతీయ సమైక్యత అనే పవిత్ర కార్యక్రమానికి అంకితం చేయదలచినాను.

ఢిల్లీ, శ్రద్ధానంద సన్యాసి.

జులై 23, 1992.

దీనివల్ల కాంగ్రెసు వాదుల హృదయం అస్పృశ్యుల అభ్యున్నతికి ఏమి చేయతలపెట్టినదో విశదమవుతుంది.

2

కాంగ్రెసు కార్యకర్తలు స్వచ్ఛందంగా ఏమి చేశారో చెప్పాము. గాంధీగారు లేదా కాంగ్రెసు వాదులు అస్పృశ్యుల అభ్యున్నతి కొరకు స్వతంత్రంగా పాటుపడే తమ స్వంత ప్రజలకు ఏమి చేశారో సమీక్షించవలసి ఉన్నది. అది అస్పృశ్యులు తమ అభివృద్ధి కొరకు వ్యక్తిగతంగా యుద్ధ ప్రాతిపదికపై పాటుపడుతున్న కాలం. పైగా హిందువులతో పౌర సహాయ నిరాకరణను పాటిస్తూ తమ పౌర మరియు సామాజిక హక్కుల కోసం పోరాడుతున్న సరిస్థితులు నెలకొని ఉన్నాయి. అదే సమయంలో బొంబాయి ప్రెసిడెన్సీలోని "అస్పృశ్యులు" "మహద్"లో చెఱువు నీళ్లు తెచ్చుకొనుటకు మరియు 'నాసిక్'లోని హిందూ దేవాలయంలోకి ప్రవేశం పొందుటకు సత్యాగ్రహం చేస్తున్నారు. హిందూ మతంలోని కులతత్వంపై అస్పృశ్యుల సత్యాగ్రహ ఉద్యమం ప్రారంభంపై గాంధీగారు ఏ విధంగా తమ దృష్టిని కేంద్రీకరించినారు? ఈవిషయంలో గాంధీగారి ప్రవర్తన ఎంతో అసంబద్ధంగా నున్నది.

మొదటి దశలో హిందువుల కులతత్వంపై అస్పృశ్యులు చేస్తున్న సత్యాగ్రహాన్ని గాంధీగారు ఖండించినారు. అతను ఆ విధంగా చేయకుండ ఉండాల్సింది. ఈ వ్యతిరేకత విషయంలో అస్పృశ్యులు చాలా తార్కికంగా ప్రవర్తించినారు. గాంధీగారి భావన ననుసరించి బ్రిటిష్ వారినుండి స్వాతంత్ర్యాన్ని పొందుటకు పౌరసహాయ నిరాకరణ ఉద్యమాన్ని న్యాయపరమైనదిగా పరిగణించినపుడు మరి హిందూ కులతత్వంపై అస్పృశ్యులు అదే విధంగా ఎందుకు పోరాడరాదనే విషయం అది ఎందుకు సమ్మతం కారాదనే అస్పృశ్యుల వాదన. కాని ఈ తార్కికమైన వాదనను గాంధీగరు అంగీకరించలేదు. అతను ఈ వాదనను తార్కికమైన వాదనతో కలిపే ప్రయత్నం చేశారు. అతని వాదన ప్రకారం అస్పృశ్యత అనునది హిందువులకు పాపంగా పరిగణించబడినది. ఇందుకై హిందువులు తగిన ప్రాయశ్చిత్తం చేసుకొనవలసి వున్నది. అస్పృశ్యులు పాపాత్ములు కారు కావున అటువంటి పాప సహితమైన పనికి వ్యతిరేకంగా సత్యాగ్రహం చేయుట వారి వ్యాపకం కారాదు. ఇది కులీన వ్యవస్థకు తగిన తర్కంగా భావించరాదు. ఇది కేవలం మహాత్ముని తార్కిక దృక్పథానికి నిదర్శనం. కాని మహాత్ముని తార్కిక వాదం ఏ మాత్రం పసలేనిది. ఇందుకు అస్పృశ్యులు ఈ విధంగా సమాధానం తెలియచేసినారు. "ఒకవేళ సత్యాగ్రహం అనునది పాపానికి ప్రాయశ్చిత్త ప్రక్రియ అయినపుడు హిందువులు ఎందుకు బ్రిటిష్‌వారికి వ్యతిరేకంగా సత్యాగ్రహాన్ని చేపట్టినారు? అందువలన బ్రిటిష్‌వారు తమ సామ్రాజ్యవాదానికి పరిహారంగా సత్యాగ్రహాన్ని చేయవలసి వుంటుంది. కాని హిందువులు ఆ విధంగా చేయరాదు కదా!" గాంధీగారి వాదనను అస్పృశ్యులు ఈ విధంగా నిరర్థకం చేసినారు. అందువలన హిందూ కులతత్వంపై అస్పృశ్యులు చేసే సత్యాగ్రహంపై గాంధీగారికి సదభిప్రాయం లేదని తేటతెల్లమవుతుంది. గాంధీగారు అస్పృశ్యులపట్ల కలిగిన అసంబద్ధమైన వాదనను అస్పృశ్యులు మార్చలేకపోయినారు.

మహాద్ మరియు నాసిక్‌లలో హిందూకులతత్వంపై అస్పృశ్యులు చేసిన సత్యాగ్రహాలపై గాంధీగారి మనోభిప్రాయాలలో అనుగుణ్యత లేకపోగా 'వైకమ్' అనే ప్రదేశంలో చేసిన సత్యాగ్రహం పట్ల కూడా గాంధీగారి అభిప్రాయాలలోని అసంబద్ధత వెల్లడి అవుతున్నది. 'వైకమ్'లోని సత్యాగ్రహానికి గాంధీ అనుకూలంగా యున్నారు. అతను తన ఆశీస్సులను అందిస్తూ ప్రోత్సహించినారు. కాని ఎందుచేత "మహాద్" మరియు "నాసిక్‌లలోని

సత్యాగ్రహాలను వ్యతిరేకించినారు? ఈ రెండింటి మధ్య ఏవిధమైన వ్యత్యాసమున్నది? అవును ఉన్నది. అదే వైకంలో అస్పృశ్యులు కాంగ్రెసు వారి అండదండలతో సత్యాగ్రహాన్ని చేయటమైనది. మిగతా రెండు కాంగ్రెసు వారితో నిమిత్తం లేకుండా స్వతంత్రంగా చేయడమైనది కదా! రెండింటి మధ్య ఈ వైవిధ్యాన్ని తొలగించుటకు గాంధీగారు ఏదైనా చేయవలసిన పనిలేదా! గాంధీగారు తగిన సమాధానం చెప్పకపోవుటచే దీనిని నేను పాఠకుల మంచి ఊహాగానాలకే వదిలి వేయుచున్నాను. బహుశా, ఏ గొఱ్ఱె పిల్లలైతే తనను గొఱ్ఱెల కాపరిగా అంగీకరించలేదో ఆ గొఱ్ఱెలను రక్షించుటకు గాంధీగారు ముందుకు రాకపోవచ్చు. ఎప్పుడైతే గాంధీగారు అస్పృశ్యులచే కొనసాగే సత్యాగ్రహ ఉద్యమానికి తన ఆశీస్సులను అందించుట లేదో అప్పుడు హిందూమత సాంప్రదాయ వాదులపై అస్పృశ్యులు సలిపే పోరులో కాంగ్రెసు వాదులు ముందుకు రావటంగాని, సహకారాన్ని అందించుటగాని జరగలేదని వ్యాఖ్యానించవచ్చు. వాస్తవంగా చూస్తే గాంధీగారి ఈ దృక్పథాన్ని బట్టి కాంగ్రెసు హిందువులు సంప్రదాయిక హిందువులతో మిళితమగుటకు అవకాశాలు ఏర్పడినవి. వారి మధ్యనున్న సంబంధ బాంధవ్యాలు వారిని మమేకం చేసి ఒక నిర్దిష్ట మౌన అవగాహనతో అస్పృశ్యులను ఎదుర్కొన్నారు. ఇది కేవలం గాంధీగారి యొక్క మోసకారి విధానమే కాకుండా అసంబద్ధత కలిగిన దృక్పథాన్ని వెల్లడిచేస్తుంది. హిందూ మతతత్వంపై జరిపే సత్యాగ్రహ సాధనలో హిందూయేతరుల సహాయ సహకారాలను నిషేధిస్తూ బహిరంగంగా వెలుగులోనికి వచ్చారు. అస్పృశ్యులకు సహాయ సహకారాలు అందించుటకు ముందుకు వచ్చిన మహ్మదీయులను, క్రిష్టియన్లను పార్శీలను మరియు యూదులను వ్యతిరేకించుటయేగాక హిందువులకు వ్యతిరేకంగా, తీవ్రవాదులుగా చలామణి అయ్యే సిక్కులను కూడా వ్యతిరేకించుట జరిగినది. మళ్లీ ఇచ్చట అసంగతమైన వాదనను చేపట్టి అస్పృశ్యత అనునది హిందూమత తత్వవాదుల పాపం అని వెల్లడిచేసినాడు. అందుకే వారుదానికి ప్రాయశ్చిత్తం చేసుకొనవలసి వుంటుంది. మన పాపపరిహారానికి ప్రాయశ్చిత్తం చేసుకుంటూ, పాపులు మాత్రమే సత్యాగ్రహం చేస్తూ అస్పృశ్యులకు సహాయం చేయవలసి వుంటుందని, అదివారి బాధ్యత అని తెలియచేసినాడు. అస్పృశ్యత విషయంలో మహమ్మదీయులు, క్రిష్టియన్లు, పార్శీలు మరియు యూదులు పాపాత్ములు కారని దానిని రూపుమాపుటకు చేయు సత్యాగ్రహాలకు వారు సహాయాన్ని అందించనవసరం లేదని వెల్లడించినాడు. బహుశః గాంధీగారు దీనిని అస్పృశ్యత దృష్ట్యా చూడకపోవచ్చు. ఇది

హిందూ మతపు పాపం కాదని వారు అస్పృశ్యతకు బానిసలని గాంధీగారు భావించక పోవుట జరిగినది. ఒక వేళ పాపాత్ములు తగిన ప్రాయశ్చిత్తం చేసుకొన్నట్లయితే, బానిసత్వ దాస్యశృంఖలాలను ఛేదించుకొని స్వేచ్ఛపై నమ్మకమున్న ప్రతివ్యక్తి కులమత విచక్షణ లేకుండా ఈ పోరాటంలో పాల్గొనవలసియుండేది. ఈ విషయాన్ని గాంధీగారు ఖిలాఫత్ ఉద్యమ సందర్భంలో అనుసరించినారు. టర్కీకి సార్వభౌమాధికారం కావలెనని మహమ్మదీయులు ఖిలాఫత్ ఉద్యమంలో కోరినారు. టర్కీకి సార్వభౌమాధికారం అనునది వాంఛనీయమైన కోరికకాదు. ఇందువల్ల అరబ్బులు టర్కీలకు తలవగ్గవలసిన సమస్యతలయెత్తుతుంది. దీనిని ఇంకను ముస్లింలు సాగదీయుటచే కాంగ్రెసు వాదులను, హిందువులను గాంధీగారు సంఘటితం చేసి ఇలాంటి అసమంజసమైన మరియు అసాధ్యమైన కోర్కెకు సహాయ సహకారాలను అందించుటకు ప్రయత్నం చేసినారు. ఒక వేళ టర్కీకి సార్వభౌమాధికారం అనునది మత పరమైన అంశం అని ముస్లింలు భావించినట్లయితే వారి కోర్కెల సాధనకు తోడ్పడవలసిన బాధ్యత హిందువులపై కలదని గాంధీగారు వాదించినారు![4]

ఈ తార్కికమైన వాదననుండి ప్రయోజనం పొందుటకు అస్పృశ్యులకు సహకారాన్ని అందించుటకు గాంధీ ముందుకు రాలేదు. ఈ విషయంలో దృఢ నిశ్చయాన్ని కలిగి హిందూయేతరులు హిందువులకు మరియు హిందువులు హిందూయేతరులకు సహాయాన్ని అందిస్తారు కాని ఎవ్వరూ అస్పృశ్యులకు సహకారాన్ని అందించరనే విషయం 'యంగ్ ఇండియా'లో వెల్లడి అయినది. అస్పృశ్యులలో సహజసిద్ధమైన అవలక్షణాల వలన ఈ ప్రత్యేకత తప్పక నెలకొని వుంటుందని, గాంధీగారి తార్కిక వాదాన్ని విశద పర్చుటలో గాంధీగారి స్నేహితులు చాలా ఉత్సాహాన్ని ప్రదర్శించి అస్పృశ్యుల యొక్క కొన్ని ఆవలక్షణాలు పౌర సంబంధమైనవి మరియు మరికొన్ని మతపరమైనవి అగుటచే పౌరసంబంధమైన అవలక్షణాలను రూపుమాపుటకు చేయు సత్యాగ్రహాలలో హిందూ యేతరులు అస్పృశ్యులకు సహకారాన్ని అందించవచ్చు. కాని ఈ విషయాన్ని కూడా ఆలకించుటకు గాంధీగారు సిద్ధంగా లేరు. అన్ని విషయాలలో అతని భావన పనిచేస్తుందేకాని ప్రత్యేకంగా వేరు అంటూ ఏమీ లేదు. ఈ వాదనవల్ల 'గాంధీగారు అస్పృశ్యుల స్నేహితుడు' అనే విషయానికి దూరమై వారికి సహాయ సహకారాలను అందించుటకు నిరాసక్తుడై వారిని యుద్ధరంగంలో పావులుగా వదిలివేయుట జరిగినది.[5]

3

ఇంతవరకు నేను కాంగ్రెసు ఏ విధంగా '[1] అస్పృశ్యుల సౌభాగ్యత' అనే అంశంపై నిరాదరణ వైఖరిని కలిగియున్నదో వివరించినాను. కాంగ్రెసు దీనిని కనీసం చేపట్టలేక పోయినది. అస్పృశ్యులు హిందూ కులతత్వం పై చేసే సత్యాగ్రహం పట్ల సహకారాన్ని అందించుటలో గాంధీగారు ఎలా విఫలం చెందినారో, మరియు అతని కుతర్క వాదన ప్రకారం సహాయ నిరాకరణకు సహాయాన్ని నిరోధించుటలో గాంధీగారి ప్రమేయాన్ని రెండవ దశలో వివరించినాను. ఇదే కాలంలో మూడవ మరియు చివరి సంఘటనలు వెల్లడి చేయవలసి వున్నది. సమయం దృష్ట్యా ప్రథమంగా పరిగణించవలసి వున్నది. ఆ సంఘటన ఇది చివరి అంశం అయినప్పటికీ ప్రాధాన్యత దృష్ట్యా 'గాంధీ అస్పృశ్యుల స్నేహితుడు' అనే భావనను మరియు వ్యవహరింపబడే హక్కును కలిగియుండటమా లేదా కోల్పోవడమా అనేది.

భారతీయ రౌండు టేబుల్ సమావేశంలో నూతన రాజ్యాంగ రూపకల్పన జరుగు సమయంలో దళిత వర్గాల పట్ల రాజకీయ పరమైన రక్షణలు ఏవిధంగా కల్పించాల్సి ఉందో, గాంధీగారి దృక్పథం, వీరి విషయంలో ఏ విధంగానున్నదో చూపే దళిత వర్గాల ప్రతినిధులు సమర్పించిన డిమాండ్‌లను దిగువ వివరించడమైనది.

చట్టసభలలో తగిన ప్రాతినిధ్యాన్ని కల్పించుట :

దళిత వర్గాల సంక్షేమం కోసం వారికి తగిన రాజకీయ శక్తిని ప్రసాదించే చట్టాల రూపకల్పన మరియు నిర్వహణాత్మక కార్యక్రమాలు అందుకు ప్రభావితం కావాలి. దీనిని దృష్టిలో ఉంచుకొని ఓటింగ్ చట్టాలలో తగిన అంశాలు ఏర్పాటు చేయవలసి వున్నది.

1. కేంద్ర మరియు రాష్ట్ర చట్టసభలలో తగిన ప్రాతినిధ్యపు హక్కును కల్పించవలెను.
2. వారి స్వంత వ్యక్తులను ఎన్నుకునే హక్కు,

ఎ. ప్రయోజన ఓటింగ్ మరియు

బి. మొదటి పది సంవత్సరాల కాలంలో ప్రత్యేక నియోజకవర్గాలను ఏర్పరచి అటు తర్వాత సమిష్టి నియోజక వర్గాలను కల్పించి ప్రత్యేక సీట్లను రిజర్వు చేయవలెను: దళిత వర్గాల అభిప్రాయాలకు వ్యతిరేకంగా సమిష్టినియోజక వర్గాలను బలవంతంగా ఏర్పాటు చేయకుండా ప్రయోజన ఓటింగ్ విధానాన్ని అనుసరించవలసి వుంటుంది.

దళిత వర్గాలచే డిమాండు చేయబడిన ఈ ఒక్క ప్రత్యేక అంశం ఒక తుఫానును సృష్టించి దీని పరిష్కారం భారత రాజకీయ మరియు హిందూ సమాజ పునాదులను కుదిపివేసింది.

దళిత వర్గాలు చేసిన ఈ డిమాండ్ "సైమన్ కమీషన్" చేసిన సిఫారసులపై ఆధారపడియున్నది. దళిత వర్గాల సమస్యల గురించి నిశితంగా పరిశీలించిన తరువాత నూతన రాజ్యాంగంలో తగిన ప్రాధాన్యత ఇచ్చుటకు సైమన్ కమీషన్ తన నివేదికలో ఇలా వ్యక్తపరిచింది.

"ఒక వేళ నియోజక వర్గాలను తగినంతగా కుదించినప్పటికీ ప్రత్యేక అవకాశాలు లేనిదే సాధారణ నియోజక వర్గాలలో దళితులు తమ ప్రతినిధులను నియుక్తులను చేయుటకు అవకాశాలు మృగ్యమే. ప్రత్యేక రక్షణ లేకుండా సమిష్టి నియోజక వర్గాలలో తగిన స్థానాన్ని పొందుతారనే ఆశాభావంతో చూడవలసి వుంటుంది. ఒక వేళ దళితులను నామినేషన్ సౌకర్యం ద్వారా నియుక్తులను చేసినట్లయితే వారికి రాజకీయ శిక్షణ లభించదు. ప్రస్తుతమున్న పరిమిత నియోజక వర్గాలలో తగినంత మంది దళిత వర్గాల ఓటర్లు తమ ఓటు హక్కు వినియోగ పద్ధతులను సక్రమంగా అనుసరించవలసి వుంటుంది.

"దళిత వర్గాలను ఎన్నికల ప్రాతినిధ్యం అనే వలయంలోనికి తీసుకొని రావడమనేది ప్రారంభించడం మనం ఒక ఆశయంగా పెట్టుకోవాలి. దీనిని మరి ఏవిధంగా చేయవచ్చు? అనేక దళిత వర్గపు సంఘాలు ప్రత్యేక నియోజక వర్గాలకు ప్రాధాన్యత నిస్తూ, వాటిని జనాభా ప్రాతిపదికగా కేటాయింపు చేయవలసి వుంటుంది. ప్రత్యేక నియోజక వర్గాల

కేటయింపువలన దళిత జాతిప్రజానీకంలో తప్పని సరిగా విశ్వాసమేర్పడి తగిన ప్రాతినిధ్యం లభించుటకు మార్గాలు సుగమం అవుతాయి. కాని ఈ ప్రత్యేకత వలన దళితులకు, హిందువులకు మధ్య వైషమ్యాలు అధికమై ఇతరులలో మిళితమయ్యే నూతన రాజకీయాలకు నాంది పలికినట్లవుతుంది.

"అందువలన మొత్తం ఎనిమిది రాష్ట్రాలలో దళిత వర్గాలకు కొన్ని సీట్లను రిజర్వు చేయవలెనని మన ప్రస్తావన.

"ఈ పథకం ఫలితంగా దళిత వర్గాల తరపున మాట్లాడే ప్రతినిధి ప్రతి రాష్ట్రంలో ఎన్నిక చేయబడిన సభ్యుడవుతాడు. కొన్ని ప్రత్యేక సీట్లను కేటాయించుటవలన రాష్ట్రాల లోని మొత్తం దళిత వర్గాల ప్రజలకు కొంతశాతం ప్రాతినిధ్యం లభించే అవకాశాలు ఏర్పడతాయి. ప్రతినియోజక వర్గంలోని మొత్తం జనాభాలో మొత్తం దళిత వర్గాల ప్రజానీకం 3/4వ వంతు ఉన్నట్లయితే వారికి భారత సాధారణ నియోజక వర్గాలలో తగిన సీట్లను రిజర్వు చేయవలసిందిగా మేము ప్రతిపాదించినాము".[6]

వాస్తవానికి దళత వర్గాల ప్రత్యేక రాజకీయ ప్రాతినిధ్యం అనే డిమాండ్‌లో నూతనత్వం ఏమిలేదు. దళిత వర్గాలు, వారిచేత, వారికొరకు వారే పాటుపడినట్లవుతుంది. అందువల్ల సైమన్ కమీషన్ కూడా దీనిని ఒక నూతన పంథాగా పరిగణించలేదు.

ఈ డిమాండ్‌ను 1919లో ప్రవేశ పెట్టడం జరిగినది.

1919 చట్టాన్ని ప్రవేశ పెట్టి సంస్కరణలను చేపట్టేకాలంలో మాంటేంగ్ ఛెమ్స్ ఫోర్డ్ నివేదిక రచయితలు అస్పృశ్యుల సమస్యలపై తగిన కృషిచేయుటకు తగిన వసతులను కల్పించినారు. నియోజక వర్గాలను విభజించుటకు, ఎన్నిక విధానంలో మార్పులను సూచించుటకు 'లార్డ్ సౌత్‌బరో' అధ్యక్షతన ఏర్పడిన కమిటీ దీనిని పూర్తిగా విస్మరించినది. భారత ప్రభుత్వం ఈ వైఖరిని ఆమోదించక దిగువ వ్యాఖ్యానాలు చేసింది.

"అస్పృశ్యులు మొత్తం జనాభాలో 1/5 వ వంతు ఉండి వారు మార్లే-మింటో కౌన్సిళ్ళలో ప్రతినిధులు కాలేదు.ఈ కమిటీ నివేదిక ప్రకారం సంతృప్తికరమైన నియోజక వర్గాలు లేనట్లయితే వారిని నామినేట్ చేసే పరిస్థితి వుంటుంది. ఈ కమిటీ అస్పృశ్యుల

యొక్క స్థితిగతులను గాని, వారి తర్వాత అస్పృశ్యుల యొక్క సామర్థ్యాన్నిగాని చర్చించలేదు. పైగా వారికి సూచించబడిన నామినేషన్ మొత్తాన్ని కూడా పేర్కొనలేదు. మొత్తం వాస్తవికంగా వున్న సీట్లలో బ్రిటిష్ ఇండియాలోని మొత్తం జనాభాలో 1/5వ వంతుకు ఏడు సీట్లను కేటాయించవలె. అన్ని కౌన్సిళ్ళలో 1/6 వ వంతు ఉద్యోగులకు ఈ విషయంపై ఆసక్తి వున్న మా దృష్టిలో సౌకర్యాలు ఏమీ కల్పించలేదని స్థూలంగా చెప్పవచ్చు. అస్పృశ్యులు తమ స్వరక్షణకు పూనుకొనవలసిన గుణపాఠాన్ని నేర్చుకొనవలెనని తెలియచేసినారు. ఎక్కడైతే 60 లేదా 70 హిందూకులస్థులు అసెంబ్లీలోనున్నారో అచ్చట ఒక దళిత సభ్యుడు మాత్రమే ఉన్నట్లయితే ఈ ఫలితాన్ని ఆశించుట దుర్లభం. ఈ నివేదికలో సూత్రాలను ఆచరించుటకు దళితులను మనము ఉదారంగా చూడవలెను. ఈ కమిటీ అస్పృశ్యులకు సూచించిన సీట్లను రెటింపు చేయవలెనని భారత ప్రభుత్వం ప్రతిపాదించినది.ఆ ఫలితంగా 7 సీట్లకు బదులుగా 14 సీట్లు కేటాయించడమైనది."

మళ్లీ 1923 లో సెక్రటరీ ఆఫ్ స్టేట్ చే 'ముద్దీమాన్ కమిటీ' ఏర్పాటు చేయడమైనది. 1919 చట్టాన్ని సవరించకుండా రూల్స్‌ను మాత్రమే సవరిస్తూ ఆ చట్టాన్ని విస్తృత పరచుటకు రాజ్యాంగాన్ని ఏవిధంగా రూపకల్పన చేయవలెననునది ఈ కమిటీ యొక్క ముఖ్యోద్దేశ్యం. ఈకమిటీ కొన్ని సిఫారసులను చేస్తూ చట్ట సభలలో దళిత వర్గాల ప్రతినిధులను అధికం చేయవలసిన ఆవశ్యకతను వెల్లడి చేసినది. ఈ సిఫారసులను సెక్రటరీ ఆఫ్ స్టేట్ ఆమోదించి సీట్లను పెంచినారు.

అందువలన చట్ట సభలలో దళిత వర్గాలకు ప్రత్యేక ప్రాతినిధ్యం అనే విషయం ఒక సూత్రంగా రూపొందించబడుటయే గాక రాజ్యాంగంచేత అనుసరించబడినది. ఈ సూత్రం జిల్లా స్థానిక బోర్డులకు, పాఠశాల బోర్డులకు మరియు పురపాలక సంఘాలకు కూడా విస్తరించబడింది.

ఇది 1919లో చట్టం చేత గుర్తించబడి, తర్వాత హక్కుగా మారి అటు తర్వాత దళిత వర్గాల ప్రతినిధుల ఎంపిక విషయంలో ఎప్పుడు; ఎవ్వరితోకూడా వివాదంగా పరిణమించలేదు. దళిత వర్గాలకు చెందిన ఈ హక్కు విషయంలో కాంగ్రెసు తీర్పు వివాదాత్మక సమస్య అని భయపడటంలో సహేతుకత లేదు. ఎందుచేతననగా, స్వరాజ్య

రాజ్యాంగం కోసం 1929లో ఏర్పాటయిన నెహ్రూ కమిటీ దళిత వర్గాల హక్కులకు సంబంధించిన అంశాలను తిరస్కరించినా ఆ కమిటీ నివేదికను కాంగ్రెసు తప్పకుండా ఒప్పుకోవలసిన అగత్యం ఏమీ లేకుండెను. 1920లో నాగపూర్‌లో జరిగిన సమావేశంలో సిక్కులలో భయాందోళనలు పోగొట్టుటకు చట్టసభలలో అల్ప సంఖ్యాక వర్గాల నందరినీ ఒకే తీరుగా చూడటమవుతుందనే విధాన నిర్ణయాన్ని ప్రకటించడమయినది.[7]

దళిత ప్రతినిధులను ఎంపిక చేసుకొనే విషయంలో న్యాయం చేకూరి, వారి కోర్కెల సాధనలో ఎలాంటి సమస్యలు ఉత్పన్నం కాజాలవని దళిత వర్గాల ప్రజలు ఆశించడంలో తప్పులేదు. మొదటి రౌండు టేబుల్ సమావేశం సాఫీగా కొనసాగింది. అల్ప సంఖ్యాక వర్గాల వారితో ఎలాంటి ఒప్పందం లేకుండానే ఏసమస్యలు ఏకోవనుండి కూడా ఉత్పన్నం కాలేదు. రౌండు టేబుల్ సమావేశానికి హాజరయిన అన్నివర్గాల ప్రతినిధులు దళిత వర్గాలకు ప్రత్యేక ప్రాతినిధ్యం అనే హక్కును గుర్తించినారు. సాధారణ సమావేశంలో తగిన ప్రతిపాదనలు చేయుటకు సబ్ కమిటీని ఏర్పాటు చేయవలెనని అల్ప సంఖ్యాక వర్గాల వారు ఒక ముగింపుకు వచ్చినారు. ఆ నివేదిక యొక్క ప్రతిరూపాన్ని దిగువ వెల్లడి చేయడమైనది.

"ప్రావిన్షియల్ రాజ్యాంగపు సబ్ కమిటీ నెంబర్-(II) సిఫారసుల ప్రకారం సాధార అగ్రిమెంటు ఏర్పడినది. దాని ప్రకారం అల్ప సంఖ్యాక వర్గాలకు చెందిన ప్రాధాన్యత కలిగిన ప్రావిన్షియల్ నిర్వాహకులకు నూతన రాజ్యాంగం సమర్థవంతంగా పనిచేయుటకు అవకాశం ఇస్తూ, ఇదే ప్రాతిపదికగా ఫెడరల్ ఎగ్జిక్యూటివ్‌లో మహ్మదీయులకు ప్రాతినిధ్యం కల్పించవలె. వ్యక్తిగతంగా గాని సామూహికంగా గాని ప్రావిన్షియల్ మరియు ఫెడరల్ ఎగ్జిక్యూటివ్‌లలో తక్కువ సంఖ్యకలిగిన ఇతర అల్ప సంఖ్యాక వర్గాల వారికి వీలయితే తగిన ప్రాతినిధ్యం కల్పించవలె. ప్రతి క్యాబినెట్‌లో అల్ప సంఖ్యాక వర్గాలవారి ప్రయోజనాలను పరిరక్షించుటకు ప్రత్యేకమంత్రిని నియమించవలె. (డాక్టర్ అంబేద్కర్ మరియు ఉజ్జ్వల్‌సింగ్‌లు 6వ పంక్తిలో "మరియు ఇతర ప్రాధాన్యత కలిగిన అల్పసంఖ్యాకులు" అని మహ్మదీయులు అనే పదానికి ప్రక్కగా చేర్చడమైనది)

"ఈ పథకం ప్రకారం సంయుక్తమైన బాధ్యతలో నిర్వాహకులు పనిచేయుట కష్ట సాధ్యమవుతుంది.

"ఈ పథకంలో ఎదురయ్యే సమస్యలను చర్చించుటకు సబ్‌కమిటీలో ప్రతినిధులకు అవకాశం కగినది. దీనికి అత్యంత ప్రాముఖ్యతనివ్వవలసియున్నప్పటికీ ఒక సాధారణ అంగీకారానికి రాలేకపోయినారు, కాని మిగతా వాటికంటే దీనికి విస్తృత ప్రాముఖ్యత ఎప్పుడూ ఇవ్వవలసి ఉందనేది విశదమైనది."

"ఏదైనా అగ్రిమెంటు ద్వారా బ్రిటిష్ ప్రభుత్వం ఎలక్టోరల్ సూత్రం లేదా ఆవిధమైన లక్షణాలు కలిగిన మరే విధమైన అంశాలతో ఈ వర్గాలపై వత్తిడి చేయుటకు వీలులేదని ఖచ్చితంగా విశదపర్చడం జరిగింది. ప్రత్యేక నియోజకవర్గాలకు సంబంధించిన అగ్రిమెంటులోని లోపాల వల్ల గాని, క్లిష్టత వల్లగాని సాధనలో వైఫల్యం ఏర్పడినపుడు నూతన రాజ్యాంగంలో నియోజక వర్గాల ఏర్పాటుకు సంబంధించిన వాటిని కొనసాగేటట్లు చూడవలెను. కాని దీనివల్ల నిష్పత్తుల సమస్య ఏర్పడుతుంది. ఈ సందర్భంలో దళితుల హక్కులకు తగిన రక్షణ కల్పించవలెను.

"దళిత హక్కుల పరిరక్షణకు ఒక ఒప్పందాన్ని ఏర్పాటు చేసుకొనుటకు సంబంధించి ప్రతినిధులతో అభిప్రాయ సేకరణ గావించుటకు ఒక సమావేశాన్ని ఏర్పాటు గావించాలని సబ్ కమిటీ సిఫారసు చేసింది. దీని ఫలితాలను తదుపరి సమావేశంలో చర్చించవలసి వుంటుంది."

కాంగ్రెసు బహిష్కారం మూలంగా గాంధీగారు మొదటి రౌండు టేబుల్ సమావేశానికి హాజరు కాలేదు.ఆయన రెండవ రౌండు టేబుల్ సమావేశానికి హాజరైనారు. కాని దళితుల హక్కుల గురించి ఆయన ఏవిధమైన వైఖరిని కలిగియున్నారు?

సంపూర్ణ స్వరాజ్య స్థాపనకై ఆవిర్భవించిన రాజ్యాంగంలో ఈ చర్చలు మరియు మంతనాలు ప్రతిబింబించే విధంగా ఆ రాజ్యాంగం రూపొందించుటలో గాంధీ గారికి ఆసక్తి అధికంగా కలదని ప్రతిఒక్కరు విశ్వసించినారు. వివిధ అల్ప సంఖ్యాక వర్గాల మధ్య సీట్ల కేటాయింపు అనే విషయంపై గాంధీగారు ఆసక్తి చూపక ప్రాధాన్యతలేనిదిగా వదిలివేయుట జరిగినది. ఈ సంఘటనలన్నీ వారి నమ్మకాన్ని వమ్ముచేయుట అనే విషయాన్ని స్పష్టీకరించినవి. బ్రిటిష్ వారి సార్వభౌమాధిపత్యం పై జరిపే పోరును గాంధీగారు మొత్తానికి విడిచి పెట్టడమైనది. పూర్ణ స్వరాజ్యంతో కూడిన రాజ్యాంగానికి ప్రజాభిప్రాయ

సేకరణతోనే తాను ముందుకు వచ్చాననే విషయాన్నికూడ గాంధీగారు విస్మరించినారు.[8] ఈ విషయాలన్ని విడిచిపెట్టి అల్ప సంఖ్యాక వర్గాలవారికి వ్యతిరేక పోరును ప్రారంభించినారు. అల్ప సంఖ్యాక వర్గాల వారికి ప్రత్యేక ప్రతినిధులు అనే హక్కు విషయంలో అతను తన సర్వ శక్తులు కేంద్రీకరించి వ్యతిరేకంగా పనిచేయడమనేది చాలా వింతగా ఉన్నది. దళిత వర్గాల వారి ప్రతినిధులను నఖశిఖ పర్యంతం వ్యతిరేకించినాడు. వారి హక్కులపై కనీసం చూపును కూడా వేయలేదు. వారి ప్రగాఢ కాంక్షపై కోపాన్ని ప్రదర్శించడం మొత్తం సమావేశాన్ని ఆశ్చర్య పరిచింది. అస్పృశ్యులకు స్నేహితుణ్ణి అని తనకు తానే భావించే గాంధీగారిలాంటి వ్యక్తి వారి ఆసక్తుల పట్ల శత్రుత్వాన్ని ప్రదర్శించుటను వారు నమ్మలేక పోయినారు. గాంధీగారి స్నేహితులు అతన్ని వివేకరహితంగా నమ్మినారు.

మహమ్మదీయులు, మరియు సిక్కులు వ్యక్తం చేసిన ఇదే విధమైన హక్కును గుర్తించుటకు గాంధీగారు సిద్ధపడినారు. క్రిష్టియన్లు, యూరోపియన్లు మరియు ఆంగ్లో ఇండియన్లకు అదే విధమైన హక్కును గుర్తించుటకు సుముఖత వ్యక్తం చేసినాడు. మరి అస్పృశ్యులు అభిలషించే అదే విధమైన హక్కును గుర్తించుటకు గాంధీగారు ఎందుకు నిరాకరిస్తున్నారో అతని స్నేహితులకు అవగాహన కాలేదు. మహమ్మదీయులు, సిక్కులు, క్రిష్టియన్లు, యూరోపియన్లు మరియు ఆంగ్లో ఇండియన్లు అస్పృశ్యులకంటే మెరుగైన పరిస్థితిలో నున్నారు. వీరు పేద వారిలో అతి పేదవారు. ముందు పేర్కొన్న వారంతా విద్యలో ముందంజ వేసి యున్నారు. కాని అస్పృశ్యులు విద్యలో చాలా వెనుకబడియున్నారు. వీరంతా సంఘంలో గౌరవనీయస్థానంలో నున్నారు కాని అస్పృశ్యులు దానికి కూడా నోచుకోలేదు. అస్పృశ్యులు కొన్ని లోపాలతో సతమతమవుతున్నాపుడు మిగతా వారంతా స్వేచ్ఛాయుత పౌరులుగా చలామణి అవుతున్నారు. అస్పృశ్యులు సంఘంలో పీడితులుగా ఉండి ప్రతిరోజు సమాజ బహిష్కరణకు గురికాబడుతున్నారు. సామాజిక హోదాలో ఈ విధమైన వ్యత్యాసాన్ని కలిగివుండి, భారతీయ ప్రజలలో తమకు ప్రత్యేక రక్షణ కల్పించవలసినది ఎవరు? అని సమీక్షించినపుడు వారు ఖచ్చితంగా అస్పృశ్యులు అవుతారు. అతని యూరోపియన్ స్నేహితులు అస్పృశ్యుల సంగతి గాంధీ గారితో వాదించినపుడు ఇద్దరి విషయంలో అతని వైఖరిలో సహనం లోపించినాకు తెలిసినంతవరకు సంబంధాలు బెడిసినవి.

దళితుల పరిరక్షణ మరియు వారి హక్కులను రక్షించే విషయంలో తనను వ్యతిరేకించేవారి సచ్ఛీలతను విశ్వసించకుండా, హేతుపరమైన సమాధానం చెప్పకుండా గాంధీగారు కోపాన్ని ప్రదర్శించేవారు. దళిత వర్గాల వారిని వ్యతిరేకించే విషయంలో ఆయన ఎప్పుడు ఒకే విధమైన వివరణ ఇచ్చేవారు. లండన్‌లో ఇచ్చిన ప్రసంగాన్ని బట్టి ఆయన మూడు రకాలైన వాదనలను ఉపయోగించి ఎలా సమర్థించుకుంటున్నారో ప్రతి ఒక్కరికి అర్థమవుతుంది. రౌండు టేబుల్ సమావేశంలో ఫెడరల్ స్ట్రక్చర్ కమిటీ సభ్యునిగా ఆయన పలుకులు ఈ విధంగా నున్నాయి.

"అస్పృశ్యుల సమస్య గూర్చి కాంగ్రెసు మొదటినుండియు పోరాడుచున్నది. కాంగ్రెసు యొక్క ప్రతివార్షిక సమావేశంలో కీర్తి శేషులైన 'రానడే' గారు తన శక్తి సామర్థ్యాలు ధారపోసి అతను చేపట్టిన వివిధ పనుల గురించి చర్చించిన సందర్భాలున్నాయి. సాంఘిక పరమైన సమావేశంగా దాన్నే మార్చుతూ, అస్పృశ్యయలకు సంబంధించిన సంస్కరణలకు ప్రాధాన్యత ఇచ్చిన సందర్భాలున్నాయి. 1920 లో కాంగ్రెసు ఒక బృహత్తర కార్యక్రమాన్ని రాజకీయ వేదిక మీద వుంచి 'అస్పృశ్యత నివారణ' అనే పథకాన్ని అమలు జరుపుటకు తగిన ప్రాముఖ్యత ఇచ్చినది. హిందూ, ముస్లింల మధ్య ఐకమత్యాన్ని కోరటం వల్ల అన్ని వర్గాల మధ్య స్నేహశీలతను ఆశించినట్లే కదా. స్వరాజ్య స్థాపనకు ఇది అత్యంత ఆ వశ్యమైనదిగా భావించడం జరిగింది. పూర్తి స్వరాజ్యం పొందుటకు అస్పృశ్యత నివారణ అనునది అనివార్యమైన అంశంగా కాంగ్రెసు పరిగణించింది."

రౌండు టేబుల్ సమావేశపుటల్ప సంఖ్యాక వర్గాల సబ్ కమిటీలో గాంధీగారు మరొక వాదనను ఈ విధంగా చేసినారు :

"ఇతర అల్పసంఖ్యాక వర్గాల వారి హక్కులను నేను అర్థం చేసుకోగలను. కాని అస్పృశ్యుల తరపున హక్కులను కోరేవారి చర్చలు నాకు నిర్దయతతో కూడు కున్నవని పించుచున్నది. అనగా ఇది పూర్తిగా పాప పంకిలమైనది. భారతదేశ స్వాతంత్ర్య సముపార్జన కోసం కూడా నేను అస్పృశ్యుల పట్ల నా ఆసక్తిని విక్రయించలేను. అసంఖ్యాకులైన అస్పృశ్యుల ప్రతినిధిగా నేను వ్యక్తిగతంగా నిలబడగలనని చెప్పకోగలను. ఇది నేను కాంగ్రెసు తరపున కాకుండా నా వ్యక్తిగతంగా మాట్లాడుతున్నాను. ఒకవేళ ఈ విషయంలో

ప్రజాభిప్రాయ సేకరణ నిమిత్తం ఓటింగ్ పెట్టినట్లయితే నాకే అధిక ఓట్లు వస్తాయి. భారతదేశమంతటా వీరి తరపున పనిచేస్తూ, అస్పృశ్యత అనే పాపపు చర్యను రూపుమాపడం విషయంలో ప్రత్యేక నియోజక వర్గాలు మరియు ప్రత్యేక రిజర్వేషన్లు సరియైన మార్గాలు కావని అస్పృశ్యులకు నేను చెప్పగలను. ఇది ఛాందసులైన హిందువులకు సిగ్గు కలిగించే విషయం. అస్పృశ్యత నివారణకై హిందూ సంస్కరణ వాదులు వాగ్దానం చేయుటకు నేడు సిద్ధంగా ఉన్నారని ఈ కమిటీ మరియు మొత్తం ప్రపంచం ఈనాడు తెలుసుకోవాలి. జనాభా గణన మరియు పుస్తకాలలో అస్పృశ్యులను ప్రత్యేక వర్గంగా పేర్కొనుట మాకు ఇష్టంలేదు. సిక్కులు, ముస్లింలు మరియు యూరోపియన్లు శాశ్వతంగా ఈ రకంగా పరిగణించబడటంలో తప్పులేదు. అస్పృశ్యులు, అస్పృశ్యులుగా శాశ్వతంగా కొనసాగుతారా? హిందూమతం మరణించినప్పటికీ అస్పృశ్యత జీవించి ఉండవద్దని నా భావన. అందువలన అస్పృశ్యుల అభ్యున్నతి ఆకాంక్షించే డాక్టర్ అంబేద్కర్‌కు నా కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను. అతను పడిన శ్రమ మరియు చేదు అనుభవాలు అతన్ని వేదనా భరితం చేసి ఉండవచ్చు. ఆయనపై గౌరవంతోను, ఆయన చేసిన పని పట్ల నమ్రతతోను, ఆయన తప్పు చేస్తున్నారని నేను చెప్పక తప్పదు. అలా అనడం నాకు బాధాకరమే అయినప్పటికీ నా ప్రాణంతో సమానమైన అస్పృశ్యతా నివారణ సమస్యకోసం నేను ఇలా చెప్పవలసి వస్తుంది. ప్రపంచరాజ్యం కొరకు కూడా అస్పృశ్యుల హక్కులను కాలరాచలేను. అస్పృశ్యుల తరపున ఏకైక ప్రతినిధిగా భావిస్తూ, డాక్టర్ అంబేద్కర్ పలికిన పలుకులను నేను అంగీకరించను. ఈ విషయమై నేను బాధ్యతాయుతంగా మాట్లాడుతున్నాను. ఇది హిందూ మతాన్ని రెండు వర్గాలుగా విభజిస్తుంది. వారి సంతృప్తి కోసం ఈ విధంగా చేయకపోవుటవలన వారు ముస్లింలుగాను లేదా క్రిష్టియన్లుగాను మారుతారు అనే విషయాన్ని నేను లక్ష్యం చేయను. దీనినైనా భరిస్తాను కాని భారతీయ గ్రామాలలో రెండు ప్రత్యేక వర్గాలను ఏర్పాటు చేయుట నా కిష్టంలేదు. పైగా నేను దీనిని భరించలేను. అస్పృశ్యుల రాజకీయ హక్కులకై మాట్లాడేవారికి భారతదేశం గురించి కాని భారతదేశ సమాజం ఏ విధంగా నిర్మింపబడినదో తెలియదు. అందువలన ఈ భావనను నేను అన్ని విధాలుగా ఖండించుచున్నాను. ఈ పనిని నేను ఒక్కణ్ణి మాత్రమే చేయగలనని ఘంటాపథంగా చెప్పుచున్నాను."

లండన్‌లో జరిగిన స్నేహితుల సమావేశంలో గాంధీగారి వాదనలు చాలా వింతగా ఉన్నాయి. దానిలో ఆయన ఈ విధంగా మాట్లాడినారు.[9]

"నాహృదయ సంఘర్షణను మీకు వెల్లడి చేయుచున్నాను. అల్ప సంఖ్యాక వర్గాల వారి హక్కుల విషయంలో కాంగ్రెసు అశక్తతోనున్నది అని మీరు భావించవచ్చు. అస్పృశ్యుల గురించి మాట్లాడే వారికెంత తెలుసో నాకు కూడా అంతే తెలుసు. వారికి ప్రత్యేక నియోజక వర్గాలు ఏర్పరచటం అనునది వారికి మరణంతో సమానమైనది. వారు ఇపుడు కులీన వర్గాలవారి చేతుల్లో నున్నారు. వీరియొక్క దయాదాక్షిణ్యాలపై ఆధారపడి వుండుటచే వారు అస్పృశ్యులను అణచివేయవచ్చు. ఈ విషయాన్ని దృష్టిలో వుంచుకొని నేను ప్రత్యేక నియోజక వర్గాలు అనే అంశానికి వ్యతిరేకంగా పోరు సల్పుతున్నాను. ఈ విషయంలో నేను చాలా సిగ్గు పడుతున్నానని మీకు ప్రస్ఫుటం చేస్తున్నాను. ప్రస్తుతం నెలకొన్న పరిస్థితులవల్ల వారి నాశనాన్ని నేను ఎలా కోరగలను. ఈ నేరానికి నేను చింతించుటలేదు.[10]

ఈ విషయంలో సమర్థుడుగా భావించే డాక్టర్ అంబేద్కర్ అసంతోషంగా తన రక్షణను కోల్పోయినాడు. వారి ప్రతినిధిగా అతని యొక్క కోరికను నేను నిర్ద్వంద్వంగా త్రోసి పుచ్చుతున్నాను."

అతని వాదనలు ఏ విధమైన అంగీకారయోగ్యతను కలిగిలేవు. అసంగతమైనవై వుండి ప్రత్యేక విన్నపాలుగా గోచరమవుతున్నాయి.

అస్పృశ్యతా నివారణకు మరియు అస్పృశ్యులను రక్షించుటకు కాంగ్రెసు ప్రతిన బూనినదని అతని మొదటి వాదన. దీనిలో ఎంత వరకు నిజమున్నది? అస్పృశ్యత నివారణకు మొత్తం కాంగ్రెసు కృషి చేస్తుందని ప్రపంచానికి గాంధీ గారు తెలియచేసినారు. కాంగ్రెసు ఏమి చేయగలదో, ఏమి చేయలేదో అనే విషయం గాంధీ గారి ముందున్నదని అతని స్నేహితులు కీర్తించుచున్నారు. ఈలాంటి అసత్యమైన భావనకు ఎందుకు విశేష ప్రాచుర్యం లభించుచున్నదో నాకు ఆశ్చర్యం కలుగుతున్నది. ఇట్టి విషయంలో 1920లో నాగపూర్‌లో జరిగిన సమావేశపు తీర్మానాన్ని మళ్లీమళ్లీ చదివినాను. ఎవరైనా ఈ సమావేశపు తీర్మానాన్ని చదివితే వచ్చే సమావేశంలో దీని విషయమై ఏమి లేదనే

విషయం వెల్లడి అవుతుంది. ఈ సమావేశపు తీర్మానం గాంధీగారి లౌక్యానికి చాలా తెలివైన ప్రతీకగా కన్పిస్తుంది. గాంధీగారు మొదటినుండి అస్పృశ్యులు హిందువులకు చాలా దగ్గరివారుగా చలామణి కావాలని కాంక్షించే వారు. వారిపై ముస్లింలకు లేదా క్రిష్టియన్లకు ఆసక్తి ఉండరాదని అభిలషించేవారు. బ్రిటిష్‌వారికి దగ్గరిగా ఉండే అస్పృశ్యులను విడదీసి హిందువులలో మమేకం చేయాలనే తలంపును గాంధీగారు కలిగియున్నారు. పై ఉద్దేశ్యాన్ని కనుగుణంగా కాంగ్రెసు వేదికలపైన అస్పృశ్యత నివారణకు తీర్మానాలు చేయవలెనని కోరినాడు. ఈ లక్ష్య సాధనయొక్క విధి హిందువులకే పరిమితమైనది. ఇది ఈ తీర్మానం చేసేపని. ఇది కుటిల రాజకీయవాది చేసేపని. ఈ తీర్మానానికి వెనుకగా మొత్తం కాంగ్రెసు నిలబడియున్నదని వెల్లడి అగుటలేదు. పైగా ఏదీకూడా బాధ్యతాయుతంగా కన్పించలేదు. ఇందుకై ఒక వాగ్దానం కాని, ఒక ప్రతినకాని లేదు. కేవలం నైతిక ఉద్బోధన మాత్రమే కలదు. ఎప్పుడూ అస్పృశ్యత నివారణ హిందువుల విధి అని సిఫారసు చేయుటయే జరిగినది. ఒకసారి గాంధీగారు కాంగ్రెసుయొక్క సభ్యత్వపు విధానానికి మార్పు చేసినారు. సభ్యత్వానికి చెల్లించే వార్షిక చందా నాలుగు అణాలకు బదులుగా దిగువ రెండు నిబంధనలు చేర్చినారు.

(1) అస్పృశ్యత నివారణ (2) నూలు వడకడం

కాంగ్రెసువారు నూలు వడకడం సభ్యత్వానికి ప్రాతిపదికగా అంగీకరించినారు కాని అస్పృశ్యత నివారణకు అలా అంగీకరించలేదు. ఒకవేళ అలాంటి నిబంధన విధించినట్లయితే అన్ని కాంగ్రెసు కమిటీలు మూతపడతాయని కాంగ్రెసు వాదులు గాంధీగారికి తెలియజేసినారు. ఈ వ్యతిరేకత గట్టిగా నుండుటచే తర్వాత గాంధీగారు దానిని విరమింపజేసినారు. రౌండు టేబుల్ సమావేశంలో గాంధీగారు చేసిన వాదనకు వాస్తవంగా జరుగుతున్న దానికి తేడాకు ఇది మచ్చు తునక. హిందువుల చేతుల్లో అస్పృశ్యులు క్షేమంగా ఉంటారనే గాంధీగారి భావనలోని అవాస్తవికత వ్యక్తం అవుతుంది.

స్వరాజ్యానికి ముందే అస్పృశ్యతా నివారణ పరిస్థితులను కాంగ్రెసు నెలకొల్పుతుందనే గాంధీగారి మరొక వాదనలో ఏ మాత్రం నిజంలేదు. ఈ విషయంలో కాంగ్రెసుకాని, గాంధీగారుకాని తమ సచ్చీలతను వ్యక్తం చేయలేకపోయినారు. అస్పృశ్యత అదే విధంగా

కొనసాగుతున్నప్పటికీ స్వాతంత్ర్యం కోసం కాంగ్రెసు మరియు గాంధీగారు డిమాండ్ చేయడమైనది. ఈ ఒక్క విషయం సరి పోతుంది, గాంధీగారి మాటల్లో ఏ మాత్రం నమ్మకం లేదని స్వరాజ్యానికి ముందే అస్పృశ్యత నివారణ అనునది గాంధీ మరియు కాంగ్రెసు యొక్క ఆశయమనే ప్రకటనలో భారతదేశంలో ఏ ఒక్కరికిగాని, అస్పృశ్యులలో ఎవరికిగాని ఏ కోశానా విశ్వాసం కలుగలేదు. గతంలో జరిగిన రౌండు టేబుల్ సమావేశంలో గాంధీగారిని ఈ విషయంలో తన ఋజువర్తనను పరీక్షించుటకు రెండు సందర్భాలలో తలయెత్తిన ప్రశ్నలకు ఇచ్చిన సమాధానాలు అసంగతాలై, ఆయనకు తన ప్రకటనపై ఏ మాత్రం నమ్మకం లేదనే విషయం విదితమైనది.

1920లో గాంధీ గారిని ఒక కరస్పాండెంట్ దిగువ ప్రశ్నలు వేయటమైనది.[11] "రక్తసిక్తమైన చేతులను కడుగు కొమ్మని బ్రిటిష్ వారిని అడిగే ముందుగా మన హిందువులను ఆ విధంగానే చేయమని ఎందుకు అడగరాదు?" దీనికి గాంధీగారి సమాధానం ఈ విధంగా నున్నది :

"అస్పృశ్యుల కోసం నేను ఏమి చేశాననే విషయాన్ని ఒక లేఖ ద్వారా కరెస్పాండెంట్ నిర్బంధ్యంగా ప్రశ్నించుట జరిగినది. ఆ కరెస్పాండెంట్ లేఖను అతని శీర్షికతో ఇచ్చాను. 'రక్తసిక్త హస్తాలతో కూడిన హిందువులైన మనం రక్తాన్ని కడిగి వేయమని ఇంగ్లీషువారిని కోరేముందు ఎందుకు ఆ పని చేయకూడదనే' ప్రశ్న సహేతుకంగా వేసినది కావచ్చు. కాని బానిస దేశంలో సభ్యులైన మనం ఆ బానిసత్వం నుండి విముక్తి పొందకుండా దళితులకు విముక్తిని ప్రసాదించగలిగితే నేను ఈ రోజు ఆ పని చేస్తాను. కాని ఇది అసంభవమైన పని."

స్వరాజ్యానికి ముందే అస్పృశ్యత నివారణ జరుగుతుందని చెప్పుకునే గాంధీ గారు మరియు కాంగ్రెసుల యొక్క సచ్ఛీలతను పై సమాధానం వెల్లడి చేస్తుంది. ఇది ఋజువర్తన కలిగిన ఒక వ్యక్తి చెప్పే సమాధానం కాదు. అటు తర్వాత గాంధీ గారు స్వరాజ్యం రాకముందే అస్పృశ్యత నివారణ జరిగే ప్రశ్నే లేదని కరెస్పాండెంటుకు నిర్బంధ్యంగా తెలియ చేసినారు.

1930లో చట్టానికి వ్యతిరేకంగా దండిలో ఉప్పు సత్యాగ్రహాన్ని ప్రారంభించుటకు వెళ్ళు సమయమున గాంధీగారిని రెండవసారి ప్రశ్నించుట జరిగినది. కొందరు అస్పృశ్యులు దండి వెళ్లి అతన్ని ప్రశ్నించినారు. స్వరాజ్య స్థాపనకు ముందే అస్పృశ్యత నివారణ అనే నిబంధన ఏమైనదనే ప్రశ్నకు గాంధీగారి సమాధానం ఈ విధంగా నున్నది.

"ఈ ఉద్యమం మొత్తంలో అస్పృశ్యులు భాగమే. నేను ఈ మొత్తం కోసం పనిచేస్తున్నప్పుడు అస్పృశ్యుల కోసం కూడా పనిచేస్తున్నట్లే కదా."

గాంధీ గారిని దర్శించినవారు ఈ విషయాన్ని మాత్రమే నాకు నివేదించారు. తప్పుమరేమీ లేదు. ఇట్టి విషయంలో గాంధీ మరేమీ చెప్పలేరనే దానిలో నాకు ఎలాంటి సంశయము లేదు. యంగ్ ఇండియా కరస్పాండెంటు గతంలో ఏరకమైన సమాధానం ఇచ్చినాడో అది దీనితో సరిపోయినది. అటుతర్వాత ఈ విధంగా చెప్పినారు.

"పంచముల" సమస్య నాకు ప్రాణంతో సమానమైనది. సహాయనిరాకరణకు పూర్తిగా దృష్టిని కేంద్రీకరించుట నాకు సంతృప్తికరంగా నున్నది. నా దృష్టిలో పంచమ సమస్య రెండవ దానికంటే కచ్చితంగా తక్కువ ప్రాధాన్యత కలిగినది."

ఈ సమాధానాలు ఒక ఋజువర్తనివేనా? ఒక సత్ప్రవర్తన కలిగిన వ్యక్తి అస్పృశ్యులు మొత్తంలో ఒక భాగమని విశ్వసించవచ్చా?

అస్పృశ్యులకు ప్రత్యేక ప్రాతినిధ్యం వలన అస్పృశ్యులు మరియు అస్పృశ్యుల మధ్య అగాధం సహజంగా ఏర్పడుతుందనే వాదన పూర్తిగా అర్థరహితమైనది. కులాంతర వివాహాలు మరియు సహపంక్తి భోజనాలు వంటి చర్యలు అస్పృశ్యతను నిర్మూలించుతాయి. అస్పృశ్యులను అందరు వాడుకొనే బావులకు మరియు అందరు చదువుకొనే పాఠశాలలకు అనుమతించినట్టయితే అస్పృశ్యుల యొక్క ఇబ్బందులను తొలగించవచ్చు. ప్రత్యేక ప్రాతినిధ్యం అనునది కులాంతర వివాహాలకు, సహపంక్తి భోజనాలకు, అందరు వినియోగించే బావులకు మరియు పాఠశాలలకు అనుమతి ఇచ్చే విషయంలో ఏవిధమైన సాధనం కాదు. పైగా అది కష్టసాధ్యమవుతుంది. పైగా ఇది ప్రత్యేక ప్రాతినిధ్యపు ఆవశ్యకతను స్థంభింప చేస్తుంది. మరి కాంగ్రెసుగాని లేదా గాంధీగారు గాని ఈ నిర్దేశక మార్గంలో ఏమైనా కృషి చేశారా! బార్డోలి తీర్మానానికి అనుబంధంగా చేసిన వివరణాత్మక అంశాలు ఈ మార్గంలో

గాంధీ మరియు కాంగ్రెసు ఏ విధమైన కృషిచేయుటకు సిద్ధంగానున్నారో విదితమవుతుంది. ఆ వివరణ ఈ విధంగానున్నది.

"ఇంకా ఏ ప్రదేశంలోనైతే అస్పృశ్యులపై ఏహ్యభావం బాగా నెలకొని ఉన్నద అచ్చట కాంగ్రెసు నిధులనుండి ప్రత్యేక బావులను నిర్వహిస్తూ, అస్పృశ్యుల యొక్క పిల్లలను జాతీయ పాఠశాలలకు పంపే విధంగా, అందరు వినియోగించే బావులను వినియోగించేటట్టు కృషి చేయవలసివున్నది".

ప్రత్యేక పాఠశాలలు, ప్రత్యేక బావుల గురించి ప్రవచించే వ్యక్తి మాటలను బట్టి ప్రత్యేక ప్రాతినిధ్యం వల్ల సామాజిక విభజనకు దారి తీస్తుందనే విషయం అసత్యం కాదా? ఇది కేవలం ప్రత్యేక ప్రాతినిధ్యానికి అవరోధాలు కల్పించుటకు మరియు తమ ఋజువర్తనను వెల్లడి చేసుకొనుటకు పలికిన పలుకులేకదా!

చివరగా గాంధీగారు చాలా అమోఘమైన వాదన చేసినాడు. ఒక వేళ కులీన వర్గాలు దళితులను అణచివేస్తున్నట్లయితే, ఈ అణిచివేత ధోరణుల వల్ల వారిలో తిరుగుబాటు మనస్తత్వం ఏర్పడి, మాకు కులీన వర్గాలతో కూడిన ప్రత్యేక నియోజక వర్గాలు ఎందుకు ఏర్పాటు చేయాలి అనే ధోరణికి మార్గాలు ఏర్పడతాయి. ఈ విషయంలో గాంధీగారు పూర్తి నిరాశవాదిగా మారి, సమానత్వభావనను, తన మానసిక స్థిరత్వాన్ని విడనాడి తన వాదనలు ఏ పరిస్థితులకు దారితీస్తాయో అనే విషయాన్ని మరిచిపోయినాడు. ఈ వాదనల వల్ల అస్పృశ్యులు అతి సహజంగా హిందువులకు బానిసలవుతున్నారనే వాస్తవాన్ని పూర్తిగ మరచిపోతున్నాడనుటకు ఇది తార్కాణం అవుతుంది. గాంధీ వాదనను సంక్షిప్తంగ చెప్పవలెనంటే "స్వాతంత్ర్యం గురించి అడగవద్దు, కారణమేమనగా అది నీయజమానికి కోపం తెప్పిస్తుంది మరియు అతను నిన్ను` కించరుస్తాడు." విధమైన వాదనన ఇంకెవరైన లేవనెత్తినట్లయితే అతను కపటి మరియు ఋజువర్తన లేనివాడని అందరు అంటారు.

అస్పృశ్యుల యొక్క న్యాయపరమైన హక్కును నిర్మూలించుటలో విఫలం అయినట్లయితే దళితులయొక్క ప్రతినిధులను బహిష్కరించుటకు గాంధీగారు ప్రయత్నాలు చేసినాడు. పైగా ఏవైపునుండి కూడా వారికి సహాయ సహకారాలను రానివ్వకుండా చేస

ముస్లింలు మరియు దళితుల మధ్యగల బంధాన్ని చేధించుటకు ప్రయత్నించినాడు. ఈ ప్రయత్నంలో భాగంగా ముస్లింలను తనవైపు త్రిప్పుకొనుటకు వారితో ఒక విధమైన ఒడంబడికకు వచ్చినాడు. ముస్లిం ప్రతినిధులకు అందచేసిన ఆ ఒడంబడికను నేను ఇచ్చట మళ్లీ ఒకసారి వెల్లడి చేయుచున్నాను ("గాంధీ మరియు కాంగ్రెసు అస్పృశ్యుల కోసం ఏమి చేసినారు" అనే శీర్షికతో డాక్టర్ అంబేద్కర్ వ్రాసిన వ్యాస భాగాన్ని ఇచ్చట పేర్కొనుట జరిగినది. పేజి. 72-73. ఈ ఒడంబడిక రాతప్రతిలో టైపు చేయబడలేదు- సం॥)

"గాంధీ–ముస్లింల యొక్క ఒడంబడిక ముసాయిదా"
రౌండు టేబుల్ సమావేశంలో ముస్లింల ప్రతినిధులు

తరువాతి పుటలో...

## "గాంధీ–ముస్లింల యొక్క ఒడంబడిక ముసాయిదా"[12]

## రౌండు టేబుల్ సమావేశంలో ముస్లింల ప్రతినిధులు[13]

టెలిఫోన్ : విక్టోరియా 2360 క్వీన్స్ హౌస్

టెలిగ్రామ్స్ : "కోర్టులైనో" లండన్, 57, సెంట్‌జేమ్స్ కోర్టు,

లండన్, యస్.డబ్లు.ఐ,

అక్టోబర్ 6, 1931

దిగువ పేర్కొన్న ప్రతిపాదనలు గత రాత్రి 10 గంటలకు గాంధీ మరియు ముస్లిం ప్రతినిధుల చేత చేయబడినవి. వీటిని రెండు రకాలుగా విభజింపనైనది. తమ హక్కులను పరిరక్షించుకొనుటకు ముస్లిం ప్రతినిధులు చేసినవి ఒకటి మరియు కాంగ్రెస్ విధానాలను వెల్లడిచేయుటకు గాంధీగారు చేసిన ప్రతిపాదనలు మరొకటి. దిగువ పేర్కొన్నవి గాంధీగారిచే అంగీకరించబడి ముస్లిం ప్రతినిధుల అభిప్రాయ సేకరణకు రూపొందించబడినవి.

### ముస్లింల ప్రతిపాదనలు

1. పంజాబ్ మరియు బెంగాల్‌లో ముస్లింలు కేవలం ఒక శాతం మాత్రమే కలరు. నూతన రాజ్యాంగం ఆవిర్భావానికి ముందు సంయుక్త నియోజక వర్గాలు మరియు మొత్తం సభలో 51% రిజర్వేషన్ల సమస్యపై ముస్లింల అభిప్రాయాన్ని అంగీకరించవలసి వుంటుంది.
2. ఏ ప్రాంతాలలోనైతే ముస్లింలు అల్ప సంఖ్యాకులుగా ఉంటున్నారో అక్కడ

### శ్రీ గాంధీ యొక్క ప్రతిపాదనలు

1. ఈ ఎంపిక విధానం వయోజన ఓటింగ్ హక్కు ప్రాతిపదికగా జరగాలి.
2. సిక్కులకు మరియు ఇతర హిందూ అల్ప సంఖ్యాక వర్గాల వారికి తప్ప ఇతరులకెవరికి ఏ విధమైన ప్రత్యేక రిజర్వేషన్లు వుండవు.

కాంగ్రెస్ యొక్క కోరికలు

ఎ) పూర్తి స్వాతంత్ర్యం

వారు ప్రస్తుతం అనుభవించే హక్కులను అదే విధంగా కొనసాగించాలి. వారికి సంయుక్త నియోజక వర్గాలు లేదా ప్రత్యేక నియోజక వర్గాలను ఏర్పాటు చేసే విషయంలో ముస్లిం ఓటర్ల అభిప్రాయ సేకరణ జరిపి వారికోరికను మన్నించవలెను.

3. కేంద్రంలోని ఉభయ సభలలో ముస్లింల ప్రాతినిధ్యం మొత్తం బ్రిటిష్ ఇండియా ప్రతినిధులలో 26 శాతం ఉండవలెను. భారతీయ రాష్ట్రాల కోటాలో కనీసం 7 శాతం సాంప్రదాయబద్ధంగా ముస్లింలకు కేటాయించవలె. అంటే మొత్తం సభలో 1/3 వ వంతు.

4) మిగతా అధికారాలు బ్రిటిష్ ఇండియా అధికార యంత్రాంగానికి పరిమితం కావాలి.

5) అంగీకరించిన మిగతా అంశాలు :

ఎ) సింధ్[14]

బి) యన్.డబ్ల్యు.యఫ్.పి[15]

సి) సేవలు[16]

డి) క్యాబినెట్[17]

ఇ) మత మరియు సాంస్కృతిక, ప్రాథమిక హక్కుల పరిరక్షణ .

ఎఫ్) ఇతర మతాల వారి రక్షణకై ఏర్పరిచిన చట్టాలు.

బి) వెంటనే రక్షణపై పూర్తి ఆధిపత్యం

సి) విదేశీ వ్యవహారాలపై పూర్తి నియంత్రణ

డి) ద్రవ్య విషయాలపై పూర్తి నియంత్రణ

ఇ) ప్రజా ఋణాలు మరియు ఇతర బాధ్యతలపై శోధనకు స్వయం ప్రతిపత్తికలిగిన ట్రిబ్యునల్‌ను ఏర్పాటు చేయుట

ఎఫ్) భాగస్వామ్య విషయంలో ఇరు పక్షాలకూ కొనసాగుట లేదా రద్దుచేయుటలో స్వేచ్ఛ.

మహమ్మదీయులతో కలసి గాంధీగారు ఈ ఒప్పందానికి రూపకల్పన చేసినారు. మహమ్మదీయులు అభిలషించే పదునాలుగు కోర్కెలను అంగీకరించుటకు గాంధీ సంసిద్ధతను వ్యక్తం చేసినారు. ఈ ఫలితంగా మిగతా విషయాలతో పాటు హిందువులకు, ముస్లింలకు మరియు సిక్కులకు ప్రత్యేక నియోజక వర్గాల ఏర్పాటుకు గాంధీగారు మహమ్మదీయుల ఆమోదాన్ని అభిలషించుచున్నారు.

ఈ అగ్రిమెంటులో తప్పుఏమున్నదని ఎవరైనా అడగవచ్చు. మరి కాంగ్రెసు ఈ మూడింటికి తప్ప మిగతావారికి కుల ప్రాతిదికగా ప్రాతినిధ్యాన్ని అంగీకరించుటకు ఇష్టపడుటలేదు కదా? ఈ వైఖరిని చాలా లోతుగా చూడవలసియున్నది. దీనిలో తప్పులేదని భావించే వారు రెండు ప్రశ్నలకు సమాధానం చెప్పవలసి యున్నది. కాంగ్రెసు విధానాలతో ఏకీభవించుట కొరకు ఇతర అల్ప సంఖ్యాకులకు మరియు అస్పృశ్యులకు లేని ప్రత్యేక ప్రాతినిధ్య సౌకర్యం కేవలం మహమ్మదీయులకు కల్పించుటకు గాంధీ గారికి ఉన్న ఆవశ్యకత ఏమిటి? కాంగ్రెసు ఇతర అల్పసంఖ్యాక వర్గల వారిహక్కులనునిరోధించుటకు ముస్లింలను తనతో పాలుపంచుకొమ్మని ఎందుకు కోరినారు? ఒకవేళ తనకు ఈ ఉద్దేశ్యం లేనట్లయితే ముస్లింలతో చేసుకొన్న అగ్రిమెంటులో ఆవిషయాన్ని చేర్చే ఆగత్యమేమున్నది.

ఇక రెండో ప్రశ్న. ఈ ప్రత్యేక సందర్భంలో మహమ్మదీయులు కోరిన పదునాలుగు డిమాండ్లను అంగీకరించుటకు గాంధీగారు ఎందుకు సముఖత చూపినాడు. రాజకీయ పరమైన ఈ పదునాలుగు ముస్లింల డిమాండ్లు తప్పుగానో లేదా ఒప్పుగానో అందరిచే తిరస్కరింపబడినవి. అవి అన్నీ హిందూ మహాసభచే నిరాకరించబడినవి. అవి సైమన్ కమీషన్‌చే తిరస్కారం పొందినవి. అవి కాంగ్రెస్ నిరాకరణకు గురిఅయినవి. ఈ పదునాలుగు డిమాండ్లు ఏ పక్షం నుండి కూడా సహకారాన్ని పొందలేదు. ఇతర అల్ప సంఖ్యాకుల మరియు అస్పృశ్యుల డిమాండ్లను సంఘటితంగా ఎదుర్కొనుటకు, ముస్లింలను కొనివేయుటకు గాంధీగారు ఎందుకు ముందుకు వచ్చారు?

నా దృష్టిలో గాంధీగారు ఏ విధమైన విశ్వాసిత అగ్రిమెంటును కుదుర్చుకొనలేదు. అల్ప సంఖ్యాక వర్గాలు మరియు అస్పృశ్యుల హక్కులను భంగపరిచే కుట్రలో ముస్లిం

పాలుపంచుకొనే విధంగా వారిని ప్రేరేపించినాడు. ఇది ముస్లింల కోసం చేసిన అగ్రిమెంటుకాదు. అస్పృశ్యులకు వ్యతిరేకంగా చేసిన అగ్రిమెంటు. ఇది వెన్ను పోటుతో కూడిన దుశ్చర్య.

అస్పృశ్యుల ప్రయోజనం కోసం ప్రత్యేక ప్రాతినిధ్యం అనే విషయంలో మహమ్మదీయుల విముఖత రావలెనని కోరి చేసుకున్న అగ్రిమెంటు ఇతర కారణంలతో పాటు అమలు చేయుట అసంభవమై మూలపడినది. ఈ పథకాన్ని మహ్మదీయులు ఏ విధంగా అంగీకరిస్తారు? వారు ముస్లింల కొరకు ప్రత్యేక ప్రాతినిధ్యాన్ని కోరుతున్నారు. వారు కేవలం ప్రత్యేక ప్రాతినిధ్యమే కాక ప్రాతినిధ్యంలో ఎక్కువ ప్రాధాన్యత కోసం పోరాడుతున్నారు. గతంలో భారత దేశంమహమ్మదీయులచే పరిపాలింపబడినదనే అంశాన్ని దృష్టిలో ఉంచుకొని వారికి రాజకీయ ప్రాధాన్యత లభించేటట్లు ప్రయత్నించారు. ఒక వేళ చట్ట సభలో ముస్లింలకు తగిన ప్రాతినిధ్యం లేనట్టయితే హిందువుల పక్షపాత ధోరణికి గురి అవుతారు. రాజకీయంగా అట్టడుగున చేరిపోతారు కావున వారికి ప్రత్యేక ప్రాతినిధ్యాన్ని అభిలాషించుట తగినదే.

దీన్ని ఆధారంగా చేసుకొని ముస్లింలు ప్రత్యేక ప్రాతినిధ్యం కోరినట్లయితే అస్పృశ్యులకు ఇటువంటి వంద ప్రాతిపదికలున్నాయి. మరి ఏ ముఖంతో ముస్లిం అస్పృశ్యుల డిమాండ్‌ను తిరస్కరిస్తారు?

మహమ్మదీయులు ఈ విషయంలో సిగ్గునుగాని తమ స్థిరత్వాన్ని కోల్పోవుట గాని చేయలేదు. ఈ ఒప్పందంలో భాగస్వామిగా కొనసాగుటకు నిరాకరించారు. ఈ పదునాలుగు డిమాండ్ల కోసం గాంధీగారు మహమ్మదీయులను ప్రేరేపితులను చేయుటకు ఇంకా ప్రయత్నిస్తూనే ఉన్నాడు. వారు ఈ రకంగా అంగీకరించినట్లయితే 14 సూత్రాల ఒప్పందం వారికిచ్చే ధరకాదు అది పాపానికి పారితోషికం. మహమ్మదీయులకు సంబంధించిన మత సూత్రాల ఆధారంగా గాంధీగారు ఈ విషయాన్ని విన్నవించు కొన్నాడు. రౌండుటేబుల్ సమావేశంలో "అల్పసంఖ్యాకుల సబ్‌కమిటీకి నివేదించే అల్ప సంఖ్యాక ఒప్పందం"[18] జరిగే 13 నవంబర్, 1931[19] కి ఒకరోజు ముందుగా గాంధీగారు ఖురాన్ ప్రతిని తీసుకొని ముస్లింల ప్రతినిధులను కలుసుకొనుటకు పిక్కా డిల్లీలో రిట్జ్ హోటల్లో బసచేసియున్న గౌరవనీయుడైన హెచ్.హెచ్. ఆగాఖాన్‌నుకలుసుకొనుటకు

వెళ్లినాడు. అస్పృశ్యులకు ప్రత్యేక ప్రాతినిధ్యం అనే అంశాన్ని తీసుకొని మీరు ఎందుకు హిందూ సమాజాన్ని విభజించు తున్నారని ముస్లిం ప్రతినిధులను గాంధీ గారు ప్రశ్నించినారు. "ఖురాన్ దీనివి అనుమతించినదా? ఎక్కడ ఉన్నదో నాకు చూపండి. ఒక ఏళ అది లేకపోతే మీ తోటి సమాజాన్ని ఆ విధంగా విభజించే పాపాన్ని ఎందుకు నిరోధించరు?" మరిముస్లిం ప్రతినిధులు దీనికి ఏ విధమైన సమాధానం ఇచ్చారో నాకు తెలియదు. దీనికి ఖచ్చితంగా సమాధానం ఇచ్చుట చాలా కష్టసాధ్యం. ఈ ఆగంతుకమైన అంశం బహుశా మహమ్మద్ ప్రవక్త మదిలో ఆవిర్భవించి ఉండకపోవచ్చు. అతను దీనికి తగిన విధంగా ఉండలేడు. ఒక వేళ ఇటువంటి ఆగంతుక విషయాలు తల యెత్తినపుడు, దానికి తగిన నిర్దేశకత్వం లేనపుడు ఏమి చేయవలెనో అని అతని అనుచరులు అతనిని అడిగి ఉండవల్సినదని అనుకొని ఉండవచ్చు. ఈ సందర్భంలో 'కాఫిర్లు' ఏమి చేస్తారో దానికి వ్యతిరేకంగా చేయుడని అతను చెప్పినాడు.[20] దీనికి సమాధానం చెప్పుటలో నాకంటే ముస్లిం ప్రతినిధులు ఎక్కువగా ఆ విషయంలో నమ్మకం కలిగి గాంధీ గారికి తగిన సమాధానం ఇచ్చి ఉండవచ్చు. తగిన ఆధారాలతో నేను తెలుసుకొని విన్న విషయాన్ని ఇచ్చట పేర్కొంటున్నాను. మరునాడు మరొకసారి బహిరంగ కమిటీ జరిగినప్పుడు గాంధీ గారు అస్పృశ్యుల పట్ల కోపాన్ని ప్రదర్శించారు. మహమ్మదీయులు మౌనము పాటించారు. తన ఆశయ సాధనలో గాంధీగారు విఫలం చెందినారు.

ఈ విధమైన వైఖరి గురించి నేనేమి చెప్పగలను? బెర్నార్డ్‌షా చెప్పినట్లు బ్రిటిష్‌వారు అన్నిటినీ సూత్రాల ప్రాతిపదికగా చేస్తారు.

అదే విధంగా ప్రతిపనిని గాంధీగారు నైతికత మరియు దృఢ విశ్వాసమనే రెండు సూత్రాల ప్రాతిపదికగా చేస్తానని తెలియజేసారు. మరి తాను చేసే పనులు న్యాయం మరియు దృఢ నమ్మకం అనే పరీక్షలకు న్యాయం చేకూర్చగలవా? నాకు చాలా ఆశ్చర్యం వేస్తుంది. కొన్ని విషయాలు నన్నువెల్లడించనివ్వండి.

మొదటి రౌండ్ టేబుల్ సమావేశానికి వెళ్లే ముందుగా నేను గాంధీగారిని బొంబాయిలో కలుసుకొన్నాను. ఆ కలయికలో అస్పృశ్యుల కొరకు ప్రత్యేక ప్రాతినిధ్యానికై రౌండు టేబుల్ సమావేశంలో అడగదలుచుకున్నానని గాంధీగారితో చెప్పాను. అతను దీనికి నేను ఒప్పుకోక పోయినా అభ్యంతర పెట్టను అని తెలియజేశాడు. ఇది భావాలలో వ్యత్యాసంగా

నేను భావించాను. రెండవ రౌండ్ టేబుల్ సమావేశంలో ఒకసారి ఒంటరిగా మరొకసారి అల్పసంఖ్యాకుల ప్రతినిధులతో గాంధీగారిని నేను రెండు సార్లు కలిశాను. మొదటిసారి కలిసినపుడు నేను మాట్లాడుతుంటే గాంధీగారు నూలు వడుకుతున్నాడు. నేను గంటకు పైగా మాట్లాడినప్పటికీ అతను ఒక చిన్న మాటను పలుకలేదు. చివరలో ఈ విధంగా అన్నాడు :

"నేను నీమాటలను విన్నాను. నీవేమి చెప్పావో నేను ఆలోచిస్తాను." రెండవసారి అల్ప సంఖ్యాకుల ప్రతినిధులతో కలిసినపుడు నేను అస్పృశ్యుల తరపున చేసిన కోరికను అంగీకరించుటకు తాను సిద్ధంగా లేనని తెలియజేసినాడు. అటుతర్వాత 28 సెప్టెంబర్ 1931న అల్ప సంఖ్యాకుల ఉపసంఘం సమావేశమైనది. అక్టోబర్ 1, 1931న జరిగిన సబ్‌కమిటీ లో గాంధీ గారిచే ఈ విధమైన ప్రతిపాదన చేయడం జరిగినది.

"గత రాత్రి గౌరవనీయుడైన ఆగాఖాన్ మరియు ఇతర ముస్లిం స్నేహితులతో ప్రధానమంత్రి సంభాషించిన తర్వాత మేము ఒక ముగింపుకు వచ్చాము. మనం ఏ ఉద్దేశ్యం కోసం అయితే ఇచ్చట సమావేశం అయ్యామో దీనిని ఒక వారం వరకు వాయిదా వేయుట సమంజసమని కోరడమైనది. నేను నా సహచరులతో సంప్రదించలేదు. కాని నేను ఏ ప్రతిపాదన చేసినా వారు అంగీకరిస్తారనటంలో నాకు సందేహం లేదు."

ఈ ప్రతిపాదనను ఆగాఖాన్ బలపర్చినాడు. నేను లేచి దీనికి అభ్యంతరం తెలుపుతూ, ఈ ప్రతిపాదనపై నాకు గల అభ్యంతరాన్ని ఈ ప్రకటన ద్వారా సమర్థించుకున్నాను.[21]

"డాక్టర్ అంబేద్కర్ : ముందున్న సమస్యకు పరిష్కారం కనుగొనే విషయంలో నేను ఏ విధమైన సంక్లిష్టతను సృష్టించ దలుచుకొనలేదు. మహాత్మాగాంధీ సూచించిన మార్గాల ద్వారా సమస్యకు పరిష్కారం చూపినట్లయితే నాకు ఎలాంటి అభ్యంతరం లేదు.

"కాని ఒకే ఒక సమస్య కలదు. అది అది నేను దళితుల ప్రతినిధిగా ప్రాతినిధ్యం వహిస్తూ దానిని ఎదుర్కొంటున్నాము. వాయిదా వేసిన సమావేశ కాలంలో మరి మహాత్మాగాంధీగారు ఏ విధమైన కమిటీని ఈ సమస్యకొరకు వేయదలుచుకున్నాడో నాకు అవగాహన కాలేదు. కాని దళితులకు తగిన ప్రాతినిధ్యం ఆ కమిటీలో ఉంటుందని నేను అనుకుంటున్నాను.

"శ్రీ గాంధీ : సంశయం ఏమీలేదు.

డాక్టర్ అంబేద్కర్ : కృతజ్ఞతలు. ప్రస్తుతం నేనున్న పరిస్థితుల దృష్ట్యా ఏర్పాటు చేయబోయే కమిటీలో నేను చేసే పనిఏమిటి? అదినాకు ఎంతవరకు ఉపకరిస్తుందో నాకు అర్థంకావటంలేదు. దీనికి కారణం ఉన్నది. భారత జాతీయ కాంగ్రెస్ ప్రతినిధిగా ఫెడరల్ నిర్మాణ కమిటీలో పాల్గొన్న మొదటిరోజున మహమ్మదీయులకు మరియు సిక్కులను మినహాయించి మిగతా మతాలవారికి ఏవిధమైన రాజకీయ పరమైన గుర్తింపు ఇవ్వనని గాంధీగారు మాతో అన్నారు. ఆంగ్లో ఇండియన్స్, దళిత వర్గాలను మరియు భారతీయ క్రిస్టియన్‌లను గుర్తించుటకు అతను సిద్ధంగాలేడు. నిన్నటిరోజున ఇతర అల్పసంఖ్యాకుల ప్రతినిధులుగా మేము గాంధీగారిని సంతోషంగా కలుసుకొని దళితుల విషయమై చర్చించిన విషయాలను ఈ కమిటీలో వెల్లడిచేయుటలో నేనుఎలాంటి ఆచారానికి విరుద్ధముగా పాలుపడుటలేదని భావించుచున్నాను. ఫెడరల్ నిర్మాణకమిటీలో ఈ విషయమై తాను దృఢ నిర్ణయానికి వచ్చానని, న్యాయమైన షరతులతో కూడిన వైఖరి తాను కల్గియున్నానని అన్నాడు. భవిష్యత్‌లో రూపొందించే భారత రాజ్యాంగంలో దళితులకు తగిన గుర్తింపు ఇవ్వకుండా ఉన్నట్లయితే ఈ విషయమై మహాత్మాగాంధీచే ఏర్పాటుచేయబడిన కమిటీలో నేను పాల్గొనుటలో అర్థం ఏమిటో నాకు అవగాహన కావటంలేదు. గత సంవత్సరంలో జరిగిన అల్పసంఖ్యాక వర్గాల కమిటీలో చేసిన తీర్మానాల ప్రకారం అన్ని అల్పసంఖ్యాక వర్గాలవారికి నూతన రాజ్యాంగంలో గుర్తింపు లభిస్తుందనే హామీ ఉండి తీరాలి. మరి ఉద్దేశించబడే కమిటీకి నేను హృదయ పూర్వకంగా సహకరిస్తానో, లేదో నాకు తెలియదు. దీనిని నేను తేటతెల్లం చేయదలచినాను.

★ ★ ★ ★

"డాక్టర్ అంబేద్కర్ : నేను ఇంకా నాస్థితిని వెల్లడి చేయదల్చుకున్నాను. నేను చెప్పేదాని గురించి కొంత అవగాహన లోపమున్నట్లుగా కన్పించుచున్నది. వాయిదా వేయుటకు నేను వ్యతిరేకిని కాను. సమస్యలకు పరిష్కారం కనుగొనుటకు వేసే కమిటీలను వ్యతిరేకించుట నాఉద్దేశం కాదు. ఈ కమిటీలో ప్రవేశించే ముందు నాకు కొన్నివిషయాలు తెలియాలి. ఈ కమిటీ ఏవిషయాలను పరిశీలించదలుచు కున్నది?

ఇది కేవలం హిందూ మరియు మహమ్మదీయుల సమస్యలను పరిగణిస్తుందా? ఇది పంజాబ్‌లోని సిక్కులను మరియు మహమ్మదీయుల విషయాలను చర్చిస్తుందా? లేదా ఈ కమిటీ క్రిష్టియన్ల, ఆంగ్లో ఇండియన్ల మరియు దళిత వర్గాల సమస్యలనుకూడా పరిగణిస్తుందా?

"ఈ కమిటీ ప్రారంభించే ముందు మనకు ఖచ్చితంగా తెలిసి ఉండాలి. ఈ కమిటీ కేవలం హిందూ మరియు మహమ్మదీయుల సమస్యలే కాకుండా దళితవర్గాలు, ఆంగ్లో ఇండియన్లు మరియు క్రిష్టియన్ల సమస్యలనుకూడా పరిష్కరించుటకు బాధ్యత వహించవలసి ఉంటుంది. ఈ విషయానికైతే వాయిదా తీర్మానికి నాకు ఎలాటి అభ్యంతరం లేదు.

"ఒకవేళ ఈవిరామాన్ని హిందూ మరియు మహమ్మదీయుల సమస్యల పరిష్కారానికి వినియోగించుటకు నన్ను వదలివేస్తారని నేను చెప్పుటలేదు. అల్పసంఖ్యాకుల కమిటీ అన్ని అల్ప సంఖ్యాకవర్గాల సమస్యలను చర్చించి తగిన పరిష్కారాన్ని చూపించుటకు ఉద్దేశించబడాలే కాని కొన్ని అల్పసంఖ్యాకుల సమస్యలను లాంఛన ప్రాయంకాని కమిటీలకు వదిలివేయరాదని నేను నొక్కి స్పష్టంగా వెల్లడిచేస్తున్నాను."

కమిటీ చైర్మన్ అయినటువంటి ప్రధానమంత్రి గాంధీగారిని తన స్థితిఏమిటో వెల్లడి చేయమని కోరగా అందుకు ఈవిధంగా సమాధానం ఇచ్చినాడు.[22]

"ప్రధానమంత్రి మరియు స్నేహితులారా! మనం చేసేపనియొక్క పరిధి గురించి మనలోనే కొంతమందికి మధ్య అవగాహన లోపించినట్లుగా విదితమవుతుంది. డాక్టర్ అంబేద్కర్ మరియు కల్నల్ గిడ్నీలు ముందు ఏమి జరుగుతుందోనని అనవసరంగా భయపడుతున్నారు. భారతదేశంలో ఏ ఒక్క వ్యక్తికిగాని, ఒక వర్గానికిగాని, ఒక ఆసక్తిగలవారికి రాజకీయ హోదా నిరాకరించుటకు నేను ఎవరిని? కాంగ్రెస్ ప్రతినిధిగా కాంగ్రెసు నాపై వుంచిన నమ్మకాన్ని ఒక చిన్నవిషయం దృష్ట్యా జాతి ప్రయోజనాలను త్యాగం చేయలేను కదా! ఈ విషయంలో నా స్వంత అభిప్రాయాలను నిస్సంశయంగా వెల్లడి చేయదలచినాను. నేను కలిగిన అభిప్రాయాలపై నాకు స్థిరత్వం ఉన్నట్లుగా భావించుచున్నాను. కాని ప్రతిఒక చిన్న ప్రయోజనానికి రక్షణ కల్పించుటకు మార్గాలున్నాయి. ఈ విషయంలో ఎవరైతే

తలదూర్చుతారో వారు అందుకు ఒక పథకాన్ని రూపొందించవలసి వుంటుంది. లాంఛన ప్రాయం కాని సమావేశంలో ఎవ్వరుకూడా తన అభిప్రాయాలను మిగతాసభ్యులమీద రుద్దే ప్రయత్నం చేయలేరు.

"అందువలన, తన అభిప్రాయాలను వెల్లడి చేయుటకు, తన అభిప్రాయాల కనుగుణంగా కొనసాగుటకు ఏవిధమైన భయాన్ని కలిగివుండవలెనని నేను భావించుటలేదు. మనలో అందరూ సమాధానమే. ఇదేమీ ఎక్కువ బరువును మోపదు. ఇతరుల అభిప్రాయాలపై నా అభిప్రాయాలను బలవంతంగా రుద్దే అధికారం నా వెనుకేమిలేదు. జాతి ప్రయోజనాల దృష్ట్యా కేవలం నా అభిప్రాయాలను వెల్లడిచేసినాను. ఈ అభిప్రాయాలను మీరు అంగీకరించినా లేదా తిరస్కరించినా అది మీ ఇష్టమే. అందువలన దయచేసి మీ మెదళ్ళను మలినపరచకండి. లాంఛనరహితమైన సమావేశంలో వెల్లడించిన భావాలను నేను క్లుప్తంగా తెలియజేసినాను. ఒకవేళ ఈ టేబుల్ ముందు నిక్కచ్చిగా కూర్చొనుటకంటే లాంఛనరహితమైన సమావేశం మనలను ఇంకా దగ్గరికి చేస్తుందని మీరు భావించినట్లయితే ఈ వాయిదా తీర్మానపు ప్రతిపాదన అవసరం లేదు. కాని లాంఛన రహిత సమావేశంలో ఈ విషయంపై మీ హృదయపూర్వక సహకారాన్ని అందచేయవలసి ఉంటుంది."



నా అభ్యంతరాన్ని ఇక ఉపసంహరించుకున్నాను.

బహిరంగ సమావేశంలో గాంధీగారిచేత ఒక ఖచ్చితమైన మాట ఇక వచ్చింది. అదేమిటి అనగా, అందరు అస్పృశ్యుల హక్కులను గుర్తించుటకు అంగీకరించినట్లయితే తాను అభ్యంతరం తెలుపనని. ఈ మాట ఇచ్చినతర్వాత అస్పృశ్యుల హక్కులను గుర్తించవద్దని గాంధీగారు మహమ్మదీయులను ప్రేరేపించినాడు. అందుకు వారు తనతో నిలబడేటట్లు వారికి ఆశచూపినారు. ఇది సరియైన విశ్వాసమేనా? లేదా నమ్మకమా? ఇది ఒకవేళ ద్రోహం కానట్లయితే ఇక ద్రోహమయ్యేది ఏమున్నదని నాకు ఆశ్చర్యం కలిగినది.

అల్పసంఖ్యాకుల ఒడంబడికపై సంతకం చేయుటచే నేను బందీనయ్యాను. నేను దేశద్రోహిగా చిత్రించబడినాను. ఆ ఒడంబడికపై సంతకం చేయుటకు నేను ఎప్పుడూ

సిగ్గుపడలేదు. నాపై విమర్శల అమాయకత్వంపై నే జాలిపడతాను. ఐరిష్ హోమ్‌రూల్‌పై అల్పసంఖ్యాకులు కూడా అదే అభిప్రాయాన్ని కలిగి ఉన్నారనే విషయాన్ని వారు విస్మరించినారు. పీడితుల రక్షణ కొరకు ఏమైనా చేయుటకు 'రెడ్‌మండ్' సంసిద్ధంగా ఉన్నాడు. కాని వారు 'మీ రక్షణ మాకేమి అవసరం లేదు. మీ పరిపాలన మాకు అవసరం లేదని' చెప్పినారు. కాని హిందువులు వారు ఈ వైఖరిని కలిగిఉంటారని ఆలోచించి ఉండలేదు. ఒడంబడికలో రక్షణలు వున్నాయితప్ప మరేమీలేవు. వీటి అన్నింటినీ గురించి ఆలోచించే బదులుగా గాంధీ గారు ఒడంబడికలపై మరియు వాటి రచయితలపై తన ఉగ్రరూపాన్ని ప్రదర్శించినాడు అతను ఈ విధంగా అన్నాడు.

"ఈ నివేదిక విషయానికి వచ్చినట్లయితే[23] 'సర్ హూబర్ట్‌కార్' తెలియచేసిన కృతజ్ఞతలను నేను అంగీకరించుచున్నాను. ఈ భారాన్ని నేను నా భుజస్కంధాలపై వేసుకున్నందువల్ల తగిన పరిష్కారానికి రావటంలో వైఫల్యం చెందినందువల్ల ఈ సమస్యకు ఆశ్చర్యకరమైన సమాధానం వచ్చిందని సర్‌హూబర్ట్‌కార్ చక్కగా వర్ణించినాడు. ఈ అల్పసంఖ్యాకుల సమస్యను కమిటీకి నివేదించి అటు తర్వాత తన ప్రభుత్వఅనుమతికి సమర్పించవలసి వుంటుందని అతను భావించినాడు.

"సర్ హ్యూబర్ట్ కార్ మరియు అతని అనుయాయులు కలిగిన యున్న సంతృప్తిని నేను కాదనుటలేదు. కాని నా అభిప్రాయంలో వారు శవం ప్రక్కన కూర్చుని శవాన్ని కోయుట తప్ప మరేమీ చేయలేదు."

గాంధీగారికి ఈవిషయంపై కోపాన్ని ప్రదర్శించుటకు హక్కు ఏమున్నది? తనకు నైతికంగా వ్యథ కలుగుతుందని భావించే హక్కున్నదా? అల్ప సంఖ్యాకులపై రాళ్లు విసురుటకు ఏవిధమైన అధికారాన్ని కలిగియున్నాడు? అల్ప సంఖ్యాకుల వలెనే తానుకూడా పాపాత్ముణ్ణే అనే విషయాన్ని గాంధీగారు మరచిపోయినారు. న్యాయాత్మక బాధ్యత తనలో లేనట్లయితే తాను పాపులకన్నా హీనమైన వాడు. అల్ప సంఖ్యాకులు మృతదేహాన్ని విభజించినట్లయితే గాంధీగారు ఏమి చేయుచున్నారు? గాంధీగారు ఈ శవాన్ని హిందువులు, మహమ్మదీయులు మరియు సిక్కులుగా విభజించినాడు. అల్పసంఖ్యాక వర్గాలవారు తమకు కూడా మిగతా వారికి వలె వాటాఉండాలని కోరినారు. ఈ శవాన్ని బాగా

బలిసిన నక్కల ముందు వేస్తే ఆకలితో నకనకలాడే బలహీనమైన గొర్రెలుకూడా చిన్న కభళాన్ని ఇవ్వమని అడుగుట తప్పా? ఈ వివాదాస్పదమైన అంశంలో న్యాయం గాంధీగారి వైపు లేదు.

ఎవరైతే తాము అస్పృశ్యులై ఉండి అస్పృశ్యుల తరఫున మాట్లాడుతున్నారో వారికంటే తనే అధికంగా వారి ప్రతినిధినని గాంధీ గారు తెలియజేసుకుంటున్నారు. ఏవిధమైన నైతిక ప్రవర్తన, న్యాయం మరియు ఆవశ్యత లేకుండానే తన వారి పరిరక్షణకు కర్తనని వెల్లడించుకుంటున్నాడు. సామాజిక పీడన, సాంఘిక అణిచివేత ఏమీ లేకుండానే మహమ్మదీయులకు రాజకీయపరమైన రక్షణ హిందువులతో పాటు కల్పించినపుడు మిగతావారికి ఎందుకు ఇవ్వరాదు? రాజకీయ హక్కును హిందువులు, మహమ్మదీయులు మరియు సిక్కులు పంచుకుంటున్నారు కదా! అస్పృశ్యులు కాంగ్రెసు ఆధీనంలో జీవనంగడపాలని గాంధీగారు కోరుతున్నారు. కాంగ్రెసు ఏరకమైన రక్షణ కల్పించకుండానే వారి మనుగడకు భద్రత ఎట్లు కలిగిస్తుంది? అస్పృశ్యులు నిరంతరం మరియు ప్రతిచోటా సామాజిక పీడనను ఎదుర్కొంటూ తమ జీవితాలకు ప్రమాదం వాటిల్లుతుందని భావించి బయట నుండి సహకారాన్ని అభిలషించుచున్నప్పుడు గాంధీగారు చేసే పని ద్రోహ పూర్వకమైనది కాదా? తమకు జరుగుతున్న అన్యాయాలపై గాంధీగారికి వ్యతిరేకంగా అస్పృశ్యులు ప్రపంచానికి నివేదించేందుకు 1వ రౌండు టేబుల్‌సమావేశంనుండి బొంబాయికి తిరిగి వచ్చిన గాంధీగారికి నిరసన తెలియ జేయడంలో అన్యాయం వుందా?

*అనువాదం : డా॥ యం. ఎర్రగట్టు స్వామి*
*ప్రొ॥ ఎస్. లింగమూర్తి*

**పాద సూచికలు :**

1. "Gandhi in London" Asia, 1932 ఫిబ్రవరి.
2. పట్టాభి సీతారామయ్య – "History of the Congress", పేజీ – 857.
3. శ్రీ అండ్రూస్ ఒక సారి కుల వ్యవస్థను సమర్థించే దాకా వెళ్ళాడు.

4. 1920 కలకత్తా కాంగ్రెస్ సమావేశంలో ఆమోదించిన తీర్మానంలో ఈ భాగం ఉంది. "ఖిలాఫత్ విషయంలో భారత, బ్రిటిష్ ప్రభుత్వాలు ముస్లింలపట్ల తమ బాధ్యత నిర్వర్తించడంలో విఫలమై ప్రధాన మంత్రి వారికిచ్చిన మాట తప్పడం వల్ల, తమ ముస్లిం సోదరులకు సంభవించిన ఈ మతపరమైన ప్రమాదాన్ని తొలగించేందుకు దేశంలోని ముస్లిమేతరులంతా సాయపడాల్సి ఉంది.

5. యంగ్ ఇండియా

6. సైమన్ కమిషన్ రిపోర్టు. Vol.II, పేజీ 65-66

7. అందుకు సంబంధించిన తీర్మానం ఈ విధంగానున్నది.

ప్రస్తుతం సిక్కులలో నెలకొనియున్నటువంటి భారత దేశభవిష్యత్ రాజకీయ స్థితి అనే విషయంలో అపనమ్మకాన్ని తొలగిస్తూ భారత దేశంలో స్వరాజ్య స్థాపన కోసం రూపొందించిన ఏ పథకంలోనైనా మహమ్మదీయులకు మరియు ఇతర అల్ప సంఖ్యాక వర్గాల వారికి కల్పించిన రక్షణలన్ని సిక్కులకు కూడా కల్పించుట జరుగుతుంది.

8. కాంగ్రెస్ ప్రతినిధిగా ఎంపిక కాబడిన గాంధీ గారిపై దిగువ పేర్కొన్న తీర్మానం కాంగ్రెస్ అభిప్రాయం అని వెల్లడి చేయమని నిర్దేశించడమైనది. దీనిని కరాచి కాంగ్రెస్‌లో తీర్మానించారు.

ఆ కాంగ్రెస్ కమిటీ మరియు భారత ప్రభుత్వం సమిష్టి అంగీకారంతో ఒక ఒప్పందాన్ని కుదుర్చుకొని కాంగ్రెస్ యొక్క లక్ష్యం పూర్ణస్వరాజ్యంగా ప్రకటించడమైనది. అనగా మిగతా విషయాలతో ప్రమేయం లేకుండా సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని సాధించుట. మిగతా విషయాలను చర్చించుటకు బ్రిటిష్ ప్రభుత్వ ప్రతినిధులు మరియు కాంగ్రెస్ ప్రతినిధుల సమావేశాలు ఏర్పాటు చేయవలె. కాంగ్రెస్ ప్రతినిధులు ఈ లక్ష్యం కోసం పనిచేస్తూ, రక్షణ విదేశీ వ్యవహారాలు, విత్త విధానం, ద్రవ్య విధానం, ఆర్థిక విధానాలను రూపకల్పన చేస్తూ వాటిని నియంత్రించుటకు భారతీయ, బ్రిటిష్ ప్రభుత్వపు ఆర్థిక విధానాలను సమీక్షించే పక్షపాత రహితమైన ట్రిబ్యునల్‌కు వదిలివేయుట జరుగుతుంది. ఇందుకై జరిపే వివిధ సర్దుబాట్లు మరియు సంప్రదింపుల నిమిత్తం భారత దేశ పరిరక్షణ నిమిత్తం కాంగ్రెస్ ప్రతినిధిగా వ్యవహరిస్తుంది.

9. యంగ్ ఇండియా - నవంబర్ 19, 1931

10. ఈ మాటల నుంచి ఎవరైనా గాంధీ గారు కేవలం ప్రత్యేక నియోజక గణాలకు మాత్రమే వ్యతిరేకులనీ, అస్పృశ్యులకు ఉమ్మడి నియోజక వర్గాలూ, రిజర్వు

చేసిన నియోజక వర్గాలూ ఇవ్వదల్చుకున్నారని అనుకోవచ్చును. కానీ ఆయన రౌండ్ టేబుల్ సమావేశంలో ఇలా అన్నారు. "నేను మళ్ళీ చెపుతున్నాను హిందువులకు, ముస్లింలకు, సిక్కులకూ ఆమోదయోగ్యమైన ఏ పరిష్కారాన్నైనా కాంగ్రెస్ ఎప్పుడూ ఆమోదిస్తుంది. కానీ ఇతర మైనారిటీలకు ప్రత్యేక రిజర్వేషన్లు, ప్రత్యేక ఎన్నిక గణాలను మాత్రం ఒప్పుకోదు.

11. యంగ్ ఇండియా, అక్టోబర్ 27, 1920

12. ఈ పత్రం నా "Thoughts on Pakistan" (1939)లో మొదటి సారి ముద్రితమైంది. దాని ప్రామాణికత ఎప్పుడూ ప్రశ్నించబడలేదు. ముస్లింలీగ్ మిత్రులనుంచి దీన్ని పొందిన ఒక రౌండ్ టేబుల్ కాన్ఫరెన్స్‌లో పాల్గొన్న హిందూ ప్రతినిధి ఒకరు దీన్ని నాకు అందించారు.

13. దీని వల్ల ఈ పత్రం ముస్లిం లీగు ప్రతినిధి వర్గపు కాగితాల మీద టైపు చేయబడిందని తెలుస్తుంది.

14. అంటే సింద్ వేర్పాటును

15. అంటే వాయువ్య ప్రాంతాల ప్రాంతీయ స్వయంప్రతిపత్తి మరియు బాధ్యతాయుతమైన ప్రభుత్వము.

16. అంటే ఉద్యోగాలలో ప్రాతినిధ్యం

17. అంటే మంత్రి వర్గంలో ప్రాతినిధ్యం

18. చూ. అంబేద్కర్ "కాంగ్రెస్ మరియు గాంధీ అస్పృశ్యులకేమి చేశారు" పేజీ 67. సం.

19. Ibid పేజీ 307-311

20. చూ. ఖురాన్

21. ఈ క్రింది భాగాలు 84వ పేజీలో "అందజేయవలసి ఉంటుంది" వరకూ- రాత ప్రతిలో లేవు. వీటిని "కాంగ్రెస్ మరియు గాంధీ అస్పృశ్యులకేమి చేశారు" నుండి తీసుకోవడం జరిగింది. – సం

22. Ibid.

23. ఇది మైనారిటీల ఒప్పందం (Minorities pact) కు సంబంధించినది.

**అనువాదం : డా॥ యం. ఎర్రగట్టు స్వామి,**

**ప్రొ॥ ఎన్. లింగమూర్తి**

అధ్యాయం - 25

# గాంధీ - ఆయన నిరాహారదీక్ష

**I. పూనా ఒడంబడిక II. హరిజన సేవక్ సంఘ్ III. దేవాలయాలూ - అస్పృశ్యులు IV. గాంధీ మార్గం.**

## I

మత సమస్య అనే శిలను ఢీకొనే ఇండియన్ రౌండ్ టేబుల్ కాన్ఫరెన్స్ ఓడ బద్దలయింది. మెజారిటీ వర్గాలకు, మైనారిటీ వర్గాలకు ఏ ఒప్పందం పొసగక పోవటం వల్లే కాన్ఫరెన్స్ నిలిచిపోయింది. శాసనసభల్లో తమకు ప్రత్యేక ప్రాతినిధ్యం కల్పిస్తేనే గాని స్వతంత్ర రాజ్యంలో తమకు రక్షణ ఉండదనే విషయాన్ని భారత దేశంలోని మైనారిటీ వర్గాలు నొక్కి చెప్పాయి. సిక్కులు, ముస్లింల విషయంలో తప్ప అలాంటి ప్రతి పాదనను అంగీకరించేందుకు కాంగ్రెస్ ప్రతినిధి గాంధీగారు సంసిద్ధతను వ్యక్తం చేయలేదు. సిక్కులు, ముస్లింల విషయంలో కూడా సీట్ల సంఖ్యను గురించి గాని, ఎన్నిక గణాల స్వభావాన్ని గురించి గానీ అంగీకారం కుదరలేదు.

అంతటా ప్రతిష్టంభన. ఒప్పందాలకు అవకాశంలేని పరిస్థితుల్లో మధ్యవర్తిత్వం మీద ఆశలు రేకెత్తాయి. దీనికి నేను తప్ప అందరూ అంగీకరించారు. పరిష్కరించే బాధ్యత ప్రధాని రాంసే మెక్‌డొనాల్డ్‌కు వదిలి వేయబడింది. మొట్టమొదటి రౌండ్ టేబుల్ కాన్ఫరెన్స్‌లో భారత ప్రతినిధులెవ్వరూ మత సమస్య పరిష్కారానికి ఒక అంగీకారానికి రాలేక పోయినప్పుడు ఇంతకన్నా వీళ్ళ నుంచి ఆశించేదేమీ లేదని గాంధీ గారి అనుయాయులు అన్నారు. వారు భారత ప్రతినిధులుగా అనర్హులని, బాధ్యతా రహితంగా ప్రవర్తిస్తూ బ్రిటిష్ ప్రభుత్వం చేతుల్లో కీలు బొమ్మలుగా, తొత్తులుగా పని చేస్తూ అనైక్యతను సృష్టిస్తున్నారని కూడా అన్నారు. ఈ తగాదా పరిష్కారానికి అవసరమైన రాజనీతిజ్ఞత గల గాంధీగారు రావటం అవసరమనీ, ఆయన వేంచేసేంత వరకూ ఆగటం మంచిదని ఎలుగెత్తి ప్రపంచానికి చాటారు. అందుకే ప్రధాని మధ్యవర్తిత్వాన్ని కోరుతూ చేసిన విజ్ఞాపనలో గాంధీగారు కూడా తన దివాళాకోరుతనాన్ని నిరూపించుకొని భాగస్వామి కావటంతో ఆయన మిత్రులంతా ఎంతో చిన్నబుచ్చుకున్నారు.

కాన్ఫరెన్సు విఫలమైందీ అంటే ఆ తప్పంతా గాంధీగారిదే. భారత దేశంలోని విభిన్న వర్గాల ఆశయాల్లో సఖ్యతను సాధించగల రాజ్యాంగ నిర్మాణానికి ఉద్దేశించిన కాన్ఫరెన్సుకు ఇంతకన్న తెలివితక్కువ ప్రతినిధిని గానీ, యుక్తిహీనుడైన ప్రతినిధిని గానీ పంపడం సాధ్యం కాదు. రాజ్యాంగ శాసనాల గురించిగానీ, ఆర్థిక విషయాల గురించిగానీ, గాంధీగారి కేమీ తెలియదు. మేధోశక్తిలో ఆయనకు విశ్వాసం లేదు. నిజానికి ఈ విషయాలంటేనే ఆయన్లో చెప్పనలవి కాని తృణీకారం బయల్దేరుతుంది. అందువల్లనే సమస్యల పరిష్కారానికి ఆయన చేసింది శూన్యం. ఆయన ఎందుకు యుక్తి హీనుడంటే తానే ముఖ్యమైన వ్యక్తిననీ, మిగతా వాళ్ళంతా లెక్కలోని వాళ్ళు కారని, ఏం చేయాలన్నా తానే చేయగలననీ, తన వల్లనే పనులన్నీ జరుగుతున్నాయని చెప్పడం ద్వారా డెలిగేట్లందరినీ మనస్తాపానికి గురి చేసి చీకాకు పెట్టేవారు. మొదటి రౌండ్ టేబుల్ కాన్ఫరెన్స్‌లో మత సమస్యపై ఎలాంటి పరిష్కారాన్ని అంగీకరించేందుకు డెలిగేట్లు ఇష్టపడని మాట వాస్తవమే. కాని అంగీకారానికి దగ్గరగా వచ్చిన మాట కూడా అంతే నిజం. అంగీకారం కుదురుతుందనే ఆశతోనే డెలిగేట్ల కాన్ఫరెన్స్ తరవాత ఎటువాళ్ళటు వెళ్ళి పోయారు. కాని రెండవ రౌండ్ టేబుల్ కాన్ఫరెన్స్ చివర్లో గాంధీగారు ఎంత దుష్పరిణామాల్ని సృష్టించారంటే సఖ్యత కుదిరే అవకాశమే లేకుండా పోయి ఇక మధ్య వర్తిత్వం కన్నా గత్యంతరం లేని పరిస్థితి ఏర్పడింది. కుల/మత సమస్య (Communal question) పై ప్రధాని తన నిర్ణయాలను 17 ఆగష్టు 1932న ప్రకటించారు. అస్పృశ్య ప్రజానీకానికి సంబంధించినంత వరకు ఆ నిర్ణయంలోని షరతులు ఈక్రింద పేర్కొన్న విధంగా ఉన్నాయి.

## కుల/మత సమస్య పై బ్రిటిష్ ప్రభుత్వ నిర్ణయం - 1932

"భారత దేశంలోని కుల/మత వర్గాలు కాన్ఫరెన్స్ పరిష్కరించలేకపోయిన కుల మత సమస్యపై అన్ని పక్షాలకూ ఆమోదయోగ్యమైన పరిష్కార మార్గాన్ని కనుగొనలేకపోయినప్పటికీ, ఈ సాకుతో రాజ్యాంగ పురోభివృద్ధికి ఆటంకమేర్పడదనీ, పరిష్కారానికి తాత్కాలిక పద్ధతి ఏదైనా అవలంబించి ఈ సమస్యను అధిగమించవచ్చని గత డిసెంబర్ ఒకటిన రెండవ రౌండ్ టేబుల్ కాన్ఫరెన్స్ ముగింపు సమావేశంలో ప్రధాని చేసిన ప్రకటన స్పష్టం చేసింది. ఈ ప్రకటనకు పార్లమెంటు ఉభయ సభలూ ఆమోదాన్ని తెలిపాయి.

"2. కుల మత వర్గాలు ఒక పరిష్కారాన్ని సాధించటంలో విఫలమవుతూ రావటం వల్ల కొత్త రాజ్యాంగ నిర్మాణానికి ఆటంకమేర్పడుతున్న విషయం తెలుసుకున్న తర్వాత క్లిష్టతరమూ, వివాదాస్పదమూ ఐన ప్రశ్నల్ని లేవనెత్తిన ఈ విషయాన్ని గురించి జాగ్రత్తగా పునః పరిశీలిస్తున్నామని, గత మార్చి 19న బ్రిటిష్ ప్రభుత్వం ప్రకటించింది. మైనారిటీల స్థితి మెరుగు పర్చేందుకు ఏవో కొన్ని అంశాలకైనా కొత్త రాజ్యాంగంలో స్థానముండనిదే దాని నిర్మాణంలో ప్రగతి సాధించలేమనే సత్యాన్ని ప్రభుత్వం ఈపాటికే గుర్తించింది.

"3. ఆ ప్రకారమే ఈ క్రింద పేర్కొన్న పథకంలో కొన్ని భాగాలను పార్లమెంటుకు సమర్పించనున్న రాజ్యాంగ నిర్మాణ ముసాయిదాలో పొందుపర్చటానికి బ్రిటిష్ ప్రభుత్వం నిర్ణయించింది. బ్రిటిష్ ఇండియాలోని కులమత వర్గాలకు ప్రాంతీయ శాసన సభల్లో ప్రాతినిధ్యం కల్పించేంత వరకే ఈ పథకం పరిధి పరిమితం. ఈ దిగువ 20వ పేరాలో పేర్కొన్నట్లు కేంద్ర శాసన సభలో ప్రాతినిధ్యాన్ని గురించిన ఆలోచనను వాయిదా వేశారు. ఈ పథకం పరిధిని పరిమితం చేయాలనే నిర్ణయంలోని గూఢార్థం మైనారిటీలకు సంబంధించిన ముఖ్యమైన ఎన్నో ఇతర సమస్యల గురించి రాజ్యంగ నిర్మాణ క్రమంలో నిర్ణయాలు తీసుకోవలసిన ఆవశ్యకతను గుర్తించలేకపోవడం వల్ల కాదు; మౌలిక సమస్యలైన ప్రాతినిధ్య పద్ధతులూ, నిష్పత్తిలకు సంబంధించి ఒక ప్రకటన చేస్తే మిగతా సమస్యలకు సంబంధించి అవసరమైన మేరకు పరిష్కారానికి చేయవలసిన ఏర్పాట్లకూ, కార్యరీతికీ మైనారిటీ వర్గాలే తగిన మార్గాలను కనుక్కోగలవనే ఆశాభావం వల్లనే.

"4. నిర్ణయాన్ని పునః పరిశీలించేందుకు చేసే ప్రయత్నానికి తమంతట తాము బాధ్యులమవబోమనీ, అన్ని సంబంధిత పార్టీల ఆమోదం లేకుండా అందులో మార్పులూ చేర్పుల కోసం ఏ ప్రతిపాదనైనా తమకు అంగీకార యోగ్యం కాబోదని స్పష్టంగా తెలియ జేసేందుకు బ్రిటిష్ ప్రభుత్వం ప్రయత్నించింది. అయితే అందరికీ సంతోషదాయకమూ ఆమోదయోగ్యమైన సెటిల్‌మెంట్‌కు అవకాశం ఉన్నట్లైతే దాన్ని అంగీకరించేందుకు సంసిద్ధతను వ్యక్తపరిచింది. ఒక వేళ దీనికన్నాముందే ఒక కొత్త భారత ప్రభుత్వ చట్టాన్ని నిర్మిస్తే దాని ప్రభావానికిలోనయ్యే వర్గాలే గవర్నర్లు పాలించే ప్రాంతాల్లో గాని లేదా యావద్భారత దేశంలో ఇప్పుడు ప్రతిపాదించబడ్డ అంశాలకు ప్రత్యామ్నాయాలను పార్లమెంటుకు సిఫారసు చేయగలరని, సులభంగా అమలు జరుపవీలున్న ప్రత్యామ్నాయ పద్ధతులకు పరస్పర అంగీకారాన్ని తెలపగలరని బ్రిటిష్ ప్రభుత్వం సంతృప్తిని ప్రకటించింది.

5. . . . .

6 . . . .

7 . . . .

8 . . . .

"9.ఓటు వేసే అర్హత గల దళిత వర్గాల సభ్యులు సాధారణ నియోజక వర్గాల్లో ఓటు చేస్తారు. ఈ పద్ధతి ద్వారా తగినంత సంఖ్యలో శాసన సభల్లో ప్రాతినిధ్యాన్ని పొందే అవకాశం సమీప భవిష్యత్తులో ఈ వర్గాలకు లభించే అవకాశం లేనందున ఈ క్రింది పట్టికలో చూపబడిన విధంగా వారికి ప్రత్యేక స్థానాలు ఇవ్వబడతాయి. ఓటు చేసే అర్హతగల "దళిత వర్గాల" సభ్యులే ఈ ప్రత్యేక స్థానాలకు ఎన్నుకోబడతారు. అలాంటి ప్రత్యేక ఎన్నికగణంలో ఓటు చేసే హక్కుగల వ్యక్తికి సాధారణ నియోజకవర్గంలో కూడా ఓటు చేసే హక్కుంటుంది. ఎక్కడైతే దళిత వర్గాల ప్రజానీకం ఎక్కువ సంఖ్యలో ఉంటారో అక్కడే ఈ ఎన్నిక గణాల్ని ఏర్పాటు చేయాలని భావించబడింది. ఒక్క మద్రాస్ ప్రాంతంలో తప్ప అలాంటి ఎన్నిక గణాలు ఒక ప్రాంతం (Province) మొత్తాన్ని ఆవరించి ఉండకూడదనుకున్నారు.

"బెంగాల్లో సాధారణ నియోజకవర్గాల్లో కూడా దళిత వర్గాల ఓటర్లు అధిక సంఖ్యలో వుండే అవకాశం ఉందనిపిస్తుంది. అందుకే ఈ విషయంలో నిజానిజాలు నిగ్గుతేలేవరకు బెంగాలు ప్రాంతం నుంచి దళిత వర్గాలకు నిర్దేశించిన ఎన్నిక గణాల ద్వారా ఎన్నుకోబడే సభ్యుల సంఖ్యను నిర్ధారించలేదు. అయితే బెంగాల్ శాసన సభల్లో పదికి తక్కువకాని సంఖ్యలో దళిత వర్గాలు సభ్యత్వం పొందే విధంగా ఉండాలని అనుకున్నారు.

"దళిత వర్గాల కోసం ఉద్దేశించిన ప్రత్యేక ఎన్నిక గణాలు అవసరమైనంత కాల కన్న ఎక్కువ కాలం వుండాలని బ్రిటిష్ ప్రభుత్వం భావించటం లేదు. ఆరవ పేరాలో పేర్కొన్నట్లు ఇంతకుముందే సాధారణ ఎన్నికల పునః పరిశీలనా శాసనం ద్వారా అ రద్దు కాకుండా ఉన్నట్లైతే 20 సంవత్సరాల వరకూ అవి అమలులో ఉండాలని కూ బ్రిటిష్ ప్రభుత్వం భావించింది."

ఇతర మైనారిటీ వర్గాలకు సంబంధించినంతవరకు కమ్యూనల్ అవార్డ్ అంగీకరించబడి వారి మధ్య పేరుకొనిపోయిన క్రోధభావాలు, అనైక్యత,ముభావాలకు తెరపడింది. కాని అస్పృశ్యుల పరిస్థితి ఇంకా అలాగే మిగిలి ఉంది. గాంధీ గారు ఈ విషయాన్ని సమసి పోనివ్వరు. రౌండ్ టేబుల్ కాన్ఫరెన్స్ నుంచి తిరిగొచ్చాక బ్రిటిష్ ప్రభుత్వం గాంధీగారిని జైల్లో పెట్టింది. ఎరవాడ జైల్లో వుండి కూడా అంతకు ముందే బ్రిటిష్ ప్రభుత్వం ఆమోదించిన ప్రత్యేక ప్రాతినిధ్యపు హక్కును అస్పృశ్యులు సాధించుకునే అవకాశాన్ని అడ్డుకోవటం ఎలాగా అనే ఆలోచనల్లోనే ఉన్నారు గాంధీగారు. అలాంటి హక్కులేమైనా అస్పృశ్యులకు కల్పిస్తే తన ప్రాణాలైనా ఒడ్డి దాన్ని ఎదుర్కొంటానని రౌండ్ టేబుల్ కాన్ఫరెన్స్‌లో అన్న గాంధీగారు దాన్ని ఖాతరు చేయకుండా బ్రిటిష్ ప్రభుత్వం అస్పృశ్యుల కోర్కెల్ని ఆమోదిస్తుందేమోనని భయాందోళనలకు గురయ్యారు. అటు తర్వాత అవకాశం దొరికిందే చాలని తనను బందీని చేశారన్న విషయం కూడా మర్చిపోయి బ్రిటిష్ ప్రభుత్వంతోమంతనాలు జరిపారాయన.

మార్చి 11, 1932న గాంధీగారు అప్పటి సెక్రెటరీ ఆఫ్ స్టేట్ గారు సర్ శామ్యూల్ హోర్‌కు ఉత్తరం పంపాడు. ఆ ఉత్తరం క్రింద పేర్కొంటున్నాను.

"డియర్ శామ్యూల్ మహాశయా!

"దళిత వర్గాలకు ప్రత్యేక నియోజక వర్గాల్ని ఏర్పాటు చేస్తే ప్రాణం పోయినా అంగీకరించనని రౌండ్ టేబుల్ కాన్ఫరెన్స్‌లో చేసిన ఉపన్యాసంలో నేను చెప్పిన విషయం మీకు గుర్తుండే వుంటుంది. ఇది క్షణికోద్రేకంతో అన్నది గానీ, శూన్య వాక్కులుగానీ కావు. ఈ విషయానికి సంబంధించి ఎల్గాగైనా సరే దళిత వర్గాలకు ప్రత్యేక నియోజకవర్గాల ఏర్పాటుకు వ్యతిరేకంగా ప్రజాభిప్రాయాన్ని కూడగట్టాలని ఆశించాను. కాని అది జరగలేదు. నాకు అనుమతించిన వార్తా పత్రికల్లో నేను చదివిన దాని బట్టి బ్రిటిష్ ప్రభుత్వం ఏ క్షణాన్నైనా తన నిర్ణయాన్ని ప్రకటించవచ్చు. అలాంటి నిర్ణయం దళిత వర్గాలకు ప్రత్యేక నియోజకవర్గాల ఏర్పాటుకు అనుకూలంగా ఉంటే నా పంతం నిలుపుకునేందుకు అవసరమైన చర్యల్ని తీసుకోవలసిన అవసరం వస్తుందని నేను మొదట భావించాను. కాని ప్రభుత్వానికి ముందే తెలియచేయకుండా ఎలాంటి చర్యా చేపట్టడం సరియైంది కాదని నాకనిపిస్తున్నది. సహజంగానే నా ప్రకటనకు నేనిచ్చే ప్రాధాన్యతను వారు గుర్తించలేరు.

## ప్రత్యేక నియోజక గణాలు హానికరం.

"దళితులకు ప్రత్యేక ఎన్నికగణాల ఏర్పాటుకు నేను చెప్పే అభ్యంతరాలను మళ్ళీ మళ్ళీ నొక్కి చెప్పవలసిన పనిలేదు. నేను వాళ్ళలో ఒకణ్ణనే భావిస్తున్నాను. వాళ్ళ పరిస్థితి మిగతా వాళ్ళ పరిస్థితికి భిన్నమైనది. శాసన సభల్లో వాళ్ళ సభ్యత్వానికి నేను విముఖుణ్ణి కాదు. ఓటు వేసే విషయంలో మిగతా వర్గాల వారికి ఇచ్చితమైన అర్హతలున్నప్పటికీ దళితుల్లో స్త్రీ, పురుష, ఆస్తి, విద్యార్హతలు ఉన్నాయా లేవా అనే విషయాల్ని పట్టించుకోకుండా అందర్నీ ఓటర్లుగా నమోదు చేయటాన్నే నేను సమర్థిస్తాను. కాని ఏ రాజకీయ కారణం వల్లనైనా ప్రత్యేక ఎన్నికగణాల్ని ఏర్పాటు చేస్తే అది వారికీ, హిందు మతానికీ చాలా హానికరం. వీరంతా హిందూ కుల వ్యవస్థలో ఎలా వ్యాప్తి చెంది ఉన్నారో, హిందూ కుల వ్యవస్థపై వీళ్ళంతా ఎలా ఆధారపడి జీవిస్తున్నారో తెలిసిన వారే ప్రత్యేక నియోజకవర్గాల ఏర్పాటు వీరికి ఎంత హానికరంగా పరిణమిస్తుందో అర్థం చేసుకోగలరు. ప్రత్యేక నియోజకవర్గాల ఏర్పాటు హిందూ మతాన్ని ముక్కలు చెక్కలు చేసి నాశనం చేస్తుంది.

"నా మటుకు నాకు ఈ వర్గాల సమస్య ప్రధానంగా నైతికపరమైనదీ మతపరమైనదీ. మతపరమైన, నైతికపరమైన అంశాలతో పోలిస్తే రాజకీయాంశానికి (ముఖ్యమైందే ఐనా) ప్రాధాన్యతనివ్వటం గందరగోళంగా కనిపిస్తుంది. ఈ వర్గాల ప్రజానీకం పట్ల చిన్నతనం నుంచీ నాకెంత అభిమానమో, వారికోసం ఎన్నో సార్లు ఎన్నో విషయాల్ని పణంగా పొడ్డానన్న విషయం మీరు తప్పక అంగీకరిస్తారు. ఇది నా గురించినేను గొప్పలు చెప్పుకోవటం కాదు. దశాబ్దాలుగా హిందువులు దళితుల్ని మోసపూరితంగా అణచివేతకు గురి చేసిన తీరు ఎంత తపస్సు చేసినా పరిహారం కాదని నేను భావిస్తున్నాను.

### "ఆమరణ నిరాహార దీక్ష చేస్తాను"

"కాని వాళ్ళనుభవిస్తున్న తీవ్రమైన అణచి వేతకు ప్రత్యేక ఎన్నికగణాల ఏర్పాటు పరిహారమూ కాదు, ప్రత్యామ్నాయమూ కాదని నాకు తెలుసు. కాబట్టి ఎట్టి పరిస్థితుల్లోనైనా ఒక వేళ మీరు తీసుకునే నిర్ణయం దళితులకు ప్రత్యేక ఎన్నికగణాలను సృష్టించ ఉద్దేశించినదైనట్టైతే నేను ఆమరణ నిరాహార దీక్షకు పూనుకుంటానని బ్రిటిషు ప్రభుత్వానికి గౌరవ పూర్వకంగా విన్నవించుకుంటున్నాను. నేను ఖైదీగా ఉండి ఈ చర్యకు దిగటం ప్రభుత్వానికి తలవంపులు కలిగించే విషయమనీ, నా అంతటి వ్యక్తి ఇలాంటి మానసికాందోళన

కలిగించే చెడుపద్ధతుల్ని రాజకీయాల్లోకి ప్రవేశ పెట్టటం సరియైంది కాదని చాలా మంది అనుకుంటారన్న బాధాకరమైన నిజం నాకు తెలుసు. దీనికి నా సమాధానం - ఇది రాజకీయ యత్నం కాదనీ, నా అస్థిత్వంలో భాగమనీను. ఇది నా ఆత్మ నాకిస్తున్న పిలుపు. నాపేరు ప్రఖ్యాతుల్నే అది పణంగా కోరినా దాన్ని తిరస్కరించే శక్తి నాకు లేదు. నన్ను జైలు నుంచి బయటకు పంపినా నిరాహార దీక్షను చేపట్టవలసిన అవసరాన్ని, బాధ్యతను అది తగ్గించదు. బ్రిటిష్ ప్రభుత్వం దళితులకు ప్రత్యేక నియోజకవర్గాలను సృష్టించదనీ, నావి అనవసర భయాలే కావాలని ఆశిస్తున్నాను.

............

సెక్రెటరీ ఆఫ్ స్టేట్, గాంధీగారికి ఈ క్రింద పేర్కొన్న సమాధానం పంపాడుః

ఇండియా ఆఫీస్
వైట్‌హాల్
ఏప్రిల్ 13, 1932.

"ప్రియమైన శ్రీ గాంధీ గారు!

మీరు మార్చి 11న రాసిన ఉత్తరానికి జవాబుగా ఈ ఉత్తరం రాస్తున్నాను. దళిత వర్గాల ప్రత్యేక ఎన్నికగణాల సమస్యను గురించి మీ భావాలలోని శక్తిని పూర్తిగా గ్రహించాను. నేను చెప్పగలిగిందొక్కటే. ఈ విషయాన్ని గురించి ఏ నిర్ణయమైనా దాని గుణగణాల మీద ఆధారపడి మాత్రమే ఉండాలని మేం అనుకుంటున్నాం. లోథియన్ కమిటీ తన పని ఇంకా పూర్తి చేయలేదు. ఒక నిర్ణయానికి రావటానికి కొన్ని వారాలైనా పట్టవచ్చు. ఈ రిపోర్టు అందిన తర్వాత అది ప్రతిపాదించే సిఫార్సుల్ని జాగ్రత్తగా పరిశీలించవలసి వుంటుంది. కమిటీ సిఫార్సులేకాక, మీరు, మీ అనుయాయుల అభీష్టాన్ని కూడా పరిశీలించాల్సి వుంటుంది. మీరే మా స్థానంలో వుంటే మేం తీసుకున్న చర్యలే మీరు తీసుకుంటారని నాకు తెలుసు. మీరు కూడా కమిటీ రిపోర్టు కోసం ఎదురు చూస్తారు. అటు తర్వాత కమిటీ రిపోర్టు పరిశీలించాకే ఒక నిర్ణయానికి రావటానికి ప్రయత్నిస్తారు. ప్రయత్నించేముందు వివాదానికి సంబంధించిన ఇరుపక్షాల అభిప్రాయాల్ని

కూడా పరిగణనలోకి తీసుకుంటారు. నేను ఇంతకన్నా ఎక్కువ చెప్పేదేమీలేదు. నిజానికి నేను ఇంతకన్నా ఎక్కువ చెప్పాలని మీరు భావిస్తున్నారని కూడా నేననుకోవటం లేదు".

...........

దళిత వర్గాలకు ప్రత్యేక ప్రాతినిధ్యం ఏర్పాటు చేయకుండా బ్రిటిష్ ప్రభుత్వాన్ని స్థంభింపచేసే తన హెచ్చరిక చేసింతర్వాత తన ఆమరణ దీక్ష బెదిరింపులు చాల్లెమ్మని అనుకుంటూ కూర్చున్నారు గాంధీ గారు. ఆగష్టు17, 1932న ప్రకటించిన కమ్యూనల్ అవార్డులోని అంశాల్ని పరిశీలించినప్పుడు తన బెదిరింపులు ఏ ప్రభావాన్నీ చూపకుండా విఫలమయ్యాయని గాంధీగారు తెలుసుకున్నారు. వెంటనే కమ్యూనల్ అవార్డులోని నిబంధనల్ని బ్రిటిష్ ప్రభుత్వం చేత సవరింప జేయాలని ప్రయత్నించాడు. అందుకే ప్రధానికి ఈ క్రింద పేర్కొన్న ఉత్తరాన్ని పంపాడు.

ఎరవాడ కేంద్ర కారాగారం
ఆగష్టు 18, 1932.

"ప్రియ మిత్రమా,

"దళిత వర్గాల ప్రాతినిధ్య సమస్యకు సంబంధించి సర్ శామ్యూల్ హోర్‌కు నేను మార్చి 11న రాసిన ఉత్తరాన్ని మీకూ, మీ మంత్రి వర్గానికి చూపించి వుంటారనటంలో సందేహం లేదు. ఆ ఉత్తరాన్ని ఈ ఉత్తరంలోని భాగంగానే భావించి కలిపి చదువుకోవాలి

## నిరాహారదీక్షకు నిర్ణయం

"మైనారిటీ వర్గాల ప్రాతినిధ్యంపై బ్రిటిష్ ప్రభుత్వ నిర్ణయాన్ని చదివి మిన్నకున్నా: సర్ శామ్యూల్ హోర్‌కు నేను రాసిన ఉత్తరాన్ని, సెయింట్ జేమ్స్ పాలెస్‌లో నవంబర్13, 1931న రౌండ్ టేబుల్ కాన్ఫరెన్స్ మైనారిటీల కమిటీ సమావేశంలో నా ప్రకటననుసరించీ నా ప్రాణాల్ని పణంగా పెట్టైనా మీ నిర్ణయాన్ని ప్రతిఘటించవల వుంది. ఇందుకు నాకున్న ఒకే ఒక మార్గం ఏ ఆహారం ముట్టకుండా కేవలం ఉప కలిపిందో లేక కలపందో నీరు, సోడా మాత్రమే సేవిస్తూ ఆమరణ నిరాహార దీక్ష చేస్తా: ప్రకటించటమే, ఒక వేళ మధ్యలో బ్రిటిష్ ప్రభుత్వం తనంతట తానుగానీ, ప్రజాభిప్రాయ

వత్తిడివల్ల గాని దళితులకు ప్రత్యేక ఎన్నికగణాల ఏర్పాటును సవరించి తమ పథకాన్ని ఉపసంహరించుకొని వారిప్రతినిధుల్ని కూడా సాధారణ విస్తృత నియోజకులే ఎన్నుకునే ఏర్పాటుకు అంగీకరిస్తే నా ఆమరణ నిరాహారదీక్ష ముగుస్తుంది.

"ఈ లోపల మీ నిర్ణయంలో పైన పేర్కొనట్టు సవరణలు లేని పక్షంలో నా నిరాహార దీక్ష వచ్చే సెప్టెంబర్ 20 వ తేదీ మధ్యాహ్నం మొదలవుతుంది.

" ఈ ఉత్తరం సారాంశాన్ని తొందరగా చేర్చి మీకుఎక్కువ వ్యవధి నివ్వాలనే ఉద్దేశ్యంతో తంతి ద్వారా పంపమని ఇక్కడి అధికారుల్ని కోరుతున్నాను. బట్వాడాలో ఎంత ఆలస్యమైనా తగిన సమయంకన్నా ముందే మీకు ఈ ఉత్తరం చేరేందుకు జాగ్రత్త తీసుకుంటున్నాను.

"ఈ ఉత్తరాన్ని, నేను శామ్యూల్ హెూర్‌కు రాసిన ఉత్తరాన్ని సాధ్యమైనంత త్వరగా ప్రచురించమని కూడా మనవి చేస్తున్నాను. నా మటుకు నేను జైలు నిబంధనల్ని తు.చ. తప్పకుండా పాటించి, జైలులో నాతో ఉన్న నా సహచరులు సర్దార్ వల్లభాయ్ పటేల్‌కు, మహదేవ దేశాయ్‌కి తప్ప ఉత్తరాల్లోని అంశాలను ఎవరికీ తెలియనివ్వలేదు. కాని మీకు వీలుండే పక్షంలో నా ఉత్తరాలు ప్రజలకు విన్నవించాలని వాంఛిస్తున్నాను. అందుకే తొందరగా ప్రచురించే ఏర్పాటు చేయమని ప్రార్థన.

## ఇది విడుదల కోసం కాదు

" ఇలాంటి నిర్ణయం తీసుకున్నందుకు నేనెంతో చింతిస్తున్నాను కాని నైతిక విశ్వాసం గల ఒక మనిషిగా నాకు వేరే మార్గం కనిపించలేదు. సర్ శామ్యూల్ హెూర్‌కు నేనింతకుముందే రాసినట్లు ఒక వేళ బ్రిటిష్ ప్రభుత్వం ఈ సంకట పరిస్థితి నుంచి బయటపడే ఉద్దేశ్యంతో నన్ను జైలు నుంచి విడుదల చేసినా నా నిరాహార దీక్ష మాత్రం కొనసాగుతుంది. మీ నిర్ణయాన్ని ప్రతిఘటించటానికి ఇప్పుడు నాకు వేరే మార్గం కనిపించుట లేదు. నా విడుదలను గౌరవ ప్రదమైన మార్గం ద్వారా మాత్రమే తప్ప మరో మార్గం ద్వారా ఎట్టి పరిస్థితుల్లోనూ నేను ఆశించటం లేదు.

"హిందూమతానికి, దళితులకు గూడా ప్రత్యేక ఎన్నిక గణాల ఏర్పాటు హానికరమనే నా నిర్ణయం తప్పే కావచ్చు. అలాగైనట్లైతే నాజీవన తత్వచింతనలో అది ఒక భాగమయ్యే అవకాశం లేక తప్పుగానే మిగిలిపోతుంది. అలాంటప్పుడు నిరాహార దీక్ష ద్వారా నామరణంతో నా పాపానికి ప్రాయశ్చిత్తం జరగటమే కాదు, నన్ను పసిపాపల్లా విశ్వసించే ఎందరో అసంఖ్యాకమైన స్త్రీ పురుషులకు నాభారం తీరిపోతుంది. ఒక వేళ నా తీర్పే సత్యమైతే – నా కీ విషయంలో సందేహంలేదు – నేను తీసుకున్న నిర్ణయంతో గత రెండున్నర దశాబ్దాలుగా నేననుసరిస్తున్న విజయవంతమైన జీవన పథం సార్థకత పొందుతుంది."

"ఉంటాను
"మీ విశ్వాసపాత్రుడైన మిత్రుడు
యం.కె.గాంధీ"

ప్రధాన మంత్రి ఇలా సమాధానం రాశాడు.

10, డౌనింగ్ స్ట్రీట్
సెప్టెంబర్ 8, 1932

"ప్రియమైన గాంధీ గారు!

"ఎంతో ఆశ్చర్యంతోనూ, మనస్తాపంతోనూ మీ ఉత్తరాన్ని అందుకున్నాను. దళిత వర్గాల గురించిన ప్రభుత్వ నిర్ణయంలోని గూఢార్థాన్ని మీరు సరిగ్గా గుర్తించకుండా ఉత్తరాన్ని రాశారని విశ్వసించకుండా ఉండలేక పోతున్నాను. దళిత వర్గాలు శాశ్వతంగా హిందూ సమాజం నుంచి విడివడిపోవటాన్ని మీరు నిర్ద్వందంగా వ్యతిరేకించారని మేం గ్రహించాం. రౌండ్ టేబుల్ కాన్ఫరెన్స్ మైనారిటీ కమిటీ సమావేశంలోనూ, మార్చి 11న సర్ శామ్యూల్ హెూర్‌కు మీరు రాసిన ఉత్తరం లోనూ మీ అభిప్రాయాల్ని స్పష్టపరిచారు. హిందూ సమాజమంతా మీ అభిప్రాయాల్తో ఏకీభవిస్తుందని కూడా మాకు తెలుసు. అందుకే దళిత వర్గాల ప్రాతినిధ్యమనే సమస్య పరిష్కార సమయంలో ఈ విషయాన్ని మేం పరిగణలోకి తీసుకున్నాం.

## ప్రభుత్వం నిర్ణయానికి వివరణ

"దళిత వర్గ సంఘాలనుంచి వచ్చిన ఎన్నో అప్పీళ్ళ దృష్ట్యానూ, మీరే అంగీకరించే వాళ్ళ దౌర్బల్య పరిస్థితుల దృష్ట్యానూ శాసన సభల్లో వారికి ఏ న్యాయమైన ప్రాతినిధ్యపు హక్కుల్లేవని మేం భావిస్తున్నామో వాటిని పరిరక్షించటం మా బాధ్యతగా మేం గుర్తిస్తున్నాం. అలాగే వాళ్ళు హిందూ సమాజ పరిధినుంచి విడిపోకుండా ఉండేందుకు తగిన జాగ్రత్తలు తీసుకుంటున్నాం. శాసన సభల్లో వాళ్ళ ప్రాతినిధ్యానికి వ్యతిరేకిని కాదని మార్చి11న రాసిన ఉత్తరంలో మీ అంతట మీరే అన్నారు.

"ప్రభుత్వ పథకం ప్రకారం దళిత వర్గాలు హిందూ సమాజంలో భాగంగానే ఉంటాయి. హిందువులతో సమానంగా నే ఓటు వేస్తారు. కాని ఎన్నికల విషయంలో హిందూ సమాజంలో భాగంగా ఉంటూనే మొదటి 20 సంవత్సరాలు పరిమిత సంఖ్యలో ప్రత్యేక నియోజకగణాలు, వాటిని సంరక్షించుకునే హక్కులు, అభీష్టాలు వారికి సంక్రమించటం ప్రస్తుత పరిస్థితుల్లో అవశ్యమని మేం దృఢంగా విశ్వసిస్తున్నాం.

" ఇలా ఏర్పాటు చేసినందువల్ల ప్రత్యేక నియోజకగణాల్లోని దళిత వర్గాల ఓటర్లకు సాధారణ హిందూ నియోజకవర్గాల్లో కూడా ఓటు చేసే హక్కు తొలగించబడదు; హిందూ సమాజంలో వారి సభ్యత్వానికి భంగం వాటిల్లకుండా వారికి రెండు ఓట్లు ఇవ్వబడతాయి.

" మీరు దళిత వర్గాలకు ప్రత్యేక నియోజకవర్గాలన్న వాటికి ప్రత్యామ్నాయంగా దళితులందరినీ సాధారణ హిందూ నియోజకవర్గాల్లో సభ్యులుగా ఉంచుతూనే, వారి ప్రత్యేక ప్రాతినిధ్యానికి హిందువులు కూడా ఓటు వేయవలసి వుండే విధంగా కావాలనే ఏర్పాటు చేయాలని నిర్ణయించాం. హిందూ నియోజకవర్గాల్లో హిందువులు దళితుల ఓట్లను, అలాగే దళితులు వారి ప్రత్యేక ప్రతానిధ్యం కోసం హిందువుల ఓట్లను అర్థించ వలసి ఉండే ఏర్పాటు ఇది. ఇలా అన్ని విధాలా హిందూ సమాజ సమగ్రత కాపాడబడింది.

## పరిరక్షణలు తాత్కాలికం

"ప్రాంతీయ శాసన సభల్లో ఎవరికి మెజారిటీ లభిస్తే వారికి అధికారం సంక్రమించి బాధ్యతాయుత ప్రభుత్వం ఏర్పాటైన తొలి దశలో- శతాబ్దాలుగా హిందువుల చేతుల్లో

అణచివేతకు, అన్యాయానికి గురైనారని సర్ శామ్యూల్ హోర్‌కు రాసిన ఉత్తరంలో మీరే వర్ణించిన - దళిత వర్గాలు తొమ్మిదింట ఏడు ప్రాంతీయ శాసన సభల్లో తమ బాధలు తెలుపుకోవటానికి, నిర్ణయాలు తమకు వ్యతిరేకంగా జరగకుండా చూసుకునేందుకు, తమ సమస్యల్ని ప్రభుత్వాల దృష్టికి తెచ్చేందుకు తప్పనిసరిగా కొంత మంది తామే ఎన్నుకున్న ప్రతినిధుల్ని ఆమోదించాలని మేం అనుకున్నాం. ఒక్క మాటలో చెప్పాలంటే వాళ్ళను గురించి వాళ్ళే మాట్లాడుకునే అవకాశం వారికి ఇవ్వాలని వాళ్ళ మంచి కోరే వారెవరైనా భావిస్తారని మేం అనుకున్నాం. ప్రస్తుత పరిస్థితుల్లో ప్రత్యేక ప్రతినిధుల్ని సీట్ల రిజర్వేషన్ ద్వారా ఎన్నుకునే పద్ధతిని మేం పరిశీలించలేదు. వారికి ప్రాతినిధ్యం వహించి, బాధ్యత వహించ గల సభ్యులు మెజారిటీ హిందువుల చేతే ఎన్నుకోబడతారు. మైనారిటీ ముస్లింలకు ఏర్పాటు చేసిన ప్రత్యేక ఎన్నికగణాలు, ప్రత్యేక ప్రాతినిధ్య పద్ధతుల వలెకాకుండా దళిత వర్గాలకు హిందూ నియోజకవర్గాల్లో సాధారణ ఓటింగ్ హక్కులతో సహా పరిమిత సంఖ్యలో ప్రత్యేక నియోజకవర్గాల ఏర్పాటు ద్వారా వారికి ప్రత్యేక సదుపాయాలివ్వబడ్డాయి. ఉదాహరణకు ఒక ముస్లిం ఓటరుకు సాధారణ నియోజకవర్గంలో పోటీ చేసే లేదా ఓటు చేసే అవకాశం లేదు. కాని ఎన్నికల నియమాల ప్రకారం అర్హుడైన ఏ దళితుడైనా ఏ సాధారణ నియోజకవర్గంలోనైనా పోటీ చేయవచ్చు, ఓటు చేయవచ్చు.

## రిజర్వేషన్లు అత్యల్పం

"ముస్లింలకు భూభాగం ఆధారంగా సీట్లు కేటాయించిన తీరును పరిశీలిస్తే ఇక ఏమాత్రం అలాంటి సీట్లు అధికంగా పొందే అవకాశంలేదని, వారి సంఖ్యతో పోలిస్తే రావలసిందానికంటే వారికి ఎక్కువే లభించిందని తెలుస్తుంది. దళితుల నియోజకవర్గాలనుంచి వాళ్ళు పొందే ప్రత్యేక సీట్లను పరిశీలిస్తే వాళ్ళ సంఖ్యకు సరిసమానంగా ఉండవు. అత్యల్ప సంఖ్యలో శాసన సభల్లో కేవలం దళిత వర్గాల ద్వారా ఎన్నుకోబడ్డ వాళ్ళు మాత్రమే వాళ్ళకు ప్రాతి నిధ్యం వహిస్తారు. వారికి కేటాయించిన సీట్ల సంఖ్య వాళ్ళ జనాభాతో నైష్పత్తికంగా పోల్చి చూస్తే ఎక్కడ చూసినా చాలా తక్కువగా వుంది.

" మీ వాలకం చూస్తే నాకేమనిపిస్తుందంటే - మీరు తిండిమాని వేసి చచ్చిపోవాల తీవ్రమైన నిర్ణయం తీసుకున్నది ఇతర హిందువులతో కలిసి దళితుల ఉమ్మ

నియోజకవర్గాన్ని పొందడానికి కాదు. ఎందుకంటే ఉమ్మడి నియోజకవర్గాల ఏర్పాటు మానిర్ణయం లో భాగం. హిందువుల్లో సమగ్రతను కాపాడటం కూడా మీ ఉద్దేశం కాదు. ఎందుకంటే అది కూడా మా నిర్ణయంలో ఉంది. భయంకరమైన దుర్బలత్వానికి లోనయిన దళిత వర్గాలు తమ తరఫున శాసనసభల్లో మాట్లాడేందుకు పరిమిత సంఖ్యలోనైనా తమ వాళ్ళని ఎన్నుకోవాలని కోరడాన్ని అడ్డుకోవటమే మీ ఈ నిర్ణయానికి కారణం

## ప్రభుత్వ నిర్ణయమే అంతిమం

"భారతీయులు తమలో తాము ఒక అంగీకారానికి రాలేని స్థితిలో, వాళ్ళే కోరిన మీదట, తనకు ఇష్టం లేనప్పటికీ, తప్పని పరిస్థితుల్లో అల్ప సంఖ్యాక వర్గాల పరిస్థితులపై ప్రభుత్వం ఒక నిర్ణయాన్నివ్వబూనుకుంది. వాళ్ళు ఇందుకు అంగీకరించారు. వాళ్ళే ప్రతిపాదించిన నిబంధనలననుసరించి తప్ప దీన్ని వాళ్ళు మార్చ వీలులేదు. కాబట్టి మీకు నా సమాధానమేమిటంటే – ప్రభుత్వ నిర్ణయమే అంతిమమనీ, ఇంకా అనేకానేక న్యాయ సంబంధమైన అంశాల దృష్ట్యా ప్రభుత్వం నిర్ణయించే ఏర్పాట్లుగానీ, ఇతర ఏ విధమైన ప్రత్యామ్నాయ ఎన్నిక ఏర్పాటైనా ఆయా వర్గాల అంగీకారంతో మాత్రమే సాధ్యమనీను.

"ఈ ఉత్తర ప్రత్యుత్తరాలను – మార్చి 11నాడు సర్ శామ్యూల్ హెూర్‌కు మీరు రాసిన ఉత్తరంతో సహా ప్రచురించమని మీరు కోరుతున్నారు. ప్రస్తుతం మీరున్న పరిస్థితుల్లో మీరు ప్రజలకు మీ నిరాహార దీక్షకు కారణాల్ని తెలిపే అవకాశం లేని దృష్ట్యా ఇవి ప్రచురించకుండా ఉండటం సరియైంది కాదు. మళ్ళీ మీరు మీ నిర్ణయాన్ని పునఃపరిశీలించుకుని మాకు తిరిగి తెలియ జేస్తే మీ కోర్కెను మన్నించటానికి మేం సిద్ధమే. ఐనా ప్రభుత్వ నిర్ణయంలోని యధార్థ అంశాలను మీరు మరొక్కసారి పరిశీలించి మీరు చేపట్టిన కార్యక్రమం సరియైందో కాదో మీకు మీరే ప్రశ్నించుకుంటారని మరొక సారి మీకు మనవి చేస్తున్నాను.

ఉంటాను.

జె.రాంసే మెక్‌డొనాల్డ్."

– ప్రధాని ఇక తనకు లొంగడని తెలిసి తానిక ఆమరణ నిరాహార దీక్ష చేసేందుకే నిర్ణయించుకున్నానని తెలియ జేస్తూ శ్రీ గాంధీ ఈ క్రింది ఉత్తరం రాశాడు.

ఎరవాడ కేంద్ర కారాగారం
9 సెప్టెంబర్, 1932

" ప్రియ మిత్రమా!

మీరు ఎంతో నిజాయితీతో తంతి ద్వారా పంపిన దీర్ఘమైన లేఖ ఈ రోజే అందింది. నాకు విచారం కలిగించిన విషయమేమిటంటే నేనూహించినట్టుగానే మీరు వివరణనిచ్చిన తీరు నాకు ముందే తెలిసిందే. నేను ఏ వర్గపు బాగోగుల్ని గురించి బాధ పడుతున్నానో ఆవర్గానికే వ్యతిరేకంగా నేను ఆమరణ నిరాహార దీక్షకు పూనుకుంటున్నాని మీరు ఆరోపించారు. నేను తీసుకున్న ఈ విపరీతమైన నిర్ణయం ఇలాంటి స్వార్థపూరిత వివరణకు అవకాశం ఇవ్వదని ఆశించాను. నాకు ఈ విషయం స్వచ్ఛమైన మత సంబంధ విషయమని నొక్కి చెబుతున్నాను. దళిత వర్గాలకు రెండు ఓట్లు ఇచ్చినంత మాత్రాన అది వారిని గానీ, హిందూ సమాజాన్ని గాని చిందరవందర కాకుండా ఆపలేదు. దళితులకు ప్రత్యేక నియోజకవర్గాల ఏర్పాటు హిందూ సమాజాన్ని విషపూరితం చేసి నాశనం చేసేందుకు వేసిన ఎత్తుగడ. ఇది దళితులకు ఏమాత్రం మేలు చేసేది కాదు. మీరెంత సానుభూతి కురిపించినా ఇరువర్గాల దృష్టిలోనూ నైతిక ప్రాధాన్యతగల ఈ బృహత్సమస్యపై మీరు సరియైన నిర్ణయాన్ని చేయలేరు. దళిత వర్గాలకు అవసరమైన దానికన్నా ఎక్కువ ప్రాతినిధ్యం కల్పించినా దానికి నేను వ్యతిరేకిని కాను. కాని హిందూ సమాజంలో కలిసిపోయి వున్న వారిని, కలిసి ఉండాలని అనుకుంటున్న వారిని పరిమిత పరిధిలోనే ఐనప్పటికి చట్ట రీత్యా విడగొట్టాలనే విధానానికి మాత్రం నేను వ్యతిరేకిని. రాజ్యాంగమే అమలులోకి వచ్చి, మీ నిర్ణయమే నిలబడితే జరిగేది హిందూ సామాజిక జీవనాన్ని ఉద్ధరించేందుకు ఎందరో హిందూ సంస్కర్తలు చేస్తున్న ఆశ్చర్యదాయకమైన అభివృద్ధిని మీరు అడ్డుకోవడమేనన్న విషయాన్ని గ్రహించారా ?

## నిర్ణయం మారదు

"కాబట్టి మీకు ఇంతకు ముందు తెలియ జేసిన నా నిర్ణయానికే - అంతగా ఇష్టం లేక పోయినా - బద్ధుడను కావటానికే నిర్ణయించుకున్నాను.

" మీ ఉత్తరం అనుమానాల్ని రేకెత్తించేదిగా ఉన్నందువల్ల ఒక విషయాన్ని మీకు స్పష్టం చేయదల్చుకున్నాను. నేను మీ నిర్ణయంలో దళిత వర్గాల సమస్యను విడదీసి

చూస్తున్నప్పటికీ ఆనిర్ణయంలోని మిగతా అంశాలను అంగీకరిస్తున్నట్లుగాని బలపరుస్తున్నట్లుగాని మీరు భావించరాదు. నా ఉద్దేశ్యంలో మీ నిర్ణయంలోని మిగతా భాగాలు కూడా అభ్యంతకరమైనవే. కాకపోతే దళితుల విషయంలో లాగా ఆ అంశాలు నన్ను నేను దహించుకోవటాన్ని కోరతాయని నేననుకోవటం లేదు.

ఉంటాను

మీ విశ్వాసపాత్రుడైన మిత్రుడు

యం.కె. గాంధీ."

అనుకున్నట్లుగానే సెప్టెంబర్ 20, 1932న శ్రీ గాంధీ దళిత వర్గాలకు ప్రత్యేక నియోజకవర్గాల ఏర్పాటుకు వ్యతిరేకంగా తన "ఆమరణనిరాహార దీక్ష" ప్రారంభించాడు.

ఈ నిరాహార దీక్షకు సంబంధించిన కథనాన్నే 'ది ఎపిక్ ఫాస్ట్" అనే ఆడంబరమైన పేరుతో ఒక సంపుటిలో ప్యారేలాల్ చెప్పాడు. 'బాస్వెల్ గారి జాన్సన్ ' లాంటి ఈ పేజీల్లో భారత దేశంలో ఈ దుర్భర దినాల్లో జరిగిన సంఘటనలన్నీ ఆసక్తి గలవారెవరైనా గమనించవచ్చు. నేనేమీ చెప్పనవసరం లేదు.కాని ఒక్క విషయం మాత్రం చెబితే చాలు. ఆమరణ నిరాహార దీక్షకు పూనుకున్న శ్రీ గాంధీకి చచ్చిపోవాలని మాత్రం లేదు; బ్రతకాలనే ఎంతగానో వాంఛించారు.

ఈ నిరాహార దీక్ష లేవనెత్తిన ఒకే ఒక సమస్య గాంధీ గారి ప్రాణాల్ని కాపాడటం ఎలాగా అనేదే. ఇక ఆయన ప్రాణాల్ని కాపాడటానికి ఒకే ఒక మార్గం గాంధీ మనస్సుకు ఏ మాత్రం బాధ కలగని రీతిలో కమ్యునల్ అవార్డును సవరించటమే. దాన్ని తనంతట తాను రద్దు చేసేందుకు గానీ, మార్చేందుకు గాని హిందువుల, అస్పృశ్యుల అంగీకారంలేనిదే బ్రిటిష్ కాబినెట్‌కు సాధ్యం కాదని ప్రధాని చాలా స్పష్టంగానే పేర్కొన్నాడు. రౌండ్ టేబుల్ కాన్ఫరెన్స్‌లో అస్పృశ్యుల తరుపు ప్రతినిధిగా నా అంగీకారం కూడా లేనిదే ఏమార్పులూ, చేర్పులూ చెల్లవు. భారతదేశంలో అస్పృశ్యులందరి ప్రతినిధిగా నాస్థానాన్ని ఎవ్వరూ ప్రశ్నించకపోగా అది ఒక యదార్థంగా అంగీకరించబడింది. అందరి కళ్ళూ నామీద పడి నన్నొక విలన్‌గా చూట్టం మొదలెట్టారు. శ్రీ గాంధీ ప్రాణం ఆయనే చెప్పినట్లుగా ఇప్పుడు నా చేతిలో ఉంది.

అతిశయోక్తి కాదు గాని అప్పుడు నాకన్న గందరగోళ పరిస్థితిలో మరెవరూ ఉండివుండరు. అదొక అయోమయ పరిస్థితి. భిన్నమైన రెండంశాల మధ్య ఏదో ఒక దాన్ని నేను ఎన్నుకోవాలి. శ్రీ గాంధీ ప్రాణాల్ని కాపాడాల్సిన విధి ఒకటి. ప్రధాని అస్పృశ్యులకు కల్పించిన రాజకీయ హక్కుల్ని రక్షించటం రెండవది. మానవత్వం దృష్ట్యా శ్రీ గాంధీ ప్రాణాల్ని రక్షించేందుకు కమ్యునల్ అవార్డును శ్రీ గాంధీ కోరిన రీతిలోనే సవరించేందుకు అంగీకరించాను. దీన్నే పూనా ఒప్పందం (Poona Pact) అంటారు.

పూనా ఒప్పందంలో నిబంధనలివి :

1. సాధారణ నియోజకవర్గాల్లోనే దళిత వర్గాలకు ప్రత్యేకంగా సీట్లు రిజర్వ్ చేయబడతాయి. ప్రాంతీయ శాసన సభల్లో సీట్లు ఈ క్రింది విధంగా ఉండాలి.

| | |
|---|---|
| మద్రాస్ | 30 |
| సింధ్ కలిసిన బొంబాయి | 15 |
| పంజాబ్ | 8 |
| బీహారు, ఒరిస్సా | 18 |
| కేంద్ర ప్రాంతాలు | 20 |
| అస్సాం | 7 |
| బెంగాల్ | 30 |
| యునైటెడ్ ప్రావిన్సెస్ | 20 |
| మొత్తం | 148 |

(బీహారు, ఒరిస్సా సీట్ల సర్దుబాట్లవల్ల 148 సీట్లు 151 కి పెరిగాయి.)

ఈ సంఖ్య ప్రధాని నిర్ణయానుసారంగా ప్రాంతీయ కౌన్సిళ్ళలో గల సంఖ్యా బలా! ఆధారంగా చేసుకొని ప్రతిపాదించబడింది.

2. ఈ సీట్లకు ఎన్నిక ఈ క్రింద పేర్కొన్న పద్ధతులననుసరించి ఉమ్మ నియోజకవర్గాల ద్వారా జరుగుతుంది. ఏ నియోజకవర్గంలోనైనా సరే సాధారణ ఎన్ని పట్టీలలో నమోదైన దళిత వర్గాల సభ్యులంతా కలిసి ఒక నియోజక గణంగా ఏర్పడత వీరు దళిత వర్గాలకు చెందిన నలుగురు సభ్యులతో కూడిన ఒక పానెల్‌ను ఒక్కొ

సీటుకు ఒక్కరు చొప్పున ఏక ఓటు పద్ధతిని ఎన్నుకుంటారు. ఆ విధంగా జరిగిన ప్రాథమిక ఎన్నికలో ఎక్కువ సంపాదించిన మొదటి నలుగురు సభ్యులు సాధారణ నియోజక గణాల్లో ఎన్నిక కావటానికి అర్హత సంపాదిస్తారు.

3. కేంద్ర శాసన సభకు పైన పేర్కొన్న పద్ధతిలోనే ఎన్నికలు జరుగుతాయి.

4. కేంద్ర శాసన సభలో సాధారణ నియోజక వర్గాలకు కేటాయించిన బ్రిటిష్ ఇండియాలోని 18 శాతం సీట్లు దళిత వర్గాలకు రిజర్వు చేయబడతాయి.

5. కేంద్ర, ప్రాంతీయ శాసనసభల్లో సభ్యుల ప్యానెల్‌కు జరిగే ప్రాథమిక ఎన్నికల వ్యవహారం ఈ క్రింద చెప్పబోతున్నట్లుగా, 10 సంవత్సరాల తర్వాత (అంతకన్నా ముందే రద్దు చేయబడని పక్షంలో) నిబంధనలోని 6వ క్లాజు ననుసరించి రద్దవుతుంది.

6. ఒకటి, నాలుగు క్లాజుల క్రింద కేంద్ర రాష్ట్ర శాసన సభల్లో రిజర్వ్‌డ్ సీట్ల కోసం చేసిన దళిత వర్గాల ప్రాతినిధ్యపుటేర్పాట్లు దానికి సంబంధించిన వర్గాల పరస్పర అంగీకారంతో కొనసాగుతాయి.

7. కేంద్ర, ప్రాంతీయ శాసనసభల్లో దళిత వర్గాలకు ఓటు చేసే హక్కు లోథియన్ కమిటీ రిపోర్టు ననుసరించి వుంటుంది.

8. దళిత వర్గాల సభ్యుడనే నెపంతో స్థానిక సంస్థల ఎన్నికలలోగాని, ప్రభుత్వ ఉద్యోగాల్లో గాని వారిపై అశక్తులు, చేతకానివారు అనే అపవాదు ఉండకూడదు. దళిత వర్గాలకు ఈ విషయాల్లో (ప్రభుత్వ ఉద్యోగాల కోసం విధించే విద్యా విషయక అర్హతలు మినహా) వారికి ప్రాతినిధ్యం కల్పించేందుకు కృషి చేయాలి.

9. ప్రతి ప్రాంతంలోనూ విద్యా శాఖ గ్రాంట్లలో తగినంత ధనాన్ని దళిత వర్గాలకు విద్యావకాశాలు కల్పించేందుకు ఏర్పాటు చేయాలి.

ఒడంబడికలోని నిబంధనలను శ్రీ గాంధీ అంగీకరించారు. అవి భారత ప్రభుత్వ చట్టంలో పొందుపర్చబడ్డాయి.

ఈ ఆమరణ నిరాహార దీక్ష శ్రీ గాంధీ ఆడిన ఒక గొప్ప జూదం. తన నిరాహార దీక్ష బెదిరింపు నన్నూ, మిగతా దళిత నాయకుల్నీ వణికించి తనకు లొంగేట్లు చేస్తుందని

శ్రీ గాంధీ భావించారు. కాని తాను పొరబడ్డాననీ, దళితులు తమ హక్కుల పరిరక్షణ కోసం చివరి వరకూ పోరాడతారనీ తొందరలోనే ఆయన తెలుసుకున్నాడు. తన అనుయాయులు తప్ప ఆయన చేసిన నిరాహార దీక్ష నైతిక విలువలతో కూడిందని ఒక్కడూ విశ్వసించలేదు. శ్రీ గాంధీ బ్రతికి బయటపడ్డాడంటే అస్పృశ్యులు ఆయన యెడల చూపిన దయాదాక్షిణ్యాలు, మంచి తనమే కారణం.

సమస్యేమిటంటే పూనా ఒడంబడికకు అంగీకరించినందువల్ల అస్పృశ్యులకు జరిగిందేమిటి అనేది. ఇది తెలియాలంటే శాసన సభలకు జరిగిన ఎన్నికల ఫలితాల్ని తప్పక పరిశీలించాలి. భారత ప్రభుత్వ చట్టం ఏప్రిల్ 1, 1937లో అమలులో లోకి వచ్చింది. చట్టంలో పేర్కొన్న విధంగానే ఫిబ్రవరి 1937లో కొత్త శాసన సభలకు ఎన్నికలు జరిగాయి. అస్పృశ్యులకు సంబంధించినంత వరకు ఫిబ్రవరిలో జరిగిన ఎన్నికలు పూనా ఒడంబడిక ప్రకారమే జరిగాయి. వివిధ ప్రాంతీయ శాసన సభల్లో అస్పృశ్యులకు రిజర్వ్ చేయబడ్డ సీట్ల విశ్లేషణ ఈ క్రింది విధంగా ఉంది.

**పట్టిక [1]**

| ప్రాంతం | అస్పృశ్యులకు రిజర్వు చేయబడ్డసీట్లు మొత్తం | కాంగ్రెస్ గెలిచిన సీట్లు |
|---|---|---|
| యునైటెడ్ ప్రావిన్సెస్ | 20 | 16 |
| మద్రాసు | 30 | 26 |
| బెంగాల్ | 30 | 6 |
| కేంద్ర ప్రాంతాలు | 20 | 7 |
| బొంబాయి | 15 | 4 |
| బీహార్ | 15 | 11 |
| పంజాబ్ | 8 | లేవు |
| అస్సాం | 7 | 4 |
| ఒరిస్సా | 6 | 4 |
| మొత్తం | 151 | 78 |

ఈ విశ్లేషణ వెల్లడించే సత్యాల ఆధారంగా, పూనా ఒప్పందాన్ని అంగీకరించిన అస్పృశ్యులు ఏకాంతైనా, ఏపాటి విలువ చేసేదైనా- శ్రీ గాంధీ ప్రాణాల్ని కాపాడటం మినహా - పొందారా అని అడగవచ్చు. ఇంకా పూనా ఒప్పందం అస్పృశ్యుల్ని హిందూ కులస్థులకు బందీలను చేయలేదా? అని కూడా అడగవచ్చు.

ఎన్నికైన వారిలో ఎక్కువ మంది కాంగ్రెస్ సభ్యులుగానే ఎన్నికైనారని ఈ విశ్లేషణ నిరూపిస్తుంది. నాదృఢమైన విశ్వాసమేమిటంటే అస్పృశ్యులు కాంగ్రెస్‌లోగాని మరే ఇతర రాజకీయ పార్టీలోనైనా చేరితే అంతకన్నా ప్రమాద పరిస్థితి మరొకటి లేదు. వారిలో విప్లవించే శక్తి ఏమైనా మిగిలివుంటే, వాళ్ళు చేసిన పొరపాట్లు ఎల్లప్పుడూ గుర్తుంచుకొనేవారే అయితే వారికి ఒక ఉద్యమం అవసరం. ఉద్యమం ఎందుకవసరమంటే అస్పృశ్యుల విషాద పరిస్థితికి కారణభూతులైన నేరస్థులు హిందువులేనని చెప్పాల్సిన అవసరం వుంది గనుక. ముస్లింల దృష్టిలో కాంగ్రెస్ నిలువెల్లా హిందూ వ్యవస్థ కాకపోవచ్చు. కాని హిందూ కులస్థులు అందులో వున్నంతవరకు అది నిలువెల్లా హిందూ వ్యవస్థే కాదు; నిలువెల్లా విషపూరితమైన వ్యవస్థ. అస్పృశ్యుల ఉద్యమం అంటే అర్థం హిందూ కులస్థుల మీద బాహాబాహీ యుద్ధమే. కాంగ్రెస్‌లో ఉండే అస్పృశ్యులతో ఈ ఉద్యమం అసాధ్యం. అప్పుడది పార్టీ అంతర్గత వ్యవహారమౌతుంది. తన అస్థిత్వాన్ని కాపాడుకోవటానికి కాంగ్రెస్ అలాంటి ఉద్యమాన్ని అనుమతించదు. తనలో సభ్యులుగా ఉన్న అస్పృశ్యుల్ని స్వతంత్రులుగా ఉద్యమించటానికి అధిష్టాన వర్గం అనుమతిలేనిదే కాంగ్రెస్ అనుమతించదు. దీని ఫలితమేమిటంటే ఏ ప్రాంతంలోనైతే అస్పృశ్యులు కాంగ్రెస్‌లో సభ్యులుగా చేరారో ఆయా ప్రాంతాల్లో అస్పృశ్యుల ఉద్యమం చచ్చిపోయింది.

అస్పృశ్యులు తమ సాధకబాధకాలు తెలియజేస్తూ రాజకీయ చర్యల ద్వారా వాటికి పరిష్కార మార్గాలను కనుగొనాలంటే శాసన సభల్లో వారు వాక్స్వాతంత్ర్యం, క్రియా స్వాతంత్ర్యం కలిగి వుండాలి. కాని కాంగ్రెస్‌లో చేరిన అస్పృశ్యుల ప్రతినిధులు తమ వాక్, క్రియా స్వాతంత్రాలను కోల్పోయారు. వాళ్ళు తమ ఇష్టానుసారంగా ఓటు చేయలేరు; ఒక్క తీర్మానాన్ని కూడా ప్రవేశ పెట్టలేరు; ఒక బిల్లూ తీసుకురాలేరు. వాళ్ళు పూర్తిగా కాంగ్రెస్ పార్టీ కార్యవర్గపు నియంత్రణలో ఉన్నారు. వారికున్న స్వేచ్ఛ కాంగ్రెస్ అనుమతించిన మేరకే. దీని ఫలితంగా అస్పృశ్యులు అంతులేని బాధలకు

లోనవుతున్నా శాసన సభల్లో అస్పృశ్యుల ప్రతినిధులు దాన్ని గురించి చిన్న ప్రశ్న కూడా లేవనెత్తే స్థితిలో లేరు. వారి పరిస్థితి ఎంత దయనీయంగా తయారైందంటే ఒక్కొక్కప్పుడు ఏదైనా చర్య అస్పృశ్యులకు అనుకూలమైందే అయినా కాంగ్రెస్ పార్టీ దానికి వ్యతిరేకంగా ఓటు చేయమంటే చేస్తున్నారు. ఈ మధ్య మద్రాసులో ఇలాంటి సంఘటనే ఒకటి సంభవించింది. మద్రాసు శాసన సభలో సభ్యుడైన రావుబహదూర్ రాజా మద్రాస్ ప్రెసిడెన్సిలో అస్పృశ్యులకు హిందూ దేవాలయాల్లో ప్రవేశాన్ని అనుమతించేందుకు ఉద్దేశించిన ఒక బిల్లును శాసన సభలో ప్రవేశపెట్టాడు. దాన్ని సమర్థిస్తామని కాంగ్రెస్ మొదట చెప్పింది. కాని తర్వాత మద్రాస్ కాంగ్రెస్ గవర్నమెంటు మనసు మార్చుకుని రాజాగారి బిల్లును వ్యతిరేకించింది. మద్రాస్ శాసన సభలోని అస్పృశ్యుల ప్రతినిధుల్లో అయోమయ పరిస్థితి ఏర్పడింది. కాని వారికి ఏ అవకాశమూలేదు. విప్ జారీ చేయబడింది. ఈ సభ్యులందరూ మూకుమ్మడిగా బిల్లుకు వ్యతిరేకంగా ఓటు వేశారు. ఈ ప్రతినిధులు అస్పృశ్యుల రక్షకులుగా ఉండాలి నిజానికి. కాని కాంగ్రెస్‌లో చేరి తోకాడించేందు కుక్కలుగా మారారు. కరవటం అలా వుంచండి అరవటం కూడా మానేశారు. వీళ్ళకు స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు కరువవటానికి కారణం వాళ్ళు కాంగ్రెస్‌లో చేరి దాని నియమ నిబంధనలకు తమను తాము అర్పించుకోవటమే.

అస్పృశ్యులు కాంగ్రెస్‌లో చేరినందువల్ల వచ్చిన మూడవ నష్టం వాళ్ళు తమ ప్రజానీకానికి నిజమైన లాభం కలగజేయగల శక్తిని కోల్పోవటమే. ఇందుకు కారణాలు రెండు. మొదటిది కాంగ్రెస్‌కు ప్రగతి శీల భావాలు గల పార్టీ లేకపోవటం. కాంగ్రెస్‌కు విప్లవాత్మకమైన పార్టీ అని పేరు ఉంది. కాంగ్రెస్ఒకప్పుడు చేపట్టిన పూర్ణ స్వరాజ్య భావన, సహాయ నిరాకరణోద్యమం, భూమి శిస్తు ఎగవేత ఉద్యమం మొదలైనవి దానికాపేరు సంపాదించిపెట్టాయి. కాని విప్లవ పార్టీ రాడికల్ పార్టీ కానవసరం లేదన్న విషయాన్ని చాల మంది విస్మరించారు. ఒక విప్లవాత్మకమైన పార్టీ రాడికల్ పార్టీ అవునా కాదా అనేది సామాజిక సమస్యల కోసం అది ఏమేరకు పోరాడి విప్లవకార్యక్రమాలు మనస్ఫూర్తిగా ఆమోదిస్తుందనే అంశంపై ఆధారపడి వుంటుంది. క్రీ.శ.1215లో ఇంగ్లాండ్‌లో సైమన్ డిమాండ్ ఫర్ట్ నాయకత్వంలో కింగ్ జాన్ చేత బలవంతంగా మాగ్నాకార్టా మీద సంతకం చేయించిన బారన్లు, క్రీ.శ. 1381లో వాట్ టైలర్ నాయకత్వంలో భూస్వామ్య యజమానుల పై తిరుగుబాటు చేసి ఉరితీతకు గురైన రైతాంగమూ విప్లవకారులే. కా

విప్లవ కారులైనందువల్లనే వాళ్ళు రాడికల్స్ అని ఎవరనగలరు? కింగ్ జాన్‌పై తమ వర్గానికి సంక్రమించవలసిన హక్కుల కోసం మాత్రమే పోరాడారు. దానికి అప్పుడున్న ప్రభుత్వంపై రోసిన ప్రజానీకం తోడ్పడ్డారు. కాని రైతాంగ ప్రజానీకం ఉద్రేకాల మాటున తిండి కోసం, స్వేచ్ఛ కోసం వాళ్ళు పడే ఆరాటం వుండటం వల్ల రాడికలు, విప్లవ కారులూ అయ్యారు. కాంగ్రెస్ విప్లవం మొదటి పోరాటం లాంటిదే. సైమన్ డిమాంట్ ఫర్ట్ నాయకత్వంలోని బారన్ల వంటిదే శ్రీగాంధీ నాయకత్వంలోని కాంగ్రెస్. సామాజిక ఉద్రేకాల వల్లనూ, అధికారానికి వ్యతిరేకంగానూ బారన్లు జరిపిన తిరుగుబాటులాంటిదే కాంగ్రెస్ బ్రిటిష్ ప్రభుత్వం మీద చేస్తున్న తిరుగుబాటు. అంతేకాని ఆకలితో నకనకలాడే శ్రమ జీవుల తిరుగుబాటులాంటిది కాదు. కాంగ్రెస్ అశేష ప్రజానీకాన్ని తమ అనుయాయులుగా సమాయత్తం చేసిన మాట నిజమే. కాని భారత ప్రజల్లో అణిగి మణిగి వున్న బ్రిటిష్ వ్యతిరేక భావాల్ని రేకెత్తించి మాత్రమే కాంగ్రెస్ ఈపని చేయగలిగింది. ఇందులో ఆకలితో అలమటించే ప్రజానీకపు ఉద్రేకాలు కూడా భాగమనే విషయాన్ని విస్మరించరాదు. కాని వీరి ఉద్రేకాలకు, ఆస్థిపర వర్గాల ఉద్రేకాలకు వైరుధ్యం ఉంది. అశేష ప్రజానీకం కేవలం ఈ వర్గాన్ని గుడ్డిగా అనుకరించేవారే. ఈ వర్గపు ఉద్రేకాలే ఎంతో కాలం నుంచి కాంగ్రెస్ సంస్కృతిని శాసిస్తున్నాయి. ఈ ఉద్రేకాలు అధికార దాహంతో తపించిపోయే ఉద్రేకాలే. అందుకే కాంగ్రెస్ పార్టీ కేవలం ఒక విప్లవ పార్టీయే గాని రాడికల్ భావాలు గల పార్టీ కాలేకపోయింది. కాంగ్రెస్ ప్రభుత్వాల రికార్డు పరిశీలించిన వారికెవరికైనా ఈ విషయం స్పష్టం. వాళ్ళు అధికారంలోకి వచ్చాక చేసిన పనులు కేవలం ఒక చిల్లర మల్లర వ్యవహారాల చిట్టా. బ్రిటిష్ వాళ్ళని తలదన్నే విధంగా శ్రామికుల్ని కాల్చేశారు; అధికారం ఉంది గదాని హైకోర్టులు శిక్షించిన నేరస్థుల్ని జైళ్ళనుంచి వదిలేశారు. ఇంత తొందరగా కాంగ్రెస్ ఇంగ్లండ్‌లోని టోరీల మల్లే తయారు కావటం నాకు ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నది. కాంగ్రెస్ పాలకవర్గాలు బ్రిటిష్ వాళ్ళను దేశం నుండి పార ద్రోలేందుకు అవసరమైన విప్లవ శక్తి నంతా కోల్పోయాయి. తమ అధికారంతో జనాన్ని విపరీతంగా దోచుకుంటూ సామ్రాజ్యవాద వ్యతిరేక భావాలు తమ పనికి అడ్డురాకూడదని భావిస్తున్నారు.

రాడికల్ పార్టీ కాకుండా కాంగ్రెస్, అస్పృశ్యులకు మేలు చేసే సామాజిక ఆర్థిక కార్యక్రమాలను చేపడుతుందనేది నమ్మకూడని విషయం. అస్పృశ్యులు అలాంటి

పార్టీలో చేరటం వ్యర్థమూ, బుద్ధిలేనిపని. అస్పృశ్యుల్ని కాంగ్రెస్ తమ పనుల కోసం ఇంతకు ముందులాగానే వాడుకోవటం తప్ప వారికి ఒరగబెట్టేదేమీలేదు.

పరిస్థితుల ఒత్తిడివల్ల కాంగ్రెస్ అస్పృశ్యులకు అప్పుడప్పుడు ఏదో కొంత చేస్తుండవచ్చు. కాంగ్రెస్ అలా చేసేది ఒకే ఒక సారి. అది శాసన సభల్లో మెజారిటీ లేక, అస్పృశ్యుల ప్రతినిధుల మద్దతు అవసరమైనప్పుడే. అలాంటి పరిస్థితిల్లోనే అస్పృశ్యులు తమ కోర్కెల్ని తీర్చుకునే అవకాశం ఉంది. కాంగ్రెస్ కూడా వాటిని తప్పనిసరిగా అంగీకరిస్తుంది. అలాంటి పరిస్థితిలో అస్పృశ్యులు కాంగ్రెస్‌లో చేరి సంకీర్ణం కావచ్చు. ఇది మంచి అవకాశమే. కాని ప్రస్తుతం ఎక్కడ చూసినా శాసన సభల్లో కాంగ్రెస్‌కు ఎవరి మద్దతు అవసరంలేని మెజారిటీ ఉంది. దానికిప్పుడు బయట నుంచి మద్దతు అవసరం లేదు. అస్పృశ్యులు కాంగ్రెస్‌లో చివరన ఒక తోకలాగా ఉన్నారు. ఈ తోక ఎంత పొడుగ్గా పెరిగిందంటే దాన్నిప్పుడు ఊపటం కూడా సాధ్యం కాదు. కాంగ్రెస్‌లో చేరినందువల్ల అస్పృశ్యులకు ఒరిగేదేమీ లేకపోవటానికి ఇదొక కారణం.

కాంగ్రెస్‌లో చేరినందువల్ల అస్పృశ్యులకు కలిగిన నష్టాలివి. అవి కేవలం నష్టాలేకాదు నేను వాటిని విపరీత పరిస్థితులంటాను. సాంఘికోద్యమంతా మృత ప్రాయమై పోయింది రాజకీయాధికారమంతా ఎక్కడికో వలస పోయింది. కొత్త రాజ్యాంగంతో అస్పృశ్యుల లాభ పడ్డారనటం హాస్యాస్పదం. నిజానికి వాళ్ళకు సంకెళ్ళు తగులుకున్నాయి.

కాని ఒక్క ప్రశ్న అడగవచ్చు. అదేమిటంటే కాంగ్రెస్‌లో చేరితే ఇన్ని నష్టాలున్నప్పు అస్పృశ్యులు అందులో ఎందుకు చేరారు? వాళ్ళు ఎన్నికల్లో స్వతంత్రంగా ఎందు పోరాడటం లేదు? కాంగ్రెస్ టిక్కెట్టు మీద నిలబడ్డ కొందరు అస్పృశ్యులు కేవలం శా సభల్లో సీట్ల కోసం, తద్వారా వచ్చే ఉద్యోగావకాశాల కోసం, వ్యక్తిగత లాభాల కో పోరాడేవారే. ఎవరి భుజాల మీద నిలబడి గెలిచామన్న విషయాన్ని వాళ్ళు లెక్క చేయలే కాగ్రెస్ పెద్ద పార్టీ కావటం వల్ల అందులో చేరితే ఎన్నిక రాజకీయాల్లో పై సునాయాసంగా ఎదిగిపోయి శాసన సభల్లో సీట్లు సంపాదించే వీలుంది. ఈ అవకాశ వాళ్ళు జారవిడుచు కోలేదు. వాళ్ళ లక్ష్యమేమిటో ఇది వివరిస్తుంది గాని కాంగ్రెస్ చేరటానికి వాళ్ళను బలవంతపెట్టిన కారణాలేమిటో ఇది వివరించదు. కాంగ్రె బాహ్యంగా తమంతట తాము ఎన్నికల్లో విజయం సాధించగలమని తెలిస్తే ఇలా

స్వలాభాపేక్ష పరులు కూడా కాంగ్రెస్‌లో చేరే వాళ్ళు కారని నాకు తెలుసు. ఇది సాధ్యం కాదని తెలిసే వాళ్ళు కాంగ్రెస్‌లో చేరారు. అంత బలవంతంగా వాళ్ళు కాంగ్రెస్‌లో ఎందుకు చేరారు ? దీనికి కారణం పూనా ఒడంబడికలో మోసపూరితంగా చేర్చిన ఉమ్మడి నియోజకవర్గాల ఏర్పాటే.

ఒక చిన్న మైనారిటీ వర్గమూ, ఒక పెద్ద మెజారిటీ వర్గమూ కలిసి ఏర్పడే ఉమ్మడి నియోజకవర్గం మైనారిటీలకు విపత్తుగా పరిణమిస్తుంది. ఒక వేళ అలాంటి నియోజకవర్గంలో మైనారిటీలనుంచి ఎవరైనా పోటీ చేస్తే నియోజక వర్గంలోని మైనారిటీ ప్రజానీకమంతా అతడికి ఓటు వేసినా అతను గెలవడు. మైనారిటీలకు సీట్లు రిజర్వ్ చేయడమంటే కేవలం ఆసీట్లలో మైనారిటీ సభ్యులు ఎన్నికకావటానికి రక్షణ కలిగి వుండటమే. కాని ఎన్నికైన మైనారిటీ ప్రతినిధిని ఉమ్మడి నియోజకవర్గంలో ఎన్నుకోవటం వల్ల అతను కేవలం మైనారిటీ వర్గానికే ప్రతినిధిగా ఉండాలన్న నిబంధన లేదు. మైనారిటీ వర్గాలకు సీట్లు కేటాయించినప్పటికీ మెజారిటీవర్గం మైనారిటీవర్గ సభ్యుణ్ణి గెలిపించి మైనారిటీ వర్గం నిలబెట్టిన మైనారిటీ వర్గ సభ్యుణ్ణి తమ బలంతో ఓటమికి గురిచేయవచ్చు. అలా గెలిచిన సభ్యుడు మైనారిటీ వర్గాల్ని విస్మరించి మెజారిటీ వర్గానికి బానిసలా తయారవుతాడు.

ప్రస్తుత శాసన సభల ఎన్నికల విధానంలో హిందూ కులాల ఓటర్ల సంఖ్యతో పోలిస్తే మైనారిటీ వర్గాల ఓటర్లు దయనీయమైన అల్పసంఖ్యాకులు. వివిధ నియోజకవర్గాల్లో హిందూ ఓటర్లకు,అస్పృశ్య ఓటర్లుకు ఎంత తారతమ్యముందో కొన్ని నియోజకవర్గాల్ని పరిశీలిస్తే తెలుస్తుంది.

ఎన్నికల్లో తమబలంతో మెజారిటీ వర్గాలు మోసం చేయడానికి ఉమ్మడి నియోజకవర్గాలకు ఏకసభ్య నియోజ కవర్గాల్లో ఎంతో అవకాశం ఉంది.

మైనారిటీలకు రిజర్వ్‌డ్ సీట్లలో ఉమ్మడి నియోజకవర్గాల్లో మెజారిటీ వర్గానికి సీటు మైనారిటీ వర్గానికి ఒక సీటు వచ్చే విధంగా బహు సభ్య నియోజకవర్గాలై వుండాలి ఒక్క మాటలో చెప్పాలంటే ప్రతి నియోజకవర్గమూ బహుసభ్య నియోజకవర్గమై వుండాలి. అది మెజారిటీ వర్గం రెండు సీట్లను, మైనారిటీ వర్గం ఒకసీటును పొందేందుక అనుకూలమైన చిన్న నియోజకవర్గమూ అయి వుండాలి. అది మెజారిటీ వర్గాలకు

ఎక్కువ ప్రాతినిధ్యం కల్పించే పెద్ద నియోజకవర్గంగా కూడా వుండవచ్చు. ఎన్నుకునే ప్రతినిధుల సంఖ్య చిన్నదై ఉంటే మెజారిటీ వర్గాలు మోసం చేసే అవకాశం తగ్గటం వల్ల ఇదొక మంచి ప్రతిపాదనే. ఒక విషయాన్ని గ్రహిస్తే ఇది స్పష్టమవుతుంది. మెజారిటీకి కొద్ది సీట్లు మాత్రమే ఉన్నట్లైతే తమ ఓటింగు బలంతో ఎక్కువ భాగాన్ని తామే నిలబెట్టిన రిజర్వ్‌డ్ మైనారిటీల సభ్యునికిచ్చి మైనారిటీలు నిలబెట్టిన సభ్యుణ్ణి ఓడిస్తారు. పైగా ఒక వేళ మెజారిటీ వర్గానికి ఎక్కువ సభ్యుల్ని అనుమతిస్తే అక్కడ పోటీ దార్ల మధ్య పోటీ అధికంగా వుంటుంది. వాళ్ళు అందులోనే తలమునకలై ఏదో కొద్ది సంఖ్యలో మాత్రమే మైనారిటీ సీటుకు కేటుస్తారు. ఉమ్మడి నియోజకవర్గాల్లో మైనారిటీల రక్షణ ఎక్కువ సీట్లు కేటాయించటంతో ముడిపడివుంది. లేకపోతే మెజారిటీ వర్గాలదే పై చేయి కావటం ఖాయం.

ఎన్నిక విధానంలో ప్రస్తుతం ఉన్న ఏర్పాటు ఏకసభ్య నియోజకవర్గమే. నియోజకవర్గాన్ని మొత్తంగా పరిశీలిస్తే అది బహు సభ్య నియోజకవర్గంగా గోచరించే మాట నిజమే. కాని వాస్తవానికి హిందువులకు సంబంధించినంతవరకు అవి ఏక సభ్య నియోజకవర్గాలే. హిందూ ఏక సభ్య నియోజకవర్గాల ప్రత్యేకతేమిటంటే తమలో గణనీయమైన ఓటర్ల సంఖ్యను అస్పృశ్యులకు రిజర్వ్ చేసిన సీట్లకు మళ్ళించి తమ ప్రతినిధిని రిజర్వ్ సీటులోకి తెచ్చే అవకాశం ఉండటమే.

పూనా ఒడంబడికలోని లాభాలను అణగార్చటానికి హిందువులు తమ బలాన్నంతా కూడ గట్టుకున్నారు. తొందరలోనే చేయటం వల్ల పూనా ఒడంబడిక చాలా విషయాలను స్పష్టీకరించకుండా వదిలేసింది. అలా వదిలివేయబడి అటుతరువాత ఎన్నో వివాదాలకు తావిచ్చిన అంశాలివి: (1) ఎన్నుకోబడే నలుగురిలో కూడిన ప్యానెల్‌లోని నాలుగు సంఖ్య ఉద్దేశించిన అత్యల్ప సంఖ్యా లేక అత్యధిక సంఖ్యా? (2) హిందువులతో కల్పి ఉమ్మడినియోజకవర్గాల్లో ఏర్పాటు చేసే ఎన్నిక విధానం ఏది ? ఈ విషయాలు చర్చించటానికి ఏర్పాటైన హామండ్ కమిటీ ఈ రెండు అంశాలకు సంబంధించినంతవరకు పరస్పర విరుద్ధమైన భావాలకు తావిస్తున్నదనీ, అందులో ఒకటి హిందూ కులస్థులకు మరొకటి మైనారిటీలకు సంబంధించినదనీ పేర్కొంది. హిందూ కులాలవారు ఈ నాలుగు సంఖ్య అత్యల్పమని భావించారు. ఒక వేళ నలుగురు సభ్యులు లభించని పక్షంలో ప్రాథమిక

ఎన్నిక జరగక రిజర్వ్‌డ్ సీటు భర్తీకి ఎన్నిక జరగదు. అప్పుడది ఖాళీగానే వుండాలని, అలాంటప్పుడు అస్పృశ్యులకు ప్రాతినిధ్యం వుండదనీ వాళ్ళంటున్నారు. నలుగురు సభ్యుల సంఖ్య అత్యధికమని అస్పృశ్యులన్నారు. పూనా ఒడంబడిక అన్నట్లు నలుగురంటే నలుగురుకన్నా ఎక్కువ కాదనే అర్థంలో వారు విశ్వసించారు. "నలుగురు కన్నా తక్కువ కాదని దానర్థం కాదు. ఓటింగ్ విషయానికొస్తే తప్పనిసరి ఓట్ల విభజన పద్ధతే సరియైందని హిందువులనుకున్నారు. సమగ్ర ఓట్ల పద్ధతే సరియైందని అస్పృశ్యులు భావించారు.

హామండ్ కమిటీ అస్పృశ్యుల వాదననే సమర్థించి హిందువుల వాదనను తిరస్కరించింది. హిందువులు ఈ వివాదాస్పదాంశాలను ఎందుకులేవనెత్తారో తెలుసుకోవటం చాలా ఆసక్తిదాయకంగా ఉంటుంది.

పానెల్లో నలుగురు కన్నా తక్కువ ఉండరాదని హిందువులు ఎందుకు కోరుతున్నారో పూర్తిగా విశదమే. వారి ఉద్దేశ్యమేమిటంటే తుది ఎన్నికలో హిందువుల్నీ, హిందూ మతాన్ని జవదాటు విశ్వసించని అస్పృశ్యుణ్ణి తమ ప్రతినిధిగా ఎన్నుకునే అవకాశం కోసమే తుది ఎన్నికలోకి రావాలంటే ముందుగా ప్రాథమిక ఎన్నిక ద్వారా "నలుగురి ప్యానెల్" లోకి రావాలి. ప్యానెల్ పెద్దగా ఉంటేనే తమకనుకూలమైన అస్పృశ్యుడు వచ్చే అవకాశాలెక్కువ.

ఒకవేళ ప్యానెల్‌లో ఒకే ఒక సభ్యుడుంటే అతను తిరుగులేని అస్పృశ్య ప్రతినిధియై హిందువులకు కంటకంగా తయారవుతాడు. ఒకవేళ ఇద్దరుంటే రెండోవాడు అంతగా కంటకప్రాయం కాకుండా హిందువులకు అనుకూల పరిస్థితి వుంటుంది. ఒక వేళ ముగ్గురుంటే మూడవ వాడు రెండవ వాడికంటే మెత్తనివాడై పోయి హిందువులకు ఇంకా అనుకూలంగా వుంటుంది. నలుగురుంటే నాల్గవ వాడు మూడవ వాడికన్నా మంచి వాడైతే హిందువులకు అత్యుత్తమంగావుంటుంది. అందుకే నలుగురితోకూడిన పానెల్ వుంటే తమ కనుకూలమైన అస్పృశ్య సభ్యుల్ని అందులో చేరేటట్లు చూడవచ్చు. తమతో, హిందూ మతంతో రాజీ పడేవాళ్ళైవుంటారు అలాటి సభ్యులు.

అవశ్య విభజన ఓట్ల పద్ధతి ఈ పానెల్‌కు కేవలం ఒక సప్లిమెంట్ మాత్రమే- క్యుములేటివ్ ఓటింగ్ పద్ధతిలో ఎన్ని సీట్లు నిండవలసి వుంటే ఓటరుకు అన్ని ఓట్లూ

వుంటాయి. తన ఇష్టానుసారం అతను అన్నీ కలిపి ఒక్కడికేగాని లేదా ఇద్దరు అంతకు మించి సభ్యుల మధ్య పంచిగానీ వినియోగించుకోవచ్చు. పంపిణీ ఓటింగ్ పద్ధతిలో కూడా ఎన్నిస్థానాలుంటే అన్ని ఓట్లు ఓటరుకుంటాయి. కాని ఒక్కొక్క సభ్యునికి ఒక్కొక్క సభ్యునికి ఒక్కొక్క ఓటు మాత్రమే అవకాశముంటుంది. ఈ రెండు పద్ధతుల మధ్య ఎంతో వ్యత్యాసమున్నట్టు కనిపిస్తుంది గాని నిజానికి ఎలాంటి వ్యత్యాసమూలేదు. రెండు పద్ధతులూ ఓటరును ఓటు పంపిణీ చేయకుండా ఆపజాలవు. ఒక అభ్యర్థికి ఒక ఓటు వేసే స్వేచ్ఛ ఓటరుకుంది. కాని హిందువులు ఏమాత్రం అవకాశం తీసుకోగోరలేదు. వాళ్ల ముఖ్యోద్దేశమేమిటంటే ఉమ్మడి నియోజక వర్గాల్లోని మిగులు ఓట్లని తమచే నియమించబడిన రిజర్వ్‌డ్ అభ్యర్థికి కురిపించి అతను ఎన్నికయ్యేట్టు పకడ్బందీగా ఏర్పాటు చేసుకోవటమే. నిజమైన అస్పృశ్య అభ్యర్థిని ఎన్నిక కాకుండా చేయటమే హిందువుల ఉద్దేశ్యం. హిందూ అభ్యర్థినుంచి కొన్ని మిగులు ఓట్లను తప్పించి తాము బలపర్చే అస్పృశ్య అభ్యర్థికి వేయించందే ఇది సాధ్యం కాదు. ఒక ఓటరు తనకున్న అన్ని ఓట్లూ ఒక అభ్యర్థికే మొత్తంగా వేసే ఏర్పాటుకన్న వాటిని పంపిణీ చేసే వీలున్న ఎన్నిక పద్ధతిలోనే ఈ ఓట్లు చీలిపోయే అవకాశం ఎక్కువ. రెండవ పద్ధతిలో ఒక హిందూ కులస్థుడైన ఓటరు తమ హిందూ అభ్యర్థికి ఒకే ఒక ఓటు ఇవ్వగలడు. మిగిలిన ఓటు హిందూ కుల అభ్యర్థికి ఉపయోగపడదు కాబట్టి అస్పృశ్య అభ్యర్థికి వినియోగించవచ్చు. ఓటు పంపిణీ పద్ధతివల్ల రిజర్వ్ చేయబడిన అస్పృశ్య అభ్యర్థికి పెద్ద ఎత్తున ఓట్లు మళ్ళించే అవకాశం ఉంది కాబట్టి వాళ్లు ఈ పద్ధతికి ప్రాధాన్యతనిస్తున్నారు. కాని వాళ్లు ఒక అవకాశం తీసుకుని చూద్దామనుకుంటున్నారు. వారి ఉద్దేశ్యంలో పంపిణీ పద్ధతి కూడా లోపాలులేని పద్ధతేమీ కాదు. ఒక ఓటరు తనకున్న ఓట్లన్నిటినీ ఉపయోగించాలనే నియమం ఏదీ లేదు. తనకున్న ఓట్లలో ఒక ఓటు హిందూ అభ్యర్థికి వేసి మిగతావి మురగబెట్టుకోవచ్చు. ఒక వేళ ఇదే జరిగితే వాళ్ళు బలపర్చే అస్పృశ్య అభ్యర్థి ఓడిపోతాడు. అందుకే సమస్యకు తావు లేకుండా హిందువులు విభజన ఓటింగ్ పద్ధతి తప్పనిసరిగా ఉండాలని కోరారు అప్పుడు హిందూ ఓటర్లు తమకు ఇష్టమున్నా లేకున్నా హిందువులు బలపర్చే అస్పృశ్య అభ్యర్థికి తప్పనిసరిగా ఓటు వేయవలసి ఉంటుంది.

ఆ విధంగా ఈ రెండు పద్ధతులూ హిందువులు పన్నిన పన్నాగంలో భాగమే హామండ్ కమిటీ వీటిని తిరస్కరించింది. కానీ పూనా ఒడంబడిక లోనే ఎన్నో లొసుగుల

వుండటం వల్ల ఈ రెండు పద్ధతులు తిరస్కరించబడినప్పటికీ అస్పృశ్యులకు ప్రత్యేక ప్రాతినిధ్యం లభించకుండా చేయటానికి అవకాశాలేర్పడ్డాయి.

పూనా ఒడంబడిక వల్ల అస్పృశులు నష్టపోతుండగా శ్రీ గాంధీ గారి మిత్రులంతా దాన్ని అస్పృశ్యులకు వరప్రసాదమని ప్రచారం చేశారు.

కమ్యునల్ అవార్డ్ ద్వారా కన్నా పూనా ఒడంబడిక వల్ల అస్పృశ్యులకు ఎక్కువ సీట్లు లభిస్తాయన్నారు. ఇది నిజమే. ఎందుకంటే పూనా ఒడంబడిక వల్ల అస్పృశ్యులకు 151 సీట్లు కేటాయించబడితే. కమ్యునల్ అవార్డ్‌లో వారికి లభించిన సీట్లు 78 మాత్రమే. అంత మాత్రం చేత కమ్యునల్ అవార్డ్ కన్న పూనా ఒడంబడిక వల్లనే అస్పృశ్యులకు ఎక్కువ లాభం జరిగిందంటే నిజానికి అస్పృశ్యులకు అవార్డ్ ఇచ్చిన దాన్ని విస్మరించటమే అవుతుంది.

కమ్యునల్ అవార్డ్ అస్పృశ్యులకు రెండు లాభాలు కలుగజేసింది. (1) ప్రత్యేక నియోజగణాలచే ఎన్నుకోబడిన నిర్ణీతమైన సంఖ్యలో అస్పృశుల్యకు సీట్లు (2) ద్వంద్వ ఓటు – ఒకటి ప్రత్యేక నియోజక గణాల్లో ఉపయోగించుకునేందుకు, రెండవది సాధారణ నియోజక గణాల్లో ఉపయోగించుకునేది.

పూనా ఒడంబడిక నిర్ణీత సంఖ్యలో సీట్ల కేటాయింపును కల్పించింది. కాని ద్వంద్వ ఓటును రద్దు చేసింది. నిర్ణీత సంఖ్యలో సీట్ల కల్పన ద్వంద్వ ఓటు రద్దుకు పరిహారం కాదు. కమ్యునల్ అవార్డు కల్పించిన ద్వంద్వ ఓటు అమూల్యమైన ప్రత్యేక హక్కు. రాజకీయాస్త్రంగా దాని విలువ తిరుగులేనిది. ప్రతి నియోజకవర్గంలోనూ పది మందిలో ఒక్కటి అస్పృశ్య ఓటు. హిందూ కుల అభ్యర్థులకు అస్పృశ్యులు ఈ సంఖ్యలో స్వతంత్రంగా ఓటు వేసే హక్కు, సాధారణ ఎన్నికల్లో అస్పృశ్యుల ఓటును నిర్ణయాత్మకమైనదిగా చేస్తుంది. ఏ హిందూ అభ్యర్థి కూడా తన నియోజకవర్గంలో గల అస్పృశ్యుల్ని విస్మరించే ధైర్యం చేయలేడు. వాళ్ళ ఓట్లు నిర్ణయాత్మకమైన పాత్ర నిర్వహిస్తాయి గాబట్టి వాళ్ళతో వైరం పెట్టుకోలేడు. ఇవాళ కమ్యూనల్ అవార్డ్ ఇచ్చినదానికంటే అస్పృశ్యులకు ఎక్కువ సీట్లే ఉన్నాయి. కాని ఇప్పుడు వారికి మిగిలిందదే. ఎవరూ వైరం పెట్టుకోకపోయినా,ఏమీ పట్టించుకోవటం లేదు. ద్వంద్వ

ఓటు కలిగి వుండే ఏర్పాటులో కమ్యునల్ అవార్డ్ ఉన్నట్లైతే అస్పృశ్యులకు కొన్ని తక్కువ సీట్లు వచ్చినా ఎన్నికయిన ప్రతివాడూ అస్పృశ్యుల ప్రతినిధిగా ఉండే అవకాశం ఉండేది. అస్పృశ్యులకు పెరిగిన సీట్లు నిజానికి పెరుగుదలే కాదు. కేవలం వాదన కోసం పూనా ఒడంబడిక అస్పృశ్యులకు ఎక్కువ సీట్లు కేటాయించటాన్ని అంగీకరించినా ఈ సీట్ల వల్ల జరిగిందేమిటనే ప్రశ్న ఇంకా మిగిలే వుంటుంది. సాధారణంగా రాజకీయ రక్షణకు ఓటు హక్కు ఒక మార్గం. కాని అస్పృశ్యులకు కేవలం ఓటు హక్కే చాలదని భావించారు. అస్పృశ్యుల ఓట్లతో గెలిచిన అభ్యర్థి ఒక వేళ అస్పృశ్యుడు కానట్లైతే అతను అస్పృశ్యుల పట్ల ఆసక్తి చూపించక పోవటం గానీ లేదా తప్పుడు పాత్ర నిర్వహించటం గానీ చేసే అవకాశం ఉందని భయపడ్డారు. అస్పృశ్యుల సాధకబాధకాలు శాసన సభల్లో బయటపెట్టటానికి అస్పృశ్యులకుకేటాంయిచిన సీట్లలో ఎన్నికైన అస్పృశ్యులే సరియైన వారని భావించారు. ఇప్పుడది నిరాశే అయిందనేందుకు దాఖలా కనిపిస్తూనే వుంది. కమ్యునల్ అవార్డు తక్కువ సీట్లను కేటాయించిన విషయంలో అనుమానంలేదు. కాని ప్రతినిధులుగా ఎన్నికైన ఆ కొద్ది మందీ స్వేచ్ఛా జీవులుగా ఉండే అవకాశం ఉండేది. పూనా ఒడంబడిక ఎక్కువ సీట్లనిచ్చింది గానీ అందులో కూర్చున్న వాళ్ళంతా బానిసలే. ఒక పెద్ద బానిసల గుంపు ఉండటం లాభదాయకమే ఐతే పూనా ఒడంబడిక లాభాన్నే చేకూర్చిందని చెప్పవచ్చు.

పూనా ఒడంబడికను సమర్థించే రెండో వాదనేమిటంటే ప్రత్యేక సీట్ల రద్దువల్ల అస్పృశ్యులు శాశ్వతంగా బానిస జీవనం గడపవలసిన దుస్థితి తప్పిందని. గాంధీగారు తాను లండన్లో చేసిన ఒకానొక ఉపన్యాసంలో ఇలా అన్నాడు :

"ముస్లింలు, సిక్కులు బాగా సంఘటితమై వున్నారు. అస్పృశ్యులలా లేరు. వాళ్లలో రాజకీయ చైతన్యం ఏమాత్రం లేదు. వాళ్ళెంతటి దుర్భర జీవితాన్నె దుర్కొంటున్నారంటే నేను వాళ్ళను వాళ్ళ నుంచే రక్షించాలని వాంఛిస్తున్నాను. వాళ్ళకు ప్రత్యేక ఎన్నిక గణాలే ఏర్పడితే గ్రామాల్లో పట్టు గలిగి ఉన్న సనాతన హిందూ కులస్థుల చేతుల్లో వాళ్ళ జీవితాల దుర్భరమౌతాయి. హిందువుల్లో ఉన్నత వర్గాలు 'అస్పృశ్యుల్ని' నిరసించినందుకు పశ్చాత్తాపంతో కుమిలిపోవాలి. దీనికి ప్రాయశ్చిత్తం క్రియాశీలకమైన సంస్కరణ ద్వారా అస్పృశ్యులకు ఎంతో సేవచేయటమే. అంతేగాని ప్రత్యేక ఎన్ని

గణాలు దానికి ప్రత్యామ్నాయం కాదు. ప్రత్యేక వర్గాల ఏర్పాటు అస్పృశ్యులకు, సనాతన హిందువులకు మధ్య అగాధాన్ని సృష్టిస్తుంది. ముస్లింలకు, సిక్కులకు ప్రత్యేక ప్రాతినిధ్యాన్ని నేను కేవలం అవశ్యక్లేశంగానే అంగీకరించానని మీరు తెలుసుకోవాలి. కాని 'అస్పృశ్యులకు' అదెంతో ప్రమాదకరం. అస్పృశ్యులకు ప్రత్యేక వర్గాలనేవి ప్రభుత్వం చేసిన విశ్వామిత్ర సృష్టియని నేను నమ్ముతున్నాను. వాళ్ళకి కావలసింది వాళ్ళు ఓటర్ల జాబితాలో చేరటం; రాజ్యాంగంలో వారికి ప్రాథమిక హక్కులు కల్పించటం. ఒక వేళ వాళ్లకు ఏదైనా అన్యాయం జరిగితే లేదా వాళ్ళ ప్రతినిధుల్ని ఉద్దేశ్యపూర్వకంగా విస్మరించినా వాళ్ళు ప్రత్యేక ఎన్నికల ట్రిబ్యునళ్ళలో రక్షణ పొందవచ్చు. ఈ ఎన్నికల ట్రిబ్యునళ్లకు ఎన్నికైన ఒక సభ్యుణ్ణి సభ్యత్వాన్నుంచి తొలగించే అధికారమూ, విస్మరించబడిన వ్యక్తికి సభ్యత్వాన్నిచ్చే అధికారమూ వుండాలి.

"ప్రత్యేక నియోజక గణాలు 'అస్పృశ్యుల్ని' శాశ్వతమైన సంకెళ్ళతో ఉంచటం ఖాయం. ప్రత్యేక ఎన్నిక గణాలున్న ముసల్మాన్లు ముసల్మాన్లు కాకుండా పోయారా? 'అస్పృశ్యులు, ఎల్లప్పుడూ అస్పృశ్యులుగానే ఉండాలని మీరు కోరుకుంటున్నారా ? మంచిది. ప్రత్యేక ఎన్నిక గణాలు ఈ దుస్థితిని ఇలాగే ఉంచుతుంది. అస్పృశ్యతను నాశనం చేయటం తక్షణ కర్తవ్యం. మీరది చేసినప్పుడు ఉన్నతవర్గాలు నిమ్న వర్గాలపై మోపిన మోసపూరిత మైన భారం నాశనమౌతుంది. అది నాశన మయ్యాక మీరెవరికోసం ప్రత్యేక ఎన్నిక గణాల్ని ఏర్పాటు చేస్తారు? ఐరోపా చరిత్ర చూడండి. శ్రామికులకు గానీ, స్త్రీలకు గానీ ప్రత్యేక ఎన్నిక గణాలున్నాయా? వయోజన ఓటింగ్ హక్కుతో 'అస్పృశ్యుల' కు పూర్తి రక్షణ నివ్వండి. మొండి సనాతనులు గూడా ఓట్ల కోసం వారి దగ్గరకు వెళతారు.

"అయితే వాళ్ళ ప్రతినిధి డా॥ అంబేద్కర్ వాళ్ళకు ప్రత్యేక నియోజక వర్గాలు కావాలని ఎందుకు పట్టుబడుతున్నాడు ? అంబేద్కర్ అంటే నాకెంతో గౌరవం. ఆయనకు ఎంత కోపమైనా రావచ్చు. ఆకోపంలో ఆయన ఇంకా మా తలలు పగల గొట్టలేదంటే అది ఆయన్లో ఉన్న గొప్పతనమే. ఇవాళ ఆయన అనుమానాల్తో ఎంతగా కాగిపోతున్నాడంటే మరేమీ గమనించే స్థితిలో లేడాయన. ప్రతి హిందువులోనూ అస్పృశ్యుల శత్రువే ఆయనకు కనిపిస్తున్నాడిప్పుడు. అది సహజమే. నేను దక్షిణాఫ్రికాలో వుండగా యూరోపియన్లు నన్ను వెంటాడినప్పుడల్లా నాకూ ఇలాగే అనిపించేది. ఆయన

తన కోపాన్ని వెళ్ళగక్కటం ఎంతో సహజం. కాని ఆయన కోరే ప్రత్యేక ఎన్నిక గణాలు ఆయననుకున్నట్లు సంఘ సంస్కరణ తేలేవు. ఆయనకు వ్యక్తిగతంగా అధికారమూ, హోదాలు లభిస్తే లభించవచ్చేమోగాని 'అస్పృశ్యుల' కు వొరిగేదేమీ ఉండదు. ఎన్నో సంవత్సరాలుగా 'అస్పృశ్యుల'తో కలిసిమెలసి జీవించిన నేను, వాళ్ళ సుఖ సంతోషాల్లో పాలుపంచుకొనగలిగిన నాకు ఈ విషయాలన్నీ ఎంతో బాగా తెలుసనని చెప్పగలను"

ఈయన వాదనకు సైమన్ కమీషన్ మద్దతు కూడా లభించిన మాట నిజమే. సైమన్ కమీషన్ ఇలా భావించింది.: (ఈ క్రింద పేర్కొన్న భాగాలు వ్రాత ప్రతిలో లేవు డా॥ అంబేద్కర్ గ్రంథం "వాట్ కాంగ్రెస్ అండ్ గాంధీ హావ్ డన్‌టు ది అన్‌టచబుల్స్" నుంచి గ్రహించబడింది. అనుబంధం **VI** పేజీ.327 - సంపాదకుడు)

"78......... ఏ ఇతర ప్రాంతం నుంచి కూడా ఓటు వేసే హక్కుకు అర్హులైన దళిత వర్గాల ప్రజలు ఎందరో అంచనా వేసేందుకు వీలు పడలేదు. ఓటు చేసే హక్కును ఎంత కుదించినా (ఇది దళిత వర్గాల నిష్పత్తిని గణనీయంగా పెంచుతుంది), వాళ్ల హక్కుల్ని రక్షించుకునేందుకు ప్రత్యేక సౌకర్యాలు కల్పించినప్పటికీ సాధారణ నియోజక వర్గాలనుంచి దళితులు తమ స్వంత ప్రతినిధుల్ని ఎన్నుకోలేరు. మునుముందు దళితులు ఏమేరకు తమ రాజకీయ శక్తిని వినియోగించుకొని ఇతరవర్గాలు తమపై ఆధారపడేట్లు చేసుకుని తమ ప్రత్యేక స్థానాన్ని నిలుపుకోగలరో ఆమేరకు మాత్రమే వాళ్ళ ప్రగతీ, వాళ్ళ అవసరాలూ తీరే అవకాశం ఉంది.

"80...... అందుకే దళితులకు వారి జనాభా ప్రాతిపదికపై సీట్లు ఏర్పరచేందుకు మేం సిఫారసు చేయం. ప్రతిపాదించిన రిజర్వ్‌డ్ ప్రాతినిధ్యరేఖ దళిత వర్గాలనుంచి వచ్చిన ఎం.ఎల్.ఎల సంఖ్యలో గణనీయమైన పెరుగుదల ను సాధించేందుకు ఉద్దేశించాం. ప్రబలంగా ఉన్న పేదరికం, అవిద్యవల్ల ఎక్కువ సంఖ్యలో తగిన సామర్థ్యం గల సభ్యులు ఒకేసారి వాళ్ళలో లభిస్తారనేది అనుమానాస్పదమే. కేవలం ఉన్నత కులాల అడుగులకు మడుగులొత్తే ప్రతినిధుల కన్నా అర్హత గల సభ్యులే వాళ్ళ ప్రతినిధులు గా ఉండటం మంచిది. దేనికీ పనికిరాని ఇలాంటి సభ్యులు ఎక్కువ సంఖ్యలో ఉండడం కన్నా తక్కువ సంఖ్యలోనైనా అర్హత గలవారుండటం వాంఛనీయం. వివిధరకాల ప్రతినిధులమధ్య ఇప్పుడు చేస్తున్న సీట్ల పునర్విభజన శాశ్వతమైందికాదు; పునః పరిశీలనకు అవకాశం

కల్పించాలి. సీట్ల రిజర్వేషన్ ద్వారా ప్రత్యేకంగా అభిప్రాయాలకు ప్రాతినిధ్యం కల్పించటమనేది రిజర్వుడ్‌కాని సీట్లను గెలవకూడదని చెప్పదు. దీని దృష్ట్యా ప్రస్తుతానికి మా ప్రతిపాదన సరియైందనే మేం భావిస్తున్నాం."

కాని ఈ వాదన వెర్రి వాదననటంలో సందేహం లేదు. ఒక మనిషిని ఇతరులనుండివేరు చేసి ఒక ప్రత్యేక భాగంగా చేయటంలో చెడువుండాల్సిన అవసరంలేదు. ఒక ముద్ర వేసి చూపించటం మంచిదా కాదా అనే విషయం అలా ఏ అవసరం కొద్దీ చే ారన్న దాని మీద ఆధారపడివుంటుంది. ఒక వేళ అతని హక్కుల్ని హరించేందుకే అలా చేస్తే అది ఘోరమైన తప్పిదమవుతుందనటంలో సందేహం లేదు. కాని అలావేరుగా చూపటం వల్ల అతనికి ప్రత్యేక హక్కులు సంక్రమించేట్టయితే అది తప్పిదం కాకపోగా ఎంతో లాభదాయకమైన చర్య అవుతుంది. అస్పృశ్యుణ్ణి ప్రత్యేక ఓటర్ల జాబితాలో చేర్చినందువల్ల అతను ఓటు హక్కును కోల్పోయే పరిస్థితి ఏర్పడితే అలాంటి చర్య అభిశంసనీయమే. ఒక వేళ అతనికి లాభం చేకూర్చే ఉద్దేశ్యంతో ప్రత్యేక ఎన్నికవర్గాల్లో చేరిస్తే అలాంటి ప్రాతినిధ్యం అతనికి తప్పక లాభదాయకమే. అంతిమంగా చూస్తే అస్పృశ్యులకు లాభాన్ని చేకూర్చే ప్రత్యేక గణాల ఏర్పాటును వాళ్ళ మిత్రులని చెప్పుకునే వాళ్ళే ఎందుకు వ్యతిరేకిస్తారో అర్థం కాని విషయం. ప్రత్యేక ఎన్నిక గణాల ఏర్పాటుకు గాంధీ చూపే వ్యతిరేకత అర్థం పర్థం లేనిదేకాదు, నిజాయితీ లేనిది కూడా. అస్పృశ్యుల్ని శాశ్వతంగా అస్పృశ్యులుగా ఉంచుతుందనే ఉద్దేశ్యంలో శ్రీ గాంధీ ప్రత్యేక ఎన్నిక గణాలను వ్యతిరేకించాడు. ఉమ్మడి ఎన్నిక గణాల ఏర్పాటు దీన్నెలా నివారిస్తుందో అర్థం చేసుకోవటం కష్టం. అస్పృశ్యుడు ఆ 'హోదా'లోనే, చట్టప్రకారం ఆ గుర్తింపుతోనే ఉమ్మడి నియోజక గణంలో ఓటు వేయాల్సి ఉంటుంది. ఆ విధంగా ఉమ్మడి నియోజకగణంలో కూడా ఆ గుర్తింపే ఉంటుంది కాబట్టి శ్రీగాంధీ ప్రత్యేక నియోజక గణాల ఏర్పాటుకు ఎంతగా అభ్యంతరం చెబుతున్నాడో ఉమ్మడి నియోజక వర్గాలకు అంతే అభ్యంతరం చెప్పాలి. శ్రీ గాంధీ నిజాయితీ లేని వాదన్నా కావాలి లేదా తాను మాట్లాడుతున్నదేదో తనకే తెలియకుండా మాట్లాడుతున్నాడనాలి.

పూనా ఒడంబడిక ప్రకారం స్వతంత్రంగా వ్యవహరించగల ఎందరు సభ్యుల్ని ఏమేరకు అస్పృశ్యులు శాసన సభల్లో తమకు ప్రాతినిధ్యం వహించేదుకు పంపించగలిగారో,

వాళ్ళు నిజంగా వాళ్ళు హక్కుల కోసం పోరాడుతున్నారో లేదో, ఏమేరకు వాళ్ళు విజయాల్ని సాధించారో అన్న విషయాల్ని గురించి గాంధీ గారూ ఆయన సహచరులూ ఆలోచించి చూడరు. అలా చూస్తే పూనా ఒడంబడికను గురించి, ఉమ్మడి నియోజకవర్గాల గురించి గానం చేయటానికి వాళ్ళు సిగ్గు పడాల్సి వుంటుంది. కాంగ్రెస్సూ, హిందువులు మెజారిటీగా వాళ్ళ అధికారాన్ని, వనరుల్ని నిస్సిగ్గుగా దురుపయోగపరుస్తున్నారు. అస్పృశ్యులను తమకు ఇష్టమైన ప్రతినిధుల్ని ఎన్నుకోకుండా అడ్డుకోవటం, వాళ్ళ మిగులు ఓట్లతో తమ స్వంత అభ్యర్థులను ఎన్నుకోకుండా అడ్డుకోవటం, వాళ్ళ మిగులు ఓట్లతో తమ స్వంత అభ్యర్థులు ఎన్నికయ్యేట్లు చూసుకోవటం మాత్రమే కాక ప్రపంచంలో మరే ఇతర పార్టీ అయినా సిగ్గు తో తలవంచుకునే పనులెన్నో చేస్తున్నారు. అస్పృశ్యులకు కేటాయించిన రిజర్వ్‌డ్ సీట్లు కాంగ్రెస్‌లోని అస్పృశ్యులతో నింపటం పిరికితనమూ మోసపూరితమూను. పూనా ఒడంబడికలో నిర్ణయించబడిన సీట్ల కంటే ఎక్కువ సీట్లు దళితులకు కేటాయించేందుకు కాంగ్రెస్ (హిందూమతానికి మరో పేరే ఇది)కు ఎప్పుడూ అవకాశం ఉంది. సాధారణ నియోజకవర్గాల్లో వాళ్ళను అభ్యర్థులుగా నిలబెట్టవచ్చు. ఇందుకు వారికి ఏ శాసనమూ అడ్డురాదు. కాంగ్రెస్ ఇలాంటి దేమీ చేయలేదు. దీనివల్ల తెలిసే దేమిటంటే అస్పృశ్యులకే గనక ప్రత్యేకసీట్లు ఏర్పరచినట్లైతే. శాసన సభల్లోనికి హిందువులు వాళ్ళని అడుగుపెట్టనిచ్చే వాళ్ళు కాదు. అంతేకాకుండా ప్రత్యేకంగా సీట్లు కేటాయించినప్పుడు దాన్ని నాశనం చేసే ఉద్దేశ్యంతో హిందువులు తమకనుకూలంగా, బానిసలుగా పడివుండే అస్పృశ్యులకే ఆసీట్లు దక్కేందుకు కృషి చేశారు.

ఆవిధంగా అస్పృశ్యులు తమ రాజకీయ హక్కుల్ని రక్షించుకోవటం కొరకు చేస్తున్న పోరాటం విషాదాంతంగా ముగిసింది. ఈ విషాదాంత నాటకానికి సూత్రధారి గాంధీయేనని చెప్పటానికి నేను వెనుకాడటం లేదు.

ప్రత్యేకత ఎన్నికవర్గాలనేర్పాటు చేస్తుందనే నెపంతో కమ్యునల్ అవార్డుకు వ్యతిరేకంగా శ్రీ గాంధీ అరిచే అరుపులు పూర్తిగా తప్పు. ఆయన నిరాహారదీక్షపిచ్చిని అభిమానించకపోతే హిందువులు ఈ విషయం గ్రహించగలిగేవారే. ప్రత్యేక ఎన్నిక గణాలతో పాటు ఉమ్మడి ఎన్నిక గణాలకు కూడా కమ్యూనల్ అవార్డు అవకాశం కల్పించింది. అస్పృశ్యులకు గల రెండవ ఓటు సాధారణ ఎన్నికవర్గాల్లో హిందూ కులస్థుల్ని ఎన్నుకోవడానికి ఉద్దేశించిందే.

ఇవి నిస్సందేహంగా ఉమ్మడి ఎన్నిక వర్గాలే. పూనా ఒడంబడికకు, కమ్యునల్ అవార్డుకు ఉన్న తేడా ఎన్నిక వర్గాల స్వభావంలోనే ఉంది. రెండూ ఉమ్మడి ఎన్నికల వర్గాల్నే ఏర్పాటు చేశాయి. ఇంకా ఈ తేడా ఎలాంటిదంటే కమ్యునల్ అవార్డు ద్వారా ఉమ్మడి ఎన్నికవర్గాల్లో హిందూ కుల అభ్యర్థుల ఎన్నికను ప్రభావితం చేసేందుకు అస్పృశ్యులకు అవకాశం కలిగించింది. కానీ పూనా ఒడంబడిక వల్ల ఏర్పడ్డ ఉమ్మడి ఎన్నిక వర్గాల్లో అస్పృశ్యుల అభ్యర్థుల ఎన్నికను ప్రభావితం చేసేందుకు హిందూ కులస్థులకు అవకాశమేర్పడింది. నిజానికి రెండిటిమధ్య ఉన్నతేడా ఇదే.

అస్పృశ్యుల బాగు కోరేవాడు ఏది వాంఛిస్తాడు? కమ్యు ్యనల్ అవార్డు పేర్కొన్న ఉమ్మడి ఎన్నిక వర్గాల్ని వాంఛిస్తాడా? లేక పూనా ఒడంబడిక పేర్కొన్న ఉమ్మడి వర్గాల్ని సమర్థిస్తాడా ? అస్పృశ్యుల ఓట్లపై కుల హిందువులు ఆధారపడే పరిస్థితి కల్పించందే అస్పృశ్యులకు మోక్షం లేదనే విషయంలో సందేహం లేదు. కమ్యునల్ అవార్డు చేసిందదే. అస్పృశ్యుల్ని కుల హిందువుల ఓట్లపై ఆధారపడేట్లు చేయటమంటే ఇప్పటికే బానిసలుగా బ్రతుకుతున్న అస్పృశ్యుల్ని హిందూ కులస్థులకు కట్టుబానిసల్ని చేయటమే. పూనా ఒడంబడిక చేసిందదే. అస్పృశ్యుల్ని హిందువుల బానిసత్వాన్నుంచి రక్షించి వాళ్ళకు స్వేచ్ఛ కల్పించటమే కమ్యునల్ అవార్డు ముఖ్యోద్దేశం. కాగా అస్పృశ్యుల పై హిందువుల పెత్తనాన్ని బలీయం చేయటానికే పూనా ఒడంబడిక తయారైంది.

శ్రీ గాంధీ చేసిన 'ఆమరణ నిరాహారదీక్ష' ను విదేశాల్లోని ఆయన మిత్రులు, అనుయాయులు మహత్తరమైన విషయమని వైభవంగా వర్ణించారు. దాన్ని క్రీస్తు రెండవ సారి శిలువనెక్కటమేనన్నారు. ఆత్మ త్యాగం అన్నారు; తిరుగులేని పోరాటమన్నారు. ఆయన అమెరికా మిత్రుడొకరు శ్రీగాంధీ ప్రాణ త్యాగం అసమానమైందని అమెరికన్లందరికీ హామీ ఇవ్వగలనన్నాడు. తన ఆనందాతిరేకంలో మరొక అమెరికన్ యావత్ప్రపంచంపై ధ్వజమెత్తిన ఏకైకవ్యక్తిగా శ్రీగాంధీని వర్ణించాడు. అందరూనన్ను విలన్ గా చూశారని వేరే చెప్పనక్కరలేదు. కాని గాంధీగారి నిరాహార దీక్ష గురించి నా అభిప్రాయాలు నాకున్నాయి. నేను దాన్ని రాజకీయ స్టంటు అన్నాను. ఆయన మాటలన్నీ నిజాయితీలేని అబద్ధాలు.

శ్రీగాంధీని కమ్యూనల్ అవార్డుకు వ్యతిరేకంగా ఆమరణ నిరాహార దీక్షకు పురమాయించింది అస్పృశ్యుల్ని విముక్తి చేయాలనే తలంపుగానీ హిందువుల్ని చెదిరిపోకుండా చేయలనే ఉద్దేశ్యం కూడా కాదని నాకు తెలుసు. ఏది ఏమైనప్పటికీ విరాహార దీక్షకు ఆయన పూనుకుంది అస్పృశ్యుల్ని బానిసలుగా చేయటానికే. పూనా ఒడంబడికను ఆయన నిరాకరించటం అంతర్యుద్ధం తర్వాత నీగ్రోలకు దక్షిణాత్యులు ఓటు హక్కును నిరాకరించటం లాంటిదే. స్టేట్స్‌మెన్, నేషన్ పత్రికలు కూడా ఇదే సత్యమని ప్రకటించాయి. ఆ పత్రికలు ఏమన్నాయంటే– ( ఈ ఉటంకింపులు రాత ప్రతిలో పేర్కొనబడలేదు. ఎక్కడా దొరకలేదు కూడా – సంపాదకులు)

నా ఈ అభిప్రాయాన్ని బలపర్చే ఏకైక సంఘటనొకటుంది. అస్పృశ్యుల్లో కొందరు ప్రముఖులు సహితం శ్రీగాంధీకి అండగా నిల్చారు.రాజా గారిది ఒక విచిత్రమైన కేసు. ఆయన ఫిర్యాదేమిటంటే దళితులకు ప్రతినిధిగా కేంద్ర శాసన సభలో సభ్యుడైనప్పటికి రౌండ్ టేబుల్ సమావేశంలో పాల్గొనేందుకు ఆయన్ని ప్రతినిధిగా ఎన్నుకోలేదు. ఆయన ప్రత్యేక ఎన్నికగణాల ఏర్పాటు కోసం పోరాడుతూ ఉండేవారు. ఆకస్మాత్తుగా ఆయన ప్లేటు ఫిరాయించాడు. ఆయన చేసే పనేనేమా చేస్తుంటే (ప్రత్యేక ఎన్నిక గణాల పోరాటం) గాంధీ గారికి వత్తాసు పలుకుతూ నామీదా బ్రిటిష్ ప్రభుత్వం మీదా కోపాగ్ని కురిపించాడు. ఆయనకు శ్రీగాంధీ మీదా, హిందువుల మీద ఎంత ప్రేమ పుట్టుకొచ్చిందంటే ఆయన్ని గురించి తెలిసిన వాళ్ళకు ఆయన ఒక తొత్తుగా పని చేస్తున్నాడంటే నమ్మ బుద్ధికాలేదు. సెప్టెంబర్ 13, 1932న కేంద్ర శాసన సభలో ఒక వాయిదా తీర్మానం పై మాట్లాడుతూ గాంధీ నిరాహారదీక్షను గురించి రాజా గారిలా అన్నారు.

"దళితుల సమస్య భారత దేశ చరిత్రలో మున్నెన్నడూ కనీ వినీ ఎరుగని ప్రాధాన్యతను ఈనాడు సంతరించుకుంది. ఇందుకు మన దళిత వర్గ ప్రజలంతా శ్రీగాంధీకి ఎంతో కృతజ్ఞులమై వుండాలి. మన జీవితాలే ఆయన మౌలిక జీవన ధ్యేయమని అనుమానం లేని విధంగా ప్రపంచానికి చాటి చెప్పాడు. ప్రపంచం ఇప్పటికీ దళిత వర్గాల పరిస్థితిని గురించి ఇంకా తెలుసుకోలేదంటే ఇవాళ ప్రపంచం లో మానవ ధర్మం మాననీయ వర్గాలు నశించాయనుకోవాలి" ..................

"దళితులకు గాంధీగారు ప్రత్యేక ఎన్నిక గణాల ఏర్పాటును వ్యతిరేకించటం వల్లనే ఈ సమస్య శాసన సభ ముందుకొచ్చింది. ఈ సభలోని ఏ గౌరవనీయ సభ్యుడైనా అలాంటి మహనీయుడు తన ప్రాణాల్ని సైతం వొడ్డటానికి సిద్ధమైన పరిస్థితుల్ని నిరసించకుండా ఉండలేడన్న విషయంలో నాకే సందేహమూ లేదు. మహాశయా! ప్రభుత్వానికి కూడా చాలా ముందుగానే హెచ్చరిక చేయబడిన విషయాన్ని ఉత్తర ప్రత్యుత్తరాలు స్పష్టం చేస్తున్నాయి. మన సమావేశాల్లో నేను హిందూ మహాసభతో కలిసి అంగీకరించిన రాజామూంజే ఒప్పందంలో అంశాలను ప్రభుత్వం పూర్తిగా పరిగణనలోకి తీసుకుని వుంటే, గాంధీగారు చేసిన తీవ్ర హెచ్చరికనైనా పరిగణనలోకి తీసుకుని వుంటే ప్రత్యేక ఎన్నిక గణాల ఏర్పాటును తలపెట్టేవాళ్ళు కారు".

"నిజానికి నా పోట్లాటంతా ప్రధాని మహాత్మా గాంధీకి రాసిన లేఖను గురించే. ప్రభుత్వం ముందు ఇవ్వాళ మన భావాల్ని ప్రకటించుకునేందుకు వీలుగా కనీస సంఖ్యలో ప్రాతినిధ్యం కల్పించేదుకే ఇరవయ్యేళ్ళ వరకు ప్రత్యేక ఎన్నిక గణాల్ని ఏర్పాటు చేశామని చెబుతున్నాడాయన. కాని మాంట్ ఫర్డ్ సంస్కరణల ద్వారా ఎన్నో స్థానిక సంస్థల్లో, కేంద్ర ప్రాంతీయ శాసన సభల్లో ఈ ప్రత్యేక హక్కులు ఇంతకు ముందు నుంచే హాయిగా అనుభవిస్తున్నామని చెబుతున్నాన్నేను. ఇది మాకెప్పటినుంచో వుంది. ఇప్పుడు ప్రత్యేకంగా ఒనకూడిందేమీ లేదు. భవిష్యత్తులో మా బాగుకోసం మేం నిజంగా కోరేదేమంటే మాకు నిజంగా ప్రాతినిధ్యం వహించగల సభ్యులు, వాళ్ల చేష్టలకు మాకు బాధ్యత వహించగల సభ్యులు సాధారణ ఎన్నిక గణాలనుండి ఎన్నిక కాబడటమే. రిజర్వ్ సీట్లకు, సాధారణ ఎన్నిక గణాలకు పొసగదని ప్రధాని మంత్రి ఎందుకంటున్నాడో నాకు అర్థం కావటం లేదు. ఇంతకు ముందు నుంచే ఇలాంటివి మద్రాసు ప్రాంతం స్థానిక సంస్థలలోనూ ఇంకా ఇతర ప్రాంతాలలోనూ సమర్థవంతంగా పనిచేస్తూనే ఉన్నాయి. అయ్యా! నామనవేమిటంటే కమ్యునల్ అవార్డులో ఉటంకించిన పథకం మమ్మల్ని విడదీసి రాజకీయ అస్పృశ్యులుగా మారుస్తుంది. మా ఓటు అర్థించే కుల హిందువులకు మేం ఓటు వేసే హక్కుండటం వల్ల ఇది విభజననిపించుకోదని ప్రధాని వాదించటం నాకు ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నది. కాని అయ్యా! దళిత వర్గాలు ఉన్నత కులస్థుల ఓట్లు అర్థించకపోతే అందరికీ సమానమైన, ఆదర్శవంతమైన పౌరసత్వం ఎలా సాధ్యం?

"నా ప్రజలు హిందూ కులస్థుల చేతుల్లో ఎన్ని ఆగడాలు భరించారో హిందువులు గుర్తించారు. మా స్థాయి, స్థితి పెరగాలని వాళ్ళల్లో ఎంతో మంది సంస్కర్తలు చేయాల్సిందంతా చేస్తున్నారనే విషయాన్ని నేనంగీకరిస్తున్నాను. హిందూ కులస్థుల హృదయాల్లో, వారి దృష్టిలోను ఎంతో పరివర్తన వచ్చింది. దళిత వర్గాల ప్రజలైన మేం కూడా ఇతర హిందూ కులస్థుల మల్లేనే స్వచ్ఛమైన హిందువులమనే భావిస్తున్నాం. హిందూ సమాజంలో భాగంగానే ఉంటేనే మాకు ముక్తి లభిస్తుంది గాని విడిపోవటం వల్ల కాదని మేం విశ్వసించేంతగా హిందువుల చిత్త సంస్కారం పెరిగిందని మేం భావిస్తున్నాం. ప్రభుత్వం అనుసరిస్తున్న విధానాలు ఎంతో కొనియాడదగిన ఈ ఉద్యమానికి అడ్డుకట్ట లేస్తున్నాయి. కాబట్టి అయ్యా! ప్రధాని ఉత్తరం, భావాల రీత్యా వ్యక్తీకరణ రీత్యా కూడా నన్నెంతో నిస్పృహకు గురిచేసిందని నొక్కి చెబుతున్నాను.

"ఇవ్వాళ మేం ఎదుర్కొంటున్న సమస్య తీవ్రమైనటువంటిది. ఒక గొప్ప మహనీయుని జీవితం చావు బ్రతుకుల్లో ఊగిసలాడుతోంది. అలాగే కొన్ని కోట్లమంది అణగారిన ఈ దేశపు ప్రజానీకపు భవిష్యత్తు కూడా ఊగిసలాడుతోంది. ప్రభుత్వం ఈ మహనీయుని జీవితానికి, కోట్లాది ప్రజల్ని శాశ్వతంగా బానిసత్వంలోకి త్రోసివేస్తున్నందుకు బాధ్యత వహిస్తుందా ? విజ్ఞతతో కూడిన మంచి నిర్ణయాన్ని తీసుకోండి".

అస్పృశ్యుల్ని పకడ్బందీగా రాజకీయ బానిసత్వంలోకి త్రోసేందుకే హిందువుల కుతంత్రం ఫలితంగా జరిగిన పూనా ఒప్పందాన్నే కాదు విభాజక ఓటింగ్ కొరకు కూడా రాజాగారు పోరాడారు. గాంధీ అన్నా హిందువులన్నా చచ్చేంత విశ్వాసమున్న రాజాగారు హామండ్ కమిటీ తీర్మానాలతో సంతృప్తి పడలేదు. విభాజక ఓటింగ్‌ను తెచ్చేందుకు ఎన్నికల అనంతరం మద్రాసు శాసన సభలో ఆయన ఒక తీర్మానాన్ని కూడా ప్రవేశ పెట్టారు. (చూడుః మద్రాసు శాసన సభ తీర్మానాలు)

కాని ఇవాళ పూనా ఒప్పందం ఫలితాలు చూశాక ఆయన్లో నిరాశా నిస్పృహలు చెలరేగినట్లు కనిపిస్తుంది. తానుకనుగొన్న సత్యాన్ని ఎంత కాలం వరకు ఆయన విశ్వసిస్తాడనేది నేను అనుకున్నదానికన్నా ఎక్కువే. ఆయన బహిరంగంగానే పూనా ఒడంబడికను తిరస్కరించాడు. ఆగష్టు 25, 1938న ఆయన గాంధీగారికి రాసిన లేఖలో ఇలా పేర్కొన్నాడు.

"శాసన సభల్లో తమ భావాల్ని స్వేచ్ఛగా ప్రకటించుకోవటానికి వీలుంటుందన్న ఉద్దేశ్యంతో మా వాళ్ళంతా ప్రత్యేక ఎన్నిక గణాల్ని సమర్థిస్తున్న కాలంలో వాళ్ళందర్నీ సాంఘికంగా, రాజకీయంగా, మతపరంగా హిందువుల్లో భాగం చేసేందుకు మీ ప్రాణాల్ని ఎలా పణంగా పెట్టారో నాకు గుర్తుంది. విశ్వాస పూరితంగా మా కోర్కెల్ని బలపర్చి మా బాధలకు ప్రాతినిధ్యం కల్పించే అవకాశం హిందూ కులస్థులు ప్రతిపాదించిన ఉమ్మడి ఎన్నికవర్గాల వల్ల సాధ్యమౌతుందని మా వాళ్ళంతా వాటిని అంగీకరించటానికి కొద్దో గొప్పో నేనూ బాధ్యుణ్ణే. ఈ ఉద్దేశ్యంతోనే ప్యానెల్ ఎన్నిక జరిగింది.

"ఇదంతా మీకు తెలుసు. నాకూ తెలుసు. ఇది మీ దృష్టికి తీసుకురావటంలో నా ఉద్దేశ్యమేమిటంటే మా పక్షాన మేం ప్రత్యేక ఎన్నిక వర్గాల కోసం ఉద్యమించకుండా పూనా ఒడంబడికకు కట్టుబడివున్నాం. మద్రాసులో హిందూ కులస్థులైన కాంగ్రెస్ సభ్యులు ఒడంబడికను ఎంతగా నీరు గార్చారంటే మా సభ్యులు శాసన సభలో హిందూ కులస్థుల్ని గుడ్డిగా అనుసరించి మంత్రి మండలికి అంగీకారయోగ్యమైన అన్ని విషయాలపైనే కాదు మాకు అనుకూలమైన విషయాలపై కూడా వ్యతిరేకంగా ఓటు చేయటానికి సిద్ధపడ్డారు.

"ఎన్నికల ప్రారంభ దశలోనే కాంగ్రెస్ కమిటి నిర్ణయించిన దళిత వర్గ సభ్యుల ప్యానెల్ ఎన్నికపై నేను అభ్యంతరాలు లేవనెత్తిన విషయం మీకు గుర్తుండే వుంటుంది. సత్యమూర్తి గారు మనముందుంచిన కొన్ని షరతులకు లోబడి మా వర్గం ప్రజల్ని కాంగ్రెస్‌లో చేరేట్టు చేయమని మీరు నాకు చెప్పారు కూడా. అందులో ఒక షరతేమిటంటే కాంగ్రెస్‌లోని దళితవర్గ సభ్యులు వాళ్ల వర్గానికి చెందిన విషయాల మేరకు కాంగ్రెస్ పార్టీతో కలిసి ఓటు చేయవలసిన అవసరం లేదనీ, వాళ్ళ నిర్ణయానుసారం ప్రవర్తించ వచ్చుననీను.

"మద్రాసు శాసన సభలో దేవాలయ ప్రవేశ బిల్లుపై ఈ మధ్య జరిగిన చర్చల్లో బిల్లును సెలక్టు కమిటీకి పరిశీలనకు పెట్టాలని నేను చేసిన ప్రతిపాదనను కాంగ్రెస్ పార్టీ క్రమ శిక్షణకు లోబడి పార్టీలోని దళిత వర్గ సభ్యులు మూకుమ్మడిగా వ్యతిరేకించటం కాంగ్రెస్ స్వభావాన్నే బట్టబయలు చేసింది. రాజగోపాలాచారి గారి నాయకత్వంలోని హిందూ కులస్థులు మా వర్గాన్ని కట్టిపడేసుకున్నారు. ఇంతకన్నా అసహజమైన పనీ, బాధాకరమైన విషయమూ మరేదైనా వుంటుందా?

" బిల్లులోని అంశాలేమిటో మీకు తెలుసు. అది కేవలం ఎక్కువ మందికి దేవాలయ ప్రవేశం కల్పించేందుకు ఉద్దేశించిన ఒక శాసన శకలం. అందులో బలవంతంగానీ, పీడన గానీ మచ్చుకై నా లేదు. ఈ బిల్లుకు మీ ఆశీర్వాదాలు కూడా ఉన్నాయి. దీన్ని రాజగోపాల చారిగారే తయారు చేస్తే మీ ఆమోదాన్ని తెలిపారు.

"గత శాసన సభా సమావేశంలో రాజగోపాలాచారి గారి అనుమతితోనే, ఆయన మద్దతు ప్రకటిస్తే నేనే ఆ బిల్లును ప్రవేశ పెట్టాను. ప్రభుత్వం తరపున మీరే ప్రవేశ పెడితే బాగుంటుందని నేను సలహా ఇస్తే నన్నే ప్రవేశ పెట్టమని అన్నారాయన. జూలై 12, 1938న నేను చివరిసారిగా ఆయన్ని కలిసినప్పుడు బిల్లును సెలక్ట్ కమిటీకి పంపమని ప్రతిపాదిస్తానని నేను చెబితే ఆయన అభ్యంతరం చెప్పలేదు.

" ఈమధ్యలో ఏమైందో నాకు తెలియదుగానీ బిల్లును సెలక్ట్ కమిటీకి పంపే ప్రతిపాదనను నేను శాసన సభల్లో తేవటానికి రెండు రోజులు ముందు రాజగోపాలాచారిగారు బిల్లు వెనక్కు తీసుకోమని చల్లగా నాకు కబురు పంపారు. కాని నేనలా చేయటానికి నిరాకరించాను. అటు తర్వాత శాసన సభలో బిల్లు ప్రతిపాదన వచ్చినప్పుడు రాజగోపాలాచారి గారు సభలో లేచి నిలబడి బిల్లును వ్యతిరేకిస్తూ నన్ను బిల్లును ఉపసంహరించుకోమని, తాను దేవాలయ ప్రవేశ బిల్లును అదే ప్రాతిపదికపై మిగతా జిల్లాలకు కాకుండా ఒక్క మలబారు కోసం మాత్రం ప్రవేశపెడతానని చెప్పారు.

"ఆయన ఉపన్యాసం ఉద్దేశ్యం నావర్గం ప్రజల కోసం వాళ్ళ సాంఘిక, మతైక ఔన్నత్యం కోసం నేను చేస్తున్నపనిని నా వర్గానికి చెందిన ప్రతినిధుల చేతనే వ్యతిరేకింపజేయటం. ఆయన ఉపన్యాసం మరో ఉద్దేశ్యం దేవాలయపు ప్రవేశ వ్యతిరేకతను దేశం మొత్తంలోనూ రేకెత్తించటం.

"కాంగ్రెస్ నిజంగా సామాజిక, మతస్వేచ్ఛను రక్షిస్తుందనే విశ్వాసంతో మేమంతా పూనా ఒడంబడికకు, ఉమ్మడి ఎన్నిక గణాలకు అంగీకరించిన దాంట్లో మా విజ్ఞత ఎంతో తల్చుకుంటే నాకు చికాకేస్తుంది. కాంగ్రెస్ నాయకత్వంలో హిందూ కులస్థులు సహాయం చేయటం అలా ఉంచి వాళ్ళ నాయకత్వంలో ఉన్న కాంగ్రెస్ మా స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను నాశనం చేసి మా గొంతులు మేమే కోసుకునే పరిస్థితి తెచ్చిందని నేను విశ్వసించ వలసి వస్తున్నది.

"చర్చ జరుగుతున్నప్పుడు ఉన్నట్టుండి అకస్మాత్తుగా అలా మట్లాడటానికి మీరు అనుమతి పొందారా అని నేను రాజగోపాలాచారి గారిని అడిగాను. నా తర్వాతనే రాజగోపాలాచారి మాట్లాడుతారని అధ్యక్షులు చెప్పారు. నా తర్వాత మాట్లాడే అవకాశాన్నాయనకిచ్చినా నేనడిగిన ప్రశ్నకు సమాధానం చెప్పకుండా దాటవేయటమే కాదు అసలు సమాధానమే చెప్పలేదు రాజగోపాలాచారి.

"మద్రాస్ కాంగ్రెస్ మంత్రి మండలి హరిజన సంక్షేమం గురించి, ముఖ్యంగా దేవాలయ ప్రవేశ సమస్యపై ప్రదర్శించిన ఈ వాలకాన్ని మీరు సీరియస్‌గా పరిగణించగలరనే నా విశ్వాసం. ఈ విషయాన్ని గురించి ఎంతో ఆలోచించి పూనా ఒప్పందాన్ని ఎదుర్కోవాలనీ, ప్రత్యేకనియోజక గణాల ఏర్పాటుకూ ప్రత్యక్ష ఆందోళనకు దిగటానికి సిద్ధంగా ఉన్న మా వాళ్లకు నేనేదో సమాధానం చెప్పటానికి ముందే మీ అభిప్రాయాల్ని నాకు తెలియనివ్వండి"

డిసెంబర్ 12, 1938న రాజాగారు వార్ధాలో ఉన్న మహాత్మా గాంధీకి ఈ తంతి కూడా పంపారు :

"మంత్రి వర్గంపై ఆందోళన - నా బిల్లు తిరస్కృతి పై నామీద తట్టుకోలేని వత్తిడి ఎంతో ఆత్రుతతో మీ సమాధానం కోసం ఎదురు చూస్తున్నాను.

సెప్టెంబర్ 14, 1938న గాంధీగారు రాజాగారికి ఇలా సమాధానం పంపారు :

"ప్రియ మిత్రమా,

"పని భారం వల్ల మీ ఉత్తరానికి వెంటనే జవాబు పంపనందుకు క్షమించాలి. ఇప్పుడు మీ టెలిగ్రాం వచ్చింది. సి.రాజగోపాలాచారి గారు మంచే చేస్తాడని మీరు నమ్ముతారని నేనాశిస్తున్నాను. ఆయన తరహాలో ఆయన్ని ఆ పని చేయనివ్వాలి. మీకు నమ్మకం కుదరకపోతే సహజంగానే మీరు మీకు ఏది మంచిదని తోస్తే అది చేస్తారు. నాకు తెలిసిందల్లా హరిజనులకు ఆయన కన్నా మంచి మిత్రుడు లేడు. ఆయన దగ్గరకు వెళ్ళండి; వాదించండి. ఆయన్ని మీరు ఒప్పించలేకపోతే ఆయన్ని భరించండి. నా సలహా అది."

రాజాగారు సెప్టెంబరు 21, 1938న గాంధీగారికి రాసిన ఉత్తరం ఇలా ఉంది:

"మీ ఎరవాడ నిరాహారదీక్ష సమయంలో నేను మా వాళ్ళకు చేసిన ప్రమాణాలు, దాన్ని మద్రాసులో మీవాడు నిర్వహించిన తీరూ దృష్టిలో ఉంచుకుని మీరు మళ్ళీ దీన్ని గురించి సీరియస్‌గా ఆలోచించమని మనవి చేస్తున్నాను. కమ్యూనల్ అవార్డు, మా వాళ్లకోరకు ఉద్దేశించిన ప్రత్యేక ఎన్నిక గణాల స్థానే ఉమ్మడి ఎన్నిక గణాలల్లో వాళ్ళని హిందూకులస్థులతో కలిపేందుకు, అంటరానితనం రూపుమాపటానికి అన్ని ప్రయత్నాలు చేయటం జరుగుతుందని నమ్మించేందుకు మీరు ఆ నిరాహారదీక్షకు పూనుకున్నారు. అస్పృశ్యతను రూపుమాపటానికి. దేవాలయ ప్రవేశం చాలా ముఖ్యమైనదనిమీరే ఒకటికి పదిసార్లు చెప్పారు.

"అందువల్ల మేం హిందూ కులస్థులతో కలిసి ఉమ్మడి ఎన్నిక గణాల్లో చేరటమనేది కాంగ్రెస్ మంత్రిత్వం దళితుల సామాజిక, మతోన్నతికి పాటుపడాలనే అంశంతో ముఖ్యంగా ముడిపడి ఉంది.

"మేం ఒక వేళ స్వేచ్ఛగా దేవాలయాల్లో ప్రవేశించకపోతే మేం హిందువులం కాము. మేం హిందువులం కాకపోతే వాళ్లతో కలిసి మేం ఉమ్మడి వర్గాల్లో ఎందుకుండాలి – ముస్లింలకు, ఇంకా ఇతర సమూహాలకు వ్యతిరేకంగా వాళ్ళ సంఖ్యకు పెంచటానికేనా?

"ఒక వేళ మీరు మద్రాసు పరిస్థితిని ఈ కోణం నుంచి పరిశీలించినట్లైతే. మద్రాసులో కాంగ్రెస్ ప్రభుత్వం దేవాలయ ప్రవేశపు బిల్లును తిరస్కరించటం దళిత వర్గాల్ని పచ్చి దగా చేసినట్లే అవుతుంది.

"ప్రభుత్వ ధనాన్ని గానీ ప్రభుత్వేతర ధనాన్ని గానీ దళిత వర్గాల ఆర్థికోన్నతికి ఎంత ఖర్చు చేసినా దేవాలయాల ప్రవేశం ద్వారా అస్పృశ్యతను రూపుమాపటానికి సాటిరాదు. హిందూ కులస్థులు దళిత వర్గాలకు దేవాలయ ప్రవేశం కల్పించటమో, కల్పించకపోవటమో అనేది వాళ్ళ చిత్త శుద్ధికి అగ్ని పరీక్ష అని మీరే ఒకసారన్నారు.

"రాజగోపాలాచారి గారు దేవాలయ ప్రవేశపు బిల్లు అమలు పర్చటానికి కష్ట సాధ్యమైన ఒక జిల్లాని తెలివిగా ఎన్నుకుని మా ప్రజానీకాన్ని హిందూకులస్థుల ముందు కట్టి పడేశారు. ఇందులో వున్న మరో అంశం ఏమిటంటే లేబర్ కమీషనరుకు సహాయ

పడేందుకు ఏర్పాటు చేసిన సలహా సంఘంలో ఈ ప్రాంతపు హరిజన సేవక్ సంఘంలోని హిందూ కులస్థులకు ప్రభుత్వ సహాయంతో సహా సభ్యత్వం కల్పించి మా ప్రజానీకపు బాగోగులు చూడమనటం. మద్రాస్ దేవాలయ ప్రవేశ బిల్లు తిరస్కరణకు గురయ్యాక రాజగోపాలాచారి చేసిన ప్రయత్నాల గురించి ఈ నా భావాలతో మీరు ఏకీభవిస్తారనుకోను. కాని మరపురాని మీనిరాహారదీక్ష సమయంలో దళిత వర్గాల అభ్యున్నతికి మనం చేసిన ప్రమాణాల దృష్ట్యా మద్రాసు ప్రాంతపు దళిత వర్గాల పరిస్థితిని మీరు సీరియస్‌గా పరిగణించగలరనే భావిస్తున్నాను.

"ఇది రాజకీయ ఎత్తుగడలకు సంబంధించిన విషయం కాక, చిత్త శుద్ధికి సంబంధించిన విషయంగా మాత్రమే పరిగణించాల్సిన నైతిక బాధ్యత మీముందుంది. అస్పృశ్యత, దేవాలయ ప్రవేశం. ఈ రెండిటి గురించి కాస్త ఆత్మ శోధన చేసుకుంటే మీరు ఎంతో స్పష్టంగా మాట్లాడగలరనీ, మీ వాళ్ళకు నచ్చ జెప్పటానికి ఏ త్యాగమైనా చేయగలరని నేను ఖచ్చితంగా చెప్పగలను.

"ఈ ఉత్తర ప్రత్యుత్తరాలను నేను పత్రికలకు పంపుదామనుకున్నాను. కాని ఈ నెల చివర వరకు మీనుంచేదైనా సమాధానం వస్తుందేమోనని ఆగుతున్నాను."

పై లేఖకు గాంధీగారు 5 అక్టోబర్, 1938న ఇలా జవాబు పంపారు.

" ప్రియ మిత్రమా!

" నేనెంతో క్లిష్ట తరమైన పరిస్థితిల్లో పని చేస్తున్నాను. ఇది కూడా పెషావర్‌కు రైల్లో వెళుతూ రాస్తున్నాను. ముందు ముందు ఎప్పుడు అవసరమనుకుంటే అప్పుడు ఈ ఉత్తర ప్రత్యుత్తరాలను మీరు ఎలాగూ ప్రచురిస్తారనుకోండి.

"మీ చివరి ఉత్తరం మీరు తప్పుదారిలో ఉన్నారని చెబుతోంది. నేను రాజాజీ పక్షపాతిని కాను. కాకపోతే అస్పృశ్యతను గురించి మీకెంత దృఢ అభిప్రాయాలున్నాయో ఆయనకూ అలాగే ఉన్నాయి. కాబట్టి ఎలా చేయాలన్న దానికి సంబంధించి ఆయన తీసుకునే నిర్ణయంలో నాకు విశ్వాసముంది. ఇంత దూరంలో ఉండి ఆయన చేస్తున్న పనుల్లో న్యాయాన్యాయాలు నిర్ణయించలేను. ఈ ఉద్యమం సనాతనుల హృదయాల్ని మార్చేందుకేనన్న విషయాన్ని మీరు గుర్తించలేదా ? వాటంతట అవి కాలిపోతాయి తప్ప ఈ సంస్కంరణలన్నీ శక్తిలోని వేగాన్ని తగ్గించలేవు. ఇది తీవ్రంగానే జరుగుతున్నది.

" ఈ దేవాలయపు ప్రవేశమనేది చాలా శక్తివంతమైన సంస్కరణ. మతపరమైన హృదయంతో మీరు దాన్ని అర్థం చేసుకుంటారని ఆశిస్తున్నాను. అలా చేయగలిగితే మీరు రాజాజీకి తాను తలపెట్టిన కార్యం విజయవంతం కావటానికి హృదయపూర్వకంగా మద్దతు నిస్తారు".

యు.పి.లోని అస్పృశ్యులు కూడా పూనా ఒడంబడికను వ్యతిరేకిస్తున్నారు. అండర్ సెక్రటరీ కల్నల్ మూర్ హెడ్‌కు సమర్పించిన మెమోరాండంలో వాళ్ళిలా అన్నారు. (రాత ప్రతిలో మెమోరాండం పైపు చేయలేదు. – సంపాదకుడు)

పూనా ఒడంబడిక ఒక బోనులాంటిది. బ్రిటిష్ ప్రభుత్వపు కమ్యునల్ అవార్డును గాంధీగారి పూనా ఒడంబడిక ద్వారా మార్చటం వాస్తవానికి అస్పృశ్యులు స్వేచ్ఛా ప్రపంచంనుంచి బానిసత్వం లోకి పోయేందుకే పని చేసింది.

పూనా ఒడంబడికపై సెప్టెంబర్ 24, 1932న సంతకాలు జరిగాయి. 25 సెప్టెంబర్ 1932 దీనికి మద్దతు నిచ్చేందుకు బొంబాయిలో హిందువుల సమావేశం ఒకటి జరిగింది. ఆ సమావేశంలో ఈ క్రింద పేర్కొన్న తీర్మానాలు చేశారు.

" హిందూ కులస్థులకు దళిత వర్గాలకు మధ్య సెప్టెంబర్ 24, 1932న జరిగిన పూనా ఒడంబడికను ఈ సమావేశం బలపరుస్తున్నది. హిందూ సమాజంలో ప్రత్యేక ఎన్నిక గణాలను సృష్టించకుండా ఈ ఒప్పందాన్ని బ్రిటిష్ ప్రభుత్వం సంపూర్ణంగా అంగీకరిస్తుందని విశ్వసిస్తున్నాం. కాబట్టి గాంధీ గారిని ఆయన షరతులకులోబడి సమయం మించక ముందే నిరాహార దీక్ష నుంచి విరమింప జేసేందుకు బ్రిటిష్ ప్రభుత్వం సత్వర చర్యలు గైకొనాలని ఈ సమావేశం కోరుతున్నది. ఇరు వర్గాల నాయకులు ఒడంబడికలోనూ, ఈ తీర్మానాలలోనూ గల లోతు పాతుల్ని గ్రహించి వాటిని అమలయ్యేలా చూడాలని కోరుతున్నది. ఇప్పటి వరకూ హిందువుల్లో కేవలం పుట్టుక వల్ల అస్పృశ్యులుగా ఉన్నవారూ, అలా చూడబడే వాళ్ళూ మిగతా హిందువుల వలెనే నీళ్ళ బావులు, పాఠశాలలు, రోడ్లు ఇంకా ఇతర సామాజిక వనరులను ఇకనుంచి అనుభవించవచ్చని కూడా ఈ సమావేశం తీర్మానిస్తున్నది. స్వరాజ్యం లభించి పార్లమెంటు ఏర్పడటంలోనే మొట్టమొదటి చట్టం (ఇంతకు ముందే చేసి ఉండనట్లైతే) ఈ హక్కులిన్ని పరిరక్షించేందుకై చేయబడుతుంది.

"న్యాయబద్ధమైన శాంతియుతమార్గాల ద్వారా అస్పృశ్య వర్గాల సాధక బాధకాలను తొలగించేందుకు, ముఖ్యంగా దేవాలయ ప్రవేశాలకు సంబంధించి కృషి చేయవలసిన బాధ్యత హిందూ నాయకులపై ఉన్నదని కూడా ఈ సమావేశం ఆమోదిస్తున్నది".

అస్పృశ్యుల సమస్య పరిష్కారానికి కృషి చేసేందుకు ప్రత్యేకమైన ఒక సంస్థ అవసరమని గాంధీ గారు భావించారు. దాని ప్రకారమే సెప్టెంబరు 2,1932న అఖిల భారత అస్పృశ్య వ్యతిరేక సమితి (All india Anti- Untouchability League) ఏర్పడింది. గాంధీ గారికి ఈ పేరునచ్చలేదు. అందుకే డిసెంబరు 1932లో దానికి 'అస్పృశ్య సేవక సమాజం' (The Servants of Untouchables Society) అని కొత్త పేరు పెట్టాడు. అయినా ఈ పేరు కూడా గాంధీ గారు ఊహించినంత మంచిగా లేదు. మార్చి ఆయనే దానికి "హరిజన సేవక్ సంఘ్" అని నామకరణ చేశారు.

అలా గాంధీ గారు ప్రవేశ పెట్టిన మొదటి మార్పు ఏదైనా ఉంటే అది ఈ పేర్లలో తెచ్చిన మార్పే. ఇప్పుడు అస్పృశ్యులని కాక వాళ్ళని 'హరిజనులు' అని పిలవాలి. అస్పృశ్యుల్ని హరిజనులని పిలిచి ఆయన ఉద్ధరించినదివైష్ణవ మతాన్నే గాని తమని కాదని అస్పృశ్యులు అంటారు. కాని అస్పృశ్యులు తమని 'హర్‌జనులు' అంటే శివుని ప్రజలని పిలవాలంటే, 'హరి' అంటే విష్ణువు కాదని, హరిజనులంటే భగవంతుని పిల్లలని అర్థమని దీనికి గాంధీగారి సమాధానం.

అస్పృశ్యులు ఈ హరిజనులనే మాటను అసహ్యించుకుంటారు. ఈ పేరు మీద ఎన్నో అభ్యంతరాలు లేవనెత్తారు. ఆపేరు వాళ్ళ దుస్థితినేమీ మార్చలేదు. హిందువుల దృష్టిలో వాళ్ల స్థితి ఏమీ మారలేదు. ఈ కొత్త పేరు పాతవాసనల్తో పురాతనమైందే. హరిజనులంటే పాత అస్పృశ్యులే తప్ప మరొక వాళ్ళు కాదని అందరికీ తెలుసు. ఈ కొత్త పేరు అస్పృశ్యుల్ని అస్పృశ్యత నుంచి తప్పించుకోవటానికి ఏ మాత్రమూ అవకాశం ఇవ్వదు. పాతపేరుతో ఎంత బాగు పడ్డారో కొత్త పేరుతోనూ అంతే. తాము అస్పృశ్యులనే పిలవబడాలని అస్పృశ్యులు కోరుచున్నారు. మాకు జరుగుతున్న అన్యాయాల్ని తెలియజేసే పాతపేరే మంచిదని వారంటున్నారు. అన్యాయం చేసిన వాళ్ళకి ఇంక ఈ అన్యాయం తొలిగిపోలేదని, తొలగించవలసిన అవసరం మిగిలే వుందని అప్పుడే గుర్తుంటుంది. సత్యాన్ని దాచేసే కొత్త పేరు అస్పృశ్యుల్ని మోసగించేందుకు, హిందువులు అస్పృశ్యులకు

తామేదో ఒరగబెట్టామని సంతోషించేందుకు మాత్రమే పని కొస్తుంది. హరిజన్ అనే మాట క్షమను సూచిస్తుందనే భావన కూడా వాళ్ళలో ఉంది. ఒక వేళ ఈ పేరు యూదులు తమను తాము 'దైవం చేత ఎన్నుకోబడ్డ ప్రజలు' అనుకునే అర్థంలో వుంటే అది వేరే సంగతి. కాని దైవ పుత్రులు అనటంలో నిరంకుశులు క్షమ గుణంతోనిస్సహాయులైన ప్రజలకు వాళ్ళ అస్వతంత్రతను గుర్తు చేస్తున్నట్లు గా ఉంది. అస్పృశ్యుల్లో మగతనం ఉన్నమగవాడెవ్వా నీచమైన ఈ కొత్త పేరును అంగీకరించడు. బొంబాయి శాసన సభలో కాంగ్రెస్ ప్రభుత్వం హరిజన్ అనే మాటకు శాసన ప్రతి పత్తి కల్పించటానికి ప్రయత్నించినప్పుడు అస్పృశ్యులంతా మూకుమ్మడిగా సభను బహిష్కరించిన సంఘటన వల్ల అస్పృశ్యుల్లో ఈ కొత్త పేరంటే ఎంత ఏవగింపు ఉందో తెలుసుకోవచ్చు.

గాంధీతో సహా ఆయన సృష్టించిన కాంగ్రెస్ ప్రభుత్వాలు పతనమయేంత వరకు ఈ కొత్త పేరు ఉంటుంది. ఈ పేరు అస్పృశ్యుల మీద రుద్ద బడిందనీ, ఇది అస్పృశ్యుల కేమీ ఒరగబెట్టేది ఏమీ లేదనేది నిర్వివాదాంశమైన సత్యం.

ఈ కొత్త పేరు తెచ్చిన శుభాశీసుల్ని గురించి చర్చించిన తర్వాత ఇప్పుడు నేను హరిజన సేవక్ సంఘ్ చేసిన పనులేమిటో పరిశీలించాలి. అస్పృశ్యుల కోసం గాంధీ గారు పడ్డ శ్రమకు జ్ఞాపకార్థంగా సంఘ్ మిగిలిందని అందరూ అనుకుంటున్నారు. సంఘ్ చేసిందేమిటి?

సంఘ్ ఒక అఖిల భారత సంస్థ. దానికొక సెంట్రల్ బోర్డు ఉంది. దాని క్రింద ప్రాంతీయ బోర్డులు, వాని క్రింద జిల్లా బోర్డులు, స్థానిక కమిటీలు ఉన్నాయి. వీటి సంఖ్య ఈ క్రింద సూచిస్తున్నాను.

| | 1932-33 | 1933-34 | 1934-35 |
|---|---|---|---|
| ప్రాంతీయ బోర్డులు | 26 | 26 | 29 |
| జిల్లా మరియు స్థానిక కమిటీలు | 213 | 313 | 372 |

నవంబరు 1933 జూలై 1934 మధ్య గాంధీ గారు ఈ సంఘ్ కోసం చందా వసూళ్ళకై చేసిన పర్యటన ద్వారా సంపాదించిన ధనం సంఘ్‌కు ముఖ్యమైన ఆర్థ

వనరు. ఈ పర్యటన ద్వారా వసూలైన మొత్తం 18 లక్షల రూపాయలు. దీన్ని 'గాంధీ పర్స్ ఫండ్' అన్నారు. సంఘ్ ఈ మొత్తం నుంచే ఖర్చు చేస్తుంది. ప్రతి సంవత్సరం వచ్చే చందాలు సంఘ్‌కు ఉన్న మరొక వనరు. అన్ని రకాల ఖాతాల క్రింద సంఘ్ చేసిన వార్షిక ఖర్చు ఈ క్రింద పేర్కొన్న విధంగా ఉంది.

| 1932-33 | 1933-34 | 1934-35 | 1935-36 |
|---|---|---|---|
| రూ.2,31,039 | 3,31791 | 4,48,422 | 3,99,354 |

జనరల్ సెక్రటరీ 1934-35 సం||ర రిపోర్టులో "1934 జూలై నాటికి ఖాతాలో ఉన్న 8 లక్షల రూపాయల పై చిలుకు మొత్తం గాంధీ పర్స్ ఫండ్ ప్రస్తుత సంవత్సరం చివరి వరకు, అంటే జూలై 1934 వరకు ఖర్చు చేయబడుతుందని పేర్కొన్నాడు.". ఐదవ సాంవత్సరిక నివేదికలో సెక్రటరీ ఇలా పేర్కొన్నాడుః " గత సంవత్సరం ఖర్చుతో పోలిస్తే ఒక లక్షకు పై చిలుకు ఖర్చు తక్కువయిందని పేర్కొంటూ, 'గాంధీ పర్స్ ఫండ్ అయిపోవటం, సాధారణ ఎన్నికల మూలంగా స్థానిక వసూళ్ళు సరిగా జరగకపోవటం దీనికి కారణాలు. కేంద్ర కార్యాలయం ఖర్చులు ఏమాత్రం సంతృప్తి కరంగా లేవు. బ్రాంచీలకు ఇచ్చిన గ్రాంట్లతో సహా కేంద్ర కార్యాలయం ఖర్చు రూ.86,610-4-8. ఆదాయం మొత్తం రూ. 42,485-4-9. ఆ విధంగా రూ. 44,125-9-11లోటు ఏర్పడింది. దీన్ని జనరల్ ఫండ్ నుంచి పూడ్చారు. చందాల ద్వారా జనరల్ ఫండ్‌కు లభించిన మొత్తం రూ. 26,173-4-0"

ఆవిధంగా హరిజన సేవక్ సంఘ్ కేవలం ఒక చిన్న ప్రయత్నం మాత్రమేననేది. విశదమే. పత్రికల్లో విడవకుండా వచ్చే ప్రకటనే లేక పోతే దీన్ని గురించి ఎవరికీ తెలిసేది కూడా కాదు. భారత దేశం దాదాపు 6,96,831 (1931 జనాభా లెక్కలు ఈ సంఖ్య రాత ప్రతి లో లేదు. మాచే చేర్చబడింది - సంపాదుకుడు)గ్రామాలు కలిగిన భూఖండం. ఈ గ్రామాలన్నిటిలో అస్పృశ్యులున్నారు. ఎందరో కొందరు అస్పృశ్యులు లేని గ్రామమేలేదు. కేవలం 372 కమిటీలు వీళ్లలో ఎందరి దగ్గరకు పోగలుగుతాయి? ఇది మహా సముద్రంలో కాకిరెట్ట. సమస్యను తీర్చటానికి దానికి శక్తి లేకపోవటమే కాదు, అస్పృశ్యులకు ఏదన్నా చేద్దామంటే దాని వనరులు ఏమూలకు చాలవు. ఇప్పుడది సంవత్సర చందాల మీద

ఆధార పడాలి. అది కూడ ఒట్టి పోయి సంఘ్ విపరీతమైన లోటుకు గురయ్యింది. సంఘ్ ఊపిరి పీల్చుకోవడమే కష్టమై పోయింది. దివాలా తీసిన దృష్ట్యా దాని కార్యకలాపాలన్నీ ఆగిపోయి మూతపడే పరిస్థితి ఏర్పడింది. సంఘ్ ఇంకా బ్రతికుండటానికి కారణం అస్పృశ్యుల ఉద్ధరణకు హిందువులిచ్చే దాన ధర్మాలు కాదు. అది ఇంకా బ్రతికుండటానికి కారణం వివిధ ప్రాంతాల్లో ఏర్పడ్డ కాంగ్రెస్ ప్రభుత్వాలు దాన్ని బ్రతికిస్తూ ఉండటమే. ప్రభుత్వ గ్రాంట్లలో ఇంతకు ముందు వివిధ ప్రభుత్వాలు తమ వివిధ శాఖలు నిర్వహించిన సాంఘిక సంక్షేమ కార్యక్రమాలను ఇప్పుడు సంఘ్‌కు అప్పగించారు. అలా ఇప్పుడు సంఘ్ ప్రభుత్వ నిధుల మీద బ్రతుకుతున్నది. హిందువుల దాన ధర్మాల వల్ల హిందువులచేతనే అస్పృశ్యుల సంక్షేమం కోసం ఏర్పడ్డ సంఘ్ ఇప్పుడులేదు.

నిరాహార దీక్షతో గాంధీ సృష్టించింది చెవులు పగిలిపోయే రొద. ఆయన ప్రాణాల్ని కాపాడేందుకు సిద్ధపడ్డ త్యాగాలు ఎంతో గొప్పది; అస్పృశ్యులతో స్నేహం కలపటం కోసం చూపిన ఆతృత ఆశ్చర్యకరమూ ఎంతో సంతోషదాయకమూ కూడా ఇదంతా కరిగిపోయి అస్పృశ్యులు గాలికి కొట్టుకు పోయారు. అస్పృశ్యుల యెడల తమ బాధ్యతను సహృదయంతో గుర్తించి హిందువులు ఏర్పాటు చేసిన సంఘ్ వారి సంక్షేమాన్నే నిజంగా కాంక్షించిందా లేదా అనే ప్రశ్నకు సమాధానంగా దాని ఆవిర్భావం లోనే ఆ గుణం లేదని చెప్పాల్సొస్తోంది. హిందువుల్లో అస్పృశ్యుల యెడల కొత్తగా జనించిన ఈ ప్రేమానురాగాలు గాంధీగారు నిరాహార దీక్ష విరమించటంతోనే అంతమయ్యాయి.

బాలారిష్టాల వల్లనే పతనమైన సంఘ్ కార్య కలాపాల గురించి చర్చించటం అనవసరమనే భావిస్తున్నాను. కాని సంఘ్ గాంధీగారు సృష్టించిన ఒక గొప్ప వ్యవస్థగా భావించబడుతోంది. కాబట్టి సంఘ్ కార్యపాల్ని, ఆకార్యకలాపాల వెనకున్న విధానాలను పరిశీలించాల్సి వుంది.

సంఘ్ కార్యకలాపాలు నిర్ధారించబడ్డ మంచి ప్రాతిపదికల పైనే నడిచాయి.

విద్యారంగంలో అస్పృశ్యులకు ఉన్నత విద్యావకాశాలు కల్పించటానికి సాంకేతిక, కళా, వృత్తి విద్యారంగాల్లో ఉపకారవేతనాలు ఇచ్చే ఏర్పాటు చేయాలని సంఘ్ తలచింది. ఉన్నత పాఠశాల విద్యార్థులకు ఉపకార వేతనాలు ఇవ్వదల్చుకుంది. కళాశాలల్లో, పాఠశాలల్లో

విద్య నభ్యసించే అస్పృశ్యవిద్యార్థులకు హాస్టళ్ళు నడిపింది. ముఖ్యంగా ప్రైమరీ పాఠశాలలులేని చోట ప్రత్యేక పాఠశాలలు తెరవటం సంఘ్ విద్యా కార్యకలాపాల్లో ముఖ్యమైన భాగం.,

దీనితర్వాత సంఘ్ చేపట్టింది సంక్షేమ కార్యక్రమాలు. అ స్పృశ్యులకోసం వైద్యసౌకర్యాలు ఏర్పాటు చేయటం కూడా ఇందులోభాగమే.అస్పృశ్యులకోసం సంఘ్ ప్రత్యేక చికిత్సాలయాలు కూడా నడుపుతున్నది. ఇది కూడా సంఘ్ ఉదతాభక్తే.

సంఘ్ చేపట్టిన సంక్షేమకార్యకలాపాల్లో చెప్పుకోదగ్గది మంచినీటి సరఫరా. అస్పృశ్యుల కోసం కొత్తగా బావులు త్రవ్వటం, బోర్ పంపులు వేయటం, పాత బావుల్ని బాగు చేయటం, అస్పృశ్యుల కోసం బావులు త్రవ్వించమని స్థానిక సంస్థల్ని కోరటం ముఖ్యమైన కార్యక్రమాలు.

ఇక పోతే సంఘ్ చేపట్టిన ఆర్థిక కార్యకలాపాలు.

సంఘ్ కొన్ని పారిశ్రామిక పాఠశాలల్ని కూడా నిర్వహించినట్లుంది.ఈ పాఠశాలల్లో సాంకేతిక విద్యనభ్యసించిన వాళ్ళు ఆర్థికంగా స్వతంత్రజీవనం గడుపుతున్నారని చెబుతున్నారు. కాని రిపోర్టుప్రకారం సంఘ్విజయవంతంగా నిర్వహించిన పని అస్పృశ్యుల కోసం సహకార సంఘాలు స్థాపించి నిర్వహించటం. సంఘ్ స్థూలంగా నిర్వహించిన కార్యకలాపాలు ఇవీ. ఇదంతా హిందూకులస్తులే చేశారు. సంఘ్ కార్యకలాపాల నిర్వహణలో ఏదో కొద్ది మంది అస్పృశ్యులు మాత్రమే నామమాత్రంగా పాల్గొన్నారు. నాకుమాత్రం సంఘ్తో ఏ సంబంధములేదు. ఒకమాటచెప్పాలి. అదేమిటంటే సంఘ్ఏర్పాటు చేసినపుడు నన్నందులో చేరమని ఆహ్వానించారు. హిందువులతో సహకరించి అస్పృశ్యతను రూపుమాపాలని నాకెంతో ఉత్సాహంగా ఉండేది. ఈ కార్యాన్ని నిర్వహించటానికి సంఘ్ ఏమేమి చేయాలో నాకు స్పష్టమైన ప్రణాళికా, విధానాలూ ఉన్నాయి. సంఘ్ను ప్రారంభించిన వెంటనే రౌండ్ టేబుల్ కాన్ఫరెన్స్కు హాజరు కావటానికి లండన్ వెళ్ళ వలసి రావటం వల్ల ఈ విషయాల గురించి మిగతా సభ్యులతో చర్చించే అవకాశం లేకపోయింది. అయితే నేను లండన్కు విక్టోరియా నౌకలో ప్రయాణిస్తూనే నవంబర్ 14, 1932న సంఘ్ కార్యదర్శి థక్కర్ గారికి ఒక లేఖ వ్రాశాను. దాంట్లో నేను రాసిన చిన్న ఉపోద్ఘాతం తప్ప లేఖ పూర్తి పాఠాన్ని ఈ క్రింద పొందు పరుస్తున్నాను.

"దళిత వర్గాల అభ్యున్నతికి పాటు పడటం కోసం నా ఉద్దేశ్యంలో విభిన్నమైన రెండు పద్ధతులు మాత్రమే ఉన్నాయి. దళితుడి తలరాత వాడి ప్రవర్తన మీద ఆధారపడి ఉంటుందని ఒక భావన. ఒకడు దుర్భర పరిస్థితులు అనుభవిస్తున్నాడు అంటే అతను దుష్టుడో, పాపాత్ముడో అయి వుండాలి. దీన్ని నమ్మిన క్రియాశీల కార్యకర్తలు వారి శాయ శక్తులన్నీ గ్రంథాలయాలూ, పాఠశాలలు, తాలింఖానాలు, సహకార సంఘాలు తెరిచి అస్పృశ్యుల గుణగణాల్లో మార్పు తెచ్చేందుకు ప్రయత్నిస్తున్నారు. నా ఉద్దేశ్యంలో ఈ సమస్యను అర్థం చేసుకోవటానికి మరొక మార్గం ఉంది, ఒక వ్యక్తి దుర్భర జీవితాన్ని గడపవలసి వస్తున్నదంటే అందుకు అతని పరిసరాలే కారణమని, ఆ పరిసరాల్లో జీవనం గడపటానికి ఇష్టపూర్వకంగా అతను అంగీకరించటంకాక, అతనలా బ్రతుకుతున్నాడంటే అతని పరిసరాలు అనుకూలమైనవి కాక పోవటమేననే మూల భావనే ఈ రెండో మార్గానికి ఆధారం.

"ఈ రెండు మార్గాల్లో ఈ రెండవదే ఖచ్చితమైనదనటంలో నాకు మాత్రం సందేహం లేదు. మొదటి మార్గం ద్వారా ఎవరో కొందరు వ్యక్తుల్ని వాళ్ళ వర్గ స్థితి కన్నా ఉన్నత స్థితికి చేరేందుకు దోహదపడితే పడవచ్చు. కాని ఒక వర్గాన్ని మొత్తంగా అది సంస్కరించజాలదు. 'అస్పృశ్యతా వ్యతిరేక సమితి' (Anti Untouchability League) దళితుల్లోంచి ఎవరో కొందరు వ్యక్తులో, ఎన్నుకోబడ్డ కొందరు యువకులో అభ్యున్నతికి చేరే పరిస్థితి కాక మొత్తం దళిత వర్గం అభ్యున్నతిని కాంక్షించే దేనని నేననుకుంటున్నాను. ఏదో కొందరు వ్యక్తుల్ని సుగుణ వంతులుగా చేయటం కోసం సమితి తన శక్తి నంతా ధార పోయటానికి నేనిష్టపడను. దళిత వర్గాలు నివసించే సామాజిక పరిసరాల్ని మార్చటంపై బోర్డు తన శాయ శక్తులూ కేంద్రీకరించాలని నేను కోరుతున్నాను. ఇప్పుడు కొన్ని నిర్దిష్టమైన ప్రతిపాదనల్ని సమితి ముందుంచటానికి సాహసిస్తున్నాను.

" నా ఉద్దేశ్యంలో సమితి చేపట్టవలసిన మొట్టమొదటి పని గ్రామాల్లోని మంచి నీటి బావుల్ని, పాఠశాలల్ని, గ్రామ చావిళ్ళని, గ్రామ బహిర్భూముల్ని దళితులకు అందరితో సమానంగా తెరవాలనీ, వారికి వాటిపై హక్కుందని భారత దేశమంతటా ప్రచారం చేసి వాటిని వారికి దక్కేట్టు చేయడం.

"ఇలాంటి కార్యక్రమాల్ని గ్రామాలన్నింటిలో చేపట్టినట్లైతే దళిత వర్గాలకు అందరితో సమానమైన సాంఘిక హోదాను కల్పించేందుకు అవసరమైన సామాజిక విప్లవం హిందూ సమాజంలో వస్తుంది. పౌరహక్కులకు సంబంధించిన ఇలాంటి కార్యక్రమాన్ని చేపట్టే ముందు ఎలాంటి ఇబ్బందుల్ని ఎదుర్కోవలసి వస్తుందో బోర్డు ముందే తెలుసుకోవటం అవసరం. ఇలాంటి కార్యక్రమాలే బొంబాయి ప్రెసిడెన్సీలోని కొలబా, నాసిక్ జిల్లాల్లో చేపట్టినప్పుడు నాకెదురైన సమస్యల దృష్ట్యా ఇది నాస్వానుభవంతో చెబుతున్న మాట.

"దళిత వర్గాలకు, హిందూ కులస్థులకు కొట్లాటలు జరిగి తలకాయలు పగిలి కోర్టు కేసుల్దాకా పోవటంతో మొదలవుతుంది. ఇలాంటి కొట్లాటల్లో విపరీతంగా నష్టపోయేది దళిత వర్గాలే. కొలబాలోనూ, నాసిక్ కేసుల్లోను పోలీసు, మేజిస్ట్రేటు-న్యాయం దళిత వర్గాలవైపే ఉన్నా వాళ్ళు ఒక్క కేసులోనూ దళితులకు సహాయపడలేదు. తమతో సమానత్వ హోదా కోసం దళితులు ప్రయత్నిస్తున్నారని తెలిసిన మరు క్షణం నుంచి గ్రామాలన్నీ దళితుల్ని సాంఘిక బహిష్కరణకు గురి చేసాయి.

"పౌర హక్కుల సాధన కోసం చేసే ఉద్యమంలో సమితికి ఎదురయ్యే రెండు అవాంతరాలను గురించి మాత్రమే నేను చెప్పాను. వీటిని అధిగమించటానికి దళితుల్ని ఉద్యమంలో పాల్గొనేందుకు సన్నద్ధుల్ని చేసి, కోర్టు కేసుల్ని విజయవంతంగా నడిపించగల క్రియాశీలురైన వ్యక్తులతో కూడిన సైన్యం అవసరం. ఈ కార్యక్రమమంతా హింసాత్మకంగా సామాజిక ఆందోళనల్తో నడుస్తుందనే మాట వాస్తవమే. కాని దీన్ని నివారించగలమని నేననుకోను. తక్కువ గొడవల్తో సరిపుచ్చుకునే రెండో పద్ధతి నాకు తెలుసు. కాని అస్పృశ్యతను రూపుమాపే విషయంలో అది చాలదు.

"జ్ఞాన శూన్యులైన హిందూ ప్రజానీకంలో నిశ్శబ్దంగా ప్రవేశిస్తున్న హేతువాద భావాలు దళిత వర్గాలకు మోక్షాన్ని ప్రసాదించవని నాకు ఖచ్చితంగా తెలుసు. అందరు మనుషుల మల్లేనే హిందు కులస్థుడెవడైనా దళితుల యెడల అస్పృశ్యతను సాంప్రదాయకంగా పాటిస్తాడు. ఎవడో దానికి వ్యతిరేకంగా బోధ చేస్తే తన ప్రవర్తనని అతడు మార్చుకోడు.

"హిందూ కులస్థుణ్ణి ఆలోచించేటట్టు చేస్తేనే, బలవంతంగానైనా అతని పద్ధతుల్ని మార్చుకునేట్టు చేస్తేనే దళిత వర్గాలకు ముక్తి. అందుకోసం అతని సాంప్రదాయక

ప్రవర్తనా నియమావళిపై ప్రత్యక్ష చర్యల ద్వారా ఆందోళనకర పరిస్థితుల్ని సృష్టించాలి మనం. అలాంటి ఆందోళనకర పరిస్థితులు అతణ్ణి ఆలోచింప జేస్తాయి. అలా ఆలోచించటం మొదలెట్టాడు అంటే ఇంతకు ముందులా కాక ఇప్పుడతను మారటానికి సిద్ధమయ్యాడన్నమాట.

"ఇంతకన్నా భిన్నమైన రెండో పద్ధతిలోని లోపమేమిటంటే హేతువాద భావాలు వాళ్ళలో జొరబడినందువల్ల మానసిక మార్పురాదు. ఎదుకంటే అది వాళ్ళలో సంక్షోభ పరిస్థితిని సృష్టించదు. మహద్‌లోని చాదర్ చెరువు, నాసిక్‌లోని కాలారాం దేవాలయం, మలబార్‌లోని గురువాయూర్ దేవాలయం విషయంలో ఎందరో సంస్కరణవాదుల ప్రబోధాల వల్ల కొన్ని వందల సంవత్సరాల్లో సాధ్యం కానిపని ప్రత్యక్ష చర్యల వల్ల కొన్ని రోజుల్లో సాధ్యమైంది.

"అస్పృశ్యతా వ్యతిరేక సమితి చేయాల్సిన రెండో పనేమిటంటే దళితులకు అందరితో సమానంగా అవకాశాలు కల్పించటం. దళితులు దుర్భరమైన బ్రతుకులు వెళ్ళదీయటానికి కారణం అస్పృశ్యత మూలంగా సమానావకాశాలు లేకుండా పోవటమే. ఎవరు బడితే వారు అస్పృశ్య గ్రామాల్లో, పట్టణాల్లో కూడా కూరగాయలు, పాలు, వెన్న అమ్ముకుని పొట్ట పోసుకునే అవకాశం ఉందిగాని దళితులకు మాత్రం ఆ అవకాశంలేదన్న విషయాన్ని మీరు గుర్తించే ఉంటారని నాకు తెలుసు. హిందూ కులస్థులు హైందవేతర కులం వాడి దగ్గిర వీటన్నిటినీ కొంటారు. కాని దళితుడనేటప్పటికి కొనటం మానేస్తారు. ఇక్కడ ఉద్యోగావకాశాలకు వస్తే పరిస్థితి హీనాతి హీనం.

"అమెరికాలో నీగ్రోలాగా– అంతా సవ్యంగా నడుస్తున్నప్పుడు అస్పృశ్యులకు ఉద్యోగం వచ్చేది చిట్టచివర. ఏమీ బాగాలేనప్పుడు మొట్టమొదట ఉద్యోగం నుంచి ఊడబెరికేది అస్పృశ్యుణ్ణే. ఒక వేళ ఇంత చోటు దొరికినా అందులో ఉన్నది మాత్రం ఏమిటి? అహమ్మదాబాదు, బొంబాయి బట్టల మిల్లులో నెలకు 25 రూపాయలు మాత్రమే దొరికే అతి చిన్న ఉద్యోగాల్లో ఉన్నారు. ఎక్కువ జీతాలు దొరికే నేతకు సంబంధించిన శాఖలు వీళ్ళకు ఎప్పుడూ మూసే ఉంటాయి. మేనేజరు ఉద్యోగాలు ఎప్పుడూ హిందూ కులస్థులకే. దళితులకు ఎంత సీనియారిటీ ఉన్నా, నైపుణ్యం ఉన్నా వాళ్ళదగ్గర బానిసలుగా పడి ఉంటున్నారు.

" కండెలు చుట్టేందుకు ఇచ్చే ముడిసరుకు హిందూ కులస్థులైన మహిళా మేస్త్రీలు అందరికీ సమానంగా పంచకుండా కేవలం హిందువులకే పంచి తమకు ఏ మాత్రం అందనీయటం లేదని ఆశ్రమంల్లో పని చేస్తున్న కొన్ని వందల మంది దళిత స్త్రీలు నాదగ్గరకొచ్చి మొర పెట్టుకున్నారు.

"అస్పృశ్యతా వ్యతిరేక సమితి ఈ విషయాన్ని పరిశీలించి అసమానత్వాన్ని రూపుమాపేందుకు దీనికి వ్యతిరేకంగా ప్రజాభిప్రాయాన్ని కూడగట్టాలి. ఇలాంటి కేసుల్ని పరిష్కరించటానికి బ్యూరోలు ఏర్పాటు చేయాలి.

"చివరగా సమితి చేయవలసిందేమిటంటే స్పృశ్యులు అస్పృశ్యుల యెడల పెంచుకున్న అసహనాన్ని రూపుమాపటం. ఇదే రెండు వర్గాలను ప్రత్యేకవర్గాలుగా చీల్చింది. ఇది సాధించటానికి ఒక మంచి మార్గం నా ఉద్దేశ్యంలో ఈ రెండు వర్గాలను ధగ్గర చేసి సయోధ్య కుదర్చటం. ఒకళ్ళకొకళ్ళు అపరిచయస్థులనే భావన పోవాలంటే వీళ్ళందర్ని ఒకే కార్యక్రమంలో సమంగా భాగం పంచుకునేట్లు చేయాలి. నా ఉద్దేశ్యంలో హిందూ కులస్థులు తమ గృహాలలో దళితుల్ని అతిథులుగా, నౌకర్లుగా ఉంచుకునే ఏర్పాటు కన్నా మంచి పద్ధతి మరొకటి లేదు.

"ఇలాంటి సజీవ సంబంధాలతో ఇరువర్గాలు ఒక రకమైన సమష్టి సాంఘిక జీవనం గడుపుతూ మనమంతా కృషి చేస్తున్న ఐక్యతా సాధనకు మార్గాన్ని సుగమం చేస్తారు. బాధ్యతాయుతులైన చాలామంది హిందూ కులస్థులు ఇందుకు సిద్ధంగా లేరనే విషయం నాకు చాలా విచారాన్ని కలిగిస్తున్నది.

"మహాత్ముని నిరాహార దీక్షతో యాపద్భారతాన్ని కుదిపేసిన ఆపదిరోజుల్లో విర్లి వర్లీలోనూ మహద్‌లోనూ కార్యాలయాల్లో తమ యజమానులు అస్పృశ్యుల్ని తాకుతూ వాళ్ళతో మంచిగా ప్రవర్తించినందుకు నిరసనగా హిందూ కులాల ఉద్యోగులందరూ పని బంద్ పెట్టారు. దళితులకు వాళ్ళ స్థానే ఉద్యోగాలిచ్చైనా వీళ్ళకు బుద్ధి చెపుతారని నేనాశించాను. అది చెయ్యకపోగా సనాతనుల్తో కలిసి వారికి వత్తాసు పలికి ఇంకా బలాన్ని చేకూర్చారు. గాలి కోళ్ళలాంటి ఇలాంటి దళిత మిత్రులు దళితవర్గాలకు ఎంత వరకు సహాయం చేస్తారో నాకు తెలియదు.

"బాధల్లో ఉన్న వాళ్ళకు పనికి మాలిన సానుభూతి నిరర్థకం. నేను సమితికి మనవి చేసేదేమిటంటే దళిత వర్గాలకు హిందూ కులస్థుల సానుభూతి చిత్తశుద్ధితో కూడిందేనని విశ్వాసం కలగాలంటే హిందూ కులస్థులు తమ వర్గం ప్రజలపై – అమెరికా నీగ్రోల కోసం శ్వేత జాతీయులే తమ జాతి వారితో పోరాడినట్లు– దళితుల సంక్షేమం కోసం పోరాడాలి.

"తన కార్యకలాపాలు నిర్వహించేదుకు సమితి ఓ పెద్ద కార్యకర్తల సైన్యాన్ని తయారు చేయాలి. ఈ కార్యకర్తల నియామకాన్ని పెద్ద సమస్యగా పరిగణించనవసరంలేదు. నామటుకు నాకు దీనికొరకు సరియైన ఏజెన్సీ నొకదాన్ని నియమించటానికి ప్రాముఖ్యతనివ్వవలసి ఉంటుంది. డబ్బు చెల్లిస్తే పనులు చేయటానికి చాలామంది కార్యకర్తలే దొరుకుతారు. కాని అలాంటి వాళ్లు సమితి తలపెట్టిన మహత్కార్యానికి పనికిరారు. టాల్‌స్టాయ్ అన్నట్టు 'ఎవరు ప్రేమిస్తారో వారే సేవ చేయగలరు'. అది జరగాలంటే నా ఉద్దేశ్యంలో దళిత వర్గీయుల నుంచి కార్యకర్తలే సమర్థులు. అందుకని సమితి బాగా ఆలోచించి ఎవర్ని నియమించాలి, ఎవరిని నియమించకూడదు. అనే విషయాన్ని తెలుసుకోవాలని కోరుతున్నాను. సంఘ సేవంటే బలవంతపు పెళ్ళని విసుక్కునే దుష్టబుద్ధులు దళితుల్లో లేరని కాదు కాని సాధారణంగా దళిత వర్గీయుల్నుంచే వచ్చే కార్యకర్తలు ఇలాంటి పనిని ప్రేమతో అంగీకరిస్తారు. సమితి విజయానికిది తప్పనిసరి.

"మరో విషయం, వర్గాలు, ఉద్దేశాలు అనే అరమరికలు లేకుండా ఎలాంటి సంఘ సేవనైనా చేస్తున్న కొన్ని సంస్థలు అస్పృశ్యతా వ్యతిరేక సమితి చేసే సేవ గ్రాంట్లు ఇస్తే తామే చేస్తామని ముందుకు వస్తాయి. వ్యాపార పద్ధతిలో జరిగే ఇలాంటి లావాదేవీల పని మేలు చేసేదికాదు. ఏ సంస్థలోనైనా చూడాల్సింది తమ ముందున్న బృహత్కార్య నిర్వహణ మీద ఏకాగ్రత కలిగి వుందా లేదా అనేదే. తమకు అప్పగించిన బృహత్కార్యాన్ని ఉత్సాహపూరితంగా అంగీకరించే 'సంకుచిత' మనస్కులు గల వ్యవస్థలు, సంస్థల్నే మనమిప్పుడు కోరాల్సింది. ఈ మహత్కార్యాన్ని మనమిప్పుడెవరికైనా అప్పగించవలసి వస్తే కేవలం దళితుల సంక్షేమానికే అంకితమైన వారికి మాత్రమే అప్పగించాలి.

"దీన్ని ముగించే ముందు నేను చెప్పదల్చుకున్నదిది. బెల్‌ఫోర్ అనుకుంటా 'బ్రిటిష్ సామ్రాజ్యాన్ని ఒకటిగా ఉంచింది ప్రేమేగాని శాసనం కాదు' అన్నాడు. ఇది హిందూ సమాజానికి కూడా వర్తిస్తుంది.

"స్పృశ్యులను,అస్పృశ్యుల్ని కలిపి ఉంచగలది చట్టం కాదు. ప్రత్యేక ఎన్నిక గణాలకు బదులు సమిష్టి ఎన్నిక వర్గాలనేర్పాటు చేసే ఎన్నికల చట్టమూ కాదు. వాళ్ళని కలిపి ఉంచగలిగింది ప్రేమ ఒక్కటే.

" నా ఉద్దేశ్యంలో కుటుంబ వ్యవస్థకు బయట న్యాయం, ధర్మం మాత్రమే ప్రేమకు ద్వారాలు తెరుస్తాయి. స్పృశ్యులు ఆపని చేసేందుకు అస్పృశ్యతా వ్యతిరేక సమితి కృషి చేయాలి. లేదా అస్పృశ్యులకు న్యాయం జరిగేట్టు చేయాలి. సమితి ఉనికిని కాపాడేదినా ఉద్దేశ్యంలో ఇది తప్ప మరేదీ కాదు"

సెక్రటరీ కనీసం ఈ ఉత్తరం అందినట్లు కూడా జవాబు రాయలేదు. నేను చెప్పిన ఏ ఒక్క సలహా కూడా అంగీకార యోగ్యం కాలేదన్నది వేరే చెప్పవలసిన పని లేదు. కనీసం నేను చెప్పినట్లు సమితి కార్యకర్తల్ని ఎక్కువగా దళితుల నుంచి మాత్రమే నియమించాలనే సలహా కూడా పాటించలేదు. హరిజన సేవక్ సంఘ్ హిందువుల పుట్టగా మారిందన్న విషయాన్ని గాంధీ గారి దృష్టికి తెచ్చినపప్పుడు చిత్తశుద్ధి లేకుండా చాలా తెలివిగానే సంఘ్‌ను సమర్థించాడు.

అస్పృశ్యుల ప్రతినిధి వర్గం ఆయన్ని కలిసినప్పుడు ఇలా అన్నాడు. "అస్పృశ్యతను సృష్టించిన పాపానికి అస్పృశ్యుల సంక్షేమం కోసం హిందువులు పరిహారం చెల్లించాలి. వసూలైన సొమ్మంతా హిందువులిచ్చిందే. ఏ విధంగా చూసినా హిందువులు మాత్రమే సంఘ్‌ను నడపాలి. ఏనీతి నియమంగానీ, చట్టంగానీ సంఘ్ బోర్డులో అస్పృశ్యులకు చోటిమ్మని చెప్పదు" (ఈ ఉటంకింపు డా॥ అంబేద్కర్ రాసిన "వాట్ కాంగ్రెస్ అండ్ గాంధీ హేవ్ డన్ టు అన్‌టచబుల్స్" నుండి గ్రహించబడింది, రాత ప్రతిలో ఇది లేదు - సంపాదకుడు)

గాంధీ, ఆయన సలహాదారులూ నా ప్రతిపాదనల్ని త్రోసి పుచ్చటమే కాదు, సంఘ్ నియమావళిని తయారు చేయటంలో నియమనిబంధనల్ని నా ప్రతి పాదనలకు వ్యతిరేకంగానే చేశారు. (పై ఉటంకింపునుంచే ఉటంకింపు - సంపాదకుడు)

సెప్టెంబరు 30, 1932న బొంబాయిలోని కవాస్‌జీ జహంగీర్ హాల్లో జరిగిన సమావేశంలో అంగీకరించిన సంస్థ నియమావళి ప్రకారం:

"అస్పృశ్యతకు వ్యతిరేకంగా ప్రచారం చేస్తూ సాధ్యమైనంత తొందరగా, బలవంతంగా కాకుండా శాంతియుతమార్గాల ద్వారా ఒప్పించి దళితులకు మంచి నీటి బావులు, ధర్మశాలలు, గ్రామ వీధులు, పాఠశాలలు, శ్మశాన వాటికలు, దేవాలయాలు తెరిచేటట్లు చేయాలి."

కాని సంస్థ ప్రారంభించిన రెండు నెలల తర్వాత నవంబరు 30 న జి.డి.బిర్లాగారు, వి.వి.థక్కర్‌గారు ఒక ప్రకటన చేస్తూ ఇలా పేర్కొన్నారు.

"హేయదృష్టిగల సనాతనులు కులాంతర వివాహాలు, భోజనాలను వ్యతిరేకించినంతగా అస్పృశ్యతా నివారణకు వ్యతిరేకులు కారు. సమితి తన పరిమితుల్ని మించి పని చేయజాలదు గనక అది హిందూ కులస్థులలో మాటామంతి ద్వారా అస్పృశ్యతా నివారణకు నిర్మాణాత్మకంగా కృషి చేస్తుందనీ, దళితుల అభ్యున్నతిని విద్యా విషయకంగా, ఆర్థికంగా, సాంఘికంగా కాంక్షిస్తుందనీ, అస్పృశ్యతా నివారణలో ఇదొక మైలురాయని స్పష్టం చేయటం అవసరం. అలాంటి పని వల్ల ఎంత గొప్ప సనాతనుడికైనా క్షమాగుణం కలుగుతుంది. కుల నిర్మూలన, సహపంక్తి భోజనాల వంటి సాంఘిక సంస్కరణలు సమితి పరిధిలోకి రావు".

ఈ నియమ నిబంధనలు ఒక వార్షిక నివేదిక(1932-33 పే.1)లో వివరించబడ్డాయి. అందులో:

"సంస్థ నియమనిబంధనల ప్రకారం దాని ఉద్దేశ్యంపుట్టుక ద్వారా వచ్చిన అస్పృశ్యతను రూపుమాపటం; హిందువులు వాడుకునే దేవాలయాలు, పాఠశాలలు, బావులు ఇతర ప్రజోపయోగ సంస్థలను హరిజనులు కూడా సమంగా అనుభవించే అవకాశాలు కల్పించటం.

"ఈ ఉద్దేశ్యాలు నెరవేర్చటానికి సంస్థ రెండు రకాల కార్యకలాపాలు చేపట్టేందుకు దారి తీసింది. హిందూ కులస్థుల భావాల్లో, అనుభూతుల్లో తీవ్రమైన మానసిక పరివర్తనను తెచ్చి, వాళ్ళు తమంతట తామే మనస్ఫూర్తిగా పైన చెప్పిన వన్నీ 'హరిజనులు' అనుభవించేందుకు అంగీకరించేట్లు ఒప్పించటం మొదటిది. సంఘ హరిజనుల సామాజిక, ఆర్థిక, విద్యాభివృద్ధికి తన ఆర్థిక వనరుల్నే కాక తన శాయశక్తులా ధారపోయాలి."

# గాంధీ ఆయన నిరాహారదీక్ష

సంఘ్ నిర్వహించిన కార్యకలాపాల్ని దాని ఆశయాలతో పోల్చి చూస్తే రెండు ప్రశ్నలు తలెత్తుతాయి. అది చేసిన పనులు గర్వించదగ్గపనులేనా అనేది మొదటి ప్రశ్న. ఇక రెండవది, ఈ పనులన్నీ సంఘ్ ఆశయాలకు అనుగుణంగా జరిగినవేనా? వట్టి గొడ్డుకు అరుపు లెక్కువన్నట్టు అది చేసిన పనులు అతి స్వల్పం. క్రైస్తవ మిషనరీలతో తనను పోల్చుకునే సంఘ్ మిషనరీలకంటే ఏమీ ఎక్కువ చేయలేకపోయింది. ఇది చాలా విచారించవలసిన విషయం. రెండోది ఆతృతతో పరిశీలించవలసిన ముఖ్యమైన ప్రశ్న. అస్పృశ్యుల కోసమే సంఘ్ పాటు పడుతున్నది. మంచిదే. కాని ఆపాట్లన్నీ ప్రణాళికా బద్ధంగా అస్పృశ్యతను రూపుమాపేవిగా ఉండాలి.

ఈ విషయాల దృష్ట్యా పరిశీలిస్తే ఎవరైనా సంఘ్ ఏం ఒరగబెట్టిందని చెబుతారు? అస్పృశ్యులకు ప్రత్యేక పాఠశాలల్ని, ప్రత్యేక వసతి గృహాల్ని, ప్రత్యేక చికిత్సాలయాల్ని, ప్రత్యేక మంచినీటి బావుల్ని సంఘ్ బహిరంగంగానే, నిస్సిగ్గుగా బలపరుస్తుంది. అస్పృశ్యత పది కాలాల పాటు కాపాడటానికి ఇదే మంచి మార్గమేమోనని నాకనిపిస్తుంది. ఆశ్చర్యకరమైన విషయమేమిటంటే అస్పృశ్యులకు ప్రత్యేక ఎన్నిక గణాలు వద్దని నిరాహార దీక్ష చేసిన గాంధీగారి కనుసన్నలలోనే ఈ వేర్పాటు ఉద్యమం నిరాఘాటంగా జరగటం. అస్పృశ్యులకు సేవ చేయటంలో గాంధీ, ఆయన సంఘ్ కూడా అస్పృశ్యులకు నిజంగా కావలసిందేదో మర్చిపోయారు. అస్పృశ్యులు కోరుతున్నది విద్య కాదు. వాళ్ళు కోరేది అందరూ వెళ్ళే ఆస్పత్రుల్లో సమానత్వ ప్రాతిపదిక పై ప్రవేశం. అస్పృశ్యుడు నీళ్ళడగటం లేదు. అతను కోరేది అన్ని నీటి వనరుల్నించీ సమిష్టిగా నీళ్ళు తోడుకునే హక్కు. అస్పృశ్యులు తమ బాధలనుంచి విముక్తి పొందాలనుకోవటం లేదు. తమ వ్యక్తిత్వాన్ని గౌరవించాలనీ, అంటరానితనమనే దురాచారం పోవాలనీ కోరుకుంటున్నారు. ఇది పోతే దీంతోనే వాళ్ళ బాధలన్నీ పోతాయి. హరిజన సేవక్ సంఘ్ దీన్ని గుర్తించినట్లు లేదు. సంఘ్ అస్పృశ్యుల హితమూ, సనాతన హిందువులేమో అస్పృశ్యుల శత్రువుగా తయారైనట్లు కనిపిస్తుంది. మిత్రుడు చేసిన మేలేమిటో శత్రువు చేయలేకపోయిన మేలేమిటో ఎవరికీ అర్థం కాదు. పాఠశాలలూ, ఆసుపత్రులూ, నీటివనరులు అస్పృశ్యులకు ప్రత్యేకంగా ఉండాలని సనాతన హిందువు కోరతాడు. సంఘమేమో మీరు కోరినట్లు గానే జరుగుతుంది అన్నట్లు ప్రవర్తిస్తుంది. అస్పృశ్యతను అంగీకరించటం అంగీకరించటకపోవటం అనే తేడా తప్ప శత్రువు, మిత్రుళ్ళా కనిపించే సనాతన హిందువుకు, హరిజన సేవక్ సంఘ్‌కు చేతల్లో

ఉన్న తేడా ఏమిటి ? వీళ్ళిద్దరి ఆధ్వర్యంలోనే అస్పృశ్యుల మీద ప్రత్యేక పాఠశాలలు, హాస్టళ్ళు, నీటి వనరులూ రుద్దబడ్డాయి.

ఇలా జరుగుతున్నప్పుడు గాంధీ గారూ, ఆయన హరిజన సేవక్ సంఘ్ సనాతన హిందువులతో ఎందుకు తగవుపడుతున్నారో ఎంతకీ అర్థమై చావదు. గాంధీగారికి, సనాతన హిందువులకు హిందూ శాస్త్రాల్లో అస్పృశ్యత ఉన్నదా లేదా అన్న విషయంపై జరుగుతున్న వాగ్వివాదాలు కేవలం ఉత్తుత్తి చర్చే. దీనివల్ల ఒరిగేదేమీలేదు. ఇంకా చెప్పాలంటే ఇది అస్పృశ్యులకు, సనాతన హిందువులకు మధ్య శత్రుత్వం పెంచిందని చెప్పటానికి నేను వెనకాడను. గాంధీగారు అనవసరంగా వాళ్ళతో గొడవ పెట్టుకోవటానికి ముందు ఈ రెండు వర్గాల మధ్య సంబంధాలు లేవు. కాని గాంధీగారు పెట్టుకున్న గొడవల్తో అది సాంఘిక వ్యతిరేకతగా పరిణమించిది. అలాంటి గొడవలు పెట్టుకోకుండా ఉన్నట్లైతే, కేవలం అస్పృశ్యత మాత్రమే వివాదాస్పదాంశం అయినట్లైతే (గాంధీగారికి నిజంగా అస్పృశ్యతపై పోరాడాలని లేదు) సనాతన హిందువులకు అస్పృశ్యుల బాధల నివారణకు తోడ్పడమని పిలుపు నిచ్చినట్లైతే ఎందరో సనాతనులు అందుకు తప్పకుండా ముందుకొచ్చి వుండేవారని చెప్పగలను. సంఘ్ పెట్టినందువల్ల వచ్చిన ఘనతంతా గాంధీగారే తలకెత్తుకున్నాడు. కానీ సంఘ్ అస్పృశ్యతా నివారణకు కృషి చేయలేదు. అస్పృశ్యుల సాధక బాధకాలు తొలగించేదుకు పాటుపడలేదు.

సంఘ్ ఎందుకు విఫలమైంది ? దీనికి నా దగ్గర ఖచ్చితమైన సమాధానముంది. సంఘ్ విఫలమైంది తప్పుడు రాజకీయాల వల్లనేనని నేనంటాను.

హరిజన సేవక్ సంఘ్ ఒక రాజకీయ సంస్థ అని అంటూ వుండే వారు. గాంధీగారు ఈ వాదనని తిరస్కరించేవాడు. అది తప్పనేవాడు. సంఘ ప్రధాన కార్యదర్శి కూడా ఈ విషయంపై అభ్యంతరం చెప్పాడు. ఆయన మాటల్లో చెప్పాలంటే "రాజకీయ ఒప్పందం వల్ల ఏర్పడిందే అయినా దానికి రాజకీయాలు లేవు". గాంధీగారి విముఖతకు, కార్యదర్శి అభ్యంతరాలకు నాకు కారణాలు కనిపించలేదు. సంఘ్ రాజకీయ సంస్థగా ఉండాలనే నేను వాంఛించాను. రాజకీయాధికారంలో అస్పృశ్యులకు భాగం లభించింది. కాని అధికారికి అధికారం ఉందన్న జ్ఞానం లేకపోతే అది అధికారమే కాదు. వ్యవస్థీకృతం కాని అధికారం కూడా అధికారం కాదు. హరిజన సేవక్ సంఘ్ అస్పృశ్యుల్ని కూడగట్టి

వాళ్ళ చేత స్వతంత్రంగా రాజకీయ పార్టీలు పెట్టించి ఎన్నికల్లో పాల్గొనేటట్లు చేసి వాళ్లకు సహాయం చేసినట్లైతే వాళ్ళరాజకీయాధికారం శక్తి వంతమయ్యేది. సంఘ్‌కు రాజకీయాలు లేవన్న గాంధీగారు, ఆయన కార్యదర్శి మాటల్నికూడా నేను అంగీకరించను. కాకపోగా సంఘ్‌కు నిర్దిష్టమైన రాజకీయ పంథా ఉందని, ఐతే ఆ పంథా అస్పృశ్యులంటే ఈర్ష్య పడే పంథా అని నేను నొక్కి చెబుతున్నాను. కాని సంఘ్‌కు రాజకీయాలున్నాయంటే గాంధీగారు అంగీకరించరు కాబట్టి దృష్టాంతాలు చూపాలి. మాటల్తో చెప్పటం కంటే దృష్టాంతాలు చూపటం మంచిది. ఎందుకంటే మనుషులు అబద్ధాలాడవచ్చేమో గాని సంఘటనలలా కాదు. నేను చెప్పబోయేదానికి సాక్ష్యంగా సంఘ్ నియమావళిలో ఒక క్లాజుపై నేనాధారపడాలనుకుంటున్నాను. ఈ క్లాజు అస్పృశ్యతా నివారణకు, హిందూ కులస్థులతో సమానంగా హక్కులు సాధించేందుకు సంఘ్ ఏఏ మార్గాలననుసరించాలనే దానికి సంబంధించింది. ఆ క్లాజు ఇలా పేర్కొంది.

"హక్కుల సాధనకు ఎలాంటి బలప్రయోగం చేయరాదు. అందుకు శాంతియుతంగా ఒప్పించటమే ఏకైక మార్గం"

ఇది సంఘ్ మౌలిక సూత్రం. ఇది నాకు అంతుపట్టని విషయం. ఆమాట కొస్తే ఎవరికీ అంతుపట్టని విషయమే. నేనొకటడగాలనుకుంటున్నాను. అస్పృశ్యతా నివారణక సంఘ్ కేవలం శాంతియుతమార్గాల ద్వారా మాత్రమే హిందూ కులస్థుల్ని ఎందుకు ఒప్పించాలనుకుంటున్నది?

చాలమంది సంఘ సంస్కర్తలు - వాళ్ళు మత సంస్కర్తలైనా కావచ్చు లేద హేతువాదులన్నా కావచ్చు- శక్తివంతులైన మనుషులు కొందరు జనం చేస్తున్న పనులు, వాళ్ల ఆలోచన్లూ సంఘ విద్రోహమైనవి చెపితే వెంటనే వాటిని మార్చుకుంటారని భావిస్తారు. కాని ప్రొఫెసర్ నైబూర్ తన గ్రంథం "మోరల్ మాన్ అండ్ ఇమ్మోరల్ సొసైటీ" లో చెప్పినట్లు ఈ సంఘ సంస్కర్తలంతా పట్టించుకోని దేమిటంటే మానవ సంబంధాలను నిర్దేశించే మానవ సమూహాల ప్రవర్తనలోని పాశవిక లక్షణం, స్వలాభాపేక్ష, సామూహిక అహంభావం. వాళ్ళు విస్మరించే మరో విషయమేమిటంటే వ్యక్తులతో నిండి వున్న జాతులు, వర్గాలు వ్యక్తులకుండే నైతిక విలువల కన్నా ఎక్కువ గుణాత్మకతను కలిగి వుండవనీ, కాబట్టి విద్య ద్వారా న్యాయాన్ని సాధించటం సాధ్యం కాదనే విషయాన్ని.

విశ్వాసాన్ని, హేతువును ఉద్యమంతో దగ్గర చేయగలిగితే అవి అన్యాయాన్నే బలపరుస్తాయి గాని తొలగించవు. ఒక వేళ అన్యాయాన్ని రూపుమాపాలనుకుంటే దాన్ని ఎదిరించాలి. ఒక వేళ అన్యాయం సామ్రాజ్యవాదం రూపంలోగానీ, వర్గాధిపత్యం రూపంలోగానీ సామూహిక శక్తి వల్ల జరిగితే దాన్ని శక్తివంతంగానే ఎదుర్కోవాలి. ఒక వేళ వర్గాధిపత్యం వ్యవస్థీకృతమైందైతే దాన్ని శక్తినుపయోగించి తప్ప తొలగించటం సాధ్యం కాదు. బలవంతులు బలహీనుల్ని దోచుకోవటాన్ని ఆపటానికి ఇదొక్కటే మార్గం.

గాంధీగారు గానీ, హరిజన సేవక్ సంఘ్ గానీ తమ నిరోధక మార్గాన్ని కుల హిందువుల ప్రాబల్యానికి, శాంతియుత ప్రోద్బలానికే ఎందుకు పరిమితం చేశారు? హిందూ కులస్థులు చేసే అన్యాయాన్ని ప్రత్యక్ష చర్యల ద్వారా ఎందుకు నిరోధించరు? అన్యాయాన్ని వ్యవస్థీకృతంగా నిరోధించటమంటే మానవ సమూహాల్లో ఉండే నైతిక, హేతుబద్ధచర్యలకు అవసరమైన వనరులు నాశనం కాకుండా రక్షించే ప్రతిఘటనా రూపాల్ని కనుక్కోవలసిన సమస్య ఎదురౌతుందని నాకు తెలుసు. కాని అదొక సమస్యే కాదు. సత్యాగ్రహ సిద్ధాంతాన్ని, శాంతియుత నిరోధాన్ని గాంధీగారు నైతిక విలువలేమీ చేయలేని విధంగా రూపొందించాడు. అస్పృశ్యులపై జరుగుతున్న అన్యాయాల్ని రూపుమాపేందుకు హిందూ కులస్థులకు వ్యతిరేకంగా అస్పృశ్యులే సత్యాగ్రహం చేసేందుకు వారిని సిద్ధం చేయాలని సంఘ్‌ను గాంధీగారు ఎందుకు కోరలేదు? బ్రిటిష్ సామ్రాజ్య వాదానికి వ్యతిరేకంగా సత్యాగ్రహం చేయమని భారత ప్రజల్ని ఆయన ప్రోద్బలం చేశాడు. హిందూ కులస్థులకు వ్యతిరేకంగా అస్పృశ్యుల్ని అదే మార్గాన్నవలంబించమని ఎందుకుకోరడు? ఈ ప్రశ్నకు గాంధీగారి జవాబేమిటి? అదేమిటో నాకు తెలుసు. అలా చేస్తే తన రాజకీయం నడవదు. గాంధీగారు ఎల్లప్పుడూ జాతి నంతా నడిపించే నాయకుడుగానే ఉండాలి. ఏదైనా జరిగి ఈనాయకత్వం పోతే జీవితమే వృధా అని ఆయన భావిస్తున్నాడేమోనని నాకనిపిస్తుంటుంది. ఇంతకన్నా ఆశబోతు రాజకీయవాది మరొకరుండరేమోననిపిస్తుంది. ఎవరైతే మిత్రులని పైకి చెబుతూ వుంటారో వాళ్ళతని శత్రువులేనని నాకు తెలుసు. తన నాయకత్వం వర్ధిల్లాలంటే కాంగ్రెస్‌ను సంఘటితగా ఉంచాలి. కాంగ్రెస్‌లో ఉన్నది నూటికి తొంభై తొమ్మిది మంది హిందువులే. అస్పృశ్యుల బాగు కోసం సంఘ్ హిందువులకు వ్యతిరేకంగా సత్యాగ్రహం చేస్తే కాంగ్రెస్‌ను సంఘటితంగా ఉంచటంలో ఆయన కృతకృత్యుడెలా

అవుతాడు? హిందువులంతా కాంగ్రెస్‌ను వదిలేస్తారు. దాంతో కాంగ్రెస్ పగిలిపోతుంది. జాతినాయకుడుగా ఇది గాంధీగారి అస్థిత్వానికే ముప్పు. అస్పృశ్యతను రూపుమాపేందుకు శాంతి యుత పరిష్కారాన్ని ఏకైక మార్గంగా గాంధీగారు గానీ సంఘ్ గానీ ఎందుకెంచుకున్నారనటాన్ని ఇదొక్కటే వివరిస్తుంది. కాంగ్రెస్‌నుగానీ, హిందువుల్ని గాని ఎక్కువగా బాధించని మార్గం ఇదొక్కటే. పెద్ద పెద్ద విషయాలనలా వుంచండి. చిన్న చిన్న విషయాల్లో కూడా హిందువులకు, కాంగ్రెస్‌కు హాని కలగని విధంగానూ, దిగ్భ్రాంతికి లోను గాకుండా ఉండేందుకుగాను సంఘ్ ఎంతో జాగ్రత్త పడింది. ఉపకార వేతనాల మంజూరు విషయంలో కూడా అభ్యర్థుల రాజకీయ పూర్వరంగాన్ని పరిశీలించి, వాళ్ళు కాంగ్రెస్‌కు గాని హిందువులకు గాని వ్యతిరేకులా, కారా? అనే విషయాన్ని తేల్చుకుని, అలా వ్యతిరేకించని వాళ్లకు మాత్రమే సంఘ్ తన నిధులనుంచి ఉపకార వేతనాలు మంజూరు చేస్తున్నదని నాకు చాలమంది చెప్పారు.

గాంధీగారు గానీ సంఘ్‌గానీ శాంతియుత పరిష్కార మార్గాల్ని కాంగ్రెస్‌కు, హిందువులకు ఏ నష్టం రాని విధంగా ఉపయోగించాలనే రాజకీయ ఉద్దేశ్యాలు లేకుండా చేశారంటే ఇంకా ఇప్పటికీ ఎవరైనా నమ్ముతారా అని నాకు ఆశ్చర్యం కలుగుతుంది. సంఘ్ రాజకీయాలు విఫలమయ్యాయని నేను ఇంతకు ముందన్నది ఈ ఉద్దేశ్యంతోనే. ఇది తప్పుడు రాజకీయమని నేను చాలమెత్తని భాషలో అంటున్నాను. ఒక వేళ రక్షకుడే భక్షకుడు కావటం విశ్వాసఘాతుకమే ఐతే ఇదీ విశ్వాస ఘాతుకమే.

భారత దేశంలోనూ, ఐరోపాలోను గాంధీగారిని ఆయన మిత్రులు తరుచుగా జీసస్ క్రైస్ట్‌తో పోలుస్తారు. ఇలాంటి విచిత్రమైన పోలికను సమ్మతం చేస్తున్నదేమిటి? ఒక విధంగా వీళ్ళిద్దరి మధ్యా నాకు పోలిక కనిపిస్తుంది. జీసస్, గాంధీ ఇద్దరూ దరిద్రుల్నే సేవిస్తున్నామంటారు. ఈ విషయంలో ఇద్దరూ ఉన్నత వర్గీయులే. ధిక్కారానికి గురైనవారే. దీనికి వీళ్ళిద్దరూ ఎలా ప్రతిస్పందించారు? పరిసయు లను ఎదుర్కోవలసి వచ్చినప్పుడు జీసస్ "ఆరోగ్యవంతులకు వైద్యుని అవసరంలేదుకాని రోగస్థులకు మాత్రం వైద్యుడు కావాలి" అన్నాడు. గాంధీగారికి, జీసస్‌కు ఎంత తేడా! ఆరోగ్యవంతుల్ని గురించి జీసస్ బాధ పడలేదు. కానీ గాంధీగారు ఆరోగ్యవంతులకూ, రోగగ్రస్థుల్ని ఇంకా పీడిస్తున్న వారి సంక్షేమానికే అంకితమై పోయాడు. అస్పృశ్యుల యెడల గాంధీగారు వైద్యుడుకాదు.

కాకపోతే కేవలం సానుభూతి పరుడు అంతే.

అస్పృశ్యుల యెడల సానుభూతిపరుడుగా కూడా ఆయన సానుభూతి రెండు అంశాల చేత పరిమితమైంది. ఇవిః ఆయన సాంఘిక ధ్యేయమూ, ఆయన రాజకీయాలు. ఈ మధ్యనే జరిగిన రెండు సంఘటనల్ని ఉటంకించకపోతే నేను చెప్పేది అనుమానాలకు దారి తీస్తుంది. ఈ రెండు సంఘటనలూ కేంద్ర ప్రాంతం (Central Province)లో షేగాంకు దగ్గర గాంధీగారుంటున్న చోటనే జరిగాయి.

నేను చెప్పబోయే రెండు సంఘటనల్లో ఒకటి భారతదేశంలో 'ఖేర్ సంఘటన'గా ప్రాచుర్యం పొందింది. గత సంవత్సరం అంటే 1938లో సెంట్రల్ ప్రావిన్స్ కాంగ్రెస్ మంత్రివర్గంలో సంక్షోభం తలెత్తింది. ప్రధాని ఖేర్‌కు, ఆయన మంత్రి వర్గ సహచరులకు పొసగలేదు. ప్రధానిగా ఖేర్ మంత్రి వర్గ సభ్యుల్ని రాజీనామా చేయమని కోరాడు. కాంగ్రెస్ పార్లమెంటరీ బోర్డు అనుమతి లేకుండా రాజీనామా చేయటానికి వారు నిరాకరించారు. కాని ఖేర్ వాళ్ళని రాజీనామా చేయమని బలవంతం పెడితే రాజీనామా చేయక తప్పని పరిస్థితి ఏర్పడింది. వాళ్ళు రాజీనామాచేశారు. తర్వాత ఖేర్ క్రొత్త మంత్రి వర్గాన్ని తనకనుకూలమైన వాళ్ళతో ఏర్పాటు చేశాడు. ఈ క్రొత్త మంత్రివర్గంలో డా॥ ఖేర్ ఒక అస్పృశ్యునికి స్థానం కల్పించాడు. డా॥ ఖేర్ మంత్రి వర్గాన్ని రాజీనామా చేయించటం, తర్వాత పార్లమెంటరీ బోర్డును సంప్రదించకుండా కొత్త మంత్రి మండలి ఏర్పాటు చేయటం కాంగ్రెస్ వర్కింగ్ కమిటీకి పరిశీలనకు వచ్చాయి. డా॥ ఖేర్ చేసింది తప్పని, పార్టీ నియమావళికి విరుద్ధమని తీర్మానించి ప్రధాని పదవి నుంచి ఆయన్ని తొలగించారు. డా॥ ఖేర్‌మీద మోపిన ఒక ఆరోపణేమిటంటే కొత్త మంత్రివర్గంలో ఒక అస్పృశ్యునికి స్థానం కల్పించారనేది. తాను అస్పృశ్యుల కోసం నిరాహారదీక్షలు చేస్తున్న గాంధీ డా॥ ఖేర్‌కు చెప్పిన విషయం ఈ క్రింద పేర్కొంటున్నాను. నా కోసం డా॥ ఖేర్ ఈ విషయాన్ని రాతరూపంలో పెట్టాడు.

"అస్పృశ్యుణ్ణి నా మంత్రి వర్గంలోకి తీసుకున్నానని మహాత్మా గాంధీ నన్ను నానామాటలన్నాడు. అస్పృశ్యుల్ని పైకి తేవటం కాంగ్రెస్ కార్యక్రమంలో భాగమేనని, ఈకార్యక్రమాన్ని దిగ్విజయం చేయటం కోసం నాకు లభించిన అవకాశాన్ని వినియోగించుకున్నానని, నేను చేసిందాంట్లో తప్పేమీ లేదని నేనుకుంటున్నానని నేను

తగిన సమాధానమే చెప్పాను. దానిమీదట ఈ పనిని నేను స్వార్థ బుద్ధితో చేశానని మహాత్మాజీ నామీద ఆరోపణచేశారు. నేను రాజీనామా చేయటంతోనే నాకు స్వార్థ బుద్ధిలేదని స్పష్టమౌతుందని నేను ఈ ఆరోపణను త్రిప్పి కొట్టాను. నా చేతుల్తో కాంగ్రెస్‌లో అపస్వరాలు, అనైక్యత సృష్టించానని, కాంగ్రెస్‌కు అన్యాయం చేశానని మహాత్మాజీ అన్నారు"

ఒక అస్పృశ్యుడు మంత్రి వర్గంలో సభ్యత్వం కలిగి ఉండటానికి గాంధీగారు తిరస్కరించాడనటానికి నిదర్శనం కేంద్ర ప్రాంతంలో కొత్తగా ఏర్పడ్డ కాంగ్రెస్ మంత్రి వర్గంలో అంతకు ముందు మంత్రి వర్గంలో కేవలం ఒక్క రోజు మాత్రమే మంత్రి పదవి నిర్వహించిన అస్పృశ్యుడు లేకపోవటమే. కేవలం బయటనుంచి చూసే వాళ్ళకోసమైనా అతన్ని మంత్రివర్గంలో చేర్చుకోవాల్సింది. అలా చేర్చుకోలేదంటే గాంధీగారు దాన్ని సూత్రప్రాయంగానే వ్యతిరేకించాడని తెలుస్తుంది.

ఇది నిజంగా అమితాశ్చర్యకరమైన విషయం. ఎందుకంటే మంత్రి పదవికి డా॥ ఖేర్ ఎంపిక చేసిన సెంట్రల్ ప్రావిన్సెస్ అస్పృశ్య శాసన సభ్యుడు పట్టభద్రుడూ. కాంగ్రెస్ వక్తే కాదు, పార్టీలో పలుకుబడి కలవాడుకూడా. కాంగ్రెస్ మంత్రి వర్గం అలాంటి వాణ్ణి చేర్చుకోవటానికి గాంధీగారికి ఎలాంటి అభ్యంతరాలైనా ఎందుకుండా నిజానికి గాంధీ అస్పృశ్యులను మానసికంగా సంతోషపర్చటానికి, హిందువుల్ని అదుపులో ఉంచటానికైనా కనీసం ఒక్కొక్క అస్పృశ్యుణ్నైనా మంత్రిగా చేర్చుకోమని పురమాయించాల్సింది. పార్టీ నిబంధనల్ని త్రోసిరాజని కూడా ఆయన ఈ పని చేయాల్సింది. కాంగ్రెస్ పార్టీకి మెజార్టీలేని ప్రాంతాల్లో కాంగ్రెసేతర పార్టీతో కలిసి పదవుల కోసం మిశ్రమ ప్రభుత్వాల్ని ఏర్పాటు చేయటానికి గాంధీగారు వ్యతిరేకత ప్రదర్శించలేదు. అలాంటి మిశ్రమ ప్రభుత్వాల్లో కాంగ్రెసేతరులకు మంత్రి పదవుల్ని కట్టబెట్టటానికి గాంధీగారు అనుమతించారు. కాంగ్రెస్ తన కులాల్ని, వర్గాన్ని కోల్పోకుండా ఈ పని చేయటానికంగీకరించిన గాంధీగారు అస్పృశ్యుల యెడల తన ప్రేమానురాగాల్ని ప్రదర్శించటంలో తనకు విశ్వాసమే ఉంటే అస్పృశ్యుల్ని కాంగ్రెస్ మంత్రి వర్గాల్లో చేర్చుకోమని కాంగ్రెస్ ప్రధాన మంత్రుల్ని ఆయన ఎందుకు ఆదేశించలేదు? కాని సెంట్రల్ ప్రావిన్సెస్ విషయం భిన్నమైంది. ఇక్కడ మంత్రిగా చేరిన అస్పృశ్యుడు కాంగ్రెస్

వాదీ, పట్టభద్రుడూను. అతని రాజకీయ జీవనాన్ని గురించిగాని, విద్యార్హతల గురించి గాని అభ్యంతరాలుండే అవకాశమే లేదు. అతన్ని చేర్చుకోవటానికి గాంధీకి అభ్యంతరమెందుకు? ఈ విషయాన్ని గురించి గాంధీని వివరణ అడగటానికి అస్పృశ్యులు కొందరు షేగాం వెళ్ళారు. ఈ విషయం తెలుసుకుని గాంధీగారు తప్పించుకోవడానికి మౌనవ్రతం ప్రారంభించారు. ఇది గమనించి అస్పృశ్యులు సెంట్రల్ ప్రావిన్సెస్ మంత్రి వర్గంలో అస్పృశ్యునికి స్థానం లేకుండా చేసినందుకు గాంధీకి వ్యతిరేకంగా సత్యాగ్రహం మొదలెట్టారు. ఇందులో నుంచి బయట పడేందుకు గాంధీగారు షేగాం వదలి వాయువ్య సరిహద్దు ప్రాంతాల్లో పఠాన్లకు అహింస బోధించేందుకు వెళ్ళి పోయారు. గాంధీగారి మౌన వ్రతం దైవైక్యం కోసం కాదని స్పష్టంగా చెప్పగలను. అస్పృశ్యులకు తన అంతరంగంలోని భావాలు వెల్లడించటం ఇష్టం లేక గాంధీగారు వెతుక్కున్న ఒకసాకు మాత్రమే ఈ మౌన వ్రతం. ఈ విషయంలో గాంధీగారి నుంచి మాకు సమాధానం లేనేలేదు. నాకు తెలిసినంతవరకు దీనికి ఒకే ఒక సమాధానం వుంది. గాంధీగారు నోరు తెరవటానికి ఇష్టపడ్డా ఇంతకన్న మంచి సమాధానం ఇవ్వలేడు. అస్పృశ్యుల గురించి గాంధీగారికున్న భావాలు చాలా సామాన్యమైన భావాలు. అవేమిటంటే అస్పృశ్యుణ్ణి అందరూ తాకాలి. ఒక వేళ తాకి స్నానం చేయకపోయినా అలా చేయని వాళ్ళను ఏమీ అనకూడదు. ఒక వేళ గాంధీగారు అలాచేసి విఫలమైనా మన్నించవచ్చు. కాని ఇలాంటి సామాన్యమైన ఆదర్శాలకు ప్రాధాన్యత నిస్తున్నందుకు అతన్ని మన్నించటమెలా? విఫలంచెందటం కాదు, అతి సామాన్యమైన లక్ష్యాలుండటం నేరం.

ఇక నేను చెప్పే రెండో సంఘటన 'బచుమా సంఘటన'. మొదటి సంఘటన దిగ్భ్రాంతి గొలిపేదైతే ఈ రెండోది భయానకమైన సంఘటన. ఎంత భయంకరమైందో చెప్పేది వింటే తెలుస్తుంది. బచుమా, వార్ధాలో ఒక అస్పృశ్యుని కుటుంబంలో పుట్టిన 12 ఏళ్ళ పిల్ల (రాతప్రతిలోని పేరు ఇక్కడ చేర్చుతున్నాం – సంపాదకుడు) ఒక సాయంకాలం ఈ పిల్లని ఒక ముస్లిం సబ్ ఇన్స్పెక్టర్ నమ్మించి తన ఇంటికి తీసికెళ్ళాడు. వాడి ఇంట్లోనే ఈ అమాయకురాల్ని ముగ్గురు ముస్లింలు చెరిచారు. అందులో ఒకడు పోలీసు సూపరింటెండెంట్; రెండవ వాడు విద్యాశాఖాధికారి; మూడో వాడు లాయరు. ఈ ముగ్గురు ముస్లింలను కోర్టు విచారించి మొదటి ఇద్దరికి రెండు సంవత్సరాల కఠిన

కారాగారశిక్ష విధిస్తూ మూడో వాణ్ణి ఆ అమ్మాయి గుర్తించలేకపోవటం వల్ల వదిలేసింది. ఈ ఇద్దరూ హైకోర్టుకు అప్పీలు చేసుకుంటే అప్పీలును తిరస్కరిస్తూ శిక్షల్నే ఖాయం చేసింది. జైల్లోనుంచే వాళ్ళు గవర్నరు దయాదాక్షిణ్యాల కోసం వేడుకోలు పంపారు. కాని అది కూడా తిరస్కరించబడింది. ఇది కాంగ్రెస్ అధికారంలోకి రాకముందు జరిగింది. కాని కాంగ్రెస్ అధికారంలోకి వచ్చాక ఈ నేరస్థులు న్యాయ శాఖా మంత్రికి వేడుకోలు పంపారు. ముస్లిమే ఐన మంత్రిగారు ఈ ముస్లింలు అస్పృశ్య జాతి అమ్మాయిని బలాత్కారంగా చెరచటం తప్పుకాదని భావించి ఈ నేరస్థుల్ని విడుదలచేసేందుకు నిశ్చయించుకున్నారు. అందులో ఒకణ్ణి- విద్యాశాఖాధికారిని విడుదల చేశారు. అతనిప్పుడు ఒక ముస్లిం స్టేట్‌లో విద్యాశాఖలోనే ఒక పెద్ద ఉద్యోగంలో స్వేచ్ఛగా ఉన్నాడు. ఆ రెండో వాణ్ణి కూడా విడుదల చేయించే వాడే కాని ఈ లోగా అతని చేష్టలకు వ్యతిరేకంగా ఉద్యమం లేవటంతో తన పదవికి రాజీనామా చేయవలసి వచ్చింది. మంత్రి గారు చేసిన ఘనకార్యాన్ని నిరసించని వాడులేడు. కాని నోరు విప్పనివాడు గాంధీగారు మాత్రమే. ఈ మంత్రి గారికి వ్యతిరేకంగా గాంధీగారు ఒక్క నిరసన వాక్యమైనా పలకలేదు. కాకపోగా ఇంకా ఖాళీగానే ఉన్న పదవిలో అదే మంత్రిని కూర్చోబెట్టేందుకు జరుగుతున్న మంతనాల్లో తలమునకలై పోయాడు. ముగ్గురు ముస్లింలచే బలాత్కారానికి గురైన అస్పృశ్య జాతిపిల్ల బచుమాని గురించి ఒక్క ముక్కకూడా మాట్లాడని గాంధీని అదే నీ కూతురైతే ఇలానే చేస్తావా అని ఎవరికైనా అడగాలని పిస్తుంది. బచుమా కేసు తనకూతురు కేసులాంటిదేనని గాంధీగారు ఎందుకు భావించలేకపోయారు? దీనికి రెండు సమాధానాలు వున్నాయి. ఇందుకు ఒక కారణం గాంధీ అస్పృశ్యుడు కాకపోవడం. ఇలాంటి సమస్య తీవ్రత తెలుసుకోవాలంటే అందుకు అస్పృశ్యుల్లో జన్మించి వుండాలి. రెండవది, బచుమా కోసం ముస్లిం మంత్రిని ఖండించటం కాంగ్రెస్ రాజకీయమతమైన హిందూ ముస్లిం ఐక్యతను నాశనం చేయటమే అవుతుంది. గాంధీగారికి అస్పృశ్యుల యెడల ఉన్న సానుభూతికి ఆయన రాజకీయాలు ఆంక్షలు విధిస్తున్నాయన్నది ఇప్పటికైనా స్పష్టమేనా?

తన ఆత్మ ప్రబోధం ప్రకారం కూడా సానుభూతిచూపలేని మనిషిలో మిగిలే మంచి ఏముంటుంది?

# III

ఇక దేవాలయ ప్రవేశం గురించి. ఇది గాంధీగారు అస్పృశ్యులకిచ్చే మరో వరప్రసాదమని ప్రచారం జరిగింది. ఇది 1932 సెప్టెంబర్, 25న జరిగిన ఒక సమావేశంలో చేసిన తీర్మానం ఫలితం. హరిజన సేవక్ సంఘ్ పుట్టింది ఈ సమావేశంలోనే. హిందువులు అస్పృశ్యులకు ఎంత ఋణపడి ఉన్నారో కూడా ఈ తీర్మానాల్లోనే పేర్కొన్నారు. ఈ ఋణ పట్టీలోనే అస్పృశ్యులకు దేవాలయ ప్రవేశం లేకపోవటాన్ని నిరసించాలనే విషయం కూడా ప్రస్తావించబడింది.

అస్పృశ్యులకు దేవాలయ ప్రవేశం కల్పించాలనే విషయం తీర్మానాల్లో ఉన్నా దాన్ని వెంటనే అమలు పర్చాలని అస్పృశ్యులు పట్టుబట్టలేదు. దేవాలయ ప్రవేశాన్ని గురించి అస్పృశ్యుల్లో అంత ఉత్సుకతలేదు. దేవాలయ ప్రవేశాన్ని గురించి నా అభిప్రాయాల్ని గాంధీ గారు నన్నడిగినప్పుడు నా అభిప్రాయాన్ని ఒక ప్రకటనరూపంలోనే వెలిబుచ్చాను. అదే ఫిబ్రవరి 10, 1933న పత్రికలక్కూడా విడుదల చేశాను ఆ ప్రకటనే ఈ క్రింద పొందుపరుస్తున్నాను.:

## దేవాలయ ప్రవేశం పై ప్రకటన

దేవాలయ ప్రవేశ సమస్య సనాతనులకు, గాంధీగారికి సంబంధించిందే ఐనా దీనిమీద ఒక సెటిల్మెంట్ కుదరటానికి అస్పృశ్యులు కూడా ప్రముఖమైన పాత్ర నిర్వహించవలసి ఉంది. కాబట్టి ఏ అరమరికలు లేకుండా ఉండేందుకు వాళ్ళ అభిప్రాయాల్ని కూడా పరిగణలోకి తీసుకోవలసిన అవసరం ఉంది.

రంగా అయ్యంగారు ప్రస్తుతం తయారు చేసిన దేవాలయ ప్రవేశ బిల్లుకు దళిత వర్గాలు తమ మద్దతును ఇవ్వకలేకపోవచ్చు. ఈ బిల్లు లో ముఖ్యాంశం ఏమిటంటే ఏదైనా స్థానిక బోర్డుల్లోని అధిక జనాభా అభిప్రాయ సేకరణ ద్వారా అభీష్టాన్ని అస్పృశ్యుల దేవాలయ ప్రవేశానికి అనుకూలంగా ప్రకటిస్తే ఆ ప్రకటనను దేవాలయ ధర్మకర్తలు, మేనేజర్లు అమలు పర్చాలి. ఇది కేవలం మెజారిటీ సూత్రం మీద ఆధారపడినటువంటిది. ఇందులో విప్లవాత్మకమైన అంశమేదీ లేదు. సనాతనులు తెలివైన వారయితే ఏసణుగుడూ లేకుండా దీన్ని ఆమోదించాలి.ఇలాంటి బిల్లుకు దళిత వర్గాలు మద్దతు నివ్వకపోవటానికి

రెండు కారణాలున్నాయి. ఒక కారణం ఏమిటంటే ఇది అనకున్నంత తొందరగా దళితులకు దేవాలయ ప్రవేశాన్ని కల్పించేందుకు కాదు. మైనారిటీలు కోర్టుకెళ్ళి ట్రస్టీల మీద ఇంజక్షను తెచ్చి దళితుల్ని దేవాలయ ప్రవేశం కానీయకుండా చేయలేరనేది నిజమే. కాని ఈ క్లాజుతో సంతృప్తి పడి బిల్లును తయారు చేసిన వారికి కృతజ్ఞత తెలిపే ముందు మెజారిటీ అభిప్రాయం అస్పృశ్యుల దేవాలయ ప్రవేశానికి అనుకూలంగా ఉంటుందనే విషయాన్ని గురించి ఖచ్చితమైన నమ్మకం కుదరాలి. ఏవో భ్రమలకు లోనైతే తప్ప దేవాలయ ప్రవేశానికి అనుకూలంగామెజారిటీ అభిప్రాయం అంగీకరిస్తుందంటే సాధారణంగా ఎవరికీ నమ్మకం కుదరదు. దేవాలయ ప్రవేశాన్ని మెజారిటీ ప్రజలు వ్యతిరేకిస్తున్నారన్న నిజాన్ని బిల్లు తయారు చేసిన వ్యక్తి శంకరాచార్యతో జరపిన ఉత్తర ప్రత్యుత్తరాల ద్వారా స్పష్టం చేశాడు కూడా. బిల్లు ఆమోదం పొందాక మెజారిటీ ప్రజలు దేవాలయ ప్రవేశానికి ప్రతికూలంగా తమ ఆమోదాన్ని వెలిబుచ్చారని విశ్వసించటానికి బిల్లులో ఉన్న ఆధారలేమిటి? నాకు మాత్రం ఏమీ కనిపించటం లేదు. గురువాయూర్ దేవాలయం విషయంలో ప్రజాభిప్రాయ సేకరణ ఫలితాలు చూశారు గదా అని మీరు నన్నగడవచ్చు. కాని గాంధీ గారి ప్రాణాలకు లంకె పెట్టటం వల్ల ఫలితం అలా వచ్చింది. కాని సాధారణ పరిస్థితిల్లో రాదు. ఇలాంటి విషయాలను గురించి ఆలోచించేటప్పుడు గాంధీ గారి ప్రాణాల్ని పక్కకు పెట్టి చూడాలి. పైగా ఈ బిల్లు దేవాలయాల్లో అస్పృశ్యతను పాటించటాన్ని పాపకార్యంగా పరిగణించటంలేదు. అనేకమైన సాంఘిక దురాచారాల్లో అస్పృశ్యత కూడా ఒకటని కొట్టిపారేస్తుంది. అస్పృశ్యత చట్ట విరుద్ధమైన చర్యగా ఈ బిల్లు ప్రకటించలేదు. అందులో ఏమన్నా మంచి వుంటే అది కూడా మెజారిటీ అంగీకరిస్తేనే అమలవుతుంది. మెజారిటీ ప్రజలు పాటిస్తున్నారని పాపమూ, అవినీతి అంగీకారయోగ్యం కాకూడదు. పాపకార్యమూ, నైతిక హీనమూ ఐన అస్పృశ్యతను మెజారిటీ ప్రజలు పాటిస్తున్నప్పటికీ ఏ సంశయం లేకుండా దాన్ని నాశనం చేయాలని దళితులు భావిస్తున్నారు. కోర్టుల్లో ప్రజా వ్యతిరేకమైన సాంప్రదాయాల విషయంలో ఇలానే జరుగుతుంది. ఈ బిల్లు చేయలేనిది ఇదే. ఏదో మద్యపాన సంస్కరణ లాగా తాత్కాలిక ఉపశమనాన్నే తప్ప ఈ బిల్లు అస్పృశ్యతా నివారణను సీరియస్‌గా పరిగణించటం లేదు. ఈ రెండిటి మధ్య సామ్యాన్ని పేర్కొని ఆయన నిజంగా ఎంతగానో సంతోషించాడు. మద్యపాన నిషేధం కూడా ప్రజల ఇష్టా ఇష్టాలమీదే జరగాలనేది ఆయన అభిప్రాయం.

అస్పృశ్యత దురాచారాన్ని మద్యపానం కన్నా మిన్నగా చూడలేని ఈ దళిత మిత్రుడికి అంతగా కృతజ్ఞత చూపనవసరం లేదు. అస్పృశ్యత దురాచారాన్నిరూపుమాపటానికి కొన్ని రోజుల క్రిందటే మహాత్మా గాంధీగారు ఆమరణ నిరాహార దీక్షకు సిద్ధపడ్డారనే నిజాన్ని గమనించి వుంటే ఈపాప పంకిలాన్ని సంపూర్ణంగా రూపుమాపేందుకు రంగా అయ్యర్ కట్టుదిట్టమైన సంస్కరణకే బిల్లులో తావిచ్చాడు. దానిలో ఉన్న కార్యసాధక లక్షణాల్లో ఎన్ని లోపాలున్నప్పటికీ దళితుల కనీస కోర్కె-బిల్లు అస్పృశ్యతను పాపకార్యంగా గుర్తించాలనేదే. అస్పృశ్యతను పాపకార్యంగా భావించే మహాత్మా గాంధీ ఈ బిల్లుకు తన ఆమోదాన్ని ఎలా తెలిపారో నాకర్థం కాదు. ఇది దళితుల్ని ఏమాత్రం సంతృప్తిపరచేదిగా లేదు. ఈ బిల్లు మంచిదా, చెడ్డదా, సరిపోతుందాలేదా అనేది వేరే ప్రశ్న. ముఖ్యమైన విషయమేమిటంటే అసలు దళితులు దేవాలయ ప్రవేశాన్ని కోరుకుంటున్నారా లేదా అనేది. ఈ విషయాన్ని దళితులు రెండు కోణాల్నుంచి పరిశీలిస్తున్నారు. ఒకటి భౌతికపరమైన దృక్పథం. ఈ దృక్కోణం నుంచి దళితులు గమనించేదేమిటంటే వారి అభ్యున్నతికి ఖచ్చితంగా దోహదం చేయగలిగింది ఉన్నత విద్య పెద్ద ఉద్యోగాలు మంచిగా బ్రతికేందుకు మార్గాలు. ఇలా జరిగితే సాంఘిక జీవనంలో పై మెట్టుకు చేరి గౌరవ మర్యాదలు పొందుతామని, అప్పుడు వారి యెడల సనాతనుల దృక్పథంలో మార్పు వస్తుందనీ, ఒక వేళ ఏమార్పు రాకపోయినా వాళ్ళ భౌతిక జీవనానికి జరిగే హానికూడా ఏమీ ఉండదని దళితులు భావిస్తున్నారు. ఈ దృక్కోణం నుంచి పరిశీలించే దళితులు తమ శక్తి సామర్థ్యాలను దేవాలయ ప్రవేశం లాంటి డొల్ల విషయాలకు వినియోగించటం లేదు. వాళ్ళు దేవాలయ ప్రవేశం కోసం పోరాడడానికి ఇష్టపడకపోవటానికి మరొక కారణం ఉంది. అదే ఆత్మ గౌరవం. వెనకటికి భారత దేశంలో యూరోపియన్లు వెళ్ళే క్లబ్బులు, ఇతర గృహాల గేట్లకు 'కుక్కలకు, భారతీయులకు ప్రవేశం నిషేధం' అని బోర్డులు తగిలించేవారు. అదే విధంగా ఇప్పటికి కూడా హిందూ దేవాలయాల్లో బోర్డులున్నాయి. ఒక తేడా ఏమిటంటే హిందూ దేవాలయాల్లో తగిలించే బోర్డులమీద "హిందువులందరూ, వారి జంతువులు, కుక్కలతో సహా దేవాలయాల్లో ప్రవేశించవచ్చు. అంటరానివారుతప్ప" అని రాసి ఉంటుంది. ఈ రెండు కేసుల్లో ఒక రకమైన సమానత్వం కనిపిస్తుంది. కాని యూరోపియన్ల క్లబ్బులోకి ప్రవేశం కావాలని హిందువులెప్పుడూ దేబిరించి అడగలేదు. హిందువుల గర్వానికి తార్కాణంగా ఉన్న దేవాలయాల్లోకి ప్రవేశం కావాలని అస్పృశ్యులు

ఎందుకు దేబిరించి అడగాలి? తన భౌతిక జీవన సంక్షేమాన్ని వాంఛించే దళితుడు అడుగుతున్న ప్రశ్న ఇది. దేవాలయాలు తెరవటం తెరవకపోవటం అనేది మీ సమస్య. దానికోసం నేనెందుకు ఉద్యమించాలి? అని అడగటానికి అతను సిద్ధంగా ఉన్నాడు. 'మనుషుల్ని దేవాలయపు ప్రవేశం చేయనివ్వకపోవటం మంచీ, మర్యాదా కాదని మీకనిపిస్తే దేవాలయాలు తెరిచి పెద్దమనుషులనిపించుకోండి. హిందువుగానే ఉంటాను, పెద్దరికం ఎవరికి కావాలని మీరనుకుంటే దేవాలయాలు తెరవకుండా ఏట్లో దూకండి నాకనవసరం. అని అనటానికి దళితుడు సిద్ధపడుతున్నాడు.

ఇలాగే వాదించటం అవసరమని నేను భావిస్తున్నాను. ఎందుకంటే దళితులు తమ దయాదాక్షిణ్యాల కోసం ఎదురుచూస్తున్నారని భావిస్తున్న పండిట్ మదన్‌మోహన్ మాలవీయాలాంటి వ్యక్తుల మనస్తత్వాన్ని నా వాదన తాకాలనే. ఇక రెండవ దృక్పథం ఆధ్యాత్మికపరమైనటువంటిది. మత విశ్వాసాలు గలవారుగా దళితులు దేవాలయ ప్రవేశాన్ని కోరతారా, కోరరా? అదీ ప్రశ్న. ఆధ్యాత్మిక దృక్కోణం నుంచి వారు దేవాలయపు ప్రవేశాన్ని కోరతారు. కాని దాని వల్ల వారి భౌతిక జీవనం బాగుపడుతుందంటే నే వారలా కోరతారు. కాని వారితుది సమాధానం ఈ క్రింది ప్రశ్నలకు గాంధీగారు, హిందువులు ఇచ్చే సంజాయిషీ మీద ఆధారపడి ఉంటుంది.

దేవాలయ ప్రవేశాన్ని సమర్థించటానికి ప్రోద్బలం చేస్తున్నదేమిటి ? దేవాలయ ప్రవేశపు అంతిమ ధ్యేయం హిందువుల దొడ్లో ఉన్న దళిత వర్గీయుల సాంఘిక స్థాయిని పెంచటానికేనా? లేక అందుకు ఇది తొలిమెట్టా? తొలిమెట్టే ఐతే అంతిమ ధ్యేయం ఏమిటి ? దేవాలయ ప్రవేశమే చిట్ట చివరి ధ్యేయమైతే దళితులు దానికి ఎన్నటికీ మద్దతు నివ్వరు. నిజానికి దాన్ని తిరస్కరించటమే కాదు. హిందూ సమాజం తమను పూర్తిగా తిరస్కరిస్తుందని భావించి స్వేచ్ఛా స్వాతంత్రాల కోసం మరో చోట తమ దారి తామే వెదుక్కుంటారు. అలా కాక ఇది తొలి మెట్టే అయితే దానికి వాళ్ళు మద్దతు నివ్వచూపవచ్చు. అప్పుడు పరిస్థితి ప్రస్తుతం భారత రాజకీయాల్లో ఏం జరుగుతుందో దానికి ప్రత్యక్ష్య సామ్యమే అవుతుంది. భారతీయులందరూ దేశానికి డొమినియన్ స్థాయి కావాలని కోరారు. రాజ్యాంగం డొమినియన్ స్థాయిని కల్పించగలిగే స్థితిలో లేకపోయినా భారతీయులందరూ దాన్ని ఆమోదిస్తారు. ఎందువల్ల ? ఎందుకంటే ధ్యేయమైతే

నిర్వచించబడింది, ఒకేసారి రాకపోయినా దశలవారీగా నైనా వస్తుంది గనక. కాని బ్రిటిష్ వాళ్ళు డొమినియన్ స్థాయిని అంగీకరించక ఏవో కొద్ది సంస్కరణలను ఇవ్వజూపితే ఎవరూ అంగీకరించేవారు కారు. కాని ఇప్పుడు చాలా మంది ఈ సంస్కరణలనే అంగీకరించారు. అలాగే మహాత్మా గాంధీ, ఇతర సంస్కరణ వాదులూ వాళ్ళ ధ్యేయమేమిటో, అది దళితుల్ని హిందువుల్లో భాగంగా ఉంచుతూనే అభ్యున్నతికి ఎలా దోహదం చేస్తుందో వివరిస్తే దేవాలయపు ప్రవేశ విషయంలో తమ అభిప్రాయాలేవో వెలిబుచ్చే అవకాశం సానుకూలమయ్యేది. దళితుల ధ్యేయం ఏమిటో అందరికీ తెలిసే విధంగా, తద్వారా వారి అభిప్రాయాలేవో తెలుసుకునేందుకు ఇప్పుడే చెప్పొచ్చు. దళితులకు కావలసింది మతం. వాళ్ళకి అందరితో సమాన స్థాయిని ఇవ్వగలమతం. లౌకిక ధ్యేయాల వల్ల జనించే సాంఘిక దురాచారాలకు, మతపరమైన ధ్యేయాల వల్ల జనించే సాంఘిక దురాచారాలకు మధ్య గల తారతమ్యాన్ని వివరించి ఈ విషయాన్ని అపార్థాలకు అవకాశం లేకుండా స్పష్టం చేస్తాను. ఏరకం సాంఘిక దురాచారానికైనా సభ్య సమాజంలో స్థానం లేదు. కాని మతపరంగా సమర్థించబడే దురాచారమంత దుర్గంధ భూయిష్టమూ, దుష్టమూ అయిన దురాచారం మరొకటి లేదు. తాము చిక్కుకు పోయిన అసమానతా బంధాలనుండి దళితులు బయట పడే శక్తి లేనివారు కావచ్చు. కాని వారి దుస్థితిని,అసమానతను సమర్థించే మతాన్ని సహించకూడదని వాళ్ళు తెలుసుకున్నారు. ఒక వేళ హిందూ మతమే వాళ్ళ మతమైతే అది సాంఘిక సమానత్వంగా ఉండాలి. కేవలం అందరికీ దేవాలయ ప్రవేశం వల్ల హిందూ మత నిబంధనలను కొద్దిగా సవరించి సంస్కరించినందువల్ల అది సమానత్వాన్ని కల్పించే మతం కాబోదు. అలాంటి మతం చేయగలిగిందల్లా వాళ్ళని పరాయి వాళ్ళుగా కాకుండా సజాతీయుల్ని చేయటం మాత్రమే. ఈ రెండూ రాజకీయ రంగంలో బాగా నలిగిన మాటలు కాబట్టి వాడాను. అంతమాత్రం చేత వాళ్ళు ఎవరి కన్నా ఎక్కువగానీ తక్కువగా కాకుండా సమానంగా, స్వేచ్ఛగా ఉంటారని కాదు; ఎందుకంటే హిందూ మతం సాంఘిక సమానత్వ సిద్ధాంతాన్ని ఆమోదించదు. అంతే కాకుండా ప్రజల్ని బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులుగా స్థాయీ భేదాలు కల్పించి వాళ్ళు తక్కువ స్థాయిలో అసహ్యంగానూ, ఎక్కువ స్థాయిలో ధిక్కారంతోనూ బ్రతికేట్లుచేస్తుంది. ఒక వేళ హిందూ మతం సాంఘిక సమానత్వాన్ని సమర్థించే మతమే అయితే అందుకు దేవాలయ ప్రవేశానికి సంబంధించిన సవరణ ఒక్కటే చాలదు. దానికి కావలసింది చాతుర్వర్ణ సిద్ధాంతాన్ని లాగి బయటపడేయటమే. అసమానతలకు

పుట్టినిల్లైన కుల వ్యవస్థకు, అసమానతారూపమైన అస్పృశ్యతకు మూలం ఇదే. ఇది జరుగకుండా దళితులు దేవాలయ ప్రవేశాన్ని తిరస్కరిచంటమే కాదు. హిందూ విశ్వాసాన్నే తిరస్కరిస్తారు. చాతుర్వర్ణమూ, కులవ్యవస్థ దళితుల ఆత్మగౌరవంతో పొసగవు. ఈ రెండూ మూల స్థంభాలుగా ఉన్నంతకాలం దళితులు నిమ్న జాతుల వాళ్ళు గానే చూడబడతారు. దళితులు హిందువులమని చెప్పుకుంటే వాళ్ళ నోటితో వాళ్ళే తాము నిమ్నజాతి వాళ్ళమని అంగీకరిస్తున్నారన్న మాట. చాతుర్వర్ణాన్ని, కులవ్యవస్థను శాస్త్రాలనుండి తొలగించిననాడు వాళ్ళు తాము హిందువులమని చెప్పుకోవచ్చు. గాంధీగారికి గానీ, హిందూ సంస్కర్తలకు గానీ దీన్ని తమ ధ్యేయంగా చేసుకుని, దాని కోసం పని చేయగల ధైర్యం ఉందా? దీన్ని నేను ఎంతో ఆరాటంతో చెబుతున్నాను. కాబట్టే వాళ్ళు దీనికేమంటారో చూస్తాను. మహాత్మా గాంధీ, హిందువులూ దీనికంగీకరించకపోయినా దళితులకు ఇంతకన్నా తక్కువ చేస్తే సంతృప్తి పొంది దేవాలయ ప్రవేశానికి అంగీకరించరు. దేవాలయ ప్రవేశాన్ని ఆమోదించి దాని తోనే తృప్తి చెందటమంటే దౌష్ట్యంతో సహవాసం చేసినట్లే, మానవ వ్యక్తిత్వంలోని పవిత్రతను తాకట్టు పెట్టమే.

నావాదనకు వ్యతిరేకంగా గాంధీ, హిందూ సంస్కర్తలూ ప్రతిపాదించే వాదన ఒకటుంది. దళితులు ప్రస్తుతానికి దేవాలయ ప్రవేశాన్ని ఆమోదించటం చాతుర్వర్ణానికి వ్యతిరేకంగా అటు తర్వాత పోరాడటానికి అడ్డంకేమీ కాదుగదా అనవచ్చు వాళ్ళు. ఇదే వాళ్ళ లక్ష్యమైతే ముందు ముందు రాబోయే పరిణామాలకు మార్గం సుగమం చేసే ఉద్దేశ్యంలో వాళ్ళ వాదనను ఇప్పుడే ఇక్కడే స్పష్టం చేస్తాను. నా సమాధానమేమిటంటేః "ఇప్పుడు దేవాలయ ప్రవేశాన్ని అంగీకరించినందు వల్ల ముందు ముందు చాతుర్వర్ణం, కుల వ్యవస్థల నిర్మూలనకు, నేను చేసే ఉద్యమానికి ఆటంకం కాని మాట నిజమే. కాని అసలు ప్రశ్నేమిటంటే అలాంటి పరిస్థితుల్లో గాంధీ ఏ పక్షాన నిలుస్తాడనేది. ఒక వేళ ఆయన నాకు వ్యతిరేకంగా ఉన్నవారితో చేరతానంటే నేనిప్పుడు ఆయన పక్షాన ఉండను. ఒక వేళ నా పక్షాన్నే ఉండాలనుకుంటే ఆయన ఇప్పుడే నా పక్షాన చేరాల్సి ఉంటుంది.

నా మిత్రులు దివాన్ బహదూర్ ఆర్. శ్రీనివాసన్ దేవాలయ ప్రవేశాన్ని గురించి ఇదే చెప్పాడు. ఆయనేమన్నాడంటే —

"బాధల్లో ఉన్న వాళ్ళకు పనికి మాలిన సానుభూతి నిరర్థకం. నేను సమితికి మనవి చేసేదేమిటంటే దళిత వర్గాలకు హిందూ కులస్థుల సానుభూతి చిత్తశుద్ధితో కూడిందేనని విశ్వాసం కలగాలంటే హిందూ కులస్థులు తమ వర్గం ప్రజలపై – అమెరికా నీగ్రోల కోసం శ్వేత జాతీయులే తమ జాతి వారితో పోరాడినట్లు– దళితుల సంక్షేమం కోసం పోరాడాలి.

"తన కార్యకలాపాలు నిర్వహించేదుకు సమితి ఓ పెద్ద కార్యకర్తల సైన్యాన్ని తయారు చేయాలి. ఈ కార్యకర్తల నియామకాన్ని పెద్ద సమస్యగా పరిగణించనవసరంలేదు. నామటుకు నాకు దీనికొరకు సరియైన ఏజెన్సీ నొకదాన్ని నియమించటానికి ప్రాముఖ్యతనివ్వవలసి ఉంటుంది. డబ్బు చెల్లిస్తే పనులు చేయటానికి చాలామంది కార్యకర్తలే దొరుకుతారు. కాని అలాంటి వాళ్లు సమితి తలపెట్టిన మహత్కార్యానికి పనికిరారు. టాల్‌స్టాయ్ అన్నట్టు 'ఎవరు ప్రేమిస్తారో వారే సేవ చేయగలరు'. అది జరగాలంటే నా ఉద్దేశ్యంలో దళిత వర్గీయుల నుంచి కార్యకర్తలే సమర్థులు. అందుకని సమితి బాగా ఆలోచించి ఎవర్ని నియమించాలి, ఎవరిని నియమించకూడదు. అనే విషయాన్ని తెలుసుకోవాలని కోరుతున్నాను. సంఘ సేవంటే బలవంతపు పెళ్ళని విసుక్కునే దుష్టబుద్దులు దళితుల్లో లేరని కాదు కాని సాధారణంగా దళిత వర్గీయుల్నుంచే వచ్చే కార్యకర్తలు ఇలాంటి పనిని ప్రేమతో అంగీకరిస్తారు. సమితి విజయానికిది తప్పనిసరి.

"మరో విషయం, వర్గాలు, ఉద్దేశాలు అనే అరమరికలు లేకుండా ఎలాంటి సంఘ సేవనైనా చేస్తున్న కొన్ని సంస్థలు అస్పృశ్యతా వ్యతిరేక సమితి చేసే సేవ గ్రాంట్లు ఇస్తే తామే చేస్తామని ముందుకు వస్తాయి. వ్యాపార పద్ధతిలో జరిగే ఇలాంటి లావాదేవీల పని మేలు చేసేదికాదు. ఏ సంస్థలోనైనా చూడాల్సింది తమ ముందున్న బృహత్కార్య నిర్వహణ మీద ఏకాగ్రత కలిగి వుందా లేదా అనేదే. తమకు అప్పగించిన బృహత్కార్యాన్ని ఉత్సాహపూరితంగా అంగీకరించే 'సంకుచిత' మనస్కులు గల వ్యవస్థలు, సంస్థల్నే మనమిప్పుడు కోరాల్సింది. ఈ మహత్కార్యాన్ని మనమిప్పుడెవరికైనా అప్పగించవలసి వస్తే కేవలం దళితుల సంక్షేమానికే అంకితమైన వారికి మాత్రమే అప్పగించాలి.

అది హిందూ దేవాలయాలు తెరిచి అస్పృశ్యుల్ని ఆహ్వానించినట్లు అనిపించుకోదు. ఇందులో మరో అంశం వుంది. నిజాన్ని తెలుసుకోవాలంటే దాన్ని కూడా పరిగణనలోకి తీసుకోవాలి. లండన్‌లో రిట్జ్ హొటల్ని సమస్త ప్రజలకి తెరిచివుంచినట్లు అస్పృశ్యులకు దేవాలయాల్ని తెరవచ్చు. లండన్‌లో రిట్జ్ హొటల్ అందరికీ ప్రవేశం లేదనే నిజం మనందరికి తెలుసు. అందులోకి పోగల సత్తా ఉన్న వాళ్ళకే అందులో ప్రవేశార్హత ఉంది. అలాగే దేవాలయాల్లో ప్రవేశించగల సత్తా ఉన్న అస్పృశ్యులకే అందులో ప్రవేశముంటుంది. దేవాలయాల్లో ప్రవేశానికి దెబ్బలుతినటం, సంఘ బహిష్కరణ లాంటివే మూల్యం అయితే నిజానికి దేవాలయాలు మాటవరసకు తెరిచినా మూసి వేసిందాన్తో సమానమే. కొట్టటం, సంఘ బహిష్కరణ అనేవి హిందువులకు సర్వసామాన్యం. దేవాలయాల్లో ప్రవేశించ ప్రయత్నించే అస్పృశ్యుల్ని వాళ్ళు దెబ్బలు కొట్టరని, సంఘ బహిష్కరణకు గురిచేయరని అనుకోవటంలో అనుమానాలే అక్కరలేదు. ఇలాగే జరిగితే ఇది పచ్చి మోసమే.

ఈ రెండు వర్గాల్లో ఏ వర్గం వాళ్ళు ఎక్కువ సంఖ్యలో ఉన్నారనేది చెప్పటం కష్టం. కాని కొన్ని ఆధారాల ననుసరించి ఊహించవచ్చు. ప్రస్తుతం భారత దేశంలో రెండు రకాల హిందువులున్నారు. ఒకరకం రాజకీయాల కన్నా మతానికే ఎక్కువ ప్రాధాన్యత నిచ్చే సనాతన హిందువులు; రెండవ రకం మతం కన్నా రాజకీయాలకే ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చేవారు. మొదటి రకం వాళ్ళు రాజకీయాలు లేని కారణంగా వాళ్ళ భావాలు ఎంత తప్పైనా వాటినే అంటిపెట్టుకొని ఉంటారు కాబట్టి, నిజాయితీపరులే. రెండవ వర్గానికి రాజకీయాలున్నాయి గనక వాళ్ళ రాజకీయ ప్రయోజనాలు నెరవేర్చుకోవలసిన దృష్ట్యా నిజాయితీని కోల్పోయి స్వార్థపరులుగా మిగులుతారు. మొదటి వర్గం వాళ్ళు అస్పృశ్యులకు దేవాలయాలు మూసి ఉంచటంలో నిజాయితీ ఉన్నప్పటికీ ప్రజల దృష్టిలో హిందువులకు చెడ్డపేరు తెచ్చి పెట్టేది కావటంవల్ల రాజకీయంగా సరియైంది కాదు. రెండో వర్గం వాళ్ళు పేరుకు మాత్రం దేవాలయాలు తెరిచి తర్వాత వాళ్ళే మూసేస్తారు. ఇది రాజకీయంగా చాలా భయంకరం. ఇదెలా ఉంటుందంటే ప్రపంచం దృష్టిలో దేవాలయాలు తెరిచినట్లే ఉంటుంది. కాని లోపల జరిగేది దేవాలయాల మూతే. సనాతన హిందువుల కన్నా కాంగ్రెస్ హిందువులే సంఖ్యా బలం కల వారు. అలాంటప్పుడు జరిగేది నేను చివర్న చెప్పిందే.

నిజంగా తెరపబడ్డ దేవాలయాల సంఖ్య చాలా తక్కువ. తప్పుడు ప్రచారం మాత్రం చాలా ఎక్కువని 1934లో కేంద్ర శాసన సభలో రంగా అయ్యర్ గారు ప్రవేశ పెట్టిన దేవాలయ ప్రవేశ బిల్లుకు పట్టిన దుర్గతి బట్టి తెలుసుకోవచ్చు. ఆ బిల్లును గురించి తర్వాత చెబుతాను.

దీంతో ఈ విషయాన్ని ముగించే వాణ్ణే.కాని గాంధీ గారు హిందువుల్లో ఆధ్యాత్మిక చైతన్యం వచ్చిందని వాదిస్తూ తిరువాన్కూర్ దేవాలయ ప్రవేశపు ప్రకటన మీదనే కూర్చున్నారు. కాబట్టి దీన్ని గురించి కూడా మాట్లాడాలని అనుకుంటున్నాను.

దేవాలయ ప్రవేశం విజయవంతమైందా లేదా అనే విషయాన్ని తెలుసుకోవటం తెరిచిన దేవాలయాల సంఖ్యను బట్టి సాధ్యం కాదు. ఈ చర్య వెనకాల ఉద్దేశ్యం ఏమిటో మాత్రమే అందుకు వీలుకలిగిస్తుంది. ఈ ఉద్దేశ్యం ఆధ్యాత్మికపరమైనదా? అనేదొక పరీక్ష. దేవాలయ ప్రవేశం ఆధ్యాత్మిక చర్య కాదంటున్నాను. అది రాజకీయ తంత్రం.

గాంధీగారు ఆధ్యాత్మిక చింతనా ప్రేరణతోనే ఈ పని చేస్తున్నారా? హిందువుల్ని ప్రబోధిస్తూ గాంధీగారు ఇలా అన్నారుః

"నేను మీకు చేస్తున్న విన్నపం నా హృదయాంతరాళంలో చెలరేగుతున్న బాధల్లోంచి వచ్చింది. నేననుభవిస్తున్న బాధని, సిగ్గును మీరూ పంచుకుని నాతో సహకరించండి. సనాతన ధర్మాన్ని పునఃప్రతిష్ఠించి దాన్ని లక్షలాది ప్రజలజీవితాల్లో యదార్థంగా జీవింపజేయటమే తప్ప నాకు వేరే ధ్యేయం లేదు"

ఈ హృదయాంతరంగంలోని బాధ పూనా ఒడంబడిక తర్వాత పుట్టింది. పూనా ఒడంబడికకు ముందు గాంధీ గారు దేవాలయ ప్రవేశ సమస్య గురించి ఆలోచించారా? పూనా ఒడంబడికకు పూర్వం గాంధీ గారి అభిప్రాయం వేరు. ఆ అభిప్రాయం పూనా ఒడంబడిక జరగటానికి, హిందువులకు తన నివేదనను తెలపటానికి కొద్ది కాలం ముందే ఆయన వెలిబుచ్చాడు. దాంట్లో నుంచే, నేను...... "గాంధీ శిక్షణ్" సంపుటిII పేజీ 132లో ఆ అభిప్రాయం పేర్కొనబడింది. అస్పృశ్యులకు ప్రత్యేక దేవాలయాలు నిర్మించాలనేదే ఆ అభిప్రాయం.

గాంధీ గారిలా అన్నారు :

" అంత్యజులకు (అస్పృశ్యులకి) అన్ని దేవాలయాల్లో ప్రవేశించటం ఎలా సాధ్యం? హిందూ మతంలో కులమూ, ఆశ్రమ ధర్మమూ శాసనంగా ఉన్నంత కాలం ప్రతి హిందువూ ప్రతి దేవాలయంలోనూ ప్రవేశించనంత కాలం ప్రస్తుతం అది అసాధ్యం"

కాబట్టి దేవాలయ ప్రవేశమనేది ఆయన స్వంత బుద్ధి కాదు. ఆధ్యాత్మికమూ కాదనేది స్పష్టమే. ఈ తీవ్రమైన బాధంతా అస్పృశ్యులు అకస్మాత్తుగా ఒకేసారి ప్రత్యేక గణాల్ని డిమాండ్ చేసినందువల్ల పుట్టిందే. ప్రత్యేక ఎన్నిక గణాల్లో ఉన్న అంతః సూత్రాలు చూసి గాంధీగారు భయపడిపోయాడు. ఈ సూత్రాలు అమలు పరిస్తే అంతిమంగా అస్పృశ్యులు హిందువుల్లోంచి విడిపోవటమే అవుతుందని ఆయన అనుకున్నాడు. దీన్ని ఎదుర్కొనేందుకే మనసు మార్చుకుని దేవాలయ ప్రవేశ ఉద్యమాన్ని మొదలు పెట్టాడు. గాంధీగారిది రాజకీయ ఉద్దేశ్యమేగాని ఆధ్యాత్మికమైనది ఏమాత్రం కాదు. గాంధీ గారు కేవలం మనసు మార్చుకున్నారనే ఒక్క అంశం ఆధారంగానే నేనీ విషయాన్ని ముగించదల్చ లేదు. మరెన్నో ఆధారాలున్నాయి మద్దతుగా.

మొదట గురువాయూర్ దేవాలయ సత్యాగ్రహం గురించి పేర్కొంటాను. దీన్ని కెల్లప్పన్ అనే హిందువు గురువాయూర్ దేవాలయం లో అస్పృశ్యులకు ప్రవేశం కల్పించాలని కోరుతూ చేపట్టాడు.

ఈ సంఘటనకు సంబంధించి కొన్ని విషయాలు ఆసక్తిదాయకంగా ఉంటాయి.

ముఖ్యంగా గమనించవలసిందేమిటంటే సనాతన హిందువులు ఈ విషయంలో తనను ప్రశ్నించినప్పుడు గాంధీగారు ప్రర్శించిన ధోరణి. రాజీకి సంబంధించిన షరతులు ఈ క్రింద పేర్కొన్న విధంగా వున్నాయి (టైమ్స్ ఆఫ్ ఇండియా, జనవరి3, 1933): పత్రికల్లో ప్రచురించిన మాటల్లోనే చెబుతాను.

"రోజులో కొన్ని గంటలు గురువాయూర్ దేవాలయం హరిజనులకోసం, ఇంకా హరిజనులు ప్రవేశించినా అభ్యంతరం తెలపని హిందువులకోసం తెరిచి ఉంచి మిగతా సమయంలో హరిజనులు ప్రవేశిస్తే అభ్యంతరం చెప్పే సనాతన హిందువులకు తెరిచి ఉంచాలి. దీనికి అభ్యంతరాలేమీ ఉండనవసరం లేదు. గురువాయూర్‌లో కృత్తికా ఏకాదశి

పర్వ దినాన హరిజనులు, హిందువులు కలగాపులగంగానే దేవాలంయంలో ప్రవేశిస్తారు. తద్వారా దేవాలయాన్ని, విగ్రహాల్ని శుద్ధి చేస్తారు."

అలాగైతే హరిజనులు ప్రవేశించిన తర్వాతదేవాలయాన్ని ప్రతిరోజు శుద్ధి చేయవలసి ఉంటుందా అని అడిగిన ప్రశ్నకు గాంధీ ఇలా సమాధానమిచ్చాడు.

"వ్యక్తిగతంగానేను శుద్ధికి వ్యతిరేకిని. కాని అభ్యంతర పెట్టే వాళ్ళ ఆత్మకు అది శాంతి చేకూర్చగలిగితే శుద్ధిని నేను వ్యతిరేకించను. ఒకవేళ శుద్ధికే అంత విలువుంటే ప్రవేశాలతో నిమిత్తం లేకుండా హరిజనులు శాస్త్రాలనే పాటిస్తే రోజూ దేవాలయం ఎన్నో సార్లు అపరిశుద్ధమౌతుంది. అన్ని సార్లూ శుద్ధి చేయవలసి వుంటుంది."

ఇది ఆధ్యాత్మికధోరణి కాదు: ఇది స్వచ్ఛమైన వ్యాపార ధోరణి. దీన్ని గాంధీ గారే అంగీకరించారు. ఆయన ఇంకా ఏమని ప్రతిపాదించారంటే అస్పృశ్యులు హిందూ కులస్థుల మధ్య ఉన్న అగాధాన్ని ఇది పూడుస్తుందనుకుంటున్నారా అని అడిగినప్పుడు గాంధీగారు ఇలా అన్నారుః

"హరిజనుల వైఖరి ఎలా ఉండాలంటే 'ఒకవేళ నా ప్రవేశానికి ఎవరైనా అభ్యంతరంచెబితే దేవాలయ ప్రవేశానికి నాకు అనుమతి ఉన్న రోజుల్లో హిందువులతో కలిసి దేవాలయాని వెళ్ళే నా న్యాయబద్ధమైన హక్కు పటిష్టంగా ఉన్నంతవరకు, దాన్ని వాళ్ళు మన్నించినంత రకు వాళ్ళ అభ్యంతరాన్ని నేనూ మన్నిస్తాను' అని హరిజనులు అనుకోవాలి".

ఆత్మ గౌరవమున్న ఏ అస్పృశ్యుడైనా గాంధీ చెబుతున్న దాన్ని అంగీకరిస్తాడేమోనాకు తెలియదు. ఈ షరతుల్తో మానవమాత్రులు మెసలనప్పుడు కుక్కలూ, పిల్లులూ కూడా దేవాలయ ప్రవేశం చేయవచ్చు. రెండు వర్గాల ప్రజల్ని సంతృప్తి పర్చేందుకు దైవసన్నిధిని స్థల, కాలాంశాల ఆధారంగా విభజించటం అనేదే చాలా ఘోరమైన ఆలోచన. అందరూ ఒకే దేవాలయంలో వేరు వేరుగా ప్రార్థనలు జరపటం, ఒకే చోట అందరూ కలిసి ప్రార్థనలు జరపటానికి గల తారతమ్యాన్ని గాంధీగారు విస్మరించారనేది విదితం. దేవాలయ ప్రవేశం ఆధ్యాత్మిక సంబంధమే అయితే అందరూ కలిసి ఒకే చోట ప్రార్థన జరపాలి. అలా కాక వేరు వేరుగా ప్రార్థనలు జరపటానికి అంగీకరించటమంటే ఒక వర్గం మరొక్క వర్గాన్ని అసహ్యించుకునేందుకు అవకాశమిస్తూనే వాళ్ళమధ్య సామరస్యాన్ని సృష్టించటానికి

ప్రయత్నించటమే. ఇక రెండో పద్ధతి ఇరువర్గాల మధ్య అసహ్య భావం లేదని భావించి ఎల్లరిలో మానవతా లక్షణం ఒకటేనని అంగీకరిస్తుంది.

దీనివల్ల తెలిసేదేమంటే గాంధీగారు ఆధ్యాత్మికాంశాలను పరిగణనలోకి తీసుకోలేదనే. అస్పృశ్యులు ఎప్పుడు హిందువుల గుంపులోంచి బయటపడిపారిపోతారోనని, అలా పోకుండా చేయాలని ఆయన మహా తొందరలో ఉన్నాడు.

గాంధీగారి భావాలకు ఆధ్యాత్మికాంశాలతో సంబంధం లేదనే విషయం నిర్ధారించే మరో సాక్ష్యం రంగా అయ్యర్ గారి దేవాలయ ప్రవేశపు బిల్లు యెడల ఆయన ప్రవర్తన తీరే. ఆయన హృదయాంతరాళంలోని బాధ కేవలం అందమైన మాటే తప్ప వాస్తవం కాదని ఇది నిరూపిస్తుంది.

దేవాలయ ప్రవేశపు బిల్లు నిర్మాత రంగా అయ్యర్‌ని ఈ బిల్లు విషాదకర పరిస్థితుల్లోకి ఎలా నెట్టిందో తెలియాలంటే దాని చరిత్ర కొంతైనా తెలుసుకోవటం అవసరం.

కొత్త రాజ్యాంగం అమలులోకి వచ్చాక రెండు ప్రాంతీయ కాంగ్రెస్ ప్రభుత్వాలు రెండు చట్టాల్ని పాస్ చేశాయి. అవి ఒకటి బొంబాయిలోనూ, మరొకటి మద్రాస్‌లోనూ పాసయ్యాయి. ఈ చట్టాల్లో ఏమాత్రం పసలేదు. దేవాలయాలు తెరవాలని ఆశాసనాలు ప్రకటించలేదు. ధర్మకర్తల కిష్టమైతే మాత్రమే తెరవ్వచ్చని పేర్కొనటంవల్ల ఈ రెండు శాసనాలూ కేవలం చిత్తు కాగితపు ముక్కలుగా మిగిలాయి. ఈ శాసనాన్ని చేయించిన మద్రాసు ప్రధాన మంత్రి రాజగోపాలాచారిగారు. ఆయనకు కాంగ్రెస్ లో అగ్రస్థానముంది. ఎంత అగ్రస్థానమంటే ఆయన్ని 'డిప్యూటీ మహాత్మా' అంటారు. బిల్లులోని తిరకాసును ఎవరైనా వివరించగలిగితే దాన్ని ప్రతిపాదించిన మనిషిమనస్తత్వమూ, దాని వెనక దన్నుగా ఉన్న గాంధీగారి మనస్తత్వమూ తెలుసుకోవచ్చు.

తిరువాన్కూర్ దేవాలయ ప్రవేశానికి వద్దాం. దేవాలయాన్ని అస్పృశ్యుల కొరకు తెరిచేందుకు నవంబర్ 12,1936న మహారాజాగారు చేసిన ప్రకటన ఒక ఆడంబరమైన డాక్యుమెంటు. అది ఇలా ఉంది:

"మనమతంలోని సత్యాన్ని, మాన్యతను సంపూర్ణంగా అంగీకరించి, అది దైవమార్గమనీ, సంపూర్ణమైన సహనశీలమనీ విశ్వసిస్తూ, అది పనిచేస్తున్న తీరులో తరతరాలుగా ఎన్నో

దశాబ్దాలుగా మారుతున్న కాలానికి అన్వయింపుతో అలరారుతున్నదని భావిస్తూ, హేతువు వల్లగానీ, కులం పుట్టుక వల్లగానీ, హిందూ మతపు విశ్వాసాన్ని ఎవరికీ తిరస్కరించకుండా శుద్ధిని, స్వచ్ఛతను సాధించేందుకు, కర్మ కాండలను జాగ్రత్తగా జరిపేందుకు మాచే కాలానుగుణంగా ప్రకటించబడే ఆయా నియమనిబంధనలకు భంగం కలగని రీతిలో, మతపరంగా హిందువుగా పుట్టిన ప్రతి వ్యక్తికి మాచేత మాప్రభుత్వం ఆధ్వర్యంలో నిర్వహించబడే దేవాలయాల్లో ప్రవేశంపై ఆంక్షలు ఉండబోవని ఇందుమూలంగా నిర్ణయించి, ప్రకటించి, విధించి, ఆదేశిస్తున్నాం".

ఈ ప్రకటనలో ఉన్న ఆధ్యాత్మికత ఏమిటి ?

ఈ ప్రకటనని తిరువాన్కూర్ మహారాజాగారు తన పేరుతో విడుదల చేశారు. కాని దాని వెనక ఉన్నది ప్రధాన మంత్రి సర్‌సి.పి.రామస్వామి అయ్యర్. మనం తెలుసుకోవాల్సింది ఆయన ఉద్దేశ్యాల్ని. 1933లో కూడా సర్ సిపి.ఆర్. తిరువాన్కూర్ ప్రధానమంత్రే. 1933లోనే గాంధీగారు గురువాయూర్ దేవాలయంలోకి అస్పృశ్యుల ప్రవేశం కోసం పోరాటం చేస్తున్నారు. దేవాలయం ప్రవేశ సమస్యలో పాలుపంచుకున్న చాలా మందిలో సర్‌సి.పి. రామస్వామి అయ్యర్ ఉన్నాడు. ఇప్పుడిదెవరికీ గుర్తున్నట్టు లేదు. ఎందుకంటే పై ప్రకటన చేయటానికి మహారాజాగారిపై వత్తిడి చేయటానికి ఆయన్ని ప్రేరేపించిందేమిటో తెలియాలంటే ఇది గుర్తుంచుకోవటం అవసరం. 1933లో ఈ సమస్య గురించి సర్‌సి.పి. రామస్వామి అయ్యర్ వైఖరి ఏమిటి? ఈ క్రింద పేర్కొనబడ్డ ఆయన పత్రికా ప్రకటనలో అది స్పష్టమౌతుంది. (ఈ ప్రకటన "వాట్ కాంగ్రెస్ అండ్ గాంధీ హేవ్ డన్‌టు ది అన్‌టచబుల్స్"పేజీ 318లోది. వ్రాతప్రతిలో ఇది లేదు- సంపాదకుడు)

"వ్యక్తి గతంగా కుల నిబంధనల్ని నేను పాటించను. ప్రస్తుతం దేవాలయాల్లో పూజా పునస్కారాలు, వాటి వివరణలు దైవాదేశాలపై ఆధారపడ్డాయని విశ్వసించే మనుషుల మనస్సులో ఈ విషయాన్ని గురించి – అంతగా తెలివైనవి కాకపోయినా దృఢమైన అభిప్రాయాలున్నాయని గుర్తించాను. పరస్పర సర్దుబాటు చేసుకోవటం ద్వారానూ, హిందూ మతస్థులైన సంఘనాయకులలో హిందూ సమాజం ఐక్యతను సాధించవలసిన తాత్కాలిక పరిస్థితుల్ని అర్థం చేసుకునే జాగృతి కలిగినప్పుడు మాత్రమే ఈ సమస్యకు శాశ్వత పరిష్కారం దొరుకుతుంది.

"షాక్ ట్రీట్‌మెంట్ ఇందుకు సమాధానం కాజాలదు. ఈ విషయంలో ప్రత్యక్ష చర్య ప్రమాదకరం. దేవాలయ ప్రవేశాన్ని పంక్తి భోజనాల్లాంటి సమస్యతో విభేదించి చూడాలని గాంధీగారు చెబుతున్న దాంతో నేను అంగీకరించలేకపోవటం నా దురదృష్టం. దళిత వర్గాల ప్రస్తుతావసరం సామాజిక,ఆర్థిక సంక్షేమమనే అంబేద్కర్ భావాలతో నేనేకీభవిస్తున్నాను."

1933లో సర్‌సి.పి.రామస్వామి అయ్యర్‌ను ఆధ్యాత్మిక విచక్షణ కదిలించలేదని ఈ ప్రకటన తెలుపుతుంది. 1933 తర్వాతనే ఆధ్యాత్మిక విచక్షణకు కాళ్ళొచ్చాయి. ఈ ఆధ్యాత్మిక ధోరణి గురించి 1936లో ఆలోచనలు రావటానికి ప్రత్యేకమైన కారణాలేమైనా ఉన్నాయా? ఒక విషయం గుర్తు తెచ్చుకుంటే మాత్రమే ఈ ప్రశ్నకు సమాధానం లభిస్తుంది. అదేమిటంటే 1936లో తిరువాన్కూర్‌లో ఇళవ (Ezhavas) సమాజం మతమార్పిళ్ళ గురించి ఒక సమావేశాన్ని ఏర్పాటు చేసింది. 1935లో ఎవాలాలో నేను ఈ విషయాన్నే లేవనెత్తాను. ఇళవ కులస్థులు మలబారంతా వ్యాపించిన అస్పృశ్యులు. విద్యా ఆర్థిక విషయాల్లో బాగా అభివృద్ధి చెందారు. వీళ్ళు చాలా బలమైన వర్గం. తమ రాజకీయ, ఆర్థిక, మతపరమైన హక్కుల కోసం ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాటం చేస్తున్నారు. సంఖ్యాపరంగా కూడా ఇళవ పెద్ద సమూహమే. ఇంత పెద్ద సంఖ్యలోవున్న ఇళవలు విడివడి పోవటం హిందూ మతానికి చావు దెబ్బ. వీళ్ళ సమావేశం అలాంటి ప్రమాదాన్ని ముందుకు నెట్టుకొచ్చింది. సర్‌సి.పి.రామస్వామి వైఖరిలో మార్పు తెచ్చింది ఇదీ. ఆధ్యాత్మిక అనేది సాకు మాత్రమే, లక్ష్యం కాదు.

ఈ ప్రకటన - పరిస్థితుల్ని ఏ మేరకు మార్చింది, ఏమేరకు కేవలం ఒక నాటకంగా మిగిల్చింది? తిరువాన్కూర్‌లో లభించే వివరాల వల్ల ఈ విషయాలు తెలుసుకోవటం సాధ్యం కాదు. మద్రాసు శాసన సభలో మలబారు దేవాలయ ప్రవేశ బిల్లుపై జరిగిన చర్చల్లో సర్‌సి.టి. పన్నీర్ సెల్వం చెప్పిన తిరువాన్కూర్‌కు సంబంధించిన వివరాలు నిజమే అయితే ఇది మొత్తం ఒక ఫార్స్ అని తేలుతుంది. పన్నీర్ సెల్వం ఇలా చెప్పాడుః

"ప్రతిపాదనకు మద్దతుగా ప్రధాని చేసిన ఒక వాదన ప్రకారం తిరువాన్కూర్‌లోని దేవాలయాలన్నీ అస్పృశ్యుల కోసం తెరిచేశారు. అధికారంగల ఒక మహారాజు ఆజ్ఞ ద్వారా ఆపని జరిగింది. కాని అక్కడ అదెలా పని చేస్తున్నదో? మనకు లభించిన సమాచారం

ప్రకారం మొదట్లో కాస్త ఉత్సాహం కనబర్చినా తర్వాత అది కాస్తా చప్పబడిపోయి హరిజనులు దేవాలయాల్లోకి పోవటం మానివేశారని, హరిజనులు ప్రవేశించటానికి ముందు దేవాలయాల్లోకి వెళ్ళిన వాళ్ళు కూడా ప్రస్తుతం వెళ్లటం లేదని తెలుస్తున్నది. ప్రభుత్వం తలపెట్టిన కార్యం తిరువాన్కూర్‌లో విజయవంతమైందా అని ప్రభుత్వాన్ని కనుక్కుని ఆయన మనకు చెబుతాడు."

బిల్లు తృతీయాధ్యాయ ంలో సర్‌పన్నీర్ సెల్వంచేసిన ప్రకటన ఎందరినో ఆశ్చర్య చకితుల్ని చేసి ఉంటుంది. ఆయన ఇంకా ఇలా అన్నాడు.

" కొన్ని ప్రయివేటు దేవాలయాల్ని సీనియర్ మహారాణి గారికోసం దేవాలయ ప్రవేశపు ప్రకటన నుంచి మినహాయించారా అనే విషయాన్ని నేను తెలుసుకోగోరుతున్నాను. దానికి కారణం ఏమిటి ?"

ప్రధాని ఈ విషయాల్ని సవాల్ చేయలేదు.ఈ విషయాల్ని చాలెంజ్ చేయటం కష్టమే. ఇవి ఎదురులేని విషయాలే. అయితే మలబారు ప్రవేశపు బిల్లును ఆధ్యాత్మిక కార్యమని ఎంత తక్కువ చెబితే అంత మంచిది.

దేవాలయ ప్రవేశ ఉద్యమాన్ని గురించి కొందరు అస్పృశ్యులు వెలిబుచ్చుతున్న రయాల్ని చెప్పకుండా ముగించటం సమసంజసం కాదు. అది కేవలం ఒక సంఘ సంస్కరణ ఉద్యమం మాత్రమేనాలేక అదొక వ్యూహమా?

విద్యారంగంలోనూ, రాజకీయ రంగంలోనూ అస్పృశ్యులకు కొన్ని ప్రత్యేక హక్కులు లభించటానికి ఆధారం వాళ్ళు అస్పృశ్యులు కావటమే. ఒక వేళ వాళ్ళు అస్పృశ్యులు కానట్లైతే వాళ్ళకున్న ఈ ప్రత్యేక హక్కుల్ని ఎప్పుడో ఛాలెంజ్ చేసేవారు. అస్పృశ్యులు కాకపోతే వాళ్ళు దరిద్రులే. కాని అస్పృశ్యులు కాకుండా కేవలం దరిద్రులే అయితే అస్పృశ్యులుగా వాళ్ళనుభవిస్తున్న ప్రత్యేక హక్కులు వాళ్ళకుండేవి కావు. దేవాలయ ప్రవేశ సమర్థకుల ప్లానేమిటి? కేవలం దేవాలయాల్ని తెరవటమేనా, లేకపోతే ఈ ప్రత్యేక హక్కుల్ని తీసేసుకోవటమనే పన్నాగమా? ఆలోచనా పరులైన ఎంతో మంది అస్పృశ్యుల మనస్సులోని భయమిది. ఈ భయాలు నిజమేనని తిరువాన్కూర్ సంఘటన వల్ల స్పష్టమవుతూనేవుంది. "ఆల్ ట్రివాన్కూర్ పులయార్ చామరార్ ఐకియ సంఘం"

బాధ్యుడు, నాతో తరచుగా ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపే వ్యక్తి ఒకాయన నవంబర్,1938న నాకు ఈ క్రింద పేర్కొన్న ఉత్తరం రాశాడు.

మయ్యానాడు
24.11.1938
క్విలన్

డా॥ అంబేద్కర్ గారికి
బొంబాయి

గౌరవనీయులైన అయ్యా!

ఈ క్రింద పేర్కొంటున్న కొన్ని వాస్తవాలను మీ దృష్టికి తెచ్చి మీనుంచి అమూల్యమైన సలహా పొందాలని నాకెంతో ఉత్సాహంగా ఉంది. తిరువాన్కూర్ స్టేట్‌లో హరిజన ప్రజానీకానికి నాయకుడుగా ఉంటూ ఇక్కడ హరిజనులు ఎన్ని సాధకబాధకాల్ని తట్టుకుని బాధపడుతున్నారో మీకు తెలపవలసిన బృహద్బాధ్యత నా పైన ఉన్నదని అనుకుంటున్నాను.

1. మహామహులైన మహారాజావారు జారీ చేసిన దేవాలయ ప్రవేశ ప్రకటన హరిజనులకు నిజంగా ఒక వరమే. కాని దేవాలయ ప్రవేశం తప్ప సామాజిక దుర్భలత్వాన్ని ఇక్కడి హరిజనులు అనుభవిస్తున్నారు. ముందు ముందు మాకు లభించబోయే రాయితీలన్నింటికి దేవాలయ ప్రవేశపు ప్రకటన అడ్డుకట్టవేసింది. ఇక హరిజనాభ్యుదయానికి ప్రభుత్వం ఏకార్యమూ చేపట్టదు.

2. ఇక్కడున్న 15 లక్షల మంది హరిజనుల్లో కొద్ది మంది పట్టభద్రులూ, ఒక ఆరుగురు పోస్టు గ్రాడ్యుయేట్లు, 50 మంది స్కూల్ ఫైనల్ పాసయినవారు. ఉన్నారు. ప్రభుత్వం పబ్లిక్ సర్వీస్ కమీషన్ను ఏర్పాటు చేసినా హరిజనులకు దక్కే నియామకాలు చాలా తక్కువ. నియామకాలన్నీ సవర్ణులకే ఇచ్చారు. ఒక వేళ హరిజనుణ్ణి నియమించినా అది ఒకటి రెండు వారాలకే. పబ్లిక్ సర్వీస్ నియమ నిబంధనల ప్రకారం ఒకసారి ఉద్యోగం వచ్చిన వాళ్ళు మళ్ళీ సంవత్సరం తర్వాతే అప్లై చేసుకోవచ్చు. కాని సవర్ణుల్ని సంవత్సరకాలం నియమిస్తున్నారు. నియామకాల లిస్టును అసెంబ్లీ ముందుకు తెచ్చినప్పుడు

కమ్యునల్ ప్రాతినిధ్యం ప్రకారం సమానంగా ఉన్నట్టు కనిపిస్తుంది కాని హరిజనుల ఉద్యోగాలన్నీ కలిపి ఒక సవర్ణుడి నియామకానికి కూడా సరికావు. ఇది అధికార్లు చేస్తున్న మోసం. ఆ విధంగా ప్రభుత్యోగాలు సవర్ణుల ఆస్థి అయిపోయాయి. హరిజనుడొక్కడు కూడా లాభం పొందలేదు.

3. కొద్ది సంవత్సరాల క్రితం ప్రతి హరిజనునికి బ్రతికేందుకు మూడు ఎకరాల స్థలం ఇస్తామని మహామహులైన మహారాజావారు ఒక ప్రకటన చేశారు. పట్టణ సరిహద్దుల్లో పశువుల్ని మేపుకునేందుకు భూమినివ్వటానికి ప్రభుత్వం సంసిద్ధమైనా ఒక్క హరిజనుడికి కూడా భూమిదక్కలేదు. హరిజనులు ఇంకా సవర్ణుల చావిళ్ళలోనే ఉంటూ నానా బాధల్ని అనుభవిస్తున్నారు. ఎంతో ఖాళీ భూమి ఉన్నా హరిజనులు చేసుకునే విన్నపాలు విన్నవాడు లేడు. ఈ భూములన్నీ సవర్ణులకే దక్కాయి.

4. ప్రభుత్వం ప్రతి సంవత్సరం ప్రతి హరిజన కులంనుంచి ఒక సభ్యుణ్ణి శాసన సభకు ఎంపిక చేస్తుంది. వాళ్ళు హరిజనులకు ప్రాతినిధ్యం వహించవలసింది పోయి అధికార్ల చేతుల్లోనూ, సవర్ణుల చేతుల్లోను కీలు బొమ్మలై పోయి వాళ్ళకే లాభం కూర్చారు. ఆ విధంగా కూడా హరిజనుల సాధక బాధకాలు తొలిగిపోనేలేదు.

5. తిరువాన్కూర్‌లోని హరిజనులంతా కూలీ నాలీ చేసుకుని బ్రతికే వారే. వాళ్ళంతా సవర్ణుల సేవకులే. వాళ్ళు వీళ్లని జంతువుల్లా చూస్తారు. వాళ్ళను పట్టించుకున్న నాధుడే లేడు. స్టేట్ మొత్తంలోనూ హరిజనుడికి ఇచ్చే కూలి రోజుకు రెండణాలు మాత్రమే. దేవాలయపు ప్రవేశంతో కూడా ఈపరిస్థితిలో మార్పు లేదు. తిరువాన్కూర్ రాష్ట్రంలోని ఫ్యాక్టరీల యజమానులు, అధికారులు అందరూ సవర్ణులే. వాళ్ళిప్పుడు బాధ్యతాయుతమైన ప్రభుత్వం కావాలని ఉద్యమం నడుపుతున్నారు. కాని హరిజనులు ప్రభుత్వోద్యాగాలు కావాలని ఉద్యమం చేస్తున్నారు. ఫ్యాక్టరీల్లోని ఉద్యోగాల్లోంచి హరిజనుల్ని వదిలించుకోవాలని సవర్ణులు ఉద్యమం చేస్తున్నారు. ఎక్కువ జీతాలు కావాలని, హక్కులు కావాలని వాళ్ళు డిమాండ్ చేస్తున్నారు. తిరువాన్కూర్ ప్రజలంతా ఫ్యాక్టరీల్లో కార్మికులు చేస్తున్న సమ్మెల్తో పిచ్చెత్తి పోతున్నారు. కాని హరిజనుల్ని పట్టించుకున్న వాళ్ళులేరు. ఫ్యాక్టరీ కార్మికుడి వేతనంతో పోలిస్తే హరిజనుడికి వచ్చేది అందులో మూడో వంతో నాలుగో వంతో ఉంటుంది.

6. కరువు కాటకాల వల్ల బ్రతుకుదెరువులేక హరిజనుల పిల్లల తలలు మాడిపోతున్నాయి. ఫలితంగా స్కూళ్ళలో వాళ్ళు పరీక్షలు ఫెయిలయ్యేట్టుంది. దేవాలయ ప్రవేశ ప్రకటనకు పూర్వం హైస్కూల్లో పిల్లలకి 6 సంవత్సరాలు రాయితీ ఉండేది. కాని అదిప్పుడు మూడేళ్లకు కుదించబడింది. ఫలితంగా చాలామంది విద్యార్థులు ఫెయిలవటం వల్ల చదువులు మానేశారు.

7. దళిత వర్గాల సంక్షేమం కోసం ఒక ప్రభుత్వ శాఖ ఉండేది. దానికి సి.ఓ. దామోదరన్ (దళిత వర్గాల రక్షకుడు) అధిపతి. ప్రతి సంవతస్సరం ఎంతో ధనం మంజూరవుతున్నా చివరకు మూడింట రెండు వంతులు ఆ శాఖ నిర్వాకం వల్ల మురిగిపోతుంది. డబ్బు ఖర్చు చేసే అవసరం అంతగా లేదని ఆయన ప్రభుత్వానికి రిపోర్టులు పంపిస్తూ వుంటాడు. నిజానికి అందులో 95 శాతం ఉద్యోగుల జీతాలకోసం పోతుంది. వీళ్లంతా సవర్ణులే. కేవలం 5 శాతం మాత్రం సరిగ్గా ఖర్చవుతుంది. ఇప్పుడు ప్రభుత్వం తిరువాన్కూర్ సమాపాన మూడు చోట్ల శివార్లు నిర్మించబోతుంది. అధికార్లు సవర్ణులు. నా ఉద్దేశ్యంలో ఈ స్కీము విజయవంతం కాదు. ఎందుకంటే ప్రభుత్వం దీన్ని పట్టించుకోదు. హరిజనుల కోసం కొచ్చిన్ రాష్ట్రం రూపాయి ఖర్చు చేస్తే అదే తిరువాన్కూర్‌లో ఒక అణా ఖర్చు చేస్తున్నారు. ఇది చెప్పటానికి విచారిస్తున్నాను.

తిరువాన్కూర్ మెజారిటీ ప్రజానీకం స్టేట్ కాంగ్రెస్ అనే వ్యవస్థ ఆధ్వర్యంలో బాధ్యతాయుత ప్రభుత్వం కావాలని తీవ్ర ఆందోళన జరుపుతున్నారు. రాష్ట్రంలో ఉన్న నాలుగు ముఖ్యమైన కులాలు "నాయర్లు, మహ్మదీయులు, క్రిస్టియన్లు, ఎళవా"లనుంచే కాంగ్రెస్ నాయకులు బయల్దేరారు. స్టేట్ కాంగ్రెస్ నాయకుడు పట్టం థాను పిళ్ళేగారు ఒక ప్రకటనలో దళితులకు ప్రత్యేక రాయితీలు కల్పించబడతాయని చెప్పారు. స్టేట్ కాంగ్రెస్ ఏం చేస్తుందోనని దళిత నాయకులంతా ఎదురు చూస్తున్నారు. ఇప్పుడు మాకు తెలిసిందేమిటంటే నాయకులు చేస్తున్న వాగ్దానాల్లో ఏమాత్రం నిజం లేదనే.

నాయకులు దళితుల్ని గాలికి వదిలేశారని ఇప్పుడు నిశ్చయంగా చెప్పగలను. జాతీయ సిద్ధాంతాలతో మొదలైన కాంగ్రెస్ కమ్యునల్ భావాలకు ఆటపట్టయింది. ఇప్పుడు నాయకుల్లో పనిచేస్తున్నది ఈ భావాలే. ఎక్కడ మాట్లాడినా, ఏ ప్రకటన చేసినా, ఎక్కడ రాసినా ఈ నాయకులిప్పుడు ఈ నాలుగు కులాల్ని గురించే చెబుతున్నారు.

సమ్మెల్ని గురించి ఆలోచించిన వాళ్ళు లేరు. తిరువాన్కూర్ రాజకీయ ఉద్యమం ఇలాగే జరిగి బాధ్యతాయుత ప్రభుత్వమే ఏర్పడితే అధికారమంతా ఈ నాయకుల చేతుల్లో ఉంటే వాళ్ళ నాలుగు కులాలకు తప్ప దళితులకు వీళ్ళు ఏమీ చేయరని నాకు భయమేస్తూంది. దళితుల పరిస్థితి ఇంకా ఘోరంగా తయారవుతుంది. దళితుల హక్కుల్ని వీళ్లే మింగేస్తున్నారు. స్టేట్ కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ సమావేశాల్లో మూడింట రెండొంతుల సమయం అల్లెప్పీ పీచు కర్మాగారాల్లో జరుగుతున్న సమ్మెల్ని గురించి చర్చించటానికే సరిపోతుంది కాని నానా బాధలు పడుతున్న హరిజన కులాల్ని గురించి పట్టించుకున్న వాళ్ళులేరు. కర్మాగారాల్లోని కార్మికులంతా సవర్ణులే. బాధ్యతాయుత ప్రభుత్వం వీళ్ళ కోసమే. ఇది హరిజన వ్యతిరేకోద్యమం తప్ప వేరేకాదు. స్టేట్ కాంగ్రెస్‌లో ప్రతి నాయకుడూ సవర్ణుల పరిస్థితిని మెరుగుపర్చాలని భావించేవాడే. తమ సంక్షేమం కోసం దళితుల్ని బలి చేయాలని ఈ నాయకులు దృఢసంకల్పులై ఉన్నారు. రాష్ట్రంలోని దళిత వర్గాల పరిస్థితి ఇది.

రాష్ట్రంలో మా హక్కుల్ని కాపాడుకోవాలంటే ఏం చేయాలి? ఈ సమయంలో మీ సలహా, సమాధానం కోసం ఎదురుచూస్తూ ఉంటాను.

ఇబ్బంది పెడుతున్నందుకు మన్నించండి.

మీ విధేయుడు

శ్రీనారాయణ స్వామి.

ఒక వేళ దేవాలయ ప్రవేశ ప్రణాళిక దళితుల చట్టబద్ధమైన హక్కుల్ని హరించేందుకే అయితే అది ఆధ్యాత్మిక ఉద్యమం కాకపోవటమటుంచి వాస్తవానికి మోసపూరితమైనటువంటిది. సత్యసంధులైన వారిపై అస్పృశ్యులకు ఈ విషయం తెలియజేసి హెచ్చరించవలసిన బాధ్యత ఉంది. 'గాంధీగారు ఉన్నారు జాగ్రత్త'

*అనువాదం : ప్రొ॥ బి. వెంకటేశ్వర్లు*

అధ్యాయం - 26

# అస్పృశ్యులకొక హెచ్చరిక

ప్రపంచ దేశాల్లోని పేదల చరిత్రలో అధికార వ్యవస్థపై తిరుగుబాటు చేయడం ఒక సహజమైన భాగం. చరిత్ర విద్యార్థి వారి యొక్క విజయం సాధించవలెననెడి భావనపై ఆశ్చర్యచకితుడు కావలిసిందే. వేదాల యుగంలో అధ్యాత్మికశక్తులే ఈ ప్రపంచాన్ని దీనులకు సంక్రమింపజేస్తాయనే ఆశతో పేదప్రజలు జీవించెడివారు. లౌకికయుగం లేదా ఆధునికి యుగంలో చారిత్రక భౌతిక వాద శక్తులే తమంతతాము బలవంతుల నుండి వారి యొక్క శక్తిని లాగుకొని బలహీనులకు ఒక స్థానాన్ని సంప్రాప్తింపజేస్తాయి.

ఈ ఆత్మవిచారణా దృష్టితో ఆలోచిస్తే, హిందూ సామాజిక క్రమంలో తిరుగుబాటు శక్తుల పాత్రలో ఉన్న అస్పృశ్యులు. అధ్యాత్మిక శుక్తులు గాని లేదా చారిత్రక శక్తులుగాని తమవిముక్తిని తేలేవు అని గ్రహించడాన్కి ఎవరైనా అభినందించాల్సిందే. ఒక వేళ హిందూ సామాజిక క్రమం క్షీణించినట్లయితే అది రెండు దశలలో జరుగుతుందని వారికి తెల్సు. మొదటగా ఈ సామాజిక క్రమాన్ని నిరంతర దాడులకు గురిచేయాల్సి ఉంటుంది. రెండవది, వారు ఆలోచనల్లో, ఆచరణలో హిందువులనుండి స్వతంత్రంగా లేనట్లయితే ఈ సామాజిక క్రమంపై నిరంతర దాడులు చేయలేరు. అందువల్లనే అస్పృశ్యులు వేరు నియోజక గణాలు మరియు వేరు నివాసప్రాంతాల కోసం పట్టుదలతోయున్నారు.

మరొక ప్రక్క, అస్పృశ్యులు స్వేచ్ఛకోసం హిందువులపై ఆధారపడాల్సిందేనని హిందువులు చెబుతున్నారు. సాధారణ విద్యా వ్యాప్తి హిందువులను హేతుబద్ధంగా ప్రవర్తించునట్లు చేస్తుందని అస్పృశ్యులకు చెప్పబడింది. అంటే అస్పృశ్యులు హిందువుల సౌహార్ద్రత, నమ్రతలపై ఆధారపడాల్సిందే. కాని ఇటువంటి సులభమైన ప్రస్తావను నమ్మలేరు. ఎవరైనా ఉన్నట్లయితే వారు పంచకులై హిందువులు చెప్పినట్లు చేస్తూ, హిందువుల కృపతో అస్పృశ్యుల స్థానాన్ని అందుకోవటానికి ప్రయత్నిస్తారు. అటువంటివారు తమకు అందుబాటులో ఉన్న అన్ని మార్గాలను అన్వేషించి హిందువుల మెప్పుకోసం ప్రయత్నిస్తారు.

అస్పృశ్యులు ఇటువంటి అసత్యప్రచారం, పిచ్చి ఆశలతో మోసపోరు. అందువలననే వీటిపై వ్యాఖ్యానం అసందర్భం. ఇదే సమయంలో అజాగ్రత్తగా యున్న అస్పృశ్యులు

ఈ అసత్యప్రచారం వైపు ఆకర్షింపబడతారు. ఆ కారణంగా అస్పృశ్యులకు హెచ్చరిక అవసరం.

సామాజిక న్యాయం కోసరం సామాజిక ఆదర్శవాదులు ఆధారపడే రెండు కారకాల్లో ఒకటి హేతువు, రెండవది మతం.

అన్యాయాన్ని ప్రజ్ఞాపాటవాలతో నిర్మూలించగలమనేది హేతువాది నమ్మకం. మధ్యయుగంలో సామాజిక అన్యాయం మరియు మూఢనమ్మకాలు రెండూ ఒకదానితో ఒకటి పెనవేసుకొని పోయినవి. అన్యాయ నిర్మూలన మూఢ నమ్మకాలను తొలగిస్తుందనే హేతువాదుల నమ్మకాన్ని వాటి ఫలితాలు ప్రోత్సహించాయి. అదే ఈ రోజు, విద్యావేత్తలు, తత్త్వవేత్తలు, మనస్తత్వవేత్తలు, సామాజిక శాస్త్రవేత్తలు సార్వత్రిక విద్య, ముద్రణ మరియు పత్రికాభివృద్ధి ఆదర్శసమాజానికి దారితీస్తాయని, అందులో ప్రతివ్యక్తి ఉత్తేజితుడై నందువల్ల, సామాజిక అన్యాయానికి తావుండదు.

భారత చరిత్రగానీ ఐరోపా చరిత్రగానీ ఈ మూఢనమ్మకాన్ని సమర్థించలేవు. ఐరోపాలో అన్యాయానికి మూలకారణమైన సాంప్రదాయాలు, మూఢనమ్మకాలు 18 వ శతాబ్దంలో నిర్మూలించబడ్డాయి. అయినప్పటికీ సామాజిక అన్యాయం విపరీతమై పెరుగుతూనే ఉంది. భారతదేశంలో మొత్తం బ్రాహ్మణ కులంలో ఆడ,మగ, పిల్లలు అందరూ విద్యావంతులే. అయితే ఎంత మంది బ్రాహ్మణులు అస్పృశ్యతా నమ్మకం నుండి స్వతంత్రులు? ఎంతమంది ఈ అస్పృశ్యతపై యుద్ధం ప్రకటించినారు. ఎంతమంది సామాజిక అన్యాయంపై జరిపే పోరాటంలో అస్పృశ్యులకు సహకరించినారు ? ఎంతమంది అస్పృశ్యుల సమస్యను తమ సమస్యగా భావించినారు? సంఖ్య మాత్రం బహుస్వల్పమే.

హేతువు సామాజిక అన్యాయాన్ని నిర్మూలించడంలో ఎందుకు నిష్ఫలమైంది? వ్యక్తిగత ఫలాపేక్షకు అడ్డంకి కానంతవరకు, హేతువు పని చేస్తుంది, లేకపోతే హేతువు అప్రయోజనకారి . చాలా మంది హిందువులు అస్పృశ్యులలో వ్యక్తి గత ఫలాపేక్ష ఆశించెడివారే. ఈ వ్యక్తి ఫలాపేక్ష సామాజిక ఔన్నత్యమనే భావనను లేదా వెట్టి చాకిరివంటి ఆర్థిక దోపిడి రూపాన్ని దాలుస్తాయి. సహజంగా హేతువు వ్యక్తిగత ఫలాపేక్షకు లొంగరాదు. అందువలన అస్పృశ్యులు హేతువుకు కూడా హద్దులున్నవని గ్రహించాలి.

ప్రయోజనకారి కాని మతంలో నమ్మకమున్న మతనైతిక వాదులు మతం యొక్క విధిని, మరియు అది సాధించే విజయాన్ని ఎవరూ తిరస్కరించలేరు. కాని ఇక్కడ **కూడా** మతం చేసే వాటికి పరిధులున్నాయి. మతం ఒక తెగలో మాత్రమే న్యాయం చేయ**టంలో** సహాయపడుతుంది. రెండు తెగల మధ్య మతం న్యాయాన్ని సమకూర్చలేదు. ఉదాహర**ణకు,** అమెరికా సంయుక్త రాష్ట్రాల్లో నీగ్రోలకు మరియు తెల్లజాతివారికి, జర్మనీ మరియు ఫ్రెంచ్ ప్రజల మధ్య న్యాయం చేయటంలో విజయం సాధించలేదు. న్యాయంకో**సం,** జాతి పిలుపు, తెగల పిలుపు మతం పిలుపు కంటే శక్తి వంతమైదని రుజువైంది.

అస్పృశ్యులు రెండింటిని మాత్రం గుర్తుంచుకోవాలి. ఒకటి, హిందూమతం సామా**జిక** న్యాయాన్ని సమకూరుస్తుందనుకోవడం నిష్ఫలమే. ఈ పని ఇస్లాం, క్రిస్టియన్, బౌద్ధమతా**ల్లో** మాత్రం సాధ్యమే. హిందూమతం అస్పృశ్యులకు అసమానతలకు, అన్యాయానికి ప్రతిరూపం. న్యాయం ప్రచారం దీని అస్థిత్వానికే వ్యతిరేకం. దీని గురించి ఆశించడం అద్భుతమే. దీనిని హిందూ మతం సాధించగలదంటే, సాధించడం అసాధ్యమే. హిందువులకు, వారి మనుషుల మధ్య గల అడ్డంకి కంటే హిందువులకు, అస్పృశ్యులకు మధ్య గల అడ్డంకి పెద్దది. ఒక తెగలో లేదా జాతిలో ఈ అప్రయోజనకరమైన అడ్డంకులను తొలగించి ఒకటి చేయడంలో శక్తిహీనమైనది.

హేతువు మరియు మతం, ఈ కారకాలే కాకుండా హిందూ శ్రామిక వర్గాల సౌభ్రాతృత్వం మరియు హిందూ ఆధిక్య వర్గాల వివేకవంతమైన స్వప్రయోజనాలను అస్పృశ్యులు నమ్మవలెనని చెప్పబడింది.

ఉన్నత వర్గాలు సౌహార్ద్ర నియంతలతో రాజీపడడం తప్ప వారు చేయవలసిందేదీ లేదు. వారి యొక్క వర్గ ప్రయోజనాలను విశ్వజనీనమైన విలువలకోసం త్యాగం చేస్తారని ఆశించకూడదు. ఇంకొకప్రక్క, వర్గ ప్రయోజనాలను, సాధారణ ప్రయోజనాలతో గుర్తించడం వారి యొక్క నిరంతర ప్రయత్నం. మరియు వారి ప్రయోజనాలు సమాజానికి వారిచ్చే ఉపయుక్తమైన కార్యాలు. అస్పృశ్యులు హిందువులలో వివాదాన్ని కనుగొన్నారు కాబట్టి వీరు అస్పృశ్యులకు ఎన్నటికీ సహచరులు కాలేరు.

అస్పృశ్యులు హిందూ శ్రామిక వర్గంనుండి సహాయాన్ని ఆశించడం గగనకుసుమమే. భారత దేశంలోని కమ్యూనిస్టులు అస్పృశ్యులకు ఐక్యత గురించి చేసిన విన్నపం శ్రామిక

వర్గం తనకుతాను ఏమీ ఆశించకుండా, తనది అనుకున్నవాటిని ఎవరితోనూ పంచుకోకుండా ఉంటారన్న భావనపై ఆధారపడిందే. కాని ఇది 'సత్యమా'? ఐరోపా ఖండంలో శ్రామిక వర్గం ఏకవర్గంకాదు. అది వర్గ సంఘటన మాత్రమే. ఇది సామాజిక మార్పుకోసమై చేస్తున్న వారి ధృక్పథాన్ని ప్రతిబింబింపజేస్తుంది. అల్పవర్గాల్లోని వారు ఉద్యమకారులు, ఉన్నతవర్గాల్లోని వారు సంస్కర్తలు అన్న భావన సత్యదూరమే. భారత దేశానికి సంబంధించినంతవరకు ఇది నిక్కచ్చిగా అసత్యమే. సమైక్య సంఘటనకు కూడా మార్గంలేదు. సామాజికంగా, ఈ రెండింటి మధ్య వ్యతిరేకత ఉంది. ఆర్థికపరంగా, వీటి మధ్య స్నేహానికి స్థానం లేదు.

అస్పృశ్యులు జ్ఞానవ్యాప్తి కోసం కృషి చేయాల్సి ఉంది. ఉన్నత వర్గాల శక్తి ప్రజల్లో వ్యాపింపజేసే వారి అసత్య ప్రచారంలో ఉండి ఇటువంటి శక్తిని అడ్డుకోవటం సాధ్యంకాదు. ఎందుకంటే ఈ అధికారం అసత్యాల వల్లనే న్యాయమని ధృవీకరించబడుతుంది. ఈ అసత్యమనే రక్షణ కవచం ఎంతవరకు నిలదొక్కుకుంటుందో అంతవరకు తిరుగుబాటుకు ఆస్కారం లేదు. అన్యాయం, అణిచివేతలను అడ్డుకోవాలంటే, ఏ అసత్యంపై అది ఆధారపడిందో దానిని బయల్పరచాలి. ఇది ఒక జ్ఞానం వల్లనే సాధ్యం.

రెండవది, వారు అధికారం కోసరం కృషి చేయాలి. హిందువుల ప్రయోజనాలకు అస్పృశ్యుల ప్రయోజనాలకు మధ్య విరోధముందని మరిచిపోవద్దు. హేతువు ఈ విరోధాన్ని ఉపశమింపజేస్తుందేగాని ఈ విరోధం అవసరాన్నిమాత్రం పరిహరించలేదు. ప్రయోజనానికి ప్రాధాన్యత కల్పించేదే అధికారం. అందువల్ల అధికారాన్ని అధికారం చేతనే నిర్మూలించవచ్చు. అధికార వినియోగాన్ని నైతికంగా మార్చడం సమస్యగా ఉన్నా, ఒక అధికారం ఇంకో అధికారాన్నిమాత్రమే నిర్మూలించగలదు. అధికారం ఆర్థికపరమైనదీ లేదా రాజకీయమైంది. సైనికాధికారం ఇప్పటి పరిస్థితుల్లో ఒక నియంత్రణా శక్తి. ఈ అధికారాన్ని స్వేచ్ఛగా వినియోగించలేం. శ్రామిక వర్గాల ఆర్థికాధికారం వారి సమ్మెలో దాగియుంది. శ్రామిక వర్గంలో భాగమైన అస్పృశ్యులకు ఇంకే ఆర్థికపరమైనా అధికారం లేదు. కాని ఈ శక్తి శ్రామిక వర్గాల రక్షణకు సరిపోదే. ఈ శక్తి నిషేధాజ్ఞలు, సైనిక శక్తి వినియోగం, సైనిక పాలన, వంటి శాసనాల వల్ల నిరుపయోగమవుతుంది. ఇంకా అస్పృశ్యులకు సమ్మెచేసే అధికారం ఇంతకంటే నిష్ఫలమైనది.

అందువల్ల అస్పృశ్యులకు రాజకీయ అధికారం ప్రాథమిక అవసరం. సామాజిక, ఆర్థిక అవసరాలను దృష్టిలో ఉంచుకుంటే, అస్పృశ్యులు రాజకీయ అధికారాన్ని ఎక్కువగా పొందలేరు. ఎంతమేరకు రాజకీయ అధికారాన్ని సంపాదించినా, హిందువుల విస్తృతమైన సామాజిక, ఆర్థిక రాజకీయం అధికారం ముందు తక్కువే.

హిందువులు రాజకీయ జీవనం వారి ఆర్థిక సామాజిక ప్రయోజనాలపై ఆధారపడి ఉంది. అయితే ఈ ప్రయోజనాలు, అస్పృశ్యుల ప్రయోజనాలకు వ్యతిరేకం, మరియు ఎంత రాజకీయ అధికారం ఉన్నా శాసనసభలో హిందువుల ప్రాతినిధ్యంపై ఆధారపడినంతవరకు, ఆ అధికారం నిష్ప్రయోజనమేనని గ్రహించాలి.

అనువాదం: వి. శ్రీనివాస్

# నాల్గవ పుస్తకం

# మతపరమైనవి

'అస్పృశ్యుల మతాంతరీకరణ' అన్న ప్రణాళిక డాక్టర్ అంబేద్కర్ ఏర్పరచుకొన్నది. దానిలో ఈక్రింది అధ్యాయాలు ఉన్నవి.

1. ప్రచార లక్షణం గల మతంగా హిందూ మతం
2. అస్పృశ్యులను క్రైస్తవులుగా మార్చడం
3. మతం మార్చుకున్న వారి స్థితిగతులు
4. శాశ్వత సత్యం
5. అస్పృశ్యుల భవితవ్యం.

ఈ వ్యాసాలలో 2,3 శ్రీ ఎస్.ఎస్. రేగే అందించారు. మొదటి వ్యాసము 'కులము, మతాంతరీకరణము' అనేపేర లభించింది. అది "తెలుగు సమాచార్" పత్రిక ప్రత్యేక సంచిక నవంబరు - 1926 లో ప్రచురితం. "హిందువులకు దూరంగా" అనే పైపు చేసిన వ్యాసం అస్పృశ్యుల మతాంతరీకరణాన్ని గూర్చి తెలిపేది లభింపగా దీనిలో చేర్చడమైంది. పై ప్రణాళికలో పేర్కొన్న ఇతర పేర్లు గల వ్యాసాలు మాకు లభించలేదు.

\- సంపాదకులు.

అధ్యాయము — 27

# హిందువుల నుంచి దూరంగా

వారి సమస్య గురించి ఆలోచించే శక్తి సంతరించుకున్న ఎక్కువ మంది అస్పృశ్యులు నమ్మేదేమనగా అస్పృశ్యుల సమస్య పరిష్కారానికి గల ఒక మార్గం హిందూయిజాన్ని పరిత్యజించి యింకొక మతంలోకి మార్పిడి చెందడమే. 31 మే 1936 నాడు బాంబేలో జరిగిన మహర్ల మహాసభలో యీ మేరకు ఏక గ్రీవంగా 25వ తీర్మానాన్ని ఆమోదించినారు. ఆమహాసభ మహర్ల మహాసభ అయినప్పటికీ[1] భారత దేశమంతటా కల అస్పృశ్యుల మద్దతు ఆ తీర్మానానికి లభించింది. ఏ తీర్మానము అంతటి అలజడిని సృష్టించలేదు. హిందూ సమూహము దాని పునాది నుంచి చలించింది. చర్య వెనుక నున్న అస్పృశ్యుల మీద తిట్లు, శాపనార్థాలు, బెదిరింపులను కుమ్మరించినారు.

అస్పృశ్యుల మత మార్పడిని వ్యతిరేకించేవారు ఈ విధమైన మత మార్పిడికి నాలుగు ముఖ్యమైన ఆక్షేపణలను పురికొల్పినారు.

1. మత మార్పిడి వలన అస్పృశ్యులకు కలిగే లాభమేమి ? మత మార్పిడి అస్పృశ్యుల స్థితిలో ఎలాంటి మార్పును తీసుకురాజాలదు.

2. అన్నిమతాలు సత్యమే. అన్ని మతాలు మంచివే. మతాన్ని మార్చుకోవడమనేది నిరర్థకమే.

3. అస్పృశ్యుల మతమార్పిడికి దాని ప్రవృత్తిలో రాజకీయ స్వభావం ఉంది.

4. అస్పృశ్యుల మతమార్పిడి విశ్వాసం మీద ఆధారపడలేదు. కాబట్టి ఇది మనఃపూర్వకమైనది కాదు.

పై ఆక్షేపణలు అవివేకమో, అపరిపూర్ణమో నిరూపించడానికి సుదీర్ఘ వాదన అవసరం లేదు.

ఆఖరి ఆక్షేపణను మొదట తీసుకుందాం. చరిత్రలో ఎటువంటి మతపరమైన ప్రేరేపణలేని మత మార్పిడి జరిగిన నిదర్శనాలు కొల్లలు. క్లోవిస్ (Clovis) అతని పౌరులు

చెపుతుందా? అస్పృశ్యుల పట్ల నీతిమంతంగా ఉండాలని అది హిందువులకు తెలపుతుందా? అస్పృశ్యుల ఎడల న్యాయంగా, సహృదయంతో ఉండాలని అది హిందువులకు ఉపదేశిస్తుందా? స్నేహ పూరిత స్వభావాన్ని అస్పృశ్యుల పట్ల కలిగి ఉండాలనే మంచి తనాన్ని అది అలవర్చగలదా? హిందువులకుఅది అస్పృశ్యులను ప్రేమించాలని, గౌరవించాలని, వారికి ఎటువంటి అన్యాయము చేయరాదని తెలుపగలదా? చివరకు హిందూయిజము జీవితానికి గల విలువను ఎటువంటి అరమరికలు లేక విశ్వజనీనము చేయగలరా.

పై ఏ ప్రశ్నలకైనా రూఢీయైన జవాబు నివ్వడానికి ఏ హిందువుకైనా ధైర్యముందా? దీనికి విపర్యయంగా హిందువులు అస్పృశ్యులను ఏ అన్యాయాలకైతే గురి చేస్తున్నారో అవి అన్ని హిందూమతం ఆమోదముద్ర చేసినవే . అవి హిందూయిజం పేరుతో చేయడమే కాక హిందూయిజం పేరుతో సమర్థింపబడుతున్నవే. అస్పృశ్యుల పట్ల హిందువుల చట్టరాహిత్యాన్ని చట్టబద్ధం చేసే స్మార్తి, ఆచారానికి హిందూమత బోధనలే ఆధారితాలై మద్దతు నిస్తున్నాయి. అస్పృశ్యులను హిందూయిజంలో ఉండమని, అంగీకృతి తెలుపమని హిందువులు ఎలా అడుగగలరు? వారి అధఃకరణకు ఏకోన్ముఖకారణమైన హిందూయిజంలో అస్పృశ్యులు ఎలా ఉండగలరు? ఒక మానవుని అధః కరణాన్ని అతిహేయమైన లోతులకు తీసుకెళ్ళగలిగింది అస్పృశ్యత ఒకటే. పేదవాడిగా ఉండడం చెడ్డ కావచ్చేమో కాని, అస్పృశ్యునిగా ఉన్నంత చెడ్డ మాత్రం కాదు. పేదవాడు తలెత్తుకొని తిరుగగలడు. అస్పృశ్యుడు అలా చేయలేడు. అధోత్వమనేది చెడుగా పరిగణించ వచ్చేమో కాని అస్పృశ్యుడంత చెడు మాత్రము కాదు. అధోత్వాన్నుంచి అతని స్థాయిని పెంచుకొనవచ్చు. ఒక అస్పృశ్యుడలా కాలేడు. బాధపడడం చెడు కావచ్చు కాని అస్పృశ్యుడంత చెడు మాత్రము కాదు. ఎప్పుడో ఒక రోజు భాదపడేవారు స్వాంతన పొందవచ్చు. కాని ఒక అస్పృశ్యుడు అలా ఆశపడలేడు. అణగిమణగి ఉండటము చెడు అనవచ్చు కాని అస్పృశ్యునంత చెడు మాత్రము కాదు. అణగి మణగి ఉండేవారు భూమిని వారసత్వంగా పొందనప్పటికి కనీసము శక్తి మంతంగా ఉంటారు. కాని అస్పృశ్యులు అలాంటి దానికి ఆశపడలేరు.

హిందూయిజంలో అస్పృశ్యులకు ఎటువంటి ఆశలేదు. అస్పృశ్యులు హిందూయిజాన్ని వదిలి వేయడానికి ఇది ఒకటే కారణం కాదు. వారు హిందూయిజంను

లేకుండా బాప్టిజాన్ని స్వీకరించేటట్లు చేయటానికి ఎటువంటి ఆటంకముండేది కాదు. రాజైన క్లోవిస్ అడుగుజాడల్లోనే అతని సైనికులయిన 300 మంది పవిత్ర క్రతువుకు ప్రవేశాన్నిచ్చారు. ఎథెల్ బర్ట్ పౌరులు వారి యువరాజు మతమార్పిడి అయిన పిదప సన్నధులు కాకుండా ఎటువంటి ప్రవచనము లేకుండా బాప్టిజాన్ని స్వీకరించారు. యితరులను అనుకరించడంలో జర్మన్లు మాత్రమే తొందరను ప్రదర్శించలేదు. రష్యాలో వ్లాడిమెర్ బాప్టిజాన్ని చేపట్టిన పిదప బాప్టిజానికి మారడానికి ఎక్కువ సంఖ్యలో గుమి గూడడం వలన నూరు మంది కొకసారి పవిత్ర క్రతువులను అనువర్తించారు".

మత మార్పిడి బలవంతంగానైనా లేక మోసంతోనైనా జరిగిన దృష్టాంతాలు చరిత్ర సంగ్రహపరిచింది.

ఈ రోజున మతమనేది ఒక పురాతన సంపత్తిలో ఒక భాగం లాంటిది. వారసత్వము లాగ యిది తండ్రి నుంచి కొడుకుకు సంక్రమిస్తుంది. అంటువంటి మార్పిడిలో యదార్థత ఎంతవరకుంటుంది? అస్పృశ్యుల మతమార్పిడి ఒకవేళ జరిగితే మతానికి గల విలువనుగాని, యితర మతాలకు గల గుణ గణాల గురించి మొత్తం చర్చించిన తరువాతనే జరుగుతుంది. అలాంటి మతమార్పిడి యదార్థమైనది కాదని ఎలా అనగలము? యింకొక రకంగా ఆలోచించి నట్లయితే చరిత్రలో యదార్థమైన మత మార్పడి యిదే మొదటి సంఘటనవుతుంది. అందువలన అస్పృశ్యుల మతమార్పిడి యదార్థతను ఎవరైనా ఎందుకు శంకిస్తున్నారనేది అర్థం కావడం కష్టంగా ఉంది.

మూడవ ఆక్షేపణ సరిగా వివేచన లేని ఆక్షేపణ. అస్పృశ్యుల మతమార్పిడి వలన రాజకీయంగా ఎలా లాభపడతారనేది ఎవరూ నిర్వచించలేదు. అథవా ఒకవేళ రాజకీయ లాభమున్నప్పటికి అది మత మార్పడికి ఎలా ప్రత్యక్షంగా ప్రలోభత కలిగి ఉందో ఎవరూ ఋజువు చేయలేదు. మతమార్పిడి ఎవరైతే వ్యతిరేకిస్తున్నారో వారికి కనీసము మతమార్పిడికి కల ప్రత్యక్ష ప్రలోభతవలన కలిగే లాభాన్ని క్షణ భంగుర లాభాన్ని వ్యత్యాసీకరించాలన్న విషయం తెలిసినట్లు లేదు. ఈ వ్యత్యాసము ఎటువంటి తేడా లేనిది కాదు. మత మార్పిడి అస్పృశ్యులకు రాజకీయ లాభాన్ని చేకూర్చవచ్చు. అది ఎప్పుడైతే ప్రత్యక్షప్రలోభమవుతుందో అప్పుడు మతమార్పిడిని నైతికం గానిదని, లేక నేరమని ఖండించవచ్చు. అస్పృశ్యులు ఏదైతే మతమార్పిడి కోరుతున్నారో అందులో రాజకీయలాభముందని మతమార్పిడి

వ్యతిరేకులు ఋజువు చేయనంతవరకు వారి ఆరోపణ నిరాధారమైనది. వాస్తవమేమిటంటే మతమార్పిడి అస్పృశ్యులకు ఎటువంటి కొత్త రాజకీయలాభాన్ని ఒనగూర్చదు. భారతదేశ రాజ్యాంగ న్యాయశాస్త్ర పరిధిలో ప్రతి మతపరసమాజానికి ప్రత్యేక రాజకీయ పరిరక్షణ లుండడానికి హక్కు ఉంది. మహమ్మదీయులు, క్రిష్టియన్లు ఎలాంటి రాజకీయ హక్కులను కలిగి ఉన్నారో ప్రస్తుత పరిస్థితిలో అస్పృశ్యులు కూడ అలాంటి రాజకీయ హక్కులే కలిగి ఉన్నారు. వారు వారి విశ్వాసాన్ని మార్చుకున్నందువలన ఆ మార్పు వారికి అంతకు ముందు లేని రాజకీయ హక్కులను తీసుకొని రాదు. రాజకీయ లాభానికి మత మార్పిడిలో ఎలాంటి సంబంధం లేదు. ఒకవేళ వారు మారనిచో వారి రాజకీయ హక్కులను వారు ఉంచుకొనే వారు. యీ అభిశంసన అర్థము చేసుకోకుండా చేసిన అభిశంసన.

అన్నిమతాలు ఒకే విషయాన్ని భోధిస్తాయనే ప్రాతిపదిక మీద ఆధారపడినదీ రెండవ ఆక్షేపణ. అన్నిమతాలు ఒకే విషయాన్ని భోధిస్తాయనే ప్రాతిపదిక మీదనే ఒక మతాన్ని కాదని వేరొక మతంవైపు మొగ్గుచూపడానికి కారణం ఏది లేదనే సారాంశాన్ని రాబట్టినారు. మంచి అనుసరిస్తున్నప్పుడే జీవితానికొక అర్థముంటుందని అన్ని మతాలు ఒప్పుకుంటాయని అంగీకరించవచ్చు. యింతవరకు మాత్రమే పై ప్రాతిపదిక సక్రమమైనదేనని ఒప్పుకొనవచ్చును. కాని పై ప్రాతిపదిక యింకొంచెం ముందంజ వేసి దీని వలనే మతాల మధ్య ఎంపిక చేసుకోవటానికి కారణమేమిలేదని ధృవీకరించినట్లయితే ది అబద్ధపు ప్రాతిపదికవుతుంది.

'మంచి'ని అనుసరిస్తున్నప్పుడే జీవితానికొక అర్థముంటుందని అన్ని మతాలు భోధించినందులవలన అన్నిమతాలు ఒకే లాగున్నాయనుకోవచ్చును. కాని 'ఏది మంచిది'? అనే ప్రశ్నకు యిచ్చే జవాబులో మతము, మతాలు ఒక లాగు లేవు. యీ విషయంలో ఖచ్చితంగా మతాలు వేరవుతాయి. ఒక మతం సౌభ్రాతృత్వము మంచిదంటే వేరొక మతము, కులము మరియు అస్పృశ్యత మంచిదన వచ్చును. యింకొక విషయంలో కూడ అన్ని మతాలు ఒకే లాగ లేవు. ఏది మంచిదని నిర్వచించడానికి ఒక అధికారిత్వాన్ని కలిగి ఉండడమే కాకుండా, మతము మంచిని పెంపుచేయడానికి, వ్యాప్తి చెందించడానికి ఒక చోదకశక్తి. మంచిని పెంపొందించడానికి వ్యాప్తి చేయడానికి ఉపయోగించే సాధనాలను, పద్ధతులను అన్ని మతాలు ఒప్పుకుంటున్నాయా? ఆచార్య బైలీగారు సూచించినట్లు

మతమనగా[3] "మానవాళి చరిత్రలోనే యిది ఒక బ్రహ్మాండమైన చలన శక్తి. సామ్రాజ్యాలను విభజించి ఏకం చేసింది. యిది దేశాలను ఆవిర్భవింప చేసింది, విచ్ఛిన్నం చేసింది, అతి క్రూరమైన మరియు ఆటవిక చర్యలను, అతి కామంతో కూడిన ఆచారాలను ఆమోదించింది. అతి ప్రశంసలందుకున్న వీరోచిత కార్యాలను, స్వపరిత్యాగాన్ని భక్తిని ప్రేరేపించింది. అతి హేయమైన రక్తపాత యుద్ధాలకు, తిరుగుబాట్లకు, అత్యాచారాలకు యిది కారణమైంది. అలాగే దేశాల స్వాతంత్ర్యాన్ని, సంతోషాన్ని, శాంతిని తీసుకవచ్చింది- ఒక కాలంలో నిరంకుశత్వాన్ని సమర్థించింది. మరియొక కాలంలో వాటి శృంఖలాలను ఛేదించింది. ఒక క్రొంగొత్త, తేజోవంతమైన నాగరికతను స్థాపించడమే కాక దాన్ని పోషించింది, శాస్త్రానికి, కళలకు, పురోగమనానికి బద్ధశత్రువవుతుంది".

పైన తెలిపిన ఒడిదుడుకులతోపాటు, మతాలు మంచిని భావించే సరళిలో, దానిని పెంపొందించే పద్ధతుల్లో శాశ్వత వ్యత్యాసాలున్నాయి. హింసను ప్రతిపాదించే మతాలే లేవా? అహింసను ప్రతిపాదించే మతాలు లేవా ? పై వాస్తవాల దృష్ట్యా అన్ని మతాలు ఒకటేనని, ఒక దాన్ని వేరొక దాని మీద ఎంపిక చేసుకోవడానికి కారణము లేదని ఎలా అనగలం.

రెండవ ఆక్షేపణ లేవనెత్తినందువలన హిందూయిజానికి కల సద్గుణాలని పరీక్ష చేయడాన్ని హిందువు తప్పించాలని చూస్తున్నాడు. యీ మతమార్పిడి వివాదములో హిందూ యిజంలో ఏమి అన్యాయం ఉందని అస్పృశ్యులతో సవాలు చేసే ధైర్యం ఒక్క హిందువుకు కూడా లేకపోవడమనేది ఒక అసాధారణ విషయం. సాపేక్ష మతశాస్త్రం రూపొందించిన వైఖరిలో హిందువు ఆశ్రయం పొందుతున్నాడు. ఆవిష్కరింపబడిన మతాలన్నీ తమకు తామే సత్యమని, యితర సత్యాన్వేషణ ఫలితాలన్నీ మిథ్యయని దర్పంతో అది తమ హక్కేనని తెలుపుతున్న మతాల భాషితాలన్ని సాపేక్ష మతశాస్త్రం ఛేదించింది. సత్య ఆవిష్కరణ అతి నిర్హేతుకమని, దాన్ని అంగీకరించి నిజమైన మతాన్ని అబద్ధమైన, మతాన్నుంచి వేరు చేసే పరీక్ష అతి చంచలమైనదైనందువలన దాన్ని అంగీకరించకూడదని తెలిపిన వైనం మతపర అన్వేషణకు సాపేక్ష మత శాస్త్రం చేసిన యింకొక గొప్పసేవ. కాని యిది అన్ని మతాలు మంచివేనని, వాటని వ్యత్యాసీకరించి నందువల్ల ఏ ప్రయోజనము నెరవేరదని, ఒక సార్వజనీక అభిప్రాయాన్ని సృష్టించడమనేది ఆ శాస్త్రానికి గల అవలక్షణం.

మొదటి ఆక్షేపణ మాత్రమే చాలా తీవ్రంగా ఆలోచించ దగ్గది. మతము మానవునికి, దేవునికి మధ్య గల స్వచ్ఛందమైన వ్యష్టి విషయమనే ప్రమేయం యీ ఆక్షేపణను కొనసాగిస్తున్నది. మతము అధిభౌతికము. దానికి సమాజంతో ఎటువంటి సంబంధం లేదు. ఎలాంటి అనుమానం లేకుండా యీ వాదన వివేకమైనదే. కాని దాని పునాదులే అబద్ధమైనవి. ఏ రీతిలో చూసినా యిది మతానికి గల ఒక పాక్షిక దృక్కోణము మాత్రమే అది కూడా పరిపూర్ణ చారిత్రక మతైక విషయాలమీద ఆధారపడినదే గాని, మౌలిక విషయాల మీద కాదు.

మతానికి గల ఉద్దేశ్యాలు, విధులను అర్థం చేసుకోవాలంటే మతాన్ని ధర్మ శాస్త్రాన్నుంచి వేరు చేయాలి. వాడుకలు, అభ్యాసాలు మరియు ఆచరణలు, క్రతువులు మరియు కర్మలు మతంలో ప్రాథమిక విషయాలు. ధర్మ శాస్త్రానికి రెండవ స్థానం. దాని ఉద్దేశ్యము వాటిని జాతీయ కరణ చేయుటయే. ఆచార్య 'రాబర్ట్ సన్ స్మిత్' క్రింది విధంగా తెలిపినారు.[4]

"ఖచ్చితంగా చెప్పాలంటే ప్రాచీన మతాల సంగమమే క్రతువులు, వాస్తవిక వాడుకలు ప్రాచీన కాలాల్లో వాస్తవిక ప్రయోగాలతో కూడిన నమ్మకం కాదు మతం, అది ఒక స్థిరమైన ఆచార వ్యవహారాలతో సమన్వితమైన నిర్మితి. సమాజంలో గల ప్రతి వ్యక్తి. ధైర్యంతో దాన్ని అనుసరిస్తాడు. వారు చేసే పనికి హేతువు లేకుండా కొన్ని విషయాలు చేస్తామని ఒప్పుకున్నట్లైతే మగవారు మగవారు కాలేరు. కాని ప్రాచీన మతంలో హేతువును ఒక సిద్ధాంతంగా మొదట ప్రమేయం చేసి తరువాత అభ్యాసంలో వ్యక్తీకరించలేదు. దీనికి విపర్యయంగా అభ్యాసం సిద్ధాంతం కన్నా ముందు ఉండేది".

మతం అధిభౌతికమని భావించకపోవడం కూడా అంతే ఆవశ్యకం. మతానికి కల ముఖ్య సారం సామాజిక మేనన్న వాస్తవాన్ని ఉపేక్షించడం మతాన్ని అర్థరహితం చేయడం అవుతుంది. ఆటవిక సమాజం జీవనంతోను, ప్రాణపరిరక్షణ తోనూ సంబంధం కలిగి ఉండేది. యీ జీవన ప్రక్రియలే ఆటవిక సమాజ మతానికి అంతర్భాగం కావడమే కాక మూలాధారాలైనవి. ఆటవిక సమాజానికి జీవనం, ప్రాణపరిరక్షణ విషయాల్లో ఎం‹ ఎక్కువ పట్టింపు ఉందంటే వాటిని మతానికి ప్రాతిపదికగా చేసినవి. ఆటవిక సమాజ మతంలో జీవన ప్రక్రియలు ఎంత కేంద్రీకృత స్థానాన్ని కలిగి ఉన్నాయంటే, ఏ వై‹

వారిని ప్రభావితం చేశాయో అవి మతంలో అంతర్భాగమైనాయి. ఆటవిక సమాజంలో కల ఆచార కర్మలు, పుట్టుక, పురుషత్వాన్ని సంతరించుకోవడం, తొలి సమర్త వివాహము, అనారోగ్యము, చావు మరియు యుద్ధంలాంటి విషయాలే కాక ఆహార విషయాలతో కూడ సంబంధం కలిగి ఉండేది.

పశుపాలకుల్లో గొర్రెల మందలు, పశువుల మందలు పవిత్రమైనవి. వ్యవసాయిక జనాల్లో పంటల వృద్ధి, వాటి పరిరక్షణతో సంబంధించినవిగా, విత్తనాల నాటి కాలం, కోతల కాలం ఉంటాయి కాబట్టి వాటిని పండుగలుగా పరిగణిస్తున్నారు. అదే విధంగా కరువు మహమ్మారి మరియు యితర ప్రకృతిలో జరిగే అస్వాభావిక దృశ్య విషయాలు కూడా క్రతువులకు హేతువయినాయి. ఆచార్య 'క్రాలే' తెలిపిన విధంగా ఆటవికుని మతం జీవి పుట్టుక ధృవ పరచడంతో మొదలయి అతని భూస్థాపితంతో ముగుస్తుంది.

ఆటవికుని మతం జీవనంతోను, ప్రాణ పరిరక్షణ తోను ముడిపడి ఉంది. దీనికి గల కారణమేమిటంటే మత సారం యివే అవుతాయి. కాబట్టి ఆటవికుని మతానికి ఏదైతే నిజమవుతుందో అది ఎక్కడి మతాల వాటికైనా నిజమవుతుంది. ప్రస్తుత సమాజంలో ధర్మశాస్త్రాన్ని మెరుగు పరచినారు కాబట్టి యీ మత సారము నిబిడీకృతమై దానిని మర్చిపోయేటట్లు చేయడమనేది వాస్తవం. కాని జీవనం ప్రాణ పరిరక్షణ అనేః ప్రస్తుత సమాజంలో కూడా మత సారమవుతుందనే విషయం నిర్వివాదాంశం. ఆచార్య క్రాలే దీనిని సోదాహరణముగా తెలిపినారు. ప్రస్తుతసమాజంలో మానవుని మతపరైక జీవనం గురించి మాట్లాడుతూ వారు యిలా అన్నారు.

"ఒక మనిషి వృత్తి లేక సామాజిక విషయాలకు కేటాయించే గంటలలో కాని అతని శాస్త్రీయ లేక కళాత్మక ఘటనలలో కాని మతము జొరబడదు. వాస్తవికంగా దానికి ముఖ్య కేటాయింపులు వారంలో ఒక్కరోజు మాత్రమే ఉండి ఆరోజు మాత్రం యితర ప్రపంచ సంబంధిత విషయాలను విస్మరిస్తాడు. నిజానికి అతని జీవనం రెండు భాగాలు. అందులో మతంలో మమేకమైన భాగం ప్రధానమయినది. అతని విశ్రాంతి రోజున అతడు తీవ్రంగా ఆలోచించే విషయాలు జీవన్మరణ ప్రశ్నలకు సంబంధించినవి. దీనికి చేర్చాల్సినవి అతని ప్రార్థనా అలవాటు, భోజనము వద్ద కృతజ్ఞతలు తెలుపుట. మతమే అతని పుట్టుక, చావు, జీవన గమనము. వివాహములను ధర్మ బద్ధంగా అనుష్టానిస్తుందనే భావన

అంతరాంతరాళలో ఉంటుంది. రూపకరీత్యా లేక మత భావన అతిగా ఉన్నందువల్ల వ్యాపారాన్ని మరియు సంతోషాన్ని కూడా అంకితం చేయవచ్చు".

మతపుట్టుక, చరిత్ర గురించి చదివే విద్యార్థులు, వారు ఆటవిక సమాజాన్ని గురించి చదివేటప్పుడు ఆ సమాజానికి సంబంధించిన మాయ, నిషిద్ధాలు, గణచిహ్నాలు. క్రతువులు, వారిని అంతర్లీనం చేస్తాయి. అందుమూలంగా ఆటవికుని సామాజిక ప్రక్రియలే మతానికి ప్రధాన భాగమవుతుందనే విషయాన్ని విస్మరించడమే కాక, వారు యింద్రజాలం, యితర అధిభౌతిక ప్రక్రియలకు కల సరియైన విధులను ప్రశంసించలేక పోతారు. మతాన్ని గురించి ఆలోచించే వారందరిని యీ తప్పిదము అతిగా నష్టపరచినది. ఎక్కువ మంది ప్రజల్లో మతాన్ని గురించి ఉండే తీవ్ర దురూహలకు పై తప్పిదమే కారణమయింది. మతం ఇంద్రజాలంలో నుంచి పుట్టిందని లేక ఇంద్రజాలంకోసమే ఇంద్రజాలంతో సంబంధముందని యిచ్చే వివరణ కన్నా పెద్దదోషము మరొకటి లేదు. ఆటవిక సమాజము ఇంద్రజాలాన్ని అభ్యాసము చేస్తుంది, నిషిద్ధాలలో నమ్మకముంది, గణచిహ్నాలను పూజిస్తుంది అనేది వాస్తవం కాని యివే మతానికి ఆధారాలవుతాయని లేక యివే మతాంతర్భాగమవుతాయని అనుకోవడం పొరపాటు. అలాంటి దృక్కోణము క్షణ భంగురాన్ని ముఖ్యమైనదిగా ప్రాశస్త్యాన్ని పెంచడమే. ఆటవికుని మతంలో ముఖ్యమైన విషయాలేవనగా మానవ మనుగడకు ఆవశ్యకమైన వాస్తవాలైన జీవం, మరణం, జననం, వివాహం మొదలయినవి. ఇంద్రజాలం, నిషిద్ధాలు, మరియు గణచిహ్నాలు అంతిమాలు కావు. అవి సాధనాలు మాత్రమే. అంతిమమైనది జీవనము, ప్రాణ పరిరక్షణ ఇంద్రజాలం, నిషిద్ధాలు మొదలైనవి. జీవితాన్ని పదిలపరచుకొనుటకు మరియు యీ చెడు ప్రభావాన్ని విన్యాసపరచి జీవితానికి ఎటువంటి హాని కలుగకుండా చూసుకొనుటకు మాత్రమే ఆటవిక సమాజం అవలంబించింది కాని వాటిని వాటి కోసము మాత్రము కాదు. పంట కోతలు, క్షామము లాంటి సన్నివేశాలు మతపరమైన ఉత్సవాలతో జత పడినవి ఆటవికునికి ఇంద్రజాలం, నిషిద్ధాలు, గణచిహ్నాలు ఎందుకంత ముఖ్యం? దీనికి గల ఒకే ఒక జవాబు ఏమిటనగా యివి అన్నీ జీవ పరిరక్షణను ప్రభావితం చేస్తాయి. జీవన ప్రక్రియ, ప్రాణసంరక్షణ ప్రధానమైన ఉద్దేశ్యాలవుతాయి. ఆటవిక సమాజానికి కేంద్ర బిందువయినది జీవనము, ప్రాణపరిరక్షణ. యీ రోజు భగవంతుడు ఇంద్రజాలం స్థానాన్ని తీసుకున్నప్పటికి, మతంలో దేవుడి స్థానాన్ని జీవ పరిరక్షణకు సాధనమవుతుంది.

వాస్తవాన్ని ఎవరూ మార్చలేరు. మతానికి కల అంతిమ లక్ష్యం సామాజిక జీవనాన్ని పదిలపరుస్తూ దాన్ని పవిత్రం చేయడమే.

మతాన్ని ఒక వ్యక్తి పరంగా గాని, సొంతమైనదని గాని లేక వ్యష్టి పరంగాగాని చూడడమనేది ఒక దోషమనే విషయానికి ప్రత్యేకంగా దృష్టిని సారించడమే గాక, పై చర్చ యీ భావనకు పూర్తి మద్దతునిస్తుంది. క్రింద తెలిపే విషయం ఆధారంగా పరిశీలిస్తే మతం వ్యక్తి పరంగాగాని, స్వంత మైనప్పుడు గాని లేక వ్యష్టి పరంగాగాని ఉండేటట్లయితే అది ప్రమాదహేతువు కాకపోవచ్చు కాని ఒక రూఢియైన దుశ్చేష్టకు మూలమవుతుంది. ఒక వ్యక్తిలో స్వాభావికంగా అంతర్లీనమైన ప్రత్యేక మత ప్రేరణ వికాసమే మతమనే భావన కూడా తప్పుడు భావనే. సరియైన భావన ఏదనగా భాషలాగే మతము కూడా సామాజిక మైనది. దీనికి గల కారణమేమిటనగా రెండూ సామాజిక జీవనానికి ఆవశ్యకాలు. వ్యక్తికి మతం కావాలి. ఎందుకనగా మతంలేనిదే అతను సామాజిక జీవనంలో పాలు పంచుకోలేడు.

సమాజంతో ప్రధానంగా సంబంధమున్నది కాబట్టి మతం సామాజికమైనట్లైతే మతానికి గల లక్ష్యం, విధి ఎట్టిది అనే ప్రశ్న సహజంగా అడగాల్సి ఉంటుంది.

మతానికి గల లక్ష్యాలనుద్దేశించి, నాకు తెలిసినంతవరకు అత్యుత్తమ వ్యక్తీకరణ 'ఛార్లెస్ ఎ ఎల్‌ఉడ్ ' చేసినది. [6] వారి ప్రకారము—

"మానవ వ్యక్తిత్వానికి, మానవ సమాజానికి ఆవశ్యమైన విలువలను మతము విశ్వమంతటా వికాసింపచేస్తుంది. తన చుట్టూ ఉన్న ప్రపంచం చాలా చిన్నదిగాను, క్షుద్రంగాను అగుపించినప్పటికి మానవుడు ఎప్పుడైతే తన చుట్టూ ఉన్న ప్రపంచాన్ని విలువకట్టడానికి ప్రయత్నిస్తాడో అపుడే మతం ఆవిర్భవిస్తుంది. మానవ, సామాజిక, భౌద్ధిక జీవనంలో ఎలాగైతే విలక్షణతలున్నాయో, మతం కూడా అలాగే మానవుని ఉచ్చ దశలో గల మేధాసంపత్తి మీద ఆధారపడి ఉంది. మానవుడొకడే మతైక జంతువు. ఎందుకనగా అతనికి గల అమూర్త భావన మరియు హేతువాద శక్తుల ద్వారా తన్నుతాను తెలుసుకోవడం అనే పదానికి గల పూర్తి అర్థం దృష్ట్యా, మనస్సు ఒకేసారి దాని విలువలను, భావనలను విశ్వజనీయం చేస్తుంది. ఎలాగైతే హేతుబద్ధ ప్రక్రియలు మానవునికివిశ్వజనీయ భావనల ప్రపంచాన్ని ప్రసాదించాయో అలాగే మత ప్రక్రియలు విశ్వజనీన విలువలను

ప్రసాదించింది. మానవుని ఉపదేశాలకన్నా మతప్రక్రియలు అతని ప్రేరణలు,ఉద్రేకాలు హేతుబద్ధీకరణ చేసే ప్రక్రియలవుతాయి కాని మరొకటి కానేరవు. హేతువేదైతే భావనలకు చేస్తుందో, మతం అనుభూతులకు అదే చేస్తుంది. అది విశ్వజనీనం చేస్తుంది. అలా విశ్వజనీనం చేయడంలో అది వాస్తవ ప్రపంచానికి వాటిని సంగతమయ్యేటట్లు చేస్తుంది".

మతము సామాజిక విలువల్ని విశ్వజనీనం చేయడమే కాక వాటని ఉద్ఘాటిస్తుంది. అతని మనస్సుకు హత్తుకునేలా చేస్తుంది. ఎందుకంటే మానవుడు సమాజ అంగీకృతి కల సభ్యునిగా చలామణీ కావడానికి అతని అన్ని కార్యాలలో సామాజిక విలువల్ని గుర్తించాల్సి ఉంటుంది. కాని మతానికున్న లక్ష్యం దీనికన్నా మించినది. అది వారిని ఆధ్యాత్మీకరిస్తుంది. ఆచార్య 'ఎల్‌ఉడ్' యిలా అభిప్రాయపడినారు[6] "మతం వ్యవహరించే మానసిక, సామాజిక విలువల్ని పురుషులు 'ఆధ్యాత్మికం' అని పిలుస్తున్నారు. యిది ఇంకొక విధంగా చెప్పాలంటే ఆధ్యాత్మిక విలువల్ని ప్రస్ఫుటీకరిస్తుంది. ఏ విలువలైతే వ్యష్టి మరియు సామాజిక జీవనంతో సంబంధముంటాయో అవే ఆధ్యాత్మిక విలువలు. మతము యీ విలువల్నిమనం చూసిన విధంగా విశ్వజనీనమై, వాస్తవంలోనికి చొచ్చుకు పోయేటట్లు చేస్తుంది. అంధత్వంతో కూడి, లక్ష్యంలేని శక్తుల ఆటలో యాంత్రికంగా అగుపడే విశ్వం కన్నా, మావవునికి మతం ఒక సామాజిక, నైతిక భావనను కలుగ చేస్తుంది. సామాన్యంగా అందరు అనుకునేటట్లు మతం ప్రధానంగా ఆత్మజ్ఞానం తెలిపే మనస్తత్వ శాస్త్రం కానప్పటికి అది మనస్సు, స్ఫూర్తి, జీవాన్నిఅన్నింటినీ ప్రస్ఫుటీకరిస్తుంది. అతి ప్రాచీనమైన మతం కూడా యిది చేస్తుంది. ప్రాచీన చలనాత్మకత లో కూడా మానసిక భావన మనలేకమానటే అనే భావనలలో ఉంది. అవి మనుష్యుల నుంచి గాని లేక ప్రధానంగా విషయాలను వ్యష్టిపరంగా చూసే దృక్పథంలో నుంచి గాని ఉత్పన్నమైనవే. కాబట్టి మతము ఆధ్యాత్మిక విలువల వాస్తవికతలో గల నమ్మిక, ఆ విలువల్ని అంతకు ముందు మనము చెప్పినట్లుగా, ప్రపంచమంతటా వ్యాపింపచేస్తుంది. అన్ని మతాలు - దేముడు లేని మతాలు కూడా - ఆధ్యాత్మికతను నొక్కి చెప్పడమే కాకా. దాని ఆధిపత్యంపై నమ్మక ముండి, దాని చివరి విజయానికి ఎదురుచూస్తుంటాయి".

సమాజంలో మతం నెరవేర్చవలసిన విధి కూడ అదే విధంగా తేటతెల్లమే. ఆచార్య ఎల్‌ఉడ్ ప్రకారము మతము చేయాల్సిన విధి[7]—

"సామాజిక నియంత్రణ కొరకు సాధనంగా మతం పని చేయాల్సి ఉంటుంది. అనగా వ్యక్తి జీవితాన్ని ఏ గణమైతే నియంత్రిస్తున్నదో ఆ గణ సామూహిక జీవనానికి నిర్దేశించబడిన మంచి కోసం పని చేయాల్సి ఉంటుంది ఏ వ్యక్తి గత అనుభూతులు లేక విలువ వ్యక్తం చేసే నమ్మకాలు మరియు అభ్యాసాల్ని గణం సమ్మతించదో వాటిని 'కపట యింద్రజాలమని' లేక వానితో కూడిన మూఢనమ్మకాలని వాటికొరకు ముద్ర వేస్తుంది. అలా ముద్ర వేయని పక్షంలో గణ జీవనంలో గల సంఘీభావత తీవ్రంగా అఘాతపడే అవకాశముందనే విషయం సుస్పష్టం అందువలన మతానికి గల ఆవశ్యకమైన సామాజిక స్వరూపము ప్రస్ఫుటమవుతుంది. పూర్తిగా వ్యష్టిపరమైన లేక వ్యక్తిగత మతమనేది. అదే కాలంలో సామాజికం కాకుండా మనకుండడానికి వీలు లేదు. ఎందుకంటే మనము సామాజిక జీవనాన్ని జీవించడమే కాకా, గణ సంక్షేమము అన్నింటిలో అందరూ తలంచవలసిన ముఖ్య విషయము".

యీ ప్రశ్నతోనే వ్యవహరిస్తున్నప్పుడుయింకొక చోటవారు యిలా అంటారు:

"చట్టానికి కాని, ప్రభుత్వానికి కాని ఏ విధైతే ఉందో అదే మతానికుంది. సామాజిక జీవన క్రమాన్ని పరిరక్షించటానికి, అందు మూలంగా వ్యక్తి నడవడిని నియంత్రించడానికి సమాజానికి మతమొక సాధనమవుతుంది. వ్యక్తి మీద సామాజిక పర నియంత్రణ కొరక పద్ధతిగా బుద్ధి పూర్వకంగా మతాన్ని ఉపయోగించక పోవచ్చు. కాని మతము సామాజిక నియంత్రణకొరక సాధనంగా పని చేస్తుందనేది వాస్తవం. మతంతో పోల్చిచూసినపుడు ప్రభుత్వము, చట్టము సాపేక్షికంగా సామాజిక నియంత్రణకు అసంపూర్ణ సాధనాలే. శాంతి భద్రతలు, చట్టం ద్వారా చేసే నియంత్రణ సమాజంలో శాంతికి స్థిరత్వాన్ని ఆపాదించడానికి సమాజంలోతుల్లోకి సుదీర్ఘంగా పోజాలవు. కాని ఇంకొక దిశలో చూచినట్లయితే మత పరమయిన అభయం. అది అదిభౌతికం కాబట్టి సామాజిక నియంత్రణకు అతి సామర్థ్యము గల సాధనమవుతుంది. ప్రభుత్వము, చట్టము గతంలో ఉన్న సమర్థతో కన్నా, లేక మున్ముందు కాలంలో ఉండే సమర్థత కన్నా యిది ఎన్నోరెట్లు సమర్థవంతమైనది. మతపరమైన మద్దతు లేనిదే ప్రభుత్వము మరియు చట్టము సామాజిక నియంత్రణకొరక సముచితసాధనాలు కానేరవు. సామాజికాకర్షణకు మతము ఒక అతి బలవంతమైనశక్తి, యీశక్తి లేనిదే సామాజిక క్రమాన్ని దాని కక్ష్యలో నిలబెట్టడం దుర్లభమవుతుంది".

పై చర్చమతాన్ని ఒక సామాజిక వాస్తవమని మతానికొక ప్రత్యేక సామాజికోద్దేశ్యము మరియు ఒక నిర్దిష్టసామాజిక విధి ఉందని విదితము చేయడానికి ఉపక్రమించినప్పటికి, అదిఏమని నిరూపించదలచుకున్నదనగా ఎవరైతే ఒక మతాన్ని ఒప్పుకోవలసి వస్తుందో అతనికి ఆమత లక్ష్యాలను ఆమతం ఎంతవరకు నెరవేర్చిందనే విషయాన్ని అడగడానిని హక్కు ఉండాలి. దీనికారణంగానే బాల్‌ఫోర్ ప్రభువు క్రియాత్మకత్వము, క్రైస్తవానికన్నా మెరుగైనదనే విషయానికి తన అంగీకృతిని తెలిపేముందు కొన్ని సూటి ప్రశ్నలను క్రియాత్మక వాదులను ప్రశ్నించడం సమర్థనీయమే. అతను కొంత శక్తివంతమైన పదజాలముతో అడిగినారు. "జీవితావసరాలతోనుఅత్యల్ప పరిరక్షణగల జీవనంతో సతమతమయ్యే నిత్యజీవిత పోరాటంలోం నిమగ్నమై దాని క్రింద అణిగిపోయే ప్రజానీకాని మానవజాతి నటిస్తున్న పెద్ద నాటకంలో వారు నిర్వహించే ఖచ్చితమైన పాత్ర గురించి ఆలోచించగల వ్యవధికాని విరామ సమయం గాని లేని వారికి మరియు క్రియాత్మకతకు గల ప్రాముఖ్యత గాని దాని ఉద్దేశ్యాలనుగాని కనుక్కున్నందువలన కలవరచెందేవారికి క్రియాత్మకత ఏమని తెలుపుతుంది? ఏ మానవుడు అత్యల్ప విలువ కలిగి ఉండడని స్వర్గాలను సృష్టించిన విధాత దృష్టిలో అతనికి అనంతమైన విలువ ఉంటుందనే విధంగా లేక యీ భౌతిక వ్యవస్థ ఏమి మిగలకుండ కుప్పకూలిపోయిన తరువాత కూడా అతని చర్య దుర్బలమైనప్పటికి దానికి అనంత చలనాత్మక పరిణామాలు ఉంటాయని మానవాళి క్రియాత్మకత విశ్వాసాన్నివ్వగలదా? వియోగాన్ననుభవిస్తున్నవారికి బలహీనులకు శక్తిని పాపం చేసిన వారికి క్షమాభిక్ష, అలసిపోయి జీవన భారాన్ని మోస్తున్నవారికి క్రియాత్మక స్వాంతన నివ్వగలదా?"

క్రియాశీలురలను ఏవైతే ప్రశ్నలను బాల్‌ఫోర్ ప్రభువు అడిగినారో, అవే ప్రశ్నల హిందూయిజాన్ని ప్రవచించే వాళ్ళను అస్పృశ్యులు అడుగవచ్చు. అస్పృశ్యులు యింక ఎక్కువ ప్రశ్నలు కూడా వేయవచ్చు. వారు యిలా అడుగ వచ్చు . హిందూయిజ వారి విలువను మానవులుగా గుర్తిస్తున్నదా? వారి సమానత్వానికి అది నిలబడుతుంద స్వేచ్ఛ వల్ల కలిగే లాభాన్ని వారికి యిది అనువర్తిస్తుందా? అది కనీసము హిందువు మధ్య అస్పృశ్యుల మధ్య స్నేహబంధాన్ని ముడి వేయడానికి దోహదపడుతుంద అస్పృశ్యులు తమ సంబంధీకులేనని అది హిందువులకు బోధిస్తుందా? అస్పృశ్యుల మనిషిగా చూడలేకపోవడం లేక పశువుగాగాని వ్యవహరించడం పాపమని అది హిందువుల

"దళితుడెవరైనా హిందూ దేవాలయంలో ప్రవేశించేందుకు అనుమతించినా అతను నాలుగు కులాల్లో దేంట్లోనైనా సభ్యుడు కావటానికి అంగీకరించరు. కుల వ్యవస్థలో చివరి వాడుగానో, పంచముడుగానో, అతి తక్కువ వాడుగానో చూస్తారు. ఇది అస్పృశ్యత కన్నా ఘోరం. అంతేకాక కులాల నిబంధనలకు,అవమానాలకు గురికావలసి వస్తుంది. అలా ఎవడైనా చెపితే దళితులు అతన్ని కుల పిచ్చి గాడని అసహ్యించుకుని పక్కకు నెడతారు. కోట్లాది దళితులు కుల నిబంధనలకు తల ఒగ్గరు. అలా ఒగ్గితే వాళ్ళు ముక్కలు చెక్కలవుతారు.

"దేవాలయ ప్రవేశాన్ని శాసనం ద్వారా బలాత్కారంగా అమలు జరపలేము. గ్రామాల్లో హిందూ కులస్థులు బాహాటంగానే శాసనాన్ని త్రోసి వేస్తారు. అది పల్లె వాసపు దళితుడికి కాగితం మీద 'పంచదార' అని రాసిచ్చి రుచి చూడమని అడిగినట్లుంటుంది.

"దేశంలోని గందర గోళానికి, అలజడికి తావివ్వకుండా పై పేర్కొన్న విషయం ప్రజల ముందుంచటం జరిగింది."

కాని దళితులకు దేవాలయ ప్రవేశం హిందువులు చెల్లించుకోవలసిన మూల్యమని భావించారు శ్రీ గాంధీ. దానికనుగుణంగానే పూనా ఒడంబడిక జరిగిన మరు క్షణం నుంచే అస్పృశ్యులకు దేవాలయ ప్రవేశం కల్పించాలని హిందువుల్లో ప్రచారం ప్రారంభించాడు.

ఈ విషయంలో గాంధీ గారు సాధించిందెంత అని అడగటం న్యాయమే. కాని నిజానిజాలు తెలుసుకోవటం కష్టం. ఆయన నిరాహార దీక్ష ఫలితంగా హిందువులు అస్పృశ్యుల కోసం చాలా దేవాలయాల్ని తెరిచారు. ఇందులో ఎంత నిజమో, కాంగ్రెస్ వాళ్ళ అబద్దపు ప్రచారమెంతో చెప్పటం కష్టం. తన నిరాహార దీక్ష పుణ్యమా అని అస్పృశ్యులు ప్రవేశించిన ఎన్నో దేవాలయాల్ని శుద్ధిచేసి మళ్లీ అస్పృశ్యుల్ని చేరనివ్వకుండా మూసేశారనేది వివాదానికి తావులేని సత్యం. మళ్ళీ దేవాలయాలు తెరవటం అర్థం లేని పని. వందలాది, వేలాది దేవాలయాలు పూజా పునస్కారాలు లేకుండా పడి ఉన్నాయి. అవిప్పుడు గాడిదలకు నివాసాలు. అలాంటి దేవాలయాలు అస్పృశ్యుల కోసం తెరవటమంటే అర్థం లేని చేష్టే కాదు అది వాళ్ళని అవమానపర్చినట్లే. అయినా అస్పృశ్యుల కోసం దేవాలయాలు తెరవచ్చు. కాని హిందువుల చేత వదలివేయబడ్డ దేవాలయాలు తెరిస్తే

వదిలి వేయడం ఆవశ్యకమయే వేరొక కారణముంది. హిందూయిజంలో అస్పృశ్యత ఒక భాగము. ఎవరైతే విద్యతో సంపన్న సంస్కరణ వాదులమని నటిస్తారో వారు అస్పృశ్యత హిందూయిజంలో భాగం కాదు అన్నప్పటికీ, అస్పృశ్యతను పాటిస్తారు. హిందువుకు హిందూయిజం నమ్మడం ఒక విషయం కాదు. తన కన్నా తక్కువ స్థాయిలో మిలియన్ల మంది అస్పృశ్యులున్నారనీ మనో స్థితి అతని ఆధ్యికతను పెంచుతుంది. కాని ఒక అస్పృశ్యునికి తను హిందూయిజంలో నమ్మకముందంటే తను ఒక అస్పృశ్యుడని అతను అంగీకరిస్తున్నాడని, అతను అస్పృశ్యుడు కావడానికి దైవ నిర్ణయమే కారణమని ఎందుకంటే హిందూయిజమే దైవ నిర్ణయం. అస్పృశ్యుడు ఒక హిందువు గొంతును కోయడు. కాని అతను అస్పృశ్యుడని ఒప్పుకుంటాడని అనుకోవాల్సిన అవసరం లేదు. అది నిజం కూడా అలాంటి ఒప్పుదలను ఇచ్చి ఆత్మ చంపేసుకునే అస్పృశ్యుడు ఎవరుంటారు? అస్పృశ్యుల ఆత్మగౌరవానికి, మర్యాదలకు హిందూయిజం తగినది కాదు అనే బలవత్తరమైన కారణమే అస్పృశ్యులను వేరొక ఉత్తమ విశ్వాసానికిమార్పిడి చెందడాన్ని సమర్థిస్తుంది.

మార్పిడికి కల తర్కము ఎదరులేని దని తెలిసినప్పటికి మార్పిడిని వ్యతిరేకించేవారు. సంతృప్తి చెందడానికి ఇష్టపడటం లేదు. ఇంకా ప్రశ్నలడగటానికి పట్టుబడతారు. వాళ్ళెప్పుడు చాలా ఆతురతతో అడిగే ప్రశ్న వారి దృష్టిలో జవాబు చెప్పలేని మరియు కఠినమైన ప్రశ్న ఒకటుంది, విశ్వాసము మార్చుకున్నందువలన అస్పృశ్యులు భౌతికంగా ఏమి లాభ పడ్డారు? ఆ ప్రశ్న క్లిష్టమైనది ఏమీ కాదు. దీనికి తేలికగా జవాబియ్యొచ్చు. మార్పిడిని ఒక ఆర్థిక లాభం కోసం ఉపయోగపడే సన్నివేశ మవ్వాలని అస్పృశ్యుల కోరిక కాదు. మార్పిడి వల్ల సంపదను అస్పృశ్యులు పొందుతారనేది కూడా నిజము కాదు. వారు హిందువులుగా ఉన్నంతవరకూ వారు పేదవారుగా ఉండడం వారి దుర్విధి కాబట్టి వారికి మార్పిడి వల్ల ఎటువంటి నష్టము వాటిల్లదు. రాజకీయంగా అస్పృశ్యులకు యిచ్చిన రాజకీయ హక్కులను కోల్పోతారు. ఇది కూడా ఎటువంటి యధార్థ నష్టం కాదు. ఎందుకంటే వాళ్ళు మార్పిడి ద్వారా ఏ సమాజాన్నయితే చేరదలుచుకున్నారో అ సమాజాన్ని కుండే రాజకీయ హక్కులు వారికి సంక్రమిస్తాయి. రాజకీయంగా లాభం కాని, నష్టంకాని లేదు. అస్పృశ్యులు నిరపేక్షంగా మరియు ఎంతో మేరకు సామాజికంగా లాభపడతారు. ఎందుకనగా మార్పిడి వల్ల జీవిత విలవలన్నింటిని విశ్వజనీనం చేసి అన్ని

విలువల్ని సమానం చేసే మతమున్న సమాజంలో అస్పృశ్యులు సభ్యులవుతారు. వారు హిందూ పరిధిలో ఉన్నంత కాలం అటువంటి దీవెన వారికి ఆలోచించడానికి కూడా వీలులేనిది.

జవాబు సంపూర్ణం కాని అది సంక్షిప్తంగా ఉన్న కారణాన మార్పిడిని వ్యతిరేకించేవారిని సంతృప్తి పరచకపోవచ్చు. అస్పృశ్యులకు మూడు విషయాలు ఆవశ్యకము. వారి మొదటి ఆవశ్యకత వారి సామాజిక వెలివేతను ఆపి వేయడం. రెండవ ఆవశ్యకతవారు తక్కువ స్థాయిలో ఉన్నామనే మనోస్థితికి స్వస్తి చెప్పడం. మార్పిడి వారి అవసరాలను తీరుస్తుందా? మార్పిడిని సమర్థించేవారికి వాదం లేదని మార్పిడి వ్యతిరేకుల కుండే భావన. అందువలనే వారు ఎప్పుడు ప్రశ్నలను లేవనెత్తుతుంటారు. అత్యంత బలవత్తరమైన వాదం కన్నా మార్పిడిని సమర్థించే వాదము బలవత్తరమైనది. ఏదైతే తేటతెల్లమో దానిని నిరూపించడానికి ఎవరూ సుదీర్ఘవాదనలు చేయరు. కాని అనుమానాలన్నింటికి ఒక ముగింపు పెట్టాల్సిన అవసరముంది కాబట్టి ఈ విషయాన్ని శోధించడానికి నేను సిద్ధపడినాను.. ప్రతి అంశాన్ని విడివిడిగా నేను తీసుకుంటాను.

వారి సామాజిక వెలివేతను వారు ఎలా ముగింపుకు తేగలరు? వారి సామాజిక వెలివేతను ముగించాలంటే ఉన్న ఒకే ఒక మార్గమేదనగా కులమనే జాడ్యంతో సంబంధంలేని, ఇంకొక సమాజంలోకి మమేకమై వారితో బంధుత్వ సంబంధాలు ఏర్పరుచుకోవాలి. దీని జవాబు చాలా తేలికైనప్పటికి ఎక్కువ మంది దీని యదార్థతను తక్షణమే ఒప్పుకునేట్టట్లు లేరు. దీనికి కారణమేమనగా అతి తక్కువ మంది బంధుత్వం సంబంధాలు విలువను మరియు ప్రాముఖ్యతను గుర్తించారు. అయినప్పటికి దాని విలువ మరియు ప్రాముఖ్యత చాలా ఎక్కువ. ఆచార్య రాబర్ట్‌సన్ స్మిత్ ఈ క్రింద మాటలలో [9] బంధుత్వమంటే అది ఏమి తెలుపుతుందనే దాన్ని వివరించారు—

"ఏ వ్యక్తుల జీవితాలైతే సమ్మిళితమై ఉండి ఒక భౌతిక ఏకత్వాన్ని ఒకే సామూహిక జీవనంలో భాగాలుగా వ్యవహరించబడతాయో, ఆ వ్యక్తుల సమూహమే ఒక కుదురు. ఒక కుదురులోగల సభ్యులందరూ ఒకే జీవన ప్రవంతికి చెంది, ఒకే రక్తాన్ని, ఒకే దేహాన్ని కలిగిన జీవమైన రాశి. ఇందులో అందరిని బాధ పెట్టకుండా ఏ ఒక్కరిని ముట్టలేము".

ఈ అంశాన్ని వ్యక్తి, గణ దృక్కోణాల నుంచి చూడవచ్చు. గణ దృక్కోనంలో బంధుత్వమేమి కోరుతుందంటే ప్రతి వారు మొట్టమొదట ఒక వ్యక్తి కాక, ఒక గణ సభ్యుడు వ్యక్తి దృక్కోణంలో గణముతో బంధుత్వ ముండటం వల్ల అతనికి కలిగే లాభము కుటుంబంలో సభ్యత్వం ఉన్నందువల్ల కుటుంబ సభ్యునిగా అతనికి కలిగే లాభాల కన్న తక్కువ ఉండదు, వేరుగా ఉండదు. తల్లి తండ్రుల మృదుత్వ సమన్వితమే కుటుంబ జీవనం. ఆచార్య మెక్‌డగల్ ఇలా ప్రస్ఫుటించారు;[10]

"ఉదారత్వము, కృతజ్ఞత, ప్రేమ, జాలి, నిజమైన కనికరం. ప్రతిరీతి పరార్థ పరత్వ నడవడి తల్లి తండ్రుల మృదుత్వాన్నుంచి లేక ఆభావావేశాన్ని ఆశించి పరిరక్షించే క్రమంలోనే జనిస్తాయి. ఇందులోనే వాటి ముఖ్యమైన నిరపేక్ష ఆవశ్యకమూలముంది. అది లేకుండా అవి ఉండలేవు".

సమాజాన్నుంచి సంఘాన్ని చూసినపుడు కుటుంబం మాత్రమే విస్తృతీకరించినపుడు సంఘమవుతుంది ఆచార్య మెక్‌డగల్ తెలిపినట్లు పైనచెప్పిన అన్ని సుగుణాలు కుటుంబం కలిగి ఉంటుందో సంఘానికి కూడా వాటినే వ్యక్తీకరిస్తాము.

ఒక సంఘంపరిధిలో బంధుత్వ సంబంధం కలిగిన కుదురులో ఎటువంటి విచక్షణ లేదు. అందులో ఉన్న ప్రతి ఒక్కరికి ఇతరులతో సమాన హక్కులు కలిగి ఉండడమనేది సంఘం గుర్తిస్తుంది ఆచార్యులు జాయి, టఫ్ట్‌లు యిలా వివరించారు—

"ఇంకొక దేశ పౌరునికి భూమిని స్వంతం చేసుకోవడానికి, దాని న్యాయ స్థానాల్లో దావా వేయడాన్ని ఒక రాజ్యం అనుమతించవచ్చు అతనికి కొంత మేరకు రక్షణ కూడా ఇస్తుంది. కాని మొదట చెప్పిన హక్కులు పరిమితంగా ఉంటాయి. కొన్ని సంవత్సరాల క్రితమే ప్రధాన న్యాయమూర్తి టానే సూత్రం తెలిపినట్లు అమెరికా సంయుక్త రాష్ట్రాలలో ప్రస్తుతంకల న్యాయ సిద్ధాంతం ఏదనగా తెల్లవాడు గౌరవించదగ్గ హక్కులు నీగ్రోలకు ఏవీ లేవని; జాతిగాని లేక ఏ ఇతర వ్యత్యాసాలను న్యాయ సిద్ధాంతం గుర్తించని చోట కూడా, ఇతర దేశస్థునికి వాస్తవంలో న్యాయం జరగటం అతి కష్టంతో కూడుకున్న విషయం ఆదిమ గణాల్లో లేక కుటుంబ సమూహాల్లో ఈ సూత్రం సంపూర్ణ శక్తితో వర్తిస్తుంది. ఒక సమూహానికి చెందినందుకు ఒక వ్యక్తికి ఉండే హక్కు న్యాయమవుతుంది.

ఇంకొక విధంగా కాదు. ఒక గణం లేక కుటుంబం లేక గ్రామీణ సంఘానికి చెందిన సభ్యునికి హక్కు ఉంది, కాని పరాయి వారికి ఎటువంటి స్థానముండదు, ఒక అతిథిగా అతనిని దయతో చూడవచ్చు కాని అతని సమూహంలో తప్ప ఇంకొక సమూహంలో న్యాయాన్ని హక్కుగా కోరలేడు. ఒక సమూహపు పరిధిలోగల హక్కుల గురించి ఉన్న భావనలోనే ఆధునిక పౌర చట్టానికి గల రూపాకృతి ఉంది. ఒక గణానికి వేరొక గణానికి మధ్యగల వ్యవహారం యుద్ధానికి సంబంధించిన విషయం లేక సంప్రదింపులద్వారా నిర్ణయమయ్యే విషయం కాని చట్టానికి సంబంధించింది కాదు. గణమే లేని వ్యక్తి వాస్తవంలో పేరుతో కూడా చట్ట బహిష్కృతుడు"

ఒక సభ్యునికి జరిగిన అన్యాయాన్ని సంఘం బాధ్యత వహించి ఋజువు పర్చేలా బంధుత్వం చేస్తుంది. ఒక వ్యక్తికి జరిగిన అన్యాయానికి రక్త పాతం ద్వారా ప్రతీకారం తీర్చుకోవడం పరాశ్రయంగా చూసినపుడు ఒక ఆటవిక పద్ధతిగా అగుపడవచ్చు. ఆత్మాశ్రయంగా పరిశీలిస్తే ఒక సభ్యునికి జరిగిన అన్యాయానికి సంఘంలో గల ఇతర సభ్యుల సానుభూతితో కూడిన నిరసనకొక వ్యక్తీకరణ. ఒక బిడ్డకు జరిగిన అన్యాయాని ముఖాముఖీ ఎదుర్కోవలసి వచ్చినపుడు కలిగే తలి తండ్రుల మృదుత్వాన్నుంచి మృదు భావము, కోపము యొక్క సామూహికత్వమే సానుభూతితో కూడిన ని ఆధారము పై ఈ మృదు భావావేశాన్ని కోపాల సమ్మిళితము, సానుభూతితో కూ నిరసన బంధుత్వాన్నుంచి ఆవిర్భవించినవే. ఇది ఒక వ్యక్తికి ఎంత మాత్రం తక్కువ విలువ కలిగి నది కాదు. ఆచార్య మెక్‌డగల్ పదాల్లో "వ్యక్తి సమాజిక జీవనంలో మృదుభావావేశానికి కోపానికి మధ్యకల సన్నిహిత కలయిక చాలా ప్రాముఖ్యతను కల్గి ఉంది. నైతిక భావనావేశాల నిజ సిద్ధాంతానికి కల సరియైన అవగాహనకు పై కలయిక మౌలిక మయినది. ఎందుకంటే ఈ విధంగా ప్రకోపింపబడ్డ కోపమే నైతిక ఆగ్రహానికి జన్మవయ్యింది. అలాంటి నైతిక ఆగ్రహాన్ని ముఖ్యంగా పునాదిగా చేసుకొని అధిక భాగంగా న్యాయం మరియు పౌర చట్టము చేయబడింది."

బంధుత్వమే ఉదారత్వాన్ని జనింపచేయడమేకాక ఒక అన్యాయాన్ని సరిదిద్దడానికి ఆవశ్యకమైన నైతిక ఆశ్రయాన్ని కలుగ చేస్తుంది. ప్రస్తుతము అస్పృశ్యులు వారంతటవారే హిందువుల దౌర్జన్యాలను, అణచివేతను భరిస్తున్నారో, దాన్ని ఎదుర్కోవడానికి సన్నిహిత

సంఘ మద్దతును ఖరారు చేసుకోవడానికి బంధుత్వమొక మనశ్శక్తి. హిందువుల దౌర్జన్యానికి, హిందువుల అణచి వేతకు అభిముఖంగా అస్పృశ్యులు తీసుకోగల్గిన చర్య. ఉత్తమ పరిరక్షణ ఏదనగా ఇంకొక సంఘంతో బంధుత్వం.

ఒంటరి తనాన్ని ముగించటానికి, కులాన్ని గుర్తించని ఇతర సంఘంలో అస్పృశ్యులు తప్పక చేరాలనే ప్రతిపాదనను బంధుత్వమంటే ఏమిటి, అది ఏమి చేస్తుంది అనే పై వివరణను పరిగణలోకి తీసుకునే వారెవరైనా ఒప్పుకోవడానికి ఎటువంటి కష్టముండకూడదు.

ఒంటరి తనానికి ప్రతి వాదం బంధుత్వం. వారి ప్రస్తుత ఒంటరి తనాన్ని బంధుత్వాన్ని ఏర్పరచుకోవడమే హిందువులుగా ఉన్నంత కాలం వారి ఒంటరితనం ముగింపుకు రాదు. హిందువులుగా వారి ఒంటరితనం వారిని ముందు వెనుకల దెబ్బతీస్తుంది. హిందువులుగా ఉన్నప్పటికీ, ముస్లిములనుంచి, క్రిష్టియన్ల నుంచి వేరు వేరు చేయబడినవారు ఎందుకంటే హిందువులుగా వారు హిందువులకు, హిందువులుకాని వారికి విజాతీయులే. ఈ ఒంటరితనం ఒకే ఒక పద్ధతిలో ఏ ఇతర పద్ధతి కాకుండా ముగియగలదు. ఆ పద్ధతి ఏదనగా అస్పృశ్యులు ఏదైనా హిందువులు కాని సంఘంలో చేరి వారి చుట్ట పక్కాలు కావడమే. ఒంటరితనానికున్న నష్టాలు, బంధుత్వానికి గల లాభాలు తెలిసిన వారికి పై విధమైన చర్య అర్థవిహీతము కాని దని అంగీకరించాల్సి ఉంటుంది. ఒంటరితనానికి ఉండే పర్యవసానాలెట్టివి? ఒంటరితనానికి అర్థం సామాజిక వేర్పాటు, సామాజిక అవమానము, సామాజిక విచక్షణ మరియు సామాజిక అన్యాయము. ఒంటరితనానికి అర్థం రక్షణను ఇవ్వకపోవడం. న్యాయాన్ని అడ్డుకోవడం. అవకాశాన్ని కలుగనీకుండా చేయడం. ఒంటరితనమంటే సానుభూతి కావాలనే కోరిక, స్నేహం కావాలనే కోరిక, గుర్తింపు ఉండాలనే కోరిక . ఒంటరితనమంటే అది మాత్రమే కాకుండా హిందువుల పట్ల నిశ్చితమైన ద్వేషము, విరోధన భావము కలిగి ఉండడము. వేరొక దిశలో ఇంకొక సంఘంతో బంధుత్వ సంబంధమున్నందువలన ఆ సంఘంలో అస్పృశ్యులకు సమానమైన స్థాయి, సమానమైన రక్షణ, సమానమైన న్యాయం ఉండడమే కాకుండా, ఆ సంఘాన్నుంచి సానుభూతిని,. దాని సౌజన్యాన్ని కూడా పొందగలరు.

వ్యతిరేకులు లేవనెత్తిన ప్రశ్నలకు యిదియే సంపూర్ణ జవాబని నేను రూఢిగా చెప్పగలను. మత మార్పిడి వల్ల అస్పృశ్యులు ఎలా లాభపడగలరో ఇది విశద పరుస్తుంది.

ఈ విషయాన్ని ఇంకొంచం ముందుకు తీసుకు వెళ్ళి మార్పిడికి వ్యతిరేకులయిన వారు ఇప్పటికి లేవనెత్తకపోయినప్పటికి, లేవనెత్తడానికి అవకాశమున్న ప్రశ్నను కూడా వదిలి వేయవచ్చు. ఆ ప్రశ్న ఏదనగా బంధుత్వాన్ని స్థాపించడానికి మార్పిడి ఎందుకవసరమవుతుంది?

సంఘానికి సమాజానికి మధ్య బంధుత్వానికి పౌరసత్వానికి మధ్య వ్యత్యాసముందనే విషయాన్ని మనస్సులో గుర్తుంచుకున్నట్లయితే ఈ ప్రశ్నకు జవాబు అదంతట అదే ప్రస్ఫుటమవుతుంది.

సంఘం అనే పదానికి కల ఖచ్చితమైన అర్థంలో చూసినట్లయితే అది ఒక కుదురు లేక బంధుత్వము కల వాళ్ళ సమూహము. సమాజము ఎన్నో సంఘాలు లేక ఎన్నో వివిధ కుదుర్ల కలయిక ఒక సంఘాన్ని కలిసికట్టుగా ఉంచే బంధనాన్ని బంధుత్వమని పిలుస్తున్నాము. సమాజాన్ని కలిసికట్టుగా ఉంచే బంధనాన్ని పౌరసత్వమంటున్నాము.

సమాజంలో పౌరసత్వాన్ని పొందడానికి ఉపయోగించే సాధనాలు, సంఘంలో బంధుత్వాన్ని పొందడానికి ఉపయోగించే సాధనాల కన్నా వేరుగా ఉంటాయి. పౌరసత్వం సహజత్వం ద్వారా పొందేది. పౌరసత్వాన్నిపొందడానికి ఉండే ముందు పరిస్థితి ఏదనగా రాజకీయ విశ్వాసాన్ని రాజ్యం పట్ల ప్రకటించడమే. బంధుత్వాన్ని పొందడానికి ఉండాల్సిన పరిస్థితులు వేరుగా ఉన్నాయి. మానవ పరిణామ క్రమంలో ఒకానొక దశలో సంఘంలోకి స్వీకరించడానికి కల పరిమితి ఒకే రక్తం కలిగి ఉండడం. వీరందరి రక్తనాళాలలో ఒకే రక్తం ప్రవహిస్తూ ఉన్నదనేది. ఒకే పూర్వీకులనుంచి వారందరూ జనించినారనే భావన కల వ్యక్తుల సమూహమే సంఘం. ప్రతి గణము ఒకే పూర్వీకుల్నుంచి జన్మించారా లేదా అనే విషయము ముఖ్యం కాదు. నిజానికి వారి పూర్వీకుల్నుంచి ఉద్భవించకపోయినప్పటికి, కొత్తవారిని సంఘంలో ఒక గణము చేర్చుకుంది. ఒక విజాతీయుడు ఏడుతరాలుగా ఒకే గణంలో వివాహాలు చేసుకున్నట్లయితే, అతను ఆ కుదరులో సభ్యుడవుతాడనే ఒక సూత్రముండడం గమనించదగ్గ విషయం. మిధ్య అయినప్పటికి, కుదురులోనికి ప్రవేశానికి ఒకే రక్తముండాలనే ప్రతిబంధకము ఉండడమనేది ఒక ముఖ్య విషయం.

మానవ పరిణామ తరువాతి దశలో ఒకే రక్తముండాలనే విషయానికి మారుగా ఒకే మతముండాలనేది బంధుత్వానికి ఒక పరిమితి అయింది. దీనికి సంబంధంగా ఆచార్య రాబర్ట్‌సన్ స్మిత్ సూటిగా తెలిపిన ఒక ముఖ్య వాస్తవాన్ని మనస్సులో ఉంచుకోవాల్సి ఉంటుంది.[11] ఒక సామాజిక వ్యవస్థలో మనుష్యులే కాక, దేముళ్ళు మనుష్యులు కలిసి ఉంటారు. అందుకని ఎవరైనా ఒక కొత్త మనిషి ఆ సంఘంలో ప్రవేశించాలనుకుని మరియు బంధుత్వ బంధనాన్ని ఏర్పరచుకోవాలనుకున్నపుడు ఆ సంఘపు దేముడిని కాని దేముళ్లను కాని అంగీకరించాల్సి ఉంటుంది. పాత టెస్ట్‌మెంట్ నయామి రూత్‌కు తెలిపే ఒక వివరణ "నీ సోదరి ఆమె జనాల దగ్గరికి, ఆమె దేవుళ్ళ దగ్గరికి వెళ్ళింది" మరియు దీనికి రూత్ సమాధానము " మీ జనాలే నా జనాలు, మీరే దేవుడు నాదేవుడు" లేక ముల్లైట్లను మోషే పుత్రులని, పుత్రికలని పిలవడము ఒక సంఘంలో బంధుత్వ అనుబంధానికి నిదర్శనాలే కాక ఒకే మతానికి బద్ధులైనందువల్ల వచ్చే పర్యవసానం. అందరికి ఒకే విధంగా వర్తించే మతం లేనిదే బంధుత్వం లేదు.

మార్పిడిని సమర్థించే వాదనలతో తప్పులు ఎన్నడానికి ప్రజలు వేచి ఉంటే, తప్పులు ఎన్నేవారికి ఎటువంటి సంశయము కాని తప్పుడర్థం గాని ఉత్పన్నంకావడానికి అవకాశం లేని విధంగా ఉండడం మంచిది. అందుకని మతము ఏ విధముగా, ఎటువంటి పద్ధతిలో బంధుత్వ అనుబంధాన్ని పెనవేయగలుగుతుంది. వివరించడం మంచిది. దీనికి జవాబు తేలికైనది. సమిష్టిగా తినడం ద్వారా, త్రాగడం ద్వారా బంధుత్వ మేర్పడుతుంది కుల వ్యవస్థను సమర్థించడంలో హిందువులు కలసి తినే పద్ధతిని ఎగతాళి చేస్తారు. కలిసి తినే పద్ధతిలో ఏముంది? అని వారు అడుగుతారు. సామాజిక శాస్త్ర దృష్ట్యా దానికి జవాబు ప్రతిదీ దానిలోనే ఉంది. బంధుత్వము సోదరత్వానికి ఒక్క సామాజిక ఒడంబడిక. అది బంధించే ముందు, ఇతర ఒడంబడికల్లాగానే సంతకము చేయబడాలి. ముద్ర వేయించుకోవాలి. బట్వాడా చేయబడాలి. ఏ విధంగా సంతకం చేయాలి, ముద్ర వేయాలి, బట్వాడా చేయాలనే పద్ధతి మతం నిర్ణయించే పద్ధతి అవుతుంది. ఆపద్ధతి ఒక యజ్ఞ భోజనంలో పాల్గొనడమే. ఆచార్య స్మిత్‌గారు [12] తెలిపినట్లు-

మనుష్యులు కలిసి తిని త్రాగి నపుడు ఏర్పడే లేక ప్రకటించబడే మైత్రి అంతిమ స్వరూప మెట్టిది? మనమున్న సంక్లిష్ట సమాజంలో మైత్రి ఎక్కువ తరహాల్లో ఉండడమే కాక ఎక్కువ అంతరాలు కలది. కొన్ని విషయాల్లో విధి నిర్వహణ, గౌరవాన్ని కాపాడడం

అనే భావం వల్ల మనుష్యులు ఒకటి కావచ్చు మిగతా విషయాల్లో వేరుగా ఉండవచ్చు. ప్రాచీన కాలాల్లో కూడా వివిధ రకాలైన సంబంధాల మీద ముద్రవేయడానికి అందరిని కలిపే ఒక పవిత్ర భోజన ముండేదని పాత టెస్ట్‌మెంట్‌లో మనం కనుగొనవచ్చు. కాని ప్రతి ఒక్కరి విషయంలో వారి సంబంధము నిరపేక్ష మైనది. ఉల్లంఘించరానిది. ఆసంబంధము ఎటువంటి దంటే నీతి భాషలో చెపితే అది ఒక సంపూర్ణ బాధ్యతగల విధి మరీ పురాతన సమాజంలో నిరాపేక్షమైన, ఉల్లంఘించలేని మైత్రి భావము ఒకే రకమైనదుంది. ఆదిమానవునికి ఇతర మనుష్యులందరూ రెండు వర్గాలుగా ఉంటారు. వారి జీవితము పవిత్రమైనదనుకునే వర్గము. అది పవిత్రముకాని దనుకునే వర్గము. మొదటి వర్గములో చేరిన వారందరూ అతనికి ఆత్మీయులు. ప్రతి మనిషి జీవితము ఇతర మిత్రులందరికి పవిత్రమనుకునే చట్రములోకి వారిని తెచ్చేంతవరకూ వారిలో ఎటువంటి ఉల్లంఘించలేని బంధాన్ని ఏర్పరచుకోవడమనేది కల్ల కాబట్టి మిగతా వారందరూ క్రొత్తవారు. భవిష్యత్తులో శత్రువులు కాదగ్గవారు.[23]

అస్పృశ్యులకు పౌరసత్వమొకటే వారి ఒంటరి తనానికి, దాని నుంచి వచ్చే కష్టాలు ఒక ముగింపు తేవడానికి సరిపోనట్లయితే, బంధుత్వమొకటే దానిని నయము చేస్తుందనుకుంటే వారు ఏ సంఘపు బంధుత్వాన్ని కోరుకుంటున్నారో ఆ సంఘపు మతాన్ని స్వీకరించుకోవాలి.

ఇంత వరకూ చేసిన వాదన మార్పిడి అస్పృశ్యుల ఒంటరితనాన్ని ఎలా ముగించగలదని తెలుపడానికి నిర్దేశించబడినది. ఇంకొక రెండు ప్రశ్నలు పరిగణించాల్సి ఉన్నవి. వారి న్యూనతా భావాన్ని మార్పిడి తొలగించగలదా? దీనిని ఎవరూ సిద్ధాంతీకరించలేరు. కాని ఈ ప్రశ్నకు జవాబు అవును అని చెప్పడానికి ఎటువంటి సందేహముండ కూడదు. వారి సామాజిక వాతావరణము, స్నేహతత్వము లేనిదిగాను, వ్యత్యాసీకరించేదిగాను, ఒంటరి తనముండేదిగాను ఉన్నందువలన దాని ఫలితము అస్పృశ్యుల న్యూనతా భావము. ఈ భావాలే వారిలో నిస్సహాయతను కలుగచేసి వారిలో న్యూనతా భావానికి కారణభూతమవడమేకాగ అతని ఆత్మ స్థైర్యాన్ని పోగొట్టుకునేలా చేసింది.

ఈ అస్పృశ్యుల మనస్తత్వాన్ని మతము మార్చగలదా? మానసిక శాస్త్రజ్ఞుల అభిప్రాయము ప్రకారము ఆ మతము సరియైనదైతే, వ్యక్తిని హేయమైన విలువలని

అస్పృశ్యులుగా చూసే మతములా కాకుండా తోటి మానవునిగా చూసేదైతే. మతము చికిత్స చేయగలదు. ఇతర మనుష్యులతో పాటు తను కూడా సమానమే అనే భావనను కలుగచేసే అవకాశాలుండే వాతావరణాన్ని మతము ఇవ్వగలిగితే అటువంటి మతము లోకి మార్పిడి అస్పృశ్యుల న్యూనతా భావానికి ఆధారమైన ఎన్నో సంవత్సరాల తరబడి ఉన్న నిరాశావాదాన్ని ఎందుకు తొలగించదనడానికి కారణంలేదు. ఆచార్య ఎల్‌ఉడ్ తెలిపినట్లు—

"మనిషి భావాలను విశ్వజనీనం చేయడం కన్నా, అతని సంకల్పాన్ని ఆవేశాల్ని విశ్వజనీనం చేసే మతం ప్రధానంగా వైఖరులను మూర్తీకరించేది. సంకల్పం భావావేశపక్షాన అతని ప్రపంచంలో మనుష్యులను సామరస్యీకరిస్తుంది. అందువల్ల నిరాశావాదానికి మరియు నిస్పృహకు అది ఒక రుసుము. ఆటవికునికి, నాగరికుని జీవన సంగ్రామములో అది ఆదశను కల్పించడమే కాక విశ్వాసాన్నిస్తుంది. మనము ఇంతవరకు చెప్పినట్లు అది అలా చేస్తుంది. ఎందుకనగా అది జీవితావశ్యక భావావేశాలను గట్టి పరుస్తుంది. అది క్రింద జీవన కేంద్రాలన్నింటిని ఎగువ నున్న జీవన కేంద్రాలను ఉద్దీపింపచేసే అనుసరణ ప్రక్రియ అయినందువలన మనస్తత్వ శాస్త్రజ్ఞుల ప్రకారము అది జీవితావశ్యక భావాలను గట్టి పరచటానికి ఒక కారణమయింది. వేరే మాటల్లో అంటే మనస్తత్వ భౌతిక మాటల్లో, విలువల విశ్వజనీనత అంటే క్రింది నాడీ కేంద్రాలు. వాటి శక్తిని ఎగువనున్న నాడీ కేంద్రాలకు ప్రవహింప చేస్తాయి. అలా చేసి అంతర్గతంగా జీవన సామర్థ్యానికి గల ఆయువు పట్టును సామరస్యీకరించడమేకాక దాన్ని గరిష్ఠీకరిస్తుంది. ఈ విధంగా మతము జీవిత సంక్షోభాన్ని ఎదుర్కోవడానికి కొత్త శక్తులను ఉజ్జీవనం చేస్తుంది. అదే కాలంలో అంతర్గత, బహిర్గతాల మధ్య ఒక నిగూఢ సామరస్యాన్ని తెస్తుంది."[3]

అస్పృశ్యుల సామాజిక స్థాయిని మార్పిడి పెంచగలదా? ఈ ప్రశ్నకు సంబంధించి రెండు దృక్పథాలు ఎలా ఉంటాయనేది ఊహించటమూ కష్టమే. పేరులో ఏముంది అనే ప్రశ్నకు ఎక్కువ సార్లు ఉదహరించే షేక్స్పియర్ జవాబు పేరుకుండే సమస్యను అవగాహన చేసుకోలేదు. పేర్లు ఎటువంటి ఉద్దేశ్యము కలిగి లేనప్పుడు రోజాపుష్పాన్ని ఏ పేరుతో పిలిచినా దాని వాసన తియ్యగానే ఉంటుంది. పేర్లమీద ఆధారపడడం కన్నా ప్రజలు ఒక్కొక్కరిని విడిగా పరిశీలించి వారి భావాలను, దృక్కోణాలను పరిశీలన ఆధారంగా ఏర్పరచుకోవాలి. దురదృష్టవశాత్తు పేర్లు చాలా ముఖ్యమైన లక్ష్యాన్ని

నిర్వర్తించగలవు. సామాజిక ఆర్థిక వ్యవస్థలో అవి ప్రముఖ పాత్రను వహిస్తాయి. పేర్లు ప్రతీకలు ప్రతి పేరు ఒక భౌతిక విషయానికి భావాలతో, అభిప్రాయాలతో కల సంబంధాన్ని వ్యక్తీకరిస్తుంది. అది ఒక గుర్తు. ఆగుర్తు ద్వారా ప్రజలకు అదేమిటో తెలుస్తుంది. ప్రతి వ్యక్తి గత విషయాల్ని పరిశీలించి ఆ భౌతిక విషయానికి సామాన్యంగా సంబంధించిన భావనలు, దృక్కోణాలు నిజమేనా అని పరిశీలన చేస్తే కష్టము తప్పుతుంది. ఎన్నో భౌతిక విషయాలతో ప్రజలు మెలగాల్సి ఉంటుంది. కాబట్టి వారికి ప్రతి విషయాన్ని పరిశీలించడం దుర్లభమవుతుంది. పేరును బట్టి వారు గుర్తించాల్సి ఉంటుంది. అందుకనే ప్రకటనలు చేసే వారందరూ ఒక మంచి పేరు కోసం నిశితంగా పరిశీలిస్తారు. పేరు ఆకర్షవంతంగా లేనట్లయితే ప్రజల దృష్టిలో ఆ వస్తువు మంచిదనిపించుకోదు.

అస్పృశ్యుడనే పేరు చెడ్డపేరు. అది అసహ్యం కలుగ చేస్తుంది. నిషేధిస్తుంది., దుర్వాసననిస్తుంది. అస్పృశ్యుడనే పేరే హిందువులకు అస్పృశ్యుల పట్ల గల సామాజిక దృక్పథాన్ని నిర్ణయిస్తుంది. అస్పృశ్యుడనే పేరులోనే నిబిడీకృతమైన దుర్వాసన అస్పృశ్యుని పట్ల గల మారని దృక్పథాన్ని నిర్ణయిస్తుంది. అతను ఎంత ప్రతిభావంతుడైనప్పటికి ప్రతి అస్పృశ్యుని వ్యక్తిగత గుణాలను పరిశీలించే మనస్తత్వము ప్రజలలో లేదు. అందరు అస్పృశ్యులకు ఈ విషయం అవగతమే. అస్పృశ్యులని కాకుండా మరొక పేరుతో పిలిపించుకోబడాలని అందరిలో ఒక సమిష్టి ప్రయత్నముంది. చామర్లు వారిని రవిడ్లు లేక జాతవులని పిలుచుకుంటారు. డోమ్‌లు శిల్పకారులనే పేరుతో వ్యవహరిస్తున్నారు. పరియాలు ఆదిద్రావిడులని, మాదిగలు అరుంధతీయులని, మహర్లు చొక్కమేలాలని లేక సోమవంశీయులని మరియు బంగీలు వాల్మీకు లనే పేర్లతో వ్యవహరిస్తున్నారు. వారి నివాస స్థలాలల్లో లేనట్లయితే వారందరూ క్రిష్టియన్లని పిలుచుకుంటున్నారు.

అస్పృశ్యులు వారిని అస్పృశ్యులు అని పిలుచుకునేటట్లయితే హిందువును బయటకు రప్పించి నట్లేకాక, అతని ఆగ్రహానికి, అతని ప్రతికూలతకు బలిఅవుతామని అస్పృశ్యులకు తెలుసు. అందువలనే వారు వారకి వేరే పేర్లను యిచ్చుకొని వర్ణవివక్షత నుంచి రక్షణను కల్పించుకునే ప్రక్రియలను చేపడుతున్నారు.

ఈ విధముగా వర్ణ వివక్షత నుంచి బయల్పడడమనేది దాని లక్ష్యాన్ని సామాన్యంగా నెరవేర్చకమానదు. హిందువులకు హిందువుగా ఉండడమనేది అంతిమ సామాజిక వర్గం

కాదు. అంతిమ సామాజిక వర్గమేదనగా కులం. ఇంకా ఉపకులముంటే ఉపకులం. హిందువులు కలిసినట్లైతే 'మీరెవరో నేను తెలుసుకోవచ్చా' అనే ప్రశ్న ఖచ్చితంగా అడుగుతారు. ఈ ప్రశ్నకు నేను హిందువును అన్న జవాబు సంతృప్తికరంగా ఉండదు. ఇది అంతిమ జవాబు క్రింద ఖచ్చితంగా ఒప్పుకోరు. వారి పరిశోధన ఇంకా తప్పక కొనసాగుతుంది. హిందువు అనే జవాబును తప్పక ఏకులము అనే ప్రశ్న వెంబడిస్తుంది. ఆ ప్రశ్నకు జవాబును తప్పక ఏ ఉపకులము అనే ప్రశ్న వెంబడిస్తుంది. పృచ్ఛకుడు అంతిమ సామాజిక వర్గాన్ని చేరిన తరువాతనే అనగా కులమో, ఉపకులమో, తెలిపిన తరువాతనే అతని ప్రశ్నలను ముగిస్తాడు.

క్రొత్త పేరును వర్ణ వివక్ష నుంచి రక్షణ కోసం స్వీకరించిన తరువాత ఆ క్రొత్త పేరు కూడా సహాయపడదని కనుగొంటాడు. అతనిని ఎడతెగని ప్రశ్నలతో వేధించి, ఇంకొక విధంగా చెప్పాలంటే అతన్ని భూమ్మీద కుదించి, అతను అస్పృశ్యుడు అని తెలువలసి ఉంటుంది. అతను అలా స్వతః సిద్ధంగా తెలిపిన దానికన్నా అతను దాచుకునేటట్లయితే,ఇంకా ఆగ్రహానికి బలి అవుతాడు.

పై చర్చ నుంచి రెండు విషయాలు తేటతెల్లం అవుతాయి. ఒకటేమిటంటే అస్పృశ్యుల తక్కువ స్థాయి అతని దుర్వాసన నొచ్చే పేరుతో జతపడి ఉంది. అతని రు మారిస్తే తప్ప అతని సామాజిక స్థాయి పెరిగే అవకాశమే లేదు. హిందూయిజంలో రును మార్చినంత మాత్రాన లాభం లేదు. అస్పృశ్యుడని చెప్పేదాక హిందువు ఆపేరును కూడా కూలంకషంగా పరిశీలించకమానడు.

పేరుకు ప్రాముఖ్యత ఉండడమే కాక అది చాలా ప్రాధాన్యతను కూడా కలిగి ఉంటుంది. అస్పృశ్యుల సామాజిక స్థాయిలో పేరు ఒక విప్లవాన్ని తీసుకురాగలదు. కాని ఆ పేరు హిందూయిజానికి బహిర్గతంగా ఉన్న సమాజానికి సంబంధించిన పేరుగా ఉండడమే కాక దానిని న్యూనత పరచి, మాలిన్యపరిచే హిందూ పరిధికి మించి ఉండాలి. అస్పృశ్యులు మత మార్పిడి అయితేనే ఆపేరు వారి ఆస్తి అవుతుంది. హిందూయిజంలో ఉండి పేరు మార్చుకోవడమనే మార్పిడి అతనికి దోహదపడక ఆమార్పిడి ఒక గుప్త మార్పిడవుతుంది.

మార్పిడి మీద జరిగిన ఈ చర్చ కొంత మేరకు గాలిలో జరిగినట్లనిపిస్తుంది. అది అలా ఉండడం సహజం. అస్పృశ్యులు తమ మతాన్ని అంగీకరిస్తారనే విషయం తెలియనంతకాలం అది వాస్తవం కానేరదు. ఒక మతంలోకి మారినందువల్ల ఎటువంటి లాభాలుంటాయనది అతను ఎంపిక చేసుకునే మతం మీద ఆ మతాన్ని అవలంభిస్తున్న వారి సామాజిక స్థాయి మీద ఆధారపడి ఉంటుంది. ఒక మతం మూడు లాభాల్నివ్వచ్చు. ఇంకొకటి రెండింటినే ఇవ్వవచ్చు. మూడవది మార్పిడివల్ల ఒకే ఒక లాభాన్నివ్వవచ్చు. అస్పృశ్యులు ఏమతాల్ని ఎంపిక చేసుకోవాలనేది ఈ అధ్యాయపు విషయ వస్తువుకాదు. ఈ అధ్యయనపు విషయ వస్తువు అస్పృశ్యతను మార్పిడి పరిష్కరించగలదా అన్నంతవరకే ఆప్రశ్నకు కల జవాబు ఉద్ఘాటించి చెప్పాలంటే అవునని. మతానికున్న సామాన్య దృక్పధం ఏమిటంటే మానవుని దేవునితోగల సంబంధం దానికి గల అర్థము ఈ దృక్పధానికి భిన్నంగా ఉండే అభిప్రాయం మీద పై వాదానికున్న బలం ఆధారపడి ఉంది. ఈ దృక్పథం ప్రకారం ఆత్మలను రక్షించటానికి కాక వ్యక్తి సంక్షేమాన్ని, సమాజాన్ని పరిరక్షించటానికి మతం ఉంటుంది. మతానికి గల మొదటి దృక్పథాన్ని అంగీకరించిన వారికి మార్పిడి ఎలా అస్పృశ్యత సమస్యను పరిష్కరిస్తుందనేది అర్థం చేసుకోవడం కష్టంగా ఉంది. ఈ అధ్యాయంలో మతానికి గల దృక్పధాన్ని అంగీకరించిన వారికి ఈ ముగింపుకున్న పటుత్వాన్ని అంగీకరించడంలో ఎలాంటి కష్టమూ ఉండదు.

**పాద సూచికలు :**

1. విడివిడిగా విభిన్న కులాల భావ తీవ్రతలను పరీక్షించే ఉద్దేశ్యంతో ఈ సమావేశం కేవలం మహర్లకే పరిమితం చేయబడింది.

2. " The Sea of Rome" పేజీ 143-145

3. లీ క్రాలీ చే ఉదాహృతం, " Tree of Life" పేజీ 5

4. The Religion Semites పేజీ

5. The Religious Reconstruction" పేజీ 39-40

6. Ibid పేజీ 45-46

7. Ibid పేజీ 42-43

8. The society in its Psychological Aspects" (1913) పేజీ 356-357

9. "Religion of the Semites" పేజీ 273

10. "Introduction to Social Psychology పేజీ ...

11. "Religion of the Semites" ఇది ప్రాచీన సమాజానాకి, ఆధునిక సమాజానికి మధ్య తేడాగా ప్రొ॥ స్మిత్ చెప్పారు. కానీ ఇది అంతకంటే ప్రాముఖ్యత గలది. నిజానికి ఇది ఒక సామూహాన్ని సమాజం నుంచి వేరు చేసే తేడా.

12. Ibid పేజీ 270-71

13. Ibid పేజీ 271-72

14. The Reconstruction of Religion పేజీ 40-41

అనువాదం : వి. శ్రీనివా

అధ్యాయం-28

# కులము, మతాంతరీకరణ

హిందూ సమజంలోని ప్రస్తుత తిరుగుబాటుకు కారణాలు తన్నుతాను సంరక్షించుకోవాలనే సహజగుణం. ఒకప్పుడు సంఘంలోని విజ్ఞులకు తమ మతాన్ని రక్షించుకోవాలనే భయం ఉండేది కాదు. వారి వాదనను బట్టి హిందూ సమాజం అత్యంత ప్రాచీనమైనది, ఎన్నో రకాల ప్రతికూల శక్తుల దాడిని ఎదుర్కొని నిలబడింది కాబట్టి దాని సంస్కృతి, నాగరికతలో ఉన్న వాస్తవ శక్తి - సామర్థ్యాలే దాన్ని జీవించి ఉండేటట్లు చేసినవి. కాబట్టి వాళ్ళ సమాజం చిరకాలంగా మనగలిగే అదృష్టమున్నదని వారు ప్రగాఢంగా విశ్వసించేవారు. ఈ మధ్య జరిగిన సంఘటనలు వారి నమ్మకాన్ని కుదిపి వేసినవి. ఈ మధ్య దేశంలో జరిగిన హిందు-ముస్లిం మత కలహాల్లో కొద్ది మంది ముస్లింలు హిందువులను తీవ్రంగా కొట్టగలిగారు. కావున హిందువుల్లోని విజ్ఞుల్లో, అస్తిత్వం కోసం జరిగే పోరులో ఈ రకమైన మనుగడకు విలువ ఉందా? అని కొత్తగా ఆలోచన మొదలైంది. తాను జీవించి ఉండడమే జీవించగల సామర్థ్యానికి సూచికగా, ఒక హస్తంగా, గర్వంగా చెప్పుకొనేవారు. జీవించి ఉండడంలో ఎన్నో రకాలున్నవని అన్నింటికి సమాన విలువ ఉండదని ఎన్నడు ఆలోచించలేదు. శత్రువుకు ఎదురు నిలిచి విజయం సాధించి జీవించడం ఒక రకం. లేక శత్రువు నుంచి పారిపోయి, తన్ను తాను రక్షించుకొని దాగి ఉండి కూడా జీవించవచ్చు. ఈ రెండు రకాల మనుగడలో నున్న కొలతలు వేరు: జీవించడం అన్న వాస్తవాన్ని కాక ఏవిధంగా జీవించడాన్నది ఇక్కడ ముఖ్యంగా గుర్తించాల్సిన విషయం. జీవించిన హిందువులు స్వతంత్రులా లేక బానిసలా అన్నదిక్కడ సమస్య? కాని నిరాశాజనకమైన విషయమేమిటంటే, బానిసల్లో ఏదో ఒక రకంగా జీవించగలిగారనే విషయానికేగాని హిందువుల్లా స్వతంత్రంగా జీవించగలిగారా అన్న విషయానికి ప్రాముఖ్యత లేనట్టు కనిపిస్తున్నది. భౌతిక పోరాటంలో ముస్లింలతో దెబ్బతినడమేగాక సాంస్కృతిక పోరాటంలో కూడా దెబ్బ తిన్నట్టు కనపడుతున్నది. ఈ మధ్య కాలంలో ఇస్లాం సంస్కృతిని విస్తరింప జేయడానికి ముస్లింలు భారీ ప్రచారాన్ని చేపట్టారు. హిందు విశ్వాసాన్ని జయించి వారి సంఖ్యను పెద్ద మొత్తంలో పెంచుకొన్నారని ఆరోపించడం జరిగింది.

అదృష్టవశాత్తు హిందువుల్లోని ఏడుకోట్ల జనాభాకు ఓ రూపం లేదు. వాళ్ళు హిందువులే కాని వారికి ప్రత్యేకంగా హిందూ విశ్వాసంలో నమ్మకం లేదు. ఈ విశ్వాసం వల్ల వారి స్థానం భరించలేని విధంగా తయారయింది. దీనివల్ల సులభంగా వారు ఇస్లాంలోకి మారిపోగలరు. వారిలో కొంతమంది ఇస్లాం మతంలోకి మారుతున్నారు, ఇంకా కొంతమంది మారి పోవచ్చు కూడా.

హిందువుల్లోని విజ్ఞులను భయపెట్టడానికిది చాలు. సంఖ్య రీత్యా ఆధిక్యతలో ఉన్నప్పటకీ వారు ముస్లింలను ఎదిరించలేక పోయినారు. ఒక వేళ హిందువులు ఇస్లాంలోకి మతాంతీకరణ చెందడం వల్ల వాళ్ళ విశ్వాసం మరింత బలహీనపడితే ఏంకావాలి? తమ సంస్కృతికి, తమ జనాభాకు నష్టం జరగకుండా రక్షించాలని హిందువులు భావించారు. శుద్ధి ఉద్యమం మతం మార్చుకున్న వారిని మళ్ళీ హిందువుల్లోకి తెచ్చే ఉద్యమం పుట్టుక ఇక్కడున్నది.

హిందువుల్లోని సాంప్రదాయ వాదులు ఈ ఉద్యమాన్ని వ్యతిరేకించారు. పుట్టుకతోనే హిందువులవుతారని హిందూ మతమెప్పుడు మతం మార్పించే మతం కాదని వీరి వాదన. ఈ ఉద్దేశాన్ని సమర్థిస్తూ ఇక్కడ కొంత చెప్పాల్సి ఉంది. మొదటినుండి మను స్మృతి లేదా సాంప్రదాయం వెనక్కిపోగలిగినంత వరకు చూస్తే, ధర్మ పరివర్తనావాదం (Prose-lytism) హిందుమత విశ్వాసంలో ఎప్పుడూ భాగం కాదు. ఆచార్య మాక్స్ ముల్లర్ ఓ గొప్ప జర్మన్ విద్వాంసుడు ప్రాచ్యనాగరికత విషయాలపై అధిక్యత గల జ్ఞాని. 1873 డిసెంబర్ మూడున తన ప్రసంగంలో హిందుమతమెన్నడూ ధర్మ ప్రచారక మతం కాదని నిర్ద్వందంగా ప్రకటించాడు. మత ప్రచారాన్ని నిరాకరించే సాంప్రదాయ వాదులు శుద్ధి ఉద్యమాన్ని వ్యతిరేకించే ఆధారం దొరికింది. ఇది హిందు ధర్మ మౌలిక లక్షణాలకు వ్యతిరేకం. అదే విధంగా శుద్ధి ఉద్యమాన్ని కూడా సమానంగా సమర్థించే అధిక్యత గల వాదనలున్నాయి. వారి అభిప్రాయం ప్రకారం, హిందూమతం ధర్మ ప్రచారక మతంగా ఉండేది. ఇప్పుడుండగలదు కూడా. ఆచార్య జొల్లి తన వ్యాసం(Die Aurbrieturg DEr ldischem fuller)లో ప్రాచీన కాలంలో హిందు రాజులు ఆదివాసి తెగల్లో హిందు మత ప్రచారానికై అవలంభించిన పద్ధతులను, సాధనాలను క్షుణ్ణంగా వివరించాడు. స్వర్గీయ సర్ ఆల్ఫ్రెడ్ లియాల్ ఆచార్య మాక్స్ ముల్లర్‌కు రాసిన జవాబులో హిందు మతం

ధర్మ ప్రచారక మతమేనని నిరూపించ ప్రయత్నించాడు. ఈ విషయ సంభావ్యతను పరిశీలిస్తే జొల్లి , లియాల ప్రతిపాదించిన విషయాలకే ఎక్కువ మద్దతున్నట్టు నిశ్చయంగా తెలుస్తున్నది. హిందు మతం ఏదో ఒక స్థాయిలో మత పరివర్తనా కార్యక్రమం చేపట్టనట్టయితే, వైవిధ్యం గల జాతులు తమదైనటువంటి ప్రత్యేకమైన సంస్కృతితో నివసిస్తున్న ఇంత పెద్ద ఉపఖండంలో హిందుమతం వ్యాప్తి కావడం సాధ్యమయ్యేది కాదు. వ్రతులను శుద్ధి చేయడమనే ఒకే ఒక్క ఊహన ఆధారంగా యజ్ఞయాగాదుల అస్తిత్వాన్ని వివరించలేం. కావున ప్రాచీన కాలంలో హిందు మతం ధర్మ ప్రచారక కార్యక్రమాలు నిర్వహించిందని, సురక్షితంగా నిర్ధారించ వచ్చు. కాని ఏదో ఒక కారణం వల్ల చారిత్రక క్రమంలో చాలా కాలం క్రితం హిందు మతం నిలిచిపోయింది.

నేను ఆలోచించే ప్రశ్న హిందూ మతం ధర్మ ప్రచారక మతంగా ఎందుకు నిలిచిపోతుంది? ఈ విషయానికి ఎన్నో రకాల వివరణలుండవచ్చు. కాని అది ఎంత విలువైనదైనప్పటికీ నేను నా స్వంత వివరణ ఇవ్వదలుచుకున్నాను. మానవడు సంఘజీవి అని అరిస్టాటిల్ చెప్పాడు. అరిస్టాటిల్ ప్రకటనకు మద్దతుగా ఎన్ని ప్రబలమైన కారణాలున్నప్పటికీ, ఎవరైనా తమ సమాజ వ్యక్తుల నుండి పూర్తిగా వేరుపడి తన వ్యక్తిగత జీవితాన్ని ఆరంభించ లేడన్నది మాత్రం ఒప్పుకోవాల్సిన నిజం. వ్యక్తి చైతన్యం పెరగడంల సామాజిక బంధనం వేళ్ళూనికొని వ్యవస్థాపితమై ఉంటుంది. తన స్వప్రయోజనాల ఇతర ప్రయోజనాలతో కలిసి ఉన్నదనీ ప్రతీ వ్యక్తి భయం ఒకరకమైన లక్ష్యాల సాధన స్వార్థపరమైనవైనా లేక ఉదారమైనవైనా, ఇతర లక్ష్యసాధనకూడా. వ్యక్తిగత లక్ష్యాలక ప్రయోజనాలకూ, జీవితాని అన్ని వర్గాల్లో సామాజిక జీవనం స్వతసిద్ధమైనది. తన జీవితంలోని అన్ని పరిస్థితుల్లోనూ సామాజిక సంబంధాల ప్రాముఖ్యతను గుర్తించి భయపడుతాడు. సూక్ష్మంగా చెబితే చేప నీళ్ళు లేక ఎలా బతకలేదో అదే విధంగా సమాజం లేక జీవనం సాధ్యం కాదు.

ఈ నిజాన్ని అనుసరించి, సమాజం మత పరివర్తకులను తయారు చేయగలుగుతున్నదంటే, దాని నిర్మాణం అన్యులను తమలో సభ్యులుగా కలుపుకొని తమ సామాజిక జీవనంలో భాగస్వాములు కావడానికి వీలు కల్పిస్తుందా అని చూడాలి. ఆ సమాజంలో పుట్టిన వారిని బయటినుండి వచ్చి కలిసినవారిని వేరుగా చూడరాదు. తమ వారిని, ఇతరులను ఒకే విధంగా స్వీకరించి, ప్రవేశించనిచ్చి, జీవించనిచ్చి తమలోని

ఇతర సభ్యులవలె తన జీవితాన్ని గడుపుకోనివ్వాలి మతాంతరీకరణ చెంది వచ్చిన అన్యులకు ఈ అవకాశం లేకపోతే మత పరివర్తకుల స్థానమేమిటనే ప్రశ్న ఒకేసారి తలెత్తుతుంది. మత పరివర్తకులకు స్థానం లేకపోతే మతాంతరీకరణకు ఆహ్వానముండదు. దానికి అంగీకారం కూడ ఉండదు.

హిందుమత విశ్వాసానికి మారిన పరివర్తకునికి హిందు సమాజంలో స్థానమేదైనా ఉన్నదా? ప్రస్తుతం హిందు సమాజ వ్యవస్థ కులాలతో కూడుకొని ఉన్నది. ప్రతీకులం అంతర్వివాహ పద్ధతితో, మరో కులంతో శత్రుత్వంతో ఉంటుంది. వేరేమాటల్లో చెప్పాలంటే, తన కులంలో పుట్టిన వారినే తనలో సభ్యులుగా ఉండనిస్తుంది,బయటి నుండి వచ్చిన వారి నెవ్వరినీ తనలోకి రానీయదు. హిందు సమాజం కులాల సమాఖ్య, ప్రతీ కులానికి స్వయం సరిహద్దులున్నాయి. కాబట్టి మత పరివర్తకులకు స్థానం లేదు. ఏకులం అతన్ని చేర్చుకోదు. మతంగా హిందుమతం ఎందుకు నిలిచి పోయిందనే ప్రశ్నకు జవాబు హిందు సమాజం కుల వ్యవస్థను వృద్ధి చేసుకోవడం వల్లనే అని చెప్పవచ్చు. కులం మతాంతరీకరణకు ప్రతికూల విషయం. భారీ మొత్తంలో మతాంతరీకరణ సాధ్యం కానంతకాలం, కొత్త కులమొకటి తయారయి అది సామాజిక జీవనానికి అవసరమయిన మూలాలు తయారు చేయనంత కాలం హిందు మతంలోకి పరివర్తన సాధ్యం కాదు. కాని భారీ మొత్తంలో మతాంతరీకరణలు లేవు. లోపలికొచ్చే వ్యక్తిగత పరివర్తకులకు ఏకులంలోను స్థానం లేదు కాబట్టి హిందు మతం మత పరివర్తక వ్యవస్థగా నిలువలేక పోయింది.

హిందు మతం ధర్మప్రచారక మతంగా ఎందుకు నిలిచిపోయిందనే ప్రశ్నను, నేనో కొత్త ఆలోచన వివరణ ఇస్తున్నాననే గొప్పతనం వస్తుందనే ఆశతో ప్రతిపాదించలేదు, ఈ ప్రశ్నను లేవనెత్తి దీనికి జవాబివ్వడానికి కారణం, శుద్ధి ఉద్యమంపై దీని ప్రభావమెక్కువగా ఉంటుందని నా అభిప్రాయం. ఈ ఉద్యమం నడిపే వారి పట్ల నాకు ఎక్కువ జాలిఉన్నది. ఎందుకంటే ఈ ప్రశ్నను వారు విశ్లేషించి ఉద్యమ విజయ పథంలోనున్న కష్టాలను అర్థం చేసుకోలేదు. శుద్ధి ఉద్యమం వెనుకనున్న ఉద్దేశ్యం హిందువులు తమ సంఖ్యను పెంచుకోవడం ద్వారా తమ బలాన్ని పెంచుకోవడం. ప్రస్తుత సమాజ ధృఢత సంఖ్యవల్ల కాక అందులోని ప్రజా బాహుళ్యం మధ్య నుండే ఐక్యత వల్ల సాధ్యమవుతుంది. కొద్ది మంది వ్యవస్థీకృతమైన ఐక్యతగల మత తీవ్రవాదులు అవ్యవస్థీ కృతమైన మతయుద్ధ

సైనికుల పెద్ద సైన్యాన్ని నాశనం చేసిన సంఘటనలు లేకపోలేదు. హిందు - ముస్లిం మత కల్లోలాల్లో కూడా ఈ విషయం రుజువయింది. బలహీనంగా ఉన్నచోటనే గాక. సంఖ్య రీత్యా ప్రభలంగా ఉన్నచోటకూడా హిందువులు ముస్లింలచే కొట్టబడ్డారు. ఈ విషయంలో మోప్లాలను ఉదాహరణగా చూపవచ్చు హిందువుల కష్టాలు సంఖ్య వల్లకాదని అనైక్యత వల్లనేనని ఈ ఒక్కదాన్ని మాత్రమే ఉదాహరణగా చూపవచ్చు. హిందు సమాజంలో సంఘీభావం పెంపొందించాలంటే అనైక్యత కలిగిస్తున్న శక్తులను సరిగా ఎదుర్కోవాలి. నాభయం ఏమిటంటే కేవలం శుద్ధి ఉద్యమం - సమైక్యతను పెంపొందించడానికి బదులు - మరింత అనైక్యత కలుగ జేస్తుంది. హిందువులకు లాభమేమి కలుగకుండా అనవసరంగా ముస్లింలల్లో అసంతృప్తి పెరుగుతుంది. కులాలతో కూడుకొన్న సమాజంలో శుద్ధి వల్ల వచ్చే వ్యక్తికి ఎక్కడ స్థానం లేక పోవడం వల్ల ఎవరితో అనుబంధం లేని, ప్రత్యేకంగా ఎవ్వరికీ విశ్వాసంగాలేని ఒంటరి జీవితాన్ని గడుపవలసి వస్తుంది. ఒక వేళ శుద్ధి ఉద్యమం వల్ల శ్రద్ధానంద పట్టుకొన్న మల్కానా లాంటి పెద్దసంఖ్యలో హిందువుల్లో చేరినా ఇప్పుడున్న కులాల సంఖ్యకు అది మరో కొత్త సంఖ్య వచ్చి చేరుతుంది. ఎక్కువ కులాలంటే ఎక్కువ ఒంటరితనం అంటే హిందు సంఘంలో మరింత ఎక్కువ బలహీనత. ఒక వేళ హిందు సమాజం జీవించ దలిస్తే పెంచుకోవాల్సింది సంఖ్యను కాదు దానిలో ఐక్యతను. అంటే దానర్థం మతాన్ని రద్దుచేయడం. కుల నిర్మూలనే హిందువుల నిజమైన సంఘటన, కుల నిర్మూలన ద్వారా ఈ సంఘటన సాధించగలిగితే శుద్ధి అనేది అనవసరం, ఒక వేళ అది ఆచరింపబడినా నిజమైన బలానికి దోహద కారి అవుతుంది. కులాలను అలానే ఉంచితే అది అసాధ్యమైన విషయం, ఒకవేళ అది ఆచరింపబడినా అది హిందువులో రావాల్సిన నిజమైన సంఘటనకు, ఐక్యతకు ప్రమాదకారి అవుతుంది. కాని హిందు సమాజంలో విప్లవాత్మకమైన సంస్కరణలు ఆశించే వాడు కూడా కులాలను రద్దు చేయడమనే భావనకు సిగ్గు పడతాడు. ఏదో ఒక రకమైన చిల్లర సంస్కరణలు ఆహారపు అలవాట్లను మార్చుకోవడం, ఆచారాలు ప్రారంభించడం వంటివి - ప్రతిపాదిస్తాడు. హిందువులు తమ సంఘాన్ని అందులోని కులాలను రక్షించుకోలేనటువంటి రోజు ఉదయించక మానదు. అది కూడా ఎంతో దూరం లేదని ఆశిద్దాం.

అనువాదం : కె. సీతారామారావు.

అధ్యాయం – 29

# అస్పృశ్యుల క్రైస్తవీకరణ క్రమం

**I. భారత దేశంలో క్రైస్తవం అభివృద్ధి II. మిషనరీల యత్నంలో వెచ్చించిన కాలం మరియు డబ్బు III. మందకొడి అభివృద్ధికి గల కారణాలు.**

## I

భారతదేశంలో క్రైస్తవ మతం ఎంత కాలానికి చెందినది? భారతదేశ ప్రజల్లో ఏ మేరకు ప్రగతిని సాధించింది? అస్పృశ్యుల పట్ల సానుభూతిగా ఆలోచించేవాళ్ళు ఎవరైనా ఈ ప్రశ్నలను వేసుకోకుండా ఉండలేరు. భారతదేశంలో ఉన్న అసంఖ్యాక అస్పృశ్యుల తోటి మరియు వారి ప్రత్యేక పరిస్థితులకు, వారు క్రైస్తవ మత సామాజిక సందేశానికి ప్రతిస్పందించడానికి, పై రెండు ప్రశ్నలకు అతి సన్నిహిత సంబంధం ఉన్నది. ఈ పరిస్థితులు లేనట్లయితే క్రైస్తవ మత ప్రచారకృషి, సందేశం విస్తృతిని సాధించి విజయవంతం అయ్యేది కాదు.

1931 జనాభా లెక్కల ప్రకారం క్రిందనీయబడిన పట్టిక భారతదేశంలోని క్రైస్తవులను ఇతర మతాలతో పోల్చినప్పుడు ఓ అవగాహనను అందజేస్తుంది.

**భారతదేశం మరియు బర్మా**

| మతాలవారి జనాభా | 1891 జనాభా లెక్కలు | 1921 జనాభా లెక్కలు | 1931 జనాభా లెక్కలు | పెరుగుదల/ తగ్గుదల |
|---|---|---|---|---|
| హిందువులు | | 216,734,586 | 239,195,140 | +10.4 |
| మహ్మదీయులు | | 68,735,233 | 77,677,545 | +13 |
| బౌద్ధులు | | 11,571,268 | 12,786,806 | +10.5 |
| సిక్కులు | | 3,238,803 | 4,335,771 | +33.9 |
| ఆదిమ మతాలు | | 9,774,611 | 8,280,347 | +15.3 |
| క్రైస్తవులు | | 4,754,064 | 6,296,763 | +32.5 |

| | | | |
|---|---|---|---|
| జైనులు | 1,178,596 | 1,252,105 | +6.2 |
| జోరాస్ట్రియనులు | 101,778 | 109,752 | +7.8 |
| యూదులు (jews) | 21,778 | 24,141 | +10.9 |
| ఇతరులు (Unreturned) | 18,004 | 2,860,187 | ......... |
| మొత్తం | 316,128,721 | 352,818,557 | +10.6 |

1921 మరియు 1931 మధ్య కాలంలో క్రైస్తవం పెరిగిందనేది వాస్తవం. వృద్ధి రీత్యా గమనించినట్లైతే సిక్కుమతం మొదటి స్థానంలో ఉంది. క్రైస్తవం రెండవ స్థానంలో, మతస్వీకరణకు వీలుగా ఉండే మరొక మతం ఇస్లాం, మూడవ స్థానంను ఆక్రమించుకున్నవి. ప్రధమ, ద్వితీయ స్థానాల మధ్య వ్యత్యాసం స్వల్పమైనది. రెండవ స్థానంలో ఉన్న క్రైస్తవ మతం మొదటి దానికంటే దాదాపు మంచిగానే ఉంది. ఇస్లాం, క్రైస్తవాల మధ్య వ్యత్యాసం ఎక్కువగా ఉంది. క్రైస్తవం తన శత్రువులను చాలా దూరంగా ఉంచిన గర్వాన్ని పొందింది. ఐనప్పటికినీ 352,818,517 జనాభాలో 6,296,763 జనాభాను మాత్రమే కలిగి ఉన్న క్రైస్తవులు మొత్తంలో 1.7 శాతం మాత్రమే.

## II

ఈ ఎదుగుదల ఎన్ని సంవత్సరాలలో మరియు ఎంత వ్యయంతో సాధించింది? వ్యయానికి సంబంధించిన సరియైన సమాచారం ఇవ్వడం సాధ్యపడదు. 1893లో జార్జి స్మిత్ ప్రచురించిన "భారత దేశంలో మతాంతీకరణ "("The Conversion of India") అనే పుస్తకంలో ప్రధానంగా క్రైస్తవం లేని దేశాల్లో క్రైస్తవ దేశాల మిషనరీలు చేసిన వ్యయ గణాంక వివరాలు యివ్వబడ్డాయి. ఈ సమాచారం కొంత అవగాహనను అందిస్తుంది. ఆయన ఏమంటాడంటేః

"ప్రత్యేకంగా పశ్చిమ దేశాల చర్చిలు ఆక్రమించుకొనిన ఆసియా మరియు ఉత్తర ఆఫ్రికా భూభాగాల్లో అమెరికన్లు అవసరరీత్యా వెచ్చించిన కాలం, చేసిన కృషి పరిగణింపబడడం లేదు. అంతే కాక క్రైస్తవుల పవిత్రమైన విశ్వాసం మరియు జీవం కోసం క్రైస్తవులు చేసిన శ్రమ పరిగణింప బడడం లేదు. డచ్ మిషనరీల సంఘం అధ్యక్షుడు రెవరెండ్ జే. వాల్ యిచ్చిన గణాంక వివరాలు జాగ్రత్తగా సమకూర్చబడినవి. ఇవి మిషనరీలలో పని

చేయటానికి వచ్చిన వారి భార్యలను ప్రాతినిధ్యంగా తీసుకొని పొందపరచబడిన వివరాలు. కావున ఆధారం ఖచ్చితమైనది అని ఒప్పుకుంటున్నాం. టర్కీ మరియు ఈజిప్టులలో మహమ్మదీయుల మధ్య శ్రమ వివరాలు మాత్రమే యివ్వడం జరిగింది.

| | 1890 | 1891 |
|---|---|---|
| ఆదాయం ( పౌండ్లలో (English Money) | £2,412,938 | £2,749,340 |
| మిషనరీలు | 4,652 | 5,094 |
| మిషనరీల అవివాహిత స్త్రీలు | 2,118 | 2,445 |
| స్థానిక బోధకులు (Native Ministers) | 3,424 | 3,730 |
| ఇతర స్థానిక సేవకులు (Other Native helpers) | 36,405 | 40,438 |
| వార్తా వాహకులు (Communicants) | 966,856 | 1,168,560 |

"1892, 1893 వివరాలను అంచనా వేయటం లేదు. ఆ పని ప్రావీణ్యం ఉన్నవారు వారి కొరకు చేసుకోగలరు. ఈ రెండు సంllలలో ప్రత్యేకించి భారతదేశంలో స్థానిక వార్తావాహకులు పెద్దసంఖ్యలో చేర్చబడినారు అని చెప్పదల్చుకున్నాం. కాథలిక్కేతర దేశాల్లోని మొత్తం క్రైస్తవుల సంఖ్య 5,200,000లలో స్థానికుల సంఖ్య 1,300,000 అని పై అంశాన్ని పరిగణిస్తూ మనం గుర్తించవచ్చు."

డీన్ వాల్ యొక్క గణాంక వివరాలు 1891లో గల 304 మిషనరీ సమాజాల మరియు ఏజెన్సీల నుండి తీసుకున్నవి. ఇవి 1649లో అమెరికా వెళ్ళిన క్రామ్‌వెల్ యొక్క 'న్యూ ఇంగ్లాండ్ కంపెనీ'తో ('New England Company') మొదలైనది. ఇక్కడ యిస్తున్న వివరాలు క్రైస్తవీకరించబడిన 17 భూభాగాల వివరాల సారాంశాన్ని అందజేస్తాయి. బ్రిటిష్ సామ్రాజ్యం యొక్క 160 మిషనరీ చర్చిలు మరియు సమాజాలు £1,659,830 పౌండ్ల ధనాన్ని సేకరించినవి. మరియు అమెరికాకు చెందిన 57 చర్చీలు, సమాజాలు £786,992 లను సేకరించినవి. మెండుగా ఆంగ్లం మాట్లాడే ఈ రెండు దేశాల ప్రజలు కలిసి £2,446,822లను క్రైస్తవేతర ప్రపంచాన్ని క్రైస్తవీకరించడానికి వెచ్చించినారు

మరియు £302,518లను జర్మనీ, స్విట్జర్ లాండ్, నెదర్ లాండ్, డెన్మార్క్, ఫ్రాన్స్, నార్వే, స్వీడన్, ఫిన్‌లాండ్ మరియు ఆసియాలనుండి సేకరించినారు".

ఈ కారణం కోసం వెచ్చించిన యిట్టి డబ్బుకు వనరులు ఏమిటో తెలియచేయడం కష్టం. ఎందుకంటే అవి ప్రచురించలేదు. కాని ఈ ఆరు మిలియనులు క్రైస్తవులుగా మారడానికి ఎంత కాలం పట్టిందో తెలియజేయడానికి కావలసినంత సమాచారం అందుబాటులో ఉంది.

క్రైస్తవ మత బీజాలను ఎవరు ముందుగా భారతదేశంలో నాటింది చెప్పడానికి ఆధారిత వివరాలు లేవు. క్రీస్తు ప్రముఖ శిష్యులచే భారతదేశంలో క్రైస్తవం ఆరంభింపబడినదని నమ్మకం. దీనికి సెయింట్ థామస్ ఆద్యుడు. గురు సంబంధమైన పునాది కలిగిన క్రైస్తవం ప్రక్కటి పురాణమైనప్పటికీ మద్రాసు దగ్గర గల సెయింట్ థామస్ పర్వతం ఆయన ఉపదేశాన్ని తెలియజేయు స్మశానస్థలంగా చెప్పవచ్చును. మొదటి శతాబ్దము సువార్తను బోధించినారనడానికి నమ్మదగిన ఆధారమేమీ లేదు. కాని దక్షిణ కోస్తా తీరవాసులు, శ్రీలంకకు చెందిన సముద్ర ముత్యాలు ఏరేవారు, మలబారు ,కోరమండల్ వ్యవసాయదారుల చెవులకు ఈ సువార్త చేరిందనడానికి కొంత సాక్ష్యాన్ని చూపించవచ్చు. ఈ సువార్తను ఈజిప్టు నావికులు, అలెగ్జాండ్రియా క్రైస్తవులు వ్యాప్తిచేసినారు. భారత దేశానికి మొట్టమొదటి క్రైస్తవ మిషనరీని అలెగ్జాండ్రియా పంపించినందువల్ల చరిత్రలో ఆ పేరు నమోదు చేయబడింది. అలా వచ్చిన మొట్ట మొదటి వ్యక్తి పేరు పాంటియోనస్. ఇతను సుఖదుఃఖాలకు అతీతుడైన గ్రీకు. ఇతను క్రైస్తవుడుగా మారడం జరిగింది మరియు అలెగ్జాండ్రియా బిషపు అయినట్టి డిమిట్రస్ చే నియమింపబడినాడు. ఇతను అలెగ్జాండ్రియా లోని ఒకే ఒక్క పాఠశాల - మత ప్రచారాలను తయారు చేయడంలో ప్రశ్నోత్తర రూపంలో (Catechist) శిక్షణ యిచ్చే పాఠశాలకు ప్రధానోపాధ్యాయుడు. ఈ పాఠశాలలో క్రైస్తవేతరులకు శిక్షణ ఇచ్చే- క్రమంలో మత ప్రచారకులు క్రైస్తవంలో నిబిడీకృతమై ఉన్న వాస్తవాలు మరియు సిద్ధాంతాలు బోధించటం జరుగుతుంది అని నిర్ధారించబడింది 180-190 సం॥ల మధ్య కాలంలో భారతదేశంలోని క్రైస్తవ మతస్థులనుండి అలెగ్జాండ్రియ బిషపు విజ్ఞాపనను అందుకొని తర్వాత ఓ మిషనరీని మరియు పాంటియోనస్‌ను వారుకోరిన ప్రకారం పంపినాడు. భారతదేశంలో ఇతను ఎంతకాలం ఉన్నాడు, ఎం

దూరం ప్రయాణం చేశాడు మరియు ఏ పనులు చేసాడు అను ప్రశ్నలను వివరించడానికి నమోదిత సమాచారం లేదు. తర్వాత కొంత కాలానికి అలెగ్జాండ్రియాకు వెళ్ళి తన పాత పాఠశాలకు ప్రధానోపాధ్యాయునిగా క్రీ.శ. 211 వరకు కొనసాగినట్లుగా తెలుస్తుంది.

భారత భూభాగంపై మూడవ శతాబ్దిలో సువార్త ప్రగతి స్వల్పంగా సాగినట్లుగా తెలుస్తుంది. కాని ఈ వాస్తవం గమనించదగినది. కాన్‌స్టాంటినో జోహన్నెస్ మత మార్పిడి తర్వాత క్రీ.శ. 325లో నికాకా సభ (Council of Nicaca) జరిగింది. ఈ సభలో సమావేశమైన బిషపులలో ఒకరు 'పర్షియాకు మరియు అఖండ భారతదేశమునకు రాజగురువు గా' తనను తాను వర్ణించుకున్నాడు. భారతీయ కోస్తా తీరంలో గుర్తింపతగిన విధంగా చర్చిలను స్థాపించారనే వాస్తవం ద్యోతకమవుతుంది. ఇంకొక విధంగా భారతదేశంలో జరిగినదంతా బిషపు సంబంధితమైనదేనని మరియు ఈ భూభాగం 'పర్షియా రాజ్యం' లోనిదేనని ఈస్టర్ గ్రంధంలో చూడగలం.

మూడవ శతాబ్ది ప్రారంభం నుండి ఐదవ శతాబ్ది చివరికి కాలం కదిలిపోగా పరిస్థితులు అలెగ్జాండ్రియా నుండి ఆంటియాక్‌కు మారి, ఆంటియాక్ మతప్రచార నిర్వహణ బాధ్యతను తన భుజస్కంధాలపై వేసుకుంది.

శాంతి పూర్వకంగా మతప్రచారం ఆరవ శతాబ్ది చివరివరకు సాగింది. ఇది ఒక యుగపు ముగింపును సూచిస్తున్నది. తర్వాతి కాలంలో సరాసిన్ ఉద్యమకారులు మహమ్మద్ ఖడ్గాన్ని మరియు ఖురాన్‌ను చేతపట్టుకుని పశ్చిమ ఆసియా మరియు ఉత్తర ఆఫ్రికానంతా చుట్టి వేసారు. యూరోప్‌లో వియన్నావరకు, స్పెయిన్ నుండి ఫ్రాన్స్‌కేంద్రస్థానం వరకు తిరిగి వణుకు పుట్టించారు. సరాసిన్ పుట్టించిన వణుకు వల్ల క్రైస్తవ మిషనరీల ప్రయత్నం కొన్ని శతాబ్దాల వరకు నిలిచిపోయింది.

1497లో వాస్కోడిగామా సముద్ర మార్గం ద్వారా ఇండియాకు రావడంతో క్రైస్తవ మిషనరీల ప్రయత్నాల చరిత్రలో తిరిగి నూతన శకం ఆరంభమైనది. మరియు 1542లో గొప్ప మిషనరీ అయిన ఫ్రాన్సిస్ జేవియర్ రాక మిషనరీల కృషిని తీవ్రతరం చేసింది మరియు నిర్ణయాత్మకంగా మార్చింది. పోర్చుగీసువారు తూర్పున పట్టు సాధించుకొనిన మొట్టమొదటి యూరోపియన్లు. వీరి ప్రోత్సాహంతోనే ఆధునిక కాలంలో స్థానిక

భారతీయులను క్రైస్తవీకరించే తొలి ప్రయత్నం జరిగింది. పోర్చుగీసుల ప్రోద్బలంతో మొదలైన మతాంతీకరణ ప్రయత్నాలు రోమన్‌కాథలిక్కుల మతమార్పిడులను ప్రభావితం చేసినవి. రోమన్ కాథలిక్కుల మిషన్స్‌వారు రోమన్ కాథలిక్కుల మత విశ్వాసంలోకి మత మార్పిడి కృషి సాగించారు.

అయినప్పటికీ వాళ్ళు శత్రువులు కాకుండా ఎంతో కాలం ఉండలేదు. ప్రొటెస్టెంట్లు కూడా రంగంలోకి వెనువెంటనే వచ్చారు. డెన్మార్క్ రాజు సహాయంతో 1706లో ట్రాంక్‌బర్‌లో లూథరన్స్ వారు స్థిరపడడంతో తొలి ప్రొటెస్టెంట్‌ల ప్రచారం మొదలైంది. 18వ శతాబ్దపు రెండవ అర్ధభాగంలో తిరుచినాపల్లి మరియు తంజావూరులలో అంకిత భావం కలిగిన ఈ మిషన్ యొక్క సభ్యుడైన స్కాట్జ్‌తో మొదలైనది. ఈ సంఘమే ఎక్కువ భాగం సువార్తా ప్రచార బాధ్యతను ముందుకు తీసుకుపోయింది.

1793లో కలకత్తాలో దిగిన కారె నాయకత్వంలో బాప్టిస్టు మిషన్ వచ్చింది. మిషనరీ క్షేత్రంలోకి 1813లో ఆంగ్లికన్ చర్చి ప్రవేశించింది అప్పటి నుండి మిషనరీల పూనిక వేగంగా మరియు నిరంతరంగా సాగింది.

ఆ విధంగా భారతదేశంలో క్రైస్తవ మత ప్రచారం ఒక దీర్ఘ ఆయువును కలిగి ఉంది. నాలుగు శతాబ్దాల తర్వాత అంటే సరాసిన్‌లు ఉద్భవించిన తరువాతనే మిషన్ కార్యకలాపాలలో విచ్ఛిన్నత ఏర్పడింది. తిరిగి సరాసిన్‌ల పతనం తర్వాతనే నాలుగు శతాబ్దాల తర్వాతనే మిషనరీ ప్రయత్నాలు మొదలైనవి. అంటే ఎనిమిది శతాబ్దాల క్రైస్తవ మిషనరీల కృషి ఆరు మిలియనుల క్రైస్తవ జనాన్ని కూడగట్ట గలిగింది. స్పష్టంగా చెప్పాలి అంటే ఇది బాధాకరమైన ఫలితమే. ఈ ఫలితం ఫ్రాన్సిస్ జేవియర్‌ను వ్యాకుల పర్చింది. జేవియర్ తర్వాత మూడు వందల సంవత్సరాలకు 1823లో ఎంతో కృంగిపోతూ ఏబ్‌దుబోవా (Abbe Dubois) వ్రాసిన దానిలో 'హిందువులను క్రైస్తవంలోకి మార్చడం అనేది నిరాశజనకమైనదేనని' ప్రకటించాడు. అందువల్ల, అతను ఆశావాదులైన క్రైస్తవ మిషనరీల ద్వారా విమర్శకు గురి కావటం జరిగింది. కాని ఈ శతాబ్ది చివరి వరకు 358 మిలియన్‌ల భారతీయులలో ఆరు మిలియనుల క్రైస్తవులు మాత్రమే మిగిలిపోయినారు అనేది వాస్తవం. నిజానికి ఇది చాలా మందకొడి వృద్ధి. ఇటువంటి వృద్ధికి గల కారణాలు ఏమిటనేది ప్రశ్న.

# III

క్రైస్తవ వృద్ధిని నిరోధించినవి మూడు కారణాలని నాకు అనిపిస్తున్నది. వీటిలో మొదటిది, భారతదేశంలో మొదటగా స్థిరపడిన యూరోపియన్ల-ముఖ్యంగా తూర్పు ఇండియా కంపెనీ ద్వారా పంపంబడిన ఇంగ్లీషువారి నీతిమాలినతనం. భారతదేశం పంపబడిన వారి ప్రవర్తనపై కంపెనీ ప్రత్యేక దూత ఐన మిస్టర్ కాయె తన "భారత దేశంలో క్రైస్తవం" (Chrishtianity in India) అను గ్రంథంలో ఈ క్రింది విధంగా మాట్లాడుతాడు:

" నమ్మకస్తులున్నారనడంలో అనుమానం లేదు. మధ్యతరగతి నుండి వచ్చిన వారిలో మంచి నడవడికల వాళ్ళున్నారు...... కానీ సమకాలిక రచయితల నుంచి దాని ప్రకారం చాలా మంది సంఘంలో ఇబ్బందికరమైనవారు. మంచి కుటుంబాల పిల్లలే కావచ్చు గానీ వాటిలో చెడబుట్టిన వారు. అందువల్ల ఇళ్ల నుంచి గెంటివేయబడి, మళ్ళీ తిరిగి రారనే ఆశతో భారత దేశానికి పంపబడినవారు. స్వదేశంలో ఎవ్వరైతే తామంతట తాము అవమాన పర్చుకున్నారో వారు విదేశాలలో గౌరవప్రదమైన జీవితం గడుపుతారు అని ఊహించలేము.

. . . . . . . . . . . . . . .

"నిజానికి, వారి ప్రవర్తనలో నీతి నియమాలు కాపాడుకొనుటకు బాహ్య ప్రేరణలు ఏమీ లేవు. కావుననే భారతదేశ భూమిపై కాలుపెట్టిన వెను వెంటనే మొట్టమొదటగా వాళ్ళు, వాళ్ళ దేశంలో వారిని నియంత్రించిన నియమాలను విడిచిపెట్టినారు. వాళ్ళను వాళ్ళు చాలా ఉన్నతమైన వారుగా భావించారు. మత సంబంధమైన అన్ని కట్టుబాట్లను మరియు నీతిని ఉల్లంఘించే అర్హత కలిగిన వారుగా మరియు జీవితం యొక్క అన్ని సున్నితమైన పద్ధతులను తుంగలో తొక్కారు. తరచూ అటువెళ్ళిన వారు నిరాశ నిస్పృహలతో కూడిన సాహసికులు.ఇటు వచ్చిన వాళ్ళంతా ఎక్కువగా ఇంగ్లాండు బహిష్కరించిన దిక్కులేని సాహసికులు. తమ పోయిన సంపదలను తూర్పున వున్న బంగారు భూముల్లో సంపాదించుకోవడానికో, అపఖ్యాతి పాలైన తమ పేరును అజ్ఞాతంగా సమాధి చేయడానికో, మాతృ దేశంలో సంపాదించడానికి తమకు ఏ అర్హతా, అవకాశమూ లేని సంపదల్ని ఏదో విధంగా పోగు చేసుకోవాలనుకునేవారు. వీళ్ళూ వచ్చింది. వారు మోసం చేశారు, వారు జూదమాడారు, వారు త్రాగుబోతులు, వారు అన్ని విధములైన

జారత్వాలతో తాగి తుళ్ళారు. క్రూరత్వంతో కూడిన సాహసములు వీరి చర్యల్లో కలగలిసినవి మరియు దుర్మార్గులలో కలుస్తారు. క్రూరత్వం అందరినీ కలిపే కట్టుబాటు. అంతే కాదు వాళ్ళు కడుపు మంటతో ఒకర్నొకరు వేధించుకుంటారు. వారు రే అయినా కొందరు చిన్న సంఖ్యలో, వారిలో నేర సాంగత్యం తప్ప సాంగత్యం లేదు".

"కొత్తవారికి ఇదంతా విరుద్ధమైనది; అందువల్ల పాపిష్టికార్యాలు సంస్కరణకు అవకాశమివ్వలేదు. లంచగొండి తనం నుండి పవిత్రత్వం అరుదుగా తప్పించుకుంది. వాళ్ళు ఏదైనా మొదలు పెట్టినన్నూ, విధ్వంసక దోషాలు చేసినన్నూ, పరిస్థితుల ప్రభావంచే బలైనారనే పరిగణింపు........" తొలినాటి క్రైస్తవుల నీతినియమాలు, ప్రవర్తన ఎంత చెడ్డగా ఉన్నాయో తెలుసుకొనుటకు మిస్టర్ కాయె ఉల్లేఖించిన ఈ క్రింది సంఘటనల నుండి అర్థం చేసుకోవచ్చు.

"1669 లో బొంబాయి డిప్యూటీ గవర్నర్ క్రింది నేరారోపణకు గురి కాబడినాడు. నిరంతరం త్రాగడం అనేది అతను సెలవు రోజున నిర్ణీత సమయంలో ప్రజాబాధ్యత నిర్వర్తించకుండా మరియు సర్వశక్తి గల భగవంతుని ప్రార్థించుకొనే క్రమంలో అడ్డంకిగా ఉండేది. ఇతరులను వారి అభీష్టాలకు వ్యతిరేకంగా వెంట ఉంచుకొంటాడు. అప్పుడు అతను త్రాగి ఉండి మోకాళ్ళపై దొంగ జపం చేస్తూ ఉండేవాడు. భగవంతుని సేవ కోసం నియమింపబడిన సమయంలో కూడా పైవన్నీ జరుగుతూ ఉండేవి. అంతేగాక, దానికి అనుబంధంగా అసంతోషకరమైన స్థితి ఇంకా విఘటితం కావటానికి తోడ్పడింది.

"అది దేశవాసులందరికి గొప్ప అవమానం. అందరినీ చుట్టి వేసింది. పోపులు మరియు ఇతరులు విగ్రహారాధకులు, ప్రొటెస్టెంట్ మతంలో నిబిడీకృతమై ఉన్న శాంతంను అగౌరవ పరుస్తూ, అతడు తరుచూ అధిక త్రాగుడు సమావేశాలు ఏర్పాటు చేసినాడు. ఇవి తెల్లవారి 3,4 గంll ల వరకు సాగేవి. ఉదయం భగవంతుని పూజించడం నిర్లక్ష్యం చేశాడు. మరియు కంపెనీకి సేవ చేసే సమయంలో నిద్రపోతూ ఉండేవాడు. ఆ విధంగా దారి మళ్ళిన ఇతను సాధారణంగా ఫ్యాక్టరీ ఉపశమన ఖర్చులకు ఉద్దేశించిన నిధులను దారి మళ్ళించి స్వంతానికి వాడుకున్నాడు".

"అతను నేరస్థునిగా ఈ ఆరోపణలతో గుర్తింపబడినాడు."

సాధారణంగా, భగవంతుణ్ణి సేవించే నియమాల మరియు మానవుని మంచి వర్తనల తిరస్కారం మూలానే తూర్పు ఇండియా కర్మాగారాల్లో పీకల దాకా అంతర్గత తగాదాలు మరియు కంపెనీని దారుణంగా అవమాన పరిచే పద్ధతులు చోటు చేసుకొన్నాయి. వాళ్ళను వాళ్ళు అవమాన పర్చుకోవడం, పగతో కలహించుకోవడం, బలీయమైన త్రాగుడు మైకంలో ఉన్నతస్థానాల్లో ఉన్నవాళ్ళు అధములతో జగడం పెట్టుకోవడం వారి పతనానికి ఉదాహరణలు.

కంపెనీకి చెందిన సూరత్ కర్మాగారం రికార్డుల నుండి సంగ్రహించిన నివేదిక నుండి ఉదహరిస్తున్న ఘటన క్రింద చూపుతున్నాను[1]:

"మాకు సంబంధించిన పుస్తకంలో 1695 ఆగష్టు 21 నుండి 1696 డిసెంబర్ 31 వరకు గలవి మీ గౌరవపరిశీలన కోసం పంపించినాం. వాటిలో అధ్యక్షుని ప్రాణ హానికి చెందిన కుట్ర కనిపిస్తుంది. మరియు అంగరక్షకులను హత్య జేసే పథకాలు కూడా, ఎందుకంటే కుట్రను వ్యతిరేకించారు కాబట్టి. వీటితో సర్వశ్రీ వాక్స్‌కు మరియు అప్టైల్‌కు ఎంత మేరకు సంబంధం ఉన్నదనే అంశాలు గౌరవంగా మీకు సమర్పిస్తున్నాను. ఈ వివరాలతో మరియు మీ ముందు ప్రదర్శింపబడే సాక్ష్యాలతో మీరే నిర్ణయించగలరు. ఒక గట్టి నమ్మకం ఏమిటంటే అధ్యక్షుల వారిని ముందుగా కత్తితో పొడవాలనేది ఇఫ్రయామ్ బెండాల్ యొక్క నిరంతర అప్రమత్తతో నిరోధించబడిదని , పహరాజవాన్లు రెట్టింపు అయినందున ఆశలు అడియాశాలు అయినాయి. విషం ఇవ్వాలి అని అనుకున్నారు. కాని ఎడ్మండ్ క్లర్క్ ఇచ్చిన వాఙ్మూలం వల్ల మరియు మిగతా వారు అంతా రహస్యానికి కట్టుబడి ఉండటమే కాక భయంకరమైన తిట్లను కనిపెట్టుకుంటూ ఉంటూ ఖండించేవారు. ఇక మిగతావన్ని ఎవరి చేతనైతే చేయబడ్డాయో వారి మీద పడటమే కాక వారి మధ్య సంబంధం కూడా తెగిపోయింది".

ఇదే డాక్యుమెంటులో సూరత్ కౌన్సిల్ అధ్యక్షునికి వ్యతిరేకంగా మిస్టర్ చార్లెస్ పీచే ఫిర్యాదు కూడా నమోదు చేయబడి ఉంది

"నేను మీ నుండి (అధ్యక్షుల)తలపై రెండు గాయాలను పొందాను. ఒకటి చాలా పొడువైనది మరియు లోతైనది. దీనితో పోల్చినప్పుడు రెండవది చిన్నది. ఎడమ చేతిపై

పడిన ముష్టిఘాతం భుజాన్ని మంటలతో ముంచింది. మరియు ప్రస్తుతం ఆ భాగం నన్ను బాధపెట్టి నిస్తేజితున్ని చేస్తున్నది. మరియు, నాకుడి ప్రక్క టెముకలపై పడిన దెబ్బ వలన ఊపిరి పీల్చుటకు కష్టంగా ఉంది. నన్ను నేను సంభాళించుకోవడం అసాధ్యంగా ఉంది, మొదటి దెబ్బ కంటే తక్కువ కాకుండా ఎడమ తుంటిపై ఇంకొకటి, వీటితో పాటు కంటి బొమ్మపై వేటు".

తొలిదశలో భారతదేశం వచ్చి స్థిరపడిన ఆంగ్లేయుల వాలకం ఇది. మన పరిశీలనకు ఈ అంశాలు చాలు. 17 వ శతాబ్దిలోని మొదటి ఎనబది సం॥లు చర్చిని నిర్మించకుండానే వారి పనిని వెళ్ళదీసుకున్నారు. 18వ శతాబ్దంలోని పరిస్థితులలో మార్పు ఏమీ లేదు. 18వ శతాబ్ద కాలంలో భారతదేశంలో ఉన్న ఆంగ్లేయుల నైతిక స్థితినే మిస్టర్ కాయెగారు ఈ విధంగా చెప్పాడు-

"సుదీర్ఘమైన వారెన్ హేస్టింగ్ పరిపాలనాకాలంలో ఆంగ్లో-ఇండియనుల స్థితి ప్రశంసించడానికి అర్హమైనదిగా లేదని రూఢీగా చెప్పవచ్చు.....ఆదర్శప్రాయంగా ఉండవలసిన వాళ్ళే వారి అరాచక జీవన విధానంతో క్రైస్తవం భరించలేని తప్పులు చేశారు...హేస్టింగ్ అనుమతి తీసుకొని ఒకరి భార్యను తీసుకపోతే, ఫ్రాన్సిస్ అనుమతి తీసుకోకుండానే ఇంకొకని భార్యను తీసుకపోయినాడు.....ఇది ఊహించడమే భయంకరమైనది: ఇలాంటి ఉదాహరణలు కలిగి ఉన్నవారి సమక్షంలో తక్కువస్థాయి కలిగిన సంఘ సభ్యులు నీతి, మాన మర్యాదలు కలిగి ఉండటం కష్టం. నిజం చెప్పదలిస్తే ఈ కాలంలో భారతదేశంలో ఇంగ్లీషువారి క్రైస్తవం విచారకరమైన స్థితిలో ఉందని గుర్తించడం తప్పని సరి. పురుషులు జూదం, త్రాగుడు ఎక్కువ చేసెడివారు. స్థానిక స్త్రీలను ఉంచుకోవడమనేది మినహాయింపుగా కంటే నియమాను సారంగానే జరిగేది. గౌవనీయ ఇంగ్లీషువారు సమృద్ధిగల జెనానాలను కలిగి ఉండడమనేది అసాధారణమేమి కాదు. ఆరోజుల్లో ఉత్కృష్టమైన విలాసాలకు కరువు లేదు. ప్రత్యేకంగా చలికాలపు వినోదాలకు అంతులేదు. బంతి ఆటలు, గుఱ్ఱపు పందాలు నాటకాలు, ఇలా వేడుకే వారి జీవనంగా సాగేది. జీవించే తక్కువ కాలంలో ఎక్కువ భాగ నవ్వుతూ పురుషులు గడపాలనేది వారి తీర్మానం.

.....................

"నిజానికి తాగుబోతు తనం సాధారణమైనది మరియు అడ్డగించేది. ఇది ఆ కాలంలో ఫ్యాషన్ పేరుతో ఏర్పడిన దురలవాట్లలో ఒకటి. ఇది నిస్త్రాణతకు దారి తీస్తుంది. పెద్ద ప్రెసిడెన్సీ పట్టణాలలో ప్రత్యేకంగా కలకత్తాలాంటి ప్రెసిడెన్సీలలో ప్రజావినోదాలు తరచుగా ఉండేవి కావు. సాధారణంగా, ఆరోజులలో తాగి ఉన్మాదస్థితిలో ఉండటం మూలాన రాత్రిపూట సంతోషపరిచే విందు విలాసాలు చాల తక్కువ. వారికి నాట్యం అనేది అసాధ్యం. అంతేకాదు వీటిస్థానంలో పోట్లాడుకోవడమనేది సర్వసాధారణం. ఆరోజుల్లో సెల్ఫ్ క్లబ్‌గా పిలిచే పేరుగల క్లబ్ ఒకటుంది. కలకత్తా మర్యాదస్థులందరూ జూదమాడిన స్థాయిలో త్రాగరు. కొన్ని సందర్భాలలో త్రాగి 1000 బంగారు మొహర్లు పందెం కాయడమనేది స్వల్ప విషయం. జూదం రాత్రంతా సాగేది, మరియు ఒక వేళ అది శనివారం రాత్రి అయితే మరుసటి రోజు వరకు ఆడేవారు.

** ** **

"గౌరవ ప్రద వివాహం చాలా అరుదైన విషయం......తూర్పు ఇండియా డైరెక్టర్ల న్యాయస్థానం.....వారు స్థిరపడిన ప్రాంతాలలో నీతి నియమాలను సంస్కరింప చేయడమనే మంచి కార్యం నిర్వర్తించారు, మరియు గౌరవప్రద వివాహాలు ఒక సాధనంగా, ముఖ్యసహాయ కారిగా ఉంటాయని భావించారు. వారు సైనికుల భార్యలకు ముడిసరుకులనే కాకుండా కొన్ని ఆభరణాలు కూడా సరఫరా చేసినారు. ఇది మర్యాదస్థులైన స్త్రీల విషయంలో జరిగింది అని భావించేవారు. ఇటువంటి వివాహ సంబంధాలను వ్యాపారానికి దోహదకారిగా ఉంటుంది అనే దానితో ప్రోత్సహించారు. ఈ సాహస కార్యం ఏదైతేనేమి ఫలవంతం కాలేదు. ఇలా వివాహం చేసుకున్నవారు ఉదాసీనంగా ఉండుటే మిగిలింది. వివాహం చేసుకోలేని వాళ్ళు ధైర్యంగా లేరు. వారిలో కొందరు సంశయాత్మకులుగా మిగిలారు. ఆ కాలంలో ఇదంతా జరిగింది ప్రజాధనం మద్దతుతోనే. కాని ఇది చాలా మేరకు వారి ఆకలిని మాత్రమే తీర్చేది. ఘాటైన నిషానిచ్చే మధ్యాన్ని కొనుగోలు చేయడానికి వ్యభిచారంతో వచ్చే ధనంతో, వేతనంతో పాటు వారు కలిగి ఉన్న అందమైన వస్తువులను అమ్ముకునేవారు. తద్వారా ఈ పరిస్థితి సహజసిద్ధంగా వాళ్ళను విషవలయంలోకి నెట్టింది.

"ఈ అసహ్యాకరమైన స్థితి బహిర్గతమై విఖ్యాతి పొందినది; మరియు డిప్యూటి గవర్నర్ మరియు కౌన్సిల్, బొంబాయి వారికి ప్రెసిడెంట్ మరియు కౌన్సల్, సూరత్ వారు ఇలా వ్రాసారు "మీరు మా దృష్టికి తీసుకొచ్చినట్లుగా మా స్థానిక మతానికి, ప్రభుత్వానికి అసహ్యం కలిగించేవిధంగా కొంతమంది స్త్రీలు ఎదిగారని, మేము మిమ్ముల్ని గౌరవనీయమైన కంపెనీ పేరు మీదుగ వారిని స్వయంగా, స్థిరచిత్తంతో మతమార్పిడికి ధరఖాస్తు చేసుకొమ్మని స్పష్టమైన హెచ్చరికలు జారీ చేయగలరని కోరుచున్నాం. అలా జరగని పక్షంలో రొట్టె, నీళ్ళతో ఈ దేశంలోనే గడపాల్సి వస్తుంది. మరియు బయటకు వెళ్ళడానికి వారికి ఉండే పూర్తి స్వేచ్ఛను కోల్పోవలసిన శిక్ష కూడా పడుతుంది. ఈ స్థితి వాళ్ళను ఇంగ్లాండ్‌కు ఓడనెక్కించేంత వరకు ఉంటుంది".[2]

సమకాలిక రికార్డుల నుండి సంగ్రహించబడిన క్రింది మూడు సంఘటనలు తొలినాటి క్రైస్తవుల నీతి మరియు ప్రవర్తనలు ఎంత చెడ్డగా ఉన్నాయో తెలియజేస్తున్నవి.

1809లో కాప్టెన్ విలియమ్ సన్ ప్రచురించిన' Indian Vade Mecum' గ్రంధంలో ఈ విధంగా చెప్పారు:-

"యిద్దరు స్త్రీలు ఒకరితొనొకరు కలిసి ఒకే గృహంలో నివసించిన పలు సన్నివేశాలు నాకు తెలుసు. వివిధ తరగతులు మరియు కొలతలకు సంబంధించిన పదహారు మందికి తక్కువ కాని వారితో ఒకానొక పెద్దతరహకు చెందిన మిలటరీ హోదా కలిగిన వ్యక్తి సంతోషపడినారు. అందులో ఎవరినైనా ఒకరిని ఏం చేశావని అతని స్నేహితుడు అతనిని అడిగినప్పుడు అతను "ఓహ్, వారికి కొంచెము అన్నం పెట్టి, వారిని యిక్కడ అటు యిటు తిరగనిచ్చాను" అని జవాబిచ్చినాడు. యూరప్ నుంచి అప్పుడే వచ్చిన ఒక నాజూకైన యువతిని సంబోధిస్తున్నప్పుడు పై పెద్దమనిషి ఆ యువతి అతిధిగా ఉన్న గృహస్థురాలు అక్కడి విషయములన్నింటిని ఆవిడకు తెలిపిన తరువాత, అతని వివరణ యిలా ముగించారు, 'నా ప్రియతమా నిన్ను ప్రార్ధిస్తున్నాను, ఈ మేజర్‌కు పదహారో భాగస్వామిగా కావడానికి నీవు యిష్టపడతావా?'

I భారతదేశంలోని ఇంగ్లీషువారిలో విశృంఖలత్వం మరియు అవినీతి ఆ విధంగా ఉండేది. ఇంగ్లీషు వారు భగవంతున్ని విశ్వసిస్తారని లేదా వారికి నీతి నియమాల పట్ల

విశ్వాసం ఉన్నదని భారతీయులతో అంటే విని అద్భుతంగా చూడటంలో ఆశ్చర్యం లేదు. క్రైస్తవం గురించి మరియు క్రైస్తవుల గురించి ఏమని ఆలోచిస్తావని భారతీయుణ్ణి అడిగితే తనకు వచ్చీరాని ఆంగ్ల భాషలో ఇలా అంటాడు "క్రైస్తవం రాక్షస మతం, క్రైస్తవులు బాగాతాగుతారు, బాగా తప్పులు చేస్తారు, ఇతరులను బాగా కొడుతారు, తిడుతారు" – మరి ఇది అవాస్తవమైన తీర్పుగా ఎవరైనా చెప్పగలరా?

ఆ కాలంలో ఇంగ్లాండ్ తనకు తాను నీతి ప్రవర్తననే అతి బరువును మోయడం లేదనేది సత్యం. వారి గృహాల్లో కూడా ఆంగ్ల దేశీయులు స్వచ్ఛమైన జీవితాలను కలిగిన వారిగా వ్యత్యాసీకరించలేము. స్వదేశంలోనే బ్రిటిష్ వారి నీతి సంకోచించి కుబ్జతనాన్ని సంతరించుకొన్నందువలన, విదేశాల్లో నీతిమంతంగా ఉండడానికి అవకాశమే లేదు. మిస్టర్ కాయె[3] యీ విధంగా గమనించారు "పునరుద్ధరణ తర్వాత అంతఃపురంలో గల స్వేచ్ఛా లైంగిక ప్రవర్తన మొత్తం దేశాన్ని కలుషితం చేసింది. మన దైనందిన జీవితాలనే కరెన్సీ మీద వైట్ హాల్ ముద్ర ఉంటుంది. కంపెనీ ఓడల్లో ప్రయాణించిన సాహసికుల ద్వారా యిది యితర ప్రదేశాలకు వ్యాప్తి చెందింది. విగ్రహారాధకుల భూమి నుంచి దీనిని తొలగించడం అంత తేలికైనది కాదని మనం ఖచ్చితంగా అనుకొనవచ్చును". పదిహేడు, పద్దెనిమిదవ శతాబ్దాలలో ఇంగ్లీషు వారి జారత్వానికి ఏ నెపాన్ని చూపినా అది క్రైస్తవత్వాన్ని అగౌరవ పర్చినదనేది, దాని వ్యాప్తిని అతి కష్టతరం చేసిందనేది వాస్తవం.

మత స్వీకరణ క్షేత్రంలో ఆధిక్యత కోసం కాథలిక్కులు, కాథలిక్కేతర మిషనరీల మధ్యన తగవులు క్రైస్తవ మత ప్రగతికి నిరోధకంగా నిలిచిన రెండవ అంశం.

1541 లో ఫ్రాన్సిస్ జేవియర్ రాకతో భారతదేశ క్రైస్తవ వ్యాప్తిలో కాథలిక్కుల చర్చి ప్రవేశించింది. పోపు అధికారాన్ని సమర్థించడానికి కొత్త జీసస్ సంఘమును స్థాపించిన మొదటి మిషనరీ ఇతనిది. కాథలిక్కులు ప్రవేశించకముందు భారతదేశంలో ముఖ్యంగా దక్షిణ భారతంలో గల క్రైస్తవ జనాభా సిరియా చర్చికి చెందిన వారు. ఈ సిరియన్ క్రైస్తవులు మలబారు తీరం వెంబడి చాలా కాలంగా ఉంటున్న వారే. వీరి ముఖ్య గురువు అయిన థామస్‌ను పితృస్వామికత్వానికి (Patriarch) ప్రతీకగా కనుగొన్నారు. థామస్ ఉపదేశమేమిటంటే "సిరియా మరియు సిలిసియా ద్వారా వెళ్ళి చర్చిల ఆకృతిని తెలుసుకొండి". వాళ్ళు సిరియాను దైవ గృహముగా భావిస్తారు. వాళ్ళు బాబిలోను

యొక్క పితృస్వామికాధిక్యాన్ని గుర్తిస్తారు. వాళ్ళకు రోము గురించి, పోపు గురించి ఏమీ తెలియదు. పోపు ఆధిపత్యం ఎదిగిన కాలంలో భారతదేశం మహమ్మదీయుల ఆధిపత్యంలో ఉంది. జోక్యం చేసుకుంటున్న పశ్చిమ దేశాలకు వ్యతిరేకంగా భారత ప్రవేశ ద్వారాలు మూసివేయబడినాయి. ఈ స్థితివల్ల భారత దేశంలోని సిరియన్ చర్చిలు రోమన్ కాథలిక్కుల చర్చిల నుండి రక్షింపబడినవి. క్రైస్తవానికి ఏది నిజమైన రూపం? కాథలిక్కులదా? సిరియన్‌లదా? అనే ప్రశ్నలకు నాకు ఇక్కడ సంబంధం లేదు. కాని వాస్తవం ఏమంటే, భారతదేశంలో పోర్చుగీసులు ప్రాతినిధ్యం వహించిన కాథలిక్కు చర్చిలు సిరియన్ చర్చిల ముందర నిందల పాలు కావడమే కాక క్రైస్తవేతర దేవాలయాలు కనిపించకుండా పోయినాయి. భ్రష్టు పట్టిన రోమన్ కాథలిక్కుల తాకిడితో సిరియన్ క్రైస్తవులు భయంతో కృశించిపోయి తాము మాత్రమే క్రైస్తవులమంటూ, విగ్రహారాధకులం కాదని ప్రకటించుకున్నారు. మరో విషయమేమిటంటే మలబారు క్రైస్తవులు రోమన్‌ల సైద్ధాంతిక వాదాన్ని అంగీకరించకపోవటమే కాక తాము రోమన్ల ఆధిపత్యంలో ఎన్నడూ లేమూ అని చెప్పుకున్నారు.

దైవ ప్రార్థనా పద్ధతులు మరియు విచారణ పద్ధతులు మాత్రమే ఈ రెండు చర్చీల మధ్యన సంఘర్షణకు కారకాలై పెనుమంటలు సృష్టింపబడుటకు వీలు కల్పించినవి.

గోవాలోని విచారణావేత్తల ప్రకారం కాథలిక్కులు భ్రష్టులు, తోడేలు లాంటి వాళ్ళు, మరియు సిరియన్‌ల చర్చి మీదకు పోపు దూతలుగా వచ్చారని పరిగణిస్తారు. ఈ ఘర్షణ ఎంత గొప్పదో యిప్పటికే కాయో చెప్పిన అతని సంపుటిలో ఉల్లేఖించడం జరిగింది.

రోమన్‌లచే శత్రువుగా పరిగణింపబడిన మొదటి సిరియన్ బిషప్పును, అతని స్థైర్యాన్ని, మంచితనాన్ని విచారణ జరిపి భూగర్భ చెరసాలలో వేసి ప్రాయశ్చిత్తం చేసారు. ఇదే గతి రెండవ బిషప్పుకు కూడా పట్టింది. మూడవ బిషప్పు సుదీర్ఘ విచారణను ఎదుర్కొన్నాడు. విచారణలో ఎన్నో బాధలు పడ్డాడు. ఐననూ పోపు ఆధిపత్యాన్ని ఒప్పుకోకనే హృదయవిదారకమైన బాధలతో విచారణలోనే మరణించాడు. ఇప్పుడు చర్చీలు బిషప్పు లేకుండా ఉన్నాయి. గతంలో కంటే ఇప్పుడు బిషప్పుల అవసరం ఎక్కువైంది. ఆదరణ అవసరమైంది. మద్దతు కావలసి వచ్చింది. రోము తన బలమైన

హస్తాన్ని ముందుకు చాచడానికి, విస్తరింపచేయడానికి సిద్ధంగా ఉంది. గోవా ఆర్చి బిషప్పుగా డాన్ అలెక్సిస్ డెమేనెజెస్ నియమింపబడినాడు. ఇతను కొత్త మత మార్పిడిల కంటే పాతవారిని లోబర్చుకోవడం తన కార్యక్రమంగా పెట్టుకున్నాడు. ఉత్సాహ, ఉద్రేకాలతో కార్యరంగంలోకి దూకి మత విద్వేషాలు రేపిన ఇతను రోముకు తప్పని సరిగా ప్రియపాత్రుడే. ఇతని సేవకుల (agents) నత్త విజయాలు అసహనాన్ని పెంచి, మొత్తం సిబ్బందిని తన చేతిలోకి తీసుకున్నాడు. సైనికశక్తినుపయోగిస్తూ దక్షిణాన ఉన్న సిరియన్ చర్చిలను తనకు తోడ్పడమని తాఖీదులు పంపాడు. ఈ చర్చిలు ఒక ఆర్చిడెకెన్ ఆధీనంలో ఉన్నవి. రాబోయే ఉపద్రవాన్ని పసిగట్టి కాలానుగుణంగా నడుచుకోవాలని నిర్ణయించుకున్నాడు. కాని తాను ప్రతిఘటనకు సిద్ధంగా ఉన్నానని కూడా ఇదే సమయంలో చూపాలనుకున్నాడు. ఆర్చి బిషప్పు కోసం ఎదురుచూశాడు. దృఢచిత్తం కలిగిన మూడువేల మంది పరివారం వెంటరాగా మేనేజెస్ కలువడానిక వెళ్ళాడు. వచ్చిన ఉద్దేశాన్ని అణచిపెట్టడం కష్టంగా ఉండెను. వారి మత రక్షణ కోసం వారికి గల తహతహను శత్రువుపై నమ్మతగని విధంగా చేసిన దాడితో ప్రదర్శించారు. హింస స్వల్పంగా చోటు చేసుకున్నది. ఐనను మేనెజెస్ రోమన్ చర్చి కాంక్షను ముందుకు తీయకుండా సమయస్ఫూర్తిని ప్రదర్శించాడు. కాని అతని ఉద్దేశాన్ని ఈ ప్రతిఘటన మళ్ళించలేకపోయింది. బాబిలాన్ యొక్క పితృస్వామికం 'అంటితే అంటుకునే భ్రష్టుమతంగ' బహిరంగంగా తిరస్కరించాడు మరియు తన ఆధిపత్యాన్ని గుర్తించుటకు దానిని పిచ్చి మతముగా ప్రకటించినాడు. రోమనుల ఆధిపత్యాన్ని తప్ప ఏ మతాధిపత్యాన్ని ఒప్పుకోకూడదని నిరోధిస్తూ వ్యక్తులందరికీ ఆదేశమును జారీ చేశాడు. లేదా సిరియనుల పితృస్వామికత్వాన్ని కాథలిక్కు చర్చి సేవలో ఉన్నవారు ఎలాంటి ప్రస్తావన తీసుకరాకూడదని హెచ్చరించాడు. దీనిని ఉల్లంఘించిన సిరియన్ చర్చి అధికారిని ప్రజా సమక్షంలోనే బహిష్కరించాడు: మరియు ఆర్చిడేకాన్‌ను పిలిచి బహిష్కరణ ఆదేశ పత్రము పై సంతకం చేయమని చెప్పాడు. భయపడి గందరగోళంలో పడ్డ, దుర్బలుడైన ఆర్చిడేకాన్ సంతకం చేశాడు. తదుపరి ఆ పత్రాన్ని చర్చి గేటుకు బహిరంగంగా అంటించాడు.

సహించలేని అవమానం ఒక ప్రక్క, దుర్బల రాజీ ఒప్పందం మరొక ప్రక్కన. భరించలేని ప్రజల కోపం ఆర్చిబిషప్‌కు వ్యతిరేకంగా భగ్గుమంది. అంతేకాదు ఆర్చిడేకాన్‌కు

వ్యతిరేకంగా కూడా. ఆర్చిడేకాన్ లక్ష్యం కష్ట సాధ్యంగా ఉంది. విరుచుకుపడిన జన బాహుళ్యం ముందుకు తరలినప్పుడు శాంత పర్చడం ఎంత కష్టమో తెలిసింది. తమ తీరాలను భ్రష్టు పట్టించిన పోర్చుగీసు చొరబాటుదారులను పంపించేవరకు ప్రజలు తెగించి పోరాడే వారే కాని ఆర్చిడేకాన్ ప్రజలను శాంతపడమని వేడుకున్నాడు. పగ తీర్చుకోవడం కంటే క్షమించడం సేవాయోగ్యమని హితవు చెప్పాడు. తన బలహీనతలకుక్షమాపణ కోరాడు. తన తప్పును ప్రక్కకు పెట్టి బాబిలాను మతాన్ని రక్షించగలనని హామీనిచ్చాడు. రోమనుల చొరబాటుకు వ్యతిరేకంగా స్థిరమైన ప్రతిఘటనను కొనసాగించాలని బోధించాడు. ప్రజలు గట్టిగా అరుస్తూ తమ సమ్మతిని తెలిపారు. తామెప్పుడూ మోకరిల్లేది లేదని ప్రతిజ్ఞ చేశారు. పోరాటాన్ని కొన సాగించడానికి సంసిద్ధులయ్యారు.

కాని మేనేజెస్ అనేక ఉపాయాలున్న వ్యక్తిగా అలాంటి ఘర్షణలనుండి భంగ పరచబడలేదు. అతని శక్తి మరియు దృఢత్వం నిర్నిరోధకత్వాన్ని కలిగి ఉంది. అతని తంత్రం చాలా దీర్ఘమైనది, లోతైనది కూడా. శత్రువుపై దాడిలో ఒక ఆయుధం విఫలమైతే వేరొక దానితో ప్రయత్నించడం అతని నైజం. మోసం హింస స్థానాన్ని ఆక్రమించుకుంటుంది. డబ్బు ఆయుధాన్ని విశ్రమింపజేస్తుంది. శత్రువు కున్న భయాలపై చేసిన ప్రయత్నం ప్రయోజనాన్ని యివ్వనప్పుడు విజ్ఞప్తుల ఎత్తు వేస్తాడు. బెదిరింపు స్థానాన్ని ఆశ ఆక్రమించుకుంటుంది.కొద్ది కొద్దిగా తన లక్ష్యాన్ని ఛేదించాడు. మొదటుగా పై పద్ధతుల ద్వారా ఒక చర్చిని పాదాక్రాంతం చేసుకున్నాడు. తదుపరి రెండవది. ప్రమాదాలు, భయాలు చుట్టుముట్టాయి. తరచూ ప్రతిఘటన హింసను ఎదుర్కొనవలసి వచ్చింది. ఎదుర్కొని ఓడించాడు కూడా. సిరియన్ క్రైస్తవుల బలం తనను మించినప్పుడు స్థానిక రాజుల సహాయాన్ని వాడుకున్నాడు. ప్రతిఘటనలో అలసిపోయి అసంతృప్తిగా మిగిలిపోయిన ఆర్చిడేకాన్ చివరికి బహిష్కార భయంతో రోమన్ కాథలిక్కుల ప్రధాన గురువును వేడుకున్నాడు. దానితో మేనేజెస్ సైనాడ్ కోసం తాఖీదు జారీ చేశాడు. 1599 జూన్ 20న డయాంపర్ వద్ద చర్చిలన్నింటిని సమావేశపర్చాడు. రహస్య గుస గుసలు ఎక్కువేమి లేకుండానే మొదటి సమావేశం నిశ్చలంగా పూర్తయింది. రెండవ ఉత్సవ సభలో ఉపద్రవం మొదలైంది. భంగం ఏర్పడింది. మత విశ్వాస ప్రకటనను ఉచ్చరిస్తూ

ఆర్చిబిషప్, బాబిలాన్ పితృస్వామికత్వాన్ని శపిస్తూ త్యజించినప్పుడు అంతరాయం ఏర్పడింది. సిరియనుల అసంతృప్తి బహిరంగంగా బద్ధలైంది. 'విశ్వాసాన్ని' ఒప్పుకు తీరాలని పట్టుబడటాన్ని వ్యతిరేకిస్తూ నిరసించారు. అలా ఒప్పుకోవడమంటే సైనాడ్ ముందు సమావేశమైన తాము క్రైస్తవేతరులుగా ప్రకటించుకోవడమే అవుతుందని, కావున కూడదని విజ్ఞప్తి చేశారు. కాని మేనేజెస్ వారి అనుమానాలను దూరం చేసి ఉపశమింపజేసినాడు. తాను స్వయంగా తూర్పు చర్చిల పేరు మీదుగా బహిరంగంగా విశ్వాస ప్రకటన చేశాడు. సిరియన్ బోధకులలో ఒకరు సంధానకర్తగా ముందుకు వచ్చి మలబారు భాషలోకి తర్జుమా చేసిన విశ్వాస ఒప్పుదల పత్రాలన్నీ చదివి వినిపించాడు. వాళ్ళను మోకరిల్లజేసె పద పదాన్ని ఉచ్చరింపజేసినాడు. ఈ విధంగా సిరియనులు రోమనులకు మోకరిల్లి తలలు వంచారు.

మేనెజెస్ తనకు లభిస్తున్న అనుకూల అవకాశాలన్నింటినీ మెరుగుపర్చుకొనుటకు దృఢచిత్తుడైనాడు. గత విజయాల సూర్యకాంతిలో చలికాచుకోవడం అతని నైజం కాదు. విశ్రమించి నిర్వ్యాపారుడై బాధపడలేదు. మత సంబంధిత ఔత్సాహికం, కాలానుగుణ ఉద్రేకము అతన్ని కదిలించింది. శత విధాల ప్రయత్నించి సిరియన్ క్రైస్తవుల మెడను కాడికి కట్టడమే అతనికి సంతృప్తినీయలేదు. అలా కొనసాగాలనుకున్నాడు. చర్చిలు మలినమైన ఫలితాలిచ్చినవి. ఐననూ వారిలో తీక్షణ దృక్కులు, తక్షణ గ్రాహకులున్నారు. 17వ శతాబ్దపు వెలుగులు ప్రపంచం మీదకు ప్రసరింపజేసిన వాళ్ళు భవిష్యత్‌లోకి ఆశతో చూశారు. తూర్పున పోర్చుగీసు వారి దివ్యమైన, ప్రఖ్యాతి కలిగిన కీర్తి క్షీణించే కారణాలను వాళ్ళు చూడగలమనే అనుభూతిని స్ఫురింపజేసింది. అక్కడ సిరియన్ చర్చిలకు ఇంకా నమ్మకం మిగిలింది. మేనేజెస్ మత విద్వేషం చాలా బాధలను, కోపాలను మిగిల్చింది. ఎందుకంటే అతను మత గురువులను భార్యలనుండి విడదీసాడు. పనికి మాలిన ఆధారాలతో చర్చి సభ్యులను బహిష్కరించాడు. సిరియనుల పవిత్ర విశ్వాసానికి సాక్ష్యంగా మిగిలిన గ్రంథాలను నాశనం చేశాడు. అతని ఆటవికవాద చర్యలు మరచిపోలేనివి, క్షమార్హం కానివి, చక్కదిద్ద(రానివి)కూడనివి. ఐననూ ఇన్ని బాధల మధ్య ఈ క్రూరత్వం తాత్కాలికమైనదనే ఊరడింపు ఆలోచనా మెదిలేది. గిబ్బన్ ఇలా వ్రాసాడు : "అర్థై సం॥ రాల దాస్యం మరియు డాంబికాన్ని సంహనంగా భరించారు. కాని విరామ మెరుగక

శ్రమించే, ధైర్యసాహసాలు గల డచ్‌ల స్వభావానికి పోర్చుగీసు రాజు గజగజలాడిన వెనువెంటనే నెస్టోరియన్‌లు తమ తండ్రుల మత విశ్వాసాలను, సామర్థ్యాలను సొంతం చేసుకున్నారు. తాము ఛీ కొట్టిన అధికారాన్ని సమర్థించడానికి శక్తులు చాలలేదు. కూలిపోతున్న క్రూరత్వానికి వ్యతిరేకంగా నలభై వేల క్రైస్తవులు వేలెత్తి చూపారు. బాబిలోన్ కులపతి నుంచి సిరియన్ మత ప్రవక్తలు, మత ప్రబోధన చేయగల దైవదత్త నైపుణ్యతలు క్రొత్తగా సరఫరా అయ్యేంత వరకు భారతదేశ మత ప్రబోధకుల్లో తలమాణిక్యం లాంటి వాడు బిషప్ పాత్రను వహించారు". ఈ సూక్ష్మ వర్ణన మేనేజెస్ యొక్క అణచివేత ఫలితాలను తెలియజేస్తుంది. ఆరునెలల కాలంలోనే అత్యాశతో విచక్షణ కోల్పోయిన బిషప్ సిరియన్ చర్చిని బానిసత్వంలోకి దింపాడు. వీళ్ళు అరవై సంవత్సరాలు రోము బానిస బంధాల బాధలను భరించారు. కాని అశాశ్వతమైన అధికార హస్తము పై ఆధారపడి ఐహిక విజేతగా విచ్చేసిన మేనేజెస్ తన స్వశక్తి మీదనే విశ్వసించాడు. ఇతని ఉదాహరణ నే మిష్టర్ హవ్ (Mr. Hough) ఇలా వ్రాసినాడు, "ప్రమాదాన్ని సూచించి హెచ్చరించే దీప స్థంభంలా మేనేజెస్ తన కుళ్ళిపోయిన చరిత్రతో భవిష్యత్ మిషనరీలకు ఓ తప్పనిసరి హెచ్చరికలా నిలిచాడు. విశ్వాసం, దైవభక్తి, లేకుండా చర్చీల అభ్యున్నతి సాధ్యం చేయలేము. ఇది లేకుండా మతాచార్యుల అద్భుతాలు, ఊహలు ఏమీ లేవు; మరియు ఏ కాలంలోనైతే అతనికి అతను తానే శాశ్వతత్వానికి పునాది వేశానని పొగుడుకున్నాడో, అదే కాలంలో సూచనప్రాయంగా కలుగచేసుకున్న దైవసంఘటన మాదిరి భారతదేశంలో పోర్చుగీసుకు కలిగే లాభం క్షీణించడం మొదలైంది."

కాథలిక్కుల, ప్రొటెస్టెంట్ మిషనరీల మధ్యన ఈ విధమైన బహిరంగ సంఘర్షణ లేదు. కాని క్రైస్తవాభివృద్ధిని నిరోధించడానికి సరిపడ శత్రుత్వముంది. ఇది సహకారాన్ని నిరోధించింది. అహంకార కార్యకలాపాలనే మిగిల్చింది.

క్రైస్తవ వృద్ధి నత్తనడకగా సాగడానికి మూడవ కారణం, క్రైస్తవ ప్రచారంలో మిషనరీలు అవలంబించిన తప్పుడు పద్ధతులు. తొలినాటి క్రైస్తవులు క్రైస్తవ ఔన్నత్యాన్ని చాటుకొనుటకు జ్ఞాన సంపన్న బ్రాహ్మణులతో పోటి పడి హిందూ, క్రైస్తవుల మధ్య తులనాత్మక యోగ్యతలపై బహిరంగ వివాదాలకు దిగడం. మిషనరీల కార్యసాధనలో ఇది కొత్త మార్గం. దీని వెనుక ఒక ప్రణాళిక దాగి ఉంది. అదేమిటంటే, హిందువులలోని ఉన్నత

వర్గాలను మరియు బ్రాహ్మణులను మత మార్పిడి చేయించడంలో గెలుపొందితే ప్రజాబాహుళ్యాన్ని మత మార్పిడి చేయించడం చాలా తేలికగా ఉంటుందని భావించారు. దీనికి సులువైన మార్గం ఏమిటంటే బహిరంగ వివాదాలలో హిందూ మతం ఓ తప్పుడు మతమని చూపించి బ్రాహ్మణులను ఓడించి మత మార్పిడి చేయించడమేనని అనుకున్నారు. క్రైస్తవ మిషనరీ బ్రాహ్మణులను పొందడమే కోరుకున్నది. కావుననే బ్రాహ్మణులతో సంబంధాలు నెలకొల్పుకొనుటకే ఎన్నో పాఠశాలలు, కళాశాలలు, వైద్యశాలలు మొ॥నవి నెలకొల్పినారు. కాని క్రైస్తవ మిషనరీలు మోసపోయినట్లుగా ఎన్నో అంశాలరీత్యా తెలుసుకున్నారు. క్రైస్తవ మిషనరీలు నిర్వహించిన సంస్థల నుండి బ్రాహ్మణులు మరియు సంపన్న వర్గాలు బాగా లాభాలు పొందినాయి. కాని క్రైస్తవం ఉనికిలోకి తెచ్చిన ఈ సంస్థల నుండి ప్రయోజనం పొందిన వారిలో అతికష్టం మీద ఎవరో ఒకరు తప్ప ఈ మతాన్ని గురించి పట్టించుకోలేదు.

దీనిలో ఆశ్చర్యం ఏమీ లేదు. హిందూ ఉన్నత వర్గాలను మరియు బ్రాహ్మణులను పొందాలనుకొని వెంబడించి విఫలమైనారు. హిందూవాదానికి మరియు క్రైస్తవ మతానికి మధ్యన వివాదానికి పునాది ఒక్కటి కాదు. మరియు పునాది ఒక్కటిగా ఉన్నచోట క్రైస్తవున్ని హిందూ ఎల్లప్పుడూ ఓడించగలడు.

మిష్టర్ బర్న్[4] విపుల పరిశీలనలో చెప్పినట్లుగా వేదాంతం తత్వానికి గల సంబంధాలను బట్టి పరిశీలించినట్లయితే హిందువులు, క్రైస్తవులు ఒకే పునాదిని కలిగి లేరని స్పష్టంగా చెప్పవచ్చును. ఎందుకంటే, నిజానికి వీళ్ళిద్దరూ పూర్తిగా భిన్నమైన వైఖరులను కలిగి ఉన్నారు.

"విద్యావంతుడైన హిందువు మత సంబంధ ప్రశ్నలు వేసుకున్నప్పుడు వేదాంతాన్ని, తత్వాన్ని విడదీయటాన్ని వ్యతిరేకించడమే కాక జగత్ సృష్టికి రెండూ కారణమైనవని వాదిస్తాడు. హిందూమతంతో మెలిగేటప్పుడు, దానికున్న ప్రస్తుత ధోరణి సర్వం దైవమయమనేది యింతకు ముందే విశదపర్చబడినది. షుమారు రెండువేల సంవత్సరాల నుంచి ఎల్లప్పుడూ తెగలు సమాయత్తమవుతున్నప్పటికీ, అవి దేవుడు, జీవి మధ్య గల ద్వంద్వాన్ని ఉద్ఘాటించినప్పుడు, తిరిగి రెండూ ఒకటే అనే ఏకత్వ సిద్ధాంతంలోకి జారిపోయే వైఖరి ఎల్లప్పుడూ ఉండడమే కాక, ప్రస్తుత ప్రపంచం మాయచే నగటు

క్రైస్తవుడు తన జీవనాన్ని సాగించడమే కాక, అతని మత పరమైన నమ్మకాలు తత్వశాస్త్రాన్ని ఆవశ్యకమనుకునే దాన్ని కన్నా కల్పనలతో కూడినదని ఒకే రీతిలో భావిస్తాడు. ఒక వ్యక్తి పెంపకంలో ఏ ఆలోచనా విధానాలను మంచివని భావిస్తాడో అవి ఖచ్చితంగా అతని తుది నిర్ణయాలను ప్రభావితం చేస్తాయి. విద్యాభ్యాసం గల హిందువులలో ఎక్కువ మందికి క్రైస్తవమనే భావనను ఒప్పుకోవడమనేది ఒక వింతగా ఉండడానికి అతని ఆలోచనా విధానం అనేక కారణాల్లో ఒకటిగా ఉంటుందని నాకు అన్పిస్తున్నది. ఒక యథార్థ ఉదాహరణను తీసుకున్నట్లు అయినచో, విద్యనభ్యసించిన ఒక సామాన్య హిందువు శూన్యంలోంచి ప్రపంచాన్ని భగవంతుడు సృష్టించాడనే నమ్మకం నవ్వు తెప్పిస్తుంది. ఒక సృష్టి ఉందని అతను నమ్మవచ్చు. కాని అతను ఒక భౌతికమైన కారణం, పదార్థం మరియు ఒక సమర్థవంతమైన కారణం, సృష్టికర్త– రెండూ ఆవశ్యకమని సిద్ధాంతీకరిస్తాడు. సర్వం దైవమయమే నన్న నమ్మకం అతనికున్నప్పుడు, చారిత్రాకాధారాల మీద కూడా విశ్వాసం ఉండదు. ప్రతి మానవుడు అతని ముక్తి కోసం పని చేయాల్సి ఉంటుంది అనే భావన దైవంతో మమేకం కావడం అనే నమ్మకంతో సంపూర్ణంగా వైరుధ్యం కలిగి ఉండడమనేది ఒక ముఖ్యమైన విషయం మీద వచ్చే ఒక ఆటంకం. ఈ ఆటంకానికి కారణభూతమైనది, ముక్తి కోసం ప్రతి మానవుడు పని చేయాలన్న భావన మీద ఆధారపడిన పునర్జన్మలో నమ్మకం".

అందువల్ల హిందువు తత్వాన్ని పునాదిగా చేసుకొని మాట్లాడుతాడు. కాని క్రైస్తవుడు వేదాంతమును ఆధారం చేసుకొని మాట్లాడుతాడు. కావున ఆ విధంగా రెండు మతాలను అంచనా వేయడానికి, లేదా స్తుతించడానికి లేదా ఖండించడానికి ఒకే పునాది లేదు. రెండు మతాలకు వేదాంతమున్నది. కావున క్రైస్తవులకు దేవుడు మరియు అతని కుమారుడగు జేసస్ ఉంటే, హిందువులకు భగవంతుడు అతని అవతారాలతో ఉండి, ఒకరిమీద ఒకరు ఆధిపత్యాన్ని నిరూపించుకొనుట అనేది వారు ప్రదర్శించే అద్భుతాల మీద ఆధారపడి ఉంటుంది. ఈ విషయంలో హిందూ వేదాంతం క్రైస్తవ వేదాంతాన్ని స్పష్టంగా ఓడించగలదు. మరియు క్రైస్తవంలో తత్వం లేకపోవడంవల్లే హిందూ విద్యావంతులను, బ్రాహ్మణులను తనవైపుకు మళ్ళించుకోవడంలో విఫలమైంది. క్రైస్తవ వేదాంతం అపరిమిత అద్భుతాలను ప్రదర్శించగలిగే హిందూ వేదాంతంతో పోల్చినపుడు వెలవెలపోయింది. ఈ ఇబ్బంది కరమైన పరిస్థితిని రోమన్ కాథలిక్కుల బోధకులైన పాదర్ గ్రెగరీ గుర్తించాడు. అతని

దృక్పథం చాలా ఆసక్తిని కలిగించినట్లుగానే నిర్దేశనాన్ని కూడా తెలియజేస్తుంది. నేను ఈ అభిప్రాయాలను కల్నల్ స్లీమాన్ పుస్తకంలో నమోదు చేసిన వాటిని క్రింద ఇస్తున్నాను. కల్నల్ స్లీమాన్ చెప్పుతూ ఉన్నాడు.[5]

"రోమన్ కాథలిక్ బోధకులైన పాదర్ గ్రెగరీ ఓ సాయంకాలం భోజనానికి కూర్చున్న సందర్భాన్ని మేజర్ గాడ్బై అవకాశముగా తీసుకుని ప్రజలలో మనమతం ఏ ప్రగతిని సాధిస్తున్నది? అని ప్రశ్నించాడు.

"అతను ఇలా అన్నాడు 'ప్రగతి? ఎందుకు? ఎలాంటి ప్రగతిని మనం ప్రజలలో సాధించగలమని ఆశించాం? మనం క్రీస్తు అద్భుతాలను గురించి మాట్లాడటం మొదలు పెట్టిన మరుక్షణమే వాళ్ళు కృష్ణుడు చేసే ఎన్నో అద్భుతాలను అనంతంగా చెప్పుతారు. గోపాలకులను, గొర్రెలను, గోవులను, వర్షపుబారిన పడకుండా ఉండేందుకు చిటికెన వ్రేలిపై గోవర్ధన గిరిని ఎత్తి గొడుగుపట్టిన గొప్ప అద్భుతాన్ని చెబుతారు.

"హిందువులు మన బైబిల్ చెప్పే అద్భుతాలను, కాలజ్ఞానాన్ని దేనినీ అనుమానించరు. దానిలో ఉన్న ప్రతి వాక్యాన్ని నమ్ముతారు. మరియు వాళ్ళు నమ్మే వాళ్ళ గ్రంథాల కంటే బైబిల్‌లో తక్కువ అద్భుతాలుండాలని అనుకుంటారు. 50 వేల సంవత్సరాల క్రితం వ్రాయబడిన విష్ణు అవతారం అయినటువంటి రాముడు మరియు కృష్ణుల గురించి, వారు చేసిన యుద్ధాలు, వారిపై మోహంను గురించి ఎవరైనా ఏ గ్రంథాలలోనైనా వ్రాసినట్లయితే సులభంగా విశ్వసిస్తాడు. ఈ అద్భుతాలు వారికి అసాధారణమేమీ కాదు. క్రైస్తవం మీద కొన్ని అనుమానాలను తొలగించుటకు హిందువుకు గౌరవనీయుడైన క్రైస్తవుడు ఇలా చెప్పవలసి ఉంటుందని సెయింట్‌పాల్ అభిప్రాయపడ్డాడు. సూర్య చంద్రులను భూమి మీదకు ఆటబంతులవలె తీసుకొచ్చాడు మరియు తిరిగి వారిని వారి స్థానాలకు ఏ మాత్రం నష్టం వాటిల్లింపజేయకుండా పంపిచాడు. ఇది వినిన హిందువుకు వాటిలో నిబిడీకృతమైన నిజాలపై ఏ మాత్రం కూడా సందేహం వస్తుందని నేను అనుకోను. కాని ఆ హిందువు తక్షణమే తమ క్రిష్ణుడు ఇంకా అపూర్వంగా చేసినవైన - గోపికలను (పాలపనిమీద ఉండే స్త్రీలను) ఉల్లాస పరచటం లేదా అతని కాలంలో ఉన్నటువంటి సంశయాళువులను (నాస్తికులను) తృప్తిపరచటం, మరియు వాటన్నింటిని సాధుత్వంతో తలచవలసినవిగా ఎంచి వివరించే అంశాలను తన మస్తిష్కంలో ఆలోచిస్తాడు."

ఇది తప్పుడు పద్ధతి అని భారత దేశంలోని ఘటనలన్నీ తెలియజెప్పినవి. ఇది కేవలం జీసస్ మరియు అతని శిష్యులు అనుసరించిన దానికి పూర్తి విరుద్ధమైనది. రోమునందు క్రీస్తు మరియు అతని శిష్యులు క్రైస్తవం వృద్ధి చెందడానికి ఎక్కడినుండి ప్రారంభించినారోననే విషయాన్ని గిబ్బన్ క్రింది వర్ణన చేసాడు. అతను చెప్పేదేమిటంటే:

" క్రైస్తవ క్రమ వికాసం గురించి చేసిన సర్వే అసంపూర్ణమైనప్పటికినీ, నిష్పక్షపాతమైనది. ఇది బహుశ ఒక ప్రక్క భయంతోనూ మరొక పక్క పూర్తిగా నిమగ్నమైన ఫలితం కావచ్చు. మతస్వీకారం పొందిన వారి సంఖ్యను అధికంగా పెంచి చూపించారు. ఆరిజిన్ (Origin) నిష్కళంకమైన ప్రమాణ పత్రం ప్రకారం మత విశ్వాసం కలిగిన వారి సంఖ్య నమ్మశక్యముగాని ప్రపంచ జనబాహుళ్యంతో పోల్చినప్పుడు చాలా చిన్నది, లెక్కింపవీలులేనిది. తొలినాటి క్రైస్తవుల వాస్తవ సంఖ్యను నిర్ధారించడం అసాధ్యం, అంతే కాదు ఊహించడమే కష్టం. కావున మనము ఎలాంటి నిర్దిష్ట సమాచారం లేకుండా మిగిలిపోతాం. ఐనప్పటికి అంటియాక్ మరియు రోము అందించిన సమాచారము నుండే చాలా అనుకూల అంశాలను ఊహించగలం. ఐననూ ఈ సమాచారం ముఖ్యమైన కాన్స్టంటిన్ మత మార్పిడిల కంటే పూర్వంది. రాజుగారు స్వయంగా నమోదు చేసిన శిలువధారులుగా ఉన్నవారి సమాచారాన్ని బట్టి ప్రజలలో 20 శాతంగా ఉండునని మనం ఊహించుటకు వీలుకల్పిస్తుంది. కాని వారి ఐక్యత, ఉత్సాహం,విశ్వాసపు అలవాట్లు వారి సంఖ్య ఎక్కువ చేసి చూపినది. సరిగ్గా ఈ కారణాలే వారి వాస్తవ బలం స్పష్టంగా కనబడే విధంగా మరియు అవి దారుణంగా వారి భవిష్యత్ క్రమానికి దోహద పడింది.

"పౌర సమాజంలో కొద్దిమంది సంపదలను ,గౌరవాలను, జ్ఞానాన్ని చేజిక్కించుకున్నారు. కాని సమాజ రక్త, మాంసాలైన జనం బీదరికం, అమాయకత్వం, అంధకారంలో, మగ్గుతున్నారు. ఉన్నత వర్గాల నుండి కాక నిమ్న పొరల నుండి జన సమీకరణ చేసి మార్పు చెందించవలెనని, క్రైస్తవ మతం తనకు తాను మొత్తం మానవ సమాజాన్ని ఉద్దేశించి ప్రబోధిస్తుంది. ఈ సహజమైన మరియు నిష్కళంకమైన పరిస్థితులు రోత పుట్టించే ఆరోపణలస్థాయికి చేరుకున్నాయి. ఈ పరిస్థితులు లేవని తప్పించుకున్న దాంట్లో దేవుని ప్రత్యేక దూతల కంటే కూడా విశ్వాసాన్ని శత్రువుగా భావించే వాళ్లై ముందున్నారు. క్రైస్తవంలో క్రొత్త తెగ దాదాపుగా సమాజంలో నీచ జాతులైనటువంటి

రైతులు, యంత్ర పనివాళ్లు, పిల్లలు , స్త్రీలు, బిచ్చగాండ్లు మరియు బానిసలతో కూడి ఏర్పడినది. ఇలా క్రైస్తవ మిషనరీల ద్వారా ఆకర్షింపబడిన వారిలో కొందరిని ధనవంతులుగా, గౌరవ కుటుంబాల వాళ్ళుగా క్రైస్తవం మలిచింది. ఈ అపరిపక్వ బోధకులు వ్యక్తిగత జీవితంలో (చర్చి తెరవెనక) వితండ వాదులుగా, ఒదురుబోతులుగా కొనసాగుతూ, బహిరంగంగా మాత్రం నోళ్ళు మూసుకుని ఉండేవారు (అని విశ్వాసం లేని మరియు ఓర్వలేని వాళ్ల ఆరోపణ) తత్వవేత్తలతో ఎదురుపడే ప్రమాదకర పరిస్థితులను జాగ్రత్తగా తప్పించుకుంటూ మొరటు మరియు నిరక్షరాస్య జనసమూహము ఎవరైతే వయసు రీత్యా, విద్యరీత్యా, లింగభేదాల రీత్యా మూఢ నమ్మకాల భయభ్రాంతులలో సులభంగా పడేవారో, వారినే ఎన్నుకొని చాలా తెలివిగా మత విశ్వాసాలను చొప్పించినారు.

" ఈ సానుకూల దృశ్యం, కొంతమేరకు పోలికలున్నప్పటికి నల్లటిరంగు వికార స్వరూపాలున్నందువల్ల శత్రువు కుంచెలోంచి వచ్చిన రూపమా అన్నట్లు మోసపుచ్చుతుంది. ప్రపంచమంతా క్రీస్తు యొక్క నిరాడంబర నమ్మకం వ్యాప్తి చెందినందువలన,ఈ నమ్మకాన్ని ఎంతో మంది ఆచరించడమే కాక,ప్రకృతి లేదా అదృష్టం అనువుగా ఉన్నందున వీరు కొన్ని పర్యవసానాల్ని పొందినారు. హడ్రియన్ అనే చక్రవర్తికి ఎథీనియన్ తత్త్వవేత్త అయిన అరిస్టిడస్ ఒక సుస్పష్టమైన క్షమాపణను ప్రదర్శించినారు. జెనోలేక్, అరిస్టాటిల్, పైథాగరస్, ప్లాటో వాదాలలో కల దైవ సంబంధిత విజ్ఞానాన్ని అవగతం చేసుకోవడానికి జస్టిన్‌మార్టియర్ ప్రయత్నించకముందే అదృష్టవశాత్తు వయోవృద్ధుల లేక దైవజ్ఞుల సందేశాన్నిచ్చి యూదుల దేవదూతలను చదవడానికి అతని దృష్టిని మరలించినారు. అలెగ్జాండ్రియాకు చెందిన క్లెమెన్సు గ్రీకులలో, టెర్టులియన్ లాటిన్, భాషలో వైవిధ్య పఠనము చేసినారు. జూలియస్ ఆఫ్రికనాస్ మరియు ఓరిజెన్ వారి కాలానికి సంబంధించిన విజ్ఞానంలో ఎక్కువ భాగాన్ని కలిగి ఉన్నారు. సైప్రియన్‌శైలి లాక్టేనియస్ (Loctanius) శైలి కన్నా విభిన్నంగా ఉన్నప్పటికీ ఈ రచయితలిద్దరిని విషయాల్ని పునరుద్ఘాటించే స్వభావము కలవారుగా మనం గుర్తించవచ్చు. క్రైస్తవులచే తత్త్వ శాస్త్రాన్ని చదివించడమనేది చాలా కాలం తర్వాత ప్రవేశపెట్టబడినప్పటికీ, అది అనుకున్న ఫలితాలను ఎల్లప్పుడూ ఉత్పన్నము చేయలేదు. భక్తి మాదిరి విన్న విషయాలకు విజ్ఞానం తండ్రి లేక మూలమవుతుంది. మరియు ఆర్టిమస్ అనుయాయుల

కోసం తయారు చేయబడిన వివరణ,తరువాతి కాలంలో సమానమైన ప్రతిపత్తిలో మతగురువులు అనుసరించిన వర్గాలన్నింటిని ఎదిరించినవారికే అన్వయించవచ్చు. పవిత్ర గ్రంథాలన్నింటిని మార్చవచ్చునని వారు భావిస్తారు. నమ్మకానికి సంబంధించిన ప్రాచీన ఒడంబడికలను వదిలివేసి తర్కానికి గల అస్పష్ట భావనలనుసరించి వారి అభిప్రాయాన్ని మలుచుకుంటారు. త్రికోణమితిని అధ్యయనం చేయడం కోసం చర్చికి సంబంధించిన శాస్త్రీయ జ్ఞానాన్ని విస్మరిస్తారు. భూమిని కొలిచే ప్రయత్నంలో స్వర్గాన్ని మరచి పోతారు. యూక్లిడ్ ఎల్లప్పుడూ వారి చేతుల్లోనే ఉంటుంది. అరిస్టాటిల్ మరియు థియోపారాట్రస్ వారి ఆరాధనకు పాత్రులు; మరియు గాలేన్ రచనలంటే అసామాన్య భక్తిని ప్రకటిస్తారు. దోషాలు, నిలకడలేని మనస్తత్వం కలవారి కళలు, శాస్త్రీయ జ్ఞానాన్ని తప్పుదోవ పట్టించినందువల్ల ఉద్భవిస్తున్నాయి. వృద్ధి చెందిన మానవ ఆలోచనల ద్వారా నమ్రత గల సువార్తలను భ్రష్టుపట్టిస్తున్నారు.

"అదృష్టం మరియు జన్మతః సిద్ధించే లాభాలు క్రైస్తవం అనేది వృత్తి నుండి వేరు చేయబడిన సత్యంగా రూఢిగా నిరూపించే విధంగా లేవు. ప్లినీ న్యాయ సభ (Tribunal of Pliny) ముందుకు చాల మంది రోమను పౌరులు తేబడినారు. వారిలో ఎక్కువ మంది వ్యక్తులు బైతానియాలోని ఒక్కొక్క పురుష క్రమం వారి పూర్వీకుల మతాన్ని విడనాడినారు అని వెనువెంటనే అతడు తెలుసుకొనినాడు. టెర్టులియన్ ధైర్య ప్రతిన కంటే అతని అనుమానించబడిన ప్రమాణం ఎక్కువ యోగ్యతను పొందుతుంది. ఎప్పుడైతే తనకు తాను దిగులు పడే వారితో పాటు ఆఫ్రికా దేశాధిపతి యొక్క కనికరం గూర్చి అతను రూఢిగా ప్రసంగం చేస్తూ ఒక వేళ అతను తన యొక్క కఠిన భావంలో పట్టుదలగా ఉన్నట్లైనచో అతను కార్తేజ్‌ను (Carthage) తప్పకుండా నాశనం చేస్తున్నట్లని మరియు అతని హెూదాలో అనేక మంది వ్యక్తులలో, సభలోని సభ్యులలో (Senators) మరియు సత్కాలీన కుటుంబినిలో మరియు అతని అత్యంత సన్నిహితులైన స్నేహితులు లేదా సంబంధికులలో నేరస్తుడని అంటారు. ఏది ఏమైనప్పటికీ, నలుబది సం॥ రాల తరువాత వాలేరియస్ చక్రవర్తి భోదించిన సత్యం రూఢి అయినది అని ద్యోతకమవుతుంది. అప్పటి నుండి క్రైస్తవ తెగలో ఉన్న సభలోని సభ్యులు రోమను రాజులు, మరియు యోగ్యత గల దొరసానులు అతని ఒకానొక ఆజ్ఞను స్పష్టంగ తలుచుకున్నారు. చర్చి అంతర్గత పరిశుద్ధత కోల్పోయినప్పటికినీ, బాహ్య శోభ (Out

ward Splendour)పెరగటం ఇంకనూ కొనసాగుతున్నది. మరియు డైక్లొంటియన్ ఏలుతూ ఉండే కాలంలో ఎవరైతే భవిష్యత్కాలపు జీవితంతో ప్రస్తుత వ్యాకులతలను సయోధ్య చేయాలి అని ప్రయత్నించిన క్రైస్తవుల బాహుళ్యతను న్యాయస్థానం మరియు సైన్యం కూడా మరగుపరిచినది.

మరియు మొదట క్రైస్తవులుగా మారిన వారిపై అస్పష్టమైన మరియు అమాయకత్వంతో, దురహంకారంతో భ్రష్టుచేయబడినది అని చేసిన ఆరోపణలు ఇంకనూ ఇటువంటి మినహాయింపులు చాల తక్కువ మేరకు లేదా ఇటీవల కాలంలో రూపుమాపుతున్నాయి. ఇటీవల మన సంరక్షణకై కల్పనా కథలను అన్వయించుకునే దానికి బదులుగా అప్పుడప్పుడు వచ్చే ఆరోపణలను మతంతో నిష్ఠ కలుగచేయు విషయంగా మార్చుకోవటం అనేది వివేకంగా ఉంటుంది. మన తీవ్ర ఆలోచనలు మనకు ఏమని తెలియజేస్తాయంటే మత గురువులు వారంతట వారే గాలిలయ యొక్క చేపలు పట్టే వారిలో చేపలు దైవ సంకల్పంగా ఎంపిక చేసుకుంటారు అని మొదటి క్రైస్తవుల సుగుణమును మరియు సిద్ధిని మెచ్చుకోవటంలో ఎక్కువ హేతువు ఉన్నట్లు, తద్వారా వారి యొక్క ఐహిక స్థితిని కొంత మేరకు మనం అణచవచ్చును అనే విషయం గమనించవచ్చు. ఆధ్యాత్మికతలో పేదవారికి స్వర్గం అనే రాజ్యం ఉంది అని చేసిన వాగ్దానం గుర్తుకు తెచ్చుకున్నట్లు అయినచో, మనం దీని భారాన్ని జాగ్రత్తగా మోయవలసి ఉంది. ఆపద, తిరస్కారంతో బాధ పడిన మానవాళి మనస్సులు దైవ సంబంధిత భవిష్యత్కాలిక సంతోషాలను ఉల్లాసంతో వింటారు. దానికి విపర్యంగా అదృష్టవంతులు ప్రపంచానుభవంతో తృప్తి పడుతారు. మరియు తెలివైన వారు ఫలించని సందేహాలతో మరియు ఘర్షణలతో శ్రేష్ఠమైన హేతువును మరియు విజ్ఞానంను నిందించుతారు.

అదే విధంగా హాలమ్ (Halam) తన మధ్యయుగాల చరిత్ర లో అది క్రైస్తవం కావడానికి కారణం ఏమిటంటే శ్రేష్ఠ వర్గంతో పాటు అస్వాభావికమైన రెండు కారణాలు దోహదపడేనాయి. మొదటి కారణం క్రైస్తవంలోకి వారు మారిన తరువాత వారసత్వపు చట్టం (Law of Inheritance) రోమన్ చక్రవర్తులచే మార్పు చేయబడినవి. తల్లి దండ్రుల ఆస్తుల యొక్క ఉత్తమమైన వారసత్వపు హక్కు పిల్లలకు చెందుతుంది. అనేది క్రైస్తవ మత వ్యతిరేకమైన ఆచారముగానే మిగిలిపోయినది.

క్రైస్తవం కేవలం ప్రజలను స్వతహాగా పేద వర్గాల వారికి స్వాభావికమైనదిగా చెప్పుకొనుచున్నది. అని తెలియుచున్నది.మరియు ఇది వారి మధ్యలో చట్ట సహాయత లేకుండానే లేదా అస్వాభావికమైన లాభాలు లేకుండనే మొదటిసారిగా క్రైస్తవం వ్యాప్తి చెందింది.

సహజ క్రమమైన విషయాలను మొదటి క్రైస్తవ మిషనరీ దానికి విరుద్ధంగా చేసినది. నేను స్వాభావికమైనది అని అంటాను. ఎందుకంటే అది మానవ మనస్తత్వ శాస్త్రంకు తగినటువంటిది. మనస్తత్వ శాస్త్రంపై అపారమైన జ్ఞానం కలిగియున్న ఆచార్య థార్న్డైక్[6] చెప్పినట్లు "మానవుడు ఆలోచించేది. ఒక శారీరక వాస్తవం. కాని ఏదైతే ఆలోచిస్తున్నాడో అది సామాజిక వాస్తవం. ఇటువంటి ధీరోదాత్తమైన అభిప్రాయాన్ని మొదటి క్రైస్తవ మిషనరీ నిరపేక్షంగా విస్మరించింది. ఒక్కొక్క రకపువాదన ప్రతి ఒక్కరికి సమ్మంతంగా ఉండదు. దీనికి స్పష్టమైన వాస్తవం ఏమిటంటే పెట్టుబడిదారీ వ్యవస్థ ధనికులకు సమ్మతంగా ఉంటుంది. కాని పేదవారికి ఆమోదయోగ్యంగా ఉండదు. ఇది ఎందుకంటే ఒక వ్యక్తి అభిలాషలు మరియు ఆలోచనల మధ్య చాల సన్నిహిత సంబంధం కలిగి ఉంటుంది. అతని అభిలాషపై ప్రతికూల ప్రభావంను కలిగి ఉంటుంది. అతను వాటికి తన మనస్సులో ఎటువంటి చోటూ ఇవ్వడు. ఇట్టి విశ్లేషణను మానవ మేథస్సు పని చేయుతీరుకు అన్వయించినట్లు అయినచో స్పష్టంగా తెలియునది ఏమిటంటే బ్రాహ్మణులు మరియు శ్రేష్ట వర్గాలు క్రైస్తవ ఉపదేశాలను సంసిద్ధతతో అంగీకరించలేరు. క్రైస్తవ ఉపదేశం మానవాళికి సోదరత్వంను బోధిస్తుంది. మరియు మానవాళి సమానత్వంకు దారితీయు విధంగా అన్వయిస్తుంది. ఇప్పుడు బ్రాహ్మణులు మరియు శిష్టుల యొక్క అభిలాషలు ఏమిటంటే అసామానత్వంపై ఏర్పాటు చేయబడినది అయిన ఈ వ్యవస్థ వారికి ఉన్నత హెూదాలను, అధికారం చెలాయించడానికి ఎక్కువ అవకాశం కల్పిస్తూ మరియు ఇతరులను దోచుకోవడానికి అనుకూలంగా ఉంటుంది. అందువల్ల క్రైస్తవాన్ని వారు ఎందుకు అంగీకరిస్తారు అని ఊహిస్తాం? ఒక వేళ అంగీకరించినట్లు అయినచో వారి హెూదాను మరియు అధికారాన్ని ధారాదత్తం చేసినట్లే. వారిని (శ్రేష్టులను) అనుసరించటం అనేది ఒక నిష్ఫలమైన ప్రయత్నం మరియు ఒక వేళ అట్టి అన్వేషణ నిరంతరం కొనసాగినట్లు అయినచో భారత దేశంలో క్రైస్తవులు ఎవరు ఉండలేరు అని నేను నమ్మకంగా చెప్పగలను. ఈ రోజున భారత దేశంలో క్రైస్తవుల సంఖ్యను మనం

చూస్తున్నాం అంటే అది వాస్తవంగా కొన్ని క్రైస్తవ మిషనరీల నిరర్థకతను చాటి చెప్పుతుంది. ఒక వేళ వారు ఇటువంటి తప్పిదాన్ని గ్రహించకుండా తక్కువ తరగతి వారిని ఆకట్టుకోవాలి అనే చేసే ప్రయత్నం, భారత దేశంలో మొత్తానికే క్రైస్తవులుగా లేకుండా చేస్తుంది. ఈనాటికి కూడా నందల మరియు వేలాది హిందూ కులస్థులు క్రైస్తవ పాఠశాలల, క్రైస్తవ కళాశాలల మరియు క్రైస్తవ ఆసుపత్రుల ద్వారా లాభాలను ఆర్జించుచున్నారు.ఈ లాభాలను క్రైస్తవులుగా మారిన వారు ఎంతమంది పొందుచున్నారు. ప్రతి ఒక్కరూ లాభాలను పొందుతూ పారిపోవడమే కాని ఆమతం గొప్పతనాన్ని, మరియు అది మానవాళికి చేస్తున్న సేవలను ఏమాత్రం పరిగణనలోకి తీసుకోలేరు.

**పాదసూచికలు :**

1. Kaye చే ఉటంకితం. "Christianity in India". పేజి 106.
2. I bid. పేజి 106.
3. I bid. పేజి 44.
4. Census of India, 1901, Vol. XVI, N.W. Pandbudh, Report. Part I పేజీ 98.
5. "Rambles and Recollections" Vol. I, ch. 53, పేజి 407.
6. "Pshychol ogy" Vol. I.

అనువాదం : ప్రొ సి. శివరామకృష్ణారావు

అధ్యాయం - 30

# మతం మార్చుకున్న వారి స్థితి

**I. గాంధీ – క్రైస్తవ మతం పట్ల ఆయనకున్న వ్యతిరేకత. II క్రైస్తవ మతం – సమాజ సేవ. III. క్రైస్తవ మతం – క్రైస్తవేతర, మతేతర దృష్టి (Pagamism). IV. క్రైస్తవ మతంలోకి మతాంతరీకరణ పొందిన వారి భావదృష్టి (spirit) V. క్రైస్తవులు – వారి సమాజ స్థితి**

## I

1928వ సంllరంలో భిన్న విశ్వాసాలను పాటించే వారి మధ్య సౌభ్రాతృత్వాన్ని పెంపొందించుటకు ఏర్పడిన ఇంటర్నేషనల్ ఫెలోషిప్ (International Fellowship) అనే సంస్థ సమావేశం జరిగింది. ఈ సమావేశానికి క్రైస్తవ మిషనరీలు, హిందువులు, ముస్లింలు కూడా హాజరైనారు. ఈ సమావేశంలో శ్రీ గాంధీ కూడా ఉన్నారు. సమావేశంలో ఎంతమేరకు ఈ సంస్థ తన ఆదర్శమైన భిన్న మతాల సౌభ్రాతృత్వాన్ని సాధించడంలో నిజాయితీగా ఉండగలుగుతుంది– ముఖ్యంగా, ఎప్పుడైతే ఈ సంస్థను క్రైస్తవ మత విశ్వాసాలలోకి ఇతరులను మార్పిడి చేసేందుకు ఈ సంస్థ దృష్టి ఉపయోగడాలన్న వారి కోరిక ఒక వైపు ఉన్నప్పుడు, ఇతర మతాల పట్ల సౌభ్రాతృత్వ దృష్టిని అలవరచడంలో సంస్థ నిజాయితీ ఎంతవరకుంటుందన్న ప్రశ్న ఈ సమావేశంలో రేకెత్తించబడి చర్చ కొనసాగింది. ఈ అంశంపైన గాంధీగారు మాట్లాడినారు. గాంధీగారి మిత్రుడైన సి.ఎఫ్. అండ్రూస్ ఈ చర్చకు సంబంధించిన సారాంశాన్ని రాసినాడు[1] చర్చాసారాంశం ఇలా కొనసాగింది:

"ఈ ప్రశ్నను (ఇతర మతాల పట్ల ఇంటర్నేషనల్ ఫెల్లోషిప్‌కు సంబంధించి) రేకెత్తించడంలో క్రైస్తవ మత సంస్థల స్వభావానికి సంబంధించిన నిర్దిష్టమైన సవాలు ఇమిడి ఉంది. ఉదార వైఖరి గలిగి ఉన్న సంస్థలు ఇంటర్నేషనల్ ఫెల్లోషిప్ సంస్థకు చేరువ కావడం వల్ల సంతోషాన్ని కలిగి ఉండవచ్చు.... ఈ అంశంపైన మహాత్మా గాంధీ ప్రకటనను గమనించాలి. ఇంటర్నేషనల్ ఫెల్లోషిప్‌లో ప్రవేశం పొందడం వల్లకానీ, చేరువ కావడం వల్లకానీ మతాంతరీకరణ చెయ్యాలనీ ఆయా లక్ష్యాల పట్ల ప్రభావం చూపించాలనే కనీస భావన మస్తిష్కంలో మెదిలినా కూడా ఫెల్లోషిప్ ప్రయత్నాలన్నీ నాశనమై పోయినట్లే. ఫెల్లోషిప్‌లో చేరే ఏ సభ్యునికైనా ఇటువంటి ఆలోచన కలిగి ఉంటే, వారు ఈ సంస్థను విడిచి పెట్టడమే మంచిది"

క్రైస్తవ మత సంస్థలు ప్రపంచంలో ఉన్న అశేష ధనరాశులు తమ వద్ద ఉన్నాయని భావించి, వాటిని పంచాలనుకుంటే వారు (క్రైస్తవ మతస్థులు) తప్పుగా ఆలోచిస్తున్నట్లేనా? అన్న ప్రశ్నను అడిగినప్పుడు శ్రీ గాంధీ దాన్ని తిప్పికొట్టారు. ఈ అంశంపైన శ్రీ ఆండ్రూస్, గాంధీ చాలా "మొండిగా" తన వైఖరిని ప్రదర్శించారని తెలుపుతూ "ఇలాంటి భావనే తప్పు" అన్నారు. ఈ అంశంపైన శ్రీ గాంధీ వహించిన వైఖరిలో "ఎటువంటి మార్పూ ఉండబోదని శ్రీ ఆండ్రూస్ స్పష్టీకరించారు.

క్రైస్తవ మత మార్పిడి పట్ల శ్రీ గాంధీ వ్యతిరేకతా స్వభావం, పై అభిప్రాయాల వల్ల సుస్పష్టమయింది. అంతే గాక 1936 నుండి క్రైస్తవ మత సంస్థల ప్రచారం పట్ల శ్రీ గాంధీ తీవ్ర అధిక్షేపణా స్వభావాన్ని వహించారు. అస్పృశ్యుల మధ్య క్రైస్తవ మత సువార్తలను వ్యాపింప చేయడం పట్ల ప్రత్యేకించి శ్రీ గాంధీ తన ఆక్షేపణలను తెలిపినారు. క్రైస్తవ మత సంస్థల కార్యకలాపాల పట్ల మత మార్పిడి ప్రయత్నాల పట్ల గాంధీగారు వహించిన విరోధ దృష్టిని కొన్ని నిర్దిష్టమైన పునాదుల ఆధారంగా చూడవచ్చు. క్రైస్తవ మత మార్పిడి పట్ల శ్రీ గాంధీ కున్న విరోధ దృష్టిని ఈ క్రింది నాలుగు అంశాల ద్వారా సారాంశీకరించవచ్చు. శ్రీ గాంధీ మాటల్లోనే ఆయన ఈ క్రింద విధంగా భావిస్తాడు.

1. "అన్ని మతాలు మౌలికంగా సమానమనేది నా భావన. మన మతం పట్ల మనకున్న గౌరవం, అన్ని మతాల పట్లకూడా అదే మాదిరిగా ఉండాలి. ఇక్కడ గుర్తుంచుకోవాల్సిన అంశం, పరస్పర సహనం కాదు. సమానమైన ఆదరణ కావాలి."[2]

2. "క్రైస్తమత సంస్థలను ప్రధానంగా కోరేదేమిటంటే, వారు క్రైస్తవులు, వా. జీవిత రీతిలో జీవించేటట్లుగా ప్రయత్నాలను చెయ్యవచ్చు. అంతేకాని, ఆయా జీవిత విధానాలకు విస్తృత వ్యాఖ్యానాత్మకంగా ఉండనవసరం లేదు[3]. మీరు (క్రైస్తవులు) జీవించె విధానాన్ని మాతో మాట్లాడ నివ్వండి. గులాబిని చూడలేని గుడ్డివాడు, దాని సువాసనను స్వీకరిస్తాడు. గులాబి రూపమైన పరమ సత్యంలోని (Gospel of Rose) రహస్యమదే. కానీ, ఏసు క్రీస్తు ప్రవచించిన పరమ సత్యం కేవలం గులాబి రూప పరమ సత్యం కన్నా క్లిష్టమైనది. సువాసనాత్మకమైనది. గులాబిప్రాయ పరమసత్యం తన ఉనికి ప్రకటించడానికి ఏ విధమైన ఏజంట్లను కోరనప్పుడు, క్రీస్తు ప్రవచనాత్మక పరమ సత్యం కూడా తన వ్యాప్తికై ఎటువంటి ఏజంట్లను కోరదు."[4]

క్రైస్తవ సంస్థల గురించిన అభిప్రాయాల్ని విశదీకరిస్తూ గాంధీగారు ఇలా అన్నారు:

3. "మిషనరీల సామాజిక కార్యకలాపాలు కేవలం వాటి కోసమే కాదు. వాటి ద్వారా సమాజ సేవలను పొందుతున్న వారి "ముక్తికోసం" సహాయాన్ని అందించడానికి ఉద్దేశించినటువంటివి.[5] ఆరోగ్య అవసరాలలో, అవి సహాయం అందిస్తూ వాటిని పొందిన రోగులు క్రైస్తవులుగా మారడాన్ని ప్రతిఫలంగా కోరడం జరుగుతుంది"[6]

అంటరాని వారిని ఉద్దేశించి గాంధీ గారుతెల్పిన అభిప్రాయాలు కూడా ఇలా ఉన్నాయి.

4. "అత్యధిక సంఖ్యలో ఉన్న హరిజన ప్రజానీకం కానీ, నిజానికి యావత్ భారత ప్రజలు కానీ, క్రైస్తవ దార్శనికత స్వరూపాన్ని అర్థం చేసుకోలేరు. అందులో, మతాంతీకరణ ఎక్కడ జరిగినా కూడా అది ఒక ఆధ్యాత్మిక అర్థంలో మాత్రం చోటు చేసుకోవడం లేదు. అవి కేవలం వసతి కోసం జరుపుకునే మార్పిడులు మాత్రమే.[7] వారు (హరిజనులు) సాపేక్షిక యోగ్యతలపై గోవుకుండే స్వీకృత దృష్టికన్నా మిన్నగా విచక్షణా స్వభావాన్ని కలిగి ఉన్నట్లుగా అనిపించదు. హరిజనులకు మేధస్సుకానీ, కుశాగ్రబుద్ధిగానీ లేదు. దైవికానికీ – అదైవికానికీ మధ్య తేడాను చూడగలిగే భావదృష్టి లేదు"[8]

కొంత అవమానకరంగా ఉంటే ఈ మాటలతో క్రైస్తవులు ఏం చేయాలనే దాన్ని గురించి గాంధీ గారు ఇలా చెపుతున్నారు:

"క్రైస్తవ మిషనరీలు చిత్తశుద్ధిగా తమ కార్యాన్ని కొనసాగించదలచుకుంటే హరిజనులను, మతాంతరీకరణ చెందించటంలో అవలంబిస్తున్న అనభ్యమైన పోటీ దృష్టిని వదులుకోవాలి.

"వారి (క్రైస్తవ మిషనరీలు) ఆధ్యాత్మికమయిన సద్గుణాలను ఆపాదించడానికి మాత్రమే కాక హరిజనుల్లోఉన్న ప్రాపంచిక సత్‌లక్షణాలను పంచుకోవచ్చుకూడా. వారికున్న సుసంపన్నమైన ఆధ్యాత్మిక భావనలను ఎటువంటి మనో అభిశంసనలు లేకుండా కలిగి ఉన్నప్పుడే వారు సాధించ దలుచున్న పనిని కొనసాగించగలుగుతారు. వారు అందించిన సేవలకు ప్రతిఫలంగా ప్రజలు మత మార్పిడి చెందాలనే దృష్టి ఉన్నంత కాలం, మీకు, నాకు అడ్డుగోడ ఉన్నట్లుగానే భావించాలి.

"క్రైస్తవులు తమకున్నదనుకునే ప్రబోధాత్మక పరిమళాల సువాసనను వెదజల్లడానికే భారత దేశానికి వచ్చి ఉంటే, భారత దేశ చరిత్ర మరొక రకంగా లిఖించబడి ఉండేది"

క్రైస్తవ మిషనరీల పట్ల, వాటి కార్యకలాపాల పట్ల గాంధీ వహించిన విరోధ భావం చాలా వరకు ఇటీవలగా పెరుగుతున్నటు వంటిదే. యవోలా నిర్ణయానికంటే(Yeola Decision) ముందుగా ఈ భావం ఉందని నేననుకోను. ఇది కేవలం ఇటీవల పెరుగుతున్న విషయం. ఇస్లాం మతంలోకి అస్పృశ్యులు మతమార్పిడి చేసుకోవడాన్ని ఇంత స్పష్టమైన రీతిలో గాంధీ ఖండించినట్లుగా దాఖలాలు కనబడవు. ముస్లింలు అంటరానివారిని మతాంతరీకరణ చెందించడంలో వారికున్న వ్యూహాన్ని గోప్యంగా ఏమీ ఉంచలేదు. 1923 కాకినాడలో జరిగిన కాంగ్రెస్ సభా వేదికకు అధ్యక్షత వహించిన మౌలానా మహమ్మద్ఆలీ స్పష్టంగానే తన ఉపన్యాసంలో మతాంతరీకరణ పట్ల ముస్లింల అవగాహనను తెలియ జెప్పినాడు.

"సంగీత ఊరేగింపుల గురించో, రావి చెట్లు, మర్రిచెట్ల వివాదం గురించో హిందూ-ముస్లింల పోట్లాట నిజంగా చిన్న పిల్లల తగాదా లాంటిది. కానీ, ఒక వాస్తవమైన ప్రశ్న ఒకటుంది. ఇరుమతాలు ఆచరిస్తున్న మతకార్యకలాపాలు సంయమన దృష్టితో సర్దుబాటు చేసుకోలేకపోతే విరోధభావం పెరుగుదలపై ఫిర్యాదు చేయడానికి ఒక సందర్భం దొరుకుతుంది. నిజానికి ఈ మొత్తం ప్రశ్న అణచి వేయబడిన వర్గాల మతాంతీకరణకు సంబంధించినటువంటిది. ఈవర్గాలను హిందూ సమాజం తనలో కలుపుకోలేనట్లుగా క్రైస్తవ మిషనరీలు ఆపని చేయడానికి సిద్ధంగా ఉన్నాయి. క్రైస్తవ సంస్థలు మతాంతరీకరణ ప్రయత్నాలు చేస్తే వారితో ఎవ్వరూ పోట్లాడరు. కానీ అదే పనిని ఒక ముస్లిం మిషనరీ కొనసాగిస్తే చాలా పెద్ద యెత్తున హిందూ ప్రెస్‌లో ఆందోళన వ్యక్తమౌతుంది. చాలా పెద్ద యెత్తున ముస్లిం మత మార్పిడికై పని చేస్తున్న అనేక మంది సుసంపన్నులైన ముస్లిం పెద్దలనుండి నాకు సలహా కూడా ఇవ్వడింది. అంతే కాక, దేశంలో అణచి వేయబడి ఉన్న వర్గాల మతాంతరీకరణ విషయంలో ఇరుమతాలు సామరస్యంగా వివిధ ప్రాంతాలలో పని చేయడానికి ఒక అంగీకారానికి వచ్చేవిధంగా హిందూ మత పెద్దలతో ఒప్పందం కుదుర్చుకోవాలని సూచన కూడా ఇవ్వబడింది. ఇరు పక్షాల వారు మత మార్పిడి విషయంలో, ఆయా వార్షిక కాలంలో చేపట్టే కార్యకలాపాల విషయంలో మార్పిడి చెందింపచేసే వారి సగటు- భాగమై ఉండాలి. అయితే ఈ అంచనా ఆయా

సంస్థా కార్యాకలాపాల్లో నిమగ్నమై ఉన్నవారి సంఖ్య, గత సంవత్సరం వెచ్చిస్తున్న విత్తవనరుల ఆధారంగా ఉండాలి. ఈ విధమైన పద్ధతుల ద్వారా ప్రతీ మతం పరస్పర ఘర్షణలకు తావివ్వకుండా వారి వారి మతాంతరీకరణ ప్రయత్నాలనుగానీ, సంస్కరణను గానీ కొనసాగించవచ్చు"

ఇంతకన్నా స్పష్టంగా ఉదహరించవలసిన అంశం అంటూ ఇంకేదీ లేదు. కాంగ్రెసు వేదికపై నుండి ఇంత నిష్కర్షగా, వ్యాపార దృష్టితోనూ, భౌతిక ప్రయోజన స్వభావంతో మతాంతరీకరణ గురించి ప్రస్తావించడం కన్నా ఇంకేం కావాలి. క్రైస్తవ మత సంస్థలు అస్పృశ్యులను క్రైస్తవీకరించే ప్రయత్నాలను గాంధీ ఖండించిన విధంగా ముస్లిం సంస్థలు చేసే మతాంతీకరణ ప్రయత్నాల పట్ల ఎప్పుడూ వ్యక్తపరచలేదు. మౌలానా కాంగ్రెస్ వేదిక నుండి చేసిన ఈ సూచనకు గాంధీ అనుయాయుల నుండి కూడా ఎటువంటి వ్యతిరేకత ప్రస్ఫుటం కాలేదు. బహుశా ఈ ధోరణికి కాంగ్రెస్‌లో ఉన్న హిందువులు - ముస్లింల మత విధిని కాపాడడం తాము అందించే కనీస సహాయం అని భావించడం వల్లనే కావచ్చు. ఈ భావన లోనే ఇస్లామిక్ మతాంతరీకరణ ను ఆమోదించే స్వభావం కూడా ఇమిడి ఉంది. 1920లో జార్జి జోసఫ్ చెప్పినట్టుగా "ఏ విధంగా చూసినా జాజిరత్ - అల్- అరబ్‌లోని అరబ్బులపైన టర్కిష్ ఖిలాఫత్‌ను కొనసాగించడం ముస్లింల మతవిధి అని ఇస్లాం మతగురువులు, రాజకీయ నాయకులు చెపుతూ వచ్చిన అంశం. అరబ్బులపై పరాయి పాలనను ప్రోత్సహించే స్వభావం - పై దృష్టిలో ధ్వనిస్తూ ఉన్నా ఇస్లాం మత విధిలో భాగంగా గుర్తించడం వల్ల హిందువులు దీన్నిఒప్పుకోవలసి వచ్చింది." ఇస్లాం మతాంతరీకరణ పట్ల ఈ కారణాన్ని చూపించి కొనసాగించిన ఈ ఆమోద దృష్టినే క్రైస్తవ మతాంతీకరణ ప్రయత్నాల పట్ల కూడా కొనసాగించడంలో గాంధీ సహాయం చెయ్యవచ్చుననే అభిప్రాయం కలుగుతుంది.

క్రైస్తవులు ఉన్నారనే వాస్తవం వల్లనే ద్వంద్వ కొలమానాలను ఏ అంశంపైన కలిగి ఉన్నారనే విషయం అర్థం కాదు. హిందూయేతర మతాల పట్ల వున్న పరిగణనపై జార్జి జోసఫ్ చాలా స్పష్టంగానే తెలిపినాడు. ఆయన మాటల్లో

" రెండు మతాల జనాభాల్లో అల్ప - అత్యధిక సంఖ్య మాత్రమే ప్రధాన తేడా. ముస్లింలు 75 మిలియన్లు ఉంటే క్రైస్తవులు 6 మిలియన్లు మాత్రమే. ఉన్నారు. జాతీయ

వాదంవైపు మొగ్గు పొదడం కోసం అత్యధిక సంఖ్యాకులైన ముస్లింలతో శాంతి కుదుర్చుకోవడం అవసరం. అల్ప సంఖ్యాకులైన క్రైస్తవులతో ఈ శాంతి స్థాపనావసరం ఉండదు."

పై వ్యాఖ్య లోని సారాంశమైన క్రైస్తవ-ముస్లింల సాపేక్షక జనసంఖ్య బలం, భారత రాజకీయాల్లో ముస్లింల సాపేక్షిక ప్రాధాన్యతవంటి కారణాలు గాంధీ గారు ప్రధానంగా పరిగణనలోకి తీసుకునే అంశాలు. క్రైస్తవ మిషనరీల మతప్రచారాన్ని తీవ్రమైన పరిభాషలో "దురుద్దేశ్యపూర్వక ప్రచారంగా" ముద్రవేస్తూ గాంధీ నిరసించాడు.

ముస్లిం మత ప్రచారం పట్ల మరొక రకంగా తన అభిప్రాయాలను వ్యక్తపరుస్తాడు.[10]

"మత మార్పిడి కోసం అతి అధమ స్థాయిల్లో మొరటుగా భౌతిక వాద ప్రయోజనాలను అందించే నెపంపైన మత సంస్థలు ప్రజలను బుజ్జగించే విధం అతి విషాదకరమైన విషయం. దీనివల్ల అత్యంత విలువైన మానవ అనుభూతులన్నీ మట్టి పాలయినాయి."

" ఈ కరపత్ర ప్రచురణకు,ఆలోచనా పరులైన ముస్లింల మద్దతు ఉండదనే నా భావం. ఈ విధమైన కరపత్రాల్లో ఉండే దురుద్దేశ స్వభావాన్ని ఆకళింపు చేసుకోవడానికి వాటిని వీరు చదువవలసి ఉంది"

ఈ కరపత్రాల దుమారాన్ని గురించి ఎలా ఎదుర్కోవాలనే విషయాన్ని నా వద్దనున్న విలేఖరి ప్రశ్నించాడు. దానికి నేనొక పరిష్కారాన్ని అన్వయించాను. ఈ విధమైన దుమార స్వభావం కలిగిన కరపత్ర ప్రచారాన్ని బాధ్యతాయుత ముస్లింల దృష్టికి తేవాలి. ఫలితంగా వారే స్థానిక ముస్లిం నాయకుల వివేచనా దృష్టిని ఇటువంటి కరపత్రాలవైపు మళ్ళించే ప్రయత్నం చేయవచ్చు. రెండవ తరహా పరిష్కార మార్గం మనలో విలీనంగా ఉన్న మాలిన్యాన్ని కడిగేసుకొని శుద్ధీకరించడం. హిందూ సమాజంలో ఎంత వరకు అయితే అస్పృశ్యత ఉంటుందో అంతవరకూ బయట పరిధుల నుండి దాడులు అనివార్యం. అంటరానితనాన్ని సమూలంగా తొలగించేటువంటి దుర్భేద్యమైన శుద్ధీకరణ ప్రయత్నాలతో కూడుకున్న ప్రహరీలను నిర్మించాలి. అటువంటప్పుడే బయటి మార్గాల ద్వారా వచ్చే దాడులను తట్టుకోగల పూర్తి సామర్థ్యం మనకు కలుగుతుంది."

మొదటి వాక్యంలో వ్యక్తమైన దూకుడు విమర్శ, రెండవ వ్యాఖ్యలోని మెత్తదనం, పిరికిదనం చాలా స్పష్టం. ఈ సందర్భంలోనే, 'వ్యక్తులను గౌరవించే' సమయానుకూలమైన మనిషిగా గాంధీని భావించాలి.

క్రైస్తవత్వానికి మారిన వైనం ఎటువంటిది? ఎథల్ బర్ట్, అతని కెంట్ పౌరులు క్రిస్టియన్లుగా ఎలా మారారు? వారు కొత్త మొత్తాన్ని స్వీకరించడానికి మత పరమైన ప్రేరణ ఉందా? మధ్య యుగంలో క్రైస్తవమతంలోకి జరిగిన మార్పులను గురించి రెవరెండు రైచల్ మాట్లాడుతూ యిలా చెప్పారు [2]

"ఐరోపాలో గల దేశాలన్ని ఒకదాని వెంబడి మరొకటి క్రైస్తవ విశ్వాసంలోకి మార్చబడినవి. యీ మార్పు ఎల్లప్పుడూ పై నించి వచ్చినదేగాని క్రింది నుంచి ఉత్పన్నం కాలేదు. రెమిజియస్ అనే బిషప్‌కు క్లోవిస్ లోబడినారు. తక్షణమే 3000 వేల మంది ఫ్రాంకులు బాప్టిజాన్ని స్వీకరించినారు. ఆగస్టిన్ ప్రచారానికిక ఎథెల్‌బెర్ట్ లోబడినారు. తక్షణమే మొత్తం కెంటే వారి నిదర్శనాన్ని అనుసరించింది. ఎప్పుడైతే అతని కుమారుడు ఎడ్ బాల్ ఆ విశ్వాసాన్ని పరిత్యజించారో అతనితోపాటు కెంటేలో గల పురుషులు కూడా ఆ విశ్వాసాన్ని పరిత్యజించారు. సిజిబెర్ట్ రాజు మతమార్పిడివలనే చివరికి ఎసెక్సును గెలుచుకోగలిగినారు. ఈ రాజు ఓస్వీ అనే యింకొక రాజు ప్రభావంతో తనకు తానే బాప్టిజాన్ని స్వీకరించినారు. ఎడ్విన్ అనే రాజు మార్పిడి అయినందువలనే నార్తంబర్‌లాండ్ కొంత కాలం తాత్కాలికంగా లాభపడింది. కాని ఎడ్విన్ చనిపోగానే అది తిరిగి దిగజారి పోయింది. ఆస్వాల్ట్ అనే ఇంకొక రాజు విశ్వాసాన్ని పరివ్యాప్తి చెందడానికి చేసిన యత్నం వల్లనే తిరిగి క్రొత్తగా విశ్వాసాన్ని స్వీకరించింది. ఛార్లెస్ మార్టిన్, పెపిన్ అనే జర్మన్ యువరాజులతో దగ్గరి సంబంధాలున్నందు వలన బోనిఫేస్ అనే బిషప్ జర్మనీని మార్పిడి చేయుటలో ఒక ప్రముఖ పాత్రను నిర్వర్తించారు. రాజ్యాధికారాన్ని బలవంతంగా చేజిక్కించుకోవడానికి పెపిన్ సాయిజాన్స్ వద్ద తన ప్రాపకాన్ని ఉపయోగించి చర్చి అనుమతి పొందాడు. హెరాల్ట్ క్రాగ్, హెరాల్ట్ బ్లాస్టలాండ్, కనూటే అనే డెన్మార్కు రాజుల మత మార్పిడివల్ల డెన్మార్కు, ఉలూఫ్‌ల మత మార్పిడివల్ల స్వీడన్, రష్యన్ సార్వభౌమాదికారైన వ్లాడిమర్ మతమార్పిడి వలన రష్యా లాభపడినవి. ప్రతి ప్రదేశములో క్రైస్తవము మొదట రాజులను, యువరాజులను మార్చింది. ప్రతి ప్రదేశములో బిషప్పులు అచ్చాటలు దాన్ని ప్రతి నిధులు గానే ఉన్నారు.

క్రైస్తవము యింతటితో ఆగలేదు. ఒకసారి ఒక రాజును పొందిన తరువాత, మధ్యకాలంనాటి ధర్మ ప్రచారకులకు ఆ రాజ్యంలో గల వీరులను ఎటువంటి విచక్షణ

మాత్రం ఆమోదించే అంశం మాత్రం వింతైనదిగా తోస్తుంది. ఎటువంటి "ప్రతిఫలాపేక్ష లేకుండా" (మారకపు రీతిలో కాక) క్రైస్తవ మత సంస్థలు భౌతిక సదుపాయాలను పంచేందుకు సిద్ధపడితే గాంధీ వారి ఆధ్యాత్మిక భావరాసులను పంచుకునేందుకు సంసిద్ధతను వ్యక్త పరుస్తాడు. క్రైస్తవ మత సంస్థలు అందించే సేవలను ప్రలోభాలనో, ఆకర్షణలనో, క్రైస్తవ మత విశ్వాసాల పట్ల చూపే మొగ్గు కేవలం మత మార్పిళ్ళని గాంధీ భావించడాన్ని అర్థం చేసుకోవడం చాలా కష్టం. కష్టాల్లో ఉన్న మానవ లోకాన్ని ఆదుకోవాలనే ప్రాథమిక క్రైస్తవ మత విశ్వాసమే క్రైస్తవ మత సంస్థలు చేపట్టే సేవల సారమని అర్థం చేసుకోవడం సాధ్యం కాని పనియా? ఈ దృష్టితో అంగీకరించి, క్రైస్తవాన్ని అంగీకరించిన వ్యక్తిది తప్పిదమవుతుందా? కేవలం ధృడంగా వ్యతిరేక భావ దృష్టి ఉన్న వాళ్లే ' అవును' అని అంటారు.

అంటరాని వారిని మతంలోకి చేర్పించడాన్ని నిరోధించడానికి గాంధీ ఇటువంటి వాదనలు ముందుకు తీసుకొచ్చాడు. హిందూ మతం కోసం అస్పృశ్యులను కాపాడడంలో ఇమిడిఉన్న గాంధీ హక్కును ఎవ్వరూ తిరస్కరించలేరు. ఈ దృష్టి బలీయంగా ఉన్నప్పుడు ఒక విషయాన్ని మిషనరీలకు నిర్భయంగా చెప్పవలసి ఉండేది " మీరు చేసే పనిని ఆపండి. మేము అంటరాని వారిని మా అంతట మేమే కాపాడ దలచుకున్నాం.మాకు ఆ అవకాశాన్ని ఇవ్వండి"! అని నిక్కచ్చిగా తెలిపితే బాగుండేది. చీకాకు కల్గిస్తున్నాయనుకున్న మిషనరీల కార్యకలాపాల పట్ల గాంధీ ఇటువంటి చిత్తశుద్ధి కలిగిన ధోరణిని వహించక పోవడం విచారకరమైన అంశం. ఎవరు ఏదైనా చెప్పినా అంటరాని వారందరూ - మతాంతీకరణ చెందిన వారు కానీ - చెందని వారు కానీ మిషనరీల పట్ల పోషించిన పాత్ర అణచలేమనే అంశానికన్నా నిస్సందేహంగా అంగీకరిస్తారు. శతాబ్దాల తరబడి అంటరాని వారికి పునరావాసం మాట అటుంచి, కనీసంగా కావలసిన నీడనిచ్చినాయి.

ఈ వాస్తవాన్ని గుర్తించని గాంధీ వైఖరిపై అటు మిషనరీలు కానీ, ఇటు అంటరాని వారు కానీ ఆదుర్దా పడనవసరం లేదు. జాతీయవాద ఉత్సుకతతో హిందువుల కుండే రాజకీయ, సామాజిక, ఆర్థికాధికారాలను క్రైస్తవాన్ని అణచి వేయాలనే తలంపుతో దుర్వినియోగం చేయనంత వరకు క్రైస్తవం భారత దేశంలో చిరకాలం నిలిచిపోతుందని చెప్పాలి. అంతే గాక నానాటికి సంఖ్యాపరంగానూ, సమాజ ప్రభావాన్ని చూపించడంలో కానీ దాని పాత్ర ఇంకా పెరిగే అవకాశముంది.

## II

క్రైస్తవ మత సంస్థల దృక్పథం నుంచి కానీ, అస్పృశ్య కులాల వారినుంచి కానీ క్రైస్తవం భారత దేశంలో ఏమీ సాధించిన దనే అంశం పరిశీలించదగ్గది.

తమ పరిధిలోకి వచ్చిన వారిని పరిశుద్ధ వ్యక్తులుగా తీర్చిదిద్దడానికి కావలసిన నిర్మాణాత్మకమైన ఏర్పాటును అందిచడానికి క్రైస్తవ మత సంస్థలు పనిచేస్తున్నాయనే విషయం తిరస్కరించ వీలులేనిది. క్రైస్తవ మిషనరీలు భారతదేశంలో చేస్తున్న కార్యకలాపాలన్నింటినీ ఈ సందర్భంలో పొందుపరచడం కష్టతరమైన పని. విశాలంగా అవి చేసే కార్యకలాపాలను ఐదురకాలుగా తెలుపవచ్చు. 1. పిల్లలకొరకు 2. యువకుల కొరకు 3. ప్రజల కొరకు 4. స్త్రీల కొరకు 5. రోగగ్రస్తుల ఉద్ధరణ కొరకు.

పై రంగాలలో క్రైస్తవ మిషనరీలు చేసిన పని చాలా పెద్ద మొత్తంలో వుంది. విద్యారంగంలో, రోగ గ్రస్తులైన వారికి సహాయం అంద జేయడంలో ఈ సంస్థలు ఎంత మేరకు పనిచేసినాయన్న విషయం తెలుసుకోవడానికి ఈ క్రింది గణాంకాలు ఉపకరిస్తాయి.

### I. క్రైస్తవ ఆరోగ్య కార్యకలాపాలు.[11]

| | | | |
|---|---|---|---|
| 1. | ఆసుపత్రులు | .. | 256 |
| 2. | చికిత్సాలయాలు (Dispensaries) | .. | 250 |
| 3. | స్వస్థతా కేంద్రాలు (Sanatoriums) | .. | 10 |
| 4. | కుష్టు రోగుల ఆవాసాలు | .. | 38 |
| 5. | ఆరోగ్య పాఠశాలలు | .. | 3 |
| 6. | ఆసుపత్రులలో ఉన్న పడకల సంఖ్య | .. | 12,000 |
| 7. | స్వస్థతా కేంద్రాలలో ఉన్న పడకల సంఖ్య | .. | 755 |
| 8. | విదేశీ వైద్యులు | .. | 350 |
| 9. | భారతీయ వైద్యులు | .. | 390 |
| 10. | విదేశీ నర్సులు | .. | 300 |

| | | | |
|---|---|---|---|
| 11. | భారతీయ నర్సులు | .. | 900 |
| 12. | విద్యార్థిని నర్సులు | .. | 1,800 |
| 13. | నిర్వహించిన ప్రధాన చికిత్సలు | .. | 44,000 |
| 14. | శిశువైద్యం | .. | 32,000 |
| 15. | ఇన్-పేషంట్స్ | .. | 2,85,000 |
| 16. | ఔట్ పేషెంట్స్ | .. | 26,00,000 |

**II క్రైస్తవ విద్య**[12]

| క్రమ సంఖ్య | వివరము | సంస్థలు | విద్యార్థులు |
|---|---|---|---|
| 1. | ప్రాథమిక పాఠశాలలు | 13,300 | 6,11,730 |
| 2. | ప్రాథమికోన్నత పాఠశాలలు | 302 | 67,229 |
| 3. | కళాశాలలు | 31 | 11,162 |
| 4. | థియోలాజికల్ కళాశాలలు – శిక్షణా పాఠశాలలు | 25 | 556 |
| 5. | బైబిల్ శిక్షణా పాఠశాలలు | 74 | 2,85 |
| 6. | అధ్యాపక శిక్షణా పాఠశాలలు | 63 | 3,185 |

హిందువుల వైపునుంచి ఇటువంటి స్పందన ఏమైనా వున్నదా తెలుపడానికి? చారిత్రకంగా వివరించాలంటే, మానవాళికి సేవ చేయడం అనేది హిందువులకు, హిందూమతానికి అన్యసమానమైనది . హిందూ మతం ప్రాథమికంగా దైవికాచారాలను అనుశీలనాలను పాటించేటటువంటిది. అది దేవాలయాలతో కూడుకొన్న మతం. మానవప్రేమకు అందులో చోటు లేదు. మనుషులపై ప్రేమ లేకుండా, మానవ సేవకై ప్రేరణ ఎలా సాధ్యమౌతుంది? హిందువు దానాలను ఇచ్చిన పద్ధతిలోనూ, లక్ష్యాల్లోనూ పరిధిలోనూ ఈ స్వభావ ప్రతిఫలాలను చూడవచ్చు. హిందువులు ఇచ్చే దానాల పరిధి లక్ష్యాలను నిర్ధారించడంలో ఎంత ప్రబలంగా కులం నిర్ణాయక స్వభావాన్ని కలి

ఉంటుందో భారత దేశంలో కొద్దిమందికి మాత్రమే తెలుసు. హిందూ దానాలకు సంబంధించిన పూర్తి - సంక్షిప్త వాస్తవాలను తెలుసుకోవడం కష్టసాధ్యమైన పనికూడా. చాలా కాలం క్రితం బాంబే పట్టణంలో సేకరించిన సమాచారం ఈ కోణంపై కొంత ఆలోచనను రేకెత్తిస్తుంది. (మూల రచనలో ఈ సమాచారం బైపు చేయబడలేదు- సం). 1918లో బాంబే నగరంలో వ్యాపించిన ఇన్ఫ్లూయన్జా వ్యాధి నివారణ చర్యలలో కొంతమంది వైద్యులు రోగులకు నయం చేసే విషయంలో కుల వివక్షతను పాటించినారన్న ఆరోపణ బాగా వినపడింది. సాపేక్షికంగా, సమాజ సేవారంగంలో క్రైస్తవ మిషనరీలు వహించిన పాత్ర చాలా గొప్పది. ఈ విషయంలో క్రైస్తవ మతం పట్ల నిశ్చయాత్మకంగా విరోధత్వాన్ని కల్గివున్న వారికి కూడా ఎటువంటి సందేహం వుండదు. క్రైస్తవ మిషనరీలు పాటించిన ఈ సేవల నేపథ్యం రెండు ప్రధాన ప్రశ్నలను ముందుంచుతుంది. ఈ సేవలు భారతీయ క్రైస్తవుల అవసరాలకు కావలసినవేనా? క్రైస్తవ మిషనరీలు పట్టించుకోలేని భారతీయ క్రైస్తవుల అవసరాలు ఏవైనా వున్నాయా? ఈ సందర్భంలో గుర్తుంచుకోవలసిన అంశం ఒకటుంది. భారతీయ క్రైస్తవులు చాలా మంది అస్పృశ్య కులాల వారినుండి, కొంత మేరకు దిగువ స్థాయిలో నున్న శూద్ర కులాల నుండి వచ్చిన వారేనన్న విషయాన్ని గుర్తుంచుకోవాలి. మిషనరీలు చేపట్టిన సేవలను ఈ వర్గాల అవసరాల నేపథ్యంలో నుంచి చూడవలసి వుంటుంది. ఈ అవసరాలు ఏమిటో చూడాలి.

మిషనరీలు వైద్య, విద్యారంగాలలో అందించే వసతులు మరే సందర్భంలోనూ భారతీయ క్రైస్తవుల సమీప అందుబాటులో ఉండేవి కావు. వైద్య, విద్యారంగాలు ఎక్కువగా ఉన్నత హిందూ కులాలు లబ్దిపొందేవిగా ఉంటాయి. ఉన్నత విద్యను పొందడంలో భారతీయ క్రైస్తవులు మరీ పేదలుగా ఉండటమో లేక అభ్యసించాలనే ఆకాంక్ష తగినంతగా లేకపోవడమో కనబడుతుంది. భారతీయ క్రైస్తవుల దృష్టిలో మిషనరీల యాజమాన్యంలో నడుపబడే కళాశాలల, పాఠశాలల, హాస్టళ్ళపైన చేయబడే వ్యయం అంతగా క్రైస్తవులకు ఉపయోగపడని రీతిలో చేయబడేటటువంటిది. వైద్య రంగంలో వెచ్చించే డబ్బు సహాయం సవర్ణ హిందువులకు చెందుతున్నది. మరీ ముఖ్యంగా ఆసుపత్రుల వినియోగంలో ఈ విషయం నూటికి నూరుపాళ్ళు వాస్తవం. చాలా మిషనరీలు ఈ విషయాన్ని తెలుసుకున్నాయనేది నాకు తెలుసు.

అయినప్పటికీ, అనేక సంవత్సరాలుగా ఒకదాని తరువాత మరొకటిగా ఈ వ్యయం కొనసాగింపబడుతూనే వుంది. ఈ విధమైన సేవల లక్ష్యం క్రైస్తవ మిషనరీలు సవర్ణ హిందువుల మధ్య సంబంధాన్ని పెంచుకోవడానికి గల సందర్భాన్ని అధికం చేయడమే. సవర్ణ హిందువులను క్రైస్తవ మతంలోకి మార్చడంలో ప్రభావితం చెయ్యాలనే ప్రయత్నం వృధా మాత్రమేకాక పూర్తిగా విఫలం చెందేటటువంటిదన్న విషయం మిషనరీలు ఎంత త్వరగా గుర్తిస్తే అంత మంచిదని నా అభిప్రాయం. క్రైస్తవం పట్ల భారతదేశంలో శిష్టజన వర్గం ధోరణిని శ్రీ విన్స్లో సరిగ్గానే గుర్తించి వ్యాఖ్యానించాడని అనిపిస్తుంది. ఆయన ఈ విధంగా చెపుతాడు ....

"డఫ్, శ్రీరాంపూర్ మిషనరీల ప్రయత్నాలు గుర్తించదగ్గ స్థాయిలో మత మార్పిడి సంఖ్యను పెంచినట్లుగా కనపడ్డప్పటికీ శీఘ్రంగానే ఈ ధోరణి తగ్గిపోయింది. క్రైస్తవ చర్చి స్థానాన్ని ధార్మిక సమాజాలు, ప్రత్యేకించి బెంగాల్‌లోని బ్రహ్మసమాజం ఆక్రమించడం మొదలు పెట్టినాయి. పాశ్చాత్య ఆలోచనా ప్రభావం వల్లనూ, తమ మత లక్షణాలైన విగ్రహారాధన, కుల స్వభావానికి రాజీ పడలేని స్థితి వల్లనూ పూర్తిగా హిందూమతంలో తమ స్థానాన్ని వదులుకోలేక పోయినందు వలన ఈ ధార్మిక సమాజాల్లో భాగస్వాములైనారు. అయితే, బ్రహ్మసమాజ రీతిని విశ్వసించిన వాళ్ళు దానిలో పూర్తిగా ఇమడలేక ఏనాటికైనా బయటపడి క్రైస్తవ మత విశ్వాసాలను అవలంబించడంలో ముందుకు వస్తారనే ఆశ చాలా సంవత్సరాలుగా క్రైస్తవ మిషనరీలకు ఉండేది. చాలా కొద్ది సందర్భాలలో ఈ బ్రహ్మసమాజ శ్రేణుల నుండి మతం మార్చుకొన్న ప్రముఖుల సంఖ్య వున్నప్పటికీ మొత్తంగా ఈ ఆశ నిరుత్సాహపర్చబడినటువంటిదే..."

. . . . . . . . .

"అటువంటి స్థితిలో విద్యావంతుడైన భారతీయుడు, ప్రత్యేకించి బ్రాహ్మణుడు క్రీస్తు గురించి ఏమని ఆలోచిస్తాడు? ఈ అంశాన్ని పూర్తిగా సాధారణీకరించే ప్రయత్నం అవివేకమైనది. అయినప్పటికీ, అంశానికి సంబంధించిన కొన్ని విశాలమైన లక్షణాలను ఎటువంటి చిక్కు లేకుండానే వివరించవచ్చు.... క్రీస్తు బోధనలోని ముఖ్య సూత్రాల పట్ల, మరీ ముఖ్యంగా నైతిక బోధనల పట్ల పెద్ద యెత్తున ఆమోదం వుంది. అంతేగాక, వాటి పట్ల ఒక పవిత్ర భావం కూడా వుంది. మానవ ప్రవర్తనను ఇదమిద్ధంగా సమాంతరంగా నియంత్రించ గలిగే ఏకైక మార్గ దర్శక నిఘంటువు ఏదీ లేదన్న దృష్టిలో నుండే ఈ భావం

ఏర్పడింది. అంతేగాక, క్రీస్తు బోధనలపై వున్న ఆదరణ ఆయన జీవితం, శీలంపై వున్న అవ్యాజ్య గౌరవ దృష్టి వల్లి ఏర్పడింది కూడా. అయితే యిదే సందర్భంలో క్రీస్తును అసమాన దైవంగా గుర్తించడానికి, ఆమోదించడానికి అత్యధిక హిందువులు సిద్ధంగా కూడా లేరు. తమ నమ్మకాలకు ప్రతీక అయిన గొప్ప ప్రవక్త బుద్ధుని సరసన నిలబెట్టుకొనే వరకు ఆమోదించే స్థాయి వుంది.

కానీ క్రైస్తవులకు 'అతడు' అతనొక్కడు (క్రీస్తు) మాత్రమే దేవుని అవతారం కాగలడు. భవబంధాల నుండి కాగల ముక్తి 'అతని' యందు అచంచలమైన విశ్వాసమును కలిగి యుండడం వల్లనే వీలవుతుంది. క్రైస్తవులలో ముక్తిపట్ల ఉండే ఏకైక విశ్వాస దృష్టి భారత దేశంలో సహజాత్మకమైన విరోధ భావాన్ని ఆహ్వానిస్తుంది.... విద్యా వంతులైన హిందువులు క్రీస్తు బోధనల పట్ల అమిత గౌరవాన్ని, ఆయన సూత్రాలను, బోధనలను ఆమోదించినప్పటికీ హిందువుగా కొనసాగడంలోనే అసలైన సంతృప్తిని నేటికి కలిగి ఉన్నారు".

పై స్థితిని దృష్టిలోకి తీసికొన్నట్లయితే పరిస్థితి మరింత స్పష్టంగా బోధపడుతుంది. ఈ స్థితే కొనసాగిన సందర్భంలో మిషనరీలు ఆరోగ్య రంగంలో వెచ్చిస్తున్న డబ్బుగానీ, శక్తిగానీ భారతీయ క్రైస్తవులకు ఏమీ ఉపయోగ పడక పోగా మరొక రకంగా తప్పుగా అనువర్తించబడుతున్నదనడంలో నాకు ఏమీ సందేహం లేదు.

భారతీయ క్రిష్టియన్లు రెండు అంశాలను కోరుకుంటారు. మొదటిది వారి పౌరహక్కుల పరిరక్షణ. రెండవది తమ స్థితి గతులనుండి బయటపడే ఆర్థిక సముద్ధరణ ఈ అవసరాలకున్న పూర్తి రూపాన్ని వివరంగా చర్చించకుండా ఉండలేను. భారతీయ క్రైస్తవ మిషనరీలు నిర్వహించే సామాజిక సేవలో పై రెండు విషయాలకు సంబంధించిన దృష్టి విస్మరింప బడినది.

## III

విద్యా,వైద్య రంగాలలో క్రైస్తవ మిషనరీలు సాధించిన పురోగతి సాదృశ్యమైనదే కాక, శ్లాఘనీయమైనది కూడా. అయితే ఒక ప్రశ్నకు ఇంకా సమాధానం రావలసి వుంది. మతాంతరీకరణ చెందిన అంటరాని వారి మనస్తత్వాన్ని మార్చడంలో క్రైస్తవ మతం

ఏమేరకు ఫలితాలను సాధించగలిగింది? మతాంతీకరణ చెందిన అంటరానివారు బేధభావం లేని స్థాయిని సృజించే స్థాయికి చేరుకోగలిగారా? వారి వారి పురాతన విశ్వాసాలను, గత దేవుళ్ళను ఆరాధించడం మానివేసినారా? ఈ ప్రశ్నలన్నీ దీర్ఘంగా ఆలోచించాల్సిన ఇవన్నీ సమాధాన మివ్వదగ్గ ప్రశ్నలు. ఈ ప్రశ్నలకు సమాధాన మిచ్చే క్రమంలోనే భారత దేశంలో క్రైస్తవం నిలబడడం కానీ, దెబ్బతినడం కానీ ఇమిడి ఉంది.

సైమన్ కమీషన్ పర్యటన సందర్భంగా దక్షిణ భారత దళిత క్రైస్తవ వర్గాలు వారు తమ స్థితి గతులపైన, కుల సమస్య పైన సమర్పించిన వినతి పత్రంలోని సమాచారం క్రైస్తవంలోకి మతాంతరీకరణ చెందిన వారి పరిస్థితిని మరింత సవివరంగా తెలుపుతుంది.

"మత పరంగా మేము ప్రొటస్టంట్లమైనా కాథలిక్కులమైనా క్రైస్తవులం. దేశంలోని ప్రెసిడెన్సీ పాలిత భూభాగంలో నివసిస్తున్న మత మార్పిడి నొందిన క్రైస్తవులలో 60 శాతం మంది దళిత వర్గాల నుంచి వచ్చిన వారే. మన దేశంలో ఎప్పుడైతే క్రైస్తవం ప్రబోధింపబడిందో ఆనాటి నుంచి మేము ముఖ్యంగా పల్లాలు (Pallas), పరియాలు (Pariahs), మాలలు. మాదిగలు క్రైస్తవాన్ని ఆచరించిన వాళ్ళం. మా సంబంధీకులలో కొంతమంది ఎవరయితే హిందూమతంలో దళిత వర్గాలుగా ఇంకా ఉన్నారో వారు క్రైస్తవంలోకి మారలేదు. మేమే క్రైస్తవ మతంలోకి మారినప్పటికీ, క్రైస్తవ మత ప్రాథమిక ప్రబోధాలయిన - దేవుని ముందు మానవులందరూ సమానమని, తోటి వారి పట్ల కారుణ్యాన్ని కలిగి ఉండే అవసరాన్ని పాటించడం, పరస్పర సానుభూతి, క్షమాగుణాన్ని కలిగి ఉండడం వంటివి పాటించి నప్పటికీ మతాంతరీకరణ చెందిన అశేష దళిత క్రైస్తవుల జీవన స్థితిగతులు, మత మార్పిడి చెందని హిందూ దళిత వర్గాల జీవన స్థితిగతులు ఒకేరకంగా ఉన్నాయి.

"అనేక క్రియా కరకాల దోహదం ఉన్నప్పటికీ మతాంతరీకరణ చెందిన క్రైస్తవులలో బలీయమయిన హిందూ కుల భావ దృష్టి (Hindu Caste Mentality) క్రైస్తవ మత సంస్థలు వ్యవహరించిన పట్టించుకోని దృష్టి ఉదాసీనత, శక్తిహీనతల వల్ల క్రైస్తవులుగా మారక ముందు ఎలాగయితే ఉన్నామో నేడు అలాగే కొనసాగుతున్నాం. అంటరాని వారుగా ఈ దేశ సామాజిక స్థితి నిర్ధారణలో భాగంగా వున్నందువల్ల అటు అగ్రకుల క్రైస్తవులచే, మరొకవైపు అగ్ర హిందూ కులాలచే తిరస్కరించ బడ్డాం. ఇంకొక

వైపు ఏ సామాజిక పునాదుల నుంచి వచ్చామో ఆ హిందూ దళిత సోదర వర్గాల నుంచి కూడా దూరం చేయబడ్డాం."

" దక్షిణ భారతదేశంలో మద్రాసు లాంటి రాష్ట్రాలలోని చట్ట సభల్లో ప్రాతినిధ్యం వహిస్తున్న అతికొద్ది ప్రతినిధులు కూడా అగ్రకుల క్రైస్తవులే. ఇది చాలా వైరుధ్యంగా కనపడినా వాస్తవమైన విషయమే. హిందూ మతం నుండి వచ్చిన అగ్రకుల క్రైస్తవ మతాంతరీకులు తమ తమ గత ప్రత్యేక కుల పోకడలను యథాతథంగా కొనసాగిస్తున్న వారే. ప్రత్యేకించి, గ్రామీణ, సుదూర ప్రాంతాల్లో జీవిస్తున్న వారు క్రైస్తవ మతాచారాలను ఒకవైపు పాటిస్తూ, సోదర క్రైస్తవులుగా వున్నప్పటికీ వారు కుల వివక్షతను, చాంధస తీవ్రతను, నిర్హేతుకతను అవలంబిస్తున్నారు. వారు మమ్మల్ని "పంచములని లేదా పరియాలని" హేళన చేస్తారు. తమకున్న ధనం, అధికారం, హోదా గర్వం, సమాజంలో వున్న పదవుల మద్దతుతో సమాజంలో వున్న పేద క్రైస్తవులను నానాటికీ వివక్షతకు గురిచేయడం పరిపాటయింది. చాలా తరచుగా, దక్షిణ భారత క్రైస్తవ జీవితంలో పంచమ వ్యతిరేక కార్యకలాపాలకు సంబంధించిన ఉదంతాలు కోకొల్లలుగా సంభవిస్తున్నాయి.

"మా జీవితాల్ని బాగుపరుచుకునేందుకు మా వైపునుంచి జరిగే ఏ ప్రయత్నాలైనా మా పురోగతి దారితీసే ప్రాథమికమయిన హక్కుల గురించిన మేం చేసే గట్టి ప్రయత్నాలు– జన్మతః ఆధిక్యులమని గుడ్డిగా భావించే అధికారుల, అనధికారుల, క్రైస్తవుల, హిందువుల ఈసడింపుకు గురి కాబడినటువంటివే. మౌలికమైన క్రైస్తవ మత పునాదులైన విశ్వప్రేమ కారుణ్యావాదం, సౌభ్రాతృత్వానికి భిన్నంగా "మా సోదర క్రైస్తవులని చెప్పబడే వారు' (నేటికి అగ్రవర్ణ ప్రభావితులుగా వున్నటువంటి వారు) మమ్మల్ని నేటికీ చర్చిల్లో అస్పృశ్యులుగానూ, సమీపించరా సముదాయాలుగానూ పరిగణిస్తూ, సమాన హోదా నివ్వని రీతిలో, న్యూన దృష్టితో పరిగణించడం జరుగుచున్నది. అంతేగాక చర్చిల్లో ప్రార్థనా ప్రాంగణంలో కూడా వేర్వేరు రీతుల్లో ఇనుప చువ్వలతో బారికేడ్లు నిర్మించి ప్రార్థనా స్థలాల్లో కూడా అడ్డుగోడలను, కొనసాగిస్తున్న చర్చిలు కూడా ఉన్నవి.

"పవిత్ర సమావేశ కూటమిలో కూడా అశుభ్రతని తొలగించడానికి ఆమిష్కా అత్యంత హేయమైన విభాజిత దృష్టి పాటించబడుతున్నది. మా పిల్లలకు విద్య నేర్పించాలని, వారికి ఒక జీవితాన్ని అందజేయాలనే మాతలంపు కేవలం అంటరాని వార

తిరస్కార దృష్టిచే నిర్దాక్షిణ్యంగా నిరాదరించబడుతున్నది. పాఠశాలల్లో, హాస్టళ్ళలో అనుమతి నిరాకరించబడుతున్నది. ఒకవేళ పాఠశాలల్లో, హాస్టళ్లలో చేర్చుకోవడం జరిగినా ఆ పిల్లలకు వేరే వసతులు కల్పించి వివక్షతకు గురిచేయడం సాధారణమైన అంశం. తమ పూర్వ హిందూ అగ్రకుల నేపథ్యంలో వున్న సారాన్ని ఇమిడించుకొన్న అగ్రకుల క్రైస్తవులు తమకు ప్రత్యేక సామాజిక హెూదాను ఏర్పర్చుకోవాలని, హిందూమతంలో సమాంతరంగా వున్న తమ కులం వారి దృష్టిలో సమానమైన పరిగణన పొందాలని కోరుకుంటారు. క్రైస్తవంలోని ఇతర దళిత క్రైస్తవులను ఇతర హిందూ అగ్రవర్ణాల మాదిరిగానే వీరు చిన్నచూపు చూడడం కూడా చేస్తారు"

"ఈ పై వ్యాఖ్యలలో తెల్పిన అభిప్రాయాలను ఇదమిద్ధంగా జరిగిన కొన్ని ఉదాహరణల ద్వారా నిరూపించవచ్చు. (ఈ ఉదాహరణలను మూల ప్రతిలో అంబేద్కర్ రాసిన రాత ప్రతిలో చూపించలేదు).

అయితే, ఇటువంటి వివక్షతా స్థితి చాలా దారుణమైనది. ఒకింత మేరకు సేద తీరే అంశం ఏమిటంటే ఇదే స్థితి దేశంలోని అన్ని ప్రాంతాల్లోనూ, అన్ని క్రైస్తవ మత శాఖల్లోనూ సమానంగా లేదు. ప్రొటస్టంట్ల కన్నా కాథలిక్కులలో వివక్షత స్థితి కొనసాగుతున్నది. అట్లాగే ఉత్తర మధ్య భారతం కన్నా, దక్షిణ భారతంలో అత్యధికంగా వుంది. మొత్తంగా, క్రైస్తవ మతంలోకి మార్పిడి చెందిన వారిలో కుల దృష్టిని తీసివేయడంలో క్రైస్తవ మతం విజయం సాధించలేక పోయింది. స్పృశ్యులకూ, అస్పృశ్యులకూ మధ్య బేధం ఒక పరిధికి లోనైనది కావచ్చు. చర్చి అందరికీ ప్రవేశం కల్పించేదిగా ఉండవచ్చు. అయినప్పటికీ, హిందువుల జీవితాలను ఏమాదిరిగా నైతే కులం నియంత్రిస్తున్నదో క్రైస్తవుల జీవితాలను అదే రీతిలో ప్రభావిస్తున్నదని తెలుపడంలో దురుద్దేశ్యమేమీలేదు. మతాంతరీకరణ చెందిన వారిలో బ్రాహ్మణ క్రైస్తవులు-బ్రాహ్మణేతర క్రైస్తవులూ వున్నారు. బ్రాహ్మణేతర క్రైస్తవులలో మరాఠా క్రైస్తవులు, మహర్ క్రైస్తవులు, మంగ్ క్రైస్తవులు, బంగే క్రైస్తవులు ఉన్నారు. అట్లాగే దక్షిణాదిలో పరియా క్రైస్తవులు , మాల క్రైస్తవులు, మాదిగ క్రైస్తవులు ఉన్నారు. వారిలో సహపంక్తి భోజనాలను అనుమతించరు. పరస్పరంగా వివాహ బాంధవ్యాలను ఏర్పర్చుకోవడం సాధ్యమయ్యే స్థితిలేదు. హిందువులలాగే వీరందరు కూడా కుల పొకడలలో విలీనం పొందిన వారే.

క్రైస్తవంలోకి మతాంతరీకరణ, క్రైస్తవ మతం సఫలం కాకపోవడానికి మరొక విషయాన్ని కూడా గమనించవలసి ఉంది. మతాంతరీకరణ చెందిన హిందువులందరూ దాదాపుగా హిందూపూజా రూపాలనుపాటించడం, హిందూ మూఢాచారాలను విశ్వసించడం స్పష్టంగానే చూడవచ్చు. క్రైస్తవ మతం పుచ్చుకొన్న వారిలో వారి వారి కుటుంబ దేవతలో పాటుగా ఇతర హిందూ దేవుళ్ళను, రామ, క్రిష్ణా, శంకర, విష్ణు తదితరులను పూజించడం కనబడే అంశం. మతాంతీకరణ చెందిన క్రైస్తవులు హిందూ పవిత్ర స్థలాలకు యాత్రీకులుగా వెళ్ళి వస్తుంటారు. వీరు పండరీ నాథ్ కు వెళ్ళి విఠోబాను కొలుస్తారు. బేజరికి వెళ్ళి రక్త దాహంతో వుండే ఖండోబా దేవుడికి బలిఇస్తారు. గణేశ చతుర్థి రోజు చంద్రున్ని చూడడానికి వీరు తిరస్కరిస్తారు గ్రహణం రోజు సముద్రంలో స్నానం చేసి మిగతా హిందువుల్లా ఆచారాలను పాటిస్తారు. క్రైస్తవుల్లో ఈ విధంగా హిందువులు అనుసరించే సాంఘిక ఆచారాలను పాటించే స్థితి కొనసాగడం దారుణం. క్రైస్తవుల్లో హిందూ సాంఘికాచారాలు కొనసాగడంపై ఇంతకన్నా నేనేమి చెప్పలేను. ఈ క్రైస్తవులు పాటించేవి కేవలం సమాజ సంప్రదాయాలే అయితే వాటిపైన ఆదుర్దా ఏమీ లేదు. అయితే అవి మత ప్రధాన స్వభావంతో సంబంధాన్ని కల్గి పరిశీలింపబడేవి. ఈ సాంప్రదాయాలను మతపరంగా పాటించడం క్రైస్తవ మత విశ్వాసాలకు, జీవిత విధానానికి భిన్నమైనది. ఈ సంప్రదాయాచారాల ప్రభావాల నుండి క్రైస్తవం బయట పడలేదా? అన్నదే ముఖ్యంగా తలెత్తేటటువంటింది.

క్రైస్తవంలోకి మందిని మార్చాలనే తాపత్రయం క్రైస్తవ మిషనరీలకు ఉన్నా, ఈ హిందూ సంప్రదాయ. క్రైస్తవమతేతర ప్రభావాలను తొలగించే ప్రయత్నం ఏనాడు చేయలేదు పైగా వాటిని సహించారు.

క్రైస్తవులలో పేరుకొని పోయిన ఈ రకమయిన క్రైస్తవేతర ఆచార దృష్టి కలిగి ఉండడానికి మూలం జెసూట్ మిషన్స్ అని చెప్పాలి. మధురా మిషనరీ వారు అవలంబించిన మత ఆలోచనా పద్ధతుల దృష్టి వల్ల కాథలిక్ మిషనరీల ఒరవడిలో ఈ మార్పు చోటుచేసుకుంది. మధురా మిషనరీని 1608లో ఇండియాకు వచ్చిన ఇటాలియన్ దేశస్థుడైన జెసూట్‌ఫాదర్ రాబర్ట్ డినోబిలీ. ఈయన ఫ్రాన్సిస్ జేవియర్ అవలంబించిన పద్ధతుల్లో ఎదురైన ఇబ్బందులను తెలుసుకుని వాటిని అధిగమించే నూతన పని

ప్రణాళికను తయారు చేసినాడు. అపోస్తలుడైన పౌలు అవలంబించిన సూత్రాన్ని డినోబిలీ అన్వయించినాడు. కొందరిని కాపాడేందుకు గాను అందరికీ కావలసిన అన్నిటినీ ఇవ్వాలనే సూత్రాన్ని విశ్వసించి నాటి మధురారాజు పెరుమాల్ నాయక్‌ను కలుసుకుని ప్రతిష్ట గొన్నటు వంటి మధురా మిషనరీని స్థాపించాడు. ఈయన మధురా మిషనరీని నడిపిన విధాన్ని 'అపోజల్స్ ఆఫ్ ఇండియా' అనే గ్రంథంలో డాక్టర్ జె.ఎన్.ఒగిల్వీ ఈ క్రింది విధంగా వ్యాఖ్యానిస్తాడు.

"మధురా పట్టణంలో ఆసక్తి కరమైన వార్త వ్యాపించింది. సుదూర ప్రాంతాలనుండి ఒక క్రొత్త జ్ఞానాన్వేషకుడు పట్టణానికి వచ్చినాడన్నది పవిత్ర పట్టణంలో ప్రముఖమైన వార్తయ్యింది. అందులోనూ వచ్చిన వ్యక్తి ఒక బ్రాహ్మణుని ఇంట్లో బస చేసినాడు. త్వర లోనే ప్రజలు తండోపతండాలుగా వచ్చిన నూతన వ్యక్తిని చూడడానికి బ్రాహ్మణుడి ఇంటికి రావడం మొదలు పెట్టినారు. అయితే ఇంటి యజమాని, బ్రాహ్మణుడి సేవకులు వచ్చిన వారిని లోనికి రానివ్వడానికి అనుమతించడం లేదు. వచ్చిన వ్యక్తి ప్రార్థనలో ఉన్నాడని, దైవంతో మాట్లాడే సందర్భం అదనీ అందువల్ల ఆయనను చూడడం వీలు కాదని వచ్చిన వారికి తెలిపారు. దానితో జనంలో మరింత కుతూహలం ఆసక్తి పెరిగిపోయింది. త్వరలోనే రోజూ జనం గుమికూడడం, దూర ప్రాంతం నుంచి వచ్చిన వ్యక్తిని దర్శించడం మొదలైంది.

ఫాదర్ రాబర్ట్ డినోబిలీ ఆచార ప్రకారంగా ఒక సన్యాసి మాదిరిగా కాళ్ళు మల్చుకుని ఉచితాసనం పైకూర్చున్న రీతి అన్నిరకాలుగా బ్రాహ్మణులు వ్యవహరించే తీరును పోలియున్నది. భుజాలపై మూడు బంగారు, రెండు వెండి దారాలతో కల్పి వేలాడుతున్న త్రిశక్తుల కలయిక సూచించే జంధ్యం దానిలోనుంచి శరీరాన్ని ఆత్మ ఐక్యతను తెల్పేవిధంగా తయారు చేసి తన శరీరంపై వేసుకున్న శిలువ చూసే వారికి ప్రత్యేకతను కలింగచేవిగా ఉన్నాయి. ఆయనతో మాట్లాడునప్పుడు బయట పడ్డ జ్ఞానం, పరిశీలించినపుడు అర్థమయ్యే అతని అతిసాధారణ ప్రవర్తన ఆయన ప్రవర్తనను తెలియజేస్తాయి. రోజుకొక పూట కొద్దిగా అన్నం, పాలు, కూరగాయలతో కూడుకొన్న తిండి, గడుపుతున్న నిరాడంబర జీవితం అనతి కాలంలోనే చిన్నా పెద్దలను, ప్రముఖులైన బ్రాహ్మణులన ఆకర్షించింది. చివరకు రాజాస్థానం నుంచి ఆహ్వానం కూడా వచ్చింది. డినోబాలీ తన

ఆత్మ అపరిశుద్ధ మవుతుందని, అందువల్ల దర్శించడం వీలు కాదని తెలిపినాడు! మధురా పట్టణంలో ఇంత పవిత్రుడైన సన్యాసిని ఇంతకు ముందెన్నడూ చూడని భావన అధికమైంది. ఆత్మ, శరీరాల కలయికను ఇంత నిర్బంధంగా పాటించే ఇటువంటి వ్యక్తి బోధనలు వాస్తవానికి అతీతంగా ఉండగలవా ? తాను" రోమన్ బ్రాహ్మణుడిన్ని" అన్న ఫాదర్ వ్యాఖ్య సమ్మతింప బడడమే కాక ప్రజల్లో అతని ఉనికిపై ఉన్న సందేహాలన్ని నివృత్తి కావడం మొదలు పెట్టినాయి. రోమ్‌లో బ్రాహ్మణులు ఎలా ప్రత్యక్షంగా బ్రహ్మ దేవుడి అంశ వల్ల అందరికన్న అత్యున్నతంగా ఆవిర్భవించారన్నది కూడా వ్యాప్తిలోకి వచ్చింది. కుశాగ్రబుద్ధి కలిగిన సన్యాసి బోధనలను పరిశుద్ధంగా స్వీకరించి ప్రజలు వినడం మొదలు పెట్టినారు.

"పుస్తకం తదుపరి మరొక పుస్తకాన్ని ఫాదర్ డినోబిలీ వ్రాయడం మొదలు పెట్టినాడు. ఇందులో హిందూ భావనను ఆధునిక క్రైస్తవ సిద్ధాంతపునాదితో అన్వయించడం మొదలు పెట్టినాడు. ఈ ప్రయత్నాలలో సుప్రసిద్ధమైంది ఆయన రాసిన 'పంచమవేదం' అనే గ్రంథం. ప్రత్యక్షంగా నాలుగు వేదాల సారాన్ని ప్రత్యక్షంగా దైవబోధనలను ప్రతిబించేదిగా ఉన్నదని పేరు పొందిన ఈ గ్రంథం హిందువులందరికి మన్నన యోగ్యమైన రీతిలో అత్యంత ధైర్య సాహస యుక్తంగా రచించబడి దాదాపు నూటాయాభై సంవత్సరాలదాకా ప్రబల స్థానాన్ని పొందుతూ వచ్చింది"

"ఫలితంగా అనేక బ్రాహ్మణ శిష్యులు క్రైస్తవ మతం పట్ల మొగ్గు చూపడం, ఆరంభించారు. గతంలోని యూరోపియన్ మిషనరీలు అవలంబించిన సాదృశ్య పూర్వక మత మార్పిడి పద్ధతులకు భిన్నంగా ఈ మిషనరీ పద్ధతి సఫలయోగ్య మైనదిగా మారుతూ వచ్చి మతాంతరీకరణ క్రమాన్ని పురోగమన స్థాయికి తీసుకు రాగలిగింది. అయితే ఈ ప్రయత్నాల్లో హిందూ మతం పట్ల మినహాయింపు ధోరణి గుర్తించదగ్గ స్థాయిల్లో అవలంబించడం వల్ల ఈ పురోగతి సాధ్యమయిన మాట మాత్రం నిస్సందేహం. ఈ మినహాయింపు ముఖ్యంగా కుల విషయంలో జరిగింది. ఫాదర్ రాబర్ట్ డినోబిలీ ప్రకారం కులం ప్రాముఖ్యమైన విషయమే కాదు. అతని దృష్టిలో కులం సమాజ సందర్భంలో ఉండే పరిశీలనాంశం. అందువల్ల మతాంతరీకరణ పొందేవారు కులబంధాలను తెంచుకోవడంలో ఇమిడి ఉన్న బలీయమైన హేతువు ఏమీలేదు. తన ఆధ్వర్యంలో

మిషనరీ ప్రభావం వల్ల మతాంతరీకరణ చెందిన హిందూ కులాల వారు సాంప్రదాయికంగా తలపై ధరించే శెండీ (Shendi) లేదా తలపాగా హిందూ కుల ఉనికిని తెలిపేదిగా ఉన్నా ఆక్షేపణీయం కానిదేనని డినోబిలీ భావించాడు. అట్లాగే వారు పొరుగు హిందూ కులాల వారు ధరించే జంధ్యాన్ని నుదుట తిరుమణి లాంటి ముద్రను ఆవుపేడ బూడిదకు బదులుగా గంధపు పొడితో తయారు చేసిన విబూదిని ధరించడం కూడా చేసేవారు.

"నలభై సంవత్సరాలు డీ నోబిలీ తన జీవితాన్ని గడిపినాడు. అనుపమానమైన దైనందిన కష్టాన్ని, నిత్య త్యాగాన్ని, స్వచ్ఛందంగా ఇబ్బందులను ఎదుర్కొని అతను జీవించాడు. 1656 ఫిబ్రవరి 16న ఆయన తన 80వ ఏట మరణించాడు. అతని ప్రభావం వల్ల ప్రత్యక్షంగా కానీ, పరోక్షంగా కానీ దాదాపు వెయ్యిమంది మత మార్పిడి పొందినారు.

"పోర్చుగల్ దేశానికి చెందిన గౌరవ కుటుంబీకుడు అయిన జాన్‌డి బ్రిట్టో 1673లో భారత దేశానికి వచ్చినాడు. ఆయన రోమన్ కాథలిక్ చర్చిలో నేడు ఒక మత గురువు. ఆయన గురించి లండన్ మిషనరీ సొసైటీకి సంబంధించిన రాబిన్సన్ ఇలా చెప్పాడు. "దైవ ఆరాధకుడుగా ఆయన పేరు అప్రతిహతం. నిస్వార్థపరమైన స్వభావం, త్యాగ బుద్ధి వంటి గొప్ప గుణాలు కలిగి ఉండి క్రైస్తవ జీవితానికే కొత్త దనాన్ని చేకూర్చి పెట్టినాడనడంలో అతిశయోక్తిలేదు

"జాన్‌డి బ్రిటో, అతని అనుచరులు మధురా రాజ్యపు ప్రాభవం తగ్గు ముఖం పట్టడంతో చిన్న చిన్న సంస్థానాలుగా విచ్ఛిన్నమై పోవడంతో నిర్దాక్షిణ్యంగా దెబ్బతిని పోయారు.

"ఈ రకమైన నిరుత్సాహ జనకమైన స్థితిని శత్రువులు కొనసాగించినప్పటికీ, ఆయన తన కర్తవ్య నిర్వహణను కొనసాగిస్తు పొయ్యాడు. తను వెళ్ళిన ప్రతి చోటా, మంచి ప్రతిస్పందనను పొందినట్లుగా వార్తలు వినపడుతూనే వచ్చాయి. తన సందేశ ఆకర్షణతో పాటుగా ఆయనకున్న వ్యక్తిత్వ ఆకర్షణ తోడుకాగా వేలాదిమంది క్రైస్తవ మతం అనుసరించే వారుగా వచ్చారు. ఆయన చేతుల మీదుగా మార్వారాజా, తాడియ తేవర్ క్రైస్తవాన్ని పుచ్చుకున్నాడు. కొనసాగుతున్న ఈ స్థితిని నిరోధించేందుకు, బ్రిట్టో ప్రయత్నాలకు అడ్డుకట్ట వేసేందుకు ఆయనను చంపే ప్రయత్నాలు త్వరితపరచబడ్డాయి. ఫిబ్రవరి 4, 1693 బ్రిట్టో నిర్దాక్షిణ్యంగా చంపబడ్డాడు.

"బ్రిట్టో మరణానంతరం ఫాదర్ జోసెఫ్ బెస్చీ 1707లో భారత దేశంలో, బ్రిట్టో నిర్వహించిన బాధ్యతలను స్వీకరించినాడు. ఆయన కూడా 'రోమన్ బ్రాహ్మణుల' విధి నిర్వహణ రీతినే అనుసరించినాడు. అయితే మిషనరీ కార్యకలాపాల్లో మాత్రం తనకంటే ముందువారికన్నా భిన్నంగా వ్యవహరించినాడు. డీనోబ్లీ సాధ్యమైనంత వరకు పవిత్ర గురువుగా, దైవిక దత్త శక్తిగా పల్లెపల్లె తిరిగే అసాధారణమైన సన్యాసిగా అతి మామూలు జీవితాన్ని ఆచరించినాడు. హిందుత్వంలో నిరాడంబర జీవితాన్ని గడిపిన మునులు ఉన్నా, మరొక వైపు అతి విలాసవంతమైన జీవితాన్ని గడిపే పీఠాధిపతులు కూడా ఉన్నారు. బెస్చీ ఎంచుకున్న మార్గం రెండవది. ప్రజలను ఆశ్చర్యచకితులను కూడా చేసినటువంటిది. తాను ప్రయాణం చేసే పల్లకీయే అతి విలువైనదిగా ఉండేది. మేలి రకపు ఛత్రాన్ని కలిగి ఉన్న సేవకుడు ముందు నడుస్తుండే వాడు. పల్లకీ ఇరువైపులా నెమలి పింఛాలతో పొదిగిన వింజామరలను పట్టుకొనిపరుగిడే సేవకులిద్దరు వుండేవారు. పల్లకీపైన ఆకర్షితమైన పులి చర్మం, రకరకాల విలువైన మేలి ముసుగులు కప్పబడి అసాధారణమైన గురువులా బెస్చీ కనపడేవాడు. అయితే ఆయన జ్ఞానహీనుడైన బడాయి కోరుకాడు. ప్రజలను అర్థం చేసుకొని వ్యవహరించిన ఆయన శైలి చాలా చక్కని ఫలితాల నిచ్చింది. బెస్చీ ఈ ఆడంబరాలపై ఆధారపడి తాను కొనసాగలేదు. తనకున్న పాండిత్యమే వ్యక్తిత్వానికి పునాదిగా మలుచుకున్నాడు. పుట్టుకతోనే భాషావేత్తగా ఉన్న బెస్చీ తమిళ భాషపై సమగ్ర జ్ఞానాన్ని పొందినాడు. భాషా పరిజ్ఞానంలో ఆయనకు ఆయనే సాటిగా ఉండేవాడు. ఏ స్థానిక పండితుడూ సమఉజ్జీటుగా రాలేకపోయాడు. ఉన్నత భాషా పరిజ్ఞానాన్ని వ్యక్తపరిచే స్థాయినుండి అతి ప్రజా భాషల వ్యవహార సరళిపై పట్టును కలిగి ఉండేవాడు. పండిత తమిళ బ్రాహ్మడి భాషనుండి, పామర తమిళులు మాట్లాడుకునే మాండలిక భాషదాకా అనర్గళమైన రీతిలో భాషా పరిజ్ఞానాన్ని పొందినటువంటి వాడు బెస్చీ. ఆయన విలువైన కలం నుండి నిఘంటువులు, వ్యాకరణం, గ్రంథాలు, కావ్యాలు వెలువడ్డాయి. అవి నేటికి ప్రాశస్త్య్ర రచనలుగా పేరు పొందుతున్నవే. ఇవి మొట్టమొదటిగా వెలువడినపుడు దక్షిణ ఇండియా స్థానిక ప్రజలు చాలా సంతోషపడ్డారు. ఇలా సంతోషపడ్డ నాటి ప్రముఖులలో నెల్లూరు నవాబైన చాందా సాహెబ్ ఒకరు. చాందా సాహెబ్ బెస్చీ రచనలకు ముగ్ధుడై తిరుచురాపల్లి జిల్లాలోని, ఏటా 12,000 రూపాయల రాబడిని ఇవ్వగల గ్రామాలను బెస్చీకి బహుమానంగా ప్రకటించాడు. ఇటువంటి తనకు సమకూర్చిన

సంపదలను, ప్రతిష్టను విశ్వసనీయంగా క్రైస్తవ మత వ్యాప్తికోసం, మిషనరీ కార్యకలాపాల కోసం మాత్రమే వెచ్చించాడు. మిషనరీ చాలా ఉజ్జ్వలంగా ఈయన కాలంలోనే ఎదిగి తర్వాత చాలా త్వరగా 1742 ఆయన మరణ కాలం నాటికి పతనావస్థకు చేరుకొన్నది."

ఈ విధంగా మధురా మిషనరీ బాధ్యులు క్రైస్తవ మత వ్యాప్తిని ప్రోత్సహించడానికై చేసిన ప్రయత్నాల్లో హిందూ మత సున్నితత్వాలకు భంగం కలిగించే పాశ్చాత్య పోకడలను ఎన్నింటినో మినహాయించడం, మత మార్పిడి నొందిన క్రైస్తవులు హిందూ మత ధోరణులెన్నింటినో కొనసాగించడాన్ని, మినహాయించడాన్ని సహించడం కూడా ఏక కాలంలో జరిగినాయి. నుదుట బొట్టును ధరించడం, జంధ్యాన్ని వేసుకోవడం, యుక్త వయస్సు లేదా రజస్వల కాకముందే వివాహమాడడం, స్త్రీల విషయంలో ఋతుస్రావ సందర్భాల్లో పాటించే పరిశుభ్ర నియమాల్లోనూ, పవిత్ర స్నానమాచ రించడంలోనూ కుల పరిధికి ఆవలగా భుజించడం కానీ, వివాహ సంబంధాలను కొనసాగించడం పై తిరస్కరించే లాంటి వాటిల్లోనూ అనేక మినహాయింపులను మిషనరీ కార్యకలాపాలు కొనసాగిస్తు వచ్చినాయి. వీటన్నింటిని కలిపిన "మలబార్ క్రియలు" (Malabar rites) అని పిలుస్తారు. 1744 సెప్టెంబర్ 12న, ఈ రకమైన సంప్రదాయ క్రియలను పాటించడం మానివెయ్యాలని పోప్ బెనిడిక్ట్ 14 జారీ చేసిన బుల్ సర్వత్రా వర్తిత ఆజ్ఞల ద్వారా (Bull Omininum Sollicitudinum) సూచించబడింది.[13] నాటి నుండి ప్రతీ రోమన్ కాథలిక్ మిషనరీ మత మార్పిడి నొందిన వ్యక్తుల విషయంలో ఎటువంటి మినహాయింపులను పాటించకుండా ఉండేందుకు బుల్ జారీ చేసిన ఉత్తర్వులను పాటించడంలో నియమ బద్ధంగా వాగ్దానం వహించేది. క్రైస్తవ మత విశ్వాసాలకూ, క్రైస్తవేతర ఆచారలకూ పొత్తు కుదురుతుందనే సంప్రదాయం మాత్రం అలాగే ఉంది.

16వ శతాబ్దపు నాటి మిషనరీ కార్యకలాపాల్లో బాధ్యులైన నాటి యూరోపియన్ల దృష్టి కానీ, యూరోపియన్ సంప్రదాయాల పట్ల హిందువుల కున్న, ముస్లిం కున్న అయిష్టత కానీ ప్రధానమైన అడ్డంకులుగా మారినవనటంలో సందేహం ఏమీ లేదు. సమయవాదిగా ఉన్న యూరోపియన్ మిషనరీ బాధ్యులు మత ప్రచార పద్ధతుల్లో సంచలనం కలిగించినా, ఆవు మాంసాన్ని, మద్యాన్ని సేవించే అలవాట్లు కలిగిన

మతారాధకులైన యూరోపియన్లు స్థానిక బ్రాహ్మణ, మహమ్మదీయ జీవన సూత్రాలకు భిన్నంగా మారడం వల్ల వీరి పట్ల వ్యతిరేకతను పెంచుకొన్నారు. తిరస్కార దృష్టితో క్రైస్తవాన్ని 'ఫిరంగుల' మతంగా భావించేవారు. హిందూ మత దృష్టిలోనుండి క్రైస్తవ మిషనరీలు ఆచరించే ఈ అపవిత్రతలను, అనాచారాలను వారు ఎత్తిచూపడం న్యాయ సమ్మతంగానూ, అవసరంగానూ అనిపిస్తుంది. కానీ జెసూట్ మిషనరీలు, అపరిమితమైన మినహాయింపులకు లోబడి నామ మాత్రంగా ఆచరించే మతాంతీకరణ కార్యక్రమాలు సిగ్గు చేటే కాక, పాపాత్మకమైనది కూడా. మతం మార్పిడి నొందిన వ్యక్తిగత చరిత్ర, పూర్వ ఆలోచనల క్రమంతో పని లేకుండా యేసును రక్షకుడుగా ప్రకటించి క్రైస్తవీకరించడం సరియైనది కాదు.

మధురా మిషనరీ తదనంతరం దేశంలోకి అడుగు పెట్టిన లూథరన్ మిషన్‌వారి దృక్పథం భిన్నంగా ఉంది. మధురా మిషనరీ వారు అనుసరించిన వైఖరికి భిన్నంగా వ్యవహరించిన గొప్ప బోధకుడు స్వార్జ్ (Swartz). క్రైస్తవం, కులం రెండు భిన్నమైన అంశాలని, నిజమైన క్రైస్తవులు కులాన్ని జీవిత ప్రణాళికగా స్వీకరించడం సరియైనది కాదని స్వార్జ్ భావించి ఉంటాడా ? ఈ ప్రశ్నకు సమాధానమేమైనా ఆయన ఈ మినహాయింపు దృష్టిని మన్నించినాడని అనుకోవటం లేదు.

ప్రొటస్టెంట్ మిషనరీలు వ్యవహరించిన తీరు ఏమిటి? వీరు చాలా ఆలస్యంగా ప్రవేశించినారన్న అంశమే వారికి సదా వ్యాఖ్యగా ఉంటూ వచ్చింది. 1813 దాకా వీరు రంగంలోకి ప్రవేశించకుండా నిరోధింపబడినారన్న మాట చారిత్రకంగా తెలిసే వాస్తవం. ఇండియా, తదితర పాలిత ప్రాంతాలలోని మిషనరీల పట్ల ఈస్ట్ ఇండియా కంపెనీ వహించిన వైఖరి ఫలితమే ఇది. భారత దేశానికి వచ్చిన యూరోపియన్ల దృక్పథం అంతా కూడా సాధ్యమైనంత వరకు స్థానికులను క్రైస్తవులుగా మార్చాలన్న సంకల్పమే కనపడుతుంది.

పోర్చుగీసు వారు తమ క్రైస్తవానుకూల ప్రచారంలో నిశ్చయాత్మకంగా వ్యవహరిస్తే, క్రైస్తవేతర దృష్టిని, సనాతన హిందూ దేవతారాధన పద్ధతిని తొక్కిపెట్టారు. 1510లోనే అల్బూకర్క్ (Albuqurque) "సతీ" సంప్రదాయాన్ని నిర్దాక్షిణ్యంగా నిరాకరించినాడు. మూడు వందల సంవత్సరాల తర్వాతమాత్రమే విలియం బెంటిక్ గమనంలోకి ఈ సమస్య

రావడాన్ని చూడవచ్చు. బలవంతమైన మతాంతీకరణనైనా జరిపించాలని ఫ్రాన్సిస్ జేవియర్ అర్థించిన సహాయాన్ని సంసిద్ధంగా నాటి పోర్చుగల్ ప్రభువైన జాన్ III అందించాడు కూడా. డచ్ ఈస్టిండియా కంపెనీ పాలిత ప్రాంతాల్లో ప్రొటెస్టెంట్ మత దృష్టి ప్రబలంగా ఉండి మతాంతరీకరణ పట్ల దృఢమైన వైఖరిని అమిత ఉత్సాహంగా చూపెట్టినారు. సిలోన్ ద్వీపాన్ని 1643లో డచ్ వారు ఆక్రమించిన కాలం నుండి క్రైస్తవమత వ్యాప్తికోసం, ప్రచారం కోసం రాజ్య ధనసహాయాన్ని సూత్ర బద్ధంగా అంగీకరించినారు. క్రైస్తవేతర దృష్టి కలిగిన దేవాలయాల నిర్మాణం, యాత్రా స్థలాల దర్శనం నిషేధింపబడ్డది. ప్రభుత్వ నియామకాలు కేవలం క్రైస్తవులకే పరిమితం. మత పాఠశాలలకు గైర్హాజర్ కావడం రాజనేరం. ఫలితంగా 1685 కాలం నాటికి 3,20,000ల మంది సింహళీయులు ఈ పద్ధతులకు లొంగి క్రైస్తవులుగా మారినారు.

దాదాపు ఇదే ఉత్సాహాన్ని బ్రిటిష్ ఈస్టిండియా కంపెనీ వారు కూడా చూపించినారు. 1614లో ఒక భారతీయ యువకుడిని లండన్‌కు కంపెనీ నావ కెప్టెన్ తీసుకొని వచ్చినాడు. అతనిని కంపెనీ ఖర్చుల మీదుగానే విద్యావంతుడిని చేసినారు. స్వదేశంలో మరికొంత మందిని క్రైస్తవీకరించుటకు సాధనంగా ఈ యువకుడు ఉపయోగపడ్తాడని కూడా తెలిపినారు. ఆయువకున్ని పాస్టర్ వద్ద క్రైస్తవీకరించిన సందర్భానికి(Baptising) లండన్ మేయర్, కంపెనీ డైరెక్టర్లు హాజరైనారు. జేమ్స్I ప్రభువు ఈ యువకుని పేరు పీటర్ అని పెట్టాలని నిర్దేశిస్తే, క్రైస్తవీకరించిన మత గురువు నాటి ప్రేక్షకులకు ఆ యువకుణ్ణి " భారత దేశం నుండి అందిన మొదటి ఫలంగా" అభివర్ణించాడు. 1617లో సూరత్ వద్ద ఒక మహ్మదీయుడిని క్రైస్తవీకరించడం జరిగింది. ఇరుమతాల నుండి మత మార్పిడిలో ఈస్టిండియా కంపెనీ కార్యకలాపాలు ప్రారంభమైనాయి. 1657లో ఆక్స్ఫర్డ్, కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయాల్లో భారత దేశంలో క్రైస్తవ మత వ్యాప్తికి దోహదపడే విధంగా ఒక ప్రత్యేక సంస్థ ఏర్పాటు చేయవలసిందిగా ఈస్టిండియా కంపెనీ అభ్యర్థించింది. పరదేశాల్లో తమ వ్యవహారాల్లో, ప్రొటెస్టెంట్ మత విషయ వ్యాప్తిలో కానీ మత గురువులు, ఆధీనులు స్థానికంగా పని చేసే వారిని, ప్రజలను నిర్దేశించే విధంగా ఆయా స్థానిక భాషలనూ నేర్చుకొనుటకు కావలసిన విద్యా, సంస్థాగత వ్యయాన్ని భరించటానికి వీలుగా తన చార్టర్ 1698లో కంపెనీ సవరించుకున్నది కూడా.

అయితే, అకస్మాత్తుగా 1698 తర్వాత కంపెనీ ప్రాధాన్యతలో మార్పు వచ్చింది. డచ్, పోర్చుగల్ ప్రభుత్వాలు మతాంతరీకరణ విషయంలో అతి వేగంగా పోతూ ఉంటే, బ్రిటిష్ ఈస్టిండియా కంపెనీ మాత్రం నెమ్మదిస్వభావాన్ని ఏర్పర్చుకున్నది. మతాంతీకరణ ఒకవైపు ఇండియాలోని మాండలిక భాషల్లో వ్యవహరించే వీలుగా మత బోధకులకు శిక్షణ గురిపై బాధ్యతను కంపెనీ స్వీకరించింది. వీరికి సుశిక్షితమైన రీతిలో మత ప్రచారాన్ని గరపటానికి, దైనందిన సర్వ విషయాల్లోనూ రక్షకుడుగా వ్యవహరిస్తున్న క్రీస్తును స్తుతించే విధంగా ప్రార్థనలను కొనసాగించడం ద్వారా, సరైన విధంగా కంపెనీ కార్యకలాపాలను సాగించడం ద్వారా మాత్రమే స్థానిక భారతీయులను జయించగలుగుతామనే అభిప్రాయం కంపెనీకి ఉంది. ఈ విధంగా కంపెనీ వ్యవహారాల్లో 'ప్రార్థనకు' 1750 దాకా ఒక ప్రత్యేక స్థానముంటూ వచ్చింది. 'ప్రార్థనా' ఇతివృత్తాన్ని, పదజాలాన్ని పరిశీలిస్తే వాస్తవంగా మొదటి నుంచి ఉన్న మతాంతరీకరణ భావాన్ని స్పష్టంగా కొనసాగించే దృష్టి ఉన్నట్లుగా కనిపించదు. ఈ విధమైన కంపెనీ స్వభావం వివాదాస్పదంగా మారింది. మతాంతరీకరణ పట్ల సానుకూలంగా ఉండే వారికి కంపెనీకున్న స్వభావాన్ని విడనాడేట్లుగా చేయడానికి ఒక మంచి అవకాశం దొరికినట్లైంది. 1773 రెగ్యులేటింగ్ చట్టం, పిట్స్ ఇండియా చట్టం వ్యాపారి రూపంలో ఉండే ప్రచ్ఛన్న రాజ్య విధానానికి స్వస్తి పలికేటట్లుగా చేసాయి. అంతే గాక భారతీయ పాలిత ప్రాంతాల పాలనను కొనసాగించే విధంగా పార్లమెంట్ పరిధిలోకి కంపెనీ చార్టర్ ఏజెంట్‌ను తీసుకొని వచ్చింది. ఈ చట్టంలోని కంపెనీ చార్టర్ కాల పరిధి 'O సంవత్సరాల దాకా ఉండాలని, తర్వాతనే పొడిగింపు నిర్ణయం నిర్ధారించాలని ాపబడింది. 1793 సంవత్సరంలోనే కంపెనీ చార్టర్ పొడగింపుకాలం ఇమిడి ఉంది ాక ఈ సంవత్సరం ఒక ప్రధానమైన ఘట్టంగా మారింది.

క్రైస్తవ జ్ఞానాన్ని వ్యాప్తి చేయాలన్న భావన కలిగి ఉండేవారికి ఈ చార్టర్ వల్ల పని సులభమైందని చెప్పాలి. విల్బర్ ఫోర్స్ అనే వ్యక్తి ఈ అంశానికి బాధ్యుడుగా పార్లమెంట్‌లో వ్యవహరించేవాడు. ఆయన పార్లమెంట్‌లో ఉన్న వారి మద్దతు ఈ అంశంపైన సంపాదించగలిగినాడు. దీనికి తోడుగా ఆర్చ్‌బిషప్ మూర్ ఆశీస్సులు కూడా ఉన్నాయి. ఈ రెండు ప్రధాన ఆధారాల మద్దతునుంచే కాక, ఈస్టిండియా కంపెనీ బిల్లు బాధ్యుడైన మంత్రి మద్దతును కూడా పొందినాడు. చార్టర్ బిల్లులో పొందుపర్చవలసిన ముఖ్యాంశాలన్నీ ముందుగా హౌజ్ ఆఫ్ కామన్స్ లో తీర్మానాలుగా తయారు చేయబడినాయి. అందులో

ఒక తీర్మానం ఇలా తెలుపబడింది. "బ్రిటిష్ భారతదేశ ప్రాంతాల్లో నివసిస్తున్నవారి ప్రయోజనాలను, సుఖసంతోషాలను కాపాడటం బ్రిటిష్ చట్టసభలకున్న మౌలికమైన విధి. వారికి ఉపయోగకరమైన జ్ఞానాన్ని, మతపరమైన, ఇతరేతర అభివృద్ధి గావించడానికి అవసరమైన చర్యలను తప్పనిసరిగా చేపట్టాలి. ఈ ఉపయోగకరమైన క్రైస్తవ జ్ఞాన వ్యాప్తికై, మతపరమైన ప్రచారం కోసం ఎప్పటి కప్పుడు సంతృప్తికరమైన సంఖ్యలో సమర్థవంతమైన వారిని అధ్యాపకులుగా, మిషనరీలుగా భారత దేశం పంపించాలి. అయితే వారిని పంపించే ముందు కాంటర్‌బరీ ఆర్చిబిషప్ వద్ద నుండిగానీ, లండన్ బిషప్ నుండిగానీ లేదా క్రైస్తవ మత వ్యాప్తి కోసం ఏర్పడిన సంస్థనుండిగానీ ఆయా పంపబడే అభ్యర్థులు అర్హులైన వారేనని తెలిపే యోగ్యధృవీకరణ పత్రాన్ని కోర్ట్ ఆఫ్ డైరెక్టర్స్‌కు అందజేయవలసిందిగా చట్టంలో నిర్దేశించబడాలి.

"అట్లాగే క్రైస్తవ జ్ఞాన వ్యాప్తి కొరకు పంపబడే వ్యక్తులు ఏయే ప్రాంతాలకు చేరుకోవాలో, వారిని ఏ రకంగా స్థానికంగా ఆదరించాలో, వారు చేపట్టే లక్ష్యాలకు ఏరకంగా నిర్వాహక ఏర్పాట్లు చూడాలో భారత దేశంలోని ప్రభుత్వానికి, ఆయా ప్రెసిడెన్సీలకు సాధికారమైన ఉత్తర్వులను ఇవ్వటానికి కోర్ట్ ఆఫ్ డైరెక్టర్ కు అధికారం ఉంది".

ఏ రకమైన శంక లేకుండా తీర్మనం హౌస్ ఆఫ్ కామన్స్‌లో ఆమోదించబడింది. ఈ ఆమోదానికి డూండస్ మద్దతు బాగా లభించింది. ఈ పరిణామంపై విల్బర్‌ఫోర్స్ చాల ఆనందపడి "ఈస్ట్ ఇండియా కంపెనీ వ్యవహార చరిత్రలో" సరయిన స్పందనగా ఆమోద మద్ధతు ప్రయత్నాల పట్ల వ్యక్తీకరించాడు. అయితే ఈ ప్రయత్నాలపై వ్యక్తీకరించిన ఆత్మ విశ్వాసం పూర్తిగా తొందరపాటుతో చేసి నటువంటిది. ఎందుకంటే, విల్బర్‌ఫోర్స్ బిల్లులో ప్రవేశ పెట్టిన పై అంశాలను మూడవసారి పరిశీలనలో హౌస్ తిరస్కరించింది. అప్పుడు విలబర్స్ డూండస్ వహించిన "అబద్ధపు, ద్వంద్వ ప్రమాణాల వైఖరిని" నిరసిస్తూ తన స్నేహితుడైన గిస్‌బ్రోన్‌కు ఉత్తరం రాసినాడు. చార్టర్ బిల్లులో ప్రవేశ పెట్టిన ఈ మార్పు ఈస్టిండియా కంపెనీ మొత్తంగా కంపెనీ యొక్క గుత్తహక్కు. కంపెనీ వారికి ముందు సమాచారం లేకుండా ఏ వ్యక్తిగానీ పర్యటనకు రాలేదు. ఒక వేళ వచ్చినా తక్షణమే స్వదేశానికి తిరిగి పంపబడతాడు. చార్టర్ బిల్లులో ప్రవేశ పెట్టిన ఈ ప్రకరణం వల్ల పెద్ద యెత్తున మిషనరీల ప్రవేశానికి బార్లా తలుపుల తెరవవలసి వస్తుందని కూడా కంపెనీకి

తెలుసు. ఈ అంశంపై అతి కుతూహలం, వివాదం చెలరేగుతూ వచ్చింది. దీనిపైన పూర్తి వివరాలను సేకరించాలనుకుంటే ఎడిన్‌బరో సమీక్షా నివేదిక సరయిన ఆధారంగా పని చేస్తుంది.

భారత దేశంలో మిషనరీల ప్రవేశం క్రైస్తవ మతవ్యాప్తికి చెందిన వివాదానికి మూడు అంశాలున్నాయి. మొదటి రకంగా, ఈస్టిండియా కంపెనీ డైరెక్టర్లు డివిడెండ్లను తమ తమ షేర్లను భద్రంగా నిలుపుకోవాలనుకునేవారు. రెండవ తరగతివారు భారత దేశంలో కంపెనీ వ్యాపారం పైన బ్రతుకుతూ, తమ సంతతికి క్రొత్త ఉద్యోగావకాశాలు పొందుతున్న ఇంగ్లీషు మధ్య తరగతి వర్గం. మూడవశ్రేణి క్రైస్తవ మత విశ్వాసాలను వ్యాప్తి చెందింపచేయడానికి నిబద్ధత వహించిన వారు. మూడవ తరహా వారు శాంతికాముకులైనప్పటికి భారత దేశంలో క్రైస్తవ వ్యాప్తి పట్ల అమిత ఆసక్తి కలిగిన వారు అయితే, మొదటి, రెండు తరహా శక్తులు ఒకటై, మూడవ తరహాకు చెందిన వారి ఆలోచనల పట్ల బలమైన వ్యతిరేక అభిప్రాయాన్ని కలిగించినారు. ఫలితంగా క్రైస్తవ మత సంస్థలకు వ్యతిరేకంగా చేపట్టిన వాదనలు ప్రముఖంగా వినవస్తూ వచ్చినాయి.

క్రైస్తవ మత విశ్వాసాల వ్యాప్తికై జరిగే ప్రచారం ఒకేసారి పెద్దయెత్తున జరుగవలెనే కానీ చిన్న చిన్న దఫాలుగా కాదన్న అభిప్రాయానికి ప్రతిస్పందనగా ఇచ్చిన సిడ్నీ స్మిత్ సమాధానం అత్యంత ఆశ్చర్యకరమైనది. ఆయన మాటల్లో:

"క్రీస్తు ఆవిర్భావానంతరం ఇన్ని శతాబ్దాలు మానవజాతి పవిత్ర నిజాలను తెలుసుకోకుండా కొనసాగడాన్ని దైవం అనుమతిస్తూ వచ్చింది. అందువల్ల, అత్యంత వేగపూరితమైన క్రైస్తవ మత విశ్వాసాలపట్ల జరిగే మార్పిడి ఏ విధంగానూ సర్వాధికారి వ్యూహం కాదనే విషయాన్ని మనం ఎంత త్వరగా గుర్తిస్తే అంత సంతృప్తికరమైంది కూడా. మతాంతీకరణ ప్రయత్నాలను దెబ్బతీసేవిగా ఉండే మనలోటి వారు అనుభవించే భౌతిక ఆనందాలను బయట పెట్టుకున్నా, సరైన రీతిలో దైవ నిర్దేశితమైన గృహ అంతర్ విధులను మనం కొనసాగించలేకున్నా దైవం దృష్టిలో తప్పిదమేమీ కాదు".

"స్థానికులను ఎగదోసి తిరుగుబాటుకు దారి తీసే విధంగా రెచ్చగొట్టేవారిని అనుమతించటం వల్ల కంపెనీ షేర్‌దార్‌లకు గానీ, బ్రిటిష్ జాతికి గానీ ప్రయోజనం కలిగేదేమీ లేదు.... రాజకీయ మార్పులకు ప్రేరేపించబడని విధమైన సమున్నత మతం

స్థానికులకు బోధించబడాలి... మన కుటుంబం పట్ల మనకున్న విధులను దైవం మనముందు సిద్ధపరచి ఉంచింది. సుదూరంలో ఉన్న క్రొత్త వారికి అవకాశాలను కల్పించే లక్ష్యం పేరిట మన విధులను నిర్లక్ష్య పరిచేందుకు మనకు స్వేచ్ఛలేదు"

ఈ విధమైన వాదనలన్నీ 1793లో చార్టర్ బిల్లులో జోడించిన ప్రకరణాన్ని తిరస్కరించలేదు. ఉపకరిస్తూ వచ్చినవే. విల్బర్ ఫోర్స్ పార్లమెంట్ సభ్యులను క్రైస్తవం సౌకర్యార్థం ఏర్పరచుకొన్న మతం కాదని చట్ట నిశ్చితమైనదని వ్యంగార్థంలో హెచ్చరించాడు. " పద్దెనిమిదవ శతాబ్దంలో అత్యధికుల్లో పరిగణించబడ్డట్టుగా క్రైస్తవాన్ని రాజ్యం-సమాజం వివేచనతో అన్వయించుకొన్న సందర్భాలను స్పష్టంగా చూడవచ్చు. దీనిని పరాయీ సంధర్బంలో అన్వయించినపుడు నిర్లక్ష్యంగా విచ్ఛిన్నం చేయనక్కరలేదు. సాధారణ పరిస్థితి ఒకరకంగా అగస్టన్ రోమ్ లాంటిదే ఉంది. రాజనీతిజ్ఞుడు సామ్రాజ్య దృష్టితో చూస్తే అన్ని మతాలు వాటి వాటి సందర్భాలలో సమానమైనవిగానే ఉంటాయి.[14]

మిషనరీలను అనుమతించాలనే ప్రయత్నాలు విఫలమయినాయి. 1813 దాకా ఈ స్థితి కొనసాగింది. ఈ విధంగా 1813 దాకా అనుమతి నిరాకరణే కాక, లైసెన్సు లేకుండా చొరబడి కొనసాగిస్తున్న మిషనరీ కార్యకలాపాల పట్ల నిశితమైన నిఘావేసింది కూడా. 1793లో డ్రాక్టర్ వేరీ చొరబాటుదారుడుగా లైసెన్సు లేకుండానే భారత దేశంలో ప్రవేశించాడు. లైసెన్సు లేనందువల్ల కలకత్తాలోనికి అయనను ప్రవేశింపనీయలేదు. ఫలితంగా, కలకత్తాకు 14 మైళ్ళ దూరంలో ఉన్న శ్రీరాంపూర్‌ను కార్యస్థలంగా ఎంచుకొని తన చర్యలను ప్రారంభించినాడు. శ్రీరాంపూర్ డేనిష్ జాతీయుల ఆధీనంలో ఉన్నటువంటిది. డేనిష్ వారు క్రైస్తవ మిషనరీలపైన, ప్రచార కార్య కలాపాలపైన ఎటువంటి ఆంక్షలను విధించలేదు. పైగా కేరీ ప్రయత్నాలను డేనిష్ గవర్నర్ ప్రోత్సహించినాడు కూడా. 1798లో శ్రీరాంపూర్ మిషన్ నలుగురు మత బోధకులను నియమించుటకు నిశ్చయించింది. 1800ల సంవత్సరంలో వారు మిషనరీ బాధ్యతలు స్వీకరించి శ్రీరాంపూర్‌లోని డేనిష్ కార్యాలయంలో నివసించడానికి నిశ్చయించినారు. వాస్తవానికి వీరి నివాసం పై గవర్నర్‌కు బ్రిటిష్ గవర్నర్ జనరల్ వెల్లెస్లీ జాబు రాసినాడు. " శ్రీరాంపూర్ గవర్నర్‌గా ఉన్న మీరు ఏ క్షణంలోనైనా బ్రిటిష్ ఈస్టిండియా కంపెనీ ప్రాంత పరిధిలోకి దొంగ చాటుగా చొరబడడానికి సిద్ధంగావున్న చొరబాటు దార్లను

బహిష్కరించడానికి చర్యలు గైకొన వలసినదిగా కోరుతున్నారు" దీనికి, డేనిష్ గవర్నర్ అటువంటి బహిష్కరణ చర్యలు చేపట్టడం సాధ్యం కాదని సమాధానం పంపినాడు. ఇటువంటి సంఘటనే 1806లో మరొకటి జరిగింది. ఈ సంవత్సరంలో కేప్టెన్ విక్స్ మత ప్రచారకులను కలకత్తా రేవు సమీపానికి తీసుకొని వచ్చాడు. దీనికి నాటి గవర్నర్ జనరల్ సర్ జార్జ్ బార్లో అసాధారణంగా స్పందిస్తూ కెప్టెన్ విక్స్ ప్రవేశానికి అనుమతి పత్రాలను మంజూరు చేయడానికి తీసుకొని వచ్చిన ఇద్దరు మత ప్రచారకులను వెనక్కు పంపించాలని షరతు విధించినాడు. వారు డేనిష్ అధికార ఆశ్రయంలో శ్రీరాంపూర్‌కు వెళ్ళవలసి వచ్చింది. ఈ విధమైన వైఖరిని నాటి గవర్నర్ జనరల్ వహించడం నిర్హేతుకమైనదేకాక శత్రు పూరితమైనది కూడా అని అభివర్ణించడం జరిగింది[15]

1806లో సంభవించిన వెల్లూర్ సిపాయిల తిరుగుబాటుకు కారణాలను తప్పుగా అంచనా వేస్తూ సర్ జార్జ్ బార్లో డేనిష్‌లోని, శ్రీరాంపూర్‌లోని మిషనరీ కార్యకలాపాలపైన ఆంక్షలను విధించాడు[16] అవి:

1. మిషనరీలు శ్రీరాంపూర్‌లోనే ఉండాలి.

2. క్రైస్తవ మత ప్రబోధాన్ని వారు బహిరంగంగా బజారులో చేయరాదు.

3. మతాంతరీకరణ చెందిన స్థానికులు మత ప్రబోధాన్ని చెయ్యవచ్చు. అయితే వారు ఈ పనికై శ్రీరాంపూర్‌నుండి పంపబడినట్టుగా దాఖలాలు ఉండకూడదు.

శ్రీరాంపూర్ మిషనరీ 1807లో విడుదల చేసిన మత కరపత్రంలో అనాలోచితంగా ఇస్లాం మత ప్రవక్త మహమ్మద్‌ను శీల హీనుడుగా అభివర్ణించడం నాటి బెంగాల్ ప్రభుత్వం వహించిన తీవ్ర వైఖరి మిషనరీలపై అవలంబించిన శత్రు దృష్టికి తగిన సాక్ష్యమని సందర్భంగా చెప్పాలి.

డాక్టర్ కారీ ఇచ్చిన సంజాయిషీపై బెంగాల్ ప్రభుత్వం సంతృప్తి చెందక శ్రీరాంపూర్ నుండి ప్రెస్సును కలకత్తాకు తరలించాలని, దానివల్ల వచ్చే సమాచారంపై సరైన అదుపు ఉంటుందని భావించింది. ఈ వార్త శ్రీరాంపూర్ మిషనరీకి దిగ్భ్రాంతిని కలిగించింది. ఎప్పటి మాదిరిగానే డేనిష్ ప్రభుత్వ ప్రతినిధిగా ఉన్న గవర్నర్ శ్రీరాంపూర్ మిషనరీని ఆదుకోవడానికి సంసిద్ధత వ్యక్తపరచి కలకత్తాలోని ఈస్టిండియా వారితో పోరాడడానికి

నిశ్చయాన్ని తెలిపినాడు. దానివల్ల వ్యవహారం సద్దుమణిగింది. బెంగాల్ ప్రభుత్వ ఉత్తర్వు ఉపసంహరించబడింది.[16] కానీ మిషనరీలతో ప్రభుత్వం సంబంధాలు మిత్ర వైఖరిలో లేవు.

సహేతుకంగా అంశాన్ని అంగీకరించడానికి కావలసిన సంసిద్ధతలేని తనం స్పష్టమే. కానీ 1813 తర్వాత బ్రిటిష్ ఈస్టిండియా ప్రభుత్వం మిషనరీల కార్యకలాపాలను అనుమతించినప్పుడు ఎటువంటి వైఖరిని అవలంబించింది? మతాంతరీకరణ చెందిన వ్యక్తి ఆలోచనలోనుంచి, జీవితంలో నుంచి, కులం తప్పనిసరిగా తుడిచి పెట్టుకపోవాలన్న విషయాన్ని దృష్టిలోకి తీసుకొందా? మొట్టమొదటిసారిగా ఏర్పాటైన ప్రొటెస్టెంట్ మిషనరీ వారు ఈ అంశాన్ని సానుకూలంగా సమర్థించినట్లు లేదు. మిషనరీలు కులంపట్ల వహించిన అసహన వైఖరి గురించి డాక్టర్ హైన్ 1814లో రాసినాడు.

"హిందువులలో పేరుకు పోయిన రాజకీయ విభజన ఏ విధంగానూ మత ఉనికికి సంబంధించినదిగా ఉండేటటువంటిది కాదు. అయితే చాలామంది జ్ఞానులనుకున్నవారు ఈ సంబంధం ఉన్నదనుకొంటారు. హిందువులకు క్రైస్తవాన్ని అందించే ముందు వారి కులాన్ని ఉంచుకోవడాన్ని అనుమతిస్తే ఎటువంటి ఊగిసలాట లేకుండా మతాంతరీకరణకు పెద్ద సంఖ్యలో ఒప్పుకుంటారు"

ఒకే వ్యక్తి ఉటంకించిన ఈ వ్యాఖ్యల ఆధారంగా మొత్తం ప్రొటెస్టెంట్ మిషనరీ వైఖరిని నిర్వచించలేం. అయితే ఈ ముఖ్యమైన విషయంపై ప్రొటెస్టెంట్ మిషనరీ దీర్ఘంగా ఆలోచించాలని, దాని వల్ల ఇది ఆలోచించబడుతున్న విషయమని తెలుపడానికి వీలుంటుందని భావించిన సందర్భాలు కూడా ఉన్నాయి. రెవరెండ్ హెబర్ కలకత్తా బిషప్‌గా 1823లో నియమితులైనప్పుడు ఈ అంశం లోతుగా చర్చించబడింది. ఆయన తన బాధ్యత గడువులో మొత్తం భారత దేశాన్ని, సిలోన్‌ను సందర్శించారు. ఈ పర్యటనా సందర్భంలో కులాన్ని మతాంతరీకరణకు ప్రాతిపదికగా పట్టించుకునే అంశంపై ప్రొటెస్టెంట్లలో తీవ్ర భేదాభిప్రాయాలు ఉన్నట్లుగా ఆయన గమనించి వాటిని పరిష్కరించడానికి నిర్ణయించుకున్నాడు. ఈ పరిష్కార క్రమాన్ని శ్రీ కేయీ భావ గర్భితంగా ఈ రకంగా వివరిస్తాడు.

"చాలా వేగంగా వృద్ధి చెందాలని, అత్యున్నతంగా విజయం సాధించాలనే దృష్టితో మిషనరీలు కొన్ని తప్పటడుగులు వేసే విధంగా వలలో పడ్డారు. ఒక హిందువును

మతాంతీకరణ చేసేముందు అతను తన కులాన్ని విడనాడాలని చెపుతారు. ఇది భారత దేశంలో హేయమైన చర్య. ఈ హేయ స్వభావమే మతాంతరీకరణకు శక్తివంతమైన ప్రతిబంధకమౌతుంది. మిషనరీలలో కులంపై పొడసూపిన బేధాభిప్రాయాలను పరిష్కరించాలని హేబర్ ఆకాంక్ష పడ్డాడు. బెంగాల్‌ను ఆయన విడిచిపోకముందే ఈ సమస్య ఆయన ముందుకు తేబడింది. మొత్తం 'కులం' ఒక సంస్థగా వున్నప్పుడు దానికి సంబంధించిన పూర్తి వివరాలను ప్రొటెస్టెంట్ మిషనరీల ఆచరణా వాస్తవాలను సేకరించి పూర్తిగా సమాచారాన్ని సంపాదించినాడు. ఆనాడు బిషప్ కాలేజీలో క్రిస్టియన్ డేవిడ్ అనే వ్యక్తి ఉండేవాడు. ఈయన చాలా గొప్ప స్వభావం కలిగినవాడు. అత్యంత సునిశిత జ్ఞానం కలిగి ఉన్న ఈ వ్యక్తిని హేబర్ తనకు సందేహాలు వచ్చినప్పుడల్లా సంప్రదించేవాడు. హేబర్ తనకున్న సమాచారంతో స్థానిక క్రైస్తవ మతాంతరీకులకు కొన్ని ప్రశ్నలు కలిగిఉన్న ప్రశ్నావళిని పంపినాడు. సరళమైన చక్కటి ఇంగ్లీషులో ప్రశ్నావళి పంపినవారి దగ్గరనుండి సమాధానాలు వచ్చినాయి.

క్రిస్టియన్ డేవిడ్ గారి అభిప్రాయంలో: దక్షిణ భారత దేశంలోని స్థానికుల మధ్య "కులం యదార్థంగా ఒక ప్రాపంచిక భావన. అది ఏరకంగానూ వాస్తవికమైన లేక అవాస్తవికమైన మతానికి సంబంధించిన మేధో దృష్టి కాదు" ఉన్నత కులాల వారు దిగువ కులాల వారితో అన్యోన్య సంబంధాలను కలిగి ఉండడానికి చూపే విముఖత ఏ మతపరమైన, మూఢాచారాల ప్రాతిపదికపైన ఆధారపడినది కాదు. అది పూర్తిగా సామాజిక కారణాల వల్లనే ఉంటుంది. ప్రాపంచికమైన సంపద ఆధారంగానో ఆదర్శ సంబంధమైన మార్గాలపరంగానో ఈ తేడాలు కొనసాగలేదు. క్రిస్టియన్ డేవిడ్ ప్రకారం దిగువ కులాలు కరుచుగా అగ్ర మనోభావాలకు ధిక్కారం కలిగించే రీతిలో భావ వ్యక్తీకరణ చేయడం వల్ల మాకుడుగా, స్వీయ గౌరవాన్ని కలిగి ఉండే విధంగా దిగువ కులాలు ఉండటం వల్ల పరస్పర తేడాలు ఉన్నాయని ఈయన భావించాడు. జ్ఞాన సంపాదన వారిని ఉన్నతీకరిస్తుందని, పెరయ్యా జ్ఞాన సముపార్జన చేసుకున్నట్లయితే పరియా పండితుడుగా గుర్తించబడి గౌరవించబడతాడని, తనతోటి సోదరులు కలిసి పోవడానికి సుముఖత వ్యక్తం చేస్తారని, అయితే ప్రాపంచిక భయం వల్లనో, గర్వం వల్లనో ఒకే పాత్రలో ఉన్న ఆహారాన్ని కలిసి భుజించడానికి ఇష్టపడరని క్రిస్టియన్ డేవిడ్ తెలిపినాడు.

"జీగెన్ బాల్గ్ రాజుల నాటి నుండి కూడా చర్చిలో ఒకే చోట కూర్చోకుండా రెండు భాగాలుగా చీలి వేర్వేరు చోట్లలో కూర్చుండేవారు. వేర్వేరుగా ఉండి ప్రభువును ధ్యానిస్తుండేవారు. త్రాగే నీటి కప్పును కూడా ముందు అగ్రవర్ణాల వారు వాడిన పిదపే మిగతా వారు ఉపయోగించేవారు. అయితే ఇవన్నీ ప్రాపంచిక విభజనలు మాత్రమేనని, దక్షిణ భారత క్రైస్తవ సంఘాలలోని వారి శ్మశాన వాటిక ఒకటేనని, చనిపోయిన వారిని ఒకే స్థితిలో బొందపెట్టేవారని, అంత్య క్రియల సమావేశంలో మిగతా క్రైస్తవేతర సందర్భాలకు భిన్నంగా అన్ని తేడాలను మరచి పాల్గొంటారని క్రిష్టియన్ డేవిడ్ తెలిపినాడు.

" కనీస సగటు ప్రయత్నాల వల్ల, ఓపికగా ఒప్పించే పద్ధతులను అవలంబించడంలో చట్ట కఠినత్వంలో క్రైస్తవానికి ఇబ్బంది కలిగించే విధంగా కాకుండా స్క్వార్ట్జ్, క్రైస్తవ మిషనరీల వంటి వారు తమ పాలన ద్వారా విభజితమై ఉన్న తేడాలను అధిగమించగలిగినారని క్రిష్టియన్ డేవిడ్ తెలిపినాడు.

"కానీ, చర్చి మిషనరీ ఆఫ్ సొసైటీకి చెందిన రేనియస్ మాత్రం భిన్నమైన ఆలోచనలను వ్యక్తీకరించినాడు. ఈ భావాలే అనేకమంది యువ మత ప్రచారకులలో ప్రాశస్త్యాన్ని పొందినాయి. నేను తెలిపినట్టుగానే ఎంత నామ మాత్రపు సామాజిక అంశమైనా కూడా 'పూర్తి కుల నిర్మూలన' అవశ్యమైనదని రేనియస్ తెలిపినాడు. కుల విస్మరణ క్రైస్తవ చర్చిలోని ప్రవేశానికి కావలసిన మూలమైన ప్రాతిపదికయని, పూర్వ మిషనరీలు అవలంబిస్తున్న వైఖరిని దుయ్యబట్టి అవి "పవిత్ర గాస్పెల్‌ను భ్రష్టు పట్టించే" శక్తులుగా రేనియస్ తెలిపినాడు.

"అందరు మత ప్రబోధకుల్లోనూ, క్రిష్టియన్ డేవిడ్ పశ్చాత్తాపాన్ని ప్రకటించినాడు. ఆయన మున్ముందుగా ఉన్న క్రిష్టియన్ స్క్వార్ట్జ్ సిద్ధాంతాలకు డేవిడ్ సహజంగానే ప్రభావితుడై మెత్తని సలహా, కనీస జోక్యం అనేకయువ మత ప్రచారకుల మనస్సును ఒప్పింప చేస్తుందని భావించాడు. వారిలో గొప్ప సహన శీలతకు, క్షమాగుణానికి ఈ రకమైన సహన దృష్టి పని చేస్తుందని భావించాడు. చాలా సహజంగానూ, ప్రయత్న పూర్వకంగానూ హేబర్ స్వభావం సహజంగానే గత మిషనరీలు పాటించిన అంగీకార దృక్పథాన్ని అవలంబిచేట్లు చేసింది. కానీ, పూర్తి సమాచారం సేకరించే దాకా, క్షేత్రం నుండి లభ్యమయ్యే నిష్పాక్షిక అంచనా లభ్యమయ్యే దాకా అంతిమ నిర్ణయాన్ని

తీసుకోవడాన్ని వాయిదా వేసేవాడు. ఆయన దక్షిణ భారత దేశాన్ని పర్యటించే కార్యక్రమం ముందు క్రిష్టియన్ నాలెడ్జ్ సొసైటీ తరపున 'కులాన్ని' ఒక అంశంగా అధ్యయనం చేయడానికి, ఒక సెలెక్షన్ కమిటీ నియామకం చేసినాడు. రెవరెండ్ డి. స్కెరివాగల్‌కు రాసిన ఉత్తరంలో ఉటంకించిన ప్రశ్నలను పరిశీలిస్తే కులం అంశం పై ఈయన అభిప్రాయాలను అర్థం చేసుకోవచ్చు. కోస్తా ప్రాంతంలోని క్రైస్తవుల మధ్య 'కుల ప్రభావం' కొనసాగుతుందని, ఒక సంస్థగా కులం వాస్తవంలో క్రైస్తవ దేశాలలో కొనసాగే సామాజిక మినహాయింపు వాదనకి సమీపంగా ఉండే లక్షణమని, యూరోపులో కులం లాంటిదేదీ లేదా? అమెరికాలో కులం లాంటిదివీదీ లేదు? మన ఆంగ్ల చర్చిలలో ఇప్పటికీ ఉన్నత వర్గం వారు, దిగువ వర్గం వారు వేర్వేరుగా కూర్చోవడం ఉందా లేదా? బాగా వస్త్ర ధారణ చేసుకొన్న వారు ముమ్మందుగా ప్రభు ప్రార్థనకు చర్చిలలో సంసిద్ధం కారా? ఉన్నత స్థాయి, దిగువ స్థాయి వారు ఒకే దగ్గర కూర్చొని భుజించగలరా? వారి పిల్లలు ఒకే పాఠశాలలో చదువుగలరా? అన్ని నాగరక దేశాలలో కూడా తేడాలతో కూడుకొన్న విభాజ్య సంస్థలు, కుల మాదిరి తేడాలు కన్పించవా? స్పానిష్ దేశస్థుడు తన కులాన్ని తెల్పే విధంగా వస్త్ర ధారణ శైలి ఉండదా? సంపన్నుడైన మూలాటో, పేదరికపు శ్వేత ములాటోకు స్నేహ పాత్రతకు అర్హమవుతాడా? ఏదైనా ఒక అంశానికి సంబంధించిన పూర్తి సారూప్యత వేరొక అంశంలో కనిపించదు. దేవుని దృష్టిలో ప్రజలందరూ సమానులేనన్న క్రైస్తవ సూత్రం అభినందించదగ్గది. కానీ అదే స్థాయిలో ఖచ్చితమైన వాస్తవం ఏమిటంటే మానవుని దృష్టిలో అందరూ సమానులు కారు. అంతేకాక దేవుడు, మనుషులందరూ సమానులుగా ఉండటాన్ని ఉద్దేశ పడ్డాడన్నది కూడా ఒక స్వచ్ఛమైన ఊహ మాత్రమే. సమాజ తేడాలు అన్ని చోట్లా ఉన్నాయి. ఇంకా వాదిస్తే,బ్రిటిష్ దృష్టిలో దక్షిణ ఇండియాలోని క్రైస్తవుల మధ్య కొనసాగుతున్న తేడాలు సామాజికమే. అటువంటప్పుడు భిన్న మానవుల వర్గాలలో లేని 'సమానత్వ సూత్రాన్ని' అమలు పరిచే ప్రయత్నాల వల్ల చేపట్టిన మతాంతరీకరణ చర్యలు భంగపడడం సమంజసమేనా?

" బిషప్ హెబర్ తన సమంజసమైన ఆలోచనతో ముందే ఒక అంశాన్ని తెలిపినాడు. క్రైస్తవ మత లక్ష్యం కోసం తాను ఆధునికుడుగా పని చెయ్యాలని నిర్ణయించుకున్నానని, పేరుకొని పోతున్న అమితోత్సాహపు స్వభావాన్ని కనిష్టీకరించి సంయమన రీతిలో వ్యవహరించే ఏ ముఖ్య మిషనరీ సాధించినట్లే లక్ష్యాల్ని సాధించగలమని భావించాడు.

అటువంటి దృష్టితోనే క్రొత్త సీసాలో పాత సారా నింపడాన్ని వ్యతిరేకిస్తున్న వారివైపు తన అధికారాన్ని, ఆమోదాన్ని తెలిపినాడు."

ఇదే అభిప్రాయాన్ని 1841లో భారత దేశంలోని మచిలీపట్నంలో చర్చి ఆఫ్ ఇంగ్లాండ్ మిషన్ వర్క్సు తరపున వచ్చిన ప్రొటెస్టెంట్ మిషనరీ రెవరెండ్ రాబర్ట్ నోబుల్ వ్యక్తపరిచాడు. కావాలనుకునే ఒక పద్ధతి ప్రకారంగా మిషనరీ స్థాపించిన పాఠశాలలో పరియాల, పాకీ పనివారల, చర్మకారుల కుటుంబాల వారిని మినహాయించినాడు. పాఠశాలల్లో కుల ప్రవృత్తిని ప్రవేశ పెడ్తున్నారన్న అభిశంసనకు ఈ క్రింది విధంగా జవాబిచ్చాడు. 'అతి దయార్ద్రమైన, మర్యాదపూర్వకమైన ఇంగ్లాండు తల్లి దండ్రులు కూడా తమ కొడుకులను, బిడ్డలను, తమ సేవకుల బిడ్డలతో పాటుగా విద్యనేర్పించడానికి ఇష్టపడరు. నిజానికి గ్రామంలో ఉన్న పిల్లలతో ఆడుకోవడానికి నేను అప్పుడప్పుడూ దొంతనంగా పోయిన నేరానికి తరుచుగా నా తండ్రిచే శిక్షింపడేవాడిని. ఉన్నతంగా శిక్షణ గరప బడ్డ క్రైస్తవ కుటుంబాలలోని పిల్లలు సేవకుల పిల్లలతో కలిసి మాట్లాడటాన్ని వారు ఎప్పుడూ కూడా అనుమతించేవారు కారు. నా తల్లి తండ్రులు సేవకుల పిల్లలతో కలిసి తిరగడాన్ని అనుమతించేవారు కారు. అట్లాగే, పవిత్ర క్రైస్తవ బోధనలను ప్రబోధించేటప్పుడు విధిగా పరియా, ఊడ్చే వారితో పాటుగా బ్రాహ్మణులు కూడా కూర్చోవాలన్న షరతు నామట్టుకు నాకు అర్థం లేనిది గానూ, క్రైస్తవేతర మైనదిగానూ అనిపిస్తుంది"

హేబర్ కాలం నాటి నుండి కూడా వివేచనా పరులైన క్రైస్తవులనేకులు హేబర్ అనుసరించిన వైఖరి మొత్తంగా తప్పుగా భావించేవారు. తదనంతర కాలంలో బిషప్ విల్సన్ ఒకప్పటి తన పూర్వ నిర్ణయానికి భిన్నమైన వైఖరితో కులపరమైన అసమానతలపై సహన దృష్టిని అవలంబించడాన్ని వ్యతిరేకించాడు. దానికి కారణంగా కులం హిందూమతంలో అంతర్లీనమైన భాగమని తెలిపినాడు. కులంపైన ఉన్న ఈ దృక్పథమే భారత దేశ క్రైస్తవంలో ప్రొటెస్టెంట్ మిషన్స్‌కున్న అధికారపరమైన,సాధారణమైన అవగాహనగా కొనసాగుతూ వచ్చింది.[18]

ఈ విధంగా అన్ని మిషనరీలు క్రైస్తవాన్ని వ్యాప్తిచెందే విధంగా సరళ తరం చేయాలని అంగీకరించాయి. ఈ అంశంపైన కాథలిక్కులు లూతరన్స్ లేదా ప్రొటెస్టెంట్స్ మధ్య తేడా ఉంది. ఈ తేడా డిగ్రీలలోనే ఉంది. మతాంతీకరణ చేసుకున్న క్రైస్తవులలో

కులం దాని రూపాల ఉనికి ఉన్నదంటే అది క్రైస్తవాన్ని సరళతరం చేసి వ్యాపింపచేయాలన్న విధానంలోనే ఉన్నది. ఈ విధానాన్ని అవలంబించడం వల్ల వచ్చే పరిణామాలను క్రైస్తవ మిషనరీలు ఊహించలేదు. "కులాన్ని తొలగించలేని క్రైస్తవం వల్ల హిందువుకు ఒరిగిందేమిటి?" అనే ప్రశ్న ఒకనాడైనా ఎదురవుతుందనే విషయాన్ని మిషనరీలు విస్మరించాయి. వారు తమ లక్ష్యాన్ని ఒకరిని క్రైస్తవుడిగా చేర్చినందువల్ల క్రీస్తు అనుసరికుడవుతాడని తప్పుగా అర్థం చేసుకున్నారు.

## V

ఈ ప్రశ్నలోఇమిడి ఉన్న రెండవ భాగాన్ని తీసుకుని పరిశీలిద్దాం. క్రైస్తవమతం అస్పృశ్యులుగా పుట్టిన వారి బాధను, పీడనను తొలగించడంలో సాధకంగా పనిచేసిందా? అస్పృశ్యులెవరైనా క్రైస్తవంలోకి మారిన పిదప పబ్లిక్ బావినుండి నీళ్ళు తోడుకుంటున్నారా? లేదా తమ పిల్లలను పబ్లిక్ పాఠశాలల్లో చేర్పించగలిగినారా? హోటల్‌లో ప్రవేశించగలిగారా? ఏ వివక్షతా లేకుండా ప్రభుత్వ కార్యాలయాల్లో ప్రవేశించగలరా? సవర్ణులతో ఒకే ఇంట్లో ఉండడం కానీ, గ్రామంలో నడిబొడ్డున నివాస చేసుకొని జీవించగలడా? అస్పృశ్యుల నుండి సవర్ణ హిందువులు నీరు త్రాగుతారా? కలసి తింటారా? అస్పృశ్యుణ్ణి తాకితే స్నానం చేయకుండా ఉంటారా? ఆ ప్రశ్నలన్నింటికి సమాధానం కాదనేది ఉంటుందని నా ఖచ్చితమైన అభిప్రాయం. మరో మాటలో చెప్పాలంటే మతాంతరీకరణ అంటరాని వారి జీవితంలో ఏ విధమైన సమాజ మార్పును తీసుకు రాలేదు. సాధారణ హిందూ ప్రజానీకుల దృష్టిలో క్రైస్తవం పుచ్చుకున్న వారైనా అస్పృశ్యులు గానే మిగిలిపోతారు.

మతాంతరీకరణ చెందిన అంటరానివారి సామాజిక హోదాను క్రైస్తవం ఎందుకు పెంచలేకపోయింది? ఈ వైఫల్యానికి కారణాలు ఏమిటి? నేనిచ్చే కారణాలు ఈ సమస్యపైన స్పందించే వారందరికీ అంగీకారంగా ఉండకపోవచ్చు. అయినప్పటికీ, ఏ మేరకు వీటి విలువ ఉన్నా నేను తెలుపదలుచుకున్నాను. నా అభిప్రాయాలు తెలుసుకొని అభినందించాలంటే ఒకటి మాత్రం స్పష్టం. మతాంతరీకరణ చెందిన వారి సమాజ హోదాలో మార్పు మరో రెండు విధాల మార్పుల ఫలితంగా ఉంటుంది. ఒకటి హిందువుల స్వభావంలో మార్పు రావాలి. రెండవది మతాంతరీకరణ చెందిన వారి మనో దృక్పథంలో మార్పు రావాలి. హోదా ఇరువైపులకు సంబంధించినటువంటిది. ఇద్దరు

వ్యక్తుల అంతరంగ స్వభావానికి కట్టుబడి ఉండేది. ఒక్కొక్కరు తమ గత అవగాహన స్థితి నుండి మారితే తప్ప మార్పుకు అవకాశం లేదు. క్రైస్తవ వ్యాప్తికి సమాధానాల్ని వెదుక్కోవటంలోనే అస్పృశ్యత నుండి క్రైస్తవులుగా మారిన వారి స్థితిగతులు మారక పోవడానికి హెూదా పెరగక పోవడానికి? గల పరిస్థితులను అవగాహన చేసుకోవచ్చు.

ఈ ప్రశ్న వివిధ దశలుగా ఆలోచిద్దాం. హిందువులు ఉన్నత దిశగా చేరుకోవటానికి క్రైస్తవం ఏం చేసింది? ఏం చేసినట్లుగా నాకు దాఖలాలు లేవు. ఎంతసేపూ వారు ఏదో ఒక అద్భుతాన్ని సాధించడమనే భావనలో ఉన్నట్లుగానే అనిపిస్తుంది. ఒక భావనలో ఉన్న విశ్వాసం, కార్యాన్ని అనుగుణ్యంగా చేపట్టడంను డ్యూక్ ఆఫ్ ఆర్గిల్ చక్కగా చెప్పినాడు![19]

"ఇంతకన్నా శక్తివంతమైన సంస్కరణ పద్ధతి ఇంకొకటి ఏమీ లేదు. ఒక తప్పుడు నీతిబాహ్యమైన వ్యవస్థ వెంట స్వార్థపూర్వకమైన ఒక భావనను జోడిస్తాం. అప్పుడు దానంతట ఆవిశ్వాసాలే ఏరకమైన భావనను ముందుంచుతాయి? ఈ విధంగా ఏ విధమైన ప్రత్యక్ష దాడికి పూనుకోకుండానే దైవికాచార ప్రాచీన ప్రపంచపు శాపంగా ఉన్న బానిసత్వాన్ని తుదముట్టించింది".

ఈ పరిశీలనకున్న ప్రాముఖ్యత ఎలా ఉన్నా ఆర్గిల్ అభిప్రాయంతో చరిత్రానుభవం ఏకీభవించదు. ఎందుకంటే, రోమన్ సామ్రాజ్యంలో బానిసత్వం క్రైస్తవ మతం వల్లనే నశించిందా? అనే ప్రశ్న వస్తుంది. కనుక, క్రైస్తవం ఒక సంప్రాగత ఏర్పాటుగా వందల సంవత్సరాలుగా యూరోపులో కొనసాగిన పిదప కూడా బానిస వ్యవస్థ కూడా సమాంతరంగా కొనసాగుతూ వచ్చింది. అమెరికాలో నీగ్రోల బానిసత్వాన్ని నిర్మూలించడానికి క్రైస్తవం మాత్రమే సరిపోదు. క్రైస్తవుల చేత తిరస్కరించబడిన స్వేచ్ఛను నీగ్రోలు పొందడానికి అంతర్యుద్ధం రావాలి.

అందువల్ల ఒక భావనను ప్రవేశపెట్టి అది అద్భుతాలు సృష్టిస్తుందని గాలికి వదిలేసిన స్వక్రైస్తవమత ప్రచారకులే అస్పృశ్యులు అస్పృశ్యులుగా కొనసాగడానికి కారణం. దీనికి ఏ క్రైస్తవ మత విశ్వాసాన్ని ఆచరించినా స్థితి ఏకరూపమే. ఈ ప్రశ్నకు సంబంధించిన మరో భాగంపై దృష్టిని సారించాలి. క్రైస్తవం అస్పృశ్యులు ఎదగడానికి ఉపకరిస్తుందా? అం సమాధానం 'లేదు' అని చెప్పాల్సి ఉంటుంది. క్రైస్తవ మత ప్రచారం అస్పృశ్యులకు

సంబంధించి నిజమైన సంస్కరణల కన్నా క్రైస్తవ సమాజ విలువలను పెంచడంలోనే ఎక్కువగా దృష్టిని కేంద్రీకరించింది. క్రైస్తవ మతాన్ని శుద్ధ ఆధ్యాత్మికమైనదిగా గుర్తించి అస్పృశ్యులు సహకరించాలని క్రైస్తవులు కోరుకుంటారు. క్రైస్తవులు పరులను ప్రేమించాలన్న కట్టుబాటు విలువ ఇటువంటిది. ఆధ్యాత్మిక జీవితం సమాజపు భావనలలో వ్యక్తమౌతుందని భావించి అక్కడే ఆగిపోతే భౌతిక జీవన సత్యాలతో సంబంధం లేకపోతే క్రైస్తవం నా దృష్టిలో కేవలం బోలు సిద్ధాంతంగా పరిగణించబడుతుంది. తప్పిదస్తుడుగా వ్యవహరించే వ్యక్తిని మంచిగా ఉండాలని నిత్యం దైనందినంగా తెల్పే ప్రబోధకత వల్ల ఏమి ప్రయోజనం? ప్రబోధం తప్పుచేస్తున్న వాడిని మంచిగా వ్యవహరించే విధంగా మలిచేందుకు కావలసిన కార్యాచరణ లేకుంటే ? అస్పృశ్యులు క్రైస్తవాని స్వీకరించిన పిమ్మట కూడా వెంటాడుతున్న అన్యాయాలను నిలకడగా ఎదిరించాలనే దృష్టితో క్రైస్తవ మిషనరీలు ఎప్పుడూ ఆలోచించలేదు. అస్పృశ్యులను సమాజ పరంగా ఉద్ధరించాలనే ఆలోచనపై మిషనరీలకు ఏర్పడిన నిష్క్రియా వర్తనం విచారకరమైనది. మరింత తీవ్రంగా బాధించే అంశం ఏమిటంటే అస్పృశ్యతా వ్యతిరేక ఉద్యమం క్రైస్తవ మతాంతరీకరణ చెందని వారినుండే అధికంగా రావడం అసాధారణ విషయం. క్రైస్తవంలోకి మారిన వారు సమావేశాల్లో పాల్గొనడం కానీ, సమాజ సమస్యల పట్ల స్పందించడం కానీ నేను ఏనాడూ చూడలేదు. వారికి సమస్యలు ఉన్నాయనేది స్పష్టం.దానిపై స్పందించి ఉద్యమాలు నడపగలిగే వారు కూడా ఉన్నారనేది స్పష్టం. అయితే మరి ఎందుకు వారి సమస్యలను తీర్చుకోవాటానికి ఏ ఉద్యమం కూడా రాలేకపోయింది.

క్రైస్తవ అస్పృశ్యులు ఉద్యమాన్ని నిర్మించలేక పోవడానికి మూడు కారణాలను చూపించవచ్చు.

మొదటి కారణం క్రైస్తవ విద్యావంతులలో తమ కమ్యూనిటీ సమస్యల పట్ల స్పందించి పోరాడే కోరిక లేకపోవడం. క్రిష్టియన్ విద్యావంతులతో వర్గానికి, వాటి ప్రజానీకానికి సంబంధం లేకుండా పోయింది. క్రైస్తవ కమ్యూనిటీ కొన్ని సందర్భాల్లో అంటరాని,సవర్ణ క్రైస్తవులుగా మిగిలారు. అన్ని సందర్భాలలో ఉన్నత దిగువ వర్గాలుగా చీలిపోయారు. క్రైస్తవులలో విద్యావంత వర్గం ఎక్కువ శాతం సవర్ణ హిందువుల నుండి వచ్చినవారే. భిన్న పూరవ్వరంగం నుండి రావడం వల్ల దిగువ వర్గ క్రైస్తవుల కోరికలను,

అవసరాలను, బాధలను పట్టించుకోలేని స్థితికి చేరుకున్నారు. అందువల్ల, అంటరాని క్రైస్తవులు నాయకత్వ లేమితో ఉండడం వల్ల తమ సమస్యలను తాము తీర్చుకోలేకపోతున్నారు. అస్పృశ్య క్రైస్తవులలో ఉద్యమం రాకపోవడానికి గల రెండవ కారణం వీరి మానసిక స్థితి.ఈ మానసిక స్థితి. వల్ల పూర్వ సంబంధాలను తెంచుకోవాలనే ఆరాటం, తపన ఉండదు. ఈ తపన ఉండకపోవటానికి గల కారణం ఏమిటి ? దీనికి రెండు కారణాలు ఉన్నాయనుకుంటాను. ఒకటి క్రైస్తవుడిగా మారేముందున్న స్థితిగతులు. ఒక అంటరాని వ్యక్తి బైబిలు బోధనకు ఇష్టపడి క్రైస్తవుడు అవుతాడు. అంతేకాని, హిందూమత బోధనల పట్ల అయిష్టత పెరిగి క్రైస్తవులుగా మారడం కనిపించదు. ఫలితంగా, తనకున్న పూర్వ ఆలోచనలకు క్రైస్తవం అదనపు విశ్వాస పరిధిగా మారుతుంది. పూర్వ విశ్వాసానికి క్రైస్తవం ప్రత్యామ్నాయ విశ్వాసంగా మారదు. రెండింటిని ఇష్టపడతాడు. ఆయా సందర్భాలలో వాటిని సరైన రీతిలోనే పాటిస్తాడు.

మరొక కారణం ఏమిటంటే క్రైస్తవులలో ఉద్యమ తపన నశించింది. మనిషి అంతం పాపం వల్ల జరుగుతుందని, క్రైస్తవునిగా మారినందువల్ల ఆయా పాపాలు క్షమింపబడతాయని మత ప్రబోధంలో ఇమిడి ఉంటుంది. ధార్మిక, మతపరమైన పునాదులు ఏమైనా మానవుడికి సామాజిక దృక్పథంలో ఈ మతధోరణి దారుణ సంక్షోభాన్ని సృష్టిస్తుంది. మనిషికి సమాజ దృక్పథం ఉండడమే సరైనది. క్రైస్తవ దృక్పథం మనిషిని ప్రక్కదారి పట్టిస్తుంది. ఇదే క్రమం ఖచ్చితంగా అస్పృశ్య క్రైస్తవులకు జరిగింది. తన అంతానికి మూలం పాపం అనే బదులుగా అస్పృశ్య క్రైస్తవుడి చుట్టూ ఉన్న సమాజ మత పరిసరాలే కారణమని తెలిపి వాటిని మార్చడానికి, వాటిపైకి దాడికి పూనుకోవాలని తెలిపితే బాగుండేది. ఫలితంగా అంటరాని క్రైస్తవులు తన చుట్టూ ఉన్న పరిసరాలను మార్చుకోవడానికి సంబంధించిన సంకల్పం వృద్ధి చెందడానికి బదులుగా, దాని వల్ల ప్రయోజనం లేదనే. మత ప్రచారం వల్ల అస్పృశ్యక్రైస్తవులను చల్లబ చుస్తుంది. తన అంతానికి ఎవరో అంతుబట్టని పూర్వీకులు అయిన ఆడమ్ చేసిన పాప ఫలితాల్ని అనుభవించాలనే విషయాన్ని అస్పృశ్య క్రైస్తవులకు ఉద్బోధిస్తారు. ఏదైనా అంటరాని క్రైస్తవుడు తప్పించుకోలేడు. అందువల్ల మత మార్పిడి "క్రొత్త జీవితానికి నాందీయా ? కాక పాత జీవన పద్ధతులకు మళ్లీ నెట్టడమా ?" అనే ప్రశ్నలు పలుమార్లు ప్రశ్నించుకో తగ్గవి.

# VI

భారత దేశంలో క్రైస్తవ సమూహం పరిగణనలో ఉండేదేనా ? దేశ వ్యవహారాలు సర్దుబాటుచేయడంలో దానికున్న పాత్ర ప్రాముఖ్యత ఏమిటి? నిస్సందేహంగా క్రైస్తవ సమూహం దేశంలో విద్యావంతులు, జ్ఞానులతో కూడుకొన్నటువంటిది. కేవలం అక్షరాస్యత శాతంలోనే కాక డాక్టర్లు, యూనివర్సిటీ పట్టభద్రుల సంఖ్య విషయంలో కూడా మరే ఇతర మతాలకన్నా క్రైస్తవంలోనే ఎక్కువ ఉన్నారు. కేవలం పురుషులు విద్యావంతులవడం కాదు, విద్యావంతులైన స్త్రీలు కూడా ఉన్నారు. ఇంత జ్ఞానం, విద్యావంతమైనటువంటిది క్రైస్తవం ఒక సమూహంగా దేశ వ్యవహారాలను నిర్ణయించడంలో అతి చిన్న పాత్రను పోషిస్తున్నది. ఈ అభిప్రాయంపై అంగీకారం ఉండవచ్చు. కానీ స్థూలంగా అధ్యయనం చేసిన తర్వాత వచ్చిన ధృవీకరణ ఇది. నా వ్యతిరేకులు నేను తప్పుడు అంచనా వేసానని, చిత్రీకరిస్తున్నారని అనవచ్చు. కానీ నా అభిప్రాయాలలో భాగం పంచుకునే వాళ్ళు కూడా ఉన్నారు. ఈ సందర్భంలోనే యంగ్ ఇండియాలో వచ్చిన రెండు ఉత్తరాలను ప్రస్తావిస్తాను.

మొదటి ఉత్తరం గాంధీకి ఒక భారతీయ క్రైస్తవుడైనటువంటి వాడు రాసిన ఉత్తరం 'యంగ్ ఇండియా'లో ఆగస్టు 25న,1921లో ప్రచురితమైంది. ఆయన ఈ విధంగా తెలుపుతాడు.

"మీరు భారతీయ క్రైస్తవులను భారత దేశ ప్రజలుగా గుర్తిస్తున్నట్లు లేదు. చాలాసార్లు యంగ్ ఇండియా ముస్లింలను, సిక్కులను, హిందువులను ప్రస్తావిస్తుంది. కానీ క్రైస్తవ పేరును ప్రస్తావించకుండా విస్మరిస్తుంది. ఈ విషయాన్ని చెప్పవలసి వచ్చినందుకు విచారిస్తున్నాను"

"........ భారతీయ క్రైస్తవులు దేశ ప్రజల్లో ఒక భాగం. దేశ వ్యవహారాల్లో తప్పనిసరిగా వారు భాగం పంచుకుంటున్నారు. ఇదే విషయాన్ని మీరు గమనించాలని కోరుతున్నారు." ఈఉత్తరంపై గాంధీ ఇలా వ్యాఖ్యానించాడు.

'ఈ లేఖ రాసిన ప్రతినిధికి, ఇతర భారతీయ క్రైస్తవులందరికీ చెప్పాల్సిందేమిటంటే సహాయ నిరాకరణ కొన్ని వర్గాల, వర్ణాలకు పరిమితమై లేదు. అందర్ని ఆహ్వానిస్తుంది.

తనలో భాగంగా చేర్చుకుంటుంది. చాలా మంది భారతీయ క్రైస్తవులు తిలక్‌స్వరాజ్ నిధికి ధనాన్ని పంపినారు. కొంత మంది ప్రముఖ భారతీయ క్రైస్తవులు సహాయ నిరాకరణలో అగ్రశ్రేణిలో ఉన్నారు. హిందూ ముస్లింల ప్రస్తావన పదే పదే రావడానికి వారు పరస్పరం గతంలో శత్రువులుగా పరిగణించుకోవడం."

నిజానికి భారతీయ క్రైస్తవులు తిలక్ నిధికి దోహద పడ్డారా లేక కొంతమంది అగ్రశ్రేణి భాగం నిరాకరణోద్యమానికి, స్వరాజ్ నిధికి నిరాదరణ చూపినారా అన్నది చర్చనీయాంశంగా వున్నా గాంధీ ఇచ్చిన సమాధానం అసమంజసంగానూ, ప్రక్కదారి పట్టించేదిగానూ వున్నది. హిందువులను శత్రువులుగా చూస్తున్నారని ముస్లింలను ప్రస్తావిస్తే సిక్కులను ఎందుకు ప్రస్తావించినట్లు? సిక్కులు హిందువులను శత్రువులుగా చూడలేదు. అంతేగాక సిక్కులను స్వరాజ్య ఉద్యమంలో ముఖ్యమైన మిత్రభాగంగా గుర్తించడం వల్ల ఈ ప్రత్యేక దృష్టి వుంది. అయితే సిక్కుల సహకారం కూడా ఏ షరతులు లేకుండా ఇచ్చినటువంటిది కాదు.[20] ఒక్క షరతు ఏమిటంటే జాతీయ పతాకంలో సిక్కుల కిష్టమైన నలుపు వర్ణాన్ని ఉంచాలని సిక్కులు డిమాండ్ చేసినారు. రెండవ డిమాండ్ చట్టసభలలో శాసన ప్రాతినిధ్యం కాంగ్రెసు తరపున కావాలి. సిక్కులను బుజ్జగించినారనేది స్పష్టం. క్రైస్తవులను కనీసం ప్రస్తావన కూడా చెయ్యలేదు కదా. వీరి ప్రస్తావన లేక పోవడానికి రెండు కారణాలు ఉన్నాయి. స్వరాజ్ ఉద్యమంలో కాంగ్రెసే వెంటవున్నా సంఖ్యాపరంగా చిన్న మైనారిటీ కనుక వారికి రావలసిన పాత్రను ఇవ్వలేక పోవచ్చు. అంతేగానీ వారు స్వరాజ్య ఉద్యమంలో కాంగ్రెస్‌తో లేరు అని చెప్పడంలో అర్థం లేదు. స్వరాజ్ పట్ల భారతీయ క్రైస్తవులు వ్యవహరించిన తీరుకు ప్రతిరూపంగా "ఇండియన్ సోషల్ రిఫార్మర్" అనే సంచిక సంపాదకునికి రాసిన ఉత్తరం సాక్ష్యవసరుగా మిగులుతుంది.

"భారతదేశంలో రెండవ శతాబ్దం నాటికి క్రైస్తవ ఆవాసాలు వున్నట్లుగా సానుకూల ఆధారాలు వున్నాయి. అటువంటప్పుడు ఇస్లాం ఈ దేశానికి రాకముందే క్రైస్తవులు భారతదేశంలో వున్నారనుకోవడానికి ఆధారం లభించినప్పుడు భారతదేశ క్రైస్తవులకు సమానంగా అబ్బవలసిన భారత దేశ చరిత్ర, అపూర్వమైన ప్రాచీన వారసత్వం ఎందుకు అబ్బలేదు. హిందూ – ముస్లిం తోటి పౌరులవలే మాతృభూమి సామాజిక, రాజకీయస్రవంతిలో క్రైస్తవులు భాగంగా పరిగణించబడటం లేదు. ఆశించబడటం లేదు,

ఆహ్వానింపబడటం లేదు. వందేమాతర గీతంలో హిందువులు, ముస్లింలనే ఉద్దేశించి ఇచ్చిన సందేశం క్రైస్తవులను ఎందుకు దృష్టిలోకి తీసుకోలేదు?

"హిందువులు, ముస్లింలు,క్రైస్తవుల భావాలను శత్రుపూరితంగా కాకున్నా, పట్టీ పట్టనట్లుగా స్వీకరించడం ఒక వైపు కాగా, నానాటికి పెరుగుతున్న జాతీయ వాదం క్రైస్తవుణ్ణి ఏ విధంగా విస్మరించగలుగుతుంది? ఏ కారణాలవల్ల క్రైస్తవుడు నిస్సహాయ స్థితికి లోనై తన భావిభద్రత అగమ్యగోచర స్థితికి గురి అవుతున్నదనే అనుమానానికి ఎందుకు లోనవుతున్నాడు."?

జార్జ్ జోసెఫ్, కె.టి.పాల్, ఎస్.కె.దత్తాలను మినహాయిస్తే భారతీయ క్రైస్తవ సమూహం స్వరాజ్య ఉద్యమంలో పాల్గొన్న భాగస్వామ్యం క్రియాశీలక మైనదిగా లేదు. ఈ భావాన్ని ప్రతిబింబిస్తూ వచ్చిన ఉత్తరం కూడా ఒక రకంగా క్రైస్తవ కమ్యూనిటీ భావాలను తెల్పేటువంటిది కూడా. హిందువుల, ముస్లింల సరసన క్రైస్తవులను ఎందుకు ప్రస్తావించని కారణమేమిటో స్పష్టం. క్రైస్తవులు స్వరాజ్ వుద్యమానికి మిత్రులు కాకపోవడం వల్ల వారిని గురించి ప్రస్తావన జరగలేదన్నది నిజంకాదు. వీరు సంఖ్యాపరంగా ప్రభావితం చెయ్యలేని, పరిగణించదగ్గవారు కాకపోవడం వల్లనే. క్రైస్తవుల పేరు మిగతావారి సరసన ప్రస్తావించబడలేదు. ఈ విధంగా అత్యంత విద్యావంతులున్న మతానికి దేశ వ్యవహారాల ?రళిలో తగిన స్థానం లభించక పోవడం విచారకరమైన విషయం. ఈ స్థితికి కారణం వారి ల్పసంఖ్యాకత్వమే. ప్రజా జీవితంలో సంఖ్యాపరంగా హిందూ, ముస్లింలలాగా, అణగారిన ర్గాల మాదిరిగా లేకపోవడమే. అయితే, గుర్తింపు లేని తనానికి కేవలం సంఖ్యా ఆధిక్యత మాత్రమే కారణం కాదు. నాకు రెండు ప్రధాన కారణాలు కనిపిస్తున్నాయి. మొదటిది భారతదేశ క్రైస్తవవులు చాలా వరకు మిషనరీల ప్రాపకంలో నివసిస్తున్నారు. వారివిద్య, ఆరోగ్యం, ధార్మిక చర్యల విషయంలో అన్నింటా ప్రభుత్వం పై వారు ఆధారపడటం లేదు. మిషనరీ సంస్థలపై ఆధారపడుతారు. ప్రభుత్వం పైన ఆధారపడినట్లైతే తమలో తాము వారు సమీకరించుకోవడం, ఆందోళన చేయడం, సమర్థవంతమైన రాజకీయ చర్యలను చేపట్టడానికై వ్యవస్థీకరణ రూపాలను ఏర్పరచడం సాధ్యమయ్యేది. అటువంటి వ్యవస్థీకరణ లేకుండా ప్రభుత్వం వీరి అవసరాలను గుర్తించదు. వర్తమానంలో క్రైస్తవ కమ్యూనిటీ లేక పోవడం వల్ల ప్రజాజీవితంలో ఉండకుండా పొయ్యారు. ప్రజా జీవితంలో లేక పోవడంతో విశాల సమాజంలో స్థానం దక్కకుండా పొయ్యింది.

రెండవ కారణం భారతీయ క్రైస్తవ కమ్యూనిటీ సంఘీభావం లేని దానికన్నా కూడా ఒక రకంగా నిలకడగా సంబంధాలు లేని అసంయుక్తమైనది (Disjointed). ఒక్క సాధారణ ప్రేరణ నిచ్చే శక్తి మినహా అన్ని విషయాల్లోనూ వైవిధ్యమే ఎక్కువ. భారతీయ క్రైస్తవులు మిగతా భారతీయుల లాగా కులం, రంగు, వర్గం ఆధారాలుగా విభజింపబడినవారు. భాషా, కులం, తెగ తేడాలున్నా వాటిని అధిగమించగలిగి సంఘటిత పరిచే బలీయమైన మతంగా క్రైస్తవం రూపొందలేదు. దీనికి తోడుగా విభాజిత మతశాఖల మీదుగా కొనసాగే తేడా ఒకటి. ఫలితం, క్రైస్తవులు ఏ సాధారణ లక్ష్యం లేక చెల్లాచెదురుగా మిగిలిపోవడమే. ఒక తమిళ క్రైస్తవునికి, హిందూ తమిళునికి చాలా సాన్నిహిత్యం వుంటుంది. కానీ, అదే సాన్నిహిత్యం పంజాబ్ క్రిష్టియన్‌తో ఉండదు. ఉత్తర ప్రదేశ్‌లోని క్రైస్తవుడు ఆ ప్రాంతంలో హిందువు పట్ల సాన్నిహిత్యాన్ని అలవర్చుకుంటాడే కానీ, మహారాష్ట్ర నుంచి వచ్చిన క్రైస్తవునితో సంఘీభావం వుండదు. సంక్షిప్తంగా, 'భారతీయ క్రైస్తవుడు' అనే పదం గణాంకపరమైన ఉపమానం? ఫలితంగా, భారతీయ క్రైస్తవులలో సామూహిక స్ఫూర్తి లేకుండాపోయింది. ఒక సమూహాన్ని కలిపి ఉంచగలిగే చైతన్యానికి కావలసినవి ఏమీ లేకపోవడం వల్ల కమ్యూనిటీగా దానికి ఉనికి మిగలకుండా పోయింది.

క్రైస్తవ జీవిత విధానంలో బలహీనతలను ఎత్తిచూపిన విధాన్ని, వారిని ప్రభావితం చేస్తున్న మాలిన్యాలను తెలియపర్చేందుకు నేను చేసిన ప్రయత్నాన్ని భారతీయ క్రైస్తవులు ఎలా స్వీకరిస్తారో నాకు తెలియదు. ఒక్క విషయం స్పష్టం. క్రైస్తవం అనే అంశం నాకు ఆసక్తి ఉన్నటువంటిది. అనేకులు అస్పృశ్య కులాల నుండి ఇందులోకి ప్రవేశించిన వారు ఉండడమనేది నాకు ప్రత్యేక ఆసక్తి కలిగించిన ముఖ్య అంశం. నా వ్యాఖ్యలు మిత్రపూరితమైనవి. దురభిప్రాయంతో వ్యక్తీకరించిన అభిశంసనలు కావు. వారిలో వున్న బలహీనతలను ఎత్తి చూపినాను. వారు బలంగా ఎదగాలంటే వారి బలహీనతలను వారు అర్థం చేసుకోవాలి. రాబోయే ప్రమాదాల దృష్ట్యా వారు మరింత బలంగా మారవలసి వున్నది. భారతదేశ సమాజ నిర్మాణంలో భాగమై వున్న క్రైస్తవాన్ని పరిరక్షించుకునేందుకు గాంధీ అవలంబిస్తున్న పదునైన సునిశిత శత్రుదృష్టిని తట్టుకొని నిలబడి ఎదుర్కోవలసి వుంది. అట్లాగే భారత జాతీయ వాదంగా ముందుకొస్తున్న ఉధృత హిందూ వాదంతో క్రైస్తవులు తలపడాల్సి వుంది. క్రైస్తవానికి, క్రైస్తవులకు ఈ ఉధృత హిందూవాదం ఏమి చేయనుందో ఇటీవల బృందావన్‌లో జరిగిన ఘటనలే చెపుతాయి.

పేపర్ వార్తల ప్రకారం[22] ఒక హిందూ ప్రజల గుంపు వెళ్ళి మిషనరీ భవనాలను తగలబెట్టి, మళ్లీ నిర్మించినట్లయితే మళ్ళీ కాల్చివేస్తామని హెచ్చరిక చేసినారన్న విషయం తెలిసింది. ఇది ప్రక్కదారి పట్టిన కొంతమంది దేశాభిమానులు పాల్పడిన సంఘటన గావచ్చు లేదా క్రైస్తవులను, క్రైస్తవాన్ని వదలించుకోవడానికి హిందువులు ఆలోచిస్తున్న ప్రణాళికా రూపానికి మచ్చుతునక కూడా కావచ్చు. ఈ ఘటనల నీడలే మళ్లీ పునరావృతమైతే వాటిని ఎదుర్కొనడానికి యావత్ క్రైస్తవులు సిద్ధంగా వుండాలి. నేను (అంబేద్కర్) తెలిపిన బలహీనతలను అధిగమించకుండా వారు ఈ లక్ష్యం పట్ల ఎలా సంఘటితం కాగలరు? యావత్ క్రైస్తవులందరూ దీనిపై ఆలోచించాలి.

పాదసూచికలు :

1. "The Young men of India, Burma and Cylone" జూన్ 1928. Vol.XI, B.No.6 లో C.F. Andrews రాసిన "The Basis of Inter - Religious Fellowship".

2. Harijan, పేజీ 330, 1936

3. Ibid పేజీ 353

4. Ibid ఏప్రిల్, 1937. పేజీ 86

5. Ibid పేజీ 137

6. Ibid జూలై 18, 1936. పేజీ 178

7. Ibid 1936, పేజి 140-141

8. Ibid 1936, పేజి 360

9. Ibid ఫిబ్రవరి 8, 1936, పేజి 415.

10. Ibid ఆగస్టు 8, 1936.

11. ఇవి భారత దేశం, బర్మా సిలోన్‌ల మొత్తం వివరాలు.

12. ఇవి భారత దేశపు వివరాలు.

13. Krishna District Manual పేజి 282

14. Mayhem. "Christianity and the government of India " పేజి 51.

15. J.C. Marshman. "Life and Times of Carey". Marshmen and word Vol.I పేజి

16. Ibid పేజి 307

17. Krishna District Manual పేజి 282

18. అయితే అమెరికన్ ప్రొటెస్టెంటు మిషనరీలు దీనికి మినహాయింపు. 1847 జులైలో వారు ఈ తీర్మానం చేశారు: "ఈ మిషను కులాన్ని ఒక అన్యమతపు మౌలిక లక్షణంగా భావిస్తుంది. సరైన బోధన తరువాత దీనిని పూర్తిగా ఆచరణలో తిరస్కరించడం దైవభక్తికి సంతృప్తికరమైన చిహ్నంగా పరిగణిస్తుంది. సరియైన పరిస్థితులలో అన్ని కులాల క్రైస్తవులతోనూ కలిసి సహపంక్తి భోజనం చేసేందుకు సిద్ధపడడం కులాన్ని వదులుకోవడానికి ఒక కనీస అర్థం.

19. C.F. Andrews చే ఉటంకితం. పేజి 25.

20. Young India, ఆగస్టు 4, 1921

21. Young India, డిసెంబర్ 21, 1922

22. Indian Witness –

అనువాదం : డా. బి. జనార్ధన రావు

## గ్రంథసూచి

రచయిత ఈ సంపుటంలో ఉదహరించిన గ్రంథాలు, పత్రికలు, నివేదికలు, వార్తాపత్రికల క్రింద సూచించబడినవి. ప్రచురణకర్త, ప్రచురణ సంవత్సరం, మున్నగు వివరాలు Asiatic and the Bombay University గ్రంథాలయం నుండి కొంత మంది రచయితల వివరాలు సేకరించబడినవి మిగతా రచయితల వివరాలు లభ్యం కాలేదు.


Dubois, Abbe : *Hindu Manners, Customs and Ceremonie* Oxford, Clarendon Press, 1897.

Ambedkar, Dr. B. R. : *Annihilation of Caste*—1936.
*What Congress and Gandhi have done to th untouchables,* Thacker and Co. Bombay, 1945.

Andrews, C. F. : *The basis of Inter-Religious Fellowship* in 'Th young men of India, Burmah and Ceylon' June 1928, Vol. XI, No. 6.
*Christ and Labour.*

Baden Powell : *A Mannual of the Land Revenue Systems an land tenures af British India,* Calcutta, Government Press, 1882.

Barrow, R. H. : *Slavery in the Roman Empire.*

Bolton : *Gandhi in London*; Asia, New York, February 1932.

Bryce, James : *The Holy Roman Empire*, London, Macmillan 1913.

Bunsen, E. D. : *Mahomed's place in the Church*, Asiatic Quarterly Review, April 1889.

Crawley : *Tree of Life.*

Durkheim, Prof. : *Elementary forms of the Religious life*, London, George Allan and Unwin Ltd. 1915.

Elwood, Prof. Charles A. : *The Religious reconstruction,*
*Society in its psychological aspects, 1913*
Encyclopaedia Britanica, 11th Ed. Vol. XXVI.

Goulding, Louis : *The Jewish Problem*, Harmondsworth, Penguin Books, 1938.

Grote, George : *Plato and the other companions of Socrates*, 4 Vols, London, 1888.


•ఆంగ్ల గ్రంథంలో ఇచ్చిన గ్రంథసూచిక యథాతథంగా ఇవ్వడమైనది.

Hallam, Henry : *View of the State of Europe during the Middle Ages*, 9th Ed. 2 Vols., London, 1848.

Johnson, Charles C. : *The Negro in American Civilization.*

Jolly, Prof. : *Ausbreitung Der Indischen Fultur.*

Kane P. V. : *History of Dharma Shastra,*

Kaye, Mr. : *Christianity in India.*

Krishnammachariar, Mr M. : *History of Classical Sanskrit Literature*, Madras, Tirumalai-Tirupti Devsthanam Press, 1937.

Marshman J. C. : *Life and Times of Carey, Marshman and Ward*, 2 Vols. 1859.

Mayhew : *Christianity and the Government of India*, London, Longmans, 1938.

Max Muller : *On effects of Religion with Sacred Books Introduction to the Science of Religion*, London 1873.

McDougall William : *Introduction to Social Psychology* ed. 26, London, Methuen & Co. 1945.

Muir, J. : *Original Sanskrit Texts, 5 Vols.* London, Trubner & Co. 1873.

Negro Year Book : 1931-32.

Niebuhr, Reinhold Prof. : *Moral Man and Immoral Society, a study in ethies and politics* New York, Charles Ser bner's Sons 1932.

Ogilvie, Dr. J. N. : *Apostles of India*, London Baird Lectures, 1915.

Paton H. J. : *The Goodwill*, London, The Library of Philosophy, 1927.

Pattabhi Sitaramayya : *History of the Indian National Congress*, Madras, Working Committee of the Congress, 1935.

Seignobos, Charles : *History of Ancient Civilization*, London, 1937.

Sleeman, Sir W. H. : *Rambles and Recollections of an Indian Official*, 2 Vols. London 1915.

Smith, Mr. George : *The Conversion of India*, 1893

Smith, Robertson : *The Religion of the Semites.*

Strange, Sir Thomas : *Treatise on Hindu Law*, 2 Vols. Allen and Co., Lodnon, 1830.

Thorndyke, Prof. Edward L. : *Comparative Psychology*, 1934.

Thurston : *Tribes and Castes of Southern India*, 7 Vols. Madras, Government Press, 1909.

Tawney R. H. : *We mean freedom in what labour can do ?* London.

Winslow Mr. : *On Christianity in India.*

*Scriptures :*

Manu Smriti, Katyayan Smriti, Narada Smriti, Mahabharat, Ramayan, Vishnu Puran, Harivamsha, Koran, Bible.

*Journals* :

Adi Hindu of Lucknow, Arya Gazette of Lahor, Afzal, Bombay Samachar, Bharat Jyoti, Bombay Chronicle, Civil and Military Gazette of Lahore, The Congress of Delhi, Edimborough Review, Free Press Journal, Harijan, Hindu, Hindustan Times, Indian News Chronicle, The Independent of Allahabad, Jeewan, Milap, National Herald, Nation, Pratap, Prakash, Savadhan, Satyasamvad of Lahore, Samata from Bombay, Sangram, Statesman, Sunday Times, Tej of Delhi, Times of India, Young India.

Census Reports of 1881, 1891, 1901, 1911, 1921, 1931, 1951.

*Reports*

Report of Simon Commission.

Report of the Southborough Committee.

Report of the Indian Franchise Committee.

Report of the Indian Round Table Conferences.

Report of the Tamilnad Harijan Sevak Sangh for the year ending 30-9-1937.

U.P. Municipal Act II, 1916.

Madras—II Criminal Law Journal.

Madras Legislative Assembly Debates.

Punjab Municipal Act, 1911.

Indian Penal Code—Draft—Address by Law Commissioner to the Secretary of State.

Krishna District Manual.

Starte : Report on the grievances of the Depressed Classes and Aboriginal Tribes, 1929.

ఇటలీ దేశస్తులకంటె వీరు 37.5 మిలియన్లు ఎక్కువ. జర్మనీ జనాభా కంటె 13.5 మిలియన్లు, ఫ్రాన్సు దేశస్తులకంటె 371/2 మిలియన్లు ఎక్కువ. బెల్జియం జనాభా కంటె 10 రెట్లు, డెన్మార్క్ జనాభాకు యిరవై రెట్లు ఎక్కువ. ఈ దేశంలో అణగారిన మానవుల మొత్తం సంఖ్య బ్రహ్మాండమంత పెద్దది.

# III

కలతపెట్టే మరో విషయం ఏమిటంటే ఈ దురదృష్టమానవ జాతి ఉత్తమమైన నాగరికుల మధ్య జీవిస్తూ వారిపై ఆధారపడి ఉండగానే ఈ పరిస్థితి దాపురించింది. 79.5 మిలియన్ల ప్రజలను మానవత్వం లేకుండా అణగదొక్కి సాటివారినుండి వేరు చేసిన ఈ నాగరికత లోపభూయిష్టమైనదని నిష్పాక్షికదృష్టికల వారెవరైనా అంగీకరిస్తారు.

నాగరికత అనేది మానవుడు -ప్రకృతి, కళలు, వృత్తుల గురించిన జ్ఞానభాండాగారం. నాగరికత అనేది సాటివారి పట్ల మన ప్రవర్తనను తీర్చిదిద్దే నైతిక సూత్రాల, ఆచార వ్యవహారాల సాంఘిక స్మృతి. అంతేకాదు, నాగరికత అనేది పాలితుల హక్కులు, పాలకుల బాధ్యతల గురించి వివరించే పౌరశాస్త్రాలతో, ప్రకృతి, ప్రకృతికి బాహ్యమైన అతీత శక్తులకు సంబంధించిన మతశాస్త్రాలతో నిండివుంటుంది. అలాంటి నాగరికత మానవాళికి ఒక అపూరూపమైన కానుక. కాని సంపూర్ణంగా అభివృద్ధిచెందే అదృష్టం అన్ని జాతుల వారికీ లభించలేదు. చాలా జాతులు ఆదిలోనే హంసపాదు అన్నట్లు ఆగిపోయాయి. కొంతమంది రెండు, మూడు అడుగులు వేసి నిలబడిపోయారు. కొందరు ఉన్నచోటే నిలబడి భ్రమణాలు చేస్తారు. కొద్ది తరాల క్రింద కనుగొన్న ఆస్ట్రేలియా, పోలినేషియాలకు చెందిన ఆదిమజాతుల వారికి మాట్లాడటం, నిప్పు చేయటం మాత్రం తెలుసు. మధ్యరాతి యుగం నాటి అనాగరిక స్థితిని దాటి వారు ముందుకు పోలేదు. అలాగే హడ్సన్ బేకు చెందిన ఆలియా పాస్కస్ ఆదిమజాతివారు, కొలంబియా లోయలోని ఇండియన్లు విల్లుబాణాల దశనుండి ముందుకు పోలేదు. వారికి పాత్రల తయారీ, జంతువులను మచ్చిక చేసుకోవడం, ఇనుము పోతపోసి పనిముట్ల తయారీ గురించి ఏమీ తెలియదు. ఈజిప్టు, బాబిలోనియా, అస్సీరియా ఇంకా చెప్పాలంటే గ్రీక్, రోమ్ నాగరికతలు తమచుట్టూ తాము తిరిగాయి కాని ముందుకు సాగలేదు. అనాగరక స్థితిలోని మానవుని ఆలోచనలనూ, పద్ధతులనూ శ్రమపడి విస్తరించడం మాత్రమే ఈ ఈనాగరికతలు సాధించిన అభివృద్ధి అని

చెప్పవచ్చు. వారికి వారసత్వంగా లభించిన నాగరికత విప్లవాత్మకంగా రూపొందడానికి ఎవరూ సాయపడలేదు. వారి పూర్వీకుల మొరటు విధానాలకు కొంత సున్నితత్వం ఆపాదించడం మినహాయించి వారు సాధించింది ఏదీ లేదు. ఈ అభివృద్ధి దశలుకూడా త్వరతరగా ఒక దాని తరువాత ఒకటి లేవు. మానవుడు అనాగరక దశలో ఉండటానికి ముందు అనేక తరాలు ఆటవికుడుగా ఉన్నాడు అనేది నిర్వివాదాంశం. అలాగే నాగరికత ప్రారంభదశ చేరుకోవడానికి ముందు దీర్ఘకాలం పాటు కిరాతకుడుగా ఉన్నాడనేది నిస్సందేహమైన అంశం. ఈ యుగాల పరంపరకు ఎంత సమయం పట్టింది అనేది ఊహకందదు. ఇందుకు సాధ్యమైనంత తక్కువ ప్రమాణంగా ఒక లక్ష సంవత్సరాలు తీసుకోవచ్చును.

నాగరికత అనేది అంత తేలికగా లభించిన అభివృద్ధి కాదు. నాగరికత ప్రాణాధారమైంది. ఒక్క తరానికేకాక ముందు తరాలకు కూడా చెందింది. ఒక తరంలో సాధించిన జ్ఞానం ఆముందు తరానికి ఉపయోగిస్తుంది. ఈ సాంఘిక వారసత్వం లేనట్లయితే సాధించిన ప్రగతికి జీవం ఉండదు ఈ భూమిని "వెల్" తోకచుక్క ఢీకొని, భూమిమీద ప్రజలందరు తమ పూర్వీకుల ద్వారా సంక్రమించిన విజ్ఞానం, అలవాట్లు మర్చిపోయినట్లయితే (మనిషి కల్పనాశక్తి, స్మృతి, అలవాట్లు యధావిధిగా ఉన్నా) భూమిమీద నివసించే ప్రతి పది మందిలో తొమ్మిది మంది ఒక నెలలోపు, మిగిలిన వారిలో 99% ఆరు నెలల లోపు మరణిస్తారు. ఎందుకంటే వారి ఆలోచనలు వెలిబుచ్చడానికి వారికి భాష ఉండదు. కేవలం పదధ్యానం ఉంటుంది. వారు నోటీసులు చదువలేరు. కార్లు, గుర్రాలు నడుపలేరు. వారు సహజంగా కొద్దిమంది శక్తిమంతులైన వ్యక్తుల అరుపులకి, కేకలకి ప్రతిస్పందిస్తారు. దాహమైనపుడు వందల కొద్దీ నది ఒడ్డుకు వెళ్లి నీరు త్రాగబోయి మునిగిపోతారు. వారికి వస్త్రధారణ, వంట చేయటం, ప్రాణరక్షణ, జంతువుల మచ్చిక గురించి కనుగొనగలిగే శక్తి ఉండదు. వారంతా తిరిగి అనాగరక స్థితికి చేరుకుంటారు. పూర్వపు సామాజిక వారసత్వాన్ని కోల్పోయిన తరం వారు అనాది ఆటవిక జాతులవారివలె అడవిలో పళ్లు, కీటకాలను భక్షిస్తూ మరలా కొత్త సామాజిక వారసత్వాన్ని అలవరచుకొనే వరకు ఆ విధంగానే ప్రవర్తిస్తారు. ఇలా కొన్నివేల సంవత్సరాల అనంతరం వారు భాషా జ్ఞానం, జంతువులను మచ్చిక చేసుకోడం, వ్యవసాయం చేయడం గురించి కొంత అవగాహన

ఏర్పరచుకుంటారు. వారు మనం మతం అని పిలిచిన విధానాన్ని కానీ, దైనందిన జీవితంలో మనం వాడే తేలికపాటి యంత్ర పరిజ్ఞానాన్ని కానీ రాజకీయ దండయాత్రలను కానీ, సాధించుకోవచ్చు. లేక సాధించుకోలేకపోవచ్చు. వారికి చట్టం, స్వేచ్ఛ, న్యాయం అనే సాధారణ విషయాల గురించి ఏమీ తెలియకపోవచ్చు. కొంత తెలియవచ్చు. సాంఘిక వారసత్వంలో కనిపించే తేడా ఇదేకాని ఈ తేడా సామాన్యమైనదికాదు.

నాగరికత అనేది అందరికీ సంక్రమించే, లభించే విశేషాధికారం కాదు. నాగరికత కలిగిన కొందరు అదృష్టవంతులకు కూడా అది ఏకరీతిన నిదానమైన ఎదుగుదలతో, దీర్ఘమై విసుగు కలిగించే మజిలీలతో కూడుకొన్న వ్యవహారంలా అనిపిస్తుంది. నాగరికత తెలిసిన కొందరికి అది సహాయకారిగాకాక, అడ్డంకిగా నిలుస్తుందనేది నిజం. ఎందుకంటే కొన్నిసార్లు అది తప్పుత్రోవపట్టి ఉండవచ్చు. అసత్య విలువలపై, పునాదులపై నిర్మింపబడి ఉండవచ్చు. అటువంటి నాగరికత జాతిని చలన రహితం చేసి, మానవునిలో ఎదుగుదల లేకుండా చేస్తుంది. ఇటువంటి నాగరకత భారం మోసి, బందీ అయేకంటే అది లేకుండా ఉండటమే ఉత్తమం. దేశభక్తుడైన ప్రతి హిందువు తన హిందూలేక వైదిక నాగరికత ప్రపంచంలో చాలా పురాతనమైందని గర్వంగా చాటి చెప్పుకుంటాడు. ప్రతిహిందువూ అహంకారం మిళితమైన తీవ్ర స్వరంతో యావత్ప్రపంచంలో ప్రజలు అనాగరికులై, నగ్నంగా సంచరించే సమయంలో భారతదేశం అత్యున్నతమైన నాగరికతా శిఖరాలు చేరుకున్నదని పదేపదే చెప్పటం మనం వింటూ ఉంటాం. హిందునాగరికతలో అంతర్గతమైన శక్తి ఉంది కాబట్టి మిగిలిన ప్రాచీన నాగరికతలైన ఈజిప్టు, బాబిలోనియా, ...డియా, రోమ్, గ్రీకు మొదలైనవి అంతరించి పోయినా, హిందూ నాగరికత జీవించే ...ందని హిందువులు గర్వంగా భావిస్తారు. ఈ విధమైన అభిప్రాయం ఎంత న్యాయమైనదైనా ఒక ముఖ్యాంశాన్ని విస్మరిస్తోంది. నాగరికత ప్రాచీనమైనదా? లేక అనాది నుండి జీవించి ఉన్నదా? అన్నది కాదు ఇక్కడ ముఖ్యమైన ప్రశ్న.[4] ముఖ్యోద్దేశ్యమేమిటంటే ఆ నాగరికత యొక్క ప్రాముఖ్యమేమిటి? ఆ నాగరికత యింతకాలం జీవించి ఉన్నదంటే ఏ ఆధారంపై ఉంది? యింకా చెప్పాలంటే ఈ సామాజిక వారసత్వం హిందూమతానికి హితకారియా లేక భారమైందా? అనేది ముఖ్యమైన ప్రశ్న. ఈ నాగరికత తన వర్గాలకు, వ్యక్తులకు అందించిన మేలేమిటి? మనిషి-ప్రకృతికి సంబంధించిన జ్ఞానానికి హిందూధర్మం హిందూ నాగరికత అందించిందేమిటి? చాలా మంది దేశభక్తి పరాయణులైన హిందువులు మనిషి

ప్రకృతి గురించిన జ్ఞానం హిందూమతంతో మొదలైందని భావిస్తారు. ఆ శాస్త్రాల ప్రారంభ రూపాలు, మూల సూత్రాల దశ దాటి అభివృద్ధి చెందలేదని ఒప్పుకుంటారు. కానీ, ఏ హిందువైనా కూడా పాణిని, కాత్యాయనులతో పాటుగా వ్యాకరణ శాస్త్రం అంతరించి పోయిందంటే నమ్మగలడా? కపిలుడితో బాటుగా వేదాంత శాస్త్రం నిలిచిపోయిందా? వ్యాస, వాల్మీక్యాదుల కాలంనాటి సాహిత్యం విస్తరించకుండా ఆగిపోయిందంటే నమ్మగలరా? హిందువులు అధిభౌతికవాదంలో సంపూర్ణ శిఖరాలకు చేరుకున్నారని చెబుతారు. హిందూ ఆదిభౌతికవాదం గురించి ప్రొఫెసర్ హరదయాళ్ అన్నమాటలివి-[5]

"భారత దేశానికి అధిభౌతికవాదం ఒక శాపం. ఈ శాస్త్రం ఆదేశ చరిత్రను బలహీనపరిచింది. శైథిల్యానికి దారితీసింది. అది వ్యక్తులకు విషయ పరిగ్రాహక శక్తిని లోపింపచేసి, వర్తమానాన్ని పట్టించుకొనని దౌర్భాగ్యులుగా తయారు చేసింది. విమర్శనా ప్రయత్నాలను నిరుపయోగమైన మార్గాలకు మళ్లించింది. అనేక శతాబ్దాలుగా భారతీయ మేధావులను జీర్ణవస్త్రాలుగా మార్చింది. అది కుతర్కాన్ని ఒక కళగా మార్చింది. నిష్ఫలమైన ఆలోచనల్ని జ్ఞానానికి ప్రత్యామ్నాయంగా తయారు చేసింది. ఈ పంథాలో వందలాది సంవత్సరాలుగా భారత మేధావులను నిందార్హులుగా చేసింది. భారతీయ దార్శనికులను అంధులుగా చేసి, అభూత కల్పనలే వాస్తవాలని వారు భ్రమ పడేట్లు చేసింది. గర్వం, అహంభావంతో, వాక్చాతుర్యంతో కన్నులు కానక పదాడంబాన్ని వేద వాక్కుగా, అద్భుత శబ్దగోపురాలను, మాటలకోటలను అభేద్యమైన ఆలోచనా దుర్గాలుగా చలామణి చేసింది. ఉపనిషత్తులు తెలిస్తే అన్నీ తెలుసుకున్నట్టే అనే భావం ప్రచారంలోకి వచ్చింది.

"నిరపేక్షం (absolute) గురించిన మధ్యయుగాలనాటి అన్వేషణే విశిష్టమైన భారత అధిభౌతిక వాదానికి పునాది అయింది. ఈ గ్రంథాలన్నీ తెలివిహీనమైన వాదనలతో, అధ్వాన్నమైన ఆలోచనలతో, గజిబిజి ఊహలతో నిండి ఉన్నాయి. కాని అది నిరుపయోగమనే సత్యాన్ని మాత్రం మనం యింకా తెలుసుకోలేదు. "సమాధి" లేక పారవశ్యం ఆధ్యాత్మిక ప్రస్థానంలో చివరిమెట్టుగా భావించారు. తీవ్రమైన భావావేశంవల్లగాని, బలహీన మనస్కత వల్లగాని మనుషులు స్పృహతప్పుతుంటారు. కాని ఇలా స్పృహకోల్పోతే అదేదో జ్ఞాన సిద్ధి అని భావించడం చాలా చిత్రం! అందుకే స్త్రీలు చిన్న కారణానికి కూడా స్పృహతప్పడం జరుగుతుంది. కాని భారతదేశంలో సమాధి కేవలం పరమహంసలు

మాత్రమే చేరుకోగలిగే యోగశాస్త్రంలోని ఎనిమిదో దశవీరందరూ దేవతా స్వరూపులట! కృత్రిమమైన పద్ధతుల ద్వారా కలిగే అసాధారణమైన మానసిక స్థితికి చేరుకొని, దీనినే జ్ఞాన ప్రకాశం అని భావించడం భారతీయ తత్వవేత్తలకే చెల్లు."

విజ్ఞాన శాస్త్రం, కళలు, హస్తకళల రంగంలో హిందూ నాగరకత చాలా ఆదిమ స్థితిలో వుంది. నేత, నూలు వడకడం వంటి కొన్ని రంగాలలో మినహాయిస్తే, సాంకేతిక పరంగా హిందూ నాగరకత సాధించింది ఏమీలేదు. సాంకేతిక సామగ్రిని కనుగొనివుంటే అవి ప్రకృతితో మనిషి పడే ఘర్షణలో వుపకరణాలుగా ఉంటాయి. జంతుదశనుండి అభివృద్ధి సాధించడానికి పనికివస్తాయి. శాస్త్ర సాంకేతిక పరిజ్ఞాన రాహిత్యం వల్లనూ, తప్పుడు భావాల పరంపరవల్లనూ, ఈ ప్రాంతం శాశ్వతంగా క్షామ పీడితమైయున్నది. అజ్ఞానం, మూఢ నమ్మకాలు మనస్సును పట్టి పీడించగా, ప్లేగు, మలేరియా శరీరాన్ని నిర్వీర్యం చేస్తూ ఈ దేశాన్ని తరాలనుండి నిస్సారం చేసాయి.

మతపరమైన నీతి శాస్త్రాల్లో హిందువులు ఎనలేని ప్రతిభ చూపినారు. వారితోడ్పాటుతో ఈ శాస్త్రాలు మరింతగా వికసించాయి. ఈ శాస్త్రాలు మానవునికి అత్యవసరమైనవనేది నిర్వివాదాంశం. ఎందుకంటే అవి మానవునిలో ఆలోచనలు కలగడానికి, క్రియాశీలతకూ దోహదపడతాయి. మనిషికి జీవితంపట్ల ఒక దృక్పథాన్ని కలిగించడంలో పాత్ర వహిస్తాయి. తనసాటి మానవుల పట్ల అభిప్రాయాలను ఏర్పరచడంలోకూడా అవి ప్రాముఖ్యత వహిస్తాయి. మానవుని ప్రవర్తనను నిర్దేశించడం, శీలాన్ని రూపొందించడం, మానవునిలో నిగూఢంగా ఉండే అంతరాత్మకు అస్థిత్వాన్నివ్వడం నీతి శాస్త్రాలపని. ఈ అంతరాత్మ మానవునికి రక్షగా వుండి తప్పు చేయకుండా నిరోధిస్తుంది.

హిందూనాగరికతను మతపరంగా పరిశీలించినట్లయితే, హిందునాగరికత దాన్ని వారసత్వంగా పొందిన వారందరికి ఏమైనా ప్రయోజనకరంగా ఉన్నదా అనే సందేహం కలుగుతుంది. ఈ నాగరికత తన సరిహద్దులో నివసిస్తున్న 25 మిలియన్ల ఆదిమతెగలకు అందించేదేమిటి? ఈ నాగరికత మధ్యలో నివసిస్తున్న నేరప్రవృత్తిగల తెగలకు అందించే దేమిటి? అలాగే నాగరికతతో కలసి నివసిస్తూ దానిని కాపాడడానికవసరమయ్యే 50 మిలియన్ల అస్పృశ్యులకు హిందూమతం ఇచ్చిన దేమిటి? తమని ఒడిలోకి తీసుకోవడానికి ముందుకు రానినాగరికత గురించి ఆదిమవాసులు ఏం చెప్పగలరు? బ్రతుకుతెరువుకోసం బలవంతంగా నేరస్తులుగా మారవలసి వచ్చినందుకు నాగరికతను గురించి నేరస్థుల

ముతాలు ఏంచెప్పగలరు? వీరందరూ ఇది 'నాగరికత కాదు' ఇది 'సిగ్గుచేటు' అంటే అన్యాయమవుతుందా?

అస్పృశ్యుల సంగతికొస్తే వారికి హిందూ నాగరకత నుంచి యుగాలుగా సంక్రమించిన న్యూనత, హీనత , దారిద్ర్యాలనుండి బయిటపడే రోజు కనుచూపుమేరలో లేదు. భారతీయులు కూడా ఈ అస్పృశ్యతా వ్యవస్థలో ఎంత హీనత్వం, దారిద్ర్యం, లేమి యిమిడి యున్నవో, విస్తరించి ఉన్నవో గుర్తించడంలేదు. అణగద్రొక్కబడిన తరగతులు, ఆదిమ తెగల సంకట పరిస్థితి విచారణకై ప్రభుత్వం 1928లో ఏర్పాటు చేసిన కమిటీవారి సందర్భోచిత వ్యాఖ్యయిది.

"అపరిశుభ్రమైన వ్యక్తినో వస్తువునో, చూస్తే ఆ కాలుష్యంవల్ల మనకు చికాకు కలుగుతుంది. ఇది విచిత్రమేమీ కాదు. కాని ఈ సిద్ధాంతాన్ని నిర్హేతుకంగా ఆపాదించడం చాలా శోచనీయమైన విషయం-అదీ ఒక వ్యక్తి యాధృచ్ఛికంగా ఒక కులంలో జన్మించడం చేతనే అతన్ని అంటరాని వ్యక్తిగా పరిగణించడం మూర్ఖత్వం. అస్పృశ్యుడుగా జన్మించిన వ్యక్తి వ్యక్తిగతంగా ఎంత పరిశుభ్రంగా ఉన్నా, యితరుల కన్న ఎంత ఉన్నతంగా ఉన్నా కూడా అతడు జీవిత పర్యంతం ఈ అస్పృశ్యత కబంధ హస్తాలనుండి తప్పించుకొనలేడు. ఆశ్చర్యకరమైన విషయమేమంటే సనాతన హిందువు, తన జీవన విధానాలకు, మతాచారాలకు పూర్తి భిన్నమైన పద్ధతులను పాటిస్తున్న క్రైస్తవులను, మహమ్మదీయులను, పార్శీలను స్పృశ్యులుగా పరిగణిస్తున్నాడు. హిందూమతానికి చెంది ఆ మతాన్ని పాటిస్తూ, ఆ మతం విధించిన కఠోర కర్మలను నిశ్శబ్దంగా అనుభవిస్తున్న అస్పృశ్యులను ఈ రకమైన ప్రవర్తన మరింత దుస్థితికి దిగజార్చింది. సనాతన హిందువులు ఆచరిస్తున్న ఈ పద్ధతి క్రైస్తవులను, మహమ్మదీయ, పార్శీలను, తమ విధానాలకు భిన్నంగా ప్రేరేపించి, వారు కూడా అస్పృశ్యతను పాటించేటట్లు చేసింది. ఇప్పటివరకు మేము గమనించింది అస్పృశ్యతలోనే ఒంటరితనం, నీచత్వం యిమిడియున్నాయని. కాని ఈ అస్పృశ్యతవల్ల కలిగే హానికరమైన పరిణామాలు ఎన్నో ఉన్నాయి. సనాతన హిందూసంఘం తమకున్న తార్కిక జ్ఞానాన్ని ప్రదర్శించి ప్రజానిధులతో నడపబడే పాఠశాలలో అస్పృశ్యత సాకుతో ప్రవేశం లేకుండా చేస్తున్నారు. ప్రభుత్వోద్యోగాలకు అర్హత కలిగి వున్నవారికి ఏవో సంప్రదాయకంగా నిర్దేశించిన పనుల్లో తప్ప మిగిలిన ఉద్యోగాల్లో ప్రవేశం దొరకదు. ప్రజానిధులతో నిర్వహించు ఊరిబావిలో నుండి వారు

నీరుతోడుకొనరాదు. ఈ కోణం నుండి చూసినట్లయితే అస్పృశ్యత కేవలం సాంఘిక సమస్య మాత్రమేకాదు. రాజ్యంలోని ప్రజల ప్రాథమిక పౌరహక్కులకు సంబంధించి అత్యంత రాజకీయ ఆవశ్యకత సంతరించుకొన్న సంక్లిష్టసమస్య యిది"

ఇది అస్పృశ్యులు ఎదుర్కొనే కష్టనష్టాల గురించి మాత్రమే చెబుతుంది. కాని ఇటువంటి అవమానకరమైన నిరాదరణకు గురైనవారు అస్పృశ్యులు ఒక్కరేకారు: ఇంతకన్న దౌర్భాగ్యస్థితిని ఎదుర్కొనే జాతులు కూడా ఉన్నాయి. అస్పృశ్యులు అంటే, వారి స్పర్శచేతనే కాలుష్యం కలుగుతుంది. కాని కొంతమంది జనం కాస్త దూరం నుంచి సమీపిస్తోంటేనే కాలుష్యం కలుగుతుంది. వీరు సమీపింపరానివారు. వీరికన్నాకూడా అత్యంత నీచస్థానం ఆక్రమించినవారు ఉన్నారు. వీరిని కంటితో చూసినంతనే అపవిత్రమవుతామని సనాతన హిందువుల భావన. వీరిని చూడరానివారుగా తలుస్తారు. సమీపించరానివారిలో నాయడీలు,[6] ఒక తెగ, వారిని గురించి చెప్తూ– "వారు హిందూకులాలన్నిటిలోను అత్యంత హీన కులానికి చెందినవారు వారు కుక్కమాంసాన్ని ఆహారంగా తీసుకునేవారు. బిచ్చమెత్తుకునేటప్పుడు తమ పట్టువిడవకుండా, ఎవరైనా వ్యక్తులు నడుస్తున్నా స్వారీ చేస్తున్నా, వారికి ఏదైనా ఇచ్చేంత వరకు వదలకుండా, మైల తగలదనుకున్నంత వరకు దూరంలో వారిననుసరిస్తూ అడుక్కొంటూ, మైళ్లకొలది దూరం నడుస్తూనే ఉంటారు. వారికి ఏదైనా యివ్వదలచి క్రిందపెట్టినపుడు ఆ యిచ్చిన వారు మైలతగలనంత దూరం వెళ్లిన తరువాత వినమ్రతతో దానిని అందుకుంటారు. "ఈ తెగవారి గురించి శ్రీ థార్టన్ ప్రస్తావిస్తూ "షోరనూర్‌లో నివసిస్తున్న నాయడీలను పరిశీలించినప్పుడు వారు యితరులకు మూడు మైళ్ల దూరంలో నివసిస్తున్నప్పటికీ, తమకు పారంపర్యంగా ఆపాదించిన అంటరాని కాలుష్యం వల్ల వారు నదిపై వున్న వంతెనమీద నడవకుండా, అనేకమైళ్లు చుట్టుతిరిగి వస్తారు"

మద్రాసు ప్రెసిడెన్సీలో గల తిరునల్వేలి జిల్లాలోని 'పూరాద వణ్ణాలు' అనే చూడరాని తెగవారున్నారు. వీరిని చూసి నంతనే మైల తాకుతుందని ఛాందస హిందువుల భావన. అందుకని వారికి పగటి వేళల్లో బయట తిరగడాన్ని నిషేధించారు. ఈ దురదృష్టవంతులు తప్పనిసరిగా చీకటి పడిన తర్వాతనే వారి గుడిసెలనుండి బయటకు వచ్చి మళ్లీ తొలివెలుగుకు ముందే గుడిసెలు చేరుకుటారు. ఈ విధంగా వారు, హైనా లాంటి జంతువులమాదిరి నిశాచరులై వెలుతురు చూడగానే వేగిరపడి గుడిసె చేరుకుంటారు.

ఈ అస్పృశ్యులు, చూడరానివారు ఎటువంటి కష్టనష్టాలనెదుర్కొంటున్నారు? వారు ఎలా జీవిస్తున్నారు? వారిని చూసినంతనే మైలపడతారని భావించినప్పుడు, వారితో ఎలా పనిచేయించుకోగలరు? వారికి జీవనాధారం ఏమిటి? ఇటువంటి నిస్సహాయ పరిస్థితుల్లో వారు బిచ్చమెత్తుకోకుండా, కుక్క మాసం తినకుండా, ఎలా జీవించి ఉండగలరు? వారిని ఆపరిస్థితికి దిగజార్చిన నాగరికతకన్న క్రూరమైనది వేరే ఏదైనా ఉందా? ఈ చూడరాని వారి, సమీపించరాని వారి సంఖ్య తక్కువగా వుండడం మన అదృష్టం. ఐతే 50 మిలియన్ల అంటరాని వారికి తమదని చెప్పుకోవడానికి ఒక నాగరికత అంటూ వుండాలా వద్దా?

అస్పృశ్యుడు తనకు విధింపబడిన ఈ దురదృష్ట పరిస్థితినుండి తప్పించుకొని స్పృశ్యుడుగా చలామణీ కాలేడు. అతను నివసిస్తున్న గ్రామంలో తన పుట్టుకగురించి దాచి, వేరొకరిగా మసలలేడు. కాని అక్కడినుండి వచ్చి వేరే పట్టణంలో తన కులప్రవస్తావన లేకుండా స్పృశ్యంగా తిరిగినా కూడా, తన కులం గురించిన విషయం బయటకు వస్తే ఏం జరుగుతుందో ఊహించగలడు.

బాంబే క్రానికల్‌లో 25.2.38న ప్రచురితమైన ఈ క్రింది సంఘటన అలాంటి పరిస్థితులు ఏర్పడినపుడు జరిగే అపాయాలను గురించి తెలియజేస్తుంది.[7]

## "పిచ్చిపట్టిన సనాతన ధర్మం"

"అంటరానివారి పట్ల 'అమానుష ప్రవర్తన'. మహారులుగా జన్మించడం నేరమా" అహ్మదాబాదునుండి కేశవ్‌జీ రన్‌చోడ్‌జీ వాఘేలా, బహిష్కృత హితకారిణీ సభ అధ్యక్షులు డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్‌కు తెలియజేసినది ఏమనగా-

"అహ్మదాబాదులో బాపూరావు లక్ష్మణ్, అతని సోదరుడు కౌరవ్ గత ఆరు సంవత్సరాలుగా నివసిస్తున్నారు. దక్కన్ ప్రాంతం నుండి వచ్చిన మరాఠా కులస్తులతో కలసి వీరు జీవిస్తూ ఉండేవారు. కౌరవు యిద్దరు కొడుకులు దాము, లక్ష్మణ్ మరాఠాల భజన సంకీర్తనలలో పాల్గొనేవారు. తరువాత లక్ష్మణ్ సోదరులు మహర్లకులానికి చెందిన వారని తెలిసింది. ఈ విషయాన్ని ధృవీకరించడం కోసం, మరాఠాలు అహ్మదాబాదునుండి సూరత్‌కు తిరిగే పార్శిల్ రైలులో పనిచేసే మహర్లకులానికి చెందిన యిద్దరిని పిలిపించి

దాము, లక్ష్మణ్‌లను గుర్తించవలసిందిగా కోరారు. వారు మహర్లని తెలియగానే అర్థరాత్రి ఉన్నపళంగా బండారీపోల్‌లోని కొల్హాపూర్ భజన పార్టీ దగ్గరకు దాము, లక్ష్మణ్‌లను పిలిపించారు. వారిరువురిని ఏకులానికి చెందినవారని ప్రశ్నించగా తాము 'సోమ' వంశస్థులమని దాము, లక్ష్మణ్ చెప్పారు. ఇది విని మరింత మండిపడిన మరాఠాలు, వారిని ఇష్టం వచ్చినట్లుగా దూషించడం మొదలుపెట్టారు. తమ అసలు కులాన్ని దాచి, వేరొక కులస్థులుగా చలామణీ అయినందులకు వారిని తీవ్రంగా నిందించారు. ఇద్దరు సోదరులలో ఒకరు బగారు ఉంగరాన్ని ధరించి ఉండగా దానిని బలవంతంగా లాక్కొని 11 రూపాయలకు అమ్మివేశారు. వచ్చిన మొత్తంలో ఆరు రూపాయలు ఈ అన్నదమ్ములను గుర్తించడానికి సూరత్‌నుండి పిలిపించిన మహర్ కులస్థులకు యిచ్చారు. దాము, లక్ష్మణ్‌లు తమను క్షమించవలసినదిగా అర్థించి, తమను యింటికి వెళ్లనివ్వవలసినదిగా ప్రార్థించగా మరాఠాలు వారిని రు. 500/- జరిమానా కట్టనిదే వెళ్లనివ్వమని చెప్పారు. అంతపెద్ద మొత్తాన్ని కట్టలేని తమ నిస్సహాయతను వారు వ్యక్తపరచగా మరాఠాలలో ఒకరు ఆ మొత్తాన్ని రు. 125/-లకు తగ్గించవలసినదిగా ప్రతిపాదించారు. కాని వేరొక మరాఠా 'ఆయిద్దర్నీ జరిమానాతో వదిలిపెట్టరాదనీ, తీవ్రంగా శిక్షించాలనీ తీర్మానించాడు. తమ కులాన్ని దాచి వేరే కులస్థులుగా తిరిగినందుకు వారిని శిక్షించకతప్పదని నిర్ణయించి, ఆ యిద్దరు సోదరులను మరునాడు ఉదయం తొమ్మిది గంటలవరకు నిర్బంధించి, తరువాత వారిని అతినీచంగా అవమానించారు. వారికి కుడివైపు మీసం, ఎడమవైపు కనుబొమలను గొరిగించి, శరీరమంతయు మసికలిపిన నూనెను పూసి, మెడలో చెప్పులదండలు వేసి, ఒక చేతికి చీపురుకట్టయిచ్చి ఊరేగించారు. ఉన్నత కులాల వారితో కలిసి తిరిగినందుకు వారికి ఈ శిక్ష విధించడమైనదని వ్రాసి ఉన్న అట్టలను వారి చేతికి యిచ్చి దాదాపు 75 మంది గుంపుగా కలసి, డప్పులు మోగిస్తూ ఆ యిద్దరు సోదరులనూ ఊరేగించారు."

" ఈఅన్నదమ్ములు తమకు జరిగిన అవమానం గురించి పోలీసులకు ఫిర్యాదు చేయగా మరాఠాలు తాము దాము, లక్ష్మణ్‌ల పట్ల ఆ విధంగానే ప్రవర్తించామని ఒప్పుకొని, ఆసోదరుల అంగీకారంతోనే ఆ శిక్ష విధించడం జరిగిందని చెప్పారు. దాము, లక్ష్మణ్‌లు అవమానం జరిగినపుడు నిస్సహాయులని, ఎదిరించినట్లయితే తీవ్ర పరిణామాలు ఎదుర్కొంటారని బెదిరించారనేది అందరికీ తెలిసిన విషయమే. ఈ కేసు అస్పృశ్యులుగా

పిలువబడే వారిలో గొప్ప కలవరం రేపింది. బాధితులకు న్యాయసహాయం అందించడానికి ప్రయత్నాలు జరిగాయికాని హిందూనాగరికతలో కట్టుబాట్లు ఎంత గట్టిగా ఉంటాయంటే ఎటువంటి పరిస్థితుల్లోనూ అంటరాని వారు ఉన్నత కులాల వారితో కలువరాదు. ప్రమాదవశాత్తు కలిసే అవకాశాలను నిరోధిస్తూ కొన్ని ప్రాంతాలలో ఒక్కోవిధమైన ఏర్పాట్లు ఉంటాయి. కొన్నిచోట్ల అస్పృశ్యులు తమని తేలిగ్గా గుర్తించడానికి వీలుగా నల్లదారాన్ని ధరించాలి. లేకపోతే తాము అంటరాని వారమని నోటితో హెచ్చరించాలి. బొంబాయి ప్రెసిడెన్సీలోని శ్రీకృష్ణుని జన్మస్థానమైన ద్వారకా పట్టణంలో ఒక నియమం ఉంది. అది వీధుల్లో తిరిగేటప్పుడు అంటరాని వారు చప్పట్లు చరుస్తూ తమకు దూరంగా వుండమని అరుస్తూ పోవాలి. ఆవిధంగా అతడు చాటి చెప్పుంటే ఉన్నత వర్గాల వారెవరూ కూడా అతనిని ప్రమాదవశాత్తుకూడా తాకరని వారి ఉద్దేశ్యం. మద్రాసు ప్రెసిడెన్సీలోని 'చెరుమాను'ల గురించి యిలావ్రాసి ఉంది.[8]

"ఈ నిర్భాగ్యుల సాంఘిక స్థాయి అత్యంత హీనమైందిగా భావించవచ్చు. ఎవరైనా ఉన్నత వర్గాల వారితో మాట్లాడాలంటే 'చెరుమాన్‌లు' దాదాపు 30 అడుగుల దూరంలో నిలబడాలి. అంతకన్నా దగ్గరకు వచ్చిన పక్షంలో ఉన్నత కులాల వారు మైలపడినట్లు భావించి మరలా స్నానం తరువాతే పవిత్రులౌతారు. అతడు బ్రాహ్మణులకు సంబంధించిన గ్రామం, గుడి లేక చెరువును సమీపించరాదు. అలా జరిగిన పక్షంలో తప్పనిసరిగా శుద్ధి చేయాలి. ఎప్పుడైనా రహదారిలో నడుస్తున్నప్పుడు తన యజమానిని చూసినట్లయితే తప్పని సరిగా రోడ్డు దిగాలి. బాట పక్క బురదలో నడవడానికి సాధ్యపడకపోయినా అక్కడే నడవాలి. పాలఘాట్ ప్రాంతంలో వారి దుస్థితి వర్ణనాతీతం. ఎందుకు కొన్ని జాతుల ప్రజలను మిగలిన ప్రజలతో సహజీవనానికి అనర్హులుగా పరిగణించి వారిని అస్పృశ్యులుగా పిలవాలి?"

ఈ ప్రశ్నలన్నిటికీ జవాబులు హైందవ నాగరికత మూల సూత్రాలకు సంబంధించినవి.

హిందూ మతంలో మత ప్రచార కార్యక్రమాలను చేపట్టకుండా కులవ్యవస్థ అవరోధం కలిగిస్తుంది. ఇదే మొదటి ప్రశ్నకు సమాధానం. ఇక రెండవ ప్రశ్న తీసుకుంటే చాతుర్వర్ణ వ్యవస్థ ఒక వ్యక్తి గౌరవమైన వృత్తిని ఎంచుకునే అవకాశాన్ని తగ్గించి వేస్తుంది.

విద్యా-జ్ఞానాలు బ్రాహ్మణుల సొత్తుకాగా యుద్ధ విద్యలు క్షత్రియుల అధీనంలో , వ్యాపారం వైశ్యులకు, సేవలు శూద్రులకు ఉన్నవి. ఈ కులాలకు చెందనివారికి, గౌరవంప్రదమైన వృత్తులేవీ మిగలలేదు. జీవనానికి వేరే దారి లేక వారు అగౌరవమైన పనులను, దోపిడీలనూ, ఎంచుకోవలసి వచ్చింది. హిందూ నాగరికతలో ముఖ్య పాత్ర వహించిన చాతుర్వర్ణ వ్యవస్థ ఫలితమిది.

ఇక మూడవ ప్రశ్నకు జవాబు హిందూ స్మృతులలో చెప్పినట్లు అంటరానితనం హిందూధర్మంలో ఒకభాగం. ఈ స్మృతులు హిందూనాగరికతకు పునాదులు.

# IV

భారత దేశపు జనాభాలోని ఈ మూడు జాతులకు చెందిన 79.5 మిలియన్ల ప్రజలు ఈ హీనమైన చరిత్రకు వారసులనేది సత్యం. కాని వారి భవిష్యత్తు కూడా యిదే విధంగా ఉంటుందని చెప్పలేము. ఎందుకంటే వారి పరిస్థితి ఒకేవిధంగా ఉన్నా వారివారి స్థానాలు మాత్రం విభిన్నం. సాటి ప్రయాణీకులు తనను తాకి మైలపడతారేమోనని అస్పృశ్యుడు నడుస్తున్నంత సేపు 'ఓ, ఓ, ఓ' అంటూ శబ్దాలు చేయాలి. పాల్ఘాట్ వంటి కొన్ని ప్రాంతాలలో దారి ప్రక్కన ఒక మురికి గుడ్డపరచుకొని "అమ్మా! ఓకాసీ ఈగుడ్డమీదకి విసరండి!" అని దీనాతి దీనంగా బిచ్చమెత్తుకొనుచున్న చేరుమానులను చూడగలం. బ్రాహ్మణాధిక్యత ఎక్కువగా ఉన్న కొచ్చిన్, ట్రావెన్ కూర్‌లలో వీరి ఉనికి సహింపరానిదిగా భావిస్తారు. పాల్ఘాట్ తాలూకాలో యిప్పటికి చెరుమానులు వీధులలోనికి అడుగిడ కూడదు. మలబార్ ప్రాంతాలలో ఉన్నత వర్గాల వారు బయటకు వెడలినప్పుడు తమరాకను తెలుపుచూ అరవడంవల్ల నిమ్నవర్గాలవారు పక్కకు దిగి తప్పుకొంటారు. అదే అంటరాని వారు, నిమ్నజాతులవారు వెళుతున్నపుడు, తమ అస్పృశ్యతను చాటించుకుంటూ, ఉన్నత వర్గాల వారి రాకగురించి విన్నపుడు బాటప్రక్కకి దిగుతారు. అందుకే అస్పృశ్యులు రహదారికి సమాంతరంగా నడచి వెళ్ళే దృశ్యం సర్వసామాన్యం . ఎందుకంటే దారిపై నడిచే ధైర్యం అస్పృశ్యులు చేయరు.

హైందవ నాగరకత ఈ దురదృష్టవంతులను, నిర్భాగ్యులను సాంఘికంగా కుష్ఠు వ్యాధిగ్రస్తుల స్థాయికి దిగజార్చినది. అంటరాని వారిగా జన్మించడం దౌర్భాగ్యమైతే దానిని

తననోటితోనే ఉచ్చరించుకుంటూ పోవడం యింకెంత ఖర్మ! ఇందుకు సమానమైన అవమానం యింకేముంది? యిలాంటి నాగరకత గురించి అస్పృశ్యులు ఏం చెప్పగలరు? ఇది నాగరకత కాదు-అమానుషత్వం-మహాపరాధం అంటే కాదనగలరా?

హిందూ నాగరికతలోని ప్రాథమిక మూలసూత్రాలే ఈ ఆదిమ తెగల, నేరస్తతెగల, అస్పృశ్య తెగల పరిస్థితికి కారణమనేది నిస్సందేహం.

ఈఆదిమజాతులను హిందూ నాగరికతలోనికి చేర్చే మత ప్రచారకులెవ్వరూ లేరెందుకని?

కొన్ని జాతులకు నేరాలే జీవనోపాధిగా ఎందుకైనాయి? ముఖ్యంగా ఆదిమ జాతులకు, నేరవృత్తిగల తెగలకు ఈ అస్పృశ్యత సమస్య లేదనే సత్యం మరువరాదు. హిందువులు వీరిని అంటరాని వారుగా చూడరు. ఇంకా చెప్పాలంటే ఈ రెండు జాతులవారు అస్పృశ్యత పాటిస్తుంటారు. ఆదిమ తెగలకు చెందిన వ్యక్తి అంటరాని వారిని ముట్టుకుంటే మైలపడినట్లు భావించడం నిజంగా హాస్యాస్పదం. ఎందుకంటే వారు అస్పృశ్యులకన్నా ఎక్కువగా పేదరికం, అజ్ఞానం, మూఢనమ్మకాలు, అపరిశుభ్రతతో జీవిస్తూ కూడా తాము అస్పృశ్యులకన్నా సాంఘికంగా గొప్పవారిమని భావిస్తుంటారు. ఇది వీరికి హిందువుల నుండి వ్యాపించిన జాడ్యం. కాని ముఖ్యమైన విషయం-హిందువులు వీరిని అంటరాని వారిగా చూడరు. ఈ కారణం చేతనే వీరు అస్పృశ్యులకన్నా ఆదరణీయులు-వీరి భవిష్యత్తు నిశ్చయంగా అభివృద్ధిలో ఉంటుంది. ఆదిమ జాతులవారికి అవకాశాలు రాక అభివృద్ధి చెందకపోవటానికి కారణం వారు కావాలని ఒంటరిగా అడవుల్లో జీవించడమే. కాని వారు అరణ్యం వదలి బయటకు వచ్చి నాగరికులలో కలవాలని భావించినపుడు వారికి ఏ అవరోధం ఉండదు. అలాగే నేరవృత్తిగల జాతులకు ప్రభుత్వం కొత్త నివాసాలు ఏర్పరచి, వారికి ఉపయోగపడే వృత్తులను నేర్పుతున్నారు. చాలా కొద్ది కాలంలోనే వారు తమ దుర్మార్గపు అలవాట్లనుండి దూరం కావచ్చు.

కాని అస్పృశ్యుల అవస్థ వీటన్నిటికన్నా భిన్నమైనది. వారి హీనతలేవైతే ఉన్నాయో అవి వారు తెచ్చి పెట్టుకున్నవికాదు. వారిపై వ్యవస్థ విధించిన హీనతలవి. వారి ఏకాంత జీవనం వారిని బలవంతంగా వేరు పరచినందువల్ల ఏర్పడింది. అస్పృశ్యుల సమస్య

ఆదిమజాతుల సమస్యకన్నా భిన్నమైనది. ఆదిమ జాతుల వారి ఒంటరితనం భౌగోళికంగా ఏర్పడింది, వారు కోరుకున్నది. కాని అస్పృశ్యుల విషయంలో ఒంటరి తనం వల్ల కలిగే హాని అస్పృశ్యత వల్ల మరింత భరింపలేనిదవుతుంది. ఆదిమవాసులకు అభివృద్ధిపట్ల ఆసక్తి లేకపోవటం కారణమైతే అస్పృశ్యులకు అవకాశాలు యివ్వకపోవటం కారణం.

ఈ అస్పృశ్యుల విమోచన ఏమంత ఆశాజనకంగా లేదు. ఏది ఏమైనా వారి విముక్తి ఆదిమవాసుల స్వేచ్ఛ కన్న సమస్యాత్మకమైంది. సుదూరమైంది. వారి రాజకీయ హక్కుల నిరాకరణే బానిసల సమస్య. అంటరాని వారిదీ అదే సమస్య అయితే న్యాయమైన రాజ్యాంగ పద్ధతిలో పరిష్కరించుకోవచ్చు. హిందువుల సాంఘిక మనస్తత్వ పరిణామమే ఈ రాజకీయ, ఆర్థిక హక్కుల నిరాకరణ. హిందువుల సాంఘిక ప్రవర్తన నుంచే ఈ అస్పృశ్యత సమస్య ఉద్భవించింది. హిందువులు తమ ఆలోచనను మార్చుకోకుండా అస్పృశ్యత అనే సమస్య అంతర్థానంకాదు. హిందువులు తమ జీవితాన్నీ, దాని మార్గాన్నీ ఎలా మార్చుకుంటారనేదే సమస్య. మొత్తం దేశాన్ని మార్చాలంటే, అందరూ అలవాటుపడిన జీవన విధానాన్ని మార్చాలంటే అది సామాన్య విషయం కాదు. అదీ కాక హిందువుల జీవనశైలికి తగినట్లు అలవాటు పడిన వారు తమ మతం ఆదేశించిన పావన జీవనశైలి అదే అని వారు ఎట్టి పరిస్థితులలోనైనా విశ్వసిస్తారు. వారు జీవన విధానం మార్చుకోవడం అంటే దాదాపు మతం మార్చుకొన్నట్లే.

కాని ఇది ఎలా సంభవిస్తుంది? తమ క్రూరత్వం వల్ల అంటరాని వారికి యిటువంటి దుఃఖ-భరిత పరిస్థితి వచ్చిందని హిందువులు తెలుసుకున్నపుడే ఇది సాధ్యపడుతుంది. హిందువుల ధార్మిక మనస్తత్వంలో విప్లవాత్మకమైన మార్పురావడానికి ఈ అస్పృశ్యులు ఎంతకాలం ఎదురుచూడాలి? భవిష్యతు చూడ శక్తి గల ఉన్నవారు సమాధానం చెప్పగలరేమో ఈ లోపు వారున్న స్థితిగురించీ వారూ వారి మిత్రులు ఎదుర్కొంటున్న సమస్యల గురించీ వివరించడం అవసరం.

1. కలకత్తా మహాబోధి సంఘం కొంత ప్రయత్నం చేసింది. (ఇదీ, ఇతర వివరాలూ) Census of India, 21931, Vol. 1 Part 3. నుంచి తీసుకున్నవవి.)

2. "Holy Roman Empire " పేజీ 367

3. Encyclopaedia Britannica, 11th Ed. vol XXVI, పేజీ 896
4. చూ. నా "కుల నిర్మూలన"
5. Modern Review, July, 1912
6. మలబార్ మాన్యువల్
7. బాంబే క్రానికల్, ఫిబ్రవరి 25, 1938
8. Thurston " Tribes and Castes of Southern India" Vol.5 పేజీ.196

అనువాదం : టి. సత్యనారాయణ

అధ్యాయం -16

# హిందువులు నిర్మించిన భవనం

హిందూ సామాజిక వ్యవస్థలో ఏమైనా ప్రత్యేకత ఉందా? ఈ ప్రశ్నకు సంబంధించిన పండితుల పరిశోధనలు తెలియని సాధారణ హిందువు ఈ సామాజిక వ్యవస్థలో ఎలాంటి ప్రత్యేకమైన, అసాధారణమైన, అసహజమైన లక్షణాలు గుర్తించలేడు. ప్రపంచంలోని ఇతర సంస్కృతులతోను, ప్రజలతోనూ ఎట్టి సంబంధం లేకుండా ఏకాంతంగా జీవించేసాధారణ ప్రజానీకానికి తమ సంస్కృతి ప్రత్యేక లక్షణాలు తెలియకపోవడం సహజమే. తరాలుగా నిరంతరం సాగిన తమ జాతికి ఒక పేరంటూ నిర్ణయించుకోవలసిన ఆవశ్యకతను కూడా ఈ ప్రజలు గుర్తించలేదు. మరి హిందువులు కాని వారు హిందూ సామాజిక వ్యవస్థను ఏ విధంగా అవగాహన చేసుకున్నారు? వారికి ఈ వ్యవస్థ సర్వసాధారణంగాను, సహజంగానే కనిపించిందా?

క్రీ.పూ. 305 ప్రాంతంలో మౌర్య చంద్రగుప్తుని ఆస్థానంలో గ్రీకు రాయబారిగా ఉండిన మెగస్థనీసుకు హిందూ సామాజిక వ్యవస్థ చాలా విచిత్రంగా తోచింది. హిందూ సామాజిక వ్యవస్థ అతనికి ప్రత్యేకంగా తోచక పోతే ఈ వ్యవస్థను వర్ణించడానికి అతడు అంతటి శ్రద్ధ చూపేవాడు కాదు.

అతని రచన ప్రకారం "భారత ప్రజానీకం ఏడు భాగాలుగా విభజించబడింది. వీరిలో తత్వవేత్తలు సంఖ్యాపరంగా జనాభాలో కొద్ది శాతమే వున్నప్పటికీ సమాజంలో అత్యుత్తమ శ్రేణికి చెందిన వారు. యజ్ఞయాగాది క్రతువులు తలపెట్టిన వ్యక్తులు వీరిని యాజ్ఞికులుగా నియోగించుకునేవారు. అతేగాక, ప్రతి ఉగాదినాడు రాజు ఆస్థానంలో నిర్వహించబడే విద్వత్‌సభల్లో పాడిపంటల అభివృద్ధికి, ప్రజాక్షేమానికి క్రొత్త సూచనలు చేసే పండితులకు, నూతన కావ్యరచనకు ఉద్యమించే కవులకు పన్నుల రాయితీలు, కానుకలు రాజుచే ప్రసాదించబడేవి. ఈ సందర్భంగా మూడు సార్లు తప్పుసలహాలు ఇచ్చిన పండితుడు మరెప్పుడూ ఇట్టి సమావేశాలలో నోరు మెదపకుండా నిషేధింపబడేవాడు.

"రెండవ కులము రైతులు. జనాభాలో ఎక్కువ భాగం వీరే. వ్యవహారంలోనూ, ప్రవర్తనలోనూ వీరు మృధు స్వభావులు. వీరు సైన్యంలో చేరవలసిన అవసరం లేదు. ఆ విధంగా సంవత్సరమంతా ఎట్టి ఆటంకం లేకుండా వ్యవసాయం చేయడానికి వీలు కల్పించబడింది. వీరు సాధారణంగా పట్టణానికి వెళ్ళేవారు కాదు. అంతే కాక తమ చుట్టుపట్లనే యుద్ధాలు జరుగుతున్నప్పటికీ రైతాంగము తమ వ్యవసాయ కార్యక్రమాలలో పాల్గొనేవారు. భూమి అంతా రాజు స్వంత ఆస్తిగా పరిగణించబడేది. పంటలో నాల్గవ భాగము తాము తీసుకునే నిబంధనతో రైతులు పంటలు పండించే వారు.

"పశుకాపర్లు, వేటగాళ్లు మూడవ కులానికి చెందిన వారు. జంతువులను వేటాడుటకు, పశువులను పోషించుటకు వీరికి మాత్రమే అధికారముండేది. వ్యవసాయంలోనూ, రవాణా మొదలైన అవసరాలకు అమ్మడానికి లేక బాడుగకు ఇవ్వడానికి వీరు పశువులను పెంచేవారు. వ్యవసాయంకొరకు అడవులను నరకడానికి, అడవి జంతువులను వేటాడి పంటలను కాపాడినందుకు వీరికి కొంత ధాన్యము రాజు ఇచ్చేవాడు. వీరు ఎక్కువగా ఊరిబయట గుడారాలలో నివసిస్తూ ఒక చోటి నుండి మరొక చోటికి తరలివెళ్తూ వుండేవారు.

"వివిధ వస్తువులు చేసేవారు, శారీరక శ్రమ చేసేవారు నాల్గవ వర్గము. వీరిలో కొందరు రాజుకు కానుకలు సమర్పించేవారు. మరి కొందరు రాజుకు ఉచితంగా తమ సేవలను అందించేవారు. కాని ఆయుధాలు, ఓడలు తయారు చేసేవారు రాజునుండి పారితోషికము పొందేవారు. సైన్యానికి సైన్యాధిపతి ఆయుధాలు పంచేవాడు. నావికాదళానికి అధిపతి ఓడలను బాడుగకు తీసుకొని ప్రయాణీకులను, వర్తకసామగ్రిని రవాణా చేసేవాడు.

"సైనిక వర్గము ఐదవది. వీరెప్పటికీ ప్రభుత్వసేవలో ఉంటూ, విరామ సమయాలలో తాగుడు, జూదము మొదలైన విలాసాలతో కాలం గడిపేవారు. వీరిని రాజ్యం భరించడం వల్ల ఎప్పుడు అవసరం కల్గినా యుద్ధం చేయడానికి సిద్ధంగా ఉండేవారు.

"ఆరవ వర్గము గూఢచారులు. రాజ్యంలోని అన్ని విషయాలను గమనిస్తూ సమాచారాన్ని రాజుకు ఎప్పటికప్పుడు రహస్యంగా చేరవేసేవారు. గూఢచారులలో కొందరు పట్టణాలలో విషయాలను గమనించడానికి, మరికొందరు సైన్యములో ఉంటూ విషయాలను సేకరించడానికి ప్రత్యేకంగా నియమించబడేవారు. ఈ గూఢచారులు

సాధారణంగా పట్టణాలలోనూ, సైనిక శిబిరాలలోనూ ఉండే వేశ్యల ద్వారా సమాచారాన్ని రాబట్టేవారు. మంచి విశ్వాస పాత్రులనే గూఢచారులుగా నియమించేవారు.

"రాజు సలహాదారులు, న్యాయమూర్తులు ఏడవ వర్గానికి చెందినవారు. న్యాయవ్యవస్థలోనూ, సాధారణ పరిపాలనలోను, ప్రభుత్వానికి చెందిన ఉన్నత పదవుల్లో ఈ వర్గానికి చెందినవారు నియమించబడేవారు. మేధావి వర్గానికి చెందినవారు తప్ప ఇతరులకు కులాంతర (వర్ణాంతర) వివాహాలు, వృత్తిలో మార్పులు నిషేధించబడ్డాయి".

క్రీ.శ. 1030లో భారతదేశాన్ని దర్శించిన ఆల్బెరూనీకి కూడా ఇక్కడి సామాజిక వ్యవస్థ విచిత్రంగా తోచింది. అందువల్లనే ఈ వ్యవస్థ గురించి ప్రత్యేకంగా వివరించకుండా ఊరుకోలేదు.

"హిందువులు తమ కులాలను వర్ణాలు (రంగులు)గా పిలిచేవారు. వంశక్రమం దృష్ట్యా వీటిని పుట్టుకతో వచ్చిన జాతకాలు (పుట్టుక) గా భావించవచ్చు. అనాది నుంచీ ఈ కులాలు నాలుగే.

"1. బ్రాహ్మముఖం నుండి వెలువడినారని హిందువుల గ్రంథాలు చెప్పే బ్రాహ్మణులను అత్యున్నతమైన కులంగా పరిగణిస్తారు. ప్రకృతిగా గుర్తించబడిన శక్తికి మరోపేరే బ్రహ్మ. ప్రాణులకు తల అత్యుత్తమ అంగముగా భావించడం వల్ల సమాజంలో బ్రాహ్మణులకు అగ్రస్థానము గుర్తించబడింది.

2. బ్రహ్మ భుజాలనుండి క్షత్రియులు ఉద్భవించారని అంటారు. సమాజంలో వీరి స్థానం బ్రాహ్మణులకన్నా కొద్దిగా తక్కువ.

3. బ్రహ్మ ఊరువు (తొడలు)ల నుండి వైశ్యులు వచ్చారు.

4. బ్రాహ్మపాదాలనుండి శూద్రులు సృష్టించబడ్డారు.

"మూడు, నాల్గవ వర్గాల మధ్య పెద్ద దూరం లేదు. ఈ వర్గాలకు చెందిన వారంతా ఒకే పట్టణంలోనూ, ఒకే గ్రామంలోనూ కలిసి జీవిస్తారు. వీలైతే ఒకే ఇంటిలో కూడా పక్కపక్కనే ఉండగల్గుతారు.

"శూద్రులకన్నా తక్కువ స్థాయికి చెందిన వారిని అంత్యజులంటారు. వీరు చేపట్టే వృత్తులను బట్టి గుర్తించబడడమే కాని, వీరిని ఒక కులంగా పరిగణించరు. వీరిలో పరస్పర వివాహ సంబంధాలున్న ఎనిమిది వర్గాల (శ్రేణులు) వారున్నారు. చెప్పులు కుట్టేవారు, నేత పనివారు మాత్రము ఇతరులతో కలవడానికి వీలు లేదు. ఈ ఎనిమిది శ్రేణులు: 1) బట్టలు ఉతికేవారు, 2) చెప్పులుకుట్టేవారు 3) విచిత్ర విన్యాసాలు చేసేవారు, 4) బుట్టలు అల్లేవారు 5) పడవలు నడిపేవారు 6) చేపలు పట్టేవారు 7) అడవి జంతువులు, పక్షులను వేటాడేవారు 8) నేతగాళ్ళు. నాలుగు ప్రధాన కులాలకు చెందిన వారు వీరితో కలిసి ఒకే చోట నివసించరు. అందువల్ల ఈ ఎనిమిది శ్రేణులకు చెందిన వారు ఊర్లకు, పట్టణాలకు దగ్గలర్లో తమనివాసాలు ఏర్పరచుకుంటారు.

"హాది, దోమ(దోంబ) చండాల, బద్ధతావు (S ic)అని పిలవబడేవారు ఏ ఒక కులానికో శ్రేణికో చెందినవారిగా గుర్తించబడరు. వారు సాధారణంగా గ్రామ పారిశుధ్యానికి ఇతర సేవలకు అంకితం కాబడినవారు. వీరందరూ వేరు వేరు వృత్తుల వారైనప్పటికి ఒకే వర్గంగా పరిగణిస్తారు. శూద్రునికి బ్రాహ్మణ వనిత ద్వారా పుట్టిన సంతానంగా భావించి వీరిని అత్యంత నిమ్న బహిష్కృత కులంగా వ్యవహరిస్తారు.

"హిందువులలోని నాల్గు వర్ణాలకు చెందిన ప్రతి వ్యక్తికి ప్రత్యేకంగా గుర్తించదగిన కులం ఆపాదించబడింది. తన ఇంట్లోనే ఉండి పని చూసుకొనే వారిని బ్రాహ్మణుల అంటారు. వీరిలో రోజూ ఒక అగ్నికి పూజ చేస్తూ ఉండేవారిని ఇష్టిఅని, మూడుఅగ్నులక చేసేవారిని అగ్నిహోత్రులని, అగ్నికి పూజతో పాటు బలులర్పించే వారిని దీక్షితులని అంటారు. బ్రాహ్మణులలాగే ఇతర కులాలవారిలో కూడా వారు చేసే పనిని బట్టి వేరు వేరు పేర్లతో వ్యవహరిస్తారు.. ఈ నాల్గు కులాలకన్నా దిగువన ఉన్నవారిలో అశుద్ధానికి దూరంగా ఉండే 'హాదీలు ప్రాముఖ్యత వహిస్తారు. వీరితర్వాత పాటలు పాడే 'దోమ', ఆ తర్వాత వేటమీద, మరణ శిక్షల అమలు మీదా ఆధారపడేవారు వీరందరికీ దిగువున చచ్చిన జంతువులను (చివరికి కుక్కలను కూడా ) తినే బద్ధాతావులు చెప్పుకోవచ్చును.

"ప్రతికులము పంక్తి భోజనాలలో ఒక ప్రత్యేక వర్గంగా భావించవచ్చును. వేరు కులాలకు చెందినవారు ఒక-పంక్తిలో కూర్చుని భోజనము చేయరాదు. అంతే కాక బ్రాహ్మణులలో రెండు వర్గాలు పరస్పరవైరంతో ఉంటే. ఒకే సమయంలో వీరు

భోజనాలకు కూర్చున్నప్పటికి వీరి మధ్య వేరుగా దడి కట్టడం వల్లనో, ఒక బట్టను అడ్డంగా కట్టడం వల్లనో, అది కూడా వీలు కాకపోతే వారి మధ్య ఒక గీతగీయడం ద్వారానో ఇరు పక్షలను వేరుగా గుర్తిస్తారు. అంతేకాక ప్రతి వ్యక్తికి వేరుగా భోజనం ఏర్పాటు చేస్తారు. ఒకరి కోసం ఉద్దేశించిన ఆహారంలో మిగిలినది ఇతరులకు నిషిద్ధము"

అల్బెరునికి హిందూ సామాజిక వ్యవస్థలో ఒక విషయం విచిత్రంగా కనబడింది.

"హిందువులలో (సామాజిక) వ్యత్యాసాలు ఈ విధంగా ఉండగా, ముస్లిములలో అందకు భిన్నంగా, ఒక్క పవిత్రతలో తప్ప, అన్ని విషయాలలోనూ మానవులందరూ సమానులే. ప్రధానంగా ఈ కారణమే హిందూ, ముస్లిముల మధ్య సదవగాహన ఏర్పడక పోవడానికి ప్రతిబంధకమని చెప్పుకోవచ్చు".

క్రీ.శ. 1500-1517 మధ్య భారతదేశంలో పోర్చుగీసు ప్రభుత్వ ప్రతినిధిగా ఉన్నుండిన డువార్ట్ బార్బొసా హిందూ సమాజంపై తన అభిప్రాయాలను ఈ విధంగా వెల్లడించాడు.

"గుజరాత్ ముస్లిమ్ పాలనలోకి రాక ముందు ఈ ప్రాంతంలో రెస్‌బుటోస్ (Resbutos) అనే జాతి వారు నివసించేవారు. వీరు మంచి యోధులు, అశ్వికులు, విలువిద్య తెలిసిన వారు. ఎప్పుడూ యుద్ధాలలో మునిగి తేలేవారు. స్వతంత్రులు, వారు ఒకరి పాలనలోనో, ఒక రాజు అధీనంలోనో ఉండేవారు కాదు. కొండ ప్రాంతాలలో పెద్ద గ్రామాలు ఏర్పరుచుకొని ఉండేవారు. గొఱ్ఱెలు, చేపలతో పాటు వివిధరకాల ఆహారం భుజించేవారు.

"తర్వాత 'బనియానీ'లని పిలవబడే వర్తకవ్యాపార వర్గము ఉండేది. వీరు ముస్లిములతో వ్యాపారం చేసేవారు. వీరు మాంసము, చేపలు తినేవారు కాదు. హింసతో కూడిన ఏ పనీ చేసేవారు కాదు. అహింసా సూత్రాల్ని ఖచ్చితంగా పాటించేవారు. వారి కళ్ళెదుట ముస్లిములెవరైనా జీవ హింసకు పాల్పడితే ఎంత ధనాన్నైనా వారికిచ్చి, ఆ జంతువులను కొని వదిలేసేవారు. ఆ దేశపురాజు కాని, గవర్నర్ కాని, ఒక నేరస్థుడికి మరణ దండన విధించినప్పుడు, ఈ బనియానీలందరూ ఏకమై కొంతధనాన్ని పోగు చేసి ప్రభుత్వానికి చెల్లించి అతనిని విడుదల చేయడానిక ప్రయత్నించేవారు. ముస్లిమ్ భిక్షగాళ్ళు వీరి నుంచి

ఎక్కువ మొత్తాలలో దానాన్ని పొందడానికి, వారి ఎదుట రాళ్ళతోనూ కత్తులతోనూ తమ శరీరాలను హింసించుకొనేవారు. కత్తులతో తమ కాళ్ళను చేతులను కోసుకునేవారు. వాళ్ళను అట్టి హింసనుండి తప్పించడానికి బనియానీలు ఎక్కువ మొత్తాలు వారికిచ్చి పంపేవారు. మరి కొందరు బనియానీల ఎదుట ఎలుకలను, పాములను చంపడానికి ఉద్యమించి డబ్బు రాబట్టుకొనేవారు.బాగా డబ్బులు రాబట్టుకోవడం వల్ల వీరంటే ముస్లిములకు ఎక్కువ గౌరవముండేది.

"రోడ్లపై చీమల బారును చూచినా, బనియానీలు వాటికి నష్టం కలుగకుండా దాటి పోయేవారు. చీకటి పడక ముందే భోజనం చేసేవారు. రాత్రికాని, పగలుకాని దీపం వెలిగించేవారు కారు. అత్యవసరంగా దీపం వెలిగించవలసి వస్తే దీపం చుట్టూ పలుచని కాగితంకాని, బట్టకాని చుట్టి మంటలో కీటకాలు పడి చావకుండా జాగ్రత్త పడేవారు. చివరికి తలలో పేలు ఎక్కువై బాధిస్తుంటే వారితోనే అతి పవిత్రంగా జీవితం గడిపేవారి చేత పేలు తీయించి వారితలల్లో ఈ పేలు ఉంచుకొని పోషించేలా చేసేవారు. ఎట్టి పరిస్థితులలోనూ జీవ హింసను నివారించడానికి కృషి చేసే వారు. ఆ విధంగా తమ భగవంతుడికి సేవ చేస్తున్నట్లు భావించేవారు. కాని ఇతర విషయాలలో ఋణదాతలు గానూ, తూకాలలో మోసం చేసేవారిగానూ, అబద్ధాలకోరులు గానూ, బంగారు వెండి నాణెములలో నాణ్యత విషయంలో దగాకోరులుగానూ వీరు ప్రసిద్ధులు. వీరు సాధారణంగా పొడవుగానూ అందంగానూ ఉండి, మంచి దుస్తులు ధరించేవారు. మిత ఆహారం తీసుకొనేవారు. ఆహారంలో పాలు, వెన్న, చక్కెర, బియ్యం, ఇతర రకాలు ఉండేవి. పండ్లతోనూ, ఆకుకూరలతోనూ, కందమూలాలతోనూ వివిధ వంటకాలు తయారు చేసుకొనేవారు. వారి నివాసాల వద్ద పండ్లతోటలు పెంచుకునేవారు. తటాకాలు ఏర్పరచుకొనేవారు. వీరు స్నానానికి ఎక్కవ ప్రాముఖ్యత నిచ్చేవారు. స్నానం చేసినప్పుడల్లా అంతవరకూ తాము చేసి పాపాలు ప్రక్షాళనమౌతాయని విశ్వసించేవారు. మనస్త్రీలవలె, బనియానీలు జుట్టు పెంచుకొని తలపై ముడి కట్టుకుని పూలు కూడా పెట్టుకొనేవారు. సుగంధ నూనెలు పూసుకొనేవారు. కుంకుమ, సుగంధనూనెలు కలసిన తెల్ల చందనం పొడిని ఒంటికి రాసుకొనేవారు. వీరు శృంగార ప్రియులు. పొడవాటి నూలు బట్టలు (పంచెలు), సిల్కుచొక్కాలు ధరించేవారు. మొనతేలిన (Pointed) బూట్లు ధరించేవారు. వీరు ఆయుధాలు ధరించరు. కాని బంగారు, వెండితో అలంకరించిన చిన్న కత్తులు

ధరించేవారు. ఆయుధాలు ఉపయోగించని కారణంగానూ, వారి రక్షణ బాధ్యత ముస్లిములు వహించటం వల్లనూ, వీరికి పెద్దగా ఆయుధాలతో పని లేదు.

"వీరిలో (హిందువులలో) మరొక వర్గము బ్రాహ్మణులు, గుళ్ళలో పూజాదికాలు నిర్వహిస్తారు. ఈ గుళ్ళు చాలా వరకు పెద్దగా ఉండడమే కాక, మంచి ఆదాయం కలవి. ఈ బ్రాహ్మణులు భిక్ష కూడా తీసుకొనే వారు. గుళ్ళలో కర్రతోనూ, రాతితోనూ, రాగితోనూ చేయబడిన పెద్ద విగ్రహాలు ఉంటాయి. గుళ్ళతో పాటు ధర్మశాలలు ఉండేవి. గుళ్ళలో విగ్రహాలకు ఉత్సవాలు ఆర్భాటంగా జరిగేవి. Holy Trinity తో పోల్చదగిన త్రిమూర్తుల ఆరాధన వీరు చేసేవారు. భగవంతుడి వివిధ అంశలుగా అనేక దేవుళ్ళను పూజించినా, వీరందరూ ఒకే భగవంతుని ప్రతీకలుగా వారు భావిస్తారు. అందువల్లనే వీరు చర్చిలలో ఆరాధనలను కూడా తృణీకరించరు. క్రైస్తవులకు; తమకు ఎట్టి వ్యత్యాసము లేదని భావిస్తారు. జీవ హింసతో కూడిన ఆహారాన్ని తీసుకోరు. వీరు కూడా స్నానానికి చాలా ప్రాధాన్యత నిస్తారు. స్నానం వల్లనే తాము రక్షణ పొందుతున్నామని భావిస్తారు.

"మనలో మతాధికార (Clergy) వర్గమున్నట్లు ఈ కాలికట్ రాజ్యంలోనే పూజారులైన బ్రాహ్మణులు ఉన్నారు. ఈ బ్రాహ్మణులంతా ఒకే భాష మాట్లాడుతారు. బ్రాహ్మణ కుటుంబంలో పుట్టడం వల్లనే బ్రాహ్మణుడని పిలిపించుకోబడతాడు. ఏడు సంవత్సరాల వయసులోని బ్రాహ్మణ బాలుడికి భుజంపై రెండు వేళ్ళ వెడల్పుతో శుద్ధి చేయబడిన చర్మాన్ని ఉంచుతారు. ఆ తర్వాత ఏడు సంవత్సరాల దాకా అతడు వక్కలు తినరాదు. అంతకాలం ఈ చర్మాన్ని ధరించేవుంటాడు. 14 సంవత్సరాల తర్వాత ఈ చర్మాన్ని తొలగించి దాని స్థానంలో మూడు వరసల దారపు పోగులు వేసి బ్రాహ్మణుడైతాడు. జీవితాంతము ఈ దారపు పోగులు ధరిస్తాడు. ఈ రోజు మొదటి సారిగా ఆ బాలుడు ప్రార్థన చేయడం ఈ ఒక గొప్ప ఉత్సవంగా జరుపుతారు. ఆ తర్వాత అతడు వక్కలు తినవచ్చును. కాని మాంసము, చేపలు తినరాదు. భారతీయులలో ఈ వీరికి చాలా గౌరవం ఉంటుంది. వీరికి ఏ సందర్భంలోనూ మరణశిక్ష వేయరాదు. సాధారణ అధిక్షేపణ నే శిక్షగా విధిస్తారు. మనలాగానే ఒక్కసారే వివాహం చేసుకుంటారు. పెద్దకుమారుడికి మాత్రమే వివాహమౌతుంది. అతడే ఇంటికి పెద్దగా వ్యవహరిస్తాడు. కుటుంబ ఆస్తికంతా అతడే అధికారి. అతని తమ్ములందరూ అవివాహితులుగానే ఉండి పోతారు. ఈ బ్రాహ్మణుల భార్యలకు చాలా రక్షణ కల్పిస్తారు. ఇతర పురుషులతో సంబంధం ఉండకుండా

జాగ్రత్త పడతారు. భర్త మరణిస్తే తిరిగి వివాహం చేసుకోరాదు. అదే విధంగా ఇతర పురుషులతో సంబంధం ఉన్నట్లు తెలిస్తే ఆమెకు విషమిచ్చి చంపేస్తారు. అవివాహితులైన సోదరులు నాయర్లనబడే స్త్రీలతో సుఖిస్తారు. ఆ స్త్రీలు వీరితో సంబంధం పెట్టుకోవడం గొప్ప గౌరవంగా భావిస్తారు. బ్రాహ్మణులతో అట్టి సంబంధానికి ఇతర స్త్రీలు తిరస్కరించరాదు. తమకన్నా వయసులో పెద్దవారైన స్త్రీలతో సాంగత్యము చేయరు. తమకంటూ ప్రత్యేకంగా ఉండే పట్టణాలలో, తమ స్వంత ఇళ్లలో వీరు నివసిస్తారు. దేవాలయాలో నిర్ణీత సమయాలలో పూజలు నిర్వహిస్తూ ఉంటారు.

"సైనిక వ్యవహాలలో తప్ప ఇతర అన్ని రాజకీయ విషయాలలో రాజుకు సహకరించే బ్రాహ్మణులు కొందరు. రాజుకు వంట చేయువారు బ్రాహ్మణులే. ఇతర రాజ్యాలకు వార్తాహరులుగా కూడా నియోగించబడేవారు. ఇతర ప్రాంతాలకు రహస్య సమాచారాలుగాని, విలువైన వస్తువులు, ధనం బ్రాహ్మణుల చేత పంపించేవారు. యుద్ధాలు జరుగుతున్నప్పుడు కూడా బ్రాహ్మణుల చేతనే ఇట్టి పనులు రాజులు చేయించుకొనేవారు. బ్రాహ్మణులవటం వల్ల పట్టుబడినప్పటికీ శత్రువులు వారిని చంపేవారు కారు. వీరు విగ్రహారాధనకు సంబంధించిన పుస్తకాలు ఉంచుకునేవారు. రాజుల చేత గౌరవాన్ని పొందేవారు.

"నాయర్ల గురించి ఇంతకు ముందు ఎన్నో సార్లు వివరించాను. కాని వాళ్ళు ఎట్టి మనుషులో వారి స్వభావం చెప్పలేదు. ఈ మలబారు ప్రాంతంలోనే నాయర్లన బడే కులం వారున్నారు. వీరు యుద్ధాలు చేసేవారు. ఎప్పుడూ ఆయుధాలు ధరిస్తారు. కొందరు కత్తులు, డాళ్ళు మరికొందరు విల్లంబులు ధరిస్తారు ఇతరులు బల్లెములు ధరిస్తారు. వీరు రాజులచెంతను, ఇతర ప్రభువుల ప్రాపంకంలో జీవించేవారు. పోషణపొందేవారు. నాయర్ల వంశానికి చెందినవారే నాయర్ గా పిలువబడేవారు. నాయర్లు నిమ్నకులాల వారిని తాకరు. వారితో కలసి భోజనం చేయరు. నీరు తాగరు.

"నాయర్లు వివాహం చేసుకోరు. అందు వల్ల వారి సోదరీల సంతానం (మేనల్లుళ్ళు) వీరికి వారసులు ఔతారు. నాయరు స్త్రీలు జన్మతో స్వతంత్రులే. వీరు నాయర్లతోనూ బ్రాహ్మణులతోనూ సంబంధం పెట్టుకుంటారు. తక్కువ కులాల వారితో కలవరు. నాయరు బాలికలకు 12 సంవత్సరాలు రాగానే తల్లులు గొప్ప వేడుక జరుపుతారు. వారి సంఘంలో ఒక పెద్ద మనిషితో వివాహం తంతు జరుపుతారు. ఆ తర్వాత నాయరు

యువకులలో ఒకరిని కన్నెరికం నుండి విముక్తి చేయవలసిందిగా కోరుతారు. నాయర్లలో కన్యలతో సంభోగించడం స్త్రీ పై అత్యాచారంగా భావించడం వల్ల చాలావరకు నాయర్ యువకులు ముందుకు రారు. కన్యరికం తొలగిన స్త్రీలతోనే వారు కలవడానికి, ఇష్టపడతారు. ఆ తర్వాత నాయరు యువకులలో ఎంత ఎక్కువ మందితో పోషింపబడితే అంత గౌరవంగా భావించబడేది. ఒకరికన్నా ఎక్కువ మంది పురుషులతో సంబంధం ఉన్నస్త్రీ ప్రతి పురుషుడికి ఒక రోజు కేటాయించేది. మధ్యాహ్నం నుండి మరుసటి మధ్యాహ్నం వరకు ఒక రోజుగా పరిగణించబడేది. ఇష్టంలేని పురుషుడిని దూరం చేసుకోగల స్వాతంత్ర్యం ఆమెకు ఉండేది. అదే విధంగా ఆమెకు కలిగిన సంతానం పై అధికారం కూడా ఆమెదే. అందువల్ల ఆమెతో సంబంధం గల పురుషులకు ఆ సంతానంపై ఎట్టి అధికారం లేదు. అదే విధంగా ఆ సంతానానికి ఆమెతో సంబంధం గల పురుషుల ఆస్తిపై ఎట్టి హక్కులు ఉండేవి కావు. నాయరు పురుషులకు వివాహాలు లేవు కాబట్టి వారు రాజు సేవలో ఎట్టి వ్యక్తి గత బాదర బందీలు లేకుండా సైన్యంలో పని చేయడానికి అవకాశం ఏర్పడింది.

" ఈ మలబారు రాజ్యంలో మరొక కులం వారు బ్యాబార్లు అని పిలవబడేవారు. వీరు స్థానికులు, వ్యాపారస్తులు. విదేశీ వ్యాపారులు ఇక్కడికి రాక ముందు నుంచే ఇక్కడ వ్యాపార లావాదేవీలు వీరు నిర్వహించేవారు. ఓడ రేవుల వద్ద , దేశంలోని లోతట్టు ప్రాంతాలలోనూ సరుకుల అమ్మకం, కొనుగోళ్ళు చేసేవారు. లాభాలను పొందేవారు. నాయర్లనుండి, ఇతరరైతుల నుండి మిరియాలు, అల్లం సమకూర్చేవారు. రైతులకు పంటలకన్నా ముందుగానే డబ్బులిచ్చి పంటలకాలంలో ధాన్యరూపంలోనూ, నూలు వస్త్రాల మారక రూపంలోనూ పంటలు కొనే వారు. ఆ తర్వాత ఈ వస్తువులను ఎక్కువ ధరకు అమ్ముకొని లాభాలు గడించేవారు. న్యాయ పరంగా వీరికి రాజు నుండి కొన్ని ప్రత్యేక ప్రయోజనాలు ఉండేవి.

" కూయవమ్ (కుమ్మరి) అని మరో కులం ఉన్నది. వీరు నాయర్ల నుంచి వేరు పడిన ఒక ఉపకులం. రాజమందిరాలకు, దేవాలయాలకు కావలసిన పెంకులు, ఇటుకలు చేసేవారు సాధారణ రాజమందిరాలు తప్ప ఇతర నివాసాలన్నీ గుడిసెలు, గడ్డితో కప్పబడినవే. ఈ కులం వారికి ప్రత్యేక దేవతా విగ్రహాలున్నాయి.

" మరొక నిమ్నకులం మైనటోలు, వీరు రాజుకు, నాయర్లకు, బ్రాహ్మణులకు బట్ట లు ఉతికేవారు. మరొక పనేదీ చేసేవారు కాదు.

"మరొక కులం చాలేటీలు. వారు నూలు, సిల్కు వస్త్రాలు నేసేవారు. వీరు బీదవారు. నిమ్నకులాలకు చెందిన వారి బట్టలు మాత్రమేనేసేవారు. వీరికి ప్రత్యేక దేవుళ్ళు ఉన్నారు.

"పై చెప్పబడిన వారు కాక ఇంకా పదకొండు తక్కువ కులాల వారు ఉన్నారు. వీరు కూడా ఇతరులను ముట్టుకునేవారు కారు. అట్లా ముట్టుకుంటే మరణ శిక్ష కూడా విధించేవారు. ఈ కులాలు మిశ్రమం కాకుండా జాగ్రత్త పడేవారు. వీరిలో సామాన్యమైన వర్ణ సంకరం కాని కులం తుయ్యాలు. వీరు కొబ్బరిచెట్లు పెంచి, వాటి కాయలు అమ్ముకునేవారు. బరువులను మోసేవారు.

"మానెన్(మంచు) అనబడే కులం వారు క్రింది కులాలవారికి బట్టలు ఉతికేవారు. చాపలు నేసేవారు. వీరికి ప్రత్యేకమైన దేవతలున్నారు.

" మరొక నిమ్నకులం చనకూలు. వీరు పిన్నులు, గొడుగులు చేసేవారు. వీరు జాతకాలు చెప్పేవారు. భవిష్యత్తు గురించి సోది చెప్పేవారు.

"ఆగెరీలనబడే కులం వారు ఇళ్లు కట్టేవారు. వడ్రంగి పని, లోహపు పని చేసేవారు. వీరిలో వివాహాలున్నాయి. వారి సంతానానికి వారసత్వ హక్కులు ఉన్నాయి.

"తుయ్యాలతో సమానమైన మోగెర్లు అనబడే వేరొక కులం ఉంది. రాజు సామాన్లు ఒక చోటి నుంచి మరొక చోటికి మోసుకెళ్ళేవారు. వీరిలో కొందరు నావికులుగానూ, చేపలు పట్టేవారిగానూ ఉంటారు. వీరికి ప్రత్యేకంగా దేవుళ్ళు లేరు. నాయర్లకు బానిసలుగా కూడా ఉండేవారు.

"చేపలు పట్టేకులం మాంకర్లు. వీరు గొప్ప నావికులు కూడాను. వీరు సిగ్గులేని దొంగలు. వీరిలోనూ వివాహాలున్నాయి. సంతానానికి వారసత్వ హక్కులున్నాయి. వీరి స్త్రీలకు మంచి ప్రవర్తన ఉండదు. వీరికి లైంగిక స్వేచ్ఛ కలదు. అతిచరించడం వీరిలో తప్పుకాదు. వీరికి ప్రత్యేకంగా దేవుళ్ళు ఉన్నారు.

" మరొక నీచకులం బెతున్లు. వీరి పని ఉప్పు తయారు చేయడం, వడ్లు పండించడం. వీరి ఇళ్ళు రోడ్డుకు దూరంగా కట్టుకునేవారు. పెద్ద మనుషుల దారికి దూరంగా ఉండేలా వారినివాసాలు నిర్మించుకొనేవారు. వీరికి ప్రత్యేకంగా కుల దేవతలున్నారు. నాయర్లకు, రాజుకు బానిసలుగా పని చేసేవారు. ఉన్నత కులాల వారు వీరితో చాలా దూరంగా ఉంటూ మాట్లాడే వారు. మరొక కులంతో వీరికి ఎటువంటి సంబంధం ఉండేది కాదు.

" మంత్రాలు, మాయలు చేసే మరొక నిమ్నకులం పనీన్లు."

గ్రామాలకు గడ్డి, వంట చెరుకు మోసుకుపోయే చాలా బీదకులం రెవోలీన్లు. వీరు ఇతరులను తాకరాదు. తమ మానాలు కాపాడుకోవడానికి మాత్రమే చిరిగిన, అతుకుల దుస్తులు కాని ఆకులు గాని కప్పుకొనేవారు. వీరి స్త్రీలు ఇత్తడితో చేసిన ఆభరణాలు చెవులకు, కంఠానికి, చేతులకు ధరించేవారు.

" అందరికన్నా తక్కువ కులం పోలియాలు. వీరు దున్నపోతులతోనూ, ఎద్దులతోనూ వ్యవసాయం చేసేవారు. ఊరికి దూరంగా నివసించేవారు. వీళ్ళు గట్టిగా కేకలు వేస్తూ వెళ్ళేవారు. ఉన్నత కులాలకు చెందిన వారు ఈ కేకలు విని దూరంగా తప్పుకొనే వారు. పొరపాటున తాకినవారిని చంపేవారు.

" మరొక నిమ్మకులం పరీన్లు. సాధారణంగా జన సంచారం లేని ప్రాంతాలలో ివించేవారు. వీరిని చూడటమే మహాపాపంగా భావించేవారు. వీళ్ళు కందమూలాలు తిని జీవించేవారు. నడుముకు ఆకులు చుట్టుకునేవారు. అడవి జంతువుల మాంసం తినేవారు.

" ఈ విధంగా ఒకరితో మరొకరు కలవని, నిమ్నకులాల దాదాపు 18 ఉన్నాయి. వీరు కాక స్థానికులు కాని వ్యాపారస్తులు పెద్ద భవనాలు ఆస్తులు కల్గి తమకంటూ ప్రత్యేక ఆచారాలు ఉన్నవారు కూడా వేరే ప్రజలు మలబారులో జీవించేవారు".

విదేశీయులు కులాలంగూర్చిన పూర్తి వివరాల తో కూడిన చిత్రణ ఇవ్వ లేక పోయారని అర్థం చేసుకోవచ్చు. ప్రతి హిందువు వ్యక్తి గత జీవితం పై కప్పబడిన పరదాను తొలగించి లోపలికి చొచ్చుకొని పోయి చూడగల్గిన అవకాశం విదేశీయులకు లేదు. ప్రాంతీయ వ్యత్యాసాలతో పాటు, ఆశ్చర్యం కలిగించే సంక్లిష్ట స్వరూపం భారతీయ

సమాజానిది. భారతీయ సమాజం ఏ ఒక్క న్యాయ సూత్రానికి పూర్తిగా లొంగనిది. హిందూ సమాజంలోని కుల వ్యవస్థ, విదేశీయులకు ప్రత్యేకంగా కనిపించడంలో అనుమానం లేదు. అందువల్లనే భారతదేశానికి వచ్చిన ప్రతి వారూ, ఈ వ్యవస్థను ప్రత్యేకంగా గుర్తించారు.

అందువల్ల కులం హిందూ సమాజంలో ఒక విశిష్టమైన వ్యవస్థ. అంతేకాక పెరుగుతున్న వ్యవస్థ. కాలానుగుణంగా మారుతూ వచ్చింది. మెగస్తనీసు చెప్పిన కాలానికీ, అల్బెరూనీ, పోర్చుగీసు వారు వర్ణించిన కాలానికి కుల స్వరూపం ఎంతో మార్పుకు లోనైనది. కులం వాస్తవ స్వరూపం, స్వభావం తెలుసుకోవడానికి, విదేశీయుల వివరణలపై పూర్తిగా ఆధారపడకుండా స్వతంత్రంగా పరిశీలించవలసి ఉంది.

అందుకు గాను భారతీయ సామాజిక నిర్మాణానికి మూల సూత్రాలను పరిచయం చేసుకోవాలి. మొదట్లో ఉన్న నాల్గు వర్ణాలు, ఆ తర్వాత కాలంలో పలు కులాలుగా విభజించబడటం పరిశీలించాలి. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర వర్ణాలుగా ఒక కాలంలో ఉండిన సామాజిక విభజన, తర్వాతకాలంలో కులాలు (జాతులు)గా రూపొంది, క్రమేణ నాల్గువేల కులాలుగా విభజించబడ్డాయి. ఆధునిక కుల వ్యవస్థ ఈవిధంగా ప్రాచీన వర్గ వ్యవస్థ నుండి పరిణామం చెందింది. ఐనప్పటికీ కుల వ్యవస్థ నర్థం చేసుకోడానికి వర్ణ వ్యవస్థను అధ్యయనంచేస్తే సరిపోదు. వర్ణంనుండి కులాన్ని వేరు చేసి చూడ వలసి ఉంది.

II

"నాకు తెలిసిన ఒకే ఒక విషయం నాకు ఏమీ తెలీదని, ఆ సంగతి కూడా నాకు ఖచ్చితంగా తెలుసునని చెప్పలేను" అని వెనుకటికి ఒక అజ్ఞేయవాది తన తత్వం గురించి క్లుప్తంగా చెప్పాడట.

సర్ డెనిజిల్ ఇబ్బెట్సన్ పంజాబ్‌లో కుల వ్యవస్థ గురించి వ్రాస్తూ సరిగ్గా ఇలాగే అన్నాడు. స్థానిక పరిస్థితుల దృష్ట్యా కులాల గురించి ఖచ్చితంగా నిర్ణయించి చెప్పలేము. ప్రాంతీయ వ్యత్యాసాలు కులాలపై కూడా తమ ప్రభావాన్ని చూపడం వల్ల ప్రతి కులం ఆయా ప్రాంతాలని బట్టి భిన్నంగా ఉంటుంది.

ఇది వాస్తవమైనప్పటికీ ప్రతికులానికి గల కొన్ని ముఖ్యమైన మౌలిక లక్షణాలు, బైటికి మనకు కనబడే లక్షణాలను వేరు చేసి పరిశీలించవచ్చును. అందుకు గాను ఒక్క

ప్రశ్న వేస్తే సరిపోతుంది. ఏ పనులు చేయడం వల్ల ఒక వ్యక్తి తన కులం నుంచి బహిష్కరింపబడతాడో తెలుసుకుంటే సరిపోతుంది. కుల బహిష్కరణకు దారితీసే కారణాలను భట్టాచార్య ఇలా వివరించారు.

1) క్రైస్తవ, ఇస్లాం మతాలలో చేరడం, 2) అమెరికా,ఐరోపాలకు వెళ్ళడం, 3) వితంతువును వివాహమాడడం 4) జంధ్యాన్ని నల్గురిలో విసరి వేయడం 5) అందరిలో మాంసాన్ని భక్షించడం 6) మహ్మదీయుడు గాని క్రైస్తవుడు గాని, తక్కువ కులానికి చెందిన వాడు గాని చేసి ఉడికిన ఆహారాన్ని తినడం 7) చాలా తక్కువ కులానికి చెందిన శూద్రుని ఇంట్లో పనిచేయడం 8) ఇంట్లో నుంచి నీతి బాహ్యమైన ఉద్దేశ్యంతో బైటికి వెళ్ళిన స్త్రీ వల్లను 9) వితంతువు గర్భవతి ఐనప్పుడు. ఈ పట్టికలో ముఖ్యమైన మరో రెండు కారణాలు చేర్చబడలేదు. 10) కులాంతర వివాహం 11) ఇతర కులాలతో కలిసి భోజనం చేయడం, 12) వృత్తి మార్చుకోవడం. భట్టా చార్య చెప్పినదాంట్లో మరొక లోపం కూడా ఉంది. ఈ కారణాలలో అతి ముఖ్యమైనవి, అంతగా ముఖ్యం కానివని తేడా చూపలేదు. ఏ కారణం చేత ఒక వ్యక్తి బహిష్కృతుడైనప్పటికి, శిక్ష అందరికీ సామాన్యమే. అతని మిత్రులు, బంధువులు, తోటి వారెవరూ అతని ఆతిధ్యం స్వీకరించరు. వారి ఇళ్ళలో శుభకార్యాలకు పిలవరు. అతని సంతానానికి వధూవరులు దొరకరు. అంతకు ముందే వివాహమైన అతని కూతుళ్ళు కూడా పుట్టినింటికి పోరాదు. పురోహితుడు, మంగలి, చాకలి అతనికి సేవలందించరు. అతని కులం వారెవరూ అతనితో ఎట్టి సంబంధమూ పెట్టుకోరు. కనీసం అతని ఇంట్లో చావుకు కూడా వెళ్ళరు, సహకరించరు. కొన్ని సందర్భాలలో బహిష్కృతుడు దేవాలయాలకు గాని, శ్మశానాలకు గాని వెళ్లడానికి వీలుండదు.

కుల బహిష్కరణకు చూపిన ఈ కారణాలు పరోక్షంగా కుల నిబంధనలను తెల్పుతాయి. కాని అన్ని నిబంధనలు మౌలికమైనవి కావు. అందులో చాలా మటుకు తప్పనిసరైనవి కావు. కొన్ని నిబంధనలు పాటించకపోయినప్పటికి కులంలో కొనసాగవచ్చును. ఈ కారణాలలో మౌలికమైన వాటిని గుర్తించడానికి మరొక ప్రశ్న వేయవచ్చును. ఒక హిందువు తాను కోల్పోయిన కులాన్ని మళ్ళీ ఎలా పొందవచ్చునో తెలుసుకుంటే చాలు. హిందువులకు తిరిగి కులంలో ప్రవేశించడానికి ప్రాయశ్చిత్తాలు చెప్పబడ్డాయి. కుల నేరాలు చేసినవారికి ఎట్టి ప్రాయశ్చిత్తము ఉండదు. కాగా ఇతర

నేరాలకు వేరు వేరుగా ప్రాయశ్చిత్తాలు చెప్పబడ్డాయి. కొన్ని నేరాలకు అతిసామాన్యమైన శిక్షలు, ఇతరమైన వాటికి కఠినమైన ప్రాయశ్చిత్త మార్గాలు సూచించారు.

కొన్నింటికి ప్రాయశ్చిత్తము, మరి కొన్నింటికి వేరు మార్గము లేకపోవడం స్పష్టంగా అర్థం చేసుకోవలసి ఉంది. అతి తీవ్రమైన నేరం చేసినవారిని ఎట్టి పరిస్థితులలోను తిరిగి ఆ కులంలోకి తీసుకోరు. సాధారణ నేరాలకు మాత్రమే ప్రాయశ్చిత్తం ద్వారా తిరిగి కులంలోకి చేర్చుకుంటారు.

1) మతం మార్చుకోవడం, 2) మతాంతర, కులాంతర వివాహం చేసుకోవడం ప్రధాననేరాలుగా భావిస్తారు. అట్టివారికి ఎట్టి పరిస్థితుల్లోను తిరిగి తమ కులంలోకి ప్రవేశించవీలుండదు.

ప్రాయశ్చిత్తానికి ఒప్పుకునే ఇతర నేరాలలో తీవ్రమైనవి రెండు 1) హిందువు కాని వానితోనూ, ఇతర కులానికి చెందిన వారితోనూ భుజించడం 2) కుల వృత్తిని వదలి వేరే వృత్తిని స్వీకరించడం. ఇవి కాక ఇతర నేరాలు సామాన్యమైనవిగా పరిగణిస్తారు. వీటికి శిక్ష స్వల్పంగా ఉంటుంది.

ప్రాయశ్చిత్త నిబంధనలు పరిశీలిస్తే ఒక కులం యొక్క మౌలిక సూత్రాలు, ఆ కులం గురించి మనకు వివరంగా తెలుస్తుంది. నిస్సందేహంగా ఒక కులానికి నాల్గు ప్రధాన సూత్రాలను గుర్తించవచ్చు. ఎ) హిందూ మతం పై నమ్మకం బి) వివాహము, సి) ఆహారము, డి) వృత్తి విషయాలలో నిర్దిష్టమైన నిబంధనలు పాటించే ఒక సామాజిక విభాగంగా కులాన్ని నిర్వచించవచ్చును. అట్టి విభాగానికి ఒక సామాన్యమైన పేరు గుర్తింపుకొరకు ఉండడమనే మరొక లక్షణాన్ని కూడా పై వాటికి చేర్చవచ్చును.

కులవ్యవస్థకు మూలస్తంభంలాంటిది వివాహం పై గల నిబంధన. కులాంతర వివాహాన్ని పూర్తిగా నిషేధించారు. ఇది కులానికి మూలస్థంభం వంటి భావన.

కులాంతర వివాహాలు నిషేధించినట్లే ఇతరకులాలతో సహ పంక్తి భోజనం కూడా నిషేధించబడింది ఆ విధంగా కులం ఒక అంతర్వివాహ విభాగమే కాక సామూహిక భాగం కూడా.

కుల వృత్తికి ప్రాధాన్యతనిచ్చారు. కులవృత్తి ప్రతి వారు తప్పక పాటించాలి. ఏ కులానికైతే ప్రత్యేక వృత్తి అంటూ చెప్పబడలేదో అట్టివారు తండ్రి తాతలు అవలంబించిన వృత్తినే కొనసాగించాలి.

సమాజంలో వ్యక్తి యొక్క స్థాయి అతని కులాన్ని బట్టి శాశ్వతంగా నిర్ణయించబడింది. అది వంశాను గతం. ప్రతి హిందువు కూడా అతని తల్లి దండ్రులకులానికే తాను చెందడం వల్ల పుట్టుకతో పాటు కులం, కులం వల్ల సామాజిక స్థాయి ముందు గానే నిర్ణయించబడి ఉంటుంది. కులాన్ని మార్చుకోవడానికి గాని, సాంఘిక అంతస్తు మార్చుకోవడానికి గాని ఏ హిందువుకు అవకాశం లేదు. తాను పుట్టిన కులం తాను చచ్చేవరకూ వెంటనే ఉంటుంది. కొత్త కులంలోకి గాని, ఉన్నత స్థాయిని పొందడానికి గాని ఎవరికీ వీలు లేదు. కులాన్ని పోగొట్టుకోవడంతోటే అతని సాంఘిక స్థాయిని కోల్పోతాడు.

కులానికి ఒక సామాన్య పేరు పెట్టడంలో విశిష్టత ఏమిటి? ఈ ప్రశ్నకు సమాధానం చెప్పుకోవాలంటే ఇందుకు సంబంధించిన మరి రెండు ప్రశ్నలను అడగవలసి ఉంటుంది. సామాజిక సమూహాలు రెండు రకాలు. వ్యవస్థాగతమైనవి, కానివి. ఏ సామాజిక సమూహానికి నిర్దిష్టమైన నిబంధనలు ఏర్పరచుకొనబడి పాటించబడతాయో, అట్టివి వ్యవస్థాగతమైనవి. ఇట్టి సమూహంలోని ప్రతి సభ్యునికి కొన్ని విధులు, ప్రయోజనాలు నిర్దేశించబడి ఉంటాయి. అందులో చేరే ప్రతి వ్యక్తికి ఆ సంఘం యొక్క లక్ష్యాలు, ఆదర్శాలు, కార్యక్రమాలు పూర్తిగా తెలుసుకొని స్వచ్ఛందంగానే చేరే అవకాశముంటుంది. ఇతర సమూహాలలో వ్యక్తి ఇష్టాయిష్టాలతో సంబంధం లేకున్నా సాంప్రదాయ సిద్ధమైన నిబంధనలకు తలొగ్గుతూ ఉండాలి.

కులం ఒక వ్యవస్థీకరించబడిన సామాజిక విభాగము. శాశ్వతమైనది. తన ఇష్టంతో సంబంధంలేకుండానే మనిషి కులంలో సభ్యుడౌతాడు. పుట్టినకులంలోనే తన జీవితాన్ని గడిపేయాలి. ఏ కులానికీ చెందని హిందువు ఉండడు. తన అదుపులోలేని నిబంధనలకు, సాంప్రదాయాలకు అతడు బానిస, అందువల్ల కులం వ్యవస్థీకరించబడినట్టి, స్వచ్ఛందంకాని ఒక సామాజిక వ్యవస్థ. ప్రతికులానికి ఒక నిర్దిష్టమైన పేరు పెట్టడం వల్ల ఆ కులం ప్రత్యేక అస్తిత్వాన్ని నిలబెట్టడానికి, శాశ్వతంగా కొనసాగడానికి సాధ్యపడింది. కుల వ్యవస్థపై ఇంత వరకూ వ్రాసిన వారెవరూ ప్రత్యేక పేరు ప్రాముఖ్యతను గుర్తించలేదు.

ఇతర దేశాలలో కూడా భారతదేశంలోని వివిధ కులాలను పోలినట్టి సామాజిక విభాగాలున్నాయి. కుండలు చేసేవారు, బట్టలుతికేవారు, మేధావులు వేరు వేరు సామాజిక సమూహాలుగా అన్ని దేశాలలోనూ చూడవచ్చును. కాని ఇతర దేశాలలో ఈ సమూహాలు అవ్యవస్థీకృతమైన స్వచ్ఛంద సమూహాలుగా నిలిచిపోయాయి. మనదేశంలో లాగా ప్రత్యేకకులంగా వ్యవస్థీకృతమైన స్వచ్ఛందంకాని సమూహాలుగా రూపొందలేదు. ఇతర దేశాలలో ఆయా ప్రత్యేక సమూహాలకు ప్రత్యేకంగా పేర్లు పెట్టలేదు. కులం పేరు వల్లనే దానికి స్థిరత్వము, శాశ్వతత్వమూ, ప్రత్యేక వ్యక్తిత్వమూ ఏర్పడింది. కొన్ని కులాలలో పుట్టిన వారికి ఆ కులం పేరు వారి పేరు వెంటనే ఇంటి పేరులా చెప్పబడుతుంది. ఈ కులంపేరు వల్లనే వారినందరినీ ప్రత్యేకనిబంధనల పరిధిలోకి తేవడానికి వీలౌతోంది. అది నిబంధనలు పాటించని నేరస్తుడు ఇతర కులాల వాడుగా చెలామణీ కాకుండా రక్షణ కల్పిస్తుంది. అదే విధంగా, అతని కులం వారి చేతికి అప్పగించి, వారిచేతనే అతన్ని శిక్షించడానికి సాధ్యమౌతున్నది.

ఇంతవరకూ కులం అంటే ఏమిటో తెలుసుకున్నాం. ఇప్పుడు కుల వ్యవస్థ అంటే ఏమిటో తెలుసుకుందాం. ఇందుకు ప్రధానంగా వివిధ కులాల మధ్య గల సంబంధాలను తెలుసుకోవలసి ఉంటుంది. కుల వ్యవస్థ అనగానే ఎన్నో లక్షణాలు మనకు తోస్తాయి. ఒక వ్యవస్థలోని వివిధ కులాల మధ్య అంతర సంబంధాలు లేవు. ప్రతి కులము ప్రత్యేకమైనది. తన ప్రత్యేక నిబంధనలు రూపొందించుకొనుటకు, ఆంతరంగిక వ్యవహారాలను నడుపుకోవటంలోను ప్రతికులం స్వతంత్రమైనది. ఒక కులం మరొక కులాన్ని బహిర్గతంగా స్పృశించగలదే కానీ లోపలికి చొచ్చుకొని పోలేదు. రెండవ లక్షణము కులాలకు గల స్థానాలలోని వరుస క్రమం. ఈ వరుస క్రమం నిలువుగా (Vertica ఏర్పడిందేకాని అడ్డుగా (Horizontal)కాదు.

మరో మాటలో చెప్పాలంటే ఈ కులాలకు సమానస్థాయి లేదు. వాటి వరుసక్రమం అసమానత్వం పై ఆధారపడి ఉంది. ఒక కులాన్ని మరొక కులంతో పోల్చినప్పుడు దానికంటే పెద్దదో, చిన్నదో అవుతుంది. క్రమానుగత శ్రేణి (Hierarely) లో ఈ కులాలలో ఒకటి అత్యున్నత స్థాయిలోను మరొకటి అట్టడుగునను ఉండి వీటి మధ్యలో మిగిలిన కులాలన్నీ మరొక కులానికి ఎగువనో, దిగువనో ఉండేటట్లు ఉంటాయి. కుల వ్యవస్థలో అత్యున్నత కులము, అట్టడుగు కులములు తప్ప మిగిలిన అన్ని కులాలకు పై కులాలు, క్రింది కులాలు ఉంటాయి.

కులాలలో ఔన్నత్యము, నిమ్నత్వము; మరొక కులానికి లోబడి వుండడము ప్రధానంగా రెండు సూత్రాలపై ఆధారపడింది. 1) మత సంబంధమైన కర్మకాండలలోను, 2) సాంఘిక సంబంధాలలోను ఏర్పడిన నిబంధనలను బట్టి ఈ తారతమ్యము నిర్ధారించబడుతుంది.

మత సంబంధమైన కర్మకాండలలో తారతమ్యాలు మూడు రకాలుగా గుర్తించ వచ్చును. 1) మత సంబంధమైన ఆచారాలను (సంస్కారాలు) పాటించే విధానాలలోను 2) మతాచారాలతో పాటు చెప్పబడే మంత్రాల ఆధారంగాను 3) వారికి తోడ్పడే పూజారి సాంఘిక స్థాయినిబట్టి నిర్ణయించబడుతుంది.

మతాచారాలకు సంబంధించిన నిబంధనలను బట్టి తారతమ్యాలను గుర్తించ వల్సి వచ్చినప్పుడు హిందూ పవిత్ర గ్రంధాలలో చెప్పబడిన పదహారు రకాల మతాచారాలను గమనించగలసి వుంటుంది. హిందూ ఆచారాలే అయినప్పటికి ప్రతి హిందువుకూ ఈ పదహారు సంస్కారాలను పాటించే అధికారం లేదు. కొందరికి మాత్రమే ఈ సంస్కారాలన్నిటిని పాటించే హక్కుంది. మరి కొందరికి కొన్నిటిని మాత్రమే అవలంబించే వీలుంది. మరి కొందరికి కొన్ని సంస్కారాలు నిషేధించబడ్డాయి. ఉదాహరణకుః- ఉపనయన సంస్కారంలో జంధ్యాన్ని ధరించడము పరిశీలించినట్లయితే కొన్ని కులాలకు ఉపనయనము నిషేధించబడింది. ఇతర కులాలకు ఈ సంస్కారాన్ని పాటించడంలో కూడా తేడాలు ఏర్పడినాయి. అన్ని సంస్కారాలు పాటించగలిగిన కులం అత్యున్నతమైనది గాను, కొన్నింటిని మాత్రమే పాటించగలిగిన కులం దాని కన్నా తక్కువగాను గుర్తించబడింది.

ఇక పోతే వారు చదివే మంత్రాల ఆధారంగా కూడా ఈ కులాల తారతమ్యాలను గుర్తించవచ్చును. హిందు మతంలో ఒకే ఆచారానికి మూడు పద్ధతుల్లో మంత్రోచ్ఛారణ జరుగుతుంది. 1) వేదోక్తము 2) శాస్త్రోక్తము 3) పురాణోక్తము. వేద విహిత కర్మలలో మంత్రాలు వేదాల నుంచి చదువుతారు. అలాగే శాస్త్రోక్త విధానంలో ఈ మంత్రాలు శాస్త్రాల నుంచి గ్రహిస్తారు. అలాగే పురాణోక్త కర్మలలో మంత్రాలు పురాణాల నుంచి తీసుకుంటారు. హిందుమత గ్రంధాలలో 1) చతుర్వేదాలు, 2) షట్ శాస్త్రాలు 3) అష్టాదశపురాణాలు అని మూడు రకాలు. ఇవన్నీ పవిత్రమత గ్రంధాలుగా అంగీకరించినప్పటికి వీటిలో వేదాలకు అత్యున్నత స్థానము, శాస్త్రాలకు మధ్యమ స్థానము ఇవ్వబడింది.

సాంఘిక తారతమ్యాలలో వివిధ కులాలు పాటించే మంత్ర విధానం భిన్నంగా వుంటుంది. అన్ని కులాలకు వేదోక్త విధానాన్ని సమానంగా పాటించే అధికారం లేదు.

పదహారు సంస్కారాల్లో ఏ ఒక్క సంస్కారాన్నైనా పాటించడంలో ఒక కులం వేదోక్త విధానాన్ని, మరొకటి శాస్త్రోక్త పద్ధతిని, మూడవది పురాణోక్త పద్ధతిని పాటిస్తాయి. అందువల్ల తమకనుకూలమైన మంత్ర విధానాన్ని బట్టి కులం యొక్క ఔన్నత్యం నిర్ధారించబడుతుంది. వేదోక్త మంత్రాలను అనుసరించే కులం కన్నా శాస్త్ర విధానాన్ని పాటించే కులం తక్కువది గాను, పురాణోక్త విధానాన్ని పాటించే కులాన్ని ఈ రెంటి కన్నా తక్కువగాను గుర్తించడం జరుగుతుంది.

మతాచారాలను పాటించడంలో సహకరించే పురోహిత వర్గాన్ని బట్టి కూడా కులాల తారతమ్యాన్ని నిర్ధారించవచ్చును. మత గ్రంథాల ద్వారా నియమించబడిన పురోహితుడిని బ్రాహ్మణుడు అంటారు. కాబట్టి, మతాచారాల నిర్వహణలో బ్రాహ్మణుడి సహకారం తప్పనిసరి. కాని హిందువుల్లో ఏ కులం వారయినా బ్రాహ్మణుడి పౌరోహిత్యాన్ని కోరుకోగలిగేలా మతగ్రంథాలు శాసించలేదు. అందువల్ల బ్రాహ్మణుడి ఇష్టాయిష్టాలపై ఆయా కులాల మతాచారాలను నిర్వహించటం ఆధారపడింది. అందువల్ల తనకిష్టమైనచోట ఆహ్వానాలను మన్నించటం , లేకపోతే తిరస్కరించటం జరుగుతోంది. కాలక్రమేణా బ్రాహ్మణుడు పౌరోహిత్యం వహించే కులాలేవో స్థిరపడినాయి. ఆ విధంగా కూడా కులాల మధ్య అంతరం గుర్తించబడింది. ఈ కారణంగా బ్రాహ్మణుడు పురోహితుడుగా వచ్చే కులాలు ఉన్నతమైనవి గాను, ఇతర కులాలు తక్కువగాను గుర్తిచబడింది.

సాంఘిక సంబంధాలు, కట్టుబాట్లు ఆధారంగా కూడా కులాల తారతమ్యాలను నిర్ధారించవచ్చును. సామాజిక సంబంధాలలో కలిసి భోజనం చేయడం చాలా ప్రధానమైంది. కాబట్టి కులాల మధ్య వివాహ సంబంధాలను నిషేధిస్తూ ఏర్పడిన నిబంధనల కన్నా, సహపంక్తి భోజనాల విషయంలో ఏర్పర్చిన నిబంధనలు ముఖ్యమైనవి. కులాంతర వివాహాల నిషేధాన్ని గౌరవించి ఖచ్చితంగా పాటించటం కన్నా సహపంక్తి భోజనాల నిషేధంపై ఏర్పర్చిన నిబంధనలు పాటించటం కష్టతరమైనవి. అన్ని కాలాల్లో, అన్ని పరిస్థితులలోను,ఇతర ప్రాంతాలకు వెళ్ళినప్పుడు భోజనాలపై గల నిబంధనలు పాటించటం ఎంతో కష్టమైన పని. మానవుడు తప్పనిసరిగానే ఇతర ప్రాంతాలకు వలస పోవలసి

వస్తుంది. కొత్త ప్రాంతంలో తన కులం వారు అతనికి దొరకకపోవచ్చును, పూర్తిగా తెలియని వ్యక్తుల మధ్య తాను బ్రతుకవలసి వస్తుంది. అటువంటి చోట వివాహం కన్నా ఆహారం చాలా అత్యవసరమైనది, వెంటనే కావలసినట్టిది. తన ప్రాంతానికి తిరిగి వచ్చేవరకు, తన కులం వారితో వివాహ సంబంధం కుదుర్చుకునే వరకు అతడు తన వివాహాన్ని వాయిదా వేసుకోగలడు. కాని ఆహారం కోసం ఎక్కువసేపు వేచి వుండలేడు. ఆకలైనప్పుడు ఎక్కడి నుంచైనా, ఎవరినుంచైనా అతడు ఆహారం అంగీకరించవలసి వస్తుంది. అప్పుడు అతడు ఎవరి నుంచి ఆహారం తీసుకోవచ్చు అన్న ప్రశ్న ఉదయిస్తుంది. తనకన్నా పై కులం నుంచి అతడు ఆహారం తీసుకోవచ్చు కాని తనకన్నాతక్కువ కులం వారి నుండి ఆహారం తీసుకూడదు. ఒక కులంనుంచి ఆహారం తీసుకోవచ్చునని మరొక కులం నుంచి ఆహారం తీసుకోరాదని నియమం ఎట్లా ఏర్పడిందో తెలియదు. సాంప్రదాయికంగా ఎన్నో తరాల నుంచి ఈ నియమం పాటించబడుతుంది. ముఖ్యంగా ఈ నియమం బ్రాహ్మణ సాంప్రదాయం వల్ల ఏర్పడి వుండవచ్చు. బ్రాహ్మణుడు ఆహారాన్ని, నీటిని పొందే విషయంలో చాలా నిర్దిష్టమైన సంక్లిష్టమైన నియమాలు ఏర్పడినాయి.

1) బ్రాహ్మణుడు కొందరి నుంచి మాత్రమే నీరు తీసుకోవచ్చు. 2) ఇతరకులాల వారెవరైనా నీటిలో ఉడికించిన ఆహారాన్ని బ్రాహ్మణుడు తినరాదు. 3) కొన్ని కులాల వారు నూనెతో తయారు చేసిన ఆహార పదార్థాలను అతను తినవచ్చు. అట్లాగే ఆహారం తయారు చేసే పాత్రల విషయంలో కూడా నిబంధనలు ఉన్నాయి. కొన్ని కులాల వారు మట్టి పాత్రలో ఇచ్చిన ఆహారాన్ని కాని, నీటిని కాని అతను స్వీకరించవచ్చు, మరి కొన్ని కులాల వారు లోహ పాత్రలలో ఆహారాన్ని, నీటిని ఇవ్వవచ్చు. మరి కొందరినుండి పింగాణి పాత్రలలో ఆహారాన్ని తీసుకోవచ్చు. ఈ నియమాలను బట్టి కులాల తారతమ్యాలను గుర్తించవచ్చు. నూనెతో చేసిన ఆహారపదార్థాలను ఒక బ్రాహ్మణుడికి సమర్పించగలిగిన కులం, ఆ విధంగా చేయలేని కులాలకన్నా గొప్పది. అట్లాగే అతడు తాగడానికి నీళ్ళు తీసుకోగల కులం కన్నా మరో కులం తక్కువది. లోహ పాత్రల్లో నీటిని సమర్పించుకోగల కులం మట్టి పాత్రలలో నీటిని ఇచ్చుకో గల కులం కన్నా గొప్పది. పింగాణి పాత్రలలో నీటిని ఇవ్వగలిగిన కులం పై రెండు కులాల కన్నా తక్కువది. పింగాణి పాత్రలలో ఆహార పదార్థాలు అంటుకోకపోవడం వల్ల అతి తక్కువ

కులం నుంచైనా వాటి ద్వారా బ్రాహ్మణుడు స్వీకరించవచ్చు. పింగాణీ పాత్రలకన్నా ఇతరమైన వాటికి మరకలు పడుతాయి. కాబట్టి అట్టి వాటిలో ఆహారాన్ని స్వీకరించడం, స్వీకరించకపోవడం ఆ బ్రాహ్మణుడి ఇష్టంపై ఆధారపడి వుంది. దానికి తగినట్టుగా ఆ కులం యొక్క సాంఘిక స్థాయి నిర్ధారించబడింది.

క్రమానుగత హిందూ కుల వ్యవస్థలో ఒక కులం యొక్క స్థాయి, భేదాలను గుర్తించటానికి పైన చెప్పబడిన విషయాలు ఉపకరిస్తాయి.

ఇది కులము, ఇది కుల వ్యవస్థ అని చెప్పటం తోనే హిందూ సాంఘిక వ్యవస్థను పూర్తిగా వివరించినట్లు కాదు. మార్పులేని హిందూ సాంఘిక వ్యవస్థను ఊహించినప్పుడు ఈ మాత్రం సరిపోతుంది. హిందువులందరు కొన్ని కులాల కింద విభజించబడినారని ఒక కులం కింద మరొక కులం ఉండేటట్లు ఈ శ్రేణి ఏర్పడిందని చెప్తే సరిపోతుంది. కానీ భారతదేశంలో కుల వ్యవస్థ చైతన్యంతో కూడుకున్నది. ఈ కులాలు తమకు చెందిన కార్యక్రమాల్లో పాల్గొనడాన్ని బట్టి ఇక్కడ కుల వ్యవస్థ వర్గ భేదాన్ని కూడా సూచిస్తుంది. వర్ణము, వర్గము కుల వ్యవస్థతో చేరటం వల్ల హిందూ సామాజిక వ్యవస్థ ఎప్పటికప్పుడు వివాదాస్పదమౌతూ వచ్చింది. కొందరు కులాన్ని వర్గంతోటి పోలుస్తారు. మరి కొందరు ఈ రెండు వేరని వాదిస్తారు. ఈ సందర్భంగా కుల వ్యవస్థకు చెందిన ఒక లక్షణాన్ని ప్రత్యేకంగా చెప్పుకోవలసి వుంటుంది. కులము, వర్గము వేరైనప్పటి హిందువుల్లోని అసంఖ్యాకమైన కులాలను కొన్ని వర్గాలుగా విభజించవచ్చును. హిందువులు కులంతో పాటు వారు చెందిన వర్గం గురించి కూడా ఎక్కువ పట్టింపు కలిగి వుంటారు. ఒకే వర్గానికి చెందిన మరొక కులంతో వివాదం ఏర్పడినప్పుడు అతడు కులాన్ని పట్టించుకున్నట్లే, తనకు చెందని వేరే వర్గంలోని తన కులంతో వివాద పడినప్పుడు తన వర్గాన్ని ఎక్కువగా పట్టించుకుంటాడు. ఇందుకు సాక్ష్యంగా మద్రాసు, బొంబాయి ప్రెసిడెన్సీలలోని బ్రాహ్మణ వ్యతిరేక ఉద్యమాన్ని చెప్పుకోవచ్చు. ఈ ఉద్యమాలను అధ్యయనం చేస్తే ఒక హిందువుకు కులము, వర్గము వాటికి సంబంధించిన స్పృహ, చైతన్యం ఎంత వాస్తవమైనవో అర్థమైతుంది. కులము, వర్గము యొక్క సరిహద్దులు వాస్తవంగా నిర్ధారించబడినట్లు తెలుస్తుంది.

వర్ణ వ్యవస్థలో నుంచి కులం ఉద్భవించిందని అంటారు. కాని ఇదెంత అసంగతమైనదో నేను తరువాత వివరిస్తాను. వర్ణం యొక్క అపభ్రంశ రూపమే కులం. వర్ణ వ్యవస్థ వ్యతిరేక దిశ నుంచి ఈ కులం ఉద్భవించింది. వర్ణ వ్యవస్థలోని వర్గ వ్యవస్థను కులం స్వీకరించింది. ఇప్పటి వర్గకుల వ్యవస్థ జాగ్రత్తగా పరిశీలిస్తే వర్ణ వ్యవస్థలోని వర్గ విభేధాలను అనుసరించిందని చెప్పవచ్చు.

ఈ వైపునుంచి కుల వ్యవస్థను పరిశీలించినప్పుడు వర్గ విభేదాల్లోని వివిధ అంతరాలు వివిధ కులాలకు చెందిన కుల పిరమిడ్‌ను ఏర్పరచిందని తెలుస్తుంది. ప్రాచీన చాతుర్వర్ణ వ్యవస్థలోనే ఈ విభజన మొదటి సారిగా ఆరంభమైనది. ఈ వ్యవస్థలో పై మూడు కులాలకు, నాలుగవ కులానికి మధ్య అంతరం ఏర్పడింది. మొదటి మూడు కులాలయిన, బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు ద్విజులుగాను, శూద్రులు అందుకు భిన్నంగాను గుర్తించబడ్డారు. ద్విజ కులాలు జంధ్యము ధరించవచ్చును. వేదాధ్యయనం చేయవచ్చును. శూద్రులకు ఈ రెండు అవకాశాలు లేవు. నేటికీ ఈ కులాలు ఈ కారణంగా భిన్న వర్గాలుగానే గుర్తించబడుతున్నాయి. ఈ విధంగా పై మూడు కులాలు ఉన్నత కులాలుగాను. శూద్రులు తక్కువ కులంగాను ఎంచబడినారు.

ఈ విభజన తరువాత తక్కువ కులాలలో వచ్చిన అంతరాలను పరిశీలించవచ్చును. చాతుర్వర్ణ వ్యవస్థలో మూడు వర్ణాలు నాలుగో వర్ణంకన్నా ఉన్నతమైనవిగా గుర్తించబడినాయి. అట్లాగే చాతుర్వర్ణాలలో ఉన్న కులాలకు చతుర్వర్ణాల బయట వున్న కులాలకు తేడా ఏర్పడింది. ఈ చాతుర్వర్ణాలలోనే ఉన్నత, నిమ్న కులాలు - బ్రాహ్మణుల నుంచి శూద్రుల దాకా - అందరిని సవర్ణులుగా, వీటికి బయట వున్న కులాలను, కులాలకు చెందిన వారిని అవర్ణులు గా గుర్తించారు. కుల వ్యవస్థ గురించి మనకు లభించే సాహిత్యం చాలా వరకు సవర్ణ హిందువులనే సూచిస్తుంది. అవర్ణ హిందువులను గురించి ఎక్కువగా చెప్పబడలేదు. ఈ అవర్ణ హిందువు ఎవరు? వీరికి హిందూ సమాజంలో వున్న స్థాయి ఎటువంటిది? వీరికి సవర్ణ హిందువులతో గల సంబంధ మెటువంటిది? అన్న ప్రశ్నలపై ఇంతవరకు ఖచ్చితంగా ఎవరూ తమ దృష్టి సారించలేదు. ఈ ప్రశ్నలకు సమాధానం చెప్పుకోకుండా హిందు సామాజిక నిర్మాణాన్ని అర్థం చేసుకోవడం వీలు పడదు. సవర్ణ, అవర్ణ హిందువుల మధ్య అంతరాన్ని చెప్పకుండా వదిలేస్తే మంత్రాలు, మంత్రగాళ్ళు లేకుండా విచిత్ర కథలను (Fairy Tales) చెప్పడానికి ప్రయత్నించినట్లవుతుంది.

అవర్ణ హిందువుల్లో మూడు రకాలవారు ఉన్నారు 1) ఆదిమకులాలు 2) నేరకులాలు 3) అస్పృశ్యకులాలు. మొత్తం జనాభాలో వీరి సంఖ్య తక్కువేమి కాదు. 1931 జనాభాలెక్కల ప్రకారం ఆదిమ కులాలకు చెందిన వారు ఇరువై ఐదు మిలయన్లు, నేరకులాలకు చెందినవారు 4 .5 మిలియన్‌లు, అస్పృశ్యులు 50 మిలియన్‌ల దాకా వున్నారు. వీరి మొత్తం జనాభా 79.5 మిలియన్‌లు.

సవర్ణ, అవర్ణ కులాలకు మధ్య అంతరం ఒకే విధంగా వుండదు. అవర్ణుల్లో ఆదిమ, నేర కులాలకు సవర్ణ కులాలతో గల సంబంధం ఒక విధంగానూ, అస్పృశ్యులతో గల సంబంధం వేరొక విధంగాను వుంటుంది. మొదటి రెండు అవర్ణ కులాలకు, సవర్ణ కులాలకు మధ్య కొంత వరకు మైత్రీ సంబంధం వుంటుంది. వీరి మధ్య మర్యాద లోపించని అంతర సంబంధాలు ఏర్పడే అవకాశం వుంది. కాని సవర్ణులకు, అస్పృశ్యులకు మధ్య విపరీతమైన వైరంతో కూడుకున్న అంతరం ఏర్పడింది. వీరి మధ్య మర్యాద పూర్వకమైన సత్సంబంధాలు ఏర్పడే అవకాశం లేదు.

ఈ అంతరానికి గల ప్రాముఖ్యత ఏమిటి? అది దేనిపై ఆధారపడి వుంది? ఈ అంతరం సత్యమైనప్పటికి దాని ప్రాతిపదిక సరిగ్గా వివరించబడలేదు. ద్విజులకు, శూద్రులకు మధ్యన వ్యత్యాసం ఏర్పడినట్లే ఈ అంతరాన్ని కూడా అర్థం చేసుకోవచ్చును. శూద్రులతో పాటు అవర్ణులు కూడా ద్విజ వర్గానికి చెందిన వారు కాదు. వీరికి జంధ్యం ధరించే అధికారం లేదు. ఈ సందర్భంగా రెండు అంశాలు ద్యోతకమైతాయి. సవర్ణులలోని శూద్రకులాలకు అవర్ణులలోని ఆదిమ, నేర కులాలకు మధ్య చాలా కొద్ది భేదం వుటుంది. వారు ద్విజులు కాక పోవటం, అస్పృశ్యులు కాకపోవటం వీరికి గల సామాన్య పోలికలు. అయితే వారి మధ్య గల వ్యత్యాసం వారి సంస్కృతిని బట్టి ఏర్పడిందనీ చెప్పవచ్చును. ఈ వ్యత్యాసాన్ని గురించి సనాతన హిందూ దృష్టి చాలా విపరీతంగాను ఇతరుల దృష్టి కొద్ది తేడా గాను కనిపిస్తుంది. సంస్కృతీ పరమైన వ్యత్యాసాన్ని గుర్తించటానికి ఈ రెండు వర్గాలకు చెందిన శూద్రులను 1) సత్‌-శూద్రులు 2) శూద్రులుగా గుర్తించారు. మొదటి వర్గానికి చెందిన శూద్రులు ఉన్నత సంస్కృతి గల వారి గాను, రెండవ వర్గానికి చెందిన వారిని హిందూ నాగరిక సమాజంలో అంగీకరించబడిన సామాన్య శూద్రులుగాను పేర్కొన్నారు. ఈ తేడా వల్ల సత్‌- శూద్రులు ద్విజులకు సన్నిహితంగా మెలగడానికి, ఇతరులు కొంత దూరంగా వుండడానికి అంగీకరించబడింది.

అవర్ణ కులాల మధ్యగల సంబంధం ఎటువంటిది? వారిని ఒక కులాల సంకలనంగా చూడవచ్చునా లేక వారి మధ్య కూడా వర్గ భేదాలు వున్నాయా? ఈ రెండు ప్రశ్నలకు కొంత వరకు అవును అని, కాదని కూడా సమాధానం చెప్పవచ్చును. అవర్ణులలో ఆదిమ, నేర కులాల మధ్య వర్గ భేదం వున్నట్టుగా తోచదు. కాని ఈ రెండు కులాలకు అస్పృశ్యులతో గల అంతరం మాత్రం చాలా పెద్దది. మొదటి రెండు కులాల వారు అస్పృశ్యుల కన్నాతాము ఉన్నత వర్గమని భావిస్తారు. అవర్ణ కులాలో అస్పృశ్యులు అతి తక్కువ స్థాయికి చెందినవారు.

ఇంతవరకు సాగిన చర్చలో హిందూ సామాజిక వ్యవస్థ యొక్క మూడు ప్రత్యేక లక్షణాలను గుర్తించాము 1) కులము 2) క్రమానుగత కుల వ్యవస్థ 3) కుల వ్యవస్థలో చొచ్చుకొనిపోయిన వర్గవ్యవస్థ. ఇట్టి సంక్లిష్టమైన వ్యవస్థాస్వరూపాన్ని అర్థం చేసుకోవడం చాలా కష్టమైన పని. అందువల్ల నాకు తోచినట్టు హిందు సామాజిక నిర్మాణాన్ని ఈ క్రింది పట్టిక రూపంలో చూపిస్తాను.

| సవర్ణ కులాలు | సవర్ణ కులాలు | అవర్ణ కులాలు | అవర్ణ కులాలు |
|---|---|---|---|
| ప్రథమ శ్రేణి | ద్వితీయ శ్రేణి | తృతీయ శ్రేణి | చతుర్ధ శ్రేణి |
| ఉన్నత కులాలు | నిమ్న కులాలు | ఆదిమ కులాలు | |
| ద్విజులు | శూద్రులు | నేర కులాలు | అస్పృశ్యులు |
| మూడు వర్ణాలకు | నాలుగవ వర్ణం | | |
| చెందినవారు | నుంచి | | |
| బ్రాహ్మణులు | | | |
| క్షత్రియులు | వచ్చినవారు | | |
| వైశ్యులు | శూద్రులు | | |

ఈ పట్టిక హిందువుల వర్గకుల వ్యవస్థను వారి సామాజిక నిర్మాణాన్ని వివరిస్తుంది. హిందువులలో సవర్ణ, అవర్ణ విభజనను; అట్లాగే సవర్ణులలో ద్విజ, శూద్ర అనబడే రెండు ప్రత్యేక వర్గాలను చూపిస్తుంది. అవర్ణులలో ఆదిమ, నేర కులాలు ఒక వర్గంగాను; అస్పృశ్యుల వేరొక వర్గంగాను చూపించబడింది. ప్రతి కులం ఇతర కులాలతో వేరైనప్పటికి అట్టి సత్యాన్ని పట్టికలో చూపడానికి సాధ్యపడలేదు, అందువల్ల ఈ కులాలన్నింటిని నాలుగు వర్గాలుగా విభజించి వేరుగా చూపబడింది. ఈ కారణంగా ఒక వర్గానికి చెందని కులం మరొక వర్గానికి చెందిన కులంతో వేరుపరుచబడింది. ఒక వర్గానికి చెందిన కులాలన్నీ ఒకే కులంగా వవస్థీకరించబడవు కానీ వారి మధ్య తాము ఒక వర్గానికి చెందిన వారిమన్న భావం వుంటుంది. వీటి మధ్య ఏర్పడిన విభజన స్వభావంలో కొంత తేడా వుంది. కొన్ని విభజనలు శాశ్వతమైనవి, కొన్ని తాత్కాలికమైనవి. మరి కొన్నిటి మధ్య కొద్ది పాటి తేడా వున్నవి ద్విజులకు శూద్రులకు మధ్య వున్న విభజన స్వభావంలో కొంతతేడా వుంది చాలా సాధారణమైనది వారిని ఒకరితో మరొకరిని పూర్తిగా వేరు చేయడానికి ఉద్దేశించబడలేదు. వారిని వేరుగా చూపించడానికే ఆ తేడా ఏర్పడింది. శూద్రకులాలకు అవర్ణకులాలోని మొదటి రెండు కులాలకు మధ్య తేడా కూడా చాలా పలచనిది. ఈ విభజన కూడా వారిని వేరుగా చూపడానికే ఉద్దేశించబడింది. కాని ఒకరి నుంచి మరొకరిని పూర్తిగా దూరం చేయడానికి ఏర్పడలేదు. కాని పై మూడు వర్గాలకు, అస్పృశ్యులకు మధ్య ఏర్పడిన విభజన మాత్రం వాస్తవమైనది, తొలగించటానికి వీలులేనిది. అస్పృశ్యులను ఇతరుల నుంచి పూర్తిగా వేరు పరుచటానికి వారి చుట్టూ ఒక బలమైన అడ్డు గోడ నిర్మించబడింది. మొదటి విభజన తొలగిస్తే ద్విజులు, శూద్రులు ఒకే వర్గంగాను రెండవ విభజన తొలగిస్తే ద్విజుల, శూద్రులు, ఆదిమ నేర కులాలు ఒకే వర్గంగాను కనపడుతారు. కాని మూడవ విభజన తొలగించడానికి వీలు లేనిది. ఈ కులాలకు చెందిన మూడు వర్గాల్లో కూడా తామందరం అస్పృశ్యులతో కలిసి (ఒకటి) కామని భావించే విషయంలో ఏకాభిప్రాయం వుంది (పై వాక్యంలో ఒకటి అన్న పదం సంపాదకుడి చేత పూరించబడింది)

వివిధ వర్గాలకు చెందిన కులాలను వారి స్థాయిల భేదాన్ని సూచిస్తూ పట్టికలో చూపబడింది. సవర్ణులలో ఉన్నత, నిమ్న శ్రేణులకు చెందిన రెండు వర్గాలను వివరించాను. కాని అవర్ణులలో తక్కువ కులాల వారిని, అట్టడుగు కులాలవారిని రెండు వేరు వర్గాలుగా

వర్ణించలేదు. సాధారణ సాంఘిక స్థాయిలను బట్టి అవర్ణులలోని రెండు వర్గాలను నిమ్నతర, నిమ్నతమ వర్గాలుగా చూపవచ్చును. కాని ఆ విధంగా చూపినప్పుడు మొత్తం హిందు సమాజంలో నాలుగు వర్గాలను - ఉన్నత, నిమ్న, నిమ్నతర, నిమ్నతమములుగా చూపవలసి వస్తుంది. అయితే అవర్ణులు, సవర్ణ కులాలు అందరు కలిసి ఒకే సమాజానికి చెందిన వారు కాదు. ఆధునిక కుల వ్యవస్థకు మాతృకగా చెప్పబడే వర్ణ వ్యవస్థ రూపుదిద్దుకునే కాలంలో ఆదిమ, నేర కులాలకు చెందిన వారి ప్రసక్తి లేదు. ఆ తరువాత కూడా వర్ణ వ్యవస్థ నియమాలలో వారిని గూర్చి చెప్పబడలేదు. కాని అస్పృశ్యుల విషయంలో ఆ విధంగా జరుగలేదు. వర్ణ వ్యవస్థ అస్పృశ్యులను గురించిన నియమ నిబంధనలను గురించి స్పష్టంగా చెప్తుంది. మను ధర్మ శాస్త్రకారుడు ఐదవ వర్ణాన్ని అంగీకరించలేదు. అందుకు గాంధీగారు ఆయనకు అనుకూలురైన సంస్కర్తలు మనువు అస్పృశ్యుల గురించి చెప్పినదానికి కొత్త అర్థాన్ని ప్రచారం చేస్తున్నారు. మనువును సరిగ్గా అర్థం చేసుకోలేదని వారు చెప్పుతారు. పంచమ వర్ణమని ఏదీ లేదని మనువు అన్నప్పుడు అస్పృశ్యులను కూడా చతుర్వర్ణమైన శూద్రులతో చేర్చినాడని వారు విపరీత అర్థాన్ని చెప్పుతున్నారు. కాని మనువు హిందూ సమాజాన్ని చతుర్వర్ణాలు దాటి పంచమవర్ణానికి విస్తరించడం ఒప్పుకోడు. ఆయన పంచమవర్ణం వుండకూడదని చెప్పడానికి ఇదే సరియైన అర్థం. అస్పృశ్యులను ఆయన వర్ణించిన విధానం పరిశీలిస్తే వారిని హిందూ సమాజానికి దూరం చేయడానికి సంకల్పించినట్లు తెలుస్తుంది. అస్పృశ్యులను వర్ణ బాహ్యులుగా వర్ణించాడు. అస్పృశ్యులకు, అవర్ణులలోని ఆది, నేర కులాలకు మధ్య గల వ్యత్యాసం ఇదే. ఆ రెండు కులాల వారు ఎప్పటికైనా హిందు సమాజంలోకి చేర్చబడవచ్చును

అందులో భాగంగా మారవచ్చును. కాని అస్పృశ్యులకు అట్టి అవకాశం లేదు. వారెప్పటికైనా హిందూ సమాజం నుంచి వేరుగా వుండవలసిందే. హిందువులకు, అస్పృశ్యులకు మధ్యగల వ్యత్యాసాన్ని సనాతన హిందు నాయకుడు, అయినాపురే శాస్త్రి బొంబాయిలో జరిగిన ఒక సమావేశంలో వివరించాడు. హిందువులు ఒక మానవుడిగాను, అస్పృశ్యులు అతని పాద రక్షలుగాను అతడు పోల్చినాడు. మనిషి చెప్పులు ధరిస్తాడు. ఆ అర్థంలో అవి అతనితో కలిసి ఒక భాగంగా వుంటాయి. కానీ అవి అతనిలోని భాగాలు కావు. ఎందుకంటే రెండు వస్తువులను కలిపి విడదీయడానికి వీలైనప్పుడు వాటిని ఒక శరీరంలోని భాగాలుగా గుర్తించడం కుదరదు. అందువల్ల ఈ పోలిక కూడా కొంత వరకు సబబే.

అనువాదం : డా॥ వై. సుదర్శనరావు

అధ్యాయం -17

# దాని ఆధారశిల

హిందూ సమాజం కులాలతో కట్టిన భవనం. హిందువులు ఒకే ప్రజ కారు. వారు వివిధ కులాలుగా ఏర్పడిన సమూహాల సముదాయం. అదే దానియొక్క ప్రత్యేకత. ఈ విషయమే కాలక్రమంలో భారత దేశాన్ని సందర్శించిన అనేక మంది విదేశీయుల దృష్టిని ఆకర్షించింది. దాన్ని అంగీకరించని కొందరు మాత్రం కులం విషయంలో ఎలాంటి ప్రత్యేకత లేనట్లు చెప్ప ప్రయత్నించారు. ఉదాహరణకు ప్రొఫెసర్ బేయిన్స్ (Prof. Baines) ఈ విధంగా అంటారు.

"పశ్చిమ దేశాల్లో కూడా అనేక పరిణామాల దృష్ట్యా ప్రభావితమై రూపు మాసిపోయినప్పటి కీ, ఏదో ఒక కాలం లో ఇది మనుగడలో వున్నదే కాని, అది అంత అగోచరమైన విషయమేమీ కాదు. ఉదాహరణకు, కొన్ని సమూహాలు ఒక ఖచ్చితమైన వర్గాలు లేదా తరగతులుగా ఏర్పడటం చాలా సాధారణమైన విషయమే కాకుండా విశ్వజనీనమైన ఒక ప్రత్యేక లక్షణం. అంతే కాకుండా వాటిని వంశపారంపార్యంగా మార్చడం మరియు సాధ్యమైనంత ప్రత్యేకంగానూ తమ ఆకాంక్షలకు అనుగుణంగానూ తయారు కావడం సహజమైన విషయంగా చెప్పబడుతుంది." ఈ వాదనను ఆదిమ జాతి ప్రజల యొక్క సామాజిక వ్యవస్థను ఉటంకించడం ద్వారా బలపరచవచ్చు. ఆదిమ సమాజంలో మానవుడెప్పుడూ ఒంటరిగా వుండడం గమనించబడలేదు.

అందువల్ల మానవులు సమూహాలుగా జీవించడం అనేది సాధారణ విషయమే కాకుండా, సహజమైన విషయం కూడా. ఈ విధంగా సామాజికంగా సమూహాలుగా ఏర్పడటం అనేది కాలక్రమంలో అనేక రూపాంతరాలను చెందడం జరిగింది. కుటుంబమనేది ఒక విశ్వజనీనమైన సామాజిక సమూహం కావడమే కాకుండా, బ్రతికి బట్టకట్టింది. కుటుంబంకంటే పెద్ద సమూహం ఒక కుదురు (Clan). క్లుప్తంగా చెప్పాలంటే కుదురు తల్లి లేదా తండ్రి ద్వారా సంబంధం కలిగి వున్న వ్యక్తుల సమూహం. దూరపు బంధువులను కూడా ఈ సంబంధంలోనికి తీసుకొని ఈ సమూహము యొక్క సభ్యులుగా భావించడం జరిగింది. అయితే ఈ బంధుత్వం పూర్తిగా కల్పితమైనదే అయినప్పటికీ సామాజిక దృష్టితో చూస్తే ఇది రక్త సంబంధం అంత సహజమైనదిగా వుండేది.కుదురుకన్నా పెద్ద

విభజన కుదురుల యొక్క సామాజిక సమూహాలు ఏర్పడటం. ఈ కులాలు రెండు సమూహాలుగా ఏర్పడినట్లయితే ఈ ఒక్కొక్క సమూహం Moiety గా పిలువబడేది. అదే రెండు కంటే ఎక్కువ సమూహాలుగా ఏర్పడినట్లయితే వీటిని Phratry లుగా పిలువ బడేది. ఈ ద్వంద్వ వ్యవస్థ ప్రపంచ వ్యాప్తంగా వ్యాపించి వుండక పోవడమే కాకుండా, ఈ moiety మరియు Phratry లు నిర్వహించాల్సిన విధులు ఏమిటో ఇదమిద్ధంగా తెలియవు. కాని moiety మరియు phratry లు, వాటిలో ఇమిడి వున్న కులాల సభ్యుల మధ్య భ్రాతృత్వ భావన కలిగి వున్న సామాజిక సమూహాలు అనే విషయంలో ఎలాంటి సందేహం లేదు. గిరిజన సమూహాలు తర్వాత వస్తాయి. గిరిజన సమూహాల స్వభావం, లక్షణం మరియు నిర్మాణంలో చాలా తేడాలు వున్నాయి. గిరిజనులు కుదుర్లు లేదా moiety లుగా విభజింపబడకుండా గ్రామీణ సమూహాలుగా ఏర్పడటం జరుగుతుంది. అవి కుదుర్లను కలిగి వుండి moiety లను కలిగి వుండక పోవచ్చు. లేదా moiety లను కలిగి వుండి కుదుర్లను కలిగి వుండక పోవచ్చు. లేదా కుదురులు మరియు moiety లను రెండింటినీ కలిగి వుండవచ్చు. గిరిజనుల అవగాహన కొన్ని మార్లు బలంగానూ మరికొన్ని మార్లు బలహీనంగానూ వుండవచ్చు. గిరిజనుల సమూహాల ఆవిర్భావానికి ఒక ఖచ్చితమైన నియమావళి లేదా పరిణామక్రమం లేక పోయినప్పటికీ, అవి నివసించే చోట ఒక సాధారణ భాష, సాధారణ ఆచారాలు, ఒక నిర్దిష్ట భూభాగము మరియు ఏదో రకమైన ప్రభుత్వము వుండడం వంటి సాధారణ లక్షణాలు వుండడం జరుగుతుంది. గిరిజన తెగకన్నా పెద్దది–ఈ తెగల యొక్క సమూహం. కాని ఇది చాలా అరుదైనది. ఒక ఖచ్చితమైన ప్రమాదాన్ని ఎదుర్కొనేందుకు ఎలాంటి లాంఛనాలు లేకుండా ఒక సాధారణ ఒడంబడిక ఈ తెగల యొక్క ఐక్యతకు దారి తీస్తుంది. ఆదిమ జాతి ప్రజలలో ఇలాంటి ఐక్యత కనబడడమనేది చాలా అరుదు. అయితే ప్రఖ్యాతి గాంచి ఇరోక్వయిస్ సంఘం (Iroquois Confederacy) అనేది ఈ విషయంలో ఒక మినహాయింపు.

ఇవి జన్మతః సంబంధం గల లేదా ఆ ప్రాంతానికి సంబంధించిన వారితో కూడిన సామాజిక సమూహాలు. ఆదిమజాతి ప్రజలలో వేరే రకమైన విభజన గల సమూహాలు వున్నాయి. ఈ సమూహాలు స్త్రీ పురుష లింగభేదము, వయస్సు లేదా ఇతర విషయాల ఆధారంగా సమూహాలుగా ఏర్పడటం జరిగింది. సామాజిక సమూహాలుగా ఏర్పడే ఒక ప్రక్రియగా కులవ్యవస్థలో ఏ కొత్తదనంగాని లేదా ప్రత్యేకత గాని లేదు. కులము అనేది

ఒక కుదురు (Clan) లాంటిది. అంతే కాకుండా ఒక తెగవలె అదికూడా సామాజిక సమూహాలు ఏర్పడే ఒక ప్రక్రియ.

అర్థంలో మరియు ఉద్దేశ్యంలో కులము కుదురు కంటే భిన్నమైనది అయినప్పటికీ, కులము మరియు కుదురుల మధ్య పోలికను అంగీకరించవచ్చు. కుల వ్యవస్థతో పోల్చి చెప్పగల కుదురు వ్యవస్థ (Caste-System) అనేది లేదు. వర్గ-కుల వ్యవస్థ (class-clan system) తో పోల్చిచెప్పడానికి తగిన వర్గ-కుదురు వ్యవస్థ (class-clan system) లేనందున కుదురుల యొక్క అమరిక (gradation) జరుగలేదు. వాస్తవానికి ఆదిమ జాతి ప్రజల యొక్క కుదురుల వర్గీకరణ అనేది హిందువుల యొక్క కుల వర్గీకరణకు పూర్తి విరుద్ధమైనది. ఆ సాదృశ్యాన్ని కేవలం నా అభిప్రాయాన్ని ముందుంచడానికి మాత్రమే అంగీకరిస్తాను. నా ఉద్దేశ్యంలో కులవ్యవస్థ సహజమైనదా, కాదా, అసాధారణమైనదా లేక సాధారణమైనదా అనేది నిస్సందేహంగా ఒక ముఖ్యమైన లేదా ఉత్సుకతను రేకెత్తించే మరియు ప్రబోధాత్మక విషయం. కాని నేను లేవనెత్తదలుచుకున్న ప్రశ్న కంటే అది అంత ప్రముఖమైన విషయం కాదు. ఆ ప్రశ్నేమిటంటే అనేక ఇతర దేశాల్లో వున్న ఇలాంటి సామాజిక సమూహాలు నాగరికత అభివృద్ధితో పాటుగా అంతరించిపోతే కులం మాత్రం మనుగడ సాగించడంతో పాటు నిక్షేపంగా ఎందుకు వుంది? అనేది.

రోమన్‌లు కూడా హిందువులు కలిగినటువంటి సామాజిక వ్యవస్థను కలిగి వుండేవారు. అయితే అలాంటి వ్యవస్థలన్నీ కనుమరుగై పోయినప్పుడు ఒక్క కులం మాత్రం ఇంకా ఎందుకు సజీవంగా వుంది? ఎందుకు ప్రజలు దాని నియమ నిబంధనలు పాటిస్తారు. అసలు కులంయొక్క దండన (sanction) ఏమిటి.?

ప్రజలు సమాజ నియమ నిబంధనలకు లొంగి వుండడాన్ని నాలుగు దండనల (four sanction) ద్వారా సాధించడం జరుగుతుంది. అవి: 1) సహజమైనవి 2) ప్రజాభిప్రాయం (popular) 3) చట్టపరమైనవి (legal) మరియు 4) మతపరమైనవి. వీటిలో ఏవి కుల వ్యవస్థకు ఊతమిస్తాయి? అయితే ఈ విషయాన్ని పరిశీలించే ముందు ఈ ఆంక్షలు ఒక్కొక్కటి ఎలా పనిచేస్తాయనేది వివరించడం సమంజసంగా ఉంటుంది.

సహజ దండన (Natural sanction) అనేది అలవాటు ద్వారా అమలు అవుతుంది. ఒక వ్యక్తి ఒక రకంగా ప్రవర్తించేందుకు అలవాటు పడినట్లయితే అతను

ఆ విధంగా ప్రవర్తించేందుకు ప్రోద్బలం చేయాల్సిన అవసరం వుండదు. అతను స్వతహాగా మరియు క్రమం తప్పకుండా ఆ విధంగా ప్రవర్తించడం నిత్యవిధిగా మారుతుంది.

ప్రజాదండన (Popular sanction) అనేది ప్రజాభిప్రాయం ద్వారా పనిచేస్తుంది. ఇది సమాజంలో వున్న కొన్ని పద్ధతులు మరియు ఆచారాలకు సంబంధించిన అంగీకారం లేదా అనంగీకార భావన. ఒక రకమైన ప్రజా జీవన సరళి అప్పటికే స్థాపితమైన ప్రజా జీవన సరళితో సమానంగా పనిచేస్తూ అంగీకారాన్ని పొందుతుంది అదే సందర్భంలో దీనికి భిన్నమైన వేరొక చర్య తిరస్కరింపబడుతుంది.

సహజ దండనలో గాని లేదా ప్రజాదండన (popular sanction) లోగాని వ్యతిరేకత ఏమీలేదు. అవి సామాజిక పరమైన ప్రతి విషయంలో గోచరిస్తాయి. వీటి ప్రాదేశిక శక్తి (native force) చాలా అనిశ్చలమైంది. ఏదైనా సమాజంలో వీటి సామర్థ్యం సాధారణ స్థాయి మించి వుదంటే, అవి మిగిలిన రెండింటి లో దేనినుండైనా ఆ శక్తిని పొంది వున్నప్పుడే సాధ్యమౌతుంది. చట్టపరమైన దండన మరియు మత పరమైన దండనలు రెండు మాత్రమే ఏ రకమైన వ్యవస్థలోనైనా మనగల సామర్థ్యాన్ని కలిగి వుంటాయి.

కులమనేది హిందూమతం యొక్క అనుమతిని కలిగి వుందనే విషయంలో ఎలాంటి సందేహంలేదు. ప్రతి హిందూ శాసన గ్రంథం కులాన్ని ఒక చట్టపరమైన వ్యవస్థగా గుర్తించడం జరిగింది. దానిని ఉల్లంఘించడం ఒక నేరం మరియు శిక్షార్హమైనది. 'మానవ ధర్మ శాస్త్రం' అని పిలువబడే మనుధర్మ శాస్త్ర గ్రంథం అన్నింటికన్న పురాతనమైనదేకాకుండా అధికారిక హైందవ శాసన గ్రంథం. కులము చట్టం ద్వారా గుర్తించబడిందని చూపడానికి దీనిలోని అంశాలనుండి ఉదహరించడం సరిపోతుంది.

హిందూ చట్టాన్ని ప్రసాదించిన మనువు, నాలుగు రకాలైన వర్ణాలుగల వ్యవస్థకు చట్టపరమైన గుర్తింపు ఇచ్చాడు. మనుస్మృతి యొక్క ముఖ్యోద్దేశ్యం నాలుగు వర్ణాల చట్టాన్ని (Law of four varnas) రూపొందించడంగా కనిపిస్తుంది. ఈ విషయం స్మృతి యొక్క ప్రారంభ చరణాల ద్వారా ప్రస్ఫుట మౌతుంది. ఆ చరణాలు ఇలా చెప్తాయి.:

I. 1 " గొప్ప జ్ఞానులైన మునులు ఏకాగ్రమైన మనస్సుతో తన ఆసనముపై ఆసీనుడై వున్న మనువును సమీపించి ఆయనను ప్రార్థించి, ఈ విధంగా అన్నారు

I. 2. " ఓ పవిత్రమైన వాడా, దయచేసి మాకు నాలుగు ముఖ్య కులాలు (వర్ణాలు) మరియు వాటి వుపకులాలైన ఒక్కొక్క దాని పవిత్ర చట్టాల (sacred laws) గురించి ఒక క్రమంలో సరిగ్గా వివరించవల్సింది".

ఆయన దానికి చట్టపరమైన అనుమతిని ఇవ్వడంతో పాటు, ఆ వ్యవస్థను కాపాడాల్సిన బాధ్యతను రాజుపై వుంచుతాడు.

VII. 35."రాజనేవాడు కులాలు (వర్ణాలు) మరియు వర్గాల యొక్క సంరక్షకుడుగా సృష్టించబడినాడు. ఇవన్నీ కూడా తమ తమ హోదా మరియు స్థాయిలను బట్టి అనేక రకాల విధులను నిర్వహిస్తూంటాయి."

VIII. 24. "అన్ని కులాలు ( వర్ణాలు) భ్రష్టు పట్టి పోతాయి (సంకరమవడం వల్ల), అన్ని అడ్డంకులు తొలగింపబడతాయి మరియు అందరు మానవులు (ఒకరియొకరు) శిక్షకు సంబంధించిన తప్పిదాల వల్ల ఏర్పడే ప్రభావాల ఫలితంగా ద్వేషించుకొంటారు"

మనువు కులాతిక్రమణను పాపంగా భావించడమే కాకుండా కుల భ్రష్టుడై పతితునికి మూడు రకాల శిక్షలను లేదా దండనలను సూచిస్తాడు.

మొదటి శిక్ష మరణానంతర శిక్ష. మనువు ఈ విధంగా అంటాడు.

XII. 60."ఎవడైతే కుల భ్రష్టుడితో సంబంధం కలిగి వుంటాడో, ఎవరైతే ఇతరుల భార్యలను చేరతాడో మరియు ఎవడైతే బ్రాహ్మణుడి ఆస్తులను దొంగిలిస్తాడో అట్టివారు బ్రహ్మరాక్షసులౌతారు".

ఈ జీవితంలో ఒక పతితుడు పొందే శిక్ష రెండు రకాలు. ఒకటి వెలివేత లేదా బహిష్కరణ. మనువు సూచించిన వెలివేత యొక్క స్వభావం మరియు లక్షణాన్ని ఆయన ఈ క్రింది విధంగా సూచించాడు.

XI. 181 "ఒక కులభ్రష్టుడితో కలిసియున్నవాడు, అతని కోసం త్యాగం చేయడం, అతనికి బోధించడం లేదా వివాహ సంబంధమైన ఒప్పందములు కుదుర్చుకోవడం వల్లనేకాక, అతని వాహనాన్ని లేదా ఆసనాన్ని ఉపయోగించడం లేదా అతడితో కూడి భుజించడం, ద్వారా తనకూడా ఒక సంవత్సర కాలం తర్వాత కులహీనుడౌతాడు.

" XI. 182 ఎవడైతే అలాంటి కుల భ్రష్టులతో సంబంధము కలిగి వుంటాడ అట్టివాడు, ఆ (అలాంటి) సంబంధము యొక్క పరిహారము కొరకు, అటువంటి దానికొరకు (పాపులకొరకు) సూచించబడిన ప్రాయశ్చిత్తమును తప్పక చేసుకోవాలి.

" XI. 183 ఒక కులభ్రష్టుడికి గ్రామము వెలుపల, ఒక అశుభదినాన, సాయంకాల సమయాన, బంధువులు మరియు గురువుల సమక్షంలో మతాచార్యుడి ఆధ్వర్యంలో నీటిని తర్పణం విడుస్తూ (అతను చనిపోయినట్లుగా) అతనికి సపిండాలు మరియు సమనో దకాలు సమర్పించాలి.

" XI. 184 ఒక స్త్రీ బానిస (slave) ఒక చనిపోయిన వ్యక్తి విషయంలో చేసినట్లుగా, ఒక నీటితో నిండిన కుండను కాలితో తన్నుతుంది. అతని సపిండాలు మరియు సమనోదకాలు ఒక పగలు మరియు రాత్రి అపరిశుభ్రంగా (Impure) వుండగలవు.

" XI. 185 కాని అప్పటి నుండి అతనితో సంభాషించుట, కూర్చుండుట, వంశపారంపర్యంగా వచ్చిన దానిలో భాగము ఇవ్వడం మరియు ఇతర వ్యక్తులతో వుండే సహజమైన సంబంధాలు అతనిలో కొనసాగించడం నిషేధింపబడతాయి"

తర్వాతది వంశపారంపర్య హక్కులు లేక పోవడం (disinheritance)

"IX. 201. నపుసంకులు, మరియు కుల భ్రష్టులు, గుడ్డి మరియు చెవిటి వారుగా పుట్టిన వారు , పిచ్చివారు, బుద్ధివిహీనులు, మూగవారు, అంతేకాకుండా అంగవైకల్యం (క్రియలకు సంబంధించిన లేదా జ్ఞానమునకు సంబంధించినది) కలవారు ఎలాంటి వాటాను పొందజాలరు.

"XI. 186. అంతేకాకుండా, (అతను జ్యేష్ఠకుమారుడైతే) అతనికి పెద్ద కుమారుడుగా సంక్రమించే జ్యేష్ఠత్వపు హక్కు మరియు అదనపు వాటా రద్దు చేయబడతాయి. మరియు అతనికి బదులుగా అతని తమ్ముడు సత్ప్రవర్తన కలవాడైతే పెద్ద కుమారుడి వాటాను పొందుతాడు".

ఈ వెలివేత మరియు వంశపారంపర్య హక్కులను కోల్పోయే శిక్షలను )ంచుకోవాలంటే, నిర్దేశించిన విధంగా ప్రాయశ్చిత్తము చేసుకోవాలి. ఈ ప్రాయశ్చిత్తము తమే ఒకే ఒక నివారణోపాయము. మనువు అంటాడు;

"XI. 188. కాని అతను ఆ కుండను నీళ్ళలోకి విసిరి, తన ఇంట్లోకి ప్రవేశించి బాధ్యుడైన ఒక బంధువులాగ అన్ని విధులను అంతకు పూర్వంలానే నిర్వహించగలడు."

ఒక పురుష పతితుడికి మరియు స్త్రీ పతితురాలికి మధ్య వ్యత్యాసం ముందుండేది. ఎవ్వరూ మినహాయింపు పొందరనీ ఇరువురికీ నియమ నిబంధనలు వర్తిస్తాయని, మనువు అంటాడు;

"XI. 189. కుల భ్రష్టురాలైన ఒక స్త్రీ విషయంలో కూడా అదే విధమైన నియమ నిభంధన పాటించాలి. కాని వారికి బట్టలు, ఆహార పానీయాలు ఇవ్వవచ్చు. మరియు వారు తమ ఇళ్ళకు కుటుంబాలకు సమీపాన నివసించవచ్చు".

చట్టపరమైన దండన అనేది చాలా శక్తివంతమైనదనే విషయంలో ఎలాంటి సందేహం లేదు. కులాతిక్రమణ విషయంలో చట్టం నిర్దేశించిన దండన లేదా శిక్ష రెట్టింపుగా (two fold) వుంటుంది. అది వెలివేత మరియు వంశపారంపర్య హక్కులను కోల్పోవడం, రెండింటినీ కలిగి వుంటుంది. ఈ శిక్షలు ఎంత భయంకరమైనవో Sir Thomas Strange హిందూ చట్టంపై తన గ్రంథం లో చక్కగా వివరించడం జరిగిc ఈ విషయాన్ని ఉటంకిస్తూ ఆయన ఇలా అంటారు;

"దిగజారుట (degradation) లేదా కుల భ్రష్టత అని పిలువబడే వెలివేతకు కారణమైన విషయంపై చేసే ప్రతిగణాంక సేకరణలో లభించేవ్యక్తిగత నియమోల్లంఘనకు సంబంధించిన (personal delinquency) దిగా చెప్పబడే ఒక సందర్భాన్ని పరిశీలించాల్సి వుంది. కొన్ని నిర్థిష్టమైన సంస్కారములతో కూడిన దీని ప్రభావం వల్ల జరిగే పరిణామం, అతన్ని తక్కిన అన్ని సామాజిక కార్యకలాపాల్లో నుండి బహిష్కరించడం, అన్ని పౌర కార్యక్రమాల్లో నుండి తొలగించడం, అన్ని సంస్థల్లో పనిచేయడానికి, అంతేకాకుండా జీవితం యొక్క అన్ని ధర్మాల (Charities) విషయంలో అనర్హుడిగా చేయడం-అతనితో సంబంధము గల అందరిద్వారా తీర్పు వెలువడిన మరునిముషం నుండి విడిచివేయబడతాడు. అతనితో సంభాషించడం, అతనితోకూడి కూర్చోవడం, వంశపారంపర్యంగా లేదా వేరే రకంగా సంక్రమించిన ఆస్తులను అతనికి పంచడం మానుకోవడంతో పాటు, సంవత్సరాదినాడు లేదా అలాంటి సందర్భాల వంటి పౌర లేదా సాధారణ సందర్భాలలో ఆహ్వానించడం నుండి వెనుకంజవేస్తారు. అతను స్వతహాగా మరణించినట్లుగా, పితృదేవతలకు విడిచినట్లుగా

...గం విడువాలని హిందూ చట్టం నిర్దేశించినట్లుగా, ఈ పరిస్థితుల్లో అతను మరణించినా ...ంచవచ్చు. వాస్తవానికి అవమాన కరమైన దుస్థితికి గురిచేసే ఈ పద్ధతిని వేటిద్వారానైతే వారిని బహిష్కరింప ప్రయత్నించారో అట్టి పురాతన చట్టాల ద్వారా ఎవరినైనా అట్టి స్థితికి గురిచేయడం ద్వారా, అమలు చేయడం జరిగింది; కాని దాని తీవ్రత "పాపి తానే తన నేరాన్ని మోస్తాడు" ("Sinner alone bears his guilt") అనే విషయాన్ని తెలిసిన ప్రస్తుత యుగారంభములో కొంత వరకు తగ్గింది. ఒకవేళ ఒక వ్యక్తి ఇంకొక వ్యక్తితో భోజనం దగ్గర కూడి వుండాల్సి కూడా తగిన కారణం లేకుండా నిరాకరించడం వంటి అసాంగత్యాన్ని తీవ్రంగా భావిస్తూ చట్టం అతన్ని శిక్షార్హుడుగా చేస్తుంది. బొంబాయి నివేదిక (reports) లలో కులం నుండి ద్వేషపూరితంగా బహిష్కరించబడిన ఒకానొక సందర్భంలో, నష్టపరిహారము కోసం చర్య తీసికొన్న సందర్భం కలదు. మన మధ్య వ్యాప్తిలో వున్నటువంటి హిందూ చట్టం ద్వారా హీనీకరించడం (degradation by Hindu law) మరియు వెలివేత (excommunication) ల మధ్య పోలిక కేవలం ఆ చర్య యొక్క సాధారణ స్వభావం మరియు ప్రభావాలతో వుండడమే కాకుండా, రెండింతలు (two-fold) గా వుండే ఈ రెండింటి యొక్క ప్రత్యేక పరిస్థితులలో వుంది. మన మధ్య అమలులో వున్న తక్కువ (less) మరియు ఎక్కువ వెలివేత (streater ex communication) ల మాదిరిగానే, హిందువులలో వారసత్వపు హక్కుల నుండి బహిష్కరణకు సంబంధించి విచారింపబడిన నేరములలో కూడా రెండు రకాలు కలవు. వాటిని కూడా రెండింతల దృష్టితో (two-fold point of view) తీసుకోవాలి. దీన్ని మనం పశ్చిమ బెంగాల్‌లో వున్న సదర్ దివానీ అదాలత్‌లో 1814లో జరిగిన ఒక కేసు ద్వారా తెలుసుకోవచ్చు. ఈ కేసును అధికారిక పండితులకు విన్నవించుకొన్నప్పుడు వారు పాక్షిక మరియు తాత్కాలిక హీనీకరణ (partial & temporary degradation) మరియు కులాన్ని పోగొట్టుకోవడం లేదా కులహీన ద్వారా సంక్రమించిన వాటి మధ్య వ్యత్యాసాన్ని తెలిపారు. మొదటి పరిస్థితిలో అంటే పాక్షిక హీనీకరణ, ఎప్పుడైతే తప్పిదము (Offence) పరిహారము చేసుకోబడుతుందో (expated), అప్పుడు ఉత్తరాధికారపు హక్కులు (Succession) కు వున్న అవరోధం తొలగింపబడుతుంది; హీనీకరణ పూర్తిగా వున్న తర్వాతి విషయంలో, పరిహార పూర్వకమైన ప్రాయశ్చిత్తము ద్వారా, చేసిన తప్పిదము యొక్క పాపము (sinfulness) తొలగింపబడినప్పటికీ, తన కులం (tribe) నుండి చిట్టచివరికి తొలగింపబడిన వ్యక్తి ఎల్లప్పుడూ ఒక కులభ్రష్టుడు

(outcaste) గా వుంటాడు కాబట్టి అతని ఉత్తరాధికారపు హక్కులకు అవరోధాలు అలాగే వుంటాయి" అని అభిప్రాయపడుతూ, సూచించబడిన కేసులో నిందితుడు చెడు శీలము కలిగి వుండి, మత్తు పానీయములకు అలవాటు పడివుండి, అతి తక్కువ స్థాయి వారితో కలిసివుండడం మరియు కలిసి భుజించే అలవాటు వుండి, అతి నీచమైన లక్షణం కలిగి వుండి, వేర్వేరు సమయాల్లో అనేక మందిపై దౌర్జన్యం చేయడం మరియు గాయపరచడం; మహమ్మదీయ స్త్రీతో కలిసి వుండి వున్నా; అంతే కాకుండా తనను అనేక మార్లు అనేక రకాలుగా నాశనము చేయప్రయత్నించిన అతని పెంపుడు తల్లి నివాస గృహానికి నిప్పంటించినా, షియన్నాధ్ చేసినట్లు నిర్ధారింపబడిన తప్పులన్నింటిలోకి మహమ్మదీయ స్త్రీతో కలిసి నివసించడమనే ఒకే ఒక తప్పు అతన్ని తన కులం (Tribe) నుండి తిరుగులేని విధంగా బహిష్కరింపబడే శిక్షకు పాత్రుడయ్యేలా చేస్తుందని" పండితులు వెల్లడించారు. అదే అభిప్రాయాన్ని న్యాయస్థానం కూడా వెలిబుచ్చింది. హీనీకరించే (degrade) అధికారం మొట్టమొదటి సందర్భంలో, దీని కోసమే సమావేశమైన కులానికి చెందినవారికి వుంటుంది, కాని వారి తీర్పు ఒక వేళ అంగీకరింపబడనట్లయితే, రాజ దర్బార్ లో నివేదించడం జరుగుతుంది. పేర్కొనబడిన కేసు విషయంలో వారస హక్కునకు సంబంధించిన ప్రశ్న తలెత్తింది. ఖచ్చితంగా చెప్పాలంటే చట్టం బహ ఏరకంగా కూడా అమలు చేయలేని సందర్భాలలో కూడా ప్రజల యొక్క నైతిక కు వర్తింపచేసే అనేక రకాల గుణవిమర్శలకు (censorships) గురిచేసే శక్తిని కలిగి వుంటుందని ఆ కేసు చూపిస్తుంది. అపరాధి తానున్న పరిస్థితులలో చేసిన తప్పులకు మాత్రమే తీర్పులు అమలు చేయబడగలవు; ఒకవేళ తప్పు తక్కువ స్థాయిది అయినట్లయితే దాన్ని నిర్ధారించేందుకు అది పునరావృతం చేయబడాలి. వెలివేతకు కారణాలైన ఇతర కారణాలనుండి హీనీకరణ (degradation) ఎందుకు భిన్నంగా వుంటుందంటే అది, తండ్రి అపరాధము తో సంబంధంలేని, ఆ అపరాధము చోటుచేసుకున్న అనంతరం పుట్టిన అతని కుమారుని పై కూడా దాని ప్రభావాన్ని విస్తరింపజేస్తుంది. ఒకవేళ ముందుగా జన్మించినట్లయితే అతనికి వారసత్వమును పొందే అధికారం వుంటుంది. అంతే కాకుండా అతడు తన తండ్రి మరణించినట్లుగానే అన్నీ తీసుకొంటాడు. అదే తక్కిన సందర్భాల్లో తన తండ్రిలాంటి దుస్థితిలో తను లేనప్పటికీ, తన తండ్రి యొక్క సంరక్షణ భాధ్యతను పొందుతారు. మనవడికి కూడా అదేరకమైన హక్కు

పొడిగింపబడుతుంది. అంతేకాకుండా, తన తండ్రి చేసిన నియమోల్లంఘన వల్ల తనకు సంబంధించిన వారసత్వపు హక్కుల నుండి బహిష్కరణ అనేది సహజమైన తప్పువల్ల కానప్పుడు, కారణమనేది ఆస్తి విభజన లేదా తరుగుదల కన్నా ముందు తలెత్తి వుండవచ్చు. ఒకవేళ అది తర్వాత వరకు చోటుచేసుకోనట్లయితే ఉత్తరాధికారపు హక్కు (Succession) దాని వల్ల బలహీన పడదు. అందువల్ల మార్పిడి సందర్భంగా భార్యలోని జారత్వము ఆమెకు వారసత్వపు హక్కులను నిషేధిస్తుంది. ఇది చట్ట ప్రకారం కలిగి వున్న హక్కులను కూడా హరిస్తుంది. ఈ విషయంలో హైందవ వితంతువు, తండ్రి కూతురికిచ్చిన భరణముపై అధికారము కల వ్యక్తి మాదిరి పోలికను కలిగి వుండి, దాన్ని ఆమె తన పేరుకు మాత్రమే కలిగి వుండడం జరుగుతుంది. ఒక్క గొప్ప గౌరవనీయమైన అభిప్రాయం ప్రకారం, ఒక వేళ కుల భ్రష్టత విషయంలో పరిహారము ద్వారా ప్రాయశ్చిత్తము చేసుకోనట్లయితే లేక పరిహారము ద్వారా విమోచనము పొందనట్లయితే దాన్ని నష్టపోయినట్లే. సాధారణంగా అనర్హతకు గురిచేసే చట్టం (disqualification Law) అనేది స్త్రీ పురుషులిరువురికి ఒకే రకంగా వర్తిస్తుంది.

"కులభ్రష్టత సందర్భాన్ని మినహాయిస్తే వారసత్వమును పొందలేక పోవుట కేవలం వ్యక్తిగతమైన విషయంలా కనిపిస్తుంది. ఒక వెలివేయబడిన వ్యక్తి అన్ని సందర్భాలలో పోషణకు అర్హుడౌతాడు. అనేక సందర్భాల్లో అతడు ఎప్పుడంటే అప్పుడు తన హక్కులను తిరిగి పొందుశక్తిని కలిగి వుంటాడు-ఈ రకమైన నిబంధనలు (provisions) వీన్నింటి యొక్క ఔచిత్యము ఏమిటని ఆలోచించినప్పటికీ, అవిపూర్తిగా అన్యాయమైనవని లేదా ఏ సందర్భంలోనూ పూర్తిగా అమానవీయమైనవని చెప్పలేము. ఈ చట్టంలోని కొంత భాగాన్ని మనచట్టంతో పోల్చినప్పుడు మన ప్రస్తుత చట్టం వీలునామా ద్వారా సంతానాన్ని పూర్తి వారసత్వపు హక్కులు పొందడం నుండి నిరోధించేందుకు ఎలాంటి ఏర్పాట్లు చేయలేదని భావించడం కూడా తగదు.

"తర్వాతి అధ్యాయములో ఈ రెండు మతపరమైన పద్ధతుల లో దేనిలోనైనా ప్రవేశించడం వల్ల, భక్తుడు (Devotee) సంస్కరణకు ముందు మనలో వున్న అంగీకరింపబడిన సన్యాసి వలె పౌరునిగా మరణిస్తాడు; మరియు అతని తర్వాతి వారసుడు అతను సహజంగా మరణించినట్లుగా ఉత్తరాధికారమును పొందుతాడు. అంతేకాకుండా

లౌకిక విషయాలను (Secular concerns) పరిత్యజించిన భక్తుడు వారసత్వపు హక్కులను కోల్పోతాడు. అదే విధంగా ధార్మికంగా మోసగించేవారు ( religios PRETENDER) మరియు మత విశ్వాసమును వదిలిన దోషి కూడా ఈ హక్కులను కోల్పోతాడు. ఒక స్వలాభాపేక్ష దృష్టితో పవిత్రమైన ముద్రలు ధరించి, సాధారణ జీవితాన్ని గడుపుతూండేవారి విషయంలో ఉపయోగించే కపటులు మరియు వంచకులు అనే ప్రతి పదాలన్నీ మొదటి పదానికి వుపయోగించవచ్చు.

"మనం గమనించే బహిష్కరణకు ఇంకొక రకమైన కారణం అయోగ్యమైన వివాహం; అంటే భార్యా, భర్తలు ఒకే వంశమునకు (stock) చెందని వారు కావడం. అలాంటి వివాహము అయోగ్యమైనది కావడం వల్ల, అట్టి వారి సంతానం, శూద్రులలో తప్ప, వారసత్వపు హక్కును కలిగి వుండరు. ఒకవేళ వివాహము వర్గ పద్ధతి (order of class) ప్రకారం కానట్లయితే కూడా పరిణామం ఈ విధంగానే వుంటుంది.

"తర్వాత, ఎలాంటి అయోగ్యత (disability) లేకుండా వారసత్వమును పొందిన వారసుడు లేదా వారసుల విషయంలో, ఏ ఆరోపణల (charges) కారణంగా అది అర్హమౌతుంది (laible) అనేది చూడాల్సి వుంది". కులం కూడా మతపరమైన అనుమతి (sanction) ని కల్గివుందా? వేదాలు కులాన్ని గుర్తిస్తాయి. ఋగ్వేదం కులాన్ని గుర్తించి దాని పుట్టుకను గూర్చి ఈ విధంగా తెలియజేస్తుంది.

"1. పురుషులకు (Purusha) వేయి తలలు, వేయికళ్ళు, వేయి కాళ్ళను కల్గి వుంటాడు. అతడు పదివేళ్ళ పర్యంతం (space of ten fingers) భూమిని అన్ని వైపులా చుట్టి, దాన్ని పూర్తిగా వ్యాపించి వున్నాడు.

"2. పురుషుడు స్వయంగా ఇంతకు ముందు వున్నది (whatever has been) మరియు ఇంక వుండేది (whatever shall be), అయిన ఈ మొత్తం విశ్వం. అతడు అమరత్వానికి ప్రభువు. ఎందుకంటే అతడు ఆహారము ద్వారా విస్తరిస్తాడు.

"3. ఆయన గొప్పతనం అలాంటిది. మరియు అతడు దీనికి అధికుడు (Superior) అన్ని జీవులు ఆయనలో ఒక పావు భాగం; తక్కిన నాలుగింట మూడొంతులు అమరమైన ఆకాశము.

" 4. మూడు పావుల భాగం పురుషుడు ఊర్ధ్వ ముఖంగా ఎగిశాడు. అతనిలోని ఒక పావు భాగం ఇచ్చట సృజించబడినది. తర్వాత అతను సర్వత్రా, భుజించే మరియు భుజించని పదార్థాలపై వ్యాపించాడు.

" 5. అతని నుండి విరాజ్ మరియు విరాజ్ నుండి పురుషుడు (purusha) జన్మించడం జరిగింది. పుట్టుకతోనే అతను భూమి ముందు మరియు వెనకా, మొత్తం భూమిపై, దాని ఆవల వ్యాపించాడు.

" 6. పురుషున్ని యజ్ఞ పశువుగా వుపయోగించి దేవతలు యజ్ఞం చేసినప్పుడు వసంత ఋతువు నెయ్యిగాను, గ్రీష్మం దాని ఇంధనము (fuel) గాను మరియు శరదృతువు (వాటితోకూడిన) సమర్పణ లేదా హవిస్సులుగా వుండెను.

" 7. ఆదిలో జన్మించి బలిపశువుగా చేయబడిన ఈ పురుషున్ని వారు దర్భలపై బలి యిచ్చారు. అతనితో దేవతలు, సాధువులు మరియు ఋషులు యజ్ఞము చేశారు.

" 8. ఆ యజ్ఞం నుండి పెరుగు మరియు నెయ్యి ఇవ్వబడినాయి. ఇవి వాయువుకు సంబంధించిన ప్రాణులు మరియు క్రూర మరియు సాధు జంతువులను సృష్టించినాయి.

" 9. ఆ యజ్ఞం నుండి ఋగ్వేదము, సామవేదము, అధర్వణ వేదం మరియు యజుర్వేదం అనేవి ఉద్భవించాయి.

" 10. దాని నుండి గుర్రములు మరియు రెండు వరుసల పళ్ళు గల జంతువులు (ప్రాణులు) వుద్భవించాయి. దానిలో నుండి ఆవులు, గొర్రెలు మరియు మేకలు వుద్భవించాయి.

"11. పురుషున్ని (దేవతలు) విభజించినప్పుడు అతన్ని ఎన్ని భాగాలుగా విభజించారు? అతని నోరు ఏమిటి? ఎలాంటి బాహువులు (అతను) కలిగి వుండెను? అతని ఊరువులు మరియు పాదాలుగా చెప్పబడే రెండు భాగాలు ఏమిటి?

"12. బ్రాహ్మణుడు అతని నోరు, రాజన్యుడు అతని బాహువులు, వైశ్యులు అతని ఊరువులుగానూ వుండెను. శూద్రులు అతని పాదములనుండి వుద్భవించారు.

13. చంద్రుడు అతని మనస్సునుండి, సూర్యుడు అతని నేత్రముల నుండి, ఇంద్రుడు మరియు అగ్ని అతని నోటి నుండి, వాయువు అతని శ్వాస నుండి వుద్భవించడం జరిగింది.

14. అతని నాభినుండి గాలి, అతని శిరస్సు నుండి ఆకాశం, అతని పాదముల నుండి భూమి అతని కర్ణముల నుండి నాలుగు దిక్కులు (quarters) వుద్భవించాయి. ఈ రకంగా సమస్త విశ్వాలు (దేవతలద్వారా) ఆవిర్భవించడం జరిగింది.

15. దేవతలు యజ్ఞంచేసేప్పుడు పురుషుణ్ని బలి పశువుగా బంధించి, అగ్ని చుట్టూ పరిధులు వుంచి ఏడు కర్రలు మరియు వాటికి మూడింతలు ఎక్కువగా సమిధలలో ఇంధనం తయారు చేయబడినాయి.

16. బలి ప్రదానంలో దేవతలు యజ్ఞం చేశారు. ఇవి తొలి వైదిక కర్మలు. ఈ అద్భుత శక్తులు ఆకాశాన్ని, అంతకు ముందటి సాధ్యులు మరియు దేవతలు ఎచ్చట వున్నారని అడిగాయి".

బ్రాహ్మణాలు (Brahmanas) కూడా కులాన్ని గుర్తిస్తాయి. శథపథ బ్రాహ్మణాలు (satapatha-Brahmanas) లో కులాన్ని ఈ క్రింది విధంగా పేర్కొనడం జరిగింది.

"23. బ్రహ్మ (వ్యాఖ్యాత ప్రకారం) అగ్ని కూపంలో వుంటూ, బ్రాహ్మణ కులానికి ప్రాతినిధ్యం వహిస్తూ వుండేవాడు. (ఈ సమస్త విశ్వం) ఒక్కడే. ఒక్కటిగా ఉండడం వల్ల అది అభివృద్ధి చెందలేదు. అది 'క్షాత్రము'అనే రూపాన్ని సృష్టించింది. అనగా దేవతల్లో ఇంద్రుడు, వరుణుడు, సోమ, రుద్రులు, పర్జన్యుడు, యముడు, మృత్యువు మరియు ఈశాన అనే అధిపతులు లేదా శక్తులు. అందువల్ల క్షాత్రం కంటే ఏదీ ఉన్నతమైనది కాదు. అందువల్ల రాజసూయయాగము వద్ద బ్రాహ్మణుడు క్షత్రియుడి కన్నా దిగువ స్థానంలో కూర్చుంటాడు. అతను క్షాత్రానికి (రాజరిక శక్తికి) ఆ మహిమను (glory) అందిస్తాడు. ఈ బ్రాహ్మణుడు క్షాత్రానికి మూలాధారం. అందువల్ల రాజు ఆధిపత్యమును (supremacy) పొందినప్పటికీ చివరికి అతను తన ఈ స్థితికి మూలాధారంగా బ్రాహ్మణున్ని ఆశ్రయిస్తాడు. ఎవడైతే అతన్ని (బ్రాహ్మణున్ని) నాశనము చేయ ప్రయత్నిస్తారో వారు తమ మూలాధారాన్ని కోల్పోతారు. అట్టివారు తన కంటే ఉన్నతుణ్ణి గాయపరచిన వానివలె కష్టముల పాలౌతారు.

" 24. అతను అభివృద్ధి చెందలేదు. అతను దళాలు, కుద్రులు, ఆదిత్యులు, విశ్వదేవతలు, మారుతులు అని పిలువబడే దేవతా వర్గాలను సృష్టించాడు.

" 25. అతను అభివృద్ధి చెందలేదు. అతను, పూశన (Pushan) అనే క్షుద్ర వర్గాన్ని సృష్టించాడు. ఈ భూమి పూశనము; జీవమున్న ప్రాణులన్నింటినీ అది పోషిస్తుంది.

" 26. అతను అభివృద్ధి చెందలేదు. అతను న్యాయం (ధర్మం) అనే ఉత్కృష్టమైన రూపాన్ని చాలా శక్తి వంతంగా రూపొందించాడు. అది పాలకులను పాలిస్తుంది. అందువల్ల న్యాయాన్ని మించింది లేదు. అందువల్ల, ఒక బలహీనుడు ఒక శక్తి వంతుణ్ణి రాజు ద్వారా అపేక్షించినట్లే, న్యాయం ద్వారా అపేక్షించగలడు. ఈ న్యాయమనేది సత్యం-అంటే సత్యం పలికే ఒక వ్యక్తిని వారు "అతడు న్యాయాన్ని పలుకుతాడు" అని లేదా ఏ వ్యక్తైతే న్యాయాన్ని పలుకుతాడో ఆవ్యక్తిని "అతడు సత్యాన్ని పలుకుతాడు" అని అంటుంటారు. రెండు పరస్పర సంబంధం కలిగినవి.

" 27. అది, బ్రహ్మ, క్షత్రము, వైశ్య మరియు శూద్ర అయి వున్నది. అగ్ని ద్వారా అది దేవతలలో బ్రహ్మగా, మానవులలో బ్రాహ్మణుడు (దైవిక) క్షత్రియుడి నుండి (మానవ) క్షత్రియుడు మరియు (దైవిక) వైశ్యుని నుండి (మానవ) వైశ్యుడు (దైవిక)శూద్రుడి నుండి (మానవ ) శూద్రుడు, అవడం జరిగింది. అందువల్ల దేవతల్లో అగ్ని మరియు మానవుల్లో బ్రాహ్మణున్ని వారు ఆశ్రయిస్తారు."

తైత్తరీయబ్రాహ్మణం 1, 2, 67- "దైవ్యో వైవర్ణో బ్రాహ్మణః అస్సుర్యో శూద్రాః" (బ్రాహ్మణకులం దేవతల నుండి, శూద్ర కులం రాక్షసుల నుండి ఉద్భవించాయి.')

కులము మనుగడ సాగించడానికి చట్టపరమైన (legal ) మరియు మతపరమైన (religious) దండనలు లేదా శిక్షలు (sanctions) శక్తివంతమైన యంత్రాలుగా పనిచేస్తాయని ఒప్పుకోవాలి. కాని, మతపరమైన దండన ప్రాథమిక మైనదనియు మరియు కులమనేది కేవలం మతపరమైన దండన యొక్క శక్తిద్వారా పోషింపబడుతుందనేది నిస్సందేహమైన విషయం. ఇది రెండు సందర్భాలలో ప్రస్ఫుటమౌతుంది. చట్టపరమైన దండన అరుదైన సంరక్షణను కల్పించేది గా అంగీకరింపబడాలి. అంటే కులము యొక్క

పోషణ వేరే మార్గముల ద్వారా జరుగుతున్నదన్నమాట. రెండవది, చట్టపరమైన దండన అనేది 1850 వరకు మాత్రమే వాడుకలో వుండేది. దాన్ని అదే సంవత్సరంలో బ్రిటిషు ప్రభుత్వం వారు ఆమోదించిన 'caste Disabilities removal Act' ద్వారా తొలగించడం లేదా తుడిచిపెట్టడం జరిగింది. చట్టపరమైన దండనను ఉపసంహరించుకొన్నప్పటికీ, కులము మాత్రం ఎలాంటి అదుపు లేకుండా నిలిచి పోయింది. ఒక వేళ కులం కనుక చట్టపరమైన దండనతో ప్రమేయం లేని స్వతంత్రమైన, మరింత శక్తివంతమైన మతపరమైన దండనను కలిగి లేనట్లయితే అది సాధ్యమై వుండేదికాదు. ఒక విశ్వాసం లేదా ఒక వ్యవస్థకు ఆధారాన్ని కల్గించి, కాపాడాల్సిన మతపరమైన దండన అత్యంత శక్తివంతమైనదనేది ప్రశ్నింపలేని విషయం. దానిశక్తి పరిమాణంలో అపరిమిత మైనది మరియు అణచివేయడంలో మహా గొప్పది-కాని ఎప్పుడు, ఎట్లా ఈ మతపరమైన దండన ఈ అత్యుత్తమ స్థాయి అశ్వశక్తిని (High grade Horse-power) పొందిందనేది అపూర్వమైన విషయం. దీన్ని విశ్లేషించుటకు మతపరమైన దండన యొక్క శక్తికి మూలం రెండు రకాలనే విషయాన్ని గుర్తించడం అవసరం.

మొట్టమొదటి స్థానంలో, మతపరమైన ప్రతీది సామాజిక పరమైనది. ప్రొ॥ డర్క్‌హీమ్ (Prof. Durkhelm ) ప్రకారం ;[1]

"వాస్తవమైన మత విశ్వాసాలనేవి ఎల్లప్పుడూ ఒక నిర్ధారిత వర్గానికి సాధారణమైనవిగా వుంటూ, వారు వాటిని అనుసరించుతూ వాటికి సంబంధించిన ఆచారక్రియలు చేసే విధంగా పనిచేస్తాయి. అవి ఈ వర్గములోని సభ్యులందరి ద్వారా వ్యక్తిగతంగానే అలవరచుకోబడవు. అవి ఆ వర్గానికంతటికీ సంబంధించినవి. అంతే కాకుండా అవి ఆ వర్గం యొక్క ఐక్యతను సాధిస్తాయి. దానిలోని వ్యక్తులు, కేవలం ఒక సాధారణ విశ్వాసాన్ని కలిగివుండడం వల్ల, ఒకరిలో ఇంకొకరు ఐక్యతను కలిగి వున్నట్లు గా భావిస్తారు".

రెండవ స్థానంలో, మత పరమైనది ప్రతీది డర్క్‌హీమ్ ప్రకారం పవిత్రమైనది.[2]

"తెలిసిన మతవిశ్వాసాలన్నీ, అవి సాధారణమైనవిగాని లేదా జటిలమైనవిగాని, ఒకే ఒక సాధారణ లక్షణాన్ని కలిగి వుంటాయి. అవి మానవులు వాస్తవమైనవి (real) గా

అంతే కాకుండా, వర్గము యొక్క సమైక్యత దాని మతపరమైన విశ్వాసాలతో దగ్గరి సంబంధం కలిగి వుండడం వల్ల, ఒక మతేతరమైన విశ్వాసాన్ని తృణీకరించి తప్పు చేసిన వ్యక్తిని దండించడానికి ఒక వర్గం వుపయోగించే దండన యొక్క కాఠిన్యత మరియు తీవ్రత స్థాయికంటే ఒక మతపరమైన విశ్వాసాన్ని తృణీకరించిన సందర్భంలో అది ఇచ్చే దండన యొక్క కాఠిన్యత మరియు తీవ్రత సాధారణంగా హెచ్చు స్థాయిలో వుంటుంది. సామాజిక శక్తి కలిగి వున్న తిరుగు లేని అధికారము ముందు, వ్యక్తి శక్తి హీనుడు. మతపరమైన విశ్వాసం విషయానికొస్తే, దాన్ని ఉల్లంఘించడం ఒక ఉపేక్షించ రాని తప్పు అనే అభిప్రాయంవల్ల సామాజిక శక్తియొక్క తిరుగులేని అధికారము ఉక్కులా దృఢపడడమే కాకుండా, పూర్తిగా సామాజిక పరమైన దండన కంటే మతపరమైన దండనకు అత్యంత శక్తిని ఇస్తుంది.

మతపరమైన దండనకు గల అధికారానికి పవిత్ర మూలం ప్రాథమికంగా వ్యక్తినుండి, తర్వాత మాత్రమే వర్గం నుండి వస్తుంది. అదే మతపరమైన దండన యొక్క సామాజిక మూలపు గమనించదగిన విశిష్టత. అది వ్యక్తులను మతవిశ్వాసాలను కాపాడేందుకు సంసిద్ధులను చేస్తుంది. అది ఒక వర్గము తన సామాజిక వర్గాన్ని వుపయోగించుకొనే అవసరాన్ని కలుగజేస్తుంది. అందువల్లనే మతపరమైన దండనాధికారము యొక్క పవిత్ర మూలం, దాన్ని తక్కిన అన్ని దండనలను వాస్తవానికి తుడిచిపెట్టి, వాటిని అధిగమించేంత ఉత్కృష్టమైనదిగా చేస్తుంది. అందువల్లనే కాలము మరియు పరిస్థితులు కూడా వేటినై ప్రభావితం చేయడంలో శక్తిహీనమైనవిగా ఋజువు పఱచబడినవో, ఆ మత విశ్వాసాల సమైక్యత లేదా సమగ్రతను కాపాడేందుకు మతపరమైన దండన ఒక్కటి మాత్రమే సరిపోతుంది. ఇది ఏరకంగా జరుగుతుందో అర్థం చేసుకోవడం చాలా సులభం. పవిత్రతత అనేది వ్యక్తిలో పవిత్రమైనవాటిపై తనకు లేని భక్తి ఆవమును మరియు నమ్రతా భావమును ప్రేరేపిస్తుంది. డర్ఖీమ్ భాషలో చెప్పాలంటే,

"పెద్ద సామాజిక కార్యకలాపాల (high Social functions) పట్ల మానవులు చేసిన సాధారణ సమర్థన, స్వభావంలో మతపరమైన గౌరవం (పవిత్రతత పట్ల) కంటే భిన్నమైనదికాదు. అది, అటువంటి నడవడిద్వారా వ్యక్తపరచబడుతుంది. ఒక వ్యక్తి, ఒక గొప్ప ప్రముఖుని నుండి కొంత దూరంగా వుంటాడు. ఆ వ్యక్తి కొన్ని జాగ్రత్తలు తీసికొని మాత్రమే అతన్ని సమీపిస్తాడు. అతనితో సంభాషించేప్పుడు ఆ వ్యక్తి ఇతర సాధారణ

అంతే కాకుండా, వర్గము యొక్క సమైక్యత దాని మతపరమైన విశ్వాసాలతో దగ్గరి సంబంధం కలిగి వుండడం వల్ల, ఒక మతేతరమైన విశ్వాసాన్ని తృణీకరించి తప్పు చేసిన వ్యక్తిని దండించడానికి ఒక వర్గం వుపయోగించే దండన యొక్క కాఠిన్యత మరియు తీవ్రత స్థాయికంటే ఒక మతపరమైన విశ్వాసాన్ని తృణీకరించిన సందర్భంలో అది ఇచ్చే దండన యొక్క కాఠిన్యత మరియు తీవ్రత సాధారణంగా హెచ్చు స్థాయిలో వుంటుంది. సామాజిక శక్తి కలిగి వున్న తిరుగు లేని అధికారము ముందు, వ్యక్తి శక్తి హీనుడు. మతపరమైన విశ్వాసం విషయానికొస్తే, దాన్ని ఉల్లంఘించడం ఒక ఉపేక్షించ రాని తప్పు అనే అభిప్రాయంవల్ల సామాజిక శక్తియొక్క తిరుగులేని అధికారము ఉక్కులా దృఢపడడమే కాకుండా, పూర్తిగా సామాజిక పరమైన దండన కంటే మతపరమైన దండనకు అత్యంత శక్తిని ఇస్తుంది.

మతపరమైన దండనకు గల అధికారానికి పవిత్ర మూలం ప్రాథమికంగా వ్యక్తినుండి, తర్వాత మాత్రమే వర్గం నుండి వస్తుంది. అదే మతపరమైన దండన యొక్క సామాజిక మూలపు గమనించదగిన విశిష్టత. అది వ్యక్తులను మతవిశ్వాసాలను కాపాడేందుకు సంసిద్ధులను చేస్తుంది. అది ఒక వర్గము తన సామాజిక వర్గాన్ని వుపయోగించుకొనే అవసరాన్ని కలుగజేస్తుంది. అందువల్లనే మతపరమైన దండనాధికారము యొక్క పవిత్ర మూలం, దాన్ని తక్కిన అన్ని దండనలను వాస్తవానికి తుడిచిపెట్టి, వాటిని అధిగమించేంత ఉత్కృష్టమైనదిగా చేస్తుంది. అందువల్లనే కాలము మరియు పరిస్థితులు కూడా వేటినై ప్రభావితం చేయడంలో శక్తిహీనమైనవిగా ఋజువు పఱచబడినవో, ఆ మత విశ్వాసాల సమైక్యత లేదా సమగ్రతను కాపాడేందుకు మతపరమైన దండన ఒక్కటి మాత్రమే సరిపోతుంది. ఇది ఏరకంగా జరుగుతుందో అర్థం చేసుకోవడం చాలా సులభం. పవిత్రత అనేది వ్యక్తిలో పవిత్రమైనవాటిపై తనకు లేని భక్తి ఆవమును మరియు నమ్రతా భావమును ప్రేరేపిస్తుంది. డర్క్‌హీమ్ భాషలో చెప్పాలంటే,

"పెద్ద సామాజిక కార్యకలాపాల (high Social functions) పట్ల మానవులు చేసిన సాధారణ సమర్థన, స్వభావంలో మతపరమైన గౌరవం (పవిత్రత పట్ల) కంటే భిన్నమైనదికాదు. అది, అటువంటి నడవడిద్వారా వ్యక్తపరచబడుతుంది. ఒక వ్యక్తి, ఒక గొప్ప ప్రముఖుని నుండి కొంత దూరంగా వుంటాడు. ఆ వ్యక్తి కొన్ని జాగ్రత్తలు తీసికొని మాత్రమే అతన్ని సమీపిస్తాడు. అతనితో సంభాషించేప్పుడు ఆ వ్యక్తి ఇతర సాధారణ

వ్యక్తులతో సంభాషించేప్పుడు వుపయోగించే వాటి కంటే భిన్నమైన సంజ్ఞలు మరియు భాషను వుపయోగిస్తాడు.".

పవిత్రత భక్తి భావమును కలుగజేస్తుంది. అది, దాన్ని అతిక్రమించరాదు అనే భావనను కూడా కలుగజేస్తుంది. ఎప్పుడైతే ఒక విశ్వాసం పవిత్రమైన విషయంగా తయారవడం జరుగుతుందో, అప్పుడు, దాన్ని స్పృశించడం, నిరాకరించడం లేదా ఎదిరించడం, నిషేధింపబడుతుంది. పవిత్రమైన దాన్ని విమర్శించడం పై నిషేధం కలదు. పవిత్రమైనది 'స్పృశింపరానిది మరియు తర్కమునకతీతమైనది'. ఎప్పుడైతే ఒక వ్యక్తి ఈ అభిప్రాయములను బాగా జీర్ణించుకొంటాడో, ఎప్పుడైతే ఈ అభిప్రాయములు అతని జీవనంలో అంతర్భాగం అవుతాయో, అప్పుడు ఆ వ్యక్తి, దేనైతే పవిత్రమైనదిగా భావించాలని బోధింపబడ్డాడో, దాన్ని కాపాడే వాడుగా మరియు దాని రక్షకుడిగా, స్వయంగా మారడం జరుగుతంది.

కులం విషయంలో హిందువులు ఖచ్చితంగా ఇదే చేశారు. వారు కులానికి వేదములలో స్థానాన్ని కల్పించారు. వేదములు పవిత్రమైనవికావడంవల్ల, తద్వారా కులం కూడా పవిత్రమైనది అయ్యింది. మతపరమైనవి కావడంవల్ల వేదములు పవిత్రమైనవని చెప్పడం తప్పు అవుతుంది. అసలు విషయమేమిటంటే, అవి పవిత్రమైనవి కావడం వల్లనే మతపరమైనవి అయ్యాయి.

వేదాలపట్ల హైందవుడు కలిగి వున్న పవిత్రతా భావాన్ని ప్రత్యక్షంగా వ్యక్తపరచే ఎలాంటి పేరు వేదానికి లేనట్లు కనిపించవచ్చు. మామూలుగా చెప్పాలంటే, వేదం అంటే జ్ఞానం అని అర్థం. అది అయితే కావచ్చు. కాని వారు వేదాలను పవిత్రమైనవిగా భావిస్తారనే విషయంలో ఎలాంటి సందేహం లేదు. వాస్తవానికి వేదానికి వారు పెట్టిన పేరు పవిత్రత అనే పదం కన్నా చాలా ఉన్నత స్థాయిలో భక్తి భావనను వ్యక్తపరుస్తుంది. వేదాలను వారు శ్రుతి అని అంటారు. అంటే మానవుడిద్వారా వినబడిన (మానవుడికి తెలియజేయబడిన) దేవుని వాక్కు అని దాని అర్థం. ప్రాచీన మతం (primitive religion) లో మనిషి తయారు చేసినవి పవిత్రమైనవి. హిందూ మతంలో, దేనైతే భగవంతుడు పవిత్రమైనదిగా నిర్ణయించాడో అది పవిత్రమైనది.

హిందువులు వేదాలను తమ పవిత్ర మత గ్రంధాలుగా భావిస్తారు. వారు స్వయంగా వేదాలను ఒక వర్గంలో వుంచుతారు.హిందువులు 'కల్పాలు' అన బడే సృష్టి చక్రాలు(cycles of creation) వున్నట్లు అభిప్రాయ పడతారు.[3] ప్రతి చక్రం యొక్క అంతంలో ఒక జలప్రళయం (deluge) వుంటుంది. మరియొక సృష్టిచక్రం ప్రారంభ మౌతుంది. ఒక కాల్పాంతంలో, జలప్రళయంలో వేదాలు నాశనమవుతూ వుంటాయి. ప్రతి కల్పారంభంలోనూ తిరిగి అవి భగవంతుడి ద్వారా ప్రభోధింపబడతాయి. అదే ప్రకారంగా కృత యుగంతో ప్రారంభమై గత కల్పాంతంరంలో, అంటే ప్రస్తుత కల్పారంభంలో, జలప్రళయంలో వేదాలు నాశనమైనాయి. అవి భగవంతుడి ద్వారా ఋషులకు ప్రభోధింపబడ్డాయి. వేదాలను హిందువులు నిత్యమైనవి (శాశ్వతమైనవి), అనాదియైనవి (ఆరంభము లేనివి) మరియు అపౌరుషేయమైనవి (మానవులు సృజించినవి కానివి) గా భావిస్తారు. క్లుప్తంగా, వేదాలనేవి భగవంతుని వాక్కులు మరియు మానవునికి భగవంతుడు చేసిన శాసనాలను కలిగి ఉన్నవి.

వేదాలు శ్రుతి అని పిలువబడన్పటికీ, పవిత్రమైనవి కలిగి ఉండే తిరుగులేని అధికారాన్ని అవి కలిగి ఉండేవి. మతాలనేవి ప్రొ॥ మాక్స్ ముల్లర్[4] ద్వారా అనేక రకాలుగా వర్గాకరింపబడినాయి. భగవత్ప్రబోధితమైనదానికి(revealed) భిన్నంగా సహజమైనది (natural) అనేది ఒక రకమైన వర్గీకరణ. జాతీయమైన (national) దానికి భిన్నంగా వ్యక్తిగతమైనది (individual) అనేది ఇంకో రకమైన వర్గీకరణ. నాస్తిక మతం Atheistic దైవత్వ మతం(deitstic), ద్వైతమతం(Dualistic) అనేక మతములనమ్మునది, లేదా విశిష్టా ద్వైతమతం (Polytheistic), అద్వైతమతం (Monotheistic) ఒకే దేవుణ్ణి ఆరాధిస్తూ అన్యదేవతల ఉనికిని నిరాకరించినది (Henotheistic) మరియు జీవారాధన (Animistic), అని పిలువడం వాటిని మూడో రకంగా వర్గీకరిచండం. సత్యమైనవి మరియు అసత్యమైనవి అనేది మతం యొక్క ఇంకోరకమైన వర్గీకరణ. గ్రంథ హీన (bookless) మతములు మరియు గ్రంధ సహిత (with book) మతములు అనే రెండు తరగతులుగా మతములును వర్గీకరించవచ్చు. దీనితో మత వర్గీకరణ పద్ధతులు బహుశా పూర్తి కాకపోవచ్చు. వ్యవస్థాపకులను కలిగిన మతములు మరియు వ్యవస్థాపకులు లేని మతాలుగా విభజించడం మిగిలిపోయింది.

రెండు మినహా ఈ భేదాలన్ని సామాజిక ప్రాముఖ్యతను కలిగి ఉన్నాయి. సహజమైన భగవత్ప్రబోధితమైన మరియు గ్రంధ సహిత మరియు గ్రంధ రహిత మతముల మధ్యవిభేదాలు కలవు. ఆ విభేదాలనేవి గుర్తించబడినప్పటికీ ఆచరణలో అవి వ్యత్యాసమును కలిగి ఉంటుంది. గ్రంధ రహితమైన మతం కంటే గ్రంధ సహిత మైన మతం తప్పక కొంత అనుకూలతను కల్గి ఉంటుంది. గ్రంధ రహితమైన మతమంటే, వ్రాసి యున్న నిబంధనలు(written constitution) లేని మతం. ఒక గ్రంధ సహితమైన మతం అది సత్యమైనదనే అభిప్రాయము కలగజేస్తుంది. అదే గ్రంధ హీనమైన మతం అలాంటి అభిప్రాయాన్ని కల్గించలేదు. గ్రంధ సహితమైన మతంతో పోల్చినప్పుడు, గ్రంధ హీనమైన మతం అసత్యమైనదనే న్యూనతా భావనను కల్గి ఉంటుంది. మాక్స్ ముల్లర్ భాషలో గ్రంధ సహితమైన మతములు మాత్రమే "నిజమైన మతాలుగా పరిగణింపబడతాయి, అంతేకాకుండా, అవి తప్పుడు సిద్ధాంతాలను కలిగి ఉన్నప్పటికీ, అన్ని విషయాల్లో క్షమార్హమైన ప్రభువుల మాదిరిగా చూడబడతాయిప. అదే సందర్భంలో గ్రంధ రహితమైన లేదా నిరక్షరమైన(illeterate) మతాల సమూహాలు పూర్తిగా రాజాదర్బారు వెలుపల ఉన్నాయి. గ్రంధ రహితమైన మతాలకంటే గ్రంధ సహితమతాలకు ఔన్నత్యమును ఆపాదించడాన్ని అర్థం చేసుకోవడం చాలా సులభం. ఎప్పుడైతే "తెలుపుపై నలుపు" (black on white) అనేది సత్యానికి ప్రతిరూపం అవుతుందో అప్పుడు, తెలుపుమీద నలుపు అయిన, వ్రాయబడిన మతం, అసత్యమైనది కానిదిగా అగుపించడం చాలా సహజం. గ్రంథ సత్యానికి నిదర్శనంగా పనిచేస్తుంది. గ్రంథ రహితమైన మతం ఎలాంటి నిదర్శనాన్ని కల్గిలేదు.

గ్రంథ సహిత మతము యొక్క సామాజిక ప్రాముఖ్యత గ్రంథంలో పొందుపరచబడిన మతం సత్యమైనది అనే అభిప్రాయమును కలుగ జేయడం ద్వారా అది ప్రజల చిత్తంపై అదుపును కల్గి ఉంటుందనే వాస్తవంలో ఉంది. అది మతానికి ప్రజలపై అధికారమును కలుగ జేయడంతో పాటు వారిలో మనః పూర్వకమైన విధేయతను ప్రేరేపిస్తుంది.

ఏమైనప్పటికీ ఒక గ్రంధ సహిత మతమైన కారణంగా, ఒక మతం అసత్యమైనదిగా కనిపించినప్పటికీ ఒక వేళ ఆచరణలో (empirically) తప్పుడు విశ్వాసాలు మరియు ఆచార కర్మలు దానిలోనికి ప్రవేశించినట్లయితే గ్రంథం మతాన్ని కాపాడలేదు. ఒక వ్యక్తి సిద్ధాంత పరంగా తప్పుడు మార్గంలో పోవచ్చు. కాని అతని లౌకిక ప్రవృత్తి అతను

చాలా కాలం వరకు తప్పుడు సిద్ధాంతాల మార్గంలో పయనించడానికి చాలా అరుదుగా అనుమతిస్తుంది. ఒక వేళ ఒక సామాజిక వర్గపు సిద్ధాంతాలు నిత్యం కానట్లయితే మతం వాస్తవానికి దీర్ఘకాలంలో వైదొలగి పోవాల్సి ఉంటుంది.

సహజ మతం మరియు భగవత్ప్రభోదిత (revealed) మతాల మధ్య వ్యత్యాసపు సామాజిక ప్రాముఖ్యతకు సంబంధించిన ప్రస్తావన ఇప్పుడు వస్తుంది. ఒక భగవత్ప్రబోధిత మతం, సహజ మతం కన్నా ఔన్నత్యం కలిగి ఉంటుంది. చాలా మంది రచయితలు సహజ మతాన్ని మతం యొక్క చారిత్ర్మాక రూపాల విషయంలో ఉపయోగించారు. అది ప్రజల యొక్క వృద్ధితో పాటుగా వృద్ధి పొందిన అంశం. ప్రజల అవసరాలు మరియు వారు నివసించే పరిసరాల మధ్య పరస్పర చర్య ఫలితంగా వృద్ధి పొందింది. సహజ మతం మానవుడి ద్వారా సృష్టించబడ్డది. దాని దండన అనేది మానవుడిలో కనిపించే సత్య జ్ఞానము (sense of truth) మరియు పశ్చాత్తాప స్వరములాంటిది. ఒక భగవత్ప్రధిత మతం మానవాధికారం పై ఆధారపడి యుండును. అది మానవుడి సృష్టి కాదు. అది భగవంతుడి సృష్టి. దాన్ని దండన అనేది పరిపూర్ణ సత్యమైన మరియు పరిపూర్ణ శ్రేష్టమైన భగవంతుడు లాంటిది. భగవత్ప్రభోదిత మతం యొక్క విధి మతాన్ని పవిత్రం చేయడం, తద్వారా దాన్ని విమర్శలనుండి అతీతంగా ఉంచుతూ, దాన్ని జవదాటరానిదిగా చేయడం.

వేదాలు రెండిటి లక్షణాలు కల్గి ఉన్నాయి. అవి గ్రంథ రహితమైన మతం కలిగి ఉండే అనుకూల స్థితిని మరియు సహజమతం, భగవత్ప్రబోధిత మతం కలిగి ఉండే అనుకూల స్థితిని కల్గి ఉంటాయి.

కులం స్వతహాగా, వేదాల ద్వారా ప్రభోదించబడడం వల్ల వ్రాయబడిన గ్రంథం యొక్క అధికారమును మరియు దైవ వాక్కు యొక్క అధికారమును మరియు దైవవాక్కు యొక్క పవిత్రను పొందుతుంది. వేదం ద్వారా ప్రతి పాదించబడిన ఒక పథకం కావడం వల్ల అది ద్విగుణీకృత రక్షణను పొందుతుంది. అది దైవిక సత్యం అయిన కారణంగా ప్రతి ఒక్కరు తప్పక దాన్ని అనుసరించాలి. అంతే కాకుండా అది పవిత్రమైనది కాబట్టి దైవ దూషణ చేసిన నేరస్తుడు తప్ప, దాన్ని ఒక తప్పుగా ఎవ్వరూ ఎదిరించరాదు.

ఇది కులం పట్ల హైందవ దృక్పథం. అంతే కాకుండా జాతి సిద్ధాంతం (racial theory) ద్వారా రిస్లే అనే అతడు కార్యకార సిద్ధాంతము (functional theory) ద్వారా

నెస్‌ఫీల్డ్ వృత్తి సిద్ధాంతం (Occupational theory) ద్వారా సెన్సాట్ (Sensant) లు ఇచ్చిన ఆధునిక వివరణల[8] ద్వారా సగటు హైందవుడు అంతగా సంతృప్తి చెందలేదు. భగవంతుడి వాక్కు లేదా శృతి అయిన వేదాలలో ప్రస్తావించబడిన కారణంగా కులం భగవంతుడి ద్వారా సృష్టించబడినదని అతనికి తెలుసు. మరియు అతడు ఆ విధంగా విశ్వసిస్తాడు. అందువల్ల అది శాశ్వతమైనది మరియు సత్యమైనది.

'కుల' వ్యతిరేకుల యొక్క విమర్శలను ఎదుర్కొని దాన్ని సమర్థించాలని కోరిన ప్రతిసారి, అట్టి కులం దైవికమైనది, పవిత్రమైనది. అందువల్ల అటువంటి కులం శాశ్వతంగా నిలిచి పోవాలనే వాదనా సరళిని బ్రాహ్మణులు ఎంచుకోవడం జరిగింది. బ్రాహ్మణులు ఒకవైపు మరియు బుద్ధుడు, ఆయన అనుచరులు ఇంకోవైపు ఉండి, వీరి మధ్య కులం విషయంలో ఒకప్పుడు చెలరేగిన వివాదంలో, కులం పట్ల ఈ దృక్పథం ప్రస్ఫుటమైన వర్ణాలలో బయట పడింది. అది;

"ఒకవేళ ఋషుల యొక్క సాధారణ అభిప్రాయాలు మాత్రమే కాక, సూచించబడిన బ్రాహ్మణుల సిద్ధాంతాలు కూడా దైవిక మూలం నుండి వుద్భవించాయి. గనక మానవ వివేకం (reasoning) లో అవి ఎదిరింపబడ జాలవు అనే విశ్వాసం ఒకానొకప్పుడు స్థాపితమైనట్లయితే, వేదముల యొక్క పవిత్ర అధికారముపై బ్రాహ్మణులు తాము కలిగి ఉన్నట్లు పేర్కొనే విశేషాధికారము (privileges)ల పట్ల వ్యతిరేకత, మతపరమైన ఒక భేదాభిప్రాయముగా స్పష్టమవుతుంది. అంతే కాకుండా ఎప్పుడైతే బ్రాహ్మణ సిద్ధాంతాలు ప్రజల లేదా రాజుల యొక్క మతం అయ్యాయో అప్పుడు అలాంటి వ్యతిరేకత రాజ్యము యొక్క మతపరమైన చట్టాల (hierarchial laws) పరిశీలనకు పాత్రమౌతుంది. ఋషుల సిద్ధాంతాలను, వాటి మౌలికమైన సాధారణలక్షణాలలో మరియు స్వచ్ఛతలో కాపాడడం కంటే, శృతి యొక్క దైవిక ఆధిపత్యమును అంగీకరించేలా చూసేందుకు బ్రాహ్మణులు అత్యంత శ్రద్ధను కనబరిచారు. తాత్విక వాదాల విషయంలో వారు సాధ్యమైనంత స్వేచ్ఛను అనుమతించారు. అంటే మొట్టమొదటి మూడు తాత్విక పద్ధతులు (రెండు మీమాంసలు మరియు న్యాయము) మాత్రమే ఛాందసమైనవిగా అంగీకరించబడినప్పటికీ, వైశేషిక, సాంఖ్య మరియు యోగ పద్ధతులలో కలపుకొని వాటి సంఖ్య ఆరుకు పెరిగింది. అత్యంత ప్రముఖమైన అనేక అంశాల పై ఉన్న అత్యంత

పరస్పర విరుద్ధమైన అభిప్రాయాలు ఏ రకంగా నైతేనేమి వాటి సమర్థకులు సాధ్యమైనన్ని రకాలుగా సాగదీసి మరియు మలుపులు త్రిప్పబడిన వారి సిద్ధాంతాలను వేదాల యొక్క చరణాలలో సమైక్యం చేయడంలో విజయవంతమైనంత వరకు అంగీకరించబడినాయి. ఒక వేళ ఇంద్రియములయొక్క జ్ఞానము (perception of sense) మరియు వివేకము యొక్క ప్రతిష్టాపన (indication of reasoning) లతో పాటుగా వేదాలలో మానవ విజ్ఞానమునకు ఉన్న శృతి లేదా జ్ఞానము కూడా మానవ విజ్ఞానమునకు ఒక వాస్తవ ఆధారాన్నిచ్చాయి అనే అభిప్రాయాన్ని మాత్రమే అంగీకరిస్తే అన్ని అంశాలు తక్కువ ప్రాముఖ్యత గల అంశాలుగా కనిపించాయి. తాత్విక మేధావులు వాస్తవ మరియు అతీత (transcedental) ప్రపంచం, సృష్టించినవాడు మరియు సృష్టించబడినది, దైవిక మరియు మానవ నైజాల మధ్య గల సంబంధముపై సాధ్యమైనన్ని అభిప్రాయాలను వ్యక్తం చేసేందుకు అనుమతించబడినారు. కానిఅలాంటి అభిప్రాయాల ద్వారా బ్రాహ్మణ కులానికి ప్రమాదం సంభవించే అవకాశం లేకుండెను. కపిలుని ఛాందస వాదములో కనిపించే, బుద్ధ శాక్యముని యొక్క తాత్విక సిద్ధాంతాలలో కనిపించే మతపరమైన భేదాభిప్రాయముల ద్వారా కూడా అలాంటి ప్రమాదం లేకుండెను. అతడు చేసిన నేరమల్లా బ్రాహ్మణుల యొక్క విశేషాధికారములు మరియు దురాచారములను వ్యతిరేకించడం. ఈ దురాచారాలు, ముఖ్యంగా బ్రాహ్మణుల యొక్క దురాచారములు దైవిక ఆధిపత్యము ద్వారా ప్రసాదించబడినాయి. ఈ దురాచారములను ఎదిరించడానికి, బుద్ధుడు వాటికి ఆధారభూతమైన దైవిక ఆధిపత్యమును ఎదిరించాడు. అందువల్లనే అతడు భిన్నమతావలంబకుడు (heretic) మరియు చెడ్డవాడు (anathema).

"బుద్ధుడు క్షత్రియుడు. అతడు ప్రముఖమూలం (principal origin)కు చెందిన వాడే కాకుండా ఆ ప్రాంతపు ప్రభువులకు (Nobility) చెందిన వాడు. అతని కులంలో బ్రాహ్మణుల అత్యాశను వ్యతిరేకించిన వారిలో ప్రధముడు, బుద్ధుడికి చాలా శతాబ్దాలకు పూర్వం బుద్ధుడి వలెనే, రాచకుల సభ్యుడైన విశ్వామిత్రుడు మత గురువు (Priests) యొక్క ప్రత్యేకతకు (exclusiveness) వ్యతిరేకంగా పోరాడాల్సి వచ్చింది. ఏమైనప్పటికి ఆ కాలంలో బ్రాహ్మణుల పరిస్థితి అంత అజేయమైనదిగా లేకుండెను. అందుకు పూర్వ బ్రాహ్మణులు ఇతరులకు చెందకుండా కేవలం తమ కులానికి మాత్రమే చెందేలా నిలుపుకున్న హక్కులను, విశ్వామిత్రుడు కుటిలుడైనప్పటికి తను ఏ హక్కుల కోసమైతే

పోరాడాడో ఆ హక్కులను తనకు మరియు తన కుటుంబానికి ఆర్జించే విషయంలో విజయవంతం అవడం జరిగింది. బ్రాహ్మణాల (Brahmanas)లో కథగా ఎవరి చరిత్ర తే వ్రాయబడిందో ఆ విదేహ రాజయిన జనకుడు బ్రాహ్మణుల యొక్క ఆచారాధిపత్యపు అర్హతలకు లోబడి ఉండడానికి నిరాకరించడంతో పాటు మతాచార్యుల ప్రవేశంలేకుండా యజ్ఞమును నిర్వహించగల తన హక్కును నొక్కి వక్కాణించాడు. ఈ ఇద్దరు వ్యక్తులు మరియు బుద్ధుడి వ్యక్తిగత గుణగణాలలో ఎంత పెద్ద వ్యత్యాసమున్నప్పటికీ వారి వ్యతిరేకతకు మూలాధారము ఒక్కటే. ఈ ముగ్గురూ కూడా ఒక స్వార్థపర మతాచార్యత (selfish priesthood) యొక్క విశేష అర్హతలకు వ్యతిరేకంగా, సమానంగా పోరాడారు.

"కానీ విశ్వామిత్రుడు తన కులము మరియు కుటుంబము యొక్క హక్కులను పరిరక్షించడంతో పాటు స్వయంగా సంతృప్తిచెంది, మతాచారపు అధికారాల యొక్క ఫలములో భాగమును ఇచ్చినంతతో సమాధాన పడడం జరిగితే, అదే సందర్భంలో జనకుడు యజ్ఞవల్క్యుడు మరియు ఇతర బ్రాహ్మణులు తన పట్ల చూపిన విధేయతతో సంతృప్తి చెందినట్లు స్వయంగా వ్యక్తీకరించాడు. క్లుప్తంగా చెప్పాలంటే, సంస్కర్తలుగా కనిపించిన అనేక మంది తర్వాతి సంస్కర్తలు ఈ విషయంలో అపజయం పాలవడమో లేదా లాభం పొందడమో జరిగింది. ప్రజల మనసులలో అసంతృప్తి బీజాలు వృద్ధి చెందుతూ ఉన్నాయి. భారత చరిత్రలో క్షత్రియులందరూ పరశురాముడి ద్వారా నాశనము చేయబడినారని పేర్కొనబడిన ఒక చీకటి అధ్యాయం కలదు. అది బ్రాహ్మణుల యొక్క ఆచారాధిపత్యపు ఆధిక్యతకు (hierarchical supremacy) ఆరంభాన్ని సూచిస్తుంది. బ్రాహ్మణులు ఎప్పుడు కూడా రాజరికాధికారమును ఆశించినట్లుగా కనిపించకపోయినా భారత చరిత్ర మరియు ఆచారాలు మనకు తెలిసినంత వరకు, వీరి కులము వాస్తవానికి ఎల్లప్పుడు ఒక పాలక కులము (ruling caste)గా ఉంటుంది. ఆచార్యత్వం (ministry) దైవిక అనుగ్రహాన్ని కలుగజేసే ఒకే మాధ్యమంగా గౌరవింపబడేది. వారి సిద్ధాంతాలు లోపాలు లేనట్టివిగా అంగీకరింపబడేవి. వారి దేవతలు మాత్రమే నిజమైన దేవతలుగా ఆరాధింపబడేవారు. మరియు వారు ఋషుల యొక్క అతిసాధారణ అభిప్రాయములను మరియు బ్రాహ్మణ రచయితల యొక్క అవివేకవంతమైన రచనలను దైవిక ఆధిపత్యపు (divine) లో ముద్రవేయుటకు తగినంత శక్తి వంతమైనదిగా ఉండేది. ఏమైనప్పటికీ ఈ చివర దశలో బ్రాహ్మణత్వపు విజయోత్సాహం కుప్పకూలుటకు భారత దేశంలో

ప్రజలు నిజము పై ఏకస్వామ్యమునకు(monopoly of truth) లొంగి ఉండరు. అంతే కాకుండా రాజకీయ యదేచ్ఛాధికారపు దాస్యమును భరిస్తూ వచ్చిన అదే లక్షలాది మంది ప్రజలు మేధావుల క్రూర పాలన యొక్క సంకెళ్లను విసిరి పారవేశారు. ప్రపంచంలోని ఒకానొక అతిపురాతనమైన మతాన్ని కూల ద్రోయడానికి, భూసురులు (భూదేవతలు) అయిన బ్రాహ్మణుల యొక్క అధిపత్యమును ఒకే ఒక వ్యక్తి సవాలు చేయడం మరియు నీచముగా నెంచబడి తిరస్కరించబడిన దేవుడి యొక్క ప్రాణులకు మతాచార్యుల మధ్య వర్తిత్వము లేకుండా ఈ మతాచార్యులు భగవత్సంబంధితమైనవిగా పిలిచే గ్రంథములపై విశ్వాసము లేకుండానే మోక్షము సాధ్యమనే చిన్న సత్యాన్ని ప్రభోదించడం సరిపోయింది.. ఆ మానవుడే శౌక్యముని బుద్ధుడు. బుద్ధుడి సిద్ధాంతాలను బ్రాహ్మణులు ఎలా పరిగణించారనే విషయాన్ని విచారించినట్లయితే, వారి తాత్విక రచనలలో అక్కడక్కడా, ఆయన కొన్ని తాత్విక సిద్ధాంతాల వివేకాన్ని ప్రశ్నించి తర్కం ద్వారా వాటిని పడగొట్టడానికి ప్రయత్నించారన్నది వాస్తవం. ఉదాహరణకు వేదాంత సూత్రములపై వాచస్పతి మిశ్రా యొక్క వ్యాఖ్యానంలో ఇలాంటి ప్రయత్నం చేయడం మనం గమనించవచ్చు. "ఉండడం మరియు ఉండకపోవడం వంటి అభిప్రాయము (Idea of being or not being) వాదన నిలవదు" అనే సిద్ధాంతాలపై వ్యాఖ్యానించడం విషయంలో ఈ అభిప్రాయాలను గూర్చి మాట్లాడడమనే వాస్తవం, వాటి రూపకల్పనకు గల అవకాశమును కూడి ఉంటుంది. అంతే కాక ధృవీకరించడానికి అవి వివేకమును (reasoning) సమ్మతించవు. అది దానిపై వాస్తవమైన తర్కమును కలిగి ఉంటుంది. దీంతో పాటు వుండడం(being) అనే అభిప్రాయమనేది ఉండకపోవం (not being) అనే అభిప్రాయమునుండి వేరైనదిగా మేధస్సు భావన చేయగలదనే విషయాన్ని ఋజువు చేస్తుందని ఆయన అభిప్రాయపడినారు.

ఏమైనప్పటికీ, బౌద్ధమత వ్యతిరేకంగా పోరాడడానికి బ్రాహ్మణత్వం అలాంటి సాధారణ శస్త్రాలు మాత్రమే ఉపయోగించలేదు. శ్రుతి లేదు, భగవత్ప్రబోధితమైన దానిపై ఆధారపడని కారణంగా బుద్ధుడి బోధనలు సత్యమైనవి కావు అనేది సాధారణంగా ఒక ప్రముఖమైన ఆక్షేపణ. అనేక ప్రముఖ అంశాల విషయములో వేదాంతానికి పూర్తిగా భిన్నమైన సాంఖ్యాయన తత్వ విచారాన్ని అంగీకరించినట్లుగానే, ఉన్నవి మరియు లేనివి అనేవాటిని అంతే గాక మొత్తం బుద్ధుడి తత్వ విచారాన్ని కూడా, బ్రాహ్మణులు ఒక కులంగా అంగీకరించేవారు. కాని సాంఖ్యాయన తాత్విక పద్ధతి యొక్క స్థాపకుడైన

కపిలుడు, భగవత్ప్రబోధము యొక్క ఆధిపత్యము వివేకమునకు మరియు అనుభవానికి అతి ముఖ్యమైనదిగా బహిరంగంగా ప్రకటిచడం ద్వారా బ్రాహ్మణ్యపు పరీక్షకు అంగీకరించాడు. కాగా బుద్ధుడు, అతని తాత్విక సిద్ధాంతము (అభిధర్మము) మరియు అంతకంటే ఎక్కువ ప్రముఖమైన నైతిక మరియు మతపరమైన సిద్ధాంతాల (వినయము) విషయంలో గాని దానికి అంగీకరించడు. మానవ మేధస్సు యొక్క సాధ్యమైన అనేక రూపాలు వేదంలో ప్రకటింపచేస్తాయి కావున, తన కొన్ని సిద్ధాంతాలు ఏ విధంగా వేదంయొక్క చరణాలలో సమైక్యమైయున్నాయో చూపడం నిస్సందేహంగా ఆయనకు చాలా సులభమై ఉండేది. ఒక వేళ ఆయన తనయొక్క "నీవు హత్య చేయవద్దు" "నీవు త్రాగవద్దు" "నీవు నిలబడి భుజించవద్దు" అనే కొన్ని భావాల విషయంలో ఆ విధంగా చేసి ఉన్నట్లయితే బుద్ధుడి మరణానంతరం ఆచరణలోకి వచ్చిన "ఎవడైతే స్వర్గాన్ని ఆశిస్తాడో వాడు స్మశానాన్ని ఆరాధిస్తాడు" "అతడు తన కేశములను తొలగించుకొంటాడు" అనే సిద్ధాంతాలను కూడా బ్రాహ్మణులు వెంటనే అంగీకరించేవారు. ఆయన ఆ విధంగా చేయుటకు నిరాకరించడం వల్ల బుద్ధుడి సిద్ధాంతాల వాస్తవికత యొక్క సాధ్యతను ఖండిస్తూ భగవత్ప్రబోధన విషయాన్ని ప్రస్తావించడానికి మాత్రమే బ్రాహ్మణుల యొక్క వాదనా సరళి పరిమితమైంది.

ఈ వాదనా ధోరణిలో ఏదో గొప్పగా ఆకర్షించే విషయం ఉండి ఉండాలి. అందువల్లనేనేమో తర్వాతి కాలంలో బౌద్ధ మతస్తులు కూడా తమ పవిత్ర రచనలకు బ్రాహ్మణులు వేదమునకు ఆపాదించునటువంటి దైవిక లక్షణములు వున్నట్లు ప్రకటించేందుకు ప్రయత్నించారు. ఈ క్రింది వివరణలో కుమారిల (Kumarila) యొక్క తంత్ర వార్తికలోని ఒక ఆసక్తి కరమైన దృష్టాంతాన్ని ప్రస్తావించడం జరిగింది. వేదములు మానవ రచయితలు చేసిన రచనలు కావని రుజువు చేసే వాదనలే సాంఖ్యాయన బోధనలకు కూడా సమానమైన బలంలో చెందుతాయని ఒక ప్రత్యర్థి అభిప్రాయపడతాడు.

అతని భావాలు చాలా స్పష్టమైనవి మరియు అర్థవంతంగా ఉండడంవల్ల ప్రశ్నింపరానివి. అంతే కాకుండా శాక్యుడు ఈ భావాల యొక్క కాల్పనికుడు కాక కేవలం బోధకుడు మాత్రమే అయిన కారణంగా, దాంతో పాటు సాంఖ్యాయన సిద్ధాంతాలకు ఏ రచయిత పేరు పెట్టకపోవడంవల్ల, వేదం విషయంలో మాదిరిగానే వీటిని కూడా మానవ రచయితలలో

సహజంగా ఉండే దోషాలు సాధ్యమైనంత తక్కువ ప్రభావితం చేస్తాయి. వాస్తవానికి వేదముల యొక్క ఆధిపత్యమును ఋజువు చేసేందుకు మీమాంసల ద్వారా ముందుకు తేబడ్డ ప్రతిదీ, అదేవిధంగా బుద్ధుడి సిద్ధాంతాల ఆధిపత్యమును కూడా ఋజువు చేస్తుందని ఆయన తీర్మానిస్తాడు. దీనిపై ఛాందసుడైన కుమారిల చాలా కోపించి ఈ విధంగా అంటాడు "నిజాయితీ కల మీమాంసకుల ద్వారా చమత్కరించబడడంలో, భీతినొందిన ఈ సాంఖ్యాయనులు, వైశేషికులు మరియు మతవిషయాలపై భిన్నాభిప్రాయములుగల మరికొందరు అతిసాధారణ భాషలో చెప్పాలంటే నీడను పట్టిబంధించడానికి ప్రయత్నిస్తున్నట్టుగా కనిపిస్తుంది. వారు తమ పవిత్ర రచనలన్నీ శాశ్వతమైనవని చెప్తారు. కాని వారికి ఎలాంటి అభిప్రాయములు లేవు. వారు కేవలం ద్వేష భావంతోనే వేదం అతి పురాతన మైనదనే విషయాన్ని తిరస్కరించగోరుతారు. అంతేకాకుండా రాబోయే తార్కికులు బుద్ధుడి ఇతర ప్రభోధాలు పూర్తిగా వేదానికి వ్యతిరేకమైనవనే కారణంగా వారి యొక్క విశ్వజనీనమైన కనికరం అనే భావనల వారు మననుండి చౌర్యము చేసినవిను వేదముల నుండి స్వీకరించలేదని కూడా ప్రకటిస్తారు. అందువల్ల ఈ విషయానికి వాస్తవికతను ఆపాదించడానికి మరియు కేవల మానవ భావన అయిన ఏ భావన కూడా నైతిక మరియు దైవికమైన ఏ విషయాలపై ఆధిపత్యమును కలిగి ఉండలేదని గమనించి, వేదం యొక్క శాశ్వతత్వముపై మన స్వవాదనలను అనుకరించడం ధ్వారా, వారి అశక్తతను కప్పిపుచ్చుకో ప్రయత్నిస్తారు. మానవ ప్రభోదాలు ఏవీ కూడా దైవిక విషయాలపై ఆధిపత్యమును పొందలేవనే విషయాన్ని మీమాంసకులు ఋజువు చేసినట్లు వారికి తెలుసు. వేదముల యొక్క దైవిక మూలాన్ని నిరూపించే ఋజువులను వెలికి తేజాలని కారణంగా వేదాల యొక్క ఆధిపత్యం ఆక్షేపించబడదని కూడా వారికి తెలుసు. దాని ద్వారా మానవ మూలమునకు సంబంధించిన అన్ని తలంపులు తొలగింపబడ్డాయి కాబట్టి, చంటి పిల్లలు వదిరినట్లుగా తమ స్వంత మాటలతో వారి హృదయాలు కోపోద్రిక్తమవడంతో, మరియు వారి అవివేకవంతమైన వాదనల యొక్క వంచన కూలద్రోయబడిన కారణంగా వారు స్వయంగా సమాధానం ఇవ్వాల్సిన అవసరం లేక" నాకుటుంబం మీ కుటుంబమంత మంచిదని" చెప్తూ మాట్లాడడం ప్రారంభిస్తారు. అదే విధంగా వారు ఇతరుల ప్రసంగాలను అనుకరిస్తూ తమ గ్రంధాల యొక్క శాశ్వతత్వాన్ని ఇప్పుడు సంరక్షిస్తూ ఉన్నారు.. అంతే కాకుండా, ఒక వేళ ఇది మా వాదన అని చెప్పి వారిని సవాలు చేసినట్లయితే, వారు జగడమాడుతారు. అదే విధంగా, మీమాంసకులమైన

మేము, వాటిని వారి ద్వారా విని, వారినుండి చౌర్యము చేశామని చెప్తారు. వివేకవంతంగా మాట్లాడలేని మరియు ప్రత్యర్థులను మోసగించ ప్రయత్నించే, అన్ని రకాలుగా విఫలమైన వ్యక్తి ఎప్పుడూ అలసిపోవడం, అణచివేయబడడం జరగదు"! ఈ నిందోపన్యాసం చివరలో ప్రతి విషయాన్ని కేవలం ఒక అశాశ్వతమైనదిగా పేర్కొనే బౌద్ధులకు ఒక శాశ్వత భగవత్ప్రబోధాన్ని గూర్చి మాట్లాడే పని లేదని కుమారిల అంటాడు.

కులమనేది దానికి పవిత్రత నిచ్చిన మతంలో నుండి ఉద్భవించిందనీ, అందువల్లనే మతమనే బండరాయిపై హిందువులు తమ సామాజిక నిర్మాణాన్ని చేసుకొన్నారని ఖచ్చితంగా మరియు యథార్థంగా చెప్ప వచ్చుననే విషయాన్ని ఈ వివరణ నుండి కనుగొనవచ్చు.

కులమనేది ఇతర రకాలైన సమాజ వర్గాలతో పోల్చకూడనంత అతి అసహజమైన వ్యవస్థ అని ఇది చూపడం లేదా?

కులంలో ఎలాంటి అసహజత్వం లేదని ఎవరైనా వాదించారంటే వారికి అసలు కులమంటే ఏమిటనే విషయం తెలియదని అనడానికి నేను సాహసిస్తాను. కులమనేది పవిత్రమైనది. అది దాని ప్రత్యేక లక్షణం. కులమనేది పవిత్రమైనది,అదే దీనికి శాశ్వతత్వాన్ని కలిగిస్తూందని నేను పునరుద్ఘాటిస్తాను.

ప్రొ.మాక్స్ ముల్లర్ సామాజిక ప్రగతిపై పవిత్ర గ్రంథాలు కలిగిన మతాల ప్రభావంపై కొన్ని ప్రబోధాత్మక విషయాలను గుర్తించాడు.

"ఏమైనప్పటికీ చట్ట స్మృతులు అతిగా గౌరవింపబడే విధంగా తయారయ్యేందుకు యోగ్యమైనవి. దానికోసం పరిపూర్ణమైన మరియు తిరుగులేని అణకువ అవసరం. వాటి చారిత్రక లేదా సమాజ మూలం తరచూ పూర్తిగా మరచిపోబడుతున్నది. అంతే గాక ఏది వ్రాయబడినది మరియు ఏది చట్టపరమైనది అనే భావన వల్ల, ఏది సరైనది మరియు ఏది న్యాయమైనదనే పాత భావనలు దాదాపు పూర్తిగా అంతరించి పోయాయి లేదా రూపుమాసిపోయాయనే ఇంకో పాఠాన్ని మనకు బోధిస్తుంది.

"తూర్పు ప్రాంతాల మతాల అధ్యయనం మనకు అదే పాఠాన్ని బోధిస్తుంది. పరిపూర్ణమైన మరియు తిరుగులేని విశ్వాసం కలిగి ఉండాలనడంవల్ల పవిత్ర గ్రంథాలు

పిచ్చిగా గౌరవింబడేవిగా తయారవుతాయి. వాటి చారిత్రక మరియు సహజ మూలం పూర్తిగా మరిచిపోబడుతున్నది. అంతే గాక ఏది సత్యం మరియు ఏది దైవికమైనది అనే పాత భావాలు ఏది వ్రాయబడినది మరియు ఛాందసమైనది అనే భావంలో పూర్తిగా విలీనమై పోయాయి.

"చరిత్ర మనకు బోధించే మూడో పాఠం ఇంకోటి కలదు. చట్టమనేది ఎప్పుడైతే వృత్తిగా మారుతుందో అది ఏది ఒప్పు ఏది తప్పు అనే బలమైన మానవ భావనలో కాకుండా కేవలం యాంత్రికంగా నిర్వహింపబడుతుందో అప్పుడు ప్రతి పౌరుడు ఏ చట్టం క్రింద నివసిస్తాడో ఆ చట్టం పట్ల అతని బాధ్యతా భావం పూర్తిగా నశించే గొప్ప ప్రమాదం ఉంది. అదే రకంగా, ఎప్పుడైతే మతమనేది ఒక వృత్తిగా మారి, అది ఏది సత్యం, ఏది అసత్యం అనే బలమైన మానవ భావనలో కాకుండా కేవలం లాంఛన ప్రాయమైన కర్మల వాస్తవికతలో నిర్వహింపబడినప్పుడు కూడా మత విశ్వాసం కల ప్రతివ్యక్తి తను ఏమతం పరిధిలో నైతే జీవిస్తాడో ఆమతం పట్ల అతని బాధ్యతా భావన కూడా అదే విధంగా నశించే ప్రమాదం ఉందనే విషయాన్ని కూడా త్రోసిపుచ్చలేం.

"ఏమైనప్పటికీ, పవిత్ర గ్రంధాల నుండి ఉత్పన్నమయ్యే ప్రమాదాలను చూపించడం నా ఉద్దేశ్యం కాదు. కాని పవిత్ర గ్రంధాలు కలిగి లేని మతాల పట్ల చాలా విస్తృతంగా వ్యాప్తిలో ఉన్న దురభిప్రాయాలను వ్యతిరేకించడం.

"గ్రంధ సహితమైన మరియు గ్రంధరహితమైన మతాల మధ్య చాలా వ్యత్యాసం వుంది. అంతే కాక ఆ వ్యత్యాసం ఒక చారిత్రక దృక్పథంలో, ఈ విభజనకు గల ఒక చాలా వాస్తవమైన ఆధారాన్ని తెలుసుకొనేందుకు అవకాశం కల్పిస్తుంది. కాని గ్రంధ సహిత మతాలు కొన్ని మతాలను కేవలం వెలివేయబడినవిగా భావింపరాదు. నిస్సందేహంగా అవి కొన్ని అననుకూలతలను కలిగి ఉండవచ్చు. కాని అవి కొన్ని అనుకూలతలను కూడా కల్గి ఉన్నాయి.

"ఒక క్రైస్తవ మత ప్రచారకునితో వాదిస్తూ ఒక భారతీయుడు తన స్వంత మతం మరియు శ్వేత వ్యక్తి యొక్క మతాల మధ్య కల వ్యత్యాసాన్ని ఈక్రింది విధంగా వివరించాడు.

మహితాత్మ ద్వారా ప్రసాదించబడిన రెండు మతాలు ఉన్నాయి. ఒకటి శ్వేత వ్యక్తుల మార్గదర్శన కొరకు ఉపయుక్త మయ్యే గ్రంథంలో ఉంది. వీరు దీని బోధనలను అనుసరించడం ద్వారా శాశ్వత స్వర్గాన్ని చేరుకుంటారు., ఇంకోటి భారతీయుల హస్తాలలో, ఆకాశం, బండలు, నదులు, మరియు పర్వతాలలో ఉంది. అదే విధంగా ప్రకృతిలో భగవంతుడి స్వరం వినే ఎర్రవాళ్ళు చివరకు స్వర్గాన్ని కనుగొంటారు.'

"శిరస్సులో, మనస్సులో మరియు ఆకాశంలో మరియు బండరాళ్ళ నదులు మరియు పర్వతాలలో ఉండే మతాన్ని మనం సహజ మతం అని పిలుస్తాం. దాని ఆధారం ప్రకృతిలో, మానవ నైజంలో మరియు ఇతర రూపాలు కలిగి,దైవత్వపు ప్రబోధంగా గల బాహ్య ప్రకృతిలో ఉంది. ఇది విశృంఖలమైనది. ఇది మానవ మేధస్సు యొక్క విశ్వాసంలో వృద్ధి నొందుతుంది. అంతే గాక ఇది ప్రతి యుగావసరాలకు సరిపోయే విధంగా మారే సామర్థ్యాన్ని కలిగి ఉంటుంది. 'ఇది చెయి' అని చెప్పవుగాని 'నేను చేస్తాను' అని చెప్తాయి ఈ సహజమైన లేదా గ్రంథరహితమైన మతాలు. స్థిరమైన సిద్ధాంతాలు మరియు నిర్ధారిత ఆచారాలు వీటికి లేకపోలేదు. విశ్వాసం, నైతికత మరియు ఆచారాలకు సంబంధించిన విషయంలో ఆదిపత్యాన్ని ఉపయోగించేందుకు సాధారణంగా అవి ఒక మతాచారాలను కలిగి ఉన్నాయి. వాటిలో కఠినమైనది మరియు మార్చలేనిది తత్వవిచారపు వృద్ధిని శాశ్వతంగా అరికట్టేది ఏది లేదు. ఒక వేళ పొరబాట్లు కనుగొనబడినట్లయితే తొలగింపబడగలవు. ఒక క్రొత్త సత్యం స్పష్టంగా అగుపించి, బలంగా సమర్థించబడినట్లయితే, అంగీకరింపబడగలదు. ఏమైనప్పటికీ, తెలుపుపై నలుపు కలిగి ఉన్న గ్రంథం ఒకటి ఉన్నట్లయితే, అది లోపరహితమైనదని మరియు మానవ వివేకానికి అందనంత దూరంలో ఉన్నట్లు భావన కల్పించేందుకు దానికి మితిమీరిన తపన ఉంటుంది. తమ స్తోత్రాలు భగవత్ప్రబోధితమైనవి అనడం లేదా వారు చూసినవి లేదా విన్నవిగా వాటిని గూర్చి చెప్పడంలో పురాతన వేద రచయితల ఉద్దేశ్యం మనం చక్కగా అర్థం చేసుకోగలం. కాని తమంత తాముగా వారు వివరించే విషయాలను అర్థం చేసుకోలేం. కాని ఒక క్రొత్త తరం ఈ అభిప్రాయాలకు ఒక క్రొత్త అర్థాన్నిచ్చింది. అంతే కాక వేదం యొక్క ప్రతి తత్వము, మరియు అక్షరం భగవత్ప్రసాదితమైనది మరియు "భగవత్ప్రబోధితమైనది గా చెప్తూ ముగించారు. వృద్ధి చెందలేనిది మరియు మార్పులేనివన్నీ నశిస్తాయని చెప్పి వేదమతాన్ని కొట్టిన చావు దెబ్బ ఇదే. ఈ ప్రమాదం నుండి గ్రంథ రహితమైన మతాలకు సహాయింపు కలదు"

ఈ రకమైన అభిప్రాయములనే సర్ విలియం మూర్ వెలిబుచ్చారు. ఇస్లాం గూర్చి మాట్లాడుతూ మతం యొక్క పవిత్ర స్మృతులు (లేదా నియమాలు) వల్ల ఉత్పన్నమయ్యే ప్రమాదాల గూర్చి చాలా పటిష్టమైన వివరణ ఇచ్చారు. సర్ విలియం మూర్ ఇలా అంటాడు.

"ధృడమైన మరియు బిగువైన శవంపై కప్పే గుడ్డలో చుట్టబడిన మొహమ్మద్ మతం బయటికి రాలేదు. దాని ప్రారంభ కాలంలో కలిగి ఉన్న శక్తి కంటే, మారగల శక్తిని ఇది కలిగి లేదు. ఇప్పుడు మరింత గట్టిపడి వ్యాకోచత్వమును కోల్పోయి మారుతున్న మానవజాతి ప్రగతి మరియు అభిప్రాయములకు చెందిన పరిస్థితులకు తగినట్లుగా తను మారలేక పోవడం, తన అనుయాయులను కూడా తీర్చిదిద్దలేకపోవడంతో పాటు వారిని తమంత తాముగా, ఆవిధంగా తీర్చిదిద్దుకోనేందుకు ప్రాధ్బలం చేసే సామర్థ్యాన్ని కూడా కలిగి లేదు." (ఏప్రిల్ 1889 ఏసియన్ త్రైమాసిక సమీక్ష (Asiatlc Quarterly Reiew)కు E de Busen వ్రాసిన 'క్రైస్తవ దేవాలయాల్లో మొహమ్మద్ స్థానం' అనే వ్యాస నుండి పేర్కొనబడింది. పేజీ. 287)

మతం యొక్క పవిత్రత స్మృతుల యొక్క సామాజిక పరిణామాలను గూర్చిన ఈ అభిప్రాయాలను వ్యాపింపజేయడంలో మానవ ప్రగతిని కాంక్షించే ఏ ఒక్కరూ వెనుకంజ వేయరు. కాని, పవిత్ర స్మృతులు కల మతం యొక్క వర్గంలో ఇంకా భేదమునకు అవకాశం ఉన్నట్లు నాకు కనిపిస్తుంది. ప్రొ. మాక్స్ ముల్లర్ ఈ విషయాన్ని కాస్త ముందుకు తీసుకు వెళ్లక పోవడం విచారకరమైన విషయం. కాని, మతపరమైన పవిత్రతలను కలిగి ఉన్న ఇతర ప్రజలనుండి మతపరమైన పవిత్ర స్మృతులు కలిగిఉన్న వారుగా హిందువులను వేరు చేసే వాస్తవికమైన విభేదాన్ని వెలువరిస్తుంది కాబట్టి ఈ విషయాన్ని కాస్త పొడిగించడం అవసరం. మతాలు ఏ అభిప్రాయాలను సృష్టించాలని ప్రయత్నించాయనే విషయాన్ని కనుగొనడానికి విభిన్న మతాలను ఎవరైనా పరిశీలించినట్లైతే ఈ భేదము స్పష్టం కాగలదు.

ఆ రకమైన పరిశీలన , సమాజం నిర్జీవమైన వస్తువులను పూజించడంతో పాటు అవి పవిత్రమైనవిగా మతపరమైన విశ్వాసాన్ని తన సభ్యుల మనస్సులో నాటిన సందర్భాలు ఉన్నట్లు తెలియజేస్తుంది. రాళ్లు, నదులు, చెట్లను దేవీ, దేవతలుగా

రూపొందించిన సందర్భాలు ఉన్నాయి. ప్రాణం కల పదార్థాలను పూజించి అవి పవిత్రమైనవనే మతపరమైన విశ్వాసాన్ని తన సభ్యుల మనస్సులలో నాటిన సందర్భాలున్నాయి. జంతువులు కుదురు చిహ్నాలు అయిన సందర్భాలున్నాయి. సమాజం మానవులను పూజ చేసి వారు పవిత్రమైన వారనే మత విశ్వాసాన్ని ప్రజల్లో నాటిన సందర్భాలున్నాయి. కాని ఒకనిర్దిష్టమైన సామాజిక వ్యవస్థను పవిత్రవంతం చేసిన ఎలాంటి సందర్భాలూ లేవు. కాని ఆదిమ ప్రపంచం కుల వ్యవస్థ మరియు జాతి వ్యవస్థలను కలిగి ఉండేది. అంతే కాక మతం ద్వారా పవిత్రవంతం చేయబడి, అతిక్రమించరానిదిగా చేయబడడం గాని జరుగలేదు. ఈజిప్టు, పెర్షియా, రోమ్, గ్రీసు మొదలగు పురాతన దేశాల్లో, కొంతమంది స్వేచ్ఛ కలవారు మరి కొందరు బానిసలు, కొంతమంది నాగరికులు మరికొందరు విదేశీయులు, కొంతమంది ఒక జాతికిని మరికొంతమంది ఇంకో జాతికి చెందిన వారు కల సామాజిక వ్యవస్థలు ఉండేవి. ఈ వర్గవ్యవస్థ కూడా కేవలం సామాజిక వ్యవస్థగా ఉండేది. అంతే కానీ అది మతం ద్వారా పవిత్రమైనదిగా మరియు అతిక్రమించరానిదిగా చేయబడలేదు. ఈ ఆధునిక ప్రపంచంలో కొన్ని చోట్ల ప్రజాస్వామ్యం, కొన్ని చోట్ల ఫాసిజం, కొన్ని చోట్ల నాజిజం, మరికొన్ని చోట్ల బోల్షివిజం వ్యవస్థలు ఉన్నాయి. కాని, అక్కడ కూడా వ్యవస్థ కేవలం సామాజిక వ్యవస్థ మాత్రమే: మతం ద్వారా పవిత్రమైనదిగా అతిక్రమించరానిదిగా చేయబడలేదు.

ఎక్కడా కూడా జీవనాన్ని నడిపించే మార్గాలైన వృత్తులను సమాజం పవిత్రీకరించలేదు. ఆర్థిక కార్యకలాపాలు ఎల్లప్పుడూ మతం యొక్క పవిత్రతకు దూరంగా ఉండేవి. ఆటవిక సమాజంలో కూడా మతం లేక పోలేదు. కాని వేట ఒక వృత్తిగా మతం ద్వారా పవిత్ర వంతం చేయబడలేదు. పశుపోషణ కూడా మతం ద్వారా పవిత్రవంతం చేయబడలేదు. వ్యవసాయం ఒక వృత్తిగా మతం ద్వారా రూపొందింపబడి పవిత్రవంతం చేయబడలేదు. ప్రభువులు, మరియు బానిసలు అనే వివిధ వర్గాలు కల ఫ్యూడలిజమ్ కూడా స్వభావంలో పూర్తిగా సామాజికమైనది. దానిలో పవిత్రమైన విషయం ఏమీ లేదు. మతం ద్వారా రూపొందించబడి,పవిత్రమైనదిగా, శాశ్వతమైనదిగా మరియు అతిక్రమించరానిదిగా చేయబడిన సామాజిక వ్యవస్థ మనిషికి, మనిషికి మధ్య సంబంధంగా కలిగి ఉన్న ప్రపంచంలోని ఒకే ఒక ప్రజ హిందువులు మాత్రమే మతం ద్వారా రూపొందించబడి, పవిత్రవంతమైనది, శాశ్వతమైనది మరియు అతిక్రమించరానిదిగా చేయబడిన ఆర్థిక -

వ్యవస్థ - ఒక పనివానికి ఇంకో పనివానికి మధ్య సంబంధంను కలిగి ఉన్న ఒకే ఒక ప్రజ ప్రపంచంలో హిందువులు మాత్రమే.

అందువల్ల హిందువులు మాత్రమే మతపరమైన పవిత్ర స్మృతులు కలిగి ఉన్నవారుగా చెప్పడం మాత్రమే సరిపోదు. అదే విధంగా జొరాష్ట్రియన్లు, ఇజ్రాయిలీలు, క్రైస్తవులు మరియు ముస్లిమ్‌లు వీరందరూ పవిత్ర స్మృతులను లేదా నియమాలను కలిగి ఉన్నారు. వారు విశ్వాసాలను మరియు ఆచార క్రియలను పూజించి పవిత్రమైనవిగా చేస్తారు. వారు ఒక నిర్దిష్టమైన సామాజిక వ్యవస్థ స్థూల రూపంలో గల వ్యక్తికి, వ్యక్తికి మధ్యగల సంబంధాలను నిర్దేశింపరు. రూపొందించరు. దాన్ని మతపరమైనదిగా, అతిక్రమించరానిదిగా చేయరు. ఈ విషయంలో హిందువులు ప్రత్యేకమైన వారు. అదే కులానికి కాల ప్రవాహాన్ని మరియు కాలము యొక్క తీవ్రమైన ప్రతిఘాతాలను తట్టుకునే స్థిరమైన శక్తిని ఇస్తుంది.

హిందువుల మాదిరిగానే మతపరమైన నియమావళి లేదా స్మృతులను కలిగిఉన్న మతాలకు చెందిన ప్రజల నుండి ఇంకో విషయంలో హిందువులు భిన్నంగా ఉంటారు. హిందూ స్మృతి అనేది భగవంతుడి ద్వారా ప్రబోధింపబడింది. అందువల్లనే వేదాలను శ్రుతి (వినబడినది) అంటారు. అదే విధంగా జొరాష్ట్రియన్లు, యూదులు, క్రిస్టియన్లు మరియు ముస్లిములు అంగీకరించిన మతాల స్మృతులు కూడా అంతే. జొరాష్ట్రియన్లు, యూదులు, క్రిస్టియన్లు మరియు ముస్లింల కొరకై పంపిన భగవద్వాక్కును ఎవ్వరు విన్నారో అడగండి? తమ మత స్మృతిలో ఇమిడిఉన్న భగవద్వాక్కును జొరాస్టర్ విన్నట్లుగా జొరాష్ట్రియన్లు చెప్తారు. మోసెస్ విన్నట్లుగా యూదులు చెప్తారు. జీసస్ విన్నట్లుగా క్రిష్టియన్లు చెప్తారు,మొహమ్మద్ విన్నట్లుగా ముస్లింలు చెప్తారు. వేదాలలో ఇమిడిఉన్న భగవత్ వాక్కు ఎవ్వరు విన్నారు, ఎవరికి వినిపించబడింది అని ఇప్పుడు హిందువులను అడగండి. హిందువుల వద్ద సమాధానం లేదు. భవంతుడి ఈ వాక్కును విన్నవారి పేరు అతని వద్ద లేదు. వేదాలలో ఇమిడి ఉన్న మంత్రాల రచయితల పేర్లు వారి ద్వారా స్వయంగా వేదాలలో పేర్కొనబడినవి. కాని వేదాలలో ఇమిడి ఉన్న భగవత్ వాక్కును విన్నవారు వీరేనని హిందువులు చెప్పలేరు. వేదాల యొక్క పవిత్ర లక్షణాన్ని సంరక్షించడం లో ఈ వ్యత్యాసం చాలా గొప్పగా సహకరిస్తుంది. మోసెస్ లేదా జీసస్‌ల వ్యక్తిత్వాన్ని ఎదిరించడం ద్వారా ఒక పవిత్ర గ్రంథంగా బైబిల్‌ను ఎదిరించవచ్చు. అదే

విధంగా మొహమ్మద్ గుణగణాలను ఎదిరించడం ద్వారా ఒక పవిత్ర గ్రంథంగా ఖురాన్‌ను ఎదిరించవచ్చు. కాని దాన్ని సృష్టించిన వ్యక్తి లేదా దాన్ని వెలికి తెచ్చిన వ్యక్తియొక్క గుణగుణాలను ఎదిరించడం ద్వారా వేదాన్ని ఎదిరించలేం. దానికి కారణం, అలాంటి వారు ఎవ్వరూ లేకపోవడం.

నేను ముందుగా చెప్పినట్లు హిందువులు మతమనే బండరాతి మీద తమ వ్యవస్థను నిర్మించుకున్నారు. ఇప్పుడది ఒక సాధారణమైన గట్టి బండరాయిలా కనిపించదు. అది ఒక గ్రానైట్.

**పాదసూచికలు :**

1. Elementary Forms of Religious Life. పేజీ 37-40
2. Ibid పేజీ 43.
3. ఎమ్.కృష్ణమాచార్యర్ ' Classical Sanskrit Literature ' పేజీ vii - viii మరియు 836.
4. Introduction to the Science of Religion.
5. Natural Religion పేజీ. 549.
6. దీనికి, ఈ వ్యాసంలోని తర్వాతి కొటేషన్లకు ఆధారాలు రాతప్రతిలో లేవు - సంపాదకులు

*అనువాదం: డా॥ కె. వెంకటనారాయణ*

అధ్యాయం – 18

# స్పృశ్యులు Vs. అస్పృశ్యులు

అంటరాని వారితో అగ్రకులాల వారి సంబంధం చాలా సునిశితముగా పరిశీలించినచో ఆశ్చర్యం కలిగించేదిగా ఉండవచ్చును. కాని ఈ ఆశ్చర్యం కారణరహితమైనది కాదు. ఈ అగ్రకులాల వారమని చెప్పుకునే వారు ఒకే నిర్ణీత కులానికి చెందిన వారు కారు. తమలో తాము విభిన్న కులాలుగా విభజింపబడినారు. హిందువు ఐన ప్రతి వ్యక్తీ తన కులాన్ని గురించిన స్పృహలో వుంటాడు. ఈ విధంగా విభజింపబడిన కులాలన్నింటినీ ఒకే సమూహంగా భావించి అంటరాని వారికి వ్యతిరేకమైన ఏకవర్గంగా చూడడమనేది ఈ కులాల విభజన వల్ల అర్థరహితమవుతుంది. కానీ స్పృశ్యులు, అస్పృశ్యులు అనే విభజన-దానికి చాలా వివరణ ఇవ్వవలసి ఉన్నప్పటికీ ఆధునిక హిందూ దేశంలో వాస్తవమైనదీ పరిశీలనకు నిలిచేది కూడా. ఈ సవర్ణులంతా ఒక వర్గంగా ఏర్పడి అంటరాని వారి కంటే తాము భిన్నమనే భావన ఎలా వచ్చిందనే వివరణ ఇవ్వడమంటే కేవలం వారి సంబంధాలను తిరిగి చెప్పుకోవడం మాత్రమే.

చాతుర్వర్ణ సిద్ధాంతాల ఆధారంగా ఆదర్శ సమాజాన్ని ఏర్పాటు చేయవచ్చనే సిద్ధాంతాల్ని గాంధీగారిలాగా నమ్మే వారందరికి చాతుర్వర్ణాల చరిత్ర గురించి ఏమీ తెలియదు. వారు ఊహించి చెప్పేదంతా ఒక భ్రాంతి లేదా వారు సాధించదలిచిన కార్యానికి అనుగుణంగా కల్పించుకున్న ఊహ. ఎందువల్లనంటే ఈ చాతుర్వర్ణాలు ఎప్పుడు కూడా ప్రేమ, సౌభ్రాతృత్వంతోను, సాంఘిక సహకార సాన్నిహిత్యంతో కూడిన ఆర్థిక ఏర్పాట్ల మీదా ఆధారపడిలేవు. ఈ చాతుర్వర్ణాలనేవి ఒక వర్ణం మీద ఒక వర్ణం వారికి ఈర్ష్య, అసూయలు తప్ప వేరే సదుద్దేశాన్ని కలిగించలేక పోయాయి. అందువలననే హిందువుల ఘన చరిత్ర కేవలం వర్గ పోరాటమేకాక, వర్గ యుద్ధం కూడా. ఈ స్థితిని పోలివున్న ఉదాహరణలు చూపడం సాధ్యం కాదు. ప్రప్రథమంగా హిందువులలో వర్గ పోరాటం బ్రాహ్మణులు – క్షత్రియ, వైశ్యులతో కలసి ఒక వర్గంగాను, శూద్రులు వారికి వ్యతిరేక వర్గంగాను ఏర్పడి చేసుకున్న పోరాటమని అన్పిస్తుంది.

కాత్యాయనుని శ్రౌత సూత్రాలలో ఎవరో కొంత మంది లోపభూయిష్టులు, వేదం చదవని వారు, నపుంసకులు, శూద్రులు యజ్ఞ నిర్వహణకు అనర్హులు. ఈ నిర్వహణకు బ్రాహ్మణులు, రాజులు, వైశ్యులు మాత్రమే అర్హులుగా ఉండేవారు. మనువు సిద్ధాంత ప్రకారం (వ్రాతప్రతిలో కొటేషన్ ఇవ్వలేదు).

ఇంకా మనువు ఇలా అన్నాడు : (వ్రాత ప్రతిలో కొటేషన్ ఇవ్వలేదు) అయితే వేద వాఙ్మయంలో మనువు మరియు కాత్యాయనులకు ముందు శూద్రులయొక్క స్థితిగతులకు సంబంధించిన వాస్తవాలు, ఉదాహరణలను మనం పరిశీలించాల్సి ఉంది.

ఆచార్య మాక్స్‌ముల్లర్ చూపిన రెండు ఉదాహరణలను బట్టి శూద్రులు యజ్ఞయాగాదులను నిర్వహించడానికి అర్హులుగా ఉండేవారు. వారిలో రథకరుడు ఒకరుకాగా, రెండవవారు నిషాదాష్టపతి. వీరివురు శూద్రులే.

అయితే, ఇది శూద్రులలో ప్రతిభ కలిగిన ఒకరిద్దరికి మాత్రమే లభించిన ఆదరణగా భావించవచ్చును. కాని, ఇది అటువంటిది కాదు. శూద్రులు ఈ హక్కును కలిగి ఉన్నారనేది పరమసత్యం. శతపథ బ్రాహ్మణంలో యజ్ఞకర్తను బ్రాహ్మణ పురోహితుడు యజ్ఞక్రియ చేయు నిమిత్తం పిలిచేవాడు. యజ్ఞకర్త బ్రాహ్మణుడు అయినప్పుడు వారిని "ఏహి" అని పిలవాలి. వైశ్యుడయినట్లయితే "ఆగాహి" (ఇక్కడకు రండి) అని పిలిచేవారు. క్షత్రియులను "అద్రవ" (త్వరపడండి) అనేవారు. శూద్రులను మాత్రము "అధవ" (పరిగెత్తుకు రమ్మని) ఆజ్ఞాపించే వారు. ఈ సంబోధన భాగం చాలా ప్రాముఖ్యత కలిగి ఉన్నది. ఈ సంబోధన వలన శూద్రులకు తప్పనిసరిగా యజ్ఞ కార్య నిర్వహణ హక్కు ఉండేది అనేది విశదమవుతున్నది. ఈ పిలుపు విధానం వలన వేదవాఙ్మయంలో ఈ విషయం ప్రత్యేకంగా ఋజువయింది. అందువలన వారికి వేదపఠనం కూడా హక్కుగా ఉండి ఉండేదని ఋజువయింది.

ఎందువల్లనంటే, కాత్యాయనుని రచనల ప్రకారం వేదం చదవగలిగినవారే యజ్ఞం నిర్వహించాలి. ఒకానొక కాలంలో శూద్రులు కూడా వేద పఠనానికి అర్హులే అన్న సత్యం, మహా భారతంలో శాంతి/పర్వంలో ప్రస్తావించబడిన భృగు మహర్షి సమాధానంనుంచి తెలుస్తుంది. "వర్ణం ఎలా నిర్ణయింపబడుతుంది?" అన్న ప్రశ్నకు సమాధానంగా ఇలా చెప్పాడు:

"ప్రపంచమంతా బ్రహ్మచే సృష్టించబడినది కావున ముందుగా అందరూ బ్రాహ్మణులే, కాని తరువాత తరువాత వారు చేయు వృత్తి విధానాలను బట్టి కులాలుగా విభజించబడ్డారు. 6940 ద్విజుల్లో (రెండుసార్లు జన్మించిన వారు) ఐహిక సుఖాలకు విలువనిచ్చి, కోపోద్రిక్తులై, తమ ధర్మాల్ని విస్మరించి, ఎరుపు వర్ణాన్ని కలిగిన వారు క్షత్రియులుగా మారారు. పసుపు వర్ణం కలిగి, పాల ఉత్పత్తుల నుండి జీవనోపాధి పొంది, వ్యవసాయ పంటలపై ఆధారపడి తమ ధర్మాలను నిర్వర్తించలేని వారు వైశ్యులైనారు. బ్రాహ్మణులలోనే అసత్యాలకు, అక్రమాలకు పాల్పడి, ఇతరుల ఆస్తి దోచుకొను వారు, నల్లగా ఉండి, నిర్ణీత

పద్ధతులను వదిలివేసిన వారందరు శూద్రులుగా పరిగణించబడినారు. బ్రాహ్మణులందరూ ఈ విధంగా వృత్తిరీత్యా, ప్రవృత్తి రీత్యా విభజించబడి చతుర్వర్ణస్థులుగా ఏర్పాటు కాబడినారు. అందువలన వీరెవ్వరూ కూడా యజ్ఞయాగాదుల నిర్వహణ నుండి నిషేధింపబడి ఉండలేదు. అటువంటి బ్రాహ్మణిక సంస్కృతిని బ్రహ్మ సృష్టించాడు. అయితే వారు తమ అభిరుచుల వలన మూర్ఖత్వంలో పడిపోయారు."

"బ్రాహ్మణిక" పదానికి భాష్యం చెపుతూ సరస్వతి అనే లాక్షణికుడు ఇలా చెప్పాడు. "సరస్వతి వేద స్వరూపం. వేదాన్ని బ్రహ్మ నాలుగు కులముల వారికి సృష్టించాడు. అయితే శూద్రులు అజ్ఞానాంధకారంలో పడి తమ వేద పఠన హక్కు పోగొట్టుకున్నారు."

శూద్రులు ఈ విధంగా దిగజారిన తరువాత వైశ్యులు కూడా క్రమేణా తమకు వేద పఠనార్హత లేకుండా చేసుకొన్నారు.

బ్రాహ్మణులకు, క్షత్రియులకు మధ్య తీవ్రతరమైన వర్గ పోరాటం ఏర్పడినది. హిందువులకు సంబంధించిన అనేక ప్రామాణిక గ్రంథాలలో ఈ పోరాటం గురించి వ్రాయబడినది. బ్రాహ్మణులకు, వేన రాజునకు మధ్య జరిగిన పోరాటం ఈ కోవలో ప్రప్రథమం.

"ఒకానొకప్పుడు అత్రి వంశానికి చెంది, అతనితో సాటియైన అంగ ప్రజాపతి ఉండేవాడు. అతని కుమారుడు వేన ప్రజాపతి. కాని, ఇతడు తన విద్యుక్త ధర్మాన్ని నేర్పుతో, రీతితో వ్యవహరించే వాడు కాడు. ఇతడు మృత్యువు (కాలుడు) కుమార్తె అయిన సునీత పుత్రుడు. ఇతడు తన మాతామహుడయిన కాలుని దోష గుణాలచే ఆవహింపబడి తన ధర్మాన్ని, విధుల్ని మరచి ఐహిక సుఖాలకు లోనయినాడు. ఈ రాజు వేద శాస్త్ర విధానాలను కాలరాచి, మతానికి విరుద్ధంగా ఒక నడవడిని ప్రవేశపెట్టాడు. ఇతని పరిపాలన న్యాయమైనది. ఇతని రాజ్యంలో పురుషులందరు వేదాధ్యయనములేక క్రతువులు నిర్వహించే వారు కారు. యజ్ఞయాగాదులు చేసినపుడు దేవతలకు సోమరసం కూడా కరువయింది. ఈ వేన ప్రజాపతి తానే కర్మనని, తానే యజ్ఞ కర్తనని, తానే యజ్ఞమని ప్రకటించుకున్నాడు. ఇట్లు వేద విధులను ఉల్లంఘించిన ఈ అహంకార పూరితుడైన రాజుతో మరీచి అధ్వర్యంలో ఋషులు ఇట్లు పలికిరి "అత్రి ప్రజాపతి వారసుడయిన ఓ వేనా! మేమందరం ఒక దైవ కార్య నిమిత్తమై పవిత్రులం కాబోతున్నాం. ఆ కార్యం అనేక సంవత్సరాలు నిర్వహించవలసి ఉన్నది, ఆ సమయంలో దుశ్చర్యలకు పాల్పడవద్దు. నీ ప్రజలను రక్షించవలసిన ధర్మాన్ని మరువవద్దు". ఆ అహంకారి తానే అన్ని విధులకు శాసనకర్తనని, తానెవరికీ విధేయుడిగా ఉండనక్కరలేదని, వేద జ్ఞానములో తనతో

సమానమయినవాడు ఈ భూమి మీద లేడని పలికాడు. అంతటితో ఆగక తానే సర్వ జీవులకు, వాటి నియమాలకు ఆధారమయిన వాడనని, తాను తలుచుకుంటే భూమిని భస్మీపటలం గావించగలనని లేకుంటే జలమయం గావించగలనని, భూమిని, స్వర్గాన్ని కూడా నిర్మూలించగలనని చెప్పుకొన్నాడు. ఇలా గర్వంతో, బూటకాలతో కూడిన వేన ప్రజాపతిని అదుపులో నుంచలేమని గమనించి, ఆ ఋషులు కోపోద్రిక్తులై అతడిని పట్టుకొని నిర్బంధించి, ఆ రాజుయొక్క ఎడమ తొడను మర్దించారు. ఆ మర్దన నుండి కురూపియైన మరుగుజ్జు ఆవిర్భవించాడు. అతడు భయభ్రాంతుడై, ఋషులను చూచి చేతులు జోడించాడు. అతడిని చూచి అత్రి మహాముని కూర్చోమని (నిషిధ) ఆజ్ఞాపించాడు. ఈతడే నిషాదులకు మూల పురుషుడు. ఇతడే మత్స్యకారులకు వంశకర్త. ఈ మత్స్యకారులు కూడా వేన ప్రజాపతి దుశ్చర్యల నుండి ఆవిర్భవించినారు. ఇదే విధంగా వింధ్య పర్వత ప్రాంతాలలో అరాచక కర్తలైనటువంటి తుకారులు, తుంబురులు కూడా వేన ప్రజాపతి నుండి ఉద్భవించిన వారే. ఇదంతా చూచిన యోగ పురుషులు వేన ప్రజాపతి యొక్క కుడిచేతిని ఆరణి చెక్కను రుద్దినట్లు రుద్దారు. అందులోనుండి అగ్ని రూపుడయినటువంటి పృథ జన్మించాడు.

"ఈ వేన ప్రజాపతి కుమారుడు పృథువు రెండు చేతులు జోడించి, ఋషులను ప్రార్థించి తన విద్యుక్త ధర్మాలను పూర్తిగా అర్థం చేసుకొనే శక్తి లేని వాడనని ప్రకృతి తనకు స్వల్ప జ్ఞానాన్ని మాత్రమే ప్రసాదించినదని, దానిని ఏ విధంగా ఉపయోగించుకోవాలో తెలియదని, ఋషులు తనకు చెప్పిన దానిని తు.చ. తప్పకుండా పాటించగలనని విన్నవించుకొన్నాడు. అంతట దేవతలు, ఋషులు తనకు ఇష్టమున్నా లేకపోయినా అందరి జీవులపట్ల సమదృష్టిని అవలంబించాలని, తనపై విధించిన ధర్మాలన్నింటిని నిర్వర్తించాలని, వ్యామోహం, క్రోధం, గర్వము లేకుండా ప్రవర్తించాలని కోరారు. కర్తవ్యాన్ని దృష్టిలో ఉంచుకొని ఋజుమార్గానికి దూరంగా పోయిన వారందరిని శిక్షించాలని, మనసా, వాచా, కర్మణా సద్బ్రాహ్మణులను రక్షించాలని, శిక్షనుండి వారిని మినహాయించవలెనని కోరారు. సంఘంలో సంకరం కాకుండా కాపాడవలెనని వేడుకొన్నారు. అంతట ప్రజాపతి కుమారుడు తన అంగీకారం తెలిపాడు. శుక్రుడు పృథువుకు పురోహితుడయ్యాడు. ఈ రాజునకు వాలఖిల్యులు, సారస్వతేయులు మంత్రులుగాను బ్రహ్మర్షి గార్గి జ్యోతిష్కుడుగాను నియమింపబడ్డారు".

క్షత్రియరాజు పురూరవునకు, బ్రాహ్మణులకు మధ్య జరిగిన రెండవ పోరాటాన్ని గురించి మహా భారతంలో ఆదిపర్వంలో వివరించబడినది.

"వివేకవంతుడైన పురూరవుడు పదకొండు మంది తల్లిదండ్రులకు జన్మించాడు. శౌర్యవంతుడై పదమూడు ద్వీపాలకు అధిపతియై, తన పరాక్రమపు అహంకారానికి లోనయి బ్రాహ్మణులతో వివాదానికి దిగినాడు. మితిలేని గర్వంతో బ్రాహ్మణులు ఆక్షేపించిననూ వినకుండా వారి ఆభరణాలను దోచుకొన్నాడు. బ్రహ్మలోకంనుండిం సనత్కుమారుడు దిగివచ్చి పురూరవునికి బుద్ధి నేర్పాలని ప్రయత్నించగా అతడి మాటలు పెడచెవిన పెట్టగా, ఆగ్రహం చెందిన ఋషులు అతడిని నాశనమై పోవలసినదిగా శపించారు. శాపగ్రస్తుడైన అతడు నాశనమై పోయాడు. అత్యాశాపరుడైన ఈ రాజు అధికార గర్వంతో తన వివేకాన్ని మరచినాడు. ఈ ప్రఖ్యాతి గాంచిన రాజు ఊర్వశి సమేతుడై అగ్నిని గంధర్వ లోకాలనుండి పవిత్ర కార్యాలకై భూమి మీదకు తీసుకొనివచ్చి మూడు సమ భాగాలుగా విభజించినాడు."

మూడవ వివాదం బ్రహ్మణులకు నహుషరాజునకు మధ్య ఏర్పడినది. మహాభారతంలోని ఉద్యోగ పర్వంలో ఈ విషయం సవివరంగా ప్రస్తావించబడినది.

"వృత్రాసురుడిని సంహరించిన తరువాత ఇంద్రుడు బ్రహ్మ హత్యాపాతకం చుట్టుకొనునని (వృత్రుడిని బ్రాహ్మణునిగా పరిగణించినారు కనుక) భయపడి నీటి అడుగున తలదాచుకొన్నాడు. దేవాధిపతి కనపడని కారణంగా లోకాలన్నిటిలోను కల్లోలం ఏర్పడినది. దేవతలు, ఋషులు నహుషుని తమకు రాజుగా ఉండవలసినదిగా కోరగా, నహుషుడు మొదట అంగీకరించలేదు. కాని వారి ప్రార్థనలు విని, చివరకు ఆ అత్యున్నత పదవిని అలంకరించుటకు తన సమ్మతిని తెలియ చేసినాడు. ఈ ఉన్నతాసనాన్ని అలంకరించు వరకు నహుషుడు చాలా ధర్మబద్ధమైన జీవితాన్ని ఆచరించినాడు. కాని పదవిలోనికి అడుగిడిన తరువాత వినోద విలాసాలకు బానిస అయి, ఇంద్రుని భార్య ఇంద్రాణిని చూచి మోహించినాడు. అప్పుడామె దేవగురువైన బృహస్పతితో తనను కాపాడవలసినదిగా మొరపెట్టుకొన్నది. నహుషునికి బృహస్పతి నచ్చచెప్పడానికి ప్రయత్నించగా, అతడి జోక్యానికి నహుషుడు మండి పడ్డాడు. దేవతలందరు అతడికి పరసతిని కోరుట పాపమని వివరించారు కాని, వారి ఆక్షేపణలను నహుషుడు ఎంత మాత్రం లెక్కచేయక తన వ్యవహారం ఇంద్రుని వ్యభిచారములకంటె హీనమైనది కాదని వాదించాడు. 373. 'పరమసాధ్వి అయిన అహల్యను ఇంద్రుడు మోసగించి, అనుభవించునప్పుడు అతడిని మీరెందుకు అడ్డుకొనలేదు? ఇంకెన్నో ఘోరకృత్యాలకు, నీచపు పనులకు విచక్షణ రహితంగా ఇంద్రుడు పాల్పడినప్పుడు మీరు అతడిని ఎందుకు నివారించలేదు?' నహుషుడి ఆజ్ఞమేరకు ఇంద్రాణిని తోడుకొని వచ్చుటకు దేవతలు వెళ్ళారు. కాని బృహస్పతి ఇందుకు సమ్మతించలేదు. అతడి ఆలోచన మేరకు, ఇంద్రాణి

నహుషుడ్ని తన భర్త జాడ తెలుసుకొనడానికి కొంత గడువు కావాలని కోరింది. ఆమె ప్రార్థించినట్లుగా గడువు ఇవ్వబడినది. దేవతలందరు ఇంద్రుడి తరపున విష్ణువుకు మొరపెట్టుకొనగా, ఇంద్రుడు తనకు యజ్ఞహవిస్సులు సమర్పించినచో, అతడు పాపాల నుండి విముక్తుడగునని, తద్వారా నహుషుని నాశనం జరగగలదని అభయమిచ్చినాడు. ఇంద్రుడు ఆ ప్రకారంగా బలులు సమర్పించగా, ఫలితం ఈ విధంగా ఉన్నది. బ్రహ్మ పాతకాన్ని ఐదు భాగాలు చేసి వృక్షాలు, నదులు, పర్వతాలు, భూమి, స్త్రీలకు పంచి, ఇంద్రుడు పాప విముక్తుడై స్వయంపాలితుడైనాడు. నహుషుడు పదవీ భ్రష్టుడైనాడు. (ఇది ఉపోద్ఘాతం కావచ్చు లేక కథలో కొంత గందరగోళం వుండి వుండవచ్చు). కాని నహుషుడు మళ్ళీ పదవిని సంపాదించుకుని వుండాలి. ఎందుకంటేతిరిగి ఇంద్రుడు కష్టాలపాలైనాడనీ, తిరిగి అదృశ్యమైనాడనీ చెప్పబడింది. ఇంద్రాణి తిరిగి భర్తను వెదకసాగింది. ఉపశ్రుతి (రాత్రి వేళలకు అధిపతియైన దేవత) సహాయంతో హిమాలయాలకు పశ్చిమానకల సముద్రంలో ఉన్న ఒక ద్వీపంలో సరస్సునందలి తామరపువ్వు తొడిమనందు ఇంద్రుడ్ని కనుగొని, అతడికి నహుషుడి దుష్టపుటాలోచన గురించి వివరించింది. భర్తను అజ్ఞాతవాసంవీడి, పదవిని అధిరోహించి, తనను నహుషుని బారినుండి కాపాడవలసినదిగా మొరపెట్టుకొన్నది. కాని నహుషుడి పరాక్రమానికి ఎదురు నిలుచుట అసాధ్యమని గ్రహించిన ఇంద్రుడు వెనువెంటనే తాను నహుషుని ఏమి చేయలేనని చెపుతూ ఆ అహంభావిని పదవి భ్రష్టుడిగా ఒనర్చే ఉపాయాన్ని శచీదేవికి వివరించాడు. ఆ ప్రకారంగానే శచీదేవి "మహా ఋషులు మోసే వాహనంలో తన దగ్గరకు నహుషుడు వచ్చిన యెడల, అతడికి దాసోహమనగలనని" సందేశం పంపింది. ఆ సందేశమందుకొన్న నహుషుడు అహంభావంతో ఇలా అన్నాడు. "మహామునులను బోయిలుగా పెట్టుకొని ప్రయాణించిన వాడు అత్యంత శక్తిమంతుడు. భూత భవిష్యత్ వర్తమానాలకు నేనే అధిపతిని కనుక ఓ దేవి! నీ కోరిక తప్పనిసరిగా మన్నించగలవాడను. నా కోపాగ్నికి ప్రపంచం తాళలేదు. ఆద్యంతాలకు నేనే మూలం. ఓ సౌందర్యరాశి! సప్తర్షులు, బ్రహ్మర్షులు మోసే వాహనంపై నిన్ను చేరుకొనెదను. ఓ సౌందర్యదేవత!" అని పలికినాడు. ఆ ప్రకారంగానే అధర్మపరుడై, నీచపుటాలోచనలతో, కామ ప్రవృత్తితో తన వాహనాన్ని మోయవలసినదిగా మహా ఋషులను ఆజ్ఞాపించాడు. ఈలోగా ఇంద్రాణి బృహస్పతిని తరుణోపాయం కొరకు వేడుకొనగా, "మరేమీ భయపడవసినది లేదు. నహుషుడి అహంకారమే అతడిని మట్టుపెట్టగలదు, నహుషుని అధోగతికి అతడే మూలకారణమవ్వగలడని అభయమిచ్చాడు. ఇంద్రుని వెదకి తనవద్దకు తీసుకొని రావలసినదిగా అగ్నిని బృహస్పతి ఆదేశించాడు. ఇంద్రుడి ఆగమనము తరువాత బృహస్పతి అతడికి జరిగిన సంఘటనలను వివరించాడు. ఇంద్రుడు,కుబేర, యమ, సోమ, వరుణులతో కలసి నహుషుని పదవీచ్యుతి కొరకు రహస్య సమాలోచన

జరుపుతుండగా, అగస్త్యుడు అక్కడకు వేంచేసి నహుషుడు పతనమైనందుకు ఇంద్రుడ్ని అభినందించి ఆ పతనావస్థను ఇట్లు వివరించాడు.

"దురహంకారుడైన నహుషుని మోసిమోసి అలసిన ఆ దివ్యఋషులు, బ్రహ్మర్షులు నహుషుడ్ని తమకు కలిగిన ఒక సందేహ నివృత్తి చెయ్యవలసినదిగా కోరారు. అదేమిటంటే, అన్ని రాజ్యాలను అధీన పరచుకొని, సర్వాధిపత్యాన్ని వహించిన నహుషుడు గొప్పవాడా లేక బ్రాహ్మణులచే వల్లించ బడే వేద పాఠాలు గొప్పవా? అని. తనకున్న జ్ఞానాన్ని, విచక్షణను కోల్పోయి, అజ్ఞానాంధకారంలో కొట్టుమిట్టాడుతున్న నహుషుడు తానే గొప్పయని పలికాడు. అంతట మునులు 'అధర్మాలకు పాల్పడిన వాడవు నీవు. మహామునులచే ఉచ్చరించ బడిన ఈ పవిత్ర వేదపాఠాలు మాకు అత్యున్నతమైనవి కాని సన్మార్గం తప్పి దుశ్చర్యలకు పాల్పడిన నీవు ఎన్నటికి గొప్పవాడవు కాలేవు' అని పలికారు. ఆవిధంగా తమలో జరిగిన (అగస్త్యుడు చెప్పిన కథనం ప్రకారం) వాగ్వివాదంలో నహుషుడు కావరంతో అగస్త్యుడి తలపై తన్నినాడు. తత్ఫలితంగా అతడి అధికార వైభవాలు మంట కలిసినాయి. జరిగిన పరిణామానికి అతడు భయభ్రాంతుడవ్వగా అగస్త్యుడు ఇట్లు శపించాడు. 'ఓ మూర్ఖుడా! పవిత్ర గ్రంథాలను కాదని, వేదోపాసకులైన మహర్షుల పూజలందుకొను వేద పాఠాలను కాదని, బ్రహ్మ సమానులైన ఋషులచే నిన్ను మోయించుకొని, నా తలపై తన్నినందుకు, నీ పదవి వైభవాలను కోల్పోయి అత్యంత హీన స్థితికి దిగజారతావు. స్వర్గం నుండి భూమిపై బడి పాము రూపంలో వేల సంవత్సరాలు పాకుతూ జీవించెదవు. శాప విమోచనం తరువాత స్వర్గానికి చేరుకొందువు.' ఆ విధంగానే నహుషుడు అత్యున్నత స్థితినుండి అధోగతి పాలయ్యాడు."

రాజైన నిమికి, బ్రాహ్మణులకు మధ్య జరిగిన యుద్ధాన్ని గురించి విష్ణు పురాణంలో వివరింపబడినది.

"బ్రాహ్మణ ఋషియైన వశిష్టుడిని నిమి ఒక వెయ్యి సంవత్సరాల పాటు నిర్వహించే యజ్ఞానికి ఆధిపత్యం వహించమని కోరాడు. కాని ఇంద్రుడికి తాను ముందే ఒక కార్యాన్ని నిర్వహించడానికి మాట ఇచ్చానని, ఐదువందల సంవత్సరాలు జరిగే ఆ కార్యానంతరం తాను నిమి వద్దకు రాగలనని వశిష్ఠుడు తెలిపాడు. నిమి మారు పలకలేదు. తన ప్రతిపాదనకు నిమి అంగీకరించాడని భావించి వశిష్ఠుడు ఇంద్రుని వద్దకు కార్య నిర్వహణార్థమై వెళ్ళాడు. కాని, తిరిగి వచ్చాక, తనకు బదులుగా గౌతముడు (వశిష్ఠుని వలె బ్రహ్మర్షి) మరియు ఇతరులను నియోగించి నిమి యజ్ఞ నిర్వహణ కావించినాడని తెలుసుకొన్నాడు. జరిగిన విషయం విచారించకుండానే కోపోద్రిక్తుడై, గాఢ నిద్రలో ఉన్న నిమిని రూపరహితుడై పోవాలని అగస్త్యుడు శపించాడు. నిమి నిద్రనుండి లేచి ఎటువంటి పూర్వ ప్రబోధం

లేకుండా విచారణ జరపకుండా శపించినందుకు వశిష్ఠునికి తిరిగి అట్టి శాపమే ఇచ్చి రూపరహితుడైనాడు. ఈ శాప ప్రభావం వలన (విష్ణు పురాణం 4 : 5 6 లో చెప్పబడినట్లుగా) 'వశిష్టుడి తపఃశక్తి మిత్ర వరుణులలో ప్రవేశించినది. ఊర్వశిని చూచినపుడు వారిరువురినుండి జారిన రేతస్సు నుండి వశిష్ఠుడు తిరిగి జన్మించాడు. నిమి రూపం ప్రతిష్ఠించబడినది. అతడు ప్రారంభించిన యజ్ఞం పరిసమాప్తమయ్యే సమయంలో బ్రాహ్మణుల మధ్య వర్తిత్వం వలన దేవతలు ప్రసన్నులై నిమికి తిరిగి రూపాన్ని ఇవ్వడానికి అనుగ్రహించారు. కాని, నిమి వారి కోరికను మన్నించలేదు. నిమి కోరికపై దేవతలు అతడిని జీవ రాశులన్నింటిలో ప్రతిష్టించారు. ఆ కారణంగానే అన్ని జీవరాశులు నిమేషులై ఉన్నాయి. (కను రెప్పలార్పుట, తెరచుట)."

బ్రాహ్మణులకు సుముఖ రాజునకు మధ్య జరిగిన వివాదం గురించి కూడా మనువు ప్రస్తావించాడుకాని వివరాలు అందుబాటులో లేవు.

ఇవి బ్రాహ్మణులకు, క్షత్రియ రాజులకు మధ్య జరిగినపోరాట సంఘటనల గురించిన ఉదాహరణలు. అంత మాత్రం చేత బ్రాహ్మణ క్షత్రియులు రెండు వర్గాలుగా కలహించుకోలేదని చెప్పలేం. ఈ రెండు వర్గాల మధ్య వైరాలు, రాజులతో బ్రాహ్మణులకు జరిగిన యుద్ధాలకంటే భిన్నమైనవి. చారిత్రిక ఆధారం కలిగి వాస్తవ దూరం కానివి ఈ సంఘటనలు.

వీటిలో మొదటిది క్షత్రియుడైన విశ్వామిత్రునికి, బ్రాహ్మణుడైన వశిష్ఠుడికి మధ్య జరిగినది. ఒక క్షత్రియుడు బ్రాహ్మణత్వాన్ని పొందవచ్చును అన్న అంశంపై వివాదం జరిగింది.

ఈ సంఘటన గురించి రామాయణంలో ఇలా చెప్పబడినది.

"పూర్వకాలంలో ప్రజాపతి కుమారుడైన కుశుడనే రాజు కలడు. అతడి కుమారుడు కుశనాభుడు. కుశనాభుని కుమారుడు గాధి. గాధి పుత్రుడు విశ్వామిత్రుడు. విశ్వామిత్రుడు భూమండలాన్ని అనేక వేల సంవత్సరాలు పాలించాడు. ఒకానొక సందర్భంలో విశ్వామిత్రుడు భూప్రదక్షిణం చేస్తున్నప్పుడు, వశిష్ఠుని ఆశ్రమాన్ని దర్శించాడు. ప్రశాంత వాతావరణంలో ఎంతో మంది సాధువులు, ఋషులు, భక్తులతో అలరారుతున్న ఆశ్రమంలో బ్రహ్మపుత్రుడి ఆతిథ్యాన్ని మొదట నిరాకరించినప్పటికీ, విశ్వామిత్రుడు స్వీకరించక తప్పలేదు. అతిథులకు కావలసినవన్నియు చిటికెలో సమకూర్చి, వారిని సంతుష్టుల్ని గావించిన కామధేనువును ఎట్లైననూ తాను వశిష్ఠుని వద్ద నుండి పొందవలెనని విశ్వామిత్రుడు తలచెను. అందుకు

మొదటి మెట్టుగా కామధేనువుకు బదులుగా వంద సాధారణ గోవులను ఇవ్వచూపెను. పైగా కామధేనువు రత్నం వంటిదనీ, రత్నాలన్నీ రాజులకు చెందాలి కనుక కామధేనువును స్వాధీన పరచుకొనుట తన హక్కని వాదించసాగాడు. తన ప్రతిపాదనకు ఎటువంటి సమాధానం రాక పోవడంతో, ఆ రాజు వెలలేని సంపదలను మిక్కిలి ధనాన్ని ఇవ్వజూపిననూ కామధేనువును పొందలేకపోయినాడు. అతడు కృతఘ్నుడై బలప్రయోగంతో ధేనువును అచ్చట నుండి కొని పోవుటకు ప్రయత్నించగా, అతడి సైనికుల బంధనాలను తెగతెంచుకొని ధేనువు తన యజమాని అయిన వశిష్ఠుని వద్దకు పరుగెత్తుకొని వచ్చి 'తననెందుకు నిరాశ్రయను చేసినారని ప్రశ్నించెను. అంతట వశిష్ఠుడు తాను ధేనువును ఇష్టపూర్వకంగా పంపుట లేదని తనకంటే రాజు బలాఢ్యుడు అగుటచే తానేమి చేయలేక పోతున్నానని బదులిచ్చెను. అంతట ధేనువు 'క్షత్రియులు మాత్రమే బలవంతులనేది భ్రమ మాత్రమే. బ్రాహ్మణులే బలవంతులు. బ్రాహ్మణశక్తి దైవికమైనది. అది క్షత్రియ బలంకంటే ఉన్నతమైంది. నీశక్తి అపరిమితమైనది. ఎంత బలవంతుడైనప్పటికి విశ్వామిత్రుడు నీకన్నా శక్తిమంతుడు కాలేడు. నీ శక్తి జయింపశక్యం కానిది. నీవు ఆదేశమిచ్చినచో, నీ బ్రాహ్మణ పరాక్రమమును పొంది నేను ఈ రాజు యొక్క అహంకారాన్ని దురాక్రమణను అణచి వేయగలను' అని పలికింది. ఆ విధంగానే ధేనువు రంకె వేయగానే వందలాది పహ్లావనులు జన్మించి, విశ్వామిత్రుడి పరివారాన్ని నాశనం చేసారు. కాని వారిని విశ్వామిత్రుడు వధించాడు. ఆ పిదప శకులు, యవనులు అనే పరాక్రమ వంతులు జన్మించి, రాజ సైనికులను వధించి, తరువాత విశ్వామిత్రుడి కత్తికి బలియైనారు. కామధేనువు కంఠధ్వని నుండి, మిగిలిన శరీర భాగములనుండి మహాశక్తి వంతులైన వివిధ జాతుల యోధులు జన్మించి విశ్వామిత్రుడి సైనికులను, కాల్బలం, గజ, అశ్వ బలాలను రథాలను తుత్తునియలు గావించిరి. అంతట విశ్వామిత్రుడి కొడుకులు నూరుగురు వివిధ మారణాయుధాలు ధరించి వశిష్ఠుడిపై దాడిచేయగా ఆ మహాముని నోటి నుండి వెలువడిన మహా శబ్దానికి మాడి మసైనారు. అపజయంపాలైన విశ్వామిత్రుడు తన కుమారుడిని రాజ్యానికి ప్రతినిధిగా చేసి హిమాలయాలకు వెళ్ళి ఘోర తపస్సును ఒనర్చెను. మహాదేవుడు ప్రసన్నుడై విశ్వామిత్రుడి కోరిక ప్రకారం సర్వాయుధాల శాస్త్ర రహస్యాలను వివరించి, స్వర్గలోకపు ఆయుధాలను ప్రసాదించినాడు. దీనితో రెట్టించిన అహంభావంతో వశిష్ఠుడి ఆశ్రమానికి వచ్చి ఆశ్రమ వాసులందరిని వెడల గొట్టెను. వశిష్ఠుడు విశ్వామిత్రుడిని 'ఇదేమి న్యాయమని' ప్రశ్నించి, బ్రాహ్మణత్వం యొక్క గొప్పతనాన్ని ఎత్తి చూపగా, విశ్వామిత్రుడు కూడా తన శక్తివంతమైన ఆయుధాన్ని బయటకులాగి, తన శత్రువుని ఎదురు నిలవగలవా అని ప్రశ్నించెను. వశిష్ఠుడు విశ్వామిత్రుడ్ని 'నీ శక్తి ఏపాటిదో చూపమని, త్వరలో అహంకారం నేల మట్టమవగలదని'

అన్నాడు. 'క్షత్రియ బలానికి, బ్రాహ్మణ శక్తికి పోలిక ఏది? ఓ నీచ రాజా! బ్రాహ్మణత్వానికి గల దైవశక్తిముందు నీ పరాక్రమము ఏపాటిది. గాధికుమారుడి చేతిలో ఉన్న మారణాయుధాన్ని బ్రాహ్మణుడి చేతిలో ఉన్న దండం ఇట్టే అణచి వేయగలదు. నీరు నిప్పు నార్పినట్లు....' తరువాత విశ్వామిత్రుడు దేవలోకాలకు చెందిన బ్రహ్మముడి, కుల, వరుణుల ఆయుధాలతో పాటుగా విష్ణుచక్రం, శివుని త్రిశూలం మొదలగు శక్తివంతమైన అస్త్రాలను తన విరోధిపై ప్రయోగించాడు. కాని బ్రహ్మ కుమారుడైన ఆ బ్రాహ్మణుడి దండం వాటినన్నింటిని హరించి వేసింది. చివరగా దేవతలందరూ భయ భ్రాంతులయ్యే విధంగా అత్యంత శక్తివంతమైన బ్రహ్మాస్త్రాన్ని అతడిపైన ప్రయోగించినాడు. కాని అది బ్రహ్మర్షిని ఏమీ చేయలేక పోయింది. అప్పుడు వశిష్ఠుడు తన భయంకరమైన రూపాన్ని ప్రదర్శించాడు. శరీరములో చర్మరంధ్రాలనుండి భగభగలాడే మంటలు, పొగలు వెలువడుతుండగా, అతడి చేతిలో బ్రహ్మదండం పొగలేని అగ్నికణికవలె గోచరించింది. యముడికి ప్రతిరూపంవలె అతడు కనపడ్డాడు. మునులందరు అతడ్ని స్తుతించి, విశ్వామిత్రుడి పై అతడి బలాధికతను కొనియాడి, శాంతింప చేయగా, వశిష్ఠుడు తన కోపాన్ని, పగను చల్లార్చుకొన్నాడు. విశ్వామిత్రుడు సంభ్రమాశ్చర్యాలతో ఇట్లు పలికాడు, "క్షత్రియుని బలం సిగ్గుపడాల్సినది. బ్రాహ్మణుని శక్తి మాత్రమే శక్తి. బ్రాహ్మణుని చేతిలోని దండం ముందు లోకం లోని మహాస్త్రాలు నిలువ లేక పోయాయి" గర్వభంగం పొందిన విశ్వామిత్రుడికి తన నిస్సహాయమైన సామాన్య స్థితిని ఒప్పుకోవడమో లేక బ్రాహ్మణ శక్తికి సమానమైన శక్తి సముపార్జనకై కృషి చేయడమో తప్ప వేరే మార్గం లేక పోయింది. అయితే అతడు రెండో మార్గాన్ని ఎన్నుకొన్నాడు. ఈ అపజయాన్ని మరింతగా అర్థం చేసుకొని యోచించి, 'మరింత ఆలోచనతో సర్వశక్తులను కూడగట్టుకొని ఐహిక సుఖాలను వీడి కఠోర సాధనకై పూర్ణ ప్రయత్నంచేసి బ్రాహ్మణ శక్తి పొందడానికి అర్హత సంపాదిస్తాను" తీవ్రంగా కలత చెంది అవమానింపబడిన విశ్వామిత్రుడు తన విరోధి పట్ల ఆర్తి ద్వేషంతో తన భార్యతో కలసి దక్షిణ ప్రాంతం వైపు బయల్దేరాడు, తన కఠోర నిర్ణయాన్ని అమలులో పెట్టసాగాడు. ఆతరువాత మనకు తెలిసిన విషయాల ప్రకారం అతడికి ముగ్గురు కుమారులు కలిగారుః వారు హివిష్యందుడు, మధుష్యందుడు మరియు ద్రిధనేత్రుడు. వేయి సంవత్సరాల కఠిన తపస్సు తరువాత బ్రహ్మ ప్రత్యక్షమై అతడు రాజర్షి స్థానానికి అర్హుడని, రాజర్షుల లోకాన్ని అతడు జయించగలిగాడని, కఠోర దీక్ష వల్లనే ఆ స్థానానికి ఎదగగలిగాడని చెప్పెను. అంతట విశ్వామిత్రుడు ఆ ఇవ్వజూపిన స్థానానికి మండిపడి తాను ఆశించినదాని కన్నా ఇది చాల తక్కువ అని ఇట్లు పలికెను! "నేను ఐహిక వాంఛలను వదిలి కఠోర సాధన చేసినందుకు దేవతలు, మునులు నన్ను రాజర్షి గా మాత్రమే పరిగణిస్తున్నారు. ఈ సాధనలన్ని వ్యర్థమేకదా!" అయినా నిరుత్సాహానికి

లోనవ్వకుండా, విశ్వామిత్రుడు ఇంకొక స్థానాన్ని అధిరోహించి తిరిగి తన శరీరాన్ని శోషింపచేసి కఠినతపస్సు కొనసాగించెను.

ఈ సమయంలో అతడి తపస్సును భంగం చేసిన అంశాలివి: ఇక్ష్వాకు వంశానికి చెందిన త్రిశంకుడికి బొందితోనే స్వర్గారోహణ చేయాలనే కోరిక కలిగింది. అందుకు సహాయపడగల యజ్ఞాన్ని అతడు చేయదలిచాడు. వశిష్ఠుడ్ని అందుకు కావలిసిన ఏర్పాట్లు చేయమనికోరగా, అది జరగదని వశిష్ఠుడు చెప్పాడు. త్రిశంకుడు దక్షిణప్రాంతానికి పర్యటించి, తపస్సును ఆచరిస్తున్న నూర్గురు వశిష్ఠ పుత్రులను వినయ వినమ్రతలతో, భక్తిగా తమ తండ్రి నిరాకరించిన తన కోర్కెను వివరించెను. ఆపైన ఇక్ష్వాకు వంశస్తులు ఎల్లప్పుడు తమ కుల గురువులను ఆపద సమయంలో ఆదుకొనెడు మహానుభావులుగా భావిస్తారని, వారి తండ్రి తరువాత తనయులను కూడా తాను కుల దేవతలుగా భావిస్తానని చెప్పెను. కాని అహంభావులైన ఆ కుల గురువులు అతని కోరిక విని ఇట్లు గద్దించిరి : 'అశక్యం! ఓ మూర్ఖుడా! సత్య వాక్పాలకుడైన మా తండ్రి నీ కోరిక నిరాకరించినప్పుడు, నీవు నీ కార్య సిద్ధి కొరకు వేరొక శాఖనెట్లు ఆశ్రయించగలవు? ఇక్ష్వాకు వంశస్థులందరికి కుల గురువు మాటయే వేదవాక్యం. సత్యసంధులైన ఋషి పుంగవుల ఆజ్ఞలు మీరరాదు. దైవజ్ఞుడైన వశిష్ఠుడే ఇది అసాధ్యమని పలికినపుడు, ఈయజ్ఞ కార్యాన్ని మేమెట్లు చేపట్టగలమని నీవు భావించెదవు? నీవు బుద్ధి హీనుడవు. నీ రాజ్యానికి తిరిగి పొమ్ము. ముల్లోకాలకు సారథ్యం వహించగల సమర్థుడు వశిష్ఠుడు. అతని పట్ల అగౌరవాన్ని మేమెట్లు ప్రదర్శించగలం?" అని పలికారు. ఆ పిమ్మట త్రిశంకుడు రాజగురువు, గురుపుత్రులు కూడా తన కోర్కె మన్నించనందుకు మథనపడి, తన వాంఛాసిద్ధికి వేరే మార్గం యోచించుచున్నట్లుగా వారికి గోచరించినాడు. త్రిశంకుడు అహంకారంతో తన కోరిక ఇట్లు వెల్లడించినందుకు వశిష్ఠ పుత్రులు మండిపడి అతడు చండాలుడిగా మారవలెనని శపించినారు. శాప ప్రభావముచే త్రిశంకు మహారాజు అంటరాని చండాలుడిగా మారిపోయెను. ఇటువంటి పరిస్థితిలో అతడు విశ్వామిత్రుడ్ని (ఈ సమయంలో విశ్వామిత్రుడు కూడా దక్షిణ ప్రాంతంలో నివసించుటచే) కలసి తన ధర్మనిష్ఠ, గుణసంపద గూర్చి వివరించి, తన దురదృష్ట స్థితికి మిక్కిలి దుఃఖించెను. విశ్వామిత్రుడు అతనిపై కనికరం చూపి, అతడి యజ్ఞానికి తాను సారథ్యం వహించెదనని త్రిశంకుడ్ని ఇంతకు ముందు నిరాదరణ పొందిన రూపం అంటే చండాలరూపంతో స్వర్గప్రవేశం చేయించగలనని ప్రమాణం చేశాడు. 'కౌశిక పుత్రుని అనుగ్రహం పొందినందుకు స్వర్గం నీ స్వంతమైనట్లు భావించమని' విశ్వామిత్రుడు పలికాడు. అటు పిమ్మట యజ్ఞ నిర్వహణకు కావలిసిన ఏర్పాట్లు సిద్ధపరచమని, వశిష్ఠుని కుటుంబంతో సహా ఋషులందరిని

యజ్ఞానికి ఆహ్వానించవలసినదిగా ఆదేశాలిచ్చాడు. విశ్వామిత్రుడి శిష్యులు ఈ వార్తను నలుమూలలకు చేరవేసి, తిరిగివచ్చి ఇట్లు పలికారు 'మీ యజ్ఞ నిర్వహణ సమాచారమందుకొని అన్ని దేశాలనుండి బ్రాహ్మణులందరు ఒనకూడి వేంచేసినారు' ఒక్క మహోదయులు (వశిష్ఠులు) తప్ప, మీ ఆహ్వానాన్ని విన్న నూర్గురు వశిష్ఠ కుమారులు కోపంతో మండిపడుతూ ఇట్లు గర్జించారు 'ఒక చండాలుడు విశ్వామిత్రుడి సారథ్యంలో యజ్ఞం చేస్తే దేవతలు, ఋషులు ఆ ఉపహారాన్ని ఎట్లు స్వీకరించగలరు? ఛండాలుడి చేతి ఆతిథ్యాన్ని స్వీకరించిన తరువాత తేజోవంతులైన బ్రాహ్మణులు స్వర్గానికి ఎట్లు చేరగలరు? వశిష్ఠుడు, అతడి పుత్రులు కోపంతో కళ్ళెర్రపడగా నిర్దయగా ఈ మాటలు పలికిరి.' విశ్వామిత్రుడు విపరీతమైన ఆగ్రహంతో వశిష్ఠుడి పుత్రులు భస్మమై పోవాలని, వారు తిరిగి ఏడు వందల జన్మల వరకు హీన జాతిలో (మృతపులు) జన్మించాలని, వశిష్ఠుడు నిషాదుడిగా మారాలని శపించెను.

"శాప ఫలితం వెంటనే అనుభవం కాగానే, విశ్వామిత్రుడు త్రిశంకుడిని శ్లాఘించి, సమావేశమైన ఋషులందరిని యజ్ఞ నిర్వహణ కానివ్వమని పలికెను. రాజర్షియొక్క ఘోర శాప ఫలితాన్ని, కోప తీవ్రతను చూచి భయపడి వారు అంగీకరించిరి. విశ్వామిత్రుడు యాజకుడు తానే అయి, మిగిలిన ఋషులు ఋత్వికులుగా ఉండి కావలసిన యజ్ఞ కార్యాలు నిర్వహించినాడు. విశ్వామిత్రుడు ఆహుతిని స్వీకరించవలసినదిగా దేవతలను ఆహ్వానించగా, హవిస్సులను స్వీకరించడానికి వారెవ్వరు ముందుకు రాలేదు. విశ్వామిత్రుడు ఉగ్రరూపం దాల్చి చేతనున్న యజ్ఞ గరిటెను పైకెత్తి త్రిశంకుడితో ఇట్లు పలికాడు. 'ఓ రాజా! ఇదిగో చూడు! నా స్వశక్తితో నేను కఠోర సాధనను చేసి తపః ఫలాన్ని పొందాను. నా తపఃశక్తితో నీకు స్వర్గాన్ని అందిస్తాను. నీ శరీరంతోనే స్వర్గారోహణ గావించు. నా కఠిన తపః ఫలాన్ని ఇందుకు వినియోగిస్తున్నాను.' మునులందరు చూస్తుండగానే త్రిశంకుడు స్వర్గారోహణ గావించాడు. కాని కులగురువుచే శాపగ్రస్తుడైనందున త్రిశంకుడు స్వర్గ ప్రవేశానికి అనర్హుడని, అతడిని తక్షణమే భూలోకానికి తలక్రిందులై మరలి పోవాలని ఇంద్రుడు ఆదేశించాడు. ఆవిధంగానే త్రిశంకుడు తలక్రిందులై భూమి మీదకు పడిపోతూ సహాయంచేసి కాపాడవలసినదిగా తన ఆధ్యాత్మిక రక్షకుడైన విశ్వామిత్రుడ్ని ఎలుగెత్తి ప్రార్థించాడు. విశ్వామిత్రుడు కోపంతో మండిపడుతూ ఉగ్రరూపుడై త్రిశంకుడ్ని అక్కడే ఆగిపోవాలని ఆజ్ఞాపించి 'నా కఠిన తపస్సుతో సాధించిన శక్తిని వినియోగించి, ఇంకొక ప్రజాపతి వలె ఆకాశంలో దక్షిణ ప్రాంతంలో వేరొక సప్తర్షి మండలాన్ని ఏర్పరుస్తున్నాను.' ఈ స్వర్గ ప్రాంతానికి చేరుకొన్న ఈ రాజర్షి మునులందరు దిగ్భ్రాంతులై చూస్తుండగా వేరొక నక్షత్ర మండలాన్ని ఏర్పరిచి, కోపావేశంతో ఇట్లు పలికాడు. 'నేను ఇంకొక

ఇంద్రుణ్ణి సృష్టిస్తాను లేదా ఇంద్రుడే లేకుండా చేస్తాను' అని పలికి, ఉగ్రరూపుడై దేవతలను కూడా సృష్టించసాగాడు. సురులు, అసురులు, మునులు ఈ ప్రతిసృష్టిని చూచి భయపడి, విశ్వామిత్రుడ్ని శాంతింప చేయదలచి, త్రిశంకుడు కులగురువు శాపానికి గురయ్యాడు కనుక అటువంటి శాపగ్రస్తుడు సంప్రోక్షణ జరిగిన పిదపనే స్వర్గ ప్రవేశానికి అర్హుడు కాగలడు, అని పలికారు. తాను త్రిశంకునికి మాట ఇచ్చానని, కనుక అతడిని దేవతల సంరక్షణలో ఉండనివ్వవలసినదని, నూతనంగా సృష్టించిన నక్షత్రాలు శాశ్వతంగా స్థిరపడ నివ్వవలసినదని విశ్వామిత్రుడు బదులిచ్చాడు. అందుకు దేవతలు సమ్మతించి సూర్య మార్గానికి ఆవలిగా ఈ నక్షత్రాలు ప్రకాశిస్తాయని, త్రిశంకుడు తల్లక్రిందులుగా వారిమధ్య నిత్యంగా వెలుగొందుతాడని, అతడి కోరిక నెరవేరినట్లేనని, అతడు స్వర్గవాసిగా పరిగణించబడతాడని, అతడు ప్రఖ్యాతి వహిస్తాడని చెప్పారు. ఆవిధంగా ఒక గొప్ప వివాదం ఈ రాజీ వలన సమసిపోయింది."

హరి వంశం నుండి గ్రహించబడిన ఈ త్రిశంకుడి కథ ఇతర కథలకన్న భిన్నమైనదని చూడవచ్చును. కాని విశ్వామిత్ర వశిష్ఠుల మధ్య కల వివాద స్వభావాన్ని వెలుగులోకి తెస్తున్నది.

"యజ్ఞం పూర్తయిన పిదప దేవతలు, ఋషులు తమతమ నెలవులు చేరిన పిదప విశ్వామిత్రుడు తన శిష్యులతో ఇలా పలికాడు. ఈ దక్షిణ ప్రాంతంలో తపస్సుకు అనేక విఘ్నాలు వాటిల్లుతున్నాయి. వేరే దిక్కుకు వెళ్ళి తపః కార్యక్రమాలు నిర్వహించు కొందాం. ఆ ప్రకారంగానే అతడు పశ్చిమ ప్రాంతంలో ఓ అరణ్యప్రాంతానికి వెళ్ళెను. కాని అక్కడ కూడా వేరొక సంఘటనతో తపః కార్యానికి విఘాతం మేర్పడినది.

"ఈ సంఘటన అయోధ్యకు ప్రభువైన అంబరీషునికి చెందినది. అంబరీషుడు రామాయణంలో చెప్పబడినట్లు ఇక్ష్వాకు వంశంలో ఇరవై ఎనిమిదో తరం వాడు. త్రిశంకుని తరువాత ఇరవై రెండో రాజు. ఈ ఇరువురు రాజుల పాలనను ఏక కాలంలో చూచినవాడు విశ్వామిత్రుడు. ఆ కథ ఈ ప్రకారంగా మొదలైనది.

"అంబరీషుడు ఒక యజ్ఞాన్ని తలపెట్టగా, బలి పశువును ఇంద్రుడు అపహరించుకు పోయాడు. అంతట రాజ పురోహితుడు 'ఇది అశుభ సూచకం, రాజ పరిపాలనలో లోపాలు ఉండటం వలననే ఇట్లు జరిగింది, నరమేధం మాత్రమే ఇందుకు ప్రాయశ్చిత్తమని' పలికెను. యజ్ఞపశువు కొరకు తీవ్ర ప్రయత్నం చేసిన తరువాత రాజర్షి అంబరీషునికి, భృగు వంశస్థుడైన రుచికుడను బ్రాహ్మణ ఋషి తారస పడ్డాడు. రుచికుడి కుమారులలో ఒకరిని తనకు యజ్ఞపశువుగా విక్రయించ వలెనని, అందుకు ప్రతిగా లక్ష గోవులను

సమర్పించు కొంటానని అడిగెను. రుచికుడు అందుకు సమాధానంగా తాను తన పెద్ద కుమారుణ్ణి అమ్మనని పలికెను. అంతట రుచికుడి పత్ని చిన్న కుమారుణ్ణి విక్రయించడానికి తాను అంగీకరించనని చెప్పెను. 'సాధారణంగా తండ్రికి పెద్ద కుమారుడిపట్ల, తల్లికి చిన్న పుత్రుడి పట్ల ఎక్కువ ప్రేమానురాగాలు ఉంటాయని' రుచికుడి పత్ని అంబరీషుడితో పలికింది. అంతట రుచికుడి రెండవ పుత్రుడు శునశ్శేపుడు యజ్ఞ పశువుగా మారవలసినది తానేనని గ్రహించుకొని, తనను కొనిపోవలసినదిగా అంబరీషుడితో పలికాడు. లక్ష గోవులు, వేల కొలది బంగారు నాణెములు, ఆభరణాలు వెలగా ఇచ్చి, శునశ్శేపుడ్ని కొనుగోలు చేసి అంబరీషుడు తన వెంట తీసుకొని పోసాగాడు. వారు అట్లు ప్రయాణం చేస్తూ పుష్కర ప్రదేశమునకు చేరుకొన్నారు. అక్కడ ఇతర మునులతో కలిసి తపమాచరిస్తున్న మేనమామయైన విశ్వామిత్రుణ్ణి చూసి శునశ్శేపుడు పరుగున వెళ్ళి అతడి చేతుల్లో వాలిపోయి, తన నిస్సహాయ స్థితిని, తల్లి దండ్రుల నిరాదరణను వివరించి, ఏకాకిగా, అనాధగా ఉన్న తనపై కనికరం చూపవలసినదిగా దయాళువైన విశ్వామిత్రుణ్ణి ప్రార్థించాడు.

"విశ్వామిత్రుడు అతడ్ని ఓదార్చి, తన పుత్రులలో ఒకరిని శునశ్శేపుడిస్థానంలో వెళ్ళవలసినదిగా ఆదేశించాడు. మధుష్యానందుడితో పాటుగా మిగిలిన పుత్రులెవ్వరు కూడా ఈ ప్రతిపాదనకు అంగీకరించలేదు. పైగా అహంభావంలో తండ్రిని అపహాస్యం చేస్తు వారు ఇట్లు పలికారు! 'ఇతరుల రక్షణార్థం పుత్రులను త్యాగం చేయుట ఎట్లు సాధ్యం? అది స్వంత కొడుకులను చంపి తినునంత పాపమని మేము భావిస్తున్నాం.' తన ఆజ్ఞలను లెక్కచేయనందుకు విశ్వామిత్రుడు తన పుత్రులను 'వశిష్ఠుని పుత్రులవలె కడుహీన జాతిలో జన్మించి, వెయ్యి సంవత్సరాల పాటు కుక్కమాంసాన్ని భుజిస్తూ, జీవించవలసినదిగా' శపించాడు. విశ్వామిత్రుడు తిరిగి శునశ్శేపుడిలో ఇలా పలికాడు 'నిన్ను పవిత్ర స్నానం తరువాత శుచి గావించి, ఎర్రని వస్త్రములు ధరింపచేసి, మెడలో ఎర్రటి పూలదండవేసి యజ్ఞప్రాంతపు వధ్యస్థలమునకు కొనిపోయినప్పుడు విష్ణువును అగ్నిదేవుడిని స్తుతిస్తూ ఈ రెండు శ్లోకాలు పఠించు. నీకోరిక తప్పక నేర వేరుతుంది, అని శునశ్శేపుడికి ఆ శ్లోకాలు వివరించాడు. శునశ్శేపుడు ఆ తరువాత అంబరీషుడ్ని కలుసుకొని తన ప్రయాణాన్ని కొనసాగించాడు. యజ్ఞస్థలంలో ఎర్రటి వస్త్రాలు ధరించి వధ్యశిలకు కట్టి, బలికి సిద్ధ పరచినప్పుడు శునశ్శేపుడు మనస్సులో ప్రశస్తమైన శ్లోకాలతో ఇంద్రుడిని, విష్ణువుని స్తుతించాడు. సహస్రాక్షుడైన ఇంద్రుడు ప్రసన్నుడై అతడిని దీర్ఘాయుష్కుడవు కమ్మని దీవించాడు, అంబరీష మహరాజు కూడా ఈ యాగం వల్ల అనేక ప్రయోజనాలు పొందాడు, పిమ్మట విశ్వామిత్రుడు తన తపస్సును కొనసాగించాడు. ఈ విధంగా అతడు వెయ్యిసంవత్సరములు తన దీక్షలో గడిపాడు.

"ఈ దీర్ఘ తపస్సు తరువాత వేల్పులు విశ్వామిత్రుడికి వరాలు అనుగ్రహించుటకై రాగా, బ్రహ్మ అతడికి ఋషి స్థానాన్ని అనుగ్రహించాడు. విశ్వామిత్రుడు సంతుష్టుడుకాక, తిరిగితన దీక్షను కొనసాగించాడు. ఇలా కొంతకాలం గడిచాక, ఆ ఋషిపుష్కర సరస్సులో స్నాన మాచరించ వచ్చిన అప్సరస మేనకను చూచి మోహించినాడు. ఆమె సౌందర్యానికి మోహితుడై తనకుతోడుగా ఉండవలసినదని ఆశ్రమానికి ఆహ్వానించాడు. ఆమె అసమాన సౌందర్యానికి, ఆమె ఆకర్షణకు బానిసయ్యై, తనఋషిధర్మాలను విడనాడి, పదిసంవత్సరాలు గడిపాడు. చివరకు తన నీచమైన లొంగుబాటుకు అవమానపడి, ఇదంతా తన కర్తవ్యంనుండి దృష్టి మరల్చడానికి దేవతలు పన్నిన పన్నాగమని గ్రహించి మిక్కిలి ఆగ్రహంచెందినాడు. అటుపిమ్మట ఆ అప్సరసకి మృదుభాషణంతో శెలవిచ్చి ఉత్తర దిశగా ప్రయాణించి కేశికి నది తీరాన వెయ్యి సంవత్సరాల పాటు ఘోరతపస్సును కొనసాగించాడు. విశ్వామిత్రుడు సాధిస్తున్న అభివృద్ధి, తపఃతీవ్రతను చూచి దేవతలు అతడికి మహర్షి స్థానాన్ని ఇవ్వవల -సినదిగా కోరారు. అంతట బ్రహ్మ, దేవతల మాటప్రకారం అతడికి మహర్షి స్థానాన్ని ఇవ్వగా, రెండు చేతులు జోడించి వినమ్రుడై బ్రహ్మర్షి స్థానాన్ని తనకు ఇచ్చినట్లయినచో తన ఇంద్రియాలను అధీనం చేయగల వాడనని చెప్పెను. బ్రహ్మ అంతట అతడు ఇంకాపూర్తిగా, ఇంద్రియ నిగ్రహం సాధించ లేదని, అందుకు కృషి చేయవలసినదిగా సమాధానపరచెను. ఆఋషి మరింత కఠోరనియమాలతో తపస్సును ఆరంభించెను. చేతులు పైకెత్తి ఆధారరహితుడై గాలినే భుజిస్తూ, వేసవిలో పంచాగ్నులకు (నాలుగు దిక్కులా నాలుగు అగ్నులు, పైన సూర్యుదు) గురి అయి, వర్ష ఋతువులో తలదాచుకొనక శీతాకాలంలో రాత్రింబవళ్ళు నీటి పైనే శయనిస్తూ వెయ్యిసంవత్సరాలు కఠిన తపము నొనరించెను, ఇంద్రాది దేవతలు విశ్వామిత్రుడు అవలంభించిన కఠిన నియమాలను, అతడు సాధించిన తపః శక్తిని చూచి మిక్కిలి కలత చెందిరి. స్వర్గాధిపతి అంతట అప్సరసలలో రంభను ఎంచి, విశ్వామిత్రుని తపస్సు భంగం చేయవలసినదిగా ఆదేశించాడు. ఆ ఉగ్రుడైన మహామునిని ప్రలోభపరచబోయి, అతడి కోపతీవ్రతకు గురి కావడానికి రంభ సమ్మతించలేదు, కాని ఇంద్రుడు పదేపదే ఆమెను ఆదేశించాడు. పైగా తాను, కందర్పుడు రంభకు సహాయంగ ఉంటామని, ఆ మునిపుంగవుడికి తపోభంగం కావించగలమని రంభకు అభయమిచ్చాడు. కాని, విశ్వమిత్రుడు ఈ పన్నాగాన్ని గ్రహించి మహోగ్రుడై వెయ్యిసంవత్సరాల పాటు శిలవలె పడి ఉండవలసినదని రంభకు శాపమిచ్చాడు. రంభ శాపగ్రస్తయై శిలయైనది. ఇంద్రుడు, కందర్పుడు అక్కడనుండి చల్లగా తప్పుకొన్నారు. ఈ విధంగా విశ్వామిత్రుడు ఐహిక వాంఛలకు, ఇంద్రియ సుఖాలకు లోబడనప్పటికి, తనకోపాన్ని అదుపులో ఉంచుకోలేక పోయినందుకు, తన తపఃశక్తిని కోల్పోయాడు. తన కోపాన్ని నిగ్రహించుకోవాలని నిర్ణయించుకొని, మౌనవ్రతం పాటిస్తూ నూరు సంవత్సరాలపాటు, ఆహారం లేకుండా, శ్వాసను బంధించి, శరీరాన్ని శుష్కింప చేసుకొని

తానాశించిన బ్రాహ్మణ లక్ష్యాన్ని పొందాడు. తరువాత అతడు హిమాలయాలనుండి తూర్పుదిశగా ప్రయాణించి తపోచరిత్రలోనే కనివిని ఎరుగని, ఎవ్వరు సాధించలేని రీతిలో వెయ్యి సంవత్సరాల పాటు మౌనవ్రతం పాటించెదనని ప్రమాణంచేశాడు, ఎన్ని అడ్డంకులు ఎదురైనను, నిశ్చల చిత్తుడై కోపరహితుడై తపస్సు కొనసాగించెను. కఠోరతపస్సు ముగిసిన పిదప విశ్వామిత్రుడు తనకొరకు కొంత ఆహారాన్ని సిద్ధపరచుకొని భుజించబోవు సమయంలో, ఇంద్రుడు బ్రాహ్మణ వేషధారియై వచ్చి ఆ ఆహారమిమ్మని అర్థించెను. విశ్వామిత్రుడు మారు పలకకుండా, ఆ ఆహారమాతడికి ఇచ్చితాను ఉపవాసమున్నాడు. కాని తానునుకొన్న నిర్ణయంప్రకారం పెదవి విప్పిపలుకలేదు. అతడుశ్వాస బంధించి కఠోరతపస్సు చేయునప్పుడు, ఆ తీవ్రతకు శిరస్సునుండి మంటలు రేగి ముల్లోకాలు భీతితో తల్లడిల్లిపోయెను. దేవతలు, ఋషులు బ్రహ్మవద్దకు వెళ్లి "విశ్వామిత్ర మహర్షి ఎన్ని ఆకర్షణలు, ప్రలోభాలు, అవరోధాలు కల్పించినప్పటికి లొంగక, అచంచలుడై, అకుంఠిత దీక్షతో తీవ్రతపస్సు కొనసాగిస్తున్నాడు. అతడి కోరిక నేరవేరనిచో అతడి తపోశక్తి ముల్లోకాలను దహించి వేయగలదు. విశ్వమంతా గందరగోళమైనది. ఎక్కడా వెలుతురు పొడలేదు. సముద్రాలు అల్లకల్లోలంగా మారినవి. భూమి అంతయు కంపించి పోవుచున్నది. గాలిదిశ లేకుండా వీచుచున్నది. పర్వతాలు ముక్కలగు చున్నవి. ఓ బ్రహ్మ! మానవజాతి నాస్తికమార్గాన్ని అనుసరించకుండా కాపాడు. ఆ మహిమాన్వితుడైన ఋషి తపః తీక్షణత లోకాలను దహించి వేయకమునుపే అతడ్ని శాంతింప చేయమని' వేడుకొన్నారు. పిమ్మట బ్రహ్మ దేవతలతో కలసి విశ్వామిత్రుణ్ణి ఉద్దేశించి "ఓ బ్రహ్మర్షీ వర్థిల్లు! నీ కఠిన తపస్సు నాకు ప్రీతిపాత్రమైనది.కౌశికా! నీవు బ్రాహ్మణ్యాన్ని సాధించుకోగలిగావు. దీర్ఘాయుష్మంతుడవై ఖ్యాతివహించెదవు. అందరి ఆశీస్సులు పొందెదవు. నీకు కావలిసిన స్థానానికి చేరుకో. నీకు శుభమగుగాక' అనిపలికెను. విశ్వామిత్రుడు ఆనంద భరితుడై బ్రహ్మాది దేవతలకు వినమ్రతతో నమస్కరించి ఇట్లు పలికెను, "నేను బ్రాహ్మణత్వాన్ని సాధించినట్లయితే, నిగూఢమైన ఏకాక్షర మంత్రం (ఓంకారనాదం) యజ్ఞ కర్మ(వశత్కర) సూత్రం, వేదాలు నన్ను బ్రాహ్మణుడిగా గుర్తించుగాక! మరియు బ్రాహ్మణపుత్రుడైన వశిష్ఠుడు, క్షత్రవేద, బ్రహ్మవేదాలలో శ్రేష్ఠులందరు నా ఈ నూతనస్థానాన్ని గుర్తించి నన్ను అట్లే తగువిధంగా సంభోదించెదరు కాక!' ఆవిధంగానే దేవతలు వశిష్ఠుడిని శాంతపరచి, సమాధాన పరచినారు. వశిష్ఠుడు విశ్వామిత్రుడి బ్రహ్మర్షి స్థానాన్ని గుర్తించి, అతడికి గల విశేషాధికారాలను గుర్తించినాడు. విశ్వామిత్రుడు కూడా బ్రహ్మర్షి స్థానాన్ని పొంది వశిష్ఠుడికి ఇవ్వవలసిన గౌరవ మర్యాదలను సగౌరవంగా సమర్పించుకొన్నాడు."

రెండవ సంఘటనలో బ్రాహ్మణులను వధించిన క్షత్రియుల గురించిన ప్రస్తావన

కలదు. మహాభారతంలో ఆదిపర్వంలో ఈక్రింద పేర్కొనబడిన విషయాలు ప్రస్తావించ బడినవి.

"కృతవీర్యుడు మరణానంతరం స్వర్గానికేగినాడు. పిమ్మట అతడి వంశస్థులు ధనావసరము వచ్చి, భృగుల ధనసంపత్తిని తెలుసుకొని వారివద్దకు వచ్చి యాచించినారు. కొందరు భృగులు క్షత్రియులకు భయపడి తమ ధనాన్ని భూమిలో దాచుకొనగా మరికొందరు ఇతర బ్రాహ్మణులకు ఇచ్చి వేసినారు. మిగిలిన వారు అడిగినవన్నియు ఇచ్చివేసినారు. ఒకసారి ఒక క్షత్రియుడు భూమి త్రవ్వుతుండగా ఒక భృగుని ఇంటిలో దాచిన ధనం బయటపడినది. క్షత్రియులందరు ఈ ధనం చూచి కోపోద్రిక్తులై భృగులందరిని వధించినారు. భృగులను వారు ఎంతగా ద్వేషించినారంటే గర్భస్థ శిశువులను కూడా విడవకుండా చంపినారు. భృగుల విధవలు భయభ్రాంతులై హిమాలయాలకు పారిపోయినారు. వారిలో ఒకామె తన గర్భస్థ శిశువును తొడలో దాచుకొంది. కాని, ఆ శిశువు ఉనికిని ఒక బ్రాహ్మణస్త్రీ బయల్పరచగా క్షత్రియులు ఆ శిశువును వధించడానికి హిమాలయాలకు బయల్దేరినారు. తన తల్లి తొడను చీల్చుకొని బయటకు వచ్చిన ఆ శిశువు మిక్కిలి ప్రకాశవంతమై తనను చంప వచ్చిన వారిని అంధులను కావించింది. అంధులై దారి తెన్ను కానక, ఆ పర్వతాలలో తిరిగి, వారు ఆశిశువు తల్లిని తమకు దృష్టిని ప్రసాదించవలసినదిగా వేడుకొన్నారు. కాని, ఆమె వారికి తన బిడ్డ ఔర్యునిలో వేదాలు, వేదవ్యాసుడు అంతర్భాగాలై ఉన్నాయని, తన వంశస్థులను చంపినందకు ప్రతీకారంగా కంటి చూపును అపహరించాడని, తిరిగి ఆ శిశువే వారిని కాపాడగలదని చెప్పెను. ఆ విధంగా వారు. కరుణించమని ఔర్యుడిని వేడుకొనగా, వారి కంటి చూపు పునరుద్ధరించబడినది. కాని ఔర్యుడు భృగులను వధించినందుకు బదులుగా సృష్టిలో అన్ని జీవరాశులను సంహరించడానికి ఘోర తపస్సు ప్రారంభించెను. దేవతలు, అసురులు, మానవులు ఆ తపఃశక్తికి భీతి చెందారు. కాని ఔర్యుడి పితృదేవతలు సాక్షాత్కరించి క్షత్రియ సంహార ఉద్దేశ్యం మరల్చుకొమ్మని ఔర్యునికి నచ్చచెప్పి, క్షత్రియుల పట్ల ప్రతీకారం తీర్చుకొనే ఉద్దేశ్యం తమకు లేదని చెప్తూ 'భక్తి పరాయణులైన భృగులు క్షత్రియులు జరిపిన నరమేధానికి బదులు తీర్చుకోలేక అశక్తులై అంటున్న మాటలు కావివి. వృద్ధాప్యంవల్ల శక్తి హీనులైనపుడు వారిచే వధింపబడాలని మేమే ఆశించాం. క్షత్రియులకు, భృగుల మధ్య వైరం జనింప చేయాలనే ఉద్దేశ్యంతో మేమే ఆ ధనాన్ని భృగుల ఇంట దాచి పెట్టినాము. స్వర్గాన్ని కోరుకొనే మాకు సంపదలెందుకు?' అని వివరించారు. వారు ఆత్మహత్యా పాతకాన్ని నివారించుకొనడానికి తాము క్షత్రియుల చేతిలో హతులయ్యామని, కనుక క్షత్రియ సంహార ఉద్దేశ్యాన్ని విరమించుకొని పాపరహితుడు కావలసినదని చెప్తూ 'ఓ

ఉండగలరు? బ్రాహ్మణులు అందరికంటే గొప్పవారని చెప్పబడుతూ, భిక్షాటన ద్వారా జీవనమును గడుపుతూ తమ గురించి చాలా ఉత్కృష్టమైన అభిప్రాయాలను కల్గియున్న బ్రాహ్మణులను నేనెపుడు దృష్టిలోనె ఉంచుకొంటాను. ఎందుకంటే ఈ సత్యం అశరీరవాణి పలికినది. ముల్లోకాలలో మానవుడైనను దేవుడైనా తిరుగులేని నా అధికారాన్ని ధిక్కరించలేడు. రణరంగంలో నన్ను ఎదుర్కొనే వాడే లేడు. కాబట్టి బ్రాహ్మణులదే పైచేయిగా నున్న ఈ ప్రపంచాన్ని క్షత్రియులదే ఆధిపత్యం ఉండే విధంగా మలుస్తాను." కార్త్యవీర్యార్జునుని ఈ వాక్కులు విని రాత్రివేళ సంచరించు నిశాచరశక్తులు ఉలిక్కి పడ్డాయి. గాలి రూపంలో భ్రమించుచున్న వాయు దేవుడు అర్జునుని హెచ్చరిస్తూ 'పాపభూయిష్టమైన ఈ ఆలోచనను త్యజించి, బ్రాహ్మణులకు ప్రణామం చేయండి. వారికేమైనా అపకారం తలపెట్టినట్లైతే, నీ రాజ్యం నాశనమగును. వారు నిన్ను తేలిగ్గా అధీనుణ్ని చేసుకొనగలరు. శక్తివంతులైన వారు నిన్ను పదవీచ్యుతుణ్ని కావించి నిన్ను రాజ్య భ్రష్టుని కావించెదరు. అంతట ఆ చక్రవర్తి 'నీవెవరవని' ప్రశ్నించగా నాతడు 'నేను వాయు దేవుడను, నీ మేలు కోరి హెచ్చరించుటకై దేవతలచే పంపబడిన దూతను' అని సమాధానమిచ్చెను. అర్జును డాతనితో 'ఆహా! బ్రాహ్మణులయెడ మీరెంతటి ప్రేమాభిమానాలు కల్గియున్నారు! కాని ఆ బ్రాహ్మణులు ఈ భూమిపై జన్మించిన ఏ యితర ప్రాణికంటే ఏ విధంగా అధికులు కారన్న విషయాన్ని గ్రహించండి!'

బ్రాహ్మణ శ్రేష్టుడగు జమదగ్ని మహాముని పుత్రుడు పరశురామునితో కార్తవీర్యుడు కయ్యమునకు దిగెను. ఆ కథ ఈ విధంగాఉన్నది.

"కన్యాకుబ్జమును పరిపాలించెడు గాధి మహారాజునకు సత్యవతి అను కుమార్తె కలదు. ఇంతకు ముందు వివరించినట్లే రేచిక మహర్షి సత్యవతి వివాహము, జమదగ్ని జననం చెప్పబడినది. జమదగ్ని, రేణుకలకు అయిదుగురు పుత్రులు కలరు. అందరిలోకి కడపటివాడు అనన్య సామాన్యుడు పరశురాముడు. అవాంఛనీయ వాంఛలతో పవిత్రతను కోల్పోయిన తల్లిని వధించమని జమదగ్ని పుత్రులను ఆదేశించగా మొదటి నలుగురు పుత్రులు తండ్రి ఆనతిని తిరస్కరించి శాపగ్రస్తులైరి. అంతట పరశురాముడు తల్లిని వధించి, తండ్రిని సంతుష్టుని కావించి, పిదప తండ్రి వరం కోరుకొమ్మనగా తల్లిని తిరిగి ప్రసాదించమని, అన్నలకు శాప విమోచనం కావించమని కోరుకొనెను. తాను కూడా మాతృ హత్యాపాతకం నుండి విముక్తుడయ్యి 'చిరంజీవుడవు కమ్మని' తండ్రి దీవెనను, అదృశ్య రూపం పొందగల శక్తిని వరములుగా పొందెను. అతని చరిత్ర ప్రస్తుతం కార్త్యవీర్యార్జునితో ముడిపడి ఉన్నది. కార్త్యవీర్యుడు జమదగ్ని ఆశ్రమానికి రాగా, మునిపత్ని సాదరంగా అతిథి మర్యాదలు కావించెను. కాని అతడు మర్యాదని ఉల్లంఘించి

మహర్షి ఆశ్రమమున ఫలవృక్షములను ధ్వంసం చేసి కామధేనువు యొక్క దూడను బలవంతంగా లాక్కొని వెళ్ళెను. ఈ హింసాత్మక సంఘటన తెలియగానే పరశురాముడు కోపోగ్రుడై కార్త్యవీరుని ఎదుర్కొని అతడి సహస్ర బాహులను ఖండించి వేసెను. ప్రతీకారంగా కార్త్యవీరుని కుమారులు పరశురాముని పరోక్షంలో శాంతమూర్తియగు జమదగ్నిని వధించివేసిరి.

"తన తండ్రి దహన సంస్కారాలు పూర్తికావించిన పిదప క్షత్రియ వంశ సంహారం చేసి తీరెదనని పరశురాముడు తీవ్ర ప్రతిజ్ఞ చేసి ముందుగా కార్త్యవీర్యుని కుమారులను, అనుచరులను వధించెను. ఈ విధంగా భూమండలం మీద ఇరవై ఒక్కసార్లు క్షత్రియ సంహారం కావించినాడు. వారి రక్తంతో సామంత పంచకములో ఐదు సరస్సులు ఏర్పడినవి. ఆ సరస్సులలో తన పితృదేవతలైన భృగులకు తర్పణములు సమర్పించి సంతుష్టులను కావించినాడు. పరశురాముడు గొప్ప యజ్ఞాన్ని నిర్వహించి ఇంద్రుణ్ణి ప్రీతి పరచి భూమండలాన్ని పురోహితులకు స్వాధీనం చేసెను. పది నిలువుల పొడవు, తొమ్మిది నిలువుల ఎత్తుగల బంగారు దైవ పీఠాన్ని కశ్యపుడికి దయ చేయించినాడు. అతడి అనుజ్ఞతో బ్రాహ్మణులు వారిలోవారు విభజించబడి ఖాండవ వనస్తులుగా పిలువబడు చున్నారు. భూమండలాన్ని కశ్యపుడికి స్వాధీన పరచి, పరశురాముడు మహేంద్రగిరిలో సంచరించెడివాడు. ఆ విధంగా క్షత్రియులకు అతడికి ఏర్పడిన వైరం వలన అతడు భూమండలాన్ని తన పరాక్రమంతో గెలుచుకో గలిగాడు."

పరశురామునిచే వధించబడిన క్షత్రియులు మహాభారతం ద్రోణపర్వంలో వివరించినట్లుగా కాశ్మీరులు, దారదులు, కుంతులు, క్షుద్రకులు, అంగ, వంగ, కళింగ, విదేహ, తామ్రలిప్తకులు, మర్దికవాటులు, శివి మరి రాజాన్యాస ప్రాంతాలకు చెందినవారు.

మరలా తిరిగి క్షత్రియుల వంశం పునరుద్ధరణ కూడా ఈ క్షత్రియ నాశన సంఘటనలోనె పేర్కొన బడినది. అది ఈ విధంగాఉన్నది.

"ఇరవై ఒక్కసార్లు భూమండలం మీద క్షత్రియులను సమూలంగా తుడిచి పెట్టిన తర్వాత జమదగ్ని పుత్రుడైన పరశురాముడు, పర్వతాలలో ఉత్తమైన మహేంద్రగిరిపై తపః కార్యాలలో నిమగ్నమైనాడు. క్షత్రియ విధవరాండ్రు బ్రాహ్మణుల వద్దకు వచ్చి సంతతి నిమిత్తమై ప్రార్థించిరి. ఈ దైవభక్తి గల బ్రాహ్మణులు ఎటువంటి వాంఛ, కోరిక లేకుండా సరియైన సమయంలో ఈ స్త్రీలతో సంభోగించినారు. తద్వారా క్షత్రియ బాలురు, బాలికలు ఈ భూమిమీదకు తీసుకొని రాబడ్డారు. ఈ విధంగా బ్రాహ్మణుల క్రింద జాతులు నాలుగుగా మారినవి.

**అనువాదం : జి. భద్రు**

అధ్యాయం - 19

# కులమనే శాపం

నేను నా మొదటి వ్యాసంలో చెప్పినట్లుగా కులం అనేది ఒకటికాదు. కులం బహువచనంగానే ఉనికిలో ఉంటుంది. ఈ గుణమే కులవ్యవస్థకు శాపం కూడా. చాలా కొద్ది మంది మాత్రమే ఈ శాప తీవ్రతను అర్థం చేసుకోగలిగారు. ఈ విచ్ఛిన్నకరశక్తి యొక్క విస్తృతపరిధిని ఎత్తి చూపుట ఎంతైనా ఆవశ్యకం. ప్రతికులం యొక్క విచ్ఛిన్నకర పరిణామక్రమం గురించి ప్రస్తావించుట అసాధ్యం. కనుక ఒక కుల చరిత్ర గురించి సమగ్రంగా తెలుసుకొనడంద్వారా మిగిలిన పరిణామాలను గురించిన అవగాహన ఏర్పడుతుంది. నేను ఇక్కడ బ్రాహ్మణుల గురించి ప్రస్తావించదలిచాను. అన్ని కులములకు మూలమైనదిగా, ధర్మస్థాపకులుగా పరిగణించబడే ఈ కులస్థులను ఆ కులం ఏవిధంగా విభజించి, విచ్ఛిన్నం చేసిందో చూడండి. భారతీయ బ్రాహ్మణులు రెండు విభిన్న సహోదర సమూహాలుగా విభజింపబడినారు. ఒకరు ద్రావిడులుకాగా వేరొకరు గౌడులు.

ఇంత మాత్రం చేత ద్రావిడులు, గౌడులు రెండు సజాతులు గా భావించరాదు. వీరు మరల అనేక ఉపజాతులుగా విభజించబడి ఉన్నారు. ఈ జాతుల సంఖ్య ఊహించుట దుర్లభం. రాబోయే పుటల్లో ఒకేకులానికి చెందిన ఈ సహోదర ఉపజాతుల గురించిన వివరాలు అందించే ప్రయత్నం చేస్తున్నాను.

## I

### ద్రావిడ బ్రాహ్మణులు

ద్రావిడ బ్రాహ్మణులు పంచ ద్రావిడులుగా విభజించబడి ఉన్నారు.

వారు:

1. మహారాష్ట్రీయులు
2. ఆంధ్రులు
3. ద్రావిడులు
4. కర్నాటకులు
5. గుర్జరులు

ఇప్పుడు మనం ఈ పంచ ద్రావిడులు తిరిగి ఎన్ని ఉపజాతులుగా విభజించి ఉన్నారో తెలుసుకుందాం.

## 1. మహారాష్ట్ర బ్రాహ్మణులు

మహారాష్ట్ర బ్రాహ్మణులలో ఈ క్రింది కులాలు, ఉపకులాలు కలవు.

1. దేశస్థులు 2. కొంకణాస్థులు 3. కర్హాడులు 4. కణ్వులు 5. మధ్యాందినులు 6.పాద్యులు 7. దేవారుఖలు 8. పాలషాలు 9. కీర్వాంతులు 10. తీర్గులులు 11) జావకులు 12. అభిరులు 13. సావాషులు 14. కాస్థులు 15. కుండగోలకులు 16.రండగోలకులు 17. బ్రహ్మణజైలు 18. సోపారులు 19. ఖిస్తీలు 20. హుస్సీనులు 21.కలంకీలు 22. మైత్రాయనులు 23. వారదీసీ మధ్యాందిన యజుర్వేదులు 24. వారదీసీ మధ్యాంధీన రుగ్వేదులు 25. జడులు

షెన్వీలు తిరిగి తొమ్మిది ఉపజాతులుగా విభజించబడినారు.

26. నార్వాంకరులు 27. కేలోస్కరులు 28. బర్దేష్కారులు 29. కుదల్దేష్కారులు 30. పేడ్నేకరులు 31. భాలవేల్కర్లు 32. కుశస్థలులు 33. ఖడేపులు 34. ఖజాలేలు

## 2. ఆంధ్ర బ్రాహ్మణులు

ఈ క్రింద శాఖలు, ఉపశాఖల వారిని ఆంధ్ర బ్రాహ్మణులుగా పిలుస్తారు

1.వర్ణశాలులు 2. కమరుకుభులు 3. కరణకములు 4. మధ్యాందినులు 5.తైలంగులు 6. మురకనాడులు 7. ఆరాధ్యులు 8. యాజ్ఞవల్క్యులు 9. కసరనాడులు 10. వెలనాడులు 11. వేంగినాడులు 12. వేదినాడులు 13. సామవేదులు 14.రామానుజులు 15. మధ్వాచారులు 16. నియోగులు.

## 3. తమిళ బ్రాహ్మణులు

1. రుగ్వేదులు 2. కృష్ణయజుర్వేదులు 3. శుక్లయజుర్వేద మధ్యాంధినులు 4.శుక్లయజుర్వేద కణ్వులు 5. సామవేదులు 6. అధర్వులు 7. వైష్ణవులు 8. వీర వైష్ణవులు 9. శ్రీవైష్ణవులు 10. భాగవతులు 11. శాక్తులు.

## 4. కర్నాటక బ్రాహ్మణులు

ఈ క్రింద వారిని కర్నాటక బ్రాహ్మణులుగా పిలుస్తారు.

1. రుగ్వేదులు 2. కృష్ణయజుర్వేదులు 3. శుక్లయజుర్వేద మధ్యాందినులు 4. శుక్ల యజుర్వేద కణ్యులు 5. సామవేదులు 6. కుమే బ్రాహ్మణులు 7. నగర బ్రాహ్మణులు.

## 5. గుర్జర బ్రాహ్మణులు

ఈ క్రింద ఉపజాతుల వారిని గుర్జార బ్రాహ్మణులుగా పరిగణిస్తారు.

I. అండిచ్య బ్రాహ్మణులలో ఈ క్రింద ఉపజాతులు కలవు.

1. సిద్ధపూర అండిచ్య బ్రాహ్మణులు 2. సిహోర అండిచ్యులు 3. తోల్కియా అండిచ్యులు 4. కుంభిగోరులు 5. ఇనోచి గోరులు. 6. డార్జిగోరులు 7. గ్రంథరపగోరులు 8. కోరిగోరులు 9. మార్వాడి అండిచ్యులు 10. కచ్చి అండిచ్యులు 11. వాగ్దియ అండిచ్యులు.

II. నగర బ్రాహ్మణులు :- వీరిలో ఈ క్రింది ఉపశాఖలు కలవు.

12. వాడనగర బ్రాహ్మణులు 13. విశాలనగర బ్రాహ్మణులు 14. సతోద్ర బ్రాహ్మణులు 15. ప్రశ్నోరులు 16. కృష్ణోరులు 17. చిత్రోదులు 18. బరాడలు.

III. నగర బ్రాహ్మణులలో మరి మూడు జాతులు కలవు.

19. గుజరాతి నగరులు 20. సోరాతి నగరులు 21. ఇతరపట్టణాల నగరులు.

III, గిర్నార బ్రాహ్మణులలో ఈ క్రింది జాతులు కలవు.

22. జునాగద్య గిర్నారులు 23. చోర్వాద గిర్నారులు 24. అజాకీయులు

IV. మేవాడ బ్రాహ్మణులుగా ఈ క్రింది వారిని పిలుస్తారు.

25. భాతమేవాడులు 26. త్రివాడి మేవాడులు 27. చరోసి మేవాడలు

V. దేశవాళీ బ్రాహ్మణులు

28. దేశవాళి బ్రాహ్మణ సురాతులనే ఉపజాతి కలదు.

VI. రాయకవల బ్రాహ్మణులలో రెండు ఉపజాతులు కలవు.

29. నవజాతి (కొత్తవారు) 30. మోతలు (పాతవారు)

VII. ఖేద్వల బ్రాహ్మణులులలో ఐదు ఉపజాతులు కలవు.

31. ఖేద్వల బాజాలు 32. ఖేద్వల భైతరాలు 33. ఖేద్వబజాలు 34. ఖేద్వ భైతరాలు.

VIII. మోధా బ్రాహ్మణులులలో పదకొండు ఉపజాతులు కలవు.

35. త్రివేది మోధాలు 36. చతుర్వేది మోధాలు 37. అగిహంస్ మోధాలు 38. త్రిపాల్ మోధాలు 39. ఖిజాదియా సన్యాన మోధాలు 40. ఏకాదశద్ర మోధాలు 41. జేతిమాల మోధాలు 42. చతుర్వేది ధినో మోధాలు 43. ధినోజా మోధాలు

IX. శ్రీమాలి బ్రాహ్మణులనగా ఈ క్రింది ఉపజాతుల వారు

44. మార్వాడి శ్రీమాలులు 45. మేవాడి శ్రీమాలులు 46. కచ్చి శ్రీమాలులు 47.కథైవాడి శ్రీమాలులు 48. గుజరాతి శ్రీమాలులు

గుజరాతి శ్రీమాలులను తిరిగి ఈ క్రింద ఉపజాతులగా విభజించారు

49.అహ్మదాబాది శ్రీమాలులు 50. సురాతి శ్రీమాలులు 51. ఘోఘారి శ్రీమాలులు 52. ఖంభాటి శ్రీమాలులు. వీరు తిరిగి ఈ క్రింది జాతులుగా విడగొట్టబడినారు

53. యజజుర్వేది ఖాంభాటి శ్రీమాలులు 54. సామవేది శ్రీమాలులు

X. చోవిషా బ్రాహ్మణులలో రెండు ఉపజాతులు కలవు

55. మోటా (గొప్పవారు) 56. లహన (దిగువవారు)

XI. సారస్వత బ్రాహ్మణులులలో రెండు జాతులు కలవు.

57. సోరాతీయ సారస్వతులు 58. సింధావ సారస్వతులు

I. పూర్తి ఉపజాతులుగా రూపొందని గుజరాతీ బ్రాహ్మణుల శాఖలను ఈ క్రింద ఇస్తున్నాను.

59. సచోర బ్రాహ్మణులు 60. ఉదంబర బ్రాహ్మణులు 61. నర్సిపర బ్రాహ్మణులు

62. వాలద్రి బ్రాహ్మణులు 63. పాంగోరా బ్రాహ్మణులు 64. నందోరా బ్రాహ్మణులు 65.వాయడ బ్రాహ్మణులు 66. తమిళ లేక ద్రావిడ బ్రాహ్మణులు 67.గోమతి వాలా బ్రాహ్మణులు 68. ఐతావాలా బ్రాహ్మణులు 69. మేధాతా వాలా బ్రాహ్మణులు 70. గయావాలా బ్రాహ్మణులు 71. అగస్త్యవాలా బ్రాహ్మణులు 72. ప్రేతావాలా బ్రాహ్మణులు 73. ఉనేవాలా బ్రాహ్మణులు 74. రోదవాలా బ్రాహ్మణులు 75. పద్మివాలా బ్రాహ్మణులు 76. రాజావాలా బ్రాహ్మణులు 77. కనోజియా బ్రాహ్మణులు 78. పర్వాలియా బ్రాహ్మణులు 79. కనోలియా బ్రాహ్మణులు 80. ఖర్తైలియా బ్రాహ్మణులు 81.పర్వాలియా బ్రాహ్మణులు 82. సోరాతియా బ్రాహ్మణులు 83. తంగా మాదియా బ్రాహ్మణులు 84.సనోడియా బ్రాహ్మణులు 85. మోటాలా బ్రాహ్మణులు 86. ఝాలోరా బ్రాహ్మణులు 87. రాయాపుల బ్రాహ్మణులు 88. కపిల బ్రాహ్మణులు 89. అక్షయ మంగళ బ్రాహ్మణులు 90. గుగ్లీ బ్రాహ్మణులు 91. నాపాల బ్రాహ్మణులు 92. అనవాలా బ్రాహ్మణులు 93. వాల్మీక బ్రాహ్మణులు 94. కళింగ బ్రాహ్మణులు 95. తెలింగ బ్రాహ్మణులు 96. భార్గవ బ్రాహ్మణులు 97. మాళవులు 98. బాందువన్ బ్రాహ్మణులు 99. భారతన బ్రాహ్మణులు 100. పుష్కరణ బ్రాహ్మణులు 101. ఖాదయత బ్రాహ్మణలు 102. మరు బ్రాహ్మణులు 103. దహిమా బ్రాహ్మణులు 104. చోవిసా బ్రాహ్మణులు 105. జంబూ బ్రాహ్మణులు 106. మరాఠా బ్రాహ్మణులు 107. దధీచ బ్రాహ్మణులు 108. లాలట బ్రాహ్మణులు 109. వాలుటా బ్రాహ్మణులు 110. బోర్షిధ బ్రాహ్మణులు 111. గోలవాలా బ్రాహ్మణులు 112. ప్రయాగవాలా బ్రాహ్మణులు 113. నాయకవాలా బ్రాహ్మణులు 114. ఉత్కళ బ్రాహ్మణులు 115. పల్లివా బ్రాహ్మణులు 116. మధుర బ్రాహ్మణులు 117. మైథిల బ్రాహ్మణులు 118. కులభ బ్రాహ్మణులు 119. బేడువా బ్రాహ్మణులు 120. రవావాలా బ్రాహ్మణులు 121. దశహార బ్రాహ్మణులు 122. కర్నాటిక బ్రాహ్మణులు 123. తలజియా బ్రాహ్మణులు 124. పరాశరీయ బ్రాహ్మణులు 125.అభిర బ్రాహ్మణులు 126. కుండు బ్రాహ్మణులు 127. హిరాయజియా బ్రాహ్మణులు 128.మస్తావా బ్రాహ్మణులు 129. స్థితిష బ్రాహ్మణులు 130. ప్రేదత్వలా బ్రాహ్మణులు 131.రాంపూరా బ్రాహ్మణులు 132. జిలా బ్రాహ్మణులు 133. తిలోత్య బ్రాహ్మణలు 134. దుర్మలా బ్రాహ్మణులు 135. కోడ్వ బ్రాహ్మణులు 136. హనుషన బ్రాహ్మణులు 137. శేవాడ బ్రాహ్మణులు 138. త్రగ బ్రాహ్మణులు 139. బసులదాస బ్రాహ్మణులు 140.మగ్మార్యా

బ్రాహ్మణులు 141. రాయతల బ్రాహ్మణులు 142. చాపిల బ్రాహ్మణులు 143. బరదాస్ బ్రాహ్మణులు 144. భుకానియా బ్రాహ్మణులు 145. గరోడ బ్రాహ్మణుడు 146.తపోరణ బ్రాహ్మణులు.

# గౌర బ్రాహ్మణులు

ద్రావిడ బ్రాహ్మణులలో వలెనే గౌడ బ్రాహ్మణులలో ఐదు శాఖలు కలవు. అవి:

1. సారసత్య బ్రాహ్మణులు, 2. కన్యాకుబ్జ బ్రాహ్మణులు, 3. గౌడ బ్రాహ్మణులు, 4. ఉత్కళ బ్రాహ్మణులు, 5. మైథిల బ్రాహ్మణులు

ఈ సమూహాలు కూడా పంచ ద్రావిడులవలెనే అంతర్విభజితమైవున్నాయి. అయితే ఈ విభజనలూ, ఉపవిభజనలూ పంచ ద్రావిడులలో కంటె తక్కువా? ఎక్కువా అనేది ప్రశ్న. అందుకు ప్రతి సమూహాన్ని విడిగా చూడడం అవసరం.

## సారసత్య బ్రాహ్మణులు

ఇవి మూడు ప్రాంతీయ సమూహాలుగా విభజితమై ఉన్నాయి.

1. పంజాబ్ కు చెందిన సారస్వతులు 2. కాశ్మీర సారస్వతులు 3. సింధు సారస్వతులు

### పంజాబ్ సారస్వతులు

వీరిలో మూడు ఉప జాతులు కలవు.

A. లాహెూరు, అమృత్‌సర్, బటాలా, గుర్దాసపూర్, జలంధర్, ముల్తాన్, ఝంగ్, షాపూర్ జిల్లాలకు చెందిన సారస్వతులు. వీరు తిరిగి ఉన్నత వర్గాలుగా అధమ వర్గాలుగా విభజించబడినారు.

ఉన్నత వర్గాలు

1. నవలె 2. ఛునీ 3. రావడె 4. సర్వలియా 5. పండిత్ 6. టిఖ 7. ఝింగాన్ కుమాడియె 9. జెట్లి 10. మోహలె లేక మోలె 11. టిఖి అండె 12. ఝుంగ్గాన్ పింగాన్ 3. జెట్లి పిట్లి 14. కుమాడియో-లూమాడియో 15. మ్రోహ్లై - బోహ్లై16. బాగె

17.కాపురియో 18. భటూరియో 19. మాలియె 20. కాలయె 21. నండా 22. పారక్ 23. కురాల్ 24. భరద్వాజి 25. జోషి 26. షోరి 27. తివారి 28. మారుద్29. దత్త 30.మూరుూల్ 31. ఛిబార్ 32. బాలి 33. మోహన్ 34. లావా 35. వైద్య 36. ప్రభాకర్ 37. శ్యామె-పోత్రి 38. భోజపోత్రి, 39. సింఘెపోత్రి 40. పట్టెపోత్రి 41. ధన్నన్ పోత్రి 42. ద్రావడె 43. గైంధర్ 44. తక్ లాలాడి 45. షామాదాసి 46. షెత్వాల్ 47. పుష్రాత్ 48. భరద్వాజ 49. కట్వాలె 50. ఘోట్కె 51. పుకార్నె.

అధమ వర్గాలు :

52. డిడ్డి 53. శ్రీధరా 54. వినాయక 55. మజ్జా 56. ఖిండారియో 57. హరాడ్ 58. ప్రభాకర్ 59. వాసుదేవ 60. పరాశర 61. మోహన 62. పంజన 63. తివార 64.కపల 65. భర్కారి 66. శోధి 67. కైజార్ 86. సంగడ్ 69. భరద్వాజి 70. వాగె 71. మకావర్ 72. వశిష్ట 73. డంగవాల్ 74. జలప్ 75. త్రిపానె 76. భరతె77. బన్వాలె 78. గంగాహర్ 79. జోటాషి80. రిఖి లేదా రిషి81. మండార్ 82. బ్రహ్మ 83. తేజ్‌పాల్ 84. పాల్ 85. రుపాల్86. లఖన్‌పాల్ 87. రతన్ పాల్ 88. శెత్వాల్ 89. భిందె 90. ధామి 91.చనన్ 92. రండెహ 93. భూట 94. రతి 95. కుండి 96. హసధిర్ 97. పుంజ్ 98. సంధి 99.బహెరాయె 100. విరాద్101. కలంద్102. సురన్103. సుదన్104. ఒఝ 105. బహ్మ-సుకుల్ 106. హరియె 107. గజెషు 108. భనోట్ 109. తినూని 110. జల్లి 111. తోలె 112. జలప్ 113. చితచోట 114. పాధె లేక పాంధె115. మరుద్ 116.లాలడియె 117. తోటె 118. కుసారిట్ 119. రాంటాల్ 120. కపాలె 121.మసోదారె 122. రత్నాయి 123. చందన్ 124. చారువాన్ 125. మందహార్ 126.మాధారె 127.లాకార్వర్128. కుంద్129. కర్దమ్ 130. డాండె 131.సాహజ్‌పాల్ 132. పాఢి 133. రాతి 134. జైత్కె 135. దైద్రియె 136. భాతరె 137. కాలి 138.జల్పోటే 139. మైత్ర 140. సంఖాత్రి 141. లూద్ర 142. వ్యాసా 143. పాట్టు 144.కిరార్ 145. పుజె 146. ఇసార్ 147. లాట్వా 148. ధామి 149. క్లన్ 150.మదర్ఖంభే 151. బెడెసార్ 152. సాల్వాహన్ 153. దాండా 154. మరుద్ 155.భటూరె 156. జోటి 157. సోయారి 158. తేజ్‌పాల్ 159. కురాల్‌పాల్ 160.కలాస్ 161. జలాప్ 162. తిన్మాణి 163. తంగనివాతె 164. జల్పోట్165. పట్టు 166. జస్రావా 167. జయచంద్ 168. సన్వాల్ 169. అగ్నిహోత్రి 170. అగ్రహాఖా

171. రుతాడె 172. భాజి 173. కుచ్చి 174. సైలి 175. భాంచి 176. మేడు 177.మెహడ్ 178. యమ్యే 179. సంగార్ 180. సంగ్ 181. నేహర్ 182. చక్వాలియె 183. బిబ్రాయె 184. నరద్ 185. కుట్యాల్ 186) కోట్వాల్ 187. నాభ్ 188. నాద్ 189. పరాంజె 190. ఖెటి 191. ఆరి 192. చాత్రై 193. బిబ్బె 194. బండు 195. మచ్చు 196. సుందర్ 197. కరాడగె 198. చ్చిబ్బె 199. సాధి 200. తల్లిన్ 201. కర్దామ్ 202.ఝూమన్ 203. రంగడె 204) భోగ్ 205. పాండె 206. గండె 207.పాంటె 208.గంఢె 209. ఢిండె 210. తగలె 211. డగలె 212. లహడ్ 213. తడ్ 214. కాయి 215. లూధ్ 216. గందర్ 217. మహె 218. శైలి 219) భాగి 220. పాండె 221. పిపార్ 222. జత్రి.

B. కంగాడకు చెందిన సారస్వత బ్రాహ్మణులలో కూడా రెండు వర్గాలు కలవు.

ఉన్నత వర్గాలు:

1.ఒస్ది 2. పండిట్ కాశ్మీర్ 3. సోత్రి 4. వేద్వె 5. నాగా 6. దీక్షిత 7 మిశ్రి కాశ్మీర్ 8. మడిహతు 9. పంచ్‌కర్న్ 10. రైనె 11. కురుడు 12. ఆచారియె

హీనవర్గాలు:

13. చితు14. పాణ్యాలు 15. డుంబు 16. దిహైదు 17. రుఖె 18. పాంబారు 19.గుత్రె 20. ద్యబుధు 21. మైతె 22. ప్రాత్(పురోహిత్) జాద్రోతియె 23. విష్ట్రప్రోత్ 24. ఫాదెసరోజ్ 25. పాధెమహిత్ 26. ఖాజూరె 27. ఛుట్యాన్ 28. పాధెఖాజూరె 29.ఛన్యాల్ 30. రంబె 31. మంగ్రూదియె 32. ఖుర్యాధ్ 33. గల్యాధ్ 34. దన్‌గ్మార్ 35. ఛలివాలె

C. దత్తాపూర్, హెూషియార్‌పూర్ ప్రక్క ప్రాంతాలలోని సారస్వత బ్రాహ్మణులలోని రెండు వర్గాలవారు ఈ క్రింది విధంగా ఉన్నారు.

ఉన్నత వర్గాలు:

1.డోగ్రి 2. సర్మాయి 3. దుబే 4. లఖానపాల్ 5. పాధిధోల్బల్యాయ 6. పాధి మోహస్నియె 7. పాధి దాడియె 8. పాధె ఖిందడియా 9. ఖాజూరియె

దిగువ వర్గాలవారు

10. కపాహతియె 11. భరాధియల్ 12. చప్రోహియె 13. మకాడె 14.కుటల్లిడియె 15. సరద్ 16. డగడు 17. వంటడె 18) ముష్లె 19. సమ్మోల్ 20. ధోపె 21. బాటోల్ 22. రాజోహడ్ 23. తానిక్ 24. పాణ్యాల్ 25. చిబ్బె 26. మదోతె 27. మీసార్ 28.చృకోతర 29. జట్రెయి 30. అహడ్ 31.. సేల్ 32. భసుల్ 32. పండిట్ 34.చంఘిహల్ 35. లాట్ 36. సంద్ 37. లై 38. గదోత్రారె 39) చిర్వోల్ 40. బాద్లె 41. శ్రీధర్ 42. పట్టూ 43.జూవల్ 44. మైట్ 45. కాక్లియె 46.తక్ 47. ఝూల్ 48.తందిక్ 50. ఝుమ్మతియార్ 51. ఆల్ 52. మీరట్ 53. ముకాటి 54. దాల్వాల్లి 55.భాటోహయె 56.భాటారె 57. భదోయె 58.త్యాహయె

## కాశ్మీరు సారస్వతులు

కాశ్మీరు సారస్వతులలో రెండు రకాలు కలరు.

జమ్మూ, జస్రోతా పరిసర పర్వత ప్రాంతాలలో నివసించే సారస్వత బ్రాహ్మణులలో మూడు వర్గాలు కలరు. ఉన్నత, మధ్య, హీనవర్గాలు.

ఉన్నతులు:

1. అంగోత్రి 2. థప్పె 3. దూబే 4. సపోలియో పాధే 5. బాడియాల్ 6. కేసర్ 7. నాధ్ 8. ఖాజూరే ప్రహెూర్ 9. జామ్వాల్ పండిట్ 10. వైద్య 11. లావా 12. చిబార్ 13. అదియో 14. మోహన్ 15. బాంభావాల్

మధ్యములు:

16. రైనె 17. సతోత్రె 18. కటోత్రె 19. లాలోత్రె 20. భాంగోత్రి 21.సామ్వోత్రి 22. కాశ్మీరీ సండిట్ 23. పంధోత్రి 24. విల్హానోచ్ 25. బాడు 26. కెర్వాయి పండిట్ 27. దనాల్ పాధే 28.మూహైట్ 29. సుద్రాలియే 30. పురోచ్ 31. అధ్రోత్రి 32. మిశ్రా 33. పరాశరా 34. బావగోత్రి 35. మన్సోత్రి 36. సుదాతియె 37. భాతియాద్

నిమ్నవర్గాలు:

38. సుదాన్ 39. సుఖి 40. ఖురె 41. చందన్ 42. జాలోత్రి 43. నాభోత్రి 44.ఖాదోట్రి 45. సగ్దోల్ 46. ఖురియో 47. భగన్నాథల్ 48. రాజాలియే 49. సంగ్దె

50. ముండే 51. సుర్నాచల్ 52.లాధంజన్ 53.జ్యోత్రి 54. లఖిన్‌పాల్ 55.గౌడపురోహిత 56. షాష్త్రి 57.ఖానోత్రి 58. గారోచ్ 59.మారోత్రి 60. ఉపాధె 61. ఖిండాయియే పాధే 62.కలిందారి 63.జరాద్ 64. ఉదిహల్ 65. గోడ్ 66. బాసోత్రి 67. బారాత్ 68.వార్గాత్ 69. లావాంతే 70. భారాంగోల్ 71.జరాంఘూల్ 72. గుహలియే 73. ధరియాంచ 74.పింధాడ్ 75. రాజానియే 76.బాడాకులియే 77. శ్రీఖండియే 78.ఖిర్వాడ్ 79.బల్లె 80. సాలూర్న్ 81.రతన్‌పాల్ 82.బానోత్రి 83.యంత్రాధరి 84.దాధోరిచ్ 85.భాలోచ్ 86. ఛాఛియల 87).ఝాగోత్రి 88.మాగ్దాల్ 89.ఫాన్ఫన్ 90. సరోచ్ 91. గుడ్డె 92.కిర్లె 93.మాన్స్రోత్రి 94.ధామోత్రి 95.ఛాన్మత్రి 96.బ్రామియె 97.కుందన్ 98.గోకులియేగోసైన్ 99.చాకోత్రి 100. రోడ్ 101. బార్గోత్రి 102.కాన్షె 103.మాగ్దాయాలియే 104.మాధార్ 105. మాహిజియో 106. తాకురేపురోహిత 107.గల్హల్ 108.ఛామ్ 109).రోడ్ 110.లాభోత్రి 111. రేడాతియె 112.పాటాల్ 113. కమానియె 114.గంధార్గాల 115.పృథ్వీపాల్ 116. మాధోత్రి 117.కంబో 118. సర్మాయి 119. బచ్వాల్ 120.మఖోత్రి 121.జాడ్ 122.బాటియాలియె 123. కుడిదాబ్ 124.జాంబె 125.కరనాధియె 126. సుధాదె 127.8గాద్ 128.గరాడియె 129.మచ్చార్130. భగోత్రి 131.సైంహసన్ 132. ఉత్రియాల్ 133.సుహండియె 134.జిందాహద్ 135.బట్లాల్ 136.భైంకారె 137.బిస్గోత్రి 138.ఝాలు 139.డాబ్ 140.భుటా 141. కాధయాలు 142.పాలాధు 143.జ్యోత్రి 44.పాంగె 145. సోత్రె 146.సుగుణియె 147.సంహెలాచ్ 148.డుహల్ 149.బండో 150.కనుంగో 151. ఝాష్న 152. ఝాపాడు 153. ఖలియె 154.ఖాఫాంఖో 155. పలంధు

**కాశ్మీరు సారస్వతులు**

కాశ్మీరు బ్రాహ్మణుల జాబితా ఈ క్రింద ఇవ్వబడినది.

1. కౌల్ 2.రజ్దాన్ 3.గురిటె 4.జిటిష్ 5.డార్ 6.త్రాకారి 7.ముజి 8.మున్షి .బూటాల్ 10. జాలి 11. బజాయి 12. రై 13. హుండో 14.దిప్తి 15.ఛిచ్వాలి 16.రుగి 7.కాల్ 18.సమ్ 19.హంజి 20.హస్తివాలి 21.ముటు 22.టిక్కు 23.గైస్ 24.గాడి 5.బ్రారి 26. గంజ్ 27.వంగన్ 28.వగన్ 29.భుట్ 30.భైరవ 31.మదన్ 32.దిన 3.షార్గాల్ 34.హక్సర్ 35.హక్ 36.కుకార్ 37.ఛతారి 38.సొంపూరి 39.మట్టి 40.ఖుష్

41.షిక్దార్ 42.వైష్ణవ 43.కోటార్ 44.కక్ 45.కచాది 46.తోటే 47.సారాప్ 48.గురాహ్
49.థాంథార్ 50.ఖార్ 51.థౌర్ 52.టెంగ్ 53.సైయాద్ 54.త్రుపురాయ 55.ముఠి
56.సాఫాయు 57.భాన్ 58. వణ్య59.గరియాల్ 60.ధాపాల్ 61. నౌరి 62.మాసాల్దాన్
63.ముష్రాన్ 64.టర్కి 65.పోతేదార్ 66.కర్బాంగి 68.భట్ 69. కిచిలు70.ఛాన్
71.ముక్దాన్ 72.ఖాపారి 73.బులాకి 74.కర్ 75.జెలాలి 76.సాఫాయు 77.భాట్వాలి
78.హుఖి 79.కుక్వారి 80. కాలి 81. జారి 82.గంజ్ 83.కిమ్ 84.ముండి 85.జంగల్
86.జటి 87.రాఖ్యాస్ 88.బాకాయి 89. గెరి 90. గారి 91. కారి 92.పంజి 93.భంగి
94.సాహిబ్ 95.బేలాబ్ 96.రాయి 97.గలికారాప్ 98.చాన్ 99.కబాబి 100.యాచ్
101.జల్వారి 102.నవసాహరి 103.కిసి 104.ధుసి 105.గంఖార్ 106.ధోలాల్
107.పిస్తా 108.బాదం 109.త్రాఛాల్ 110.నాదిర్ 111.లిదారిగారి 112.ప్యాల్
113.కబి 114.ఛత్రి 115.వంటి 116.వటిలులు 117.ఖారి 118.వాస్ 119.హటి
120.సబంజ్ 121.దండి 122.రావల్ 123.మిశారి 124.సిబ్బి 125.శింగారి 126.మిర్జె
127.మూల్ 128.వారికి 129.జాన్ 130.లుటారి 131.పారిమ్ 132.హలి 133.నాకైబ్
134.మైన్ 135.ఆంబారాడార్ 136.ఉఖాల్ 137.కాంత్ 138.బాలి 139.జంగలి
140.దులి 141.పరవా 142.హర్కార్ 143.గాగర్ 144.పండిట్ 145.జారి 146.లంగి
147.ముక్కి 148.బిహి 149.పాడార్ 150.పాడె 151.జాంద్ 152.టెంగ్ 153.టుండ్
154.డ్రాబి 155.డ్రాల్ 156.ఫాంభి 157.సజాపుల్ 158.బక్షి 159.ఉగ్రా 160.సాంబ్బి
161.పఠాన్ 162.విచారి 163.ఉంత్ 164.కుచారి 165. షాల్ 166.బాబి 167.మఖాని
168.లబారి 169.ఖన్యా 170.ఖాన్యాఖాటి 171.షా 172.పిర్ 173.కుర్ది 174.ఖుంఖి
175.కాల్వాష్ 176.పిషాన్ 177.బిషాన్ 178.బుల్ 179.చోకి 180.చాక్ 181. ప్రీతి
183.పాటి 184.కిచిలి 185.కహి 186.జిజి 187.కిల్మార్క్ 188.సల్మాన్ 189.కదల్బాజు
190.కండహరి 191. మండల్ 192.మానాటి 193.బంఖాన్ 194. హకీం 195.గరీబ్
196.బాలి197.మంజాహ 198.షైర్ 199.నన్ 200. తెలి 201.ఖాలాసి 202.చంద్ర
203.గదిర్ 204.జరాబి 205.సిహరి 206.కర్బిట్207.నగరి 208.ముంగుచ్ 209.ఖైబరి
210.కుర్లి 211.కబి 212.ఖోసా 213.దురాని 214.తులి 215.గరీబ్ 216.జటి
218.రాక్షస్ 219.హర్కార్ 220.గ్రడ్ 221.వగరి , వైగైరా వైగైరా......

## సింధు ప్రాంతపు సారస్వతులు

వీరు తిరిగి ఈ క్రింది విధముగ విభజించబడినారు

1) షికరపురు 2) బారోపులు 3) రావంజాహిలు 4) శేట్పాలలు

5) కుపచందులు 6) పోఖరనులు.

**II** కన్యాకుబ్జ బ్రాహ్మణులు

ఒకానొక సామ్రాజ్యపు ముఖ్యపట్టణమైన కనోజ్ నందు నివసించినందువలన వీరిని కన్యాకుబ్జులని పేరువచ్చింది. వీరిని కనౌజిలని కూడా పిలుస్తారు. కన్యాకుబ్జ బ్రాహ్మణులలో రెండు శాఖలు కలవు. వారు సర్వారియలు, కన్యాకుబ్జులు. ప్రాచీన సరయూ నదికి తూర్పువైపున నివసించే వారికి సర్వారియలు అనిపేరు. వీరు కనోజు పట్టణ వాసుల వారసులయినప్పటికీ ప్రస్తుతం సర్వారియలు, కనోజులకు మధ్య వివాహ సంబంధాలు లేవు. కనోజులలో, సర్వారియులలో దాదాపు ఒకే రకమైన ఉపశాఖలు కలవు.కనుక కనోజులలోని ఉపశాఖల గురించి సమగ్రంగా తెలుసుకొన్నట్లయితే, సర్వారియుల గురించి కూడా పూర్తి అవగాహన ఏర్పడుతుంది.

కన్యాకుబ్జ బ్రాహ్మణులలో గల పది ఉపశాఖల గురించిన వివరాలు క్రింద ఇవ్వబడినాయి.

1. మిశ్రాలు 2. శుక్లాలు 3. తివారీలు 4. దుబేలు 5. పాఠక్‌లు 6.పాండేలు 7. ఉపాధ్యాయలు 8.చేబేలు 9.దీక్షిత్‌లు 10.వాజపేయిలు.

ప్రతి ఒక్క ఉపశాఖకు మరి ఎన్నో ఉపశాఖలు కలవు.

### 1. మిశ్రాలు

1.మధ్వానీలు 2.చంపారణులు 3.పట్లాలు లేదా పట్లాయళులు 4.రతనవళులు 5.బందోళులు 6.మతోలు లేదా మతీవలలు 7.కటారియాలు 8.కటారియా వేదానికి చెందిన కటారియాలు 9. వత్సగోత్రానికి చెందిన నగారియాలు 10. గణాలు 11.తేవాంతులు 12. మార్జానీలు 13.గుర్హాలు 14. జిజ్ఞాలు 15. పారాయణాలు 16.పేపారులు17. అధర్వులు లేక అధేర్వులు 18. వత్సగోత్రానికి చెందిన పాయాసీలు

19 హతేపారులు 20. సుగంటులు 21. ఖేటాలు 22. గ్రాంవాసులు 23.బిర్తాలు 24.కౌసీలు 25. కేవటిలు 26. రైసీలు 27. భావజీయాలు 28. బేల్వాలు 29.ఉగ్రసైనాలు 30.కోడియాలు 31.తవక్పూరీలు 32జిమాల్పూరిలు 33. శృంగారపూరిలు 34.సీతాపూరి 35.పుత్వ్ష 36. సిరాజ్ పూరీలు 37.భాంపూరీలు 38.టెర్కాలు 39. డధాగౌమిలు 40.రత్నాపూరిలు 41. సున్హాన్లలు 42)మార్కారులు

2.శుక్లాలు .

శుక్లాలలో ఈ క్రింది వారు కలరు.

1.ఖాఖాయిజికోరులు 2.మామ్ఖోరులు 3.తిప్తిలు 4. ఖేడిలు 5.బాకారువాలు 6.కన్జాహిలు 7.ఖాండైలు 8.బేలాలు 9.అవస్థిలు10.తేవారసీ ప్రభాకరులు 11.మెహులియార్లు 12. ఖార్చాహియాలు 13చందాలు 14. గృగాలు 15.గౌతములు 16.పరాసలు 17.తారాలు 18.బారిఖ్పూరిలు 19. కార్యావలు 20. అజ్మార్గధ్యాలు 21. పిచౌరలు 22.మాసావులు 23.సోంతియాన్వలు 24. అకినులు 25. భీర్లు 26. గోపినాధ్లు.

3.తివారీలు,

తివారీలలో ఈ క్రింది కుటుంబాలు కలవు.

1.లోనాఖర్లు 2.లోనాపార్లు 3.ముంజేనలు 4)మంగ్రైచ్లు 5.జానాదిమాలు 6.సోహగౌరలు 7.తారాలు 8.గోరాఖ్పురాయాలు 9.దౌరవలు 10.పేండిలు 11.సిర్జాంలు 12. ధాటురాలు 13.పాణీలిలు 14. నాడౌలిలు లేక తాండౌలిలు 15.బుర్తియాబారిలు 116. గురౌలిలు 17జోగియాలు 18.దీక్షితులు 19.సోనౌరలు 20. అగోరిలు 21.భార్గవలు 22.బకియాలు 23. కుకుర్గారియాలు 24.డామాలు 25.గోపాలులు 26.గోవర్థనులు 27.టుకేలు 28 చడ్డులు 29. శివాలిలు 30.శాఖారాజ్లు 31.మనోహటు 33.శివారాజ్పూర్లు 34.మంధ్నాలు 35.సేపులు 36.మండన్ త్రివేదిలు 37లహరి త్రివేదీలు 38.జేతి త్రివేదిలు 39) ఉమారిలు

4.డుబేలు.

డుబేలలో ఈ క్రింది శాఖలు కలవు.

1.కాంచనిలు 2.శింఘ్వాలు 3.బేలవాలు 4.పారవాలు.5.కరైవాలు 6.బార్హైన్యాలు

7.పంచానిలు 8.లాతియాహిలు 9.గుర్వానులు 10.మేతిబేరులు11.బేర్హాంపురియాలు 12.సింగిలావాలు 13.కుచలలు 14.ముజార్విలు 15. పాలియాలు 16.ధేగవాలు 17.శిశ్రలు 18.సినానిలు 19.కుదవార్యేలు 20.కట్టైయాలు 21.పాన్యాలు.

5. పాఠక్‌లు

ఈ క్రింది వర్గాల వారిని పాఠక్‌లుగా పిలుస్తారు.

1.సోనౌరాలు 2.అంబతారాలు 3.పాటఖావాలియాలు 4.ధీగవాచులు 5.భాదరీలు

6. పాండేలు

ఈ క్రిందవర్గాల వారిని పాండేలుగా పిలుస్తారు.

1. తిర్వాలులు లేక త్రిఫాలులు 2.జోరావాలు 3.మత్తైన్యాలు 4.తోరాయాలు 5.నాక్‌చౌరిలు 6.పార్శిహలు 7.సహంకోలులు 8.బార్హాదీయులు9.గేగలు 10 ఖోరియాలు 11.పిచౌరాలు 12పిచౌరాప్యాసీలు 13.జుటియా లేక జాట్యాలు 14. ఇటారులు లేక ఇంటారులు. 15.బేష్తాలు లేక బేష్తవాలాలు 16.వార్వాండులు 17. శిలులు 18.అధుర్జులు 19. మదరియాలు 20. మజ్గామ్‌లు 21. ధిలిపాపారులు 22. పాయ్హాత్యాలు 23.నాగవులు 24.తాళవులు 25జంబూలు.

7. ఉపాధ్యాయులు

ఉపాధ్యాయులలో ఐదువర్గాలు కలరు.

1.హరైన్యాలు లేక హిరణ్యాలు 2.దేవరైన్యాలు 3.ఖోరియాలు 4.జైతియాలు 5.దాహేంద్రులు 6.గోరాటులు 7.రాణిసరాపులు 8.నిజామాబాదులు 9.దుధోలియాలు 10.బాస్గవలు.

8. చౌబేలు

చౌబేలలోని ముఖ్య ఉపశాఖలు ఈ క్రింద ఇవ్వబడినవి.

1.నయాపురలు2.రార్గాడీలు 3.చౌఖార్‌లు 4.కాటాయాలు 5. రాంపూరాలు 6.పాలియాలు 7. హర్దానపూరలు 8. తిబైయాలు 9. జామూద్వులు 10. గార్గేయులు

9. దీక్షితులు

ఈ క్రింద ఉపశాఖలను దీక్షితులుగా పరిగణిస్తారు.

1.దేవగాములు 2.కాకాదిలు 3. నేవార్షియాలు 4.అంతర్లు 5.సుకాంతలు 6.చౌదరిలు 7. జుజాత్యతియులు.

10. వాజపేయిలు.

వాజిపేయిలలో ఈ క్రింది ఉపశాఖలు కలవు.

1.ఊంచే అనగా పైనున్నవారు.2.నీచే లేక క్రింద వర్గాలవారు

కన్యాకుబ్జబ్రాహ్మణులలో పైన చెప్పబడిన శాఖలు, ఉపశాఖలుకుచెందని కొన్ని దిగువ వర్గాలు కలవు. అవి 1.సందారియాలు 2.తిర్గుపతిలు 3.భారుహలు 4.కబిసాలు 5.కేవతిలు 6. చంద్రవాలాలు 7.కుసేంబియాలు 8.బిసోహ్యలు 9. కన్యాలిలు 10.ఖాజ్వైలు 11.కిసిర్మానులు 12.పైహ్తియాలు 13. మాసోనాడ్‌లు 14. బిజారాలు 15.అన్‌నౌరాలు.

## III గౌడ బ్రాహ్మణులు

అనేక సంవత్సరాల క్రితం ఎంతోకాలం బీహార్, బెంగాల్(అంగ,వంగ,బంగ దేశాల మూలప్రాంతమైన) లకు ముఖ్యపట్టణమై, ప్రస్తుతం శిథిలమైపోయిన గౌడనగరానికి చెందిన వారగుటచే వీరికి గౌడ బ్రాహ్మణులని పేరు వచ్చెను. వీరిలోని ఉపశాఖలు తగు మాత్రమైవి. వాటిలో ప్రాధాన్యత కలవి.

1. గౌడులు లేక కేవల గౌడులు 2. ఆదిగౌడులు 3. శుక్లవాలా ఆది గౌడులు 4. ఓఝూలు 5. సనాద్య గౌడులు 6. చింగళులు 7. ఖండేవాలాలు 8. దైమియాలు 9. శ్రీ-గౌడులు 10.తంబోలి గౌడులు 11. ఆది-శ్రీ-గౌడులు 12. గుర్జార్‌గౌడులు 13.హరియాని గౌడులు 14. కిరత్న్య గౌడులు 15. టెక్‌బారా గౌడులు 16. చమర్‌గౌడులు 17. సుకుల్ గౌడులు

### IV ఉత్కళ బ్రాహ్మణులు

ఒరిస్సా ప్రాంతపు పూర్వపుపేరు ఉత్కళ దేశం. ఉత్కళ బ్రాహ్మణులనగా ఒరిస్సా బ్రాహ్మణులు. వారిలో ఈ క్రింది వర్గాలు కలవు.

1. శాసని బ్రాహ్మణులు 2. శ్రోత్రియ బ్రాహ్మణులు 3. పాండా బ్రాహ్మణులు 4.ఘాటియా బ్రాహ్మణులు 5. మహాస్థాన బ్రాహ్మణులు 6. కళింగ బ్రాహ్మణులు

శాసని బ్రాహ్మణులలో ఈ క్రింది వర్గాలు కలవు.

1. సావంతులు 2. మిశ్రాలు 3. నందాలు 4. పటేలు 5. కారాలు 6. ఆచార్యలు 7.శతపస్తిలు 8. బేడీలు 9.సేనాపతిలు 10. పర్ణగ్రాహిలు 11. నిశాంకులు 12. రైనిపతిలు

శ్రోత్రియ బ్రాహ్మణులలో నాలుగు వర్గాలు కలవు. 1. శ్రోత్రియులు 2. సోనార్బినిలు 3. తెలిలు 4. అగ్రభక్షాలు

### V మైథిల్య బ్రాహ్మణులు

పూర్వము మిథిలకు చెందిన వారగుటచే వీరికి మైథిల్య బ్రాహ్మణులని పేరు వచ్చినది. ప్రస్తుతం ఈ ప్రాంతం తిర్హుత్, సారాన్, పూర్ణియ మరియు నేపాల్ పరిసర ప్రాంతాలుగా రూపొందింది.

మైథిల్య బ్రాహ్మణులలో ఈ క్రింది వర్గాలు కలవు.

1. ఓఝాలు 2. ఠాకూర్లు 3. మిశ్రాలు 4. పురాలు 5. శ్రోత్రియులు 6.భూయిహరులు. వీరిలో మిశ్రాలలో క్రింది ఉపశాఖలు కలవు.

1. చంధారీలు 2. రాయులు 3. పరిహస్తలు 4. ఖానాలు 5. కుమారులు

## III

## ఇతర బ్రాహ్మణులు

వింధ్య పర్వతాల దిగువ ప్రాంతాలలో నివసించే బ్రాహ్మణులకు పంచద్రావిడులని, వింధ్య ఎగువ ప్రాంతాలలో ఉండే బ్రాహ్మణులకు పంచగౌడులని పేరు. ఇంకా

విశదీకరించాలంటే దక్షిణ ప్రాంతపు బ్రాహ్మణులు పంచ ద్రవిడులు, ఉత్తర ప్రాంతం వారికి పంచగౌడులని పేరు. అయితే ఈ ద్రవిడ, గౌడ బ్రాహ్మణులలో గల ఉపశాఖల వారు మాత్రమే ఉత్తర దక్షిణ భారతాలలో ఉన్నారు అని భావిస్తే అది అసమంజసం. ఈ విషయంలో పూర్తి అవగాహనకు రావాలంటే ఈ ప్రాంతాలలో నివసించే ఇతర బ్రాహ్మణుల గురించే కాక వారిలో కల ఉపశాఖల గురించి తెలుసు కోవడం ఎంతైనా అవసరం.

## దక్షిణ భారతపు ఇతర బ్రాహ్మణులు

వారు ఈ క్రింది విధంగా ఉన్నారు.

1. కొంకణి బ్రాహ్మణులు[2] 2. హుబులు[3]3 3. గోకర్ణులు[4] 4. హావికులు[5] 5.తుళ్వలు[6] 6. అమ్మకొడగులు[7] 7. నంబూద్రిలు

మలబారు ప్రాంతంలో నివసించే బ్రాహ్మణులకు నంబూద్రిలని పేరు. వీరితో పాటుగా అక్కడ నివసించే ఇతర బ్రాహ్మణుల వివరాలు ఈ విధంగా ఉన్నాయి.

1. పొట్టిలు, 2. ముట్టదులు 3. ప్లైదులు 4. రామ్నాడు - రిట్ పరౌశలు 5.పట్టారాలు 7. అంబల్వాసిలు

## ఇతర రాజపుత్ర బ్రాహ్మణులు

గుర్జార బ్రాహ్మణులలో ప్రస్తావించిన రాజపుత్ర బ్రాహ్మణ వర్గాలు ఈ క్రింది విధంగా ఉన్నాయి.

1. శ్రీమాలి బ్రాహ్మణులు 2. సచోడ బ్రాహ్మణులు 3. పల్లివాలా బ్రాహ్మణులు 4.నందనాస్ బ్రాహ్మణులు 5. పుష్కర బ్రాహ్మణులు 6. ఫోఖార్ సేవక బ్రాహ్మణులు 7.మేధాతవాలాలు 8. పరిఖ బ్రాహ్మణులు 9. లావణ బ్రాహ్మణులు 10. డకోటా బ్రాహ్మణులు 11. గరుడియా బ్రాహ్మణులు 12. ఆచార్యులు 13. బూర బ్రాహ్మణులు 14. కపిదులు 15. దహిమాలు 16.ఖండేవాలాలు 17. దివాలు 18. శిఖవాదులు 19.చమత్వాలాలు 20. మారుస్ 21. శ్రీవంతలు 22. అభిరులు 23. భారతనాస్ 24.సనకాదులు 25. వాగడిలు 26. మేవాడలు 27. రాజగురులు 28. భటాలు 29.చరనాలు

**పాదసూచికలు :**

1. కాశ్మీరు బ్రాహ్మణులు సారస్వతులా కాదా అనే వివాదం ఉంది.

2. గోవాలోని పోర్చుగీసు ప్రాంతాలలో నివసించే వారిని కొంకణి బ్రాహ్మణులని అంటారు. మహారాష్ట్రకు చెందిన కొంకనాస్థుల

3. వీరు కార్వారు చెందిన వారు.

4. వీరు ..... కుచెందిన వారు (రాతప్రతిలో స్థలం రాయబడలేదు - సం)

5. తెలిచ్చేరి సమీప ప్రాంతాలకు చెందినవారు.

6. ఉడిపి సమీపంలో నివసించెదరు.

7. కూర్గ్‌లో నివసించువారు.

అనువాదం : జి. భద్రు

# మూడవ పుస్తకం

# రాజకీయం

రాజకీయ అంశాలకు సంబంధించిన ఏడు అముద్రిత వ్యాసాలను ఈ పుస్తకంలో 'రాజకీయం' అనే విభాగం క్రింద చేర్చడం జరిగింది.

సంపాదకులు

అధ్యాయం –20

# లక్షలనుండి భిన్నాంకాలకు

**I. చాలాకాలంపాటు తెలియని అస్పృశ్యుల జనాభా II.1911 జనాభా లెక్కలసేకరణ ప్రత్యేక గణింపునకు మొదటి ప్రయత్నం III. 1911 జనాభా లెక్కల నిర్ధారణల ధృవీకరణ IV. లోథియన్ కమిటీ, 'అస్పృశ్యులు లేరు' అనే హిందువుల గలాభా V. గలాభాకు గల కారణాలు VI. వెనుకబడిన తరగతుల/ముస్లింల వైఖరి.**

## I

భారతదేశంలో అస్పృశ్యుల మొత్తం జనాభా ఎంత? వాళ్ళపట్ల శ్రద్ధ ఉండి వాళ్ళ గురించి తెలుసుకొనగోరే వారంతా తప్పనిసరిగా మొట్టమొదట అడిగే ప్రశ్న ఇదే. ఇప్పుడు ఇది సులభంగా జవాబు చెప్పగల ప్రశ్న. 1931లో సేకరించిన జనాభా లెక్కలననుసరించి అది 50 మిలియన్లు (ఐదుకోట్లు). ఇప్పుడు ఖచ్చితంగా భారతదేశంలో అస్పృశ్యుల జనాభా ఇంత అని చెప్పడం చాలా వరకు సాధ్యమే. కాని ఇంతకు ముందు చాలాకాలం పాటు ఇది సాధ్యం కాలేదు.

ఇలా సాధ్యంకాకపోడానికి కారణాలెన్నో ఉన్నవి. మొదట, అస్పృశ్యత అనేది చట్టబద్ధమైన (legal)పదం కాదు. అస్పృశ్యతకు ఖచ్చితమైన, చట్టబద్ధమైన నిర్వచనంలేదు. కాబట్టి ఫలానావాడు అస్పృశ్యుడు, ఫలానావాడు కాదు అని నిర్ధారించడం సాధ్యం కాదు. అస్పృశ్యత అనేది ఒక సామాజిక భావన. అది సామాజిక ఆచారం లో భాగమై పోయింది. ఆచారంవలె అస్పృశ్యత కూడా ఎన్నో తేడాలతో ఆచరింపబడుతున్నది. ఫలితంగా, గణిత పూర్వక ఖచ్చితత్వంలో అస్పృశ్యుల జనాభా ఇంత అని తెలియచేయడం కొంచెం కష్టమైన[illegible]. రెండవది, హిందూ ఉన్నత కులాలవారు కులాల వారీ జనాభా లెక్కల సేకరణను మొదటి నుండి ఎప్పుడూ తీవ్రంగా వ్యతిరేకిస్తున్నారు. జనాభాను కులాలుగా, తెగలుగా వర్గీకరించడాన్ని వ్యతిరేకించడానికి, జనాభా లెక్కల సేకరణ ప్రశ్నావళిలో కులాన్ని తెలియపరిచే ప్రశ్నను తొలగించాలని వీళ్ళు పట్టు బట్టారు. 1901 జనాభా లెక్కల సేకరణ సమయంలో దీని కోసం ఒక ప్రతిపాదన చేయడం జరిగింది.

జనాభాలోని కులాలు, తెగలలో దీర్ఘకాలిక విరామంతో ఎన్నో మార్పులు వస్తున్నవి, కాబట్టి పది సంవత్సరాలకోసారి వీటికి సంబంధించిన లెక్కలు సేకరించాల్సిన అవసరం లేదనే వాదనే ఈ ప్రతిపాదనకు ప్రాతిపదిక.

ఈ అభ్యంతరాలు జనాభా లెక్కల సేకరణ కమీషనర్ పై ఎలాంటి ప్రభావం చూపలేదు. జనాభా లెక్కల కమీషనర్ అభిప్రాయంలో కులాల వారీ గణింపు ఎంతో ముఖ్యమైనది, అవసరం కూడా. జనాభా లెక్కల కమీషనర్ ఈ విధంగా వాదించారు.

"ఒక సమాజిక సంస్థగా కులానికున్న ప్రయోజనాలు, ఆ ప్రయోజనాలను గురించి అభిప్రాయాలేమి వున్నా భారతదేశంలో జనాభా సమస్యపై జరిగే ఉపయోగకరమైన చర్చను కులం అనే మౌలిక అంశ ప్రాముఖ్యతను గుర్తించకుండా భావించడం సాధ్యంకాదు. భారత సామాజిక నిర్మాణానికి ఇప్పటికీ కులమే పునాది. భారత సమాజంలో వివిధ అంతరాలలో జరిగే మార్పులకు కులాలకు సంబంధించిన సమాచారం ఉత్తమమైన మార్గదర్శిని. ప్రతీ హిందువు (ఈ పదాన్ని విస్తృతార్థంలో ఉపయోగించనైనది) ఒక కులంలో జన్మిస్తాడు. మతపరమైన, సామాజిక, ఆర్థిక, గృహస్థజీవనంతో పాటు ఊయల నుండి స్మశానం దాక ఉండే జీవిత విషయాలన్నిటిని అతని కులమే నిర్ణయిస్తుంది. పాశ్చాత్యదేశాల్లో సమాజంలోని అంతరాలను నిర్ణయించే కారకాలు (Factors) -సంపద, విద్య, వృత్తి మొదలైనవి.కాథలిక్కు మతస్థులు పుట్టుకతో వచ్చిన పరిమితులను, వంశపారంపర్యంగా వచ్చిన స్థానాన్ని మార్చుకొనే ధోరణి ఉన్నది. కాని భారత దేశంలో ఒక వ్యక్తికి చెందిన ఆధ్యాత్మిక, సామాజిక సమూహం (Social community) సాంప్రదాయ వృత్తి, మిగతా కారకాలన్నింటిని అధిగమిస్తాయి. ఈ విధంగా పాశ్చాత్య దేశాల్లోని జనాభా లెక్కల్లో వృత్తి లేదా ఆర్థికపరమైన వర్గీకరణ జన సంఖ్యాశాస్త్ర గణాంకాలతో కలవడానికి పునాదిగా ఉపకరిస్తుంది. అయితే భారతదేశజనాభాలో దీనికి సమాన అను రూపప్రాతిపదిక మతాన్ని, కులాన్ని వేరు పరచడం. కులాన్ని జాతీయ, సామాజిక సంస్థగా భావించినప్పటికీ, ఏ దృష్టితో చూసినప్పటికీ దాన్ని అలక్ష్యం చేయడం నిరుపయోగమే. ఎంతవరకైతే కులం వ్యక్తిగత, అధికారిక, సామాజిక గుర్తింపునకు ప్రముఖమైన లక్షణంగా కొనసాగుతుందో అంతవరకు పది సంవత్సరాల కోసారి జరిగే జనగణన దాని నిరంతరతకుతోడ్పడుతుందని అనుకోవడానికి వీల్లేదు".

1911 జనాభా లెక్కల సేకరణ సమయంలో కొన్ని పరీక్షలకు, నిబంధనలకు లోనయి కులాలను వర్గీకరించడం కోసం ప్రశ్నావళిని జారీ చేసినపుడు అభ్యంతరాలు మరింత శక్తివంతంగా ముందుకొచ్చినవి. ఈ పరీక్షలు అణిచి వేయబడ్డవర్గాలను హిందుకులాల నుండి దూరం చేసాయనడంలో సందేహం లేదు. ముస్లింలు రాజ్య కార్యదర్శికి (Secretary of State) ఇచ్చిన విజ్ఞప్తి ఫలితంగా ఈ ప్రకటన జారీ చేయబడినదని, దీని ఉద్దేశం అణచబడిన వర్గాలను హిందువులనుండి విడదీసి హిందూ సమాజ బలాన్ని,ప్రాముఖ్యతను తగ్గించడమని హిందూఉన్నత కులాలవారు భయపడ్డారు.

ఈ ఆందోళన వల్ల ఫలిత మేమీరాలేదు. పది పరీక్షలకు నిలిచిన కులాలను ప్రత్యేకంగా గణనలోకి తీసుకోవడం జరిగింది. ఏమైనప్పటికి ఆందోళన మాత్రం పూర్తిగా చావలేదు. మళ్ళీ అది 1920 జనాభా లెక్కల సేకరణ సందర్భంగా తలెత్తింది. ఈ సారి లాంఛన ప్రాయంగా అభ్యంతరాన్ని ముందుంచడానికి ప్రయత్నం జరిగింది. జనాభాలెక్కల్లో కులాల వారీ విచారణను విమర్శిస్తూ 1920లో సార్వభౌమ శాసన సభలో ఒక తీర్మానాన్ని ఈ కింది ఆధారాలపై ప్రవేశ పెట్టడం జరిగింది. అవి : ఎ) కులవ్యవస్థను అధికారిక చర్య ద్వారా గుర్తించి దానికి శాశ్వతత్వం కలిగించడం అవాంఛనీయం. బి) నిమ్నకులాల వాళ్ళు దీన్ని అవకాశంగా తీసుకొని ఉన్నత హోదా కలిగిన వర్గాలకు చెందిన వారమని చెప్పుకోవచ్చు కాబట్టి దీనివల్ల వచ్చే సమాచారం ఖచ్చితంగా ఉండదు, నిరుపయోగమైనది కూడా. ఒక వేళ ఈ తీర్మానం ఆమోదించబడి ఉంటే అస్పృశ్యుల జనాభాను తెలుసుకోవడం సాధ్యంకాక పోయి ఉండేది. అదృష్టవశాత్తు ఈ తీర్మానాన్ని ప్రవేశపెట్టేవాడు గైరు హాజరు కావడం వల్ల తీర్మానం చర్చకు రాలేదు. 1921 జనాభా లెక్కల కమీషనరు నిరభ్యంతరంగా యధా విధిగా తన విచారణ కొనసాగించినాడు.

మూడవది, 1911 సంవత్సరానికి ముందు ఏ జనాభా లెక్కల కమీషనరు కూడా అస్పృశ్యుల ప్రత్యేకగణనకు ప్రయత్నించలేదు. భారతదేశంలో మొట్టమొదటి జనాభా లెక్కల సేకరణ 1881 లో జరిగింది. అన్ని కులాల, జాతుల పట్టీ రూపొందించి, లెక్కించి భారత దేశ మొత్తం జనాభా సంఖ్యను చెప్పడం తప్ప 1881 జనాభా లెక్కలు చేసిందేమీ లేదు. ఇది హిందుకులాలలను ఉచ్చ, నిమ్న కులాలుగా, స్పృశ్య, అస్పృశ్య కులాలుగా వర్గీకరించడానికి ప్రయత్నం చేయలేదు. భారతదేశ రెండవ జనాభా లెక్కల సేకరణ

1891 లో జరిగింది. ఈసారి జనాభా లెక్కల కమీషనరు మొదటి సారిగా జనాభాను కులాలు, జాతులు, శ్రేణులుగా వర్గీకరించడానికి ప్రయత్నించడం జరిగింది.

1901లో మూడవ సారి భారతదేశంలో జనాభా లెక్కల సేకరణ జరిగింది. ఈసారి ఒక నూతన వర్గీకరణ సూత్రాన్ని పాటించడం జరిగింది, అది "దేశస్థుల అభిప్రాయం ప్రకారం సామాజిక అగ్రగామిత్వం ఏకులానిదని గుర్తిస్తారో దాని ప్రకారం వర్గీకరణ". సమానత్వాన్ని గుర్తించని సామాజికవ్యవస్థ ఉచ్చ, నిమ్నాలుగా వర్గీకరించబడిన హిందు సమాజంలాంటి సమాజానికి ఈ సూత్రం సరి అయినదే. సామాజిక అగ్రగామిత్వం అనే సూత్రం తప్ప ఏది కూడా స్వీకృతంగానో లేదా అవ్యక్తంగానో కుల ప్రాతిపదికపై వ్యవస్థీకరింపబడి ఉన్న భారత సామాజిక జీవనాన్ని స్పష్టంగా చిత్రీకరించి మరింత విశదపరచజాలదు.

# II

1911 జనాభా లెక్కల కమీషనర్ ఉద్దేశపూర్వకంగా, నిశ్చితమైన పద్ధతిలో అస్పృశ్యుల జనాభా లెక్కలు సేకరించడానికి మొదటి ప్రయత్నం చేసినాడు.

1911 జనాభా లెక్కల కాలాన్ని తక్షణం అంటుకొని ఉన్న ముందుకాలం మార్లే-మింటో సంస్కరణలు జరిగిన కాలం. భారతదేశ మహమ్మదీయులు ప్రత్యేక నియోజక వర్గాల ద్వారా తమకు చట్ట సభల్లో తగినంత ప్రాతినిధ్యముండాలనే ఆందోళన మొదలు పెట్టిన కాలం అది. వారి ప్రచారంలో భాగంగా మహమ్మదీయులు, అప్పటి భారత రాజ్యకార్యదర్శి అయిన మోర్లే ప్రభువు వచ్చేదాకా ఆగి, 1909, 27 జనవరి న అతనికి ఒక విజ్ఞాపన పత్రం అందచేసినారు. ఆ విజ్ఞాప్తిలో ఈ కింది ప్రకటన ఉన్నది.

(ఈ ప్రకటన వ్రాతప్రతిలో రికార్డు చేయబడలేదు -

- సంపాదకులు)

1907 లో ముస్లిం ప్రతినిధి వర్గం సమర్పించిన విజ్ఞాపన పత్రంలో అస్పృశ్యుల ప్రస్తావనకు పురి కొల్పిందేమిటి? నాలుగేళ్ళ తరువాత జనాభా లెక్కల అధికార్లకి కలిగిన

చెప్పడం సాధ్యం కాదు. 1911లో జనాభా లెక్కల కమీషనరు అమలు చేయడానికి ప్రతిపాదించిన విషయాలు, తనకు ముందున్న అధికారులు జనాభాను జన సంఖ్యాశాస్త్ర రీత్యా అధ్యయనం చేసే విధానాలచరమావస్థగా రూపొందిన విధానమని మాత్రం భావించడం సాధ్యమవుతుంది. అది అట్లా ఉండనివ్వండి, జనాభాలో అస్పృశ్యులను ప్రత్యేకంగా గణించాలని తన ప్రణాళికను జనాభా లెక్కల కమీషనర్ ప్రకటించిన తక్షణమే హిందువులలో పెద్ద గలాభా రేగింది. జనాభా లెక్కల కమీషనర్ ప్రయత్నం బ్రిటిష్ ప్రభుత్వం, ముస్లింలు కలిసి హిందువులను విభజించి బలహీన పరచాలని పన్నిన కుట్ర ఫలితమని చెప్పడం జరిగింది. ఈ చర్య వెనుకనున్న నిజమైన కోరిక అస్పృశ్యుల జనాభా గురించి తెలుసుకోవడం కాదనీ స్పృశ్యులు, అస్పృశ్యులుగా వేరు పరిచి హిందూసమాజ సంఘీ భావాన్ని విరచడమేనని ఆరోపించారు. హిందువులు దేశమంతా ఎన్నో నిరసన సభలు నిర్వహించి జనాభా లెక్కల కమీషనర్ ప్రణాళికను తీవ్ర పదజాలంతో ఖండించడం జరిగింది.

ఏమైనప్పటికీ జనాభా లెక్కల కమీషనరు ఈ నిరసన తుఫానుకు చలించక తాను రూపొందించుకున్న ప్రణాళికను కొనసాగించడానికే నిశ్చయించుకున్నాడు. అస్పృశ్యుల ప్రత్యేక గణింపునకు తాను రూపొందించుకున్న పని బహుళ నూతనమైనది. హిందువులుగా వర్గీకరించ బడిన కులాలను, జాతులను, ఎవరైతే కొన్ని ప్రమాణాలకు (Standards) అనుగుణంగా లేరో లేదా ఎవరైతేకొన్ని అశక్తతలకు గురిచేయబడ్డారో వారిని- ప్రత్యేకంగా గణించాలని ప్రాంతీయ ప్రభుత్వాల జనాభా లెక్కల అధికారులకు ఆజ్ఞలు జారీ చేయబడినవి.

ఈ క్రింది పరీక్షల ప్రమాణాల ప్రకారం కొన్ని కులాలను, జాతులను ప్రత్యేకంగా గణించారు, ఎవరైతే 1) బ్రాహ్మణుల ఆధిపత్యాన్ని నిరాకరించిన వారు 2) బ్రాహ్మణుల నుండి లేదా గుర్తింపు పొందిన హిందూగురువులనుండి పూజా ఇత్యాది కార్యక్రమాలకు చెందిన మంత్రాలు పొందని వారు 3) వేదాల ఆధిక్యతను నిరాకరించిన వారు 4) హిందు మహా దేవతలను పూజించని వారు 5) మంచి బ్రాహ్మణులచే సేవలు పొందని వారు 6) బ్రాహ్మణ పురోహితులు లేని వారు 7) సాధారణ హిందు దేవాలయాల్లోకి ప్రవేశంలేని వారు 8) మైలను కలిగించేవారు 9) కుటుంబంలో చనిపోయిన సభ్యులను ఖననం చేసేవారు 10) పశుమాంసం తినడం, గోవులను పూజించకపోవడం ఇతరత్రా.

వారు 8) మైలను కలిగించేవారు 9) కుటుంబంలో చనిపోయిన సభ్యులను ఖననం చేసేవారు 10) పశుమాంసం తినడం, గోవులను పూజించకపోవడం ఇతరత్రా.

జనాభా లెక్కల కమీషనర్ నిర్వహించిన దర్యాప్తు ఊహాగానాలకు చోటివ్వకుండా జరిగింది. దాని ఫలితంగా జనాభాలో అస్పృశ్యుల సంఖ్యను కనుగొనగలిగాడు. ఈ క్రింద పేర్కొన్న పట్టిక 1911 జనాభా లెక్కల ననుసరించి ప్రాంతాల వారీగా అస్పృశ్యుల జనాభా వివరాలు తెలియజేస్తుంది.

| ప్రాంతము | మొత్తం జనాభా మిలియన్లలో | అణచబడిన వర్గాల జనాభా మిలియన్లలో | మొత్తం స్థానాల సంఖ్య | అణచబడిన వర్గాలకుచెందిన స్థానాలు |
|---|---|---|---|---|
| మద్రాసు | 39.8 | 6.3 | 120 | 2 |
| బొంబాయి | 19.5 | 0.6 | 113 | 1 |
| బెంగాల్ | 45.0 | 9.9 | 127 | 1 |
| ఐక్యప్రాంతాలు | 47.0 | 10.1 | 120 | 1 |
| పంజాబ్ | 19.5 | 1.7 | 85 | - |
| బీహార్, ఒరిస్సా | 32.4 | 9.3 | 100 | 1 |
| మధ్యప్రాంతాలు | 12.0 | 3.7 | 72 | 1 |
| అస్సాం | 6.0 | 0.3 | 54 | - |
| | 221.2 | 41.9 | 791 | 7 |

(డా॥ బాబాసాహెబ్ అంబేద్కర్ రచనలు, ఉపన్యాసాలు, సంపుటి 2 నుండి ఈ పట్టిక పునర్ముద్రించబడినది. వ్రాతప్రతిలో ఇది రికార్డు చేయ బడలేదు - సం॥)

ఈ ప్రమాణాల; పరీక్షల ప్రముఖ్యతను బయటివాడు గుర్తించకపోవచ్చు. అస్పృశ్యతతో చేయాల్సిన పనేముందని ప్రశ్నించవచ్చు. కాని అస్పృశ్యుల జనాభా సేకరణ అనేసమస్యకున్న ప్రాముఖ్యతను తెలుసుకోవాల్సివుంది. ఇదివరకే చెప్పినట్టు, అస్పృశ్యతకు చట్టబద్ధమైన నిర్వచనమంటూ ఏది లేదు, ఉండబోదు కూడా. అస్పృశ్యత తలమీది వెంట్రుకల ద్వారానో, చర్మపురంగు ద్వారానో వ్యక్తీకరించబడదు. అది రక్తానికి సంబంధించిన విషయమూ కాదు. అస్పృశ్యత అనేది ఆదరించే పద్ధతుల ద్వారా, అనుసరించే ఆచారాల

హిందువులు ఆదరించే పద్ధతికి ఒక నిర్దిష్టత ఉన్నది. అస్పృశ్యులు ఆచరించే ఆచారాలకు కూడా ఒక నిర్దిష్టత ఉన్నది. అట్లయితే, అస్పృశ్యులెవరో తెలుసుకోవాలంటే ఉన్న ఒకే ఒక్క పద్ధతి వారు అనుసరించే పద్ధతులు, ఆచారాలు కొలమానంగా తీసుకొని అవి అనుసరించే సమాజాలను కనుగొనాలి. అంతకు తప్ప వేరే మార్గం లేదు. ఒక వేళ బయటి వాడు గనుక ఈ విషయాన్ని దృష్టిలో ఉంచుకుంటే, జనాభా లెక్కల కమీషనర్ సూచించిన ప్రమాణాలు అస్పృశ్యంగా కనిపించక విషయాన్ని సరిగా అర్థం చేసుకునేందుకు తోడ్పడవనిపించవచ్చు, కాని నిజానికవే అస్పృశ్యతకు గుర్తులు. అనుసరించిన పద్ధతులు సక్రమమైనవే ప్రమాణాలు నిజమైనవే. ఏ విధంగానూ సందేహించాల్సిన పని లేదు. ఫలితంగా, ఈ దర్యాప్తు వల్ల వచ్చిన ఫలితాలు ఎంతో విలువైనవని, ఈ విధంగా తీసిన లెక్కలు ఖచ్చితమైనవని నిస్సందేహంగా చెప్పవచ్చు.

# III

1911 జనాభా లెక్కల్లో కమీషనర్ అస్పృశ్యుల జనాభా గురించి కనుగొన్న విషయాలు 1921 జనాభా లెక్కల కమీషనర్ నిర్ధారించడం జరిగింది.

1921 జనాభా లెక్కల కమీషనర్ కూడా అస్పృశ్యుల జనాభా వివరాల గురించి ప్రత్యేక దర్యాప్తు జరిపించాడు. ఈ నివేదిక మొదటి భాగంలో 1921 జనాభా లెక్కల కమీషనర్ ఈ విధంగా పరిశీలించాడు.

" సమాజంలో కొంత మంది 'అణిచివేయ బడ్డ వర్గమని' మాట్లాడటం ఈ మధ్యకాలంలో మామూలయింది. ఇంతవరకు నాకు తెలిసినంత వరకు ఈ పదానికో అంతిమ నిర్వచనం లేదు, ఈ వర్గం కింద చేరే వాళ్ళెవరో ఖచ్చితంగా చెప్పలేము. విద్యాప్రగతి పంచవర్ష సమీక్ష (1912-17) (ఆధ్యాయము XVIII,పేరా 505) లో - ప్రత్యేకంగా అణిచివేయబడిన వర్గాల విద్యాభివృద్ధి దృష్టినుండి ప్రజలను పరిశీలించడం జరుగుతుందని, XIII వ అనుబంధంలో ఈ వర్గాలకు చెందిన కొన్ని కులాలలను, జాతులను పేర్కొనడం జరిగింది. ఈ విధంగా పేర్కొన్న కులాల జాతుల సంఖ్య 3.1 కోట్లు లేదా బ్రిటిష్ ఇండియా హిందువుల, ఆదివాసుల జనాభాలో 19 శాతం. ఒక బహిరంగ నివేదికలో సామాజికంగా తేడాలు చూపించడం ద్వేషపూరితమనిపించవచ్చు. నిస్సందేహంగా కొంత ప్రమాదం కూడా, కాని ఇదివరకే తయారు చేసిన జాబితాల ప్రకారం, ప్రత్యేకంగా దక్షిణ భారతంలో 'అణిచివేయబడ్డ

దళిత వర్గాలు' కొంతమేరకు వ్యవస్థీకరించబడి వర్గచైతన్యాన్ని పొందినాయి. ఈ దళిత వర్గాలకు ప్రత్యేక మత సంస్థలు సేవ చేస్తున్నవి. లోకోపకార (Philanthropic) సంఘాలచే ఉద్ధరించబడుతున్న దళితులకు అధికారికంగా శాసన సభల్లో ప్రాతినిధ్యం కూడా ఇవ్వబడింది. వీరి గురించి కొన్ని గణాంక వివరాలు సేకరించాలనే సలహా ఆచరించదగినదే. కాబట్టి జనాభా లెక్కలను బట్టి దళితుల్లో చేర్చిన కులాల సంఖ్యను సుమారుగా అంచనా వేయాల్సిందిగా నేను ప్రాంతీయ జనగణన అధికారులకు కోరాను.

"అన్ని ప్రాంతాలనుండి, రాష్ట్రాలనుండి ఒక్క ఐక్యప్రాంతం నుండి తప్ప, జాబితాలు అందినవి. అక్కడి నుండి కనీసం చిత్తు అంచనా అయినా తయారు చేయబడకపోవడానికి కారణం అధికారులు విపరీతంగా సంకోచపడడం. భారత దేశంలోని వివిధ ప్రాంతాల్లో నివసిస్తున్న ఒకే కులం స్థానాన్ని విభిన్న దృష్టితో చూడడం వల్ల అందించిన సంఖ్యాత్మక వివరాలు ఏకరూపమైన ప్రమాణాల్పై ఆధారపడిలేవు. విద్యా నివేదిక అందించిన వివరాలు, 1911 జనాభా నివేదికలో నున్న సమాచారం, పట్టికల ఆధారంగా నేను కొన్ని విషయాలు మార్చాల్సి వచ్చింది. ఇవి కూడా మొదట వివరించినట్టు సాధారణ లోపానికి గురి అయినట్టివే. ఎందుకంటే ఏ కులానికి చెందిన పూర్తి జనాభా కూడా రికార్డు చేయబడలేదు. ఒక మోతాదుగా ఇచ్చిన ఈ ప్రకటన హిందూ సమాజంలోని దళిత వర్గాల కనీస సంఖ్యను చిత్తు అంచనాగా తెలియజేస్తుంది. అన్ని ప్రాంతాల నుండి వచ్చిన వివరాలను కలిపితే మొత్తం 5.3 కోట్లు. 1) అన్ని జాతుల, కులాల మొత్తం సంఖ్యను 2) ఈ మధ్యకాలంలో హిందువుల్లోకి చేర్చబడిన ఆదిమతెగల వాళ్ళను - వీరిలో చాలా మందిని భ్రష్టులుగానే గుర్తిస్తారు- వీళ్ళందరిని ఈ సంఖ్యలో చేర్చలేదు కాబట్టి, దీన్ని తక్కువ అంచనాగా గుర్తించాల్సిందే. భారతదేశంలో ఇప్పటికి భ్రష్టులుగా గుర్తింపబడే ఈ దళిత వర్గాల జనాభా 5.5 లేదా 6 కోట్లని నమ్మకంగా చెప్పవచ్చు".

ఆ తరువాత 1919 భారతప్రభుత్వ చట్టం ద్వారా ప్రవేశ పెట్టబడిన సంస్కరణలు పని చేసే తీరును పరీక్షించి, మరిన్ని సంస్కరణలు సూచించడానికి 1929లో బ్రిటిష్ పార్లమెంట్‌చే నియమించబడ్డ సైమన్ కమీషన్ వచ్చింది.

1919 చట్టంలో భాగంగా వచ్చిన సంస్కరణలు చర్చించబడుతున్న కాలంలో, మాంటేగ్ - చెమ్స్‌ఫర్డ్ నివేదిక రాసిన రచయితలు అస్పృశ్యుల సమస్యను గుర్తించి చట్ట సభల్లో వారి ప్రాతినిధ్యానికి తగినన్ని చర్యలు తీసుకోవాలని సూచించినారు. కాని

సౌత్ బరో ప్రభువు అధ్యక్షతన ఎన్నికల విధానం, ఓటింగ్ పద్ధతులకు రూపకల్పన చేయడానికి నియమించబడ్డ సంఘం వీటిని పూర్తిగా నిర్లక్ష్యం చేసింది. భారత ప్రభుత్వం ఈ ధోరణిని ఆమోదించక ఈ కింది విధంగా వ్యాఖ్యానించింది:

"అస్పృశ్యులు మొత్తం జనాభాలో ఐదింట ఒక వంతు. వీళ్ళకు మార్లే - మింటో కౌన్సిళ్ళలో ప్రాతినిధ్యం లేదు. సంతృప్తికరమైన ఎన్నిక విధానం లేకపోతే దళిత వర్గాల ప్రతినిధులను నామినేట్ చేయవచ్చునని మాత్రమే ఈ నివేదిక రెండుసార్లు పేర్కొన్నది. ఇందులో వాళ్ళ స్థానం, వాళ్ళ విషయాలను వాళ్ళు చూసుకోగల శక్తి గురించి చర్చ ఎక్కడా లేదు. వాళ్ళను ఏ విధంగా ఎంత మంది నామినేట్ చేయాలో కూడా వివరించబడలేదు. వాళ్ళు ప్రతిపాదించే ప్రాతినిధ్యం.... బ్రిటిష్ ఇండియా మొత్తం జనాభాలో ఐదింట ఒక వంతు అంటే మొత్తం ఎనిమిది వందల స్థానాల్లో ఏడు స్థానాలు కేటాయించాలని అర్థం. నిజానికి అన్ని కౌన్సిళ్ళలో నున్న ఆరింట ఒక వంతు అధికారులు అస్పృశ్యుల ప్రయోజనాలు తమ దృష్టిలో ఉంచుకోవాలని అనుకోవడం జరిగింది. కాని మా అభిప్రాయంలో ఆ సర్దుబాటు సరికాదు. సంస్కరణలపై ప్రవేశపెట్టిన నివేదిక ఉద్దేశం కూడా అది కాదు. అస్పృశ్యులు తమ స్వీయ రక్షణ కోసం తగిన పాఠాలు నేర్చుకోవాలని రచయితలు అభిప్రాయ పడ్డారు. అరవై లేదా డెబ్బై మంది హిందు కులస్థులున్న చట్ట సభలో ఒక్కరిని చేర్చుకోవాలని ఆశించడం ఆశ్చర్యకరమైన విషయమే. నివేదిక మంచి ఫలితాలు అందించాలంటే బహిష్కృత కులాలను మనం మరింత ఎక్కువ దానశీలతతో ఆదరించాల్సిందే".

కమిటీ అస్పృశ్యులకు కేటాయించిన స్థానాలు రెండింతలు చేయాలని ప్రభుత్వం సిఫార్సు చేసింది. ఆ ప్రకారం ఏడు స్థానాలు 14 కు పెంచబడినాయి. భారత ప్రభుత్వ దానశీలత ఆచరణ కొచ్చేసరికి పెద్దగా అగుపించలేదు. అస్పృశ్యులకు న్యాయంగా రావాల్సింది ఇవ్వలేదు.

1919లో సక్రమంగా పరిష్కరించకుండా మిగిలిపోయిన సమస్యలో అస్పృశ్యులదొకటి, అది సైమన్ కమీషన్ ముందు తప్పక మళ్ళీ ప్రత్యక్షమవుతుంది. ఈ సమస్య అప్పటి భారత దేశ రాజ్యకార్యదర్శి అయిన కీ॥శే॥ బిర్కెన్ హెడ్ ప్రభువు దృష్టికి పోగా ఊహించనంత ప్రాముఖ్యతను సంతరించుకొన్నది. సైమన్ కమీషన్ నియమించబడడానికి కొద్దిరోజుల ముందు ఒక ఉపన్యాసంలో ఇలా అన్నారు: .........

.............................. (రాతప్రతిలో ఇలాగే ఖాళీగా విడిచివేయబడింది - సం॥) ।
సహజంగా సైమన్ కమీషన్‌కు ఈ సమస్య ప్రత్యేకమైన పని అయింది. ప్రాతినిధ్యం కల్పించాలనే విధంగా ఈ సమస్య విజ్ఞప్తి చేయబడినప్పటికీ, మౌలికంగా ఇది అస్పృశ్యుల గురించి తెలుసుకోవాల్సిన రాజకీయ సమస్య. ఎందుకంటే, ఎంతవరకైతే వీరి జనాభాను తెలుసుకోలేమో అంతవరకు చట్టసభల్లో వీరి ప్రాతినిధ్యపు సమస్యను పరిష్కరించలేము.

కాబట్టి సైమన్ కమీషన్ అస్పృశ్యుల జనాభా గురించి శోధనాత్మకంగా విచారణ జరపాల్సి ఉంటుంది తమ ప్రాంతాల్లో నివసించే అస్పృశ్యుల జనాభా వివరాలు పంపించమని ఈ కమీషన్ ప్రాంతీయ ప్రభుత్వాలను ఆదేశించింది. ఆ వివరాలను అందచేయడానికి ప్రాంతీయ ప్రభుత్వాలు ప్రత్యేక శ్రద్ధ తీసుకొన్నవి. కాబట్టి అస్పృశ్యుల జనాభా వివరాలు తెలియచేసే సంఖ్యల ఖచ్చితత్వం గురించి సమస్యలేదు. ఈ కింద ఇచ్చిన పట్టిక సైమన్ కమీషన్, సౌత్‌బరో కమిటీ కనుగొన్న వివరాల ఆధారంగా అస్పృశ్యుల జనాభా లెక్కలు తెలియచేస్తుంది. (రాత ప్రతిలో పట్టిక ఇవ్వలేదు - సం॥)

# IV

ఈ విధంగా అస్పృశ్యుల జనాభా 50 మిలియన్లని అంచనావేయడం స్పష్టమే. 1911 జనాభా లెక్కల కమీషనర్ ఈ అస్పృశ్యుల జనాభాను కనుగొంటే దాన్ని 1921లో వచ్చిన జనాభా లెక్కల కమీషనర్, 1929లో వచ్చిన సైమన్ కమీషన్ నిర్ధారించడం జరిగింది. ఈ విధంగా రికార్డులో నిలిచిన వాస్తవాన్ని ఇర్వై సంవత్సరాలలో హిందువు లెప్పుడూ సవాల్ చేయలేదు. సైమన్ కమీషన్‌తో సహకరించడానికి కేంద్ర శాసన సభ, ప్రాంతీయ శాసన సభలచే నియమించబడ్డ వివిధ కమిటీల నివేదికల ఆధారంగా హిందువుల దృష్టిని తెలుసుకోవచ్చు, ఈ సంఖ్యను వాళ్ళు ఆక్షేపణ లేవీ లేకుండా నిస్సందేహంగా ఒప్పుకోవడం జరిగింది.

1932లో ఆకస్మికంగా లోధియన్ కమిటీ వచ్చి తన శోధన ప్రారంభించినపుడు హిందువులు దాన్ని సవాల్‌గా స్వీకరించి ఈ సంఖ్యను అంగీకరించ నిరాకరించినారు. కొన్ని ప్రాంతాల్లో హిందువులు అసలు అస్పృశ్యులే లేరని అనేంత దూరం పోయినారు. ఈ సంఘటన హిందువుల మనస్తత్వాన్ని తెలియజేస్తుంది కాబట్టి దీని గురించి ఇంకా కొన్ని వివరాలు చెప్పాల్సి ఉంది.

భారత రౌండ్ టేబుల్ సమావేశం నియమించిన వయోజన ఓటు హక్కు ఉపసంఘం సిఫారసుల కనుగుణంగా లోధియన్ కమిటీని నియమించడం జరిగింది. ఒక్క మధ్య ప్రాంతాలు, అస్సాం తప్ప ఈ కమిటీ అన్ని ప్రాంతాలు సందర్శించింది. భారతదేశమంతా పర్యటించింది. ఈ కమిటీతో సహకరించడానికి ప్రాంతీయ ప్రభుత్వాలు ఆయా ప్రాంతాల్లోని వివిధ రాజకీయ ప్రయోజనాలకు చెందిన రాజకీయ నాయకులతో కూడిన ప్రాంతీయ సంఘాలు ఏర్పాటు చేయడం జరిగింది. అనధికార సభ్యులు అధ్యక్షులుగా, ప్రాంతీయ కౌన్సిళ్ళ లోని సభ్యులు ప్రాంతీయ కమిటీల్లో సభ్యులుగా నియమించబడ్డారు. చర్చను కేంద్రీకరించే దృష్టితో, భారత వయోజన ఓటు హక్కు కమిటీ తను విచారణ చేపట్టాల్సిన అంశాల్లో భాగంగా ఒక ప్రశ్నావళిని జారీ చేసింది. వయోజన ఓటు హక్కు కమిటీ ఈ ఏర్పరిచిన నియమావళి ప్రకారము, ప్రాంతీయ ప్రభుత్వాలు ప్రశ్నావళిలో రేకెత్తించిన అంశాలపై తమ స్వంత అభిప్రాయాలను రూపొందించుకొని కమిటీతో చర్చించాలి. ప్రాంతీయ కమిటీలు ఈ కమిటీకి అధికారిక సలహాదారులు కాబట్టి స్వతంత్రంగా తమ అభిప్రాయాలు రూపొందించుకొని, తమ వివేచననుసరించి రాత పూర్వక ప్రకటనల ఆధారంగా సాక్ష్యాలను ప్రాథమిక పరీక్షకు గురి చేయవచ్చు. భారత వయోజన ఓటు హక్కు కమిటీ నివేదిక సవివరమైన పరిశోధన పై అధారపడినట్లు చెప్పవచ్చు.

భారత వయోజన ఓటు హక్కు కమిటీ అధ్యక్షుడైన లోధియన్ ప్రభువుకు ప్రధానమంత్రి రాసిన ఆదేశ పూర్వక ఉత్తరంలో కమిటీలకి చెందిన నియమ నిబంధనలు, ప్రవర్తనావళి గురించిన పరిశీలన ఈ కింది విధంగా ఉన్నది.

"సభ (భారత రౌండ్ టేబుల్) లో వివిధ సందర్భాల్లో జరిగిన చర్చల ను బట్టి కొత్తరాజ్యాంగము అణిచివేయబడ్డ వర్గాలకు పేర్లను సూచించడం ద్వారా ప్రాతినిధ్యమివ్వడమనేది సరి అయిన పద్ధతి కాదని స్పష్టమైపోయింది. అణిచివేయబడ్డ వర్గాలకు ఎన్నికల్లో ప్రత్యేక నియోజకవర్గాల ఏర్పాటు చేయాలనే విషయంపై అభిప్రాయ భేదమున్న విషయం మీకిదివరకే తెలుసు. అణిచివేయబడ్డ వర్గాల స్థితిని సూచించే విధంగా మీ కమిటీ చేసే పరిశోధన ఈ విషయంపై నిర్ణయం తీసుకోవడానికి ఉపకరించాలి. అందరికీ ఓటు హక్కు అందించడం ద్వారా సాధారణ నియోజక వర్గాల్లో ఓటు చేసే హక్కు మీరు సిఫారసు చేయవచ్చుకూడా. మరో పక్క, అణిచవేయబడ్డ వర్గాల కోసం

ప్రత్యేక నియోజక వర్గాలు కల్పించడానికి నిర్ణయించాలా లేక ఆయా ప్రాంతాల్లో జనాభాలో వారిని ప్రత్యేక అంశంగా గుర్తించాలా? అందరికీ ఓటు హక్కు కల్పించాలనే సాధారణ సమస్యపై మీ కమిటీ చేస్తున్న విచారణ, అణిచివేయబడుతున్న వర్గాలకు ప్రత్యేక ప్రాతినిధ్యం కల్పించే పద్ధతికి సంబంధించిన వాస్తవాలు కలిగి ఉండాలి".

దీని ప్రకారం, భారత ఓటు హక్కు కమిటీ జారీ చేసిన ప్రశ్నావళిలో ఈ కింద పేర్కొన్న ప్రశ్నను చేర్చడం జరిగింది.

"అణిచివేయబడ్డ వర్గాలలో ఏ కులాలను చేర్చుతారు? అస్పృశ్యులనుగాక ఇతర కులాలను కూడా చేర్చుతారా? అయితే అవి ఏవి?"

భారత ఓటు హక్కు కమిటీలో నేను సభ్యుడిని. నేను సభ్యుడినయినపుడు అస్పృశ్యులకు ప్రత్యేకమా లేక ఉమ్మడి నియోజక వర్గాలా? అనే సమస్యపై హిందూకులాలతో ఘర్షించాల్సి వస్తుందని నాకు ముందే తెలుసు. భారత ఓటు హక్కు కమిటీలో ఉన్న వాళ్ళకు వ్యతిరేకంగా ఎక్కువ కష్టాలొస్తాయని నాకు తెలుసు. హిందూ కులాలనుండి వచ్చిన అరడజను సభ్యుల్లో నేనొక్కణ్ణే అస్పృశ్యుల ప్రతినిధిని. అటువంటి అసమ ఘర్షణకు వ్యతిరేకంగా, భారత ఓటు హక్కు కమిటీలో సభ్యత్వం ఒప్పుకోవడానికి ముందే నాకు నేనుగా సిద్ధపడ్డాను. అస్పృశ్యులకు ప్రత్యేక నియోజకవర్గాలు ఉండాలా? వద్దా? అన్నది కమిటీ విచారణనిబంధనల్లో భాగం కారాదని మొదటే నేను స్పష్టం చేసాను. దీన్ని అంగీకరించి ఈ సమస్యను భారత ఓటు హక్కు కమిటీ నుండి తొలగించడం జరిగింది. ఈ సమస్యపై కమిటీలో నేను ఓడిపోతాననే భయం లేదు. ఈ వ్యూహానికి హిందూ సభ్యులు నన్ను క్షమించలేదు. కాని అక్కడ మరో ఊహించని సమస్య తలెత్తింది, దాన్ని అంగీకరించక తప్పలేదు. అంటే సంఖ్య గురించి అని నా భావన. 1911-1929 మధ్యకాలంలో నాలుగు వివిధ అధికారిక సంఘాలు పరీక్షించి కనుగొన్న అస్పృశ్యుల జనాభా దాదాపు ఐదుకోట్లు భారత ఓటు హక్కు కమిటీలో ఈ సమస్యపై ఎటువంటి భేదాభిప్రాయముంటుందని నేనూహించలేదు.

ఇది మీకాశ్చర్యం కల్గించవచ్చు. భారత ఓటు హక్కు కమిటీ ముందు సంఖ్య గురించి తీవ్రంగా, క్రూరమైన పద్ధతిలో ఘర్షణపడాల్సి వచ్చింది. కమిటీ తరువాత కమిటీ, సాక్ష్యం తరువాత సాక్ష్యం అస్పృశ్యుల ఉనికి నిరాకరించడానికి ముందుకు రావడం జరిగింది.

ఈ విధమైన దిగ్భ్రమ పరిచే సాదృశ్యాన్ని కమిటీలో నే నెదుర్కోవాల్సి వచ్చింది. అస్పృశ్యులనబడే వర్గపు ఉనికిని నిరాకరిస్తూ వ్యక్తిగత సాక్షులిచ్చిన ప్రకటనలిక్కడ ప్రస్తావించడం సాధ్యంకాదు. ప్రాంతీయ ఓటు హక్కు కమిటీలో అస్పృశ్యుల జనాభా విషయానికి సంబంధించిన సభ్యుల అభిప్రాయాలను ఇక్కడ పేర్కొనడం ద్వారా నా అభిప్రాయాన్ని తెలియచేస్తే చాలు.

# పంజాబ్

## పంజాబ్ ప్రభుత్వ అభిప్రాయం:

"పంజాబ్ ప్రభుత్వ అభిప్రాయం ప్రకారం, కౌలుదార్లకు ఓటు హక్కునిచ్చినట్లయితే అది అణిచివేయబడ్డ వర్గాల్లో చాలామందికి చెందినట్టే. అది ప్రాంతీయ కౌన్సిళ్ళకు ప్రతినిధుల నెన్నుకోవడంలో వాళ్ళ పలుకుబడిని కొంత మేరకు పెంచగలుగుతుంది"[1]

"అణిచివేయబడ్డ వర్గాల విషయానికొస్తే, పంజాబ్‌లో ఈ వర్గాల సమస్య అంత తీవ్రమైనది కాదని, కౌలుదార్ల ద్వారా వీరికి కొంత ప్రాతినిధ్యం లభిస్తుందన్న, విజ్ఞాపన పత్రం పేరా 25లో భారత ప్రభుత్వ చట్టబద్ధ కమీషన్ సిఫారసుల ఆధారంగా ప్రభుత్వ అధికారిక సభ్యులు వ్యక్తంచేసిన అభిప్రాయాలతో పంజాబ్ ప్రభుత్వం విడిపోవడానికి కారణమేమిలేదు"[2]

## పంజాబ్ ప్రాంతీయ ఓటు హక్కు కమిటీ అభిప్రాయం:

" కె.బి. దిన్ మహమ్మద్, హన్స్‌రాజ్‌ల (వీరిద్దరు కమిటీలో అస్పృశ్యులకు ప్రాతినిధ్యం వహించారు) అభిప్రాయం ప్రకారం, ముస్లింలలో అణిచివేయబడ్డ వర్గాలు లేరు. హిందువుల్లో, సిక్కుల్లో అణిచివేతకు గురి అయిన కులాలున్నవి...... వారి మొత్తం సంఖ్య 13, 10, 709. హన్స్ రాజ్ దృష్టిలో ఇది అసంపూర్ణమైన జాబితా".

"వీరి అభిప్రాయం ప్రకారం, అణిచివేతకు గురి అయిన వర్గాలను ప్రత్యేక సమాజంగా గుర్తించి వారి ప్రత్యేక ప్రాతినిధ్యం కోసం ఒక నిబంధన కల్పించాలి నాజర్ హుస్సేన్, రాజబహద్దూర్ చౌదరి, చోటు రామ్, ఓన్ రాబర్ట్స్, కె.బి. మహ్మద్ హయత్, ఖురేషి, చటర్జీ, సర్దార్ బూటాసింగ్, పండిట్ నానక్ చంద్‌ల అభిప్రాయాన్నిఅనుసరించి, ఏ వ్యక్తి మతపరమైన హక్కుల తగ్గుదల దృష్ట్యా, పంజాబ్‌లో అణిచివేయ బడ్డ

వర్గాలున్నవని చెప్పడం సాధ్యం కాదు. అధ్యక్షుడు పండిట్ నానక్ చంద్, సర్దార్ బూటాసింగ్ ల అభిప్రాయం ప్రకారం, దక్షిణ భారతంలో తప్ప అణిచివేయబడ్డ వర్గాలు పంజాబ్‌లో లేవు. కాని గ్రామాల్లో కొన్ని వర్గాల ప్రజలు ఖచ్చితంగా సామాజికంగా, ఆర్థికంగా హీన స్థానంలో ఉన్నారు. హిందువుల్లోని చర్మకారులు (Chamar) ముస్లింల్లోని మోచీ పనివాళ్ళకు తేడా చూడటం సాధ్యంకాదు. వాళ్ళో ప్రత్యేక వర్గమని భావించరు".[3]

ఈ విధంగా పంజాబ్ ప్రాంతీయ ప్రభుత్వం ఈ ప్రశ్నకు సమాధానమివ్వడాన్ని దాటవేసింది. పంజాబ్ ప్రాంతీయ కమిటీ మెజార్టితో అస్పృశ్యులు లేదా అణిచివేయబడ్డ వారు ఉన్నారనే విషయాన్ని నిరాకరించింది.

## ఐక్య ప్రాంతాలు

## ప్రాంతీయ ఓటు హక్కు కమిటీ అభిప్రాయం

"అస్పృశ్యులనే అణిచివేయబడ్డ వర్గాలుగా పిలువాలని ఐక్య ప్రాంతాల ఓటు హక్కు కమిటి అభిప్రాయపడింది. ఈ పరీక్ష ననుసరించి నిర్ణయిస్తే, భంగీలు, డోములు, దనుకాల విషయంలో తప్ప ఈ ప్రాంతాల్లో అస్పృశ్యత లేదు. ఇతర స్పృశ్యులైనవారితో కలుపుకొని వీరిమొత్తం జనాబా 5,82,000."[4]

అస్పృశ్యులకు ప్రాతినిధ్యం వహిస్తూ ఐక్య ప్రాంతాల ఓటు హక్కు కమిటీలో సభ్యుడయిన బాబు రామ్ సహాయి, తన నిరసన తెలియచేస్తూ ఐక్య ప్రాంతాల్లో అస్పృశ్యుల సంఖ్య[5] 1,14,35,417 అని తెలిపాడు. ఐక్య ప్రాంతాల ఓటు హక్కు కమిటీలో అణిచివేయబడిన వర్గాలకు ప్రాతినిధ్యం వహిస్తున్న మరో సభ్యుడు, రాయిసాహెబ్ బాబురామ్ చరణ్, తన నిరసన తెలుపుతూ ఐక్య ప్రాంతాల్లో అస్పృశ్యుల సంఖ్య[6] 20 మిలియన్లని చెప్పాడు.

ఐక్య ప్రాంతాల ప్రభుత్వం తన నివేదిక[7]లో ఎక్కువలో ఎక్కువ ఈ సంఖ్య 17 మిలియన్లని అంచనా వేసింది తక్కువలో తక్కువ 1 మిలియనుకన్న తక్కువ. దాని అభిప్రాయంలో కనీస సంఖ్య 67, 73, 814.

# బెంగాల్

బెంగాల్ ప్రాంత ఓటు హక్కు కమిటీ తన మొదటి నివేదికో లో ఈ విధంగా తెలియచేసింది.

" ఈసమస్యపై కమిటీ ఎటువంటి నిర్ణయానికి రాలేకపోయింది. కేంద్ర కమిటీతో పాటు దీన్ని పునః పరిశీలించాలని తీర్మానించడం జరిగింది"

తన అంతిమ నివేదికలో అదే కమిటీ ఈ విధంగా తెలిపింది.

"అస్పృశ్యత, సమీపించలేకపోవడం వంటివి ప్రమాణాలుగా తీసుకొంటే, భారతదేశంలోని ఇతర ప్రాంతాల్లో వీటిని అర్థం చేసుకొన్న విధంగా, భూమిమాలీలు తప్ప బెంగాల్‌లో అణచి వేయబడ్డ వర్గమంటూ ఏదీ లేదు".[9]

బెంగాల్ ప్రాంత ఓటు హక్కు కమిటీలో అణిచి వేయ బడ్డ వర్గాలకు ప్రాతినిధ్యం వహించినే మల్లిక్ తన నిరసన నోటులో ఇచ్చిన జాబితాలో అస్పృశ్యుల వర్గానికి చెందిన 86 కులాలను పేర్కొనడం జరిగింది.

## బీహార్, ఒరిస్సా

1911 జనాభా లెక్కల ప్రకారం బీహార్ ఒరిస్సా ప్రాంతాల్లోని అణచివేయబడ్డ వర్గాల జనాభా 93,00,000[10], 1921 లెక్కల ప్రకారం 80,00,000.

కానీ బీహార్, ఒరిస్సా ప్రాంతీయ ఓటు హక్కుల కమిటీ తన ప్రాంతీయ విజ్ఞాపన[11] లో ఈ విధంగా పరిశీలించింది.

"అణచివేయబడ్డ వర్గాల నిర్వచనం కిందికి వచ్చే కులాల పూర్తి జాబితా ఇవ్వడం కష్ట సాధ్యమైన పని. అణిచివేయబడ్డ వర్గాలని పిలవబడేవాళ్ళు, ముషహర్లు, దుసాద్‌లు చామర్లు,డోములు, మేతర్లు మాత్రమే. ప్రత్యేక ఓటర్లుగా నమోదు చేయడానికి వీలుగా వీరి సంఖ్య తగినంత న్యాయ సమ్మతంగా లేదు. అణిచివేయబడ్డ వర్గాల సమస్య బొంబాయి లేక దక్షిణ భారతంలో ఉన్నంత తీవ్రంగా బీహార్ లో లేదు. అణిచి వేయ బడ్డ వర్గాలకు ప్రత్యేక ప్రాతినిధ్యం అక్కరలేదని ఈ కమిటీ భావిస్తున్నది."

అదే కమిటి తన చివరి నివేదికలో[612] ఈ విధంగా తెలిపింది.

"సాధారణంగా అస్పృశ్యులనబడే వర్గాలు చామర్లు, దుసాద్‌లు, డోములు, హలాల్‌కోర్లు, హరీలు, మోచీలు, ముషాహర్లు, పన్‌పాసీలు. కమిటీలోని మెజారిటీ సభ్యుల అభిప్రాయం ప్రకారం అణిచివేయబడ్డ వర్గాల ఇబ్బందులు బొంబాయి లేదా దక్షిణ భారతంలో వలే అంత తీవ్రమైనవిగా లేవు. కాబట్టి వీరి ప్రత్యేక ప్రాతినిధ్యమవసరంలేదు.

హిందువులు ఒకేసారి అకస్మాత్తుగా అస్పృశ్యుల జనాభాను లక్షలనుండి పదులకు తగ్గించి ఎందుకు చెపుతున్నారు? 1911 నుండి ఈ సంఖ్య 5 కోట్లని రికార్డు చేయబడింది. దీన్నెవరూ ప్రశ్నించలేదు. 1932లో హిందువులు ఈ సంఖ్యను సవాలు చేస్తున్న పద్ధతులకున్న ఖచ్చితత్వాన్ని పట్టించుకోకుండా నిశ్చితమైన ప్రయత్నమెందుకు చేస్తున్నారు?

దీనికి సమాధానం సులభమే. 1932 దాకా అస్పృశ్యులకు రాజకీయ ప్రాధాన్యత లేదు. హిందూ సమాజం గుర్తించిన నాలుగు వర్ణాలు బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు. ఈ వ్యవస్థకు బయట వున్నా రాజకీయ లక్ష్యాల దృష్ట్యా పంచములను కూడా హిందూ సమాజ వ్యవస్థలో భాగంగా గుర్తించారు. దీని వల్ల రాజకీయ లక్ష్యాల దృష్ట్యా (శాసన సభల్లో ప్రాతినిధ్యం లాంటివి ఇతరత్రా), అంతకు ముందు అస్పృశ్యుల జనాభా సమస్య వల్ల ఫలితమేమీ లేదు. 1932 వరకున్న రాజకీయ సమస్య చట్ట సభల్లోని స్థానాల విభజన హిందువులు, ముస్లిముల మధ్య మాత్రమే. హిందువులకొచ్చిన పెద్ద భాగం స్పృశ్యులు, అస్పృశ్యుల మధ్య విభజింపబడలేదు. కాబట్టి హిందువులు అస్పృశ్యుల జనాభా గురించి విచారించడానికి శ్రద్ధ చూపలేదు. 1932 నాటికి పరిస్థితి పూర్తిగా మారింది. హిందూ ముస్లింల మధ్య నున్న సీట్ల పంపకం సమస్య కున్న ప్రాధాన్యత పోయి చాలా రోజులయ్యింది. హిందువులకు కేటాయించిన భాగం మరింత విభజించి అది ప్రత్యేకంగా తామే అనుభవించాలని అస్పృశ్యులు తమ హక్కుకై అడుగనారంభించినారు. ఈ ప్రత్యేక హక్కును గుర్తించి భారత రౌండ్ టేబుల్ కాన్ఫరెన్స్ సభలో అస్పృశ్యుల ప్రతినిధులు ఆ వర్గం నుంచే వచ్చి ప్రాతినిధ్యం వహించే విధంగా వీలు కల్పించినారు. ఈ విధంగా అస్పృశ్యుల ప్రత్యేక అస్థిత్వాన్ని గుర్తించడమే కాక భారత రౌండ్ టేబుల్ సభకు చెందిన మైనార్టీల ఉప సంఘం కొత్త రాజ్యాంగంలో

కూడా అణిచి వేయబడ్డ వర్గాల జనాభా ప్రాతిపదికగా అన్ని రాష్ట్రాల శాసన సభల్లో ప్రాతినిధ్యం కల్పించాలనే సూత్రాన్ని ఆమోదించింది. ఈ విధంగా అస్పృశ్యుల జనాభా సమస్య ప్రాధాన్యత సంతరించుకుంది. అస్పృశ్యుల జనాభా తక్కువవుంటే ఎక్కువ ప్రాతినిధ్యం స్పృశ్యులైన హిందువులకు పోతుంది. 1932 కు ముందు అస్పృశ్యుల జనాభా సమస్యను హిందువులు ఎందుకు విస్మరించారో, 1932 తరువాత అస్పృశ్యుల వర్గం ఉనికిని ఎందుకు నిరాకరించారో దీని వల్ల మనకు తెలుస్తుంది.

లోథియన్ కమిటీ ముందు అస్పృశ్యుల జనాభాను తగ్గించడానికి హిందువులు చేసిన వాదనకుగల స్పష్టమైన పునాదులు రెండు. మొదటిది, జనాభా లెక్కల కమీషనర్ ఇచ్చిన సంఖ్య అణిచివేయబడ్డ వర్గాలకు సంబంధించింది. ఈ అణిచి వేయబడ్డ వర్గాలలో అస్పృశ్యులతో పాటు ఇతరవర్గాలు కూడా కలిసి ఉన్నవి. వీళ్లు వాదించిన రెండవ ప్రాతిపదిక ఆ పదానికిచ్చిన నిర్వచనం భారత దేశమంతా ఏకరూపకత కలిగి ఉండి, జనాభా నిర్ణయించడానికి అన్ని ప్రాంతాల్లో సమానంగా అన్వయించాలి. వేరే మాటల్లో చెప్పాలంటే వాళ్ళు అస్పృశ్యతకు స్థానికంగా ఉండే ప్రమాణాలకు అభ్యంతరం తెలిపారు.

మొదటి వాదన నిరాపేక్షమైన సత్యం అణిచి వేయబడ్డ వర్గాలు అనే పదాన్ని అస్పృశ్యులకు సమానార్థకంగా వాడినారు. అస్పృశ్యులు అనడానికి బదులు అణిచివేయబడిన వర్గాలని పిలువడం జరిగింది. దీనికి కారణం, ప్రజలు ఈ వర్గంలో చేర్చడంవల్ల బాధపడే అవకాశమున్నదని భావించడం జరిగింది. ఈ వర్గంలో కేవలం అస్పృశ్యులను తప్ప ఆదివాసులను గాని,నేరగిరిజన జాతులను గాని చేర్చడం జరుగలేదు. 1916 సామ్రాజ్య చట్టసభ (Imperial Legislature Council)లో గౌరవనీయుడైన దధంబాకు ప్రవేశపెట్టిన తీర్మానం పై జరిగిన చర్చ ఈ విషయాన్ని స్పష్టం చేసింది. కులీన హిందువుల రెండవ అభ్యంతరం, అస్పృశ్యతకు సంబంధించిన ప్రమాణం ఏకరూపకత కలిగి ఉండాలి. దీని లక్ష్యం అస్పృశ్యుల సంఖ్య తగ్గించడానికే. భారత దేశంలో వివిధ ప్రాంతాల్లో అస్పృశ్యత వివిధ రూపాల్లో ఉన్నదన్న విషయం అందరికీ తెలిసిందే. భారత దేశంలోని కొన్ని ప్రాంతాల్లో అస్పృశ్యులను చూడడానికి కూడా వీల్లేదు. అంటే హిందువుల దృష్టిలోకి వస్తేవారు మైలకు కారకులవుతారు. మరి కొన్ని ప్రాంతాల్లో అస్పృశ్యులు దగ్గరికి రావడానికి వీల్లేదు. హిందువులున్న చోటికి దగ్గరగా రావడం వల్ల మైలను కలుగచేస్తారు.

దరిచేరగలిగే రెండురకాల అస్పృశ్యుల్లో వర్గాలున్నవి. కొంత మంది దగ్గరికి రావచ్చు కాని ఒక పరిధి దాటి రావడానికి వీల్లేదు. మరికొంత మంది అస్పృశ్యులు దగ్గరికి వచ్చినా తమ నీడ హిందువులపై పడకుండా చూసుకోవాలి. కొన్ని ప్రాంతాల్లోని అస్పృశ్యుడు చూడడానికి, దగ్గరికి రావడానికి అర్హుడే. అతనిలో భౌతిక సంబంధం మాత్రమే కలుషిత కారణం. కొన్ని ప్రాంతాల్లో అస్పృశ్యులు నీళ్ళను, ఆహారాన్ని ముట్టుకోకూడదు. మరి కొన్ని ప్రాంతాల్లో అస్పృశ్యులు దేవాలయాల్లో ప్రవేశించకూడదు. ఈ తేడాలన్నింటిని దృష్టిలోకి తీసుకొంటే ఒక వేళ చూడకపోవడమనేది ప్రమాణంగా తీసుకుంటే దగ్గరికి రాకూడని వాళ్ళు అస్పృశ్యుల వర్గంలోంచి తొలగించాల్సి వస్తుంది. దగ్గరికి చేరకూడని వాళ్ళను ప్రమాణంగా తీసుకుంటే స్పర్శవల్ల మైలను కలుగజేసే వాళ్ళను అస్పృశ్యుల వర్గం నుంచి తీసివేయాల్సి ఉంటుంది. స్పర్శ వల్ల మైలను కలిగించే వాళ్ళను ప్రమాణంగా తీసుకుంటే నీళ్ళను, ఆహారాన్ని తాకకూడనివాళ్ళు, దేవాలయాల్లోకి ప్రవేశించకూడని వాళ్ళు అస్పృశ్యుల వర్గంలో చేరడానికి అనర్హులవుతారు. హిందువులు చేయదలచుకున్నదిదే. ఏకరూపత గలిగిన ప్రమాణాలుండాలని పట్టుబట్టడం వల్ల అస్పృశ్యుల వర్గం నుండి కొంత మందిని తొలగించి వాళ్ళ జనాభాను తగ్గించాలనేది హిందువుల ఆలోచన. ఈ దృష్టి పొరపాటైనదనేది స్పష్టమే. అస్పృశ్యత అనేది హిందువులు ఒక వ్యక్తి పట్ల అంతరంగికంగా ఉన్న ఏహ్య స్వభావాన్ని బయటికి వ్యక్తీకరించడమే. ఈ ఏహ్య భావం తీసుకోబోయే రూపం క్షణికమైనది. ఈ రూపం తమ ఏహ్యతను సూచించే పరిమాణం మాత్రమే. ఎక్కడైతే ఏహ్య మనస్తత్వ ముంటుందో అక్కడ అస్పృశ్యత ఉంటుంది. ఈ అతి సామాన్యమైన సత్యం హిందువులకు తెలుసు.

కాని నిరంతరంగా ఏకరూపత గల ప్రమాణం కోసం వాళ్ళు పట్టుబడుతూనే ఉన్నారు. ఎందుకంటే ఏదో ఒక రకంగా అస్పృశ్యుల జనాభాను తగ్గించి, రాజకీయ ప్రాతినిధ్యంలో ఎక్కువ భాగాన్ని చేజిక్కించుకోవాలనేదే వాళ్ళ కోరిక.

## VI

హిందువులు, అస్పృశ్యుల మధ్య నున్న పోరాటం నిస్సందేహంగా ప్రధానమైన కథగా వుండింది. కాని ఈ కథలోనే, దాని పాత్ర చిన్నదైనప్పటికీ, మరొకటున్నది. అది వెనకబడిన వర్గాలు (Backward Classes)కి, అస్పృశ్యుల మధ్యన జరిగిన పోరాటం.

అణిచివేయబడిన వర్గాల్లో, దాని ఖచ్చితమైన అర్థంలో, కేవలం అస్పృశ్యులనే కాక ఆర్థికంగా, విద్యా విషయకంగా వెనుకబడిన వర్గాలను చేర్చాలని వెనుకబడిన వర్గాల ప్రతినిధులు అభిప్రాయపడినారు. ఆర్థికంగా, విద్యాపరంగా వెనుక బడిన వర్గాలకు ప్రత్యేక ప్రాతినిధ్య మివ్వాలనేది ఇది కోరుతున్న వారి లక్ష్యం. ఇది ప్రశంసించదగిన విషయమే. ఈ విషయాన్ని ముందు పెడుతున్న వారు కొత్త విషయాన్నేమీ అడగడంలేదు. 1920లో అమల్లోకొచ్చిన సంస్కరించబడిన రాజ్యాంగం కింద భారత దేశంలోని బొంబాయి, మద్రాసు ప్రాంతాల్లో విద్యాపరంగా, ఆర్థికంగా వెనుకబడిన వర్గాల హక్కులు గుర్తించడం జరిగింది. బొంబాయిలో మరాఠాలు, వారి సంబంధిత కులాలకు, మద్రాసులో బ్రాహ్మణేతరులకు ఆర్థికంగా, విద్యాపరంగా వెనుకబడ్డవర్గాలనే ప్రాతిపదికమీద మాత్రమే ప్రత్యేక ప్రాతినిధ్యమివ్వడం జరిగింది. ఒక వేళ వారికి ప్రాతినిధ్య మివ్వనట్టయితే హిందువుల్లోని అల్పసంఖ్యాక వర్గానికి ఉన్నత కులాలకు చెందిన బ్రాహ్మణులు, వారి సంబంధిత కులాలచే రాజకీయంగా అణిచివేయబడతామనే భయానికి లోనయ్యారు. ఇతర ప్రాంతాల్లో కూడా ఇదే స్థానంలోనున్న కులాలెన్నో ఉన్నవి. వాళ్ళకు రాజకీయంగా ప్రత్యేక ప్రానిధ్యమవసరం. హిందువుల్లోని వెనుకబడిన వర్గాల ప్రతినిధులు వెనుకబడిన కులాల కోసం ప్రత్యేక ప్రాతినిధ్యం కోరడం అన్ని విధాల సమంజసమే.[13] ఒక వేళ వెనుకబడిన కులాలు ప్రతినిధుల అభిప్రయాలను ఆమోదించినట్టయితే వెనుకడిన వర్గాల ప్రాతినిధ్యం ఎంతో ఎక్కువ మొత్తం పెరిగి ఉండేది. కాని వారికి ఉన్నత కులాల హిందువుల నుండి గాని, ఉత్తర ప్రదేశ్ ప్రభుత్వం ఉత్తర్ ప్రదేశ్‌లో వెనుకబడిన వర్గాలకు ప్రాతినిధ్యం కల్పించడానికి అవసరమైన ఏర్పాట్లు చేయడమనే డిమాండును విపులంగా ప్రదర్శించింది. అస్పృశ్యులనుండి గాని తగినంత సహాయం లభించలేదు. ఈ ప్రతిపాదన వల్ల అణచి వేయబడ్డ వర్గాల జనాభా పెరుగుతుందని హిందువులు దాన్ని వ్యతిరేకించినారు. నిజంగా అస్పృశ్యులు కాని వారెవ్వరిని తమ వర్గంలో కలపడం అస్పృశ్యులకు ఇష్టం లేదు. ఈ వెనక బడిన కులాలకు నిజమైన పరిష్కారం స్పృశ్యులైన హిందూ కులాలను అభివృద్ధి చెందినవి, వెనుకబడ్డవిగా గుర్తించి వెనక బడిన కులాలకు ప్రత్యేక ప్రాతినిధ్యం కల్పించాలి. ఈ ప్రయత్నంలో అస్పృశ్యులు వారికి మద్దతు ఇచ్చి ఉండాల్సింది. కాని వారు దీనికి అంగీకరించ లేదు. అణిచివేయబడ్డ కులాల్లో తమను కలుపడానికి పట్టు విడవ కుండా ప్రయత్నిస్తూనే ఉన్నారు. వాళ్ళ లక్ష్యం సాధించడానికి ఇదే సులువైన

మార్గమని భావించి ఉండాలి. ఎప్పుడైతే అస్పృశ్యులు దీన్ని వ్యతిరేకించారో వెనకబడ్డ కులాలు మారిపోయి హిందువుల్లో కలిసి హిందువులకన్న ఎక్కువ తీవ్రంగా అస్పృశ్యుల ఉనికి నిరాకరించారు.

స్పృశ్యులకు, అస్పృశ్యులకు మధ్యన జరిగిన పోరాటంలో అస్పృశ్యులకు ముస్లింల నుండి ఎలాంటి మద్దతు లభించలేదు. పంజాబ్ ప్రాంత ఓటు హక్కు కమిటీలో ఒకే ఒక్క ముస్లిం సభ్యుడు అస్పృశ్యుల ప్రతినిధిని పంజాబ్‌లో అస్పృశ్యులుగా గుర్తించిన వారి హక్కులకై చేసిన వాదనను సమర్థించడాన్ని గుర్తించ వచ్చు. ఇతర ముస్లిం సభ్యులు ఇతనిలో కలువలేదు. బెంగాల్లోని ప్రాంతీయ ఓటు హక్కు కమిటీ లోని హిందు, ముస్లిం సభ్యులు ఈ విషయంపై ఏ భావమూ వ్యక్తం చేయరాదనే అంగీకారానికొచ్చినారు. ముస్లిం సభ్యుల విషయంలో ఆశ్చర్యం కలిగించేది ఏమంటే ఈ విషయంపై ముస్లింలు మౌనంగా ఉండడం. వారి ప్రయోజనాల దృష్ట్యా అస్పృశ్యులు రాజకీయంగా ప్రత్యేక వర్గంగా గుర్తించబడాలి. స్పృశ్యులు అస్పృశ్యుల మధ్య ఏర్పడే విభజన వారికి లాభకారకం. అస్పృశ్యులు సంఖ్య కోసం చేస్తున్న పోరాటానికి వీరు ఎందుకు సహాయం చేయడం లేదు? ముస్లింలు ఇటువంటి ధోరణి వహించడానికి రెండు కారణాలున్నాయి. మొదటిది, ముస్లింలు వారి జనాభా కన్నా ఎక్కువ ప్రాతినిధ్యాన్ని అడగడం. వారడుగుతున్నది రాజకీయ పరిభాషలో తమ ప్రాబల్యం కోసం. రాజకీయాల్లో తమ ప్రాబల్యం పెరడడం వల్ల హిందువులకు నష్టమని వారికి తెలుసు, ఇక్కడొకొచ్చే ప్రశ్న ఈ నష్టం హిందువుల్లో ఏ వర్గం భరించాలనేది. వారి భాగంలో నష్టం జరుగకుండా ముస్లింల కిచ్చే రాజకీయ ప్రాబల్యంతో స్పృశ్యులైన హిందువులకు అభ్యంతరం లేదు. ఇదెలా చేయడమన్న ప్రశ్నకు ఏకైక మార్గం అస్పృశ్యుల భాగాన్ని తగ్గించడం. వాళ్ళ భాగాన్ని తగ్గించడమంటే వాళ్ళ జనాభాను తగ్గించడమే. అస్పృశ్యులు తమ సంఖ్య కోసం జరుపుతున్న పోరాటంలో ముస్లింలు మద్దతు తెలపక పోవడానికి ఇదో కారణం. రెండో కారణం హిందువులు తమని బహిరంగ పరుస్తారనే భయం. అయినప్పటికి ఇస్లాం జాతి, వర్గం వంటి విషయాలను అధిగమించి వివిధ వర్గాల ప్రజలను సౌభ్రాతృత్వంలో ఐక్యం చేయగల మతం. కాని భారత దేశంలో ఇస్లాం కులతత్వాన్ని పెకలించడంలో విజయవంతం కాలేదు. హిందువుల్లో ఉన్నంత తీవ్రమైన కులతత్వం ముస్లింల్లో లేదు. కాని నిజానికి అక్కడ కూడా కొంత కుల ప్రసక్తి ఉన్నది. ఈ విధంగా ముస్లింలలోనున్న కులతత్వం సామాజిక వర్గీకరణకు

దారి దీస్తుంది. ఈ లక్షణాన్ని ఈ విషయాన్ని అధ్యయనం చేసిన వారు గుర్తించినారు. బెంగాల్ జనాభా లెక్కల కమీషనర్ తననివేదికలో ఈ విధంగా తెలిపాడు: (రాత ప్రతిలో ఉటంకింపు రికార్డు చేయబడలేదు - సం|)

ఈ వాస్తవాలు హిందువులకు బాగా తెలుసు. ఒక వేళ ముస్లింలు అస్పృశ్యులకు మద్దతు నివ్వడంలో ఎక్కువ దూరం పోయి శాసన సభలో హిందువుల స్థానాలు తగ్గించాలని ప్రయత్నిస్తే ముస్లింలకు వ్యతిరేకంగా అస్పృశ్యులను ఉపయోగించటానికి వారు సిద్ధమైనారు. ముస్లింలకు తమ బలహీనత తెలుసు. తమలో ఉన్న సామాజిక విభేదాలు ఎత్తిచూపేందుకు హిందువులకు అవకాశ మివ్వదలుచుకోలేదు. వాళ్ళు పక్షరహిత దృష్టితో ఉంటేనే వారి ప్రయోజనాలు తీరుతాయని వారి ఆలోచన.

ఈ విధంగా అస్పృశ్యులు తమ జన సంఖ్య కోసం తామే ఒంటరి పోరాటం చేసుకునే స్థితిలో విడిచి వేయబడినారు. కాని దీనికోసం తమ బలం పై కూడా ఆధారపడలేకపోయారు. ఎప్పుడైతే హిందువులు అస్పృశ్యుల జనాభా తగ్గించడంలో విజయవంతం కాలేదో అప్పుడు అస్పృశ్యులను తప్పుదారి పట్టించడానికి ప్రయత్నించారు. ప్రభుత్వం తయారు చేస్తున్న జాబితాలో అస్పృశ్యులు తమ కులాన్ని నమోదు చేయించుకోవడం వల్ల అస్పృశ్యత మరింత పెరిగి పోతుందని చెప్పడం ప్రారంభించారు. ఈ సలహా ఆధారంగా నిజంగా అస్పృశ్యులైన కులాలు జాబితా లో తమను అస్పృశ్యుల వర్గంగా నమోదు చేయరాదని విజ్ఞాపనలు పంపడం జరిగింది. వాళ్ళు పంపిన విజ్ఞాపనలు వెనక్కు తీసుకోవడానికి ఎంతో ప్రయత్నించి దీని లక్ష్యం జనాభా అంచనా వేయడాని కని వారికి, చట్ట సభల్లో స్థానాలు కేటాయించడానికని వారిని సమ్మతింప చేయాల్సి వచ్చింది.

అందరికి అదృష్టవశాత్తు, ఇప్పటికీ పోరాటం ఆగిపోయింది. అస్పృశ్యుల జనాభా వివాదం శాశ్వతంగా మూతబడింది. అస్పృశ్యులిప్పుడు చట్ట బద్ధంగా వర్గీకరించబడి నిర్వచింపబడినారు. 1935 భారత ప్రభుత్వ చట్ట ప్రకారం అస్పృశ్యులెవరో ప్రభుత్వ జాబితాలో సూచించబడినారు. వీరిని అనుసూచిత కులాలు (Scheduled Castes) గా పేర్కొనబడినది. కాని ఈ పోరాటం హిందువుల లక్షణాన్ని తెలియ చేస్తుంది ఒక వేళ అస్పృశ్యులు కొంత అలజడి, గడబిడ చేయకపోతే హిందువులు వారి పరిస్థితులపట్ల సిగ్గులేకుండా అలాగే ప్రవర్తించేవారు. వారి సంఖ్య పట్ల కూడా వేలయినా, లక్షలైనా ఉదాసీనంగా ఉండిపోయేవారు. ఏమాత్రం బాధపడిఉండేవారు కాదు. కాని అస్పృశ్యులు

లేచి నిలబడి తమ గుర్తింపు కోసం అడిగేసరికి హిందువులు వారి ఉనికి నిరాకరిచడానికి సిద్ధపడి ఈ బాధ్యతను సమ్మతించడం లేదు. ఎటువంటి పరితాపం , పశ్చాత్తాపం లేకుండా తమ అధికారాన్ని పంచుకోవడానికి తిరస్కరిస్తున్నారు.

పాదసూచికలు:

1. భారత ఓటు హక్కు కమిటీకి (IFC) పంజాబ్ ప్రభుత్వం సమర్పించిన విజ్ఞాపన, మూడవ సంపుటం, పే[రాతప్రతిలో పేర్కొనలేదు]

2. Ibid పే.29.
3. Ibid పే.35.
4. Ibid పే.398.
5. Ibid పే.440.
6. Ibid పే.285.
7. Ibid పే.297 - 98.
8. Ibid పే.189.
9. Ibid పే.230.
10. Ibid పే. —
11. Ibid పే. —
12. Ibid పే. 129
13. ఉత్తర ప్రదేశ్ శాసన సభ నిర్మాణం గురించి ఈ విధంగా తెలియచేసింది: "ఈ ప్రాంతంలో హిందువుల్లో నాలుగు ఉన్నత కులాలున్నవి. అవి, బ్రాహ్మణులు, ఠాకూర్లు, వైశ్యులు, కాయస్తులు. హిందూ జనాభా.

అనువాదం : డా॥ కె. సీతారామారావు

అధ్యాయం - 21

# అస్పృశ్యుల తిరుగుబాటు

హిందూ సమాజ వ్యవస్థ చేసిన అన్యాయాలకు వ్యతిరేకంగా, ముఖ్యంగా మహారాష్ట్రలో అస్పృశ్యుల ఉద్యమానికి ఒక దీర్ఘమైన చరిత్ర ఉన్నది. ఈ చరిత్రకు రెండు దశలున్నవి. మొదటి దశలో ప్రధానంగా నిరసనలు, విజ్ఞాపనలు; రెండవ దశలో హిందూ వ్యవస్థకు వ్యతిరేకంగా బహిరంగ తిరుగుబాటు, ప్రత్యక్ష చర్య. రెండు రకాల పరిస్థితులను బట్టి వైఖరిలో ఈ మార్పు వచ్చింది. మొదటిది, విజ్ఞప్తులు, నిరసనలు హిందువుల్లో మార్పు తీసుకురావడంలో విఫలమైనవని తెలుసుకోవడం. రెండవది ప్రజాసంస్థలు, ఇతర ప్రజా సౌకర్యాలన్ని పౌరులందరికీ, అస్పృశ్యులతో సహా, అందుబాటులో ఉంటాయని ప్రభుత్వం ప్రకటించడం. ఇతర విషయాలతో పాటు ఎలాంటి బట్టలైనా తొడగడానికి, ఎలాంటి ఆభరణాలైనా ధరించడానికి అవకాశం బ్రిటిష్ ప్రభుత్వ చట్టం అస్పృశ్యులకిచ్చిన హక్కుల్లో ఒకటి. వీటితో పాటు ప్రజా సంస్థలు, సౌకర్యాలైన బావులు, బడులు, బస్సులు, ట్రాంలు, రైళ్ళు, ప్రజాకార్యాలయాలు. ఇతరత్రా వంటివన్నీ అస్పృశ్యులు వాడుకోవచ్చునని నిస్సందేహంగా తెలియచేసింది. కాని హిందువుల నుండి వచ్చే వ్యతిరేకతను దృష్టిలో ఉంచుకొని అస్పృశ్యులు వీటిని సక్రమంగా ఉపయోగించుకోలేక పోయారు. ఈ పరిస్థితి నెదుర్కోడానికి అస్పృశ్యులు తమ పద్ధతుల మార్పుకు నిర్ణయించుకొని అవతలవాళ్ళ తప్పులు సరిదిద్దడానికి ప్రత్యక్ష చర్యకు పూనుకొన్నారు. 1920ల ప్రాంతంలో ఈ మార్పు సంభవించింది.

## I

హిందూసామాజిక వ్యవస్థకు వ్యతిరేకంగా అస్పృశ్యులు జరిపిన తిరుగుబాటు నర్థం చేసుకోవడానికి వారి ప్రయత్నంలో భాగమైన కొన్ని ప్రత్యక్ష చర్యలనిక్కడ ఉదహరిస్తే చాలు. ప్రజారహదారులనుపయోగించడానికి వాళ్ళు చేసిన ప్రయత్నాలని ఒక ప్రమాణికంగా చూపవచ్చు. 1924లో ట్రావెంకూర్ రాష్ట్రంలో వైక్కమ్ దేవాలయపు పొలిమేరలో నున్న రహదారి నుపయోగించడానికి అస్పృశ్యులు చేసిన ప్రయత్నం చెప్పుకోదగ్గ విషయం. ఈ రహదార్లు అందరి ఉపయోగాలకోసం ప్రభుత్వం చే నిర్వహింపబడుతున్న ప్రజా రహదార్లు. కాని వీటిలో కొన్ని దేవాలయ భవనానికి అతి సమీపంలో ఉండడం

వల్ల వాటిని అస్పృశ్యులు ఉపయోగించడానికి వీలు లేకుండా చేయడం జరిగింది. చివరకు సత్యాగ్రహం ఫలితంగా దేవాలయ ప్రాకారాన్ని పెంచి రహదారిని మూర్చు చేయడం జరిగింది. దీనివల్ల ఆ రహదారిని అస్పృశ్యులుపయోగించినా అది దేవాలయాన్ని కలుషితం చేసే దూరంలో లేని విధంగా చేసారు.

# II

ప్రజలు నీళ్ళు వాడుకునే స్థలాలనుండి నీళ్ళు తీసుకొనే హక్కును సాధించుకోవడానికి అస్పృశ్యులు చేసిన ప్రయత్నాన్ని తెలుపడానికి చాదర్ చెరువు ఉదాహరణ చాలు

బొంబాయి రాష్ట్రంలోని కొలాబా జిల్లాలో మహద్ పట్టణంలో ఈ చాదర్ చెరువున్నది. వర్షపునీరు, కొన్ని సహజమైన చిన్న వాగులవల్ల వచ్చే నీటితో ఉన్న ఈ చెరువు చాల విస్తారమైనది. అన్ని పక్కల ఈ చెరువుకు కట్ట ఉన్నది. చెరువు చుట్టూ అన్ని పక్కల అక్కడక్కడ ప్రైవేట్ వ్యక్తుల భూములున్నవి. వీటికి అవతల చెరువును చుట్టి పోయే మున్సిపల్‌రహదారి. రోడ్డుకవతల స్పృశ్యుల ఇండ్లు. చెరువు దాదాపు హిందువుల ఇండ్ల మధ్యనే ఉంటుంది.

ఈ చెరువు చాల పురాతనమైనది, దీనిని ఎవరు, ఎప్పుడు నిర్మించారో ఎవ్వరికీ తెలియదు. కాని 1869లో ఎప్పుడైతే మహద్ పట్టణంలో ప్రభుత్వం పురపాలక సంఘం స్థాపించిందో అప్పుడు ఈ చెరువు నిర్వహణ మున్సిపాలిటికి అప్పగించబడింది. అంటే అది ప్రజల ఆస్తి అన్నమాటే.

మహద్ ఒక వ్యాపార కేంద్రమే గాక తాలుకా కేంద్రం కూడా. తమ మార్కెట్ పనుల కోసమో లేదా గ్రామాధికారులు వసూలు చేసిన భూమి శిస్తు చెల్లించడానికో, గ్రామసేవకులుగా తాలుకా కేంద్రానికి గ్రామాధికారులు పంపే ఉత్తరాలు తేవడానికో అస్పృశ్యులు మహద్ పట్టణానికి రోజూ రాక తప్పదు .బయటి నుండి వచ్చినవాళ్ళు నీళ్ళు వాడడానికున్న ఒకే ఒక్క ప్రజా చెరువు చాదర్ చెరువు. కాని అస్పృశ్యులు ఈ చెరువు నుండి నీళ్ళు వాడడానికి వీలు లేదు. మహద్ పట్టణంలో అస్పృశ్యుల వాడలో నున్న ఒక్క బావే నీళ్ళు వాడడానికి వాళ్ళకున్న ఆధారం. ఈ బావి పట్టణ కేంద్రం నుండి కొంత దూరంలో ఉంటుంది. మున్సిపాలిటి నిర్లక్ష్యంవల్ల ఆ బావి

పూడుకుపోయి వుండేది.

అందువల్ల అస్పృశ్యులంతా నీళ్ళ విషయంలో ఎంతో ఇబ్బందికి గురి కావాల్సి వచ్చింది. ఈ వ్యవహారమిలా కొనసాగుతూనే ఉన్నది. 1923లో మహరాష్ట్ర శాసన మండలి, అస్పృశ్య వర్గాలందరిని ప్రజానీటి స్థలాలు, బావులు, ప్రజాధనంతో నిర్మించి, నిర్వహింపబడే ధర్మశాలలు లేదా ప్రభుత్వ చట్టం ద్వారా నియమించబడిన పాలన మండలిచే నిర్వహించబడుతున్నవి; ప్రభుత్వ పాఠశాలలు, కోర్టులు, కార్యాలయాలు, ఆస్పత్రులవంటి ప్రజోపయోగ సంస్థలన్నింటిలోకి ప్రవేశించ అనుమతించాలని ఒక తీర్మానం చేసింది. ప్రభుత్వం ఈ తీర్మానాన్ని ఆమోదించి ఈ క్రింది విధంగా ఆజ్ఞలు జారీ చేసింది.

" ముందు చెప్పబోయే శాసన మండలి తీర్మానాన్ని బొంబాయి ప్రభుత్వం సంతోషంగా ఆమోదించి అన్ని కార్యాలయాల కార్యనిర్వాహకులకు ఆదేశించు విషయం: ఈ తీర్మానం ప్రజాస్థలాలకు, సంస్థలకు సంబంధించిన విషయం కాబట్టి సమర్థవంతంగా అమలు చేయాలి. తమ పరిధిలో నున్న స్థానిక సంస్థలకు ఆయా కలెక్టర్లు తీర్మానంలో సూచనలు ఆమోదించే విధంగా సలహానివ్వాలని కోరడమైనది".

ప్రభుత్వ ఆజ్ఞననుసరించి కొలాబా జిల్లా కలెక్టరు ఆ ఆజ్ఞానిజప్రతినొక దానిని మహద్ పురపాలక సంఘానికి పంపించడం జరిగింది. 1924 జనవరి 5న మహద్ పురపాలక సంఘం చెరువును వాడడంలో అస్పృశ్యులకు అనుమతినివ్వడానికి అభ్యంతరమేమిలేదని ఒక తీర్మానం చేయడం జరిగింది. ఈ తీర్మానం జరిగిన వెంటనే మహద్ పట్టణంలో నా అధ్యక్షతన కొలాబా జిల్లా అస్పృశ్యుల సభ జరిగింది. 1927 మార్చి 18,20 తేదిల్లో రెండు రోజుల పాటు ఈ సభ జరిగింది. కొలాబా జిల్లాలో ఇది అస్పృశ్యుల మొట్ట మొదటి సమావేశము. దాదాపు 2,500లకు పైన అస్పృశ్యులు ఈ సభకు హాజరైనారు, సభికుల్లో ఎంతో ఉత్సాహం కనపడింది. సభ మొదటి రోజున నా అధ్యక్షోపన్యాసము ముగించాను, దానిలో నేను తమకున్న అశుభ్రమైన అలవాట్లను వదులుకొని సంపూర్ణ మానవత్వంతో నిలబడి తమ హక్కులకోసం పోరాడమని ప్రోత్సహించినాను. ఈ తరువాత అక్కడున్న ఉన్నత కులాల హిందువులు, తాము అస్పృశ్యుల నిజమైన మిత్రులమ ్ని బయటికొచ్చినవారు, అస్పృశ్యులను ధైర్యంగా నిలబడి చట్టం ఇచ్చిన

హక్కును వినియోగించుకోవాలని సభనుద్దేశించి ప్రసంగించారు. ఈ విధంగా మొదటి రోజు సభాకార్యక్రమాలు ముగిసినవి. ఆ రోజు రాత్రి కార్యనిర్వాహక సంఘం సమావేశమై మరుసటి రోజు సభలో చర్చించి తీర్మానించాల్సిన విషయాలను పరిశీలించింది. కార్య నిర్వాహక సంఘం లోని కొంతమంది సభ్యులు మహద్ పట్టణంలో అస్పృశ్యులు తాగునీటి కోసం పడుతున్న ఇబ్బందులను చర్చించినారు. ఆహ్వాన సంఘం సభ్యులు ఈ విషయంలో తాము పడ్డ ఇబ్బందులను ప్రత్యేకంగా పేర్కొన్నారు. ఆహ్వాన సంఘం సభ్యులు 15 రూపాయలు ఖర్చు పెట్టి సభకు హాజరయిన సభ్యుల **నీటి** అవసరాలు తీర్చడానికి హిందూ కులాల వాళ్ళను వినియోగించాల్సి వచ్చిందని వారు పేర్కొన్నారు.

మరుసటి రోజు 20వ తారీఖున ఉదయం 9 గంటలకు సభ ప్రారంభమయింది. కార్య నిర్వాహక సంఘంలో అంగీకరించిన తీర్మానాలు సభలో ఆమోదించబడినవి. మూడు గంటల్లో ఈ పని పూర్తి అయింది. చివరగా నా సహకార్యకర్త ఒకరు కృతజ్ఞతలు తెలుపుతూ పట్టణంలో మంచి నీళ్ల తెచ్చుకోవడానికి అస్పృశ్యులు పడుతున్న ఇబ్బందులు ప్రస్తావించి, చాదర్ చెరువునుండి నీళ్ళు అస్పృశ్యులతో సహా అందరు వాడుకోవచ్చునని మున్సిపాలిటీ ప్రకటించిన దృష్ట్యా, ఆ చెరువు నుండి నీరు తెచ్చుకొనే హక్కును అమలు చేయాలని అస్పృశ్యులను ప్రోత్సహించినారు. ఈ విషయంలో హిందూ మిత్రులు కూడా సహాయపడడానికి సిద్ధమైనారని పేర్కొన్నాడు. అస్పృశ్యులను తమ హక్కులను సాధించుకోవడంలో నిర్భయంగా, ధైర్యంగా వ్యవహరించాలని ఉద్బోధించిన హిందువులు ఇది బాంబులాంటి ప్రమాదమని గ్రహించివెంటనే పరుగెత్తిపోయినారు. కాని అస్పృశ్యులపై ఈ ప్రభావం భిన్నంగా ఉండింది. ఈ పిలుపు వాళ్ళను విద్యుత్తువలె విపరీతంగా ఉత్తేజపరిచింది. ఈ పిలుపునందుకొన్న రెండు వేల ఐదు వందల అస్పృశ్యులు నా నాయకత్వాన ప్రధాన వీధుల గుండా ఊరేగింపుగా బయలు దేరి వెళ్ళినారు. ఈ వార్త దావానలంలా వ్యాపించింది, వీధుల వెంట ఉన్న ప్రజలు గుంపులు గుంపులుగా వచ్చి చేరి దీన్ని తిలకించినారు.

పట్టణంలోని హిందువులు ఈ దృశ్యాన్ని చూసినారు. ఈ తుఫానులో చిక్కుకు పోయినారు. ఇంతకు ముందెన్నడు చూడనటువంటి దృశ్యాన్ని చూసినట్టుగా భయభీతులైనారు. ఒక్క క్షణంపాటు వారు నిశ్చేష్టులయి, స్థంభించిపోయినారు.

నాలుగువరసలుగా సాగిన ఊరేగింపు చాదర్ చెరువు వద్దకు చేరింది. అస్పృశ్యులు మొదటిసారిగా ఆ చెరువులోని నీరు తాగినారు. ఇది జరిగిన విషయం తెలుసుకున్న తరువాత హిందువులు వెర్రి ఆవేశంతో నీరుమైలపరచిన అస్పృశ్యులపై అన్ని రకాల అత్యాచారాలు జరిపారు. ఈ అత్యాచారాలు తగిన చోట వివరిస్తాను.

మహద్ పట్టణంలోని చాదర్ చెరువులో ప్రవేశించిన అస్పృశ్యుల పై హిందువులు చేసిన దాడి నిస్సందేహంగా అస్పృశ్యులకో సవాలు. మరో వైపు అస్పృశ్యులు తమ హక్కును అమలు చేయడంతో మాత్రమే సంతృప్తి పడక అది శాశ్వతంగా ఖాయం చేయబడాలని భావించారు. సహజంగానే వాళ్ళపై హిందువులు విసిరిన సవాలును ఎదుర్కోవాలని భావించారు. దీని ప్రకారం అస్పృశ్యుల రెండవ మహాసభకు పిలుపు నివ్వడం జరిగింది. అన్నింటికి సిద్ధపడి, అన్ని రకాల పరిస్థితులను ఎదుర్కొనడానికి, సత్యాగ్రహం చేయడానికి సిద్ధపడిరావాల్సిందిగా అస్పృశ్యులకు తెలియ చేయడం జరిగింది (అనగా శాసనోల్లంఘనను, జైలుకు పోవడానికి కూడా సిద్ధపడి).

ఇది తెలిసిన వెంటనే హిందువులు, అస్పృశ్యులకు వ్యతిరేకంగా 144 సెక్షన్ విధించి చాదర్ చెరువులో ప్రవేశించి నీళ్ళను మైలపరచకుండా నిరోధించాలని కొలాబా జిల్లా న్యాయాధికారికి విన్నవించుకొన్నారు. జిల్లా న్యాయాధికారి దీనికి నిరాకరించడమే కాకుండా, ఆ చెరువు ప్రజలందరిదని, చట్టం ద్వారా సొరులెవ్వరినీ, అస్పృశ్యులతో సహా, చెరువునుండి నీటిని వాడడాన్ని నిరోధించలేమనీ స్పష్టం చేసాడు. కోర్టుకు పోయి ఆ చెరువు నుండి ప్రత్యేకంగా వాళ్ళు మాత్రమే నీరు వాడుకొనే హక్కును ఖాయ పరుచుకోమ్మని వారికి సలహానిచ్చినాడు. 1927 డిసెంబర్ 25, 26, 27 తేదీల్లో మహాసభ జరపాలని నిర్ణయించడం జరిగింది. మహాసభ రోజులు దగ్గర పడుతున్న కొద్దీ, అస్పృశ్యులు పట్టుదలతో ఉన్నారని తెలిసిన తరువాత, జిల్లా న్యాయాధికారి తమ సహాయానికి రావడానికి నిరాకరించాడని తెలుసుకొన్నాక వాళ్ళకు మిగిలిన అవకాశమొక్కటే . చట్టం ద్వారా తమ హక్కును ఖాయపరుచుకొని అస్పృశ్యులను ప్రజాల చెరువునుపయోగించకుండా చేయడం. దీని ప్రకారం వివిధ కులాల కు చెందిన తొమ్మిది మంది హిందువులు దావా దారులుగా మహద్ కోర్టులో సబ్‌జడ్జ్ ముందు 1927 డిసెంబర్ 12న కేసు నెం. 405/1927 వేయడం జరిగింది. నేను, నాతో పాటు నలుగురిని

అస్పృశ్యుల ప్రతినిధులుగా కేసులో ప్రతివాదులుగా చేయడం జరిగింది. ఈ దావా లక్ష్యం, సహజంగా చాదర్ చెరువు కేవలం హిందువుల ప్రైవేటు ఆస్థి అని, అస్పృశ్యులు ఆ చెరువు నుండి నీరును వాడుకునే హక్కులేదని కోర్టు ద్వారా ఒక ప్రకటన తెప్పించడం. ప్రతివాదులు ముందు ముందు అటువంటి పని చేయకుండా కోర్టు నుండి శాశ్వత ఉత్తర్వులు పొందడం. కోర్టులో కేసువేసిన రోజునే ప్రతివాదులకువ్యతిరేకంగా తాత్కాలిక ఇంజక్షన్ ఉత్తర్వులు, చెరువు నుండి నీరు వాడడాన్ని నిరోధిస్తూ, జారీ చేయాలని కోర్టుకు విన్నవించుకోవడం జరిగింది. 1927 డిసెంబర్ 14న నాకు, నాతోపాటు నాలుగురికి వ్యతిరేకంగా కోర్టు తాత్కాలిక ఉత్తర్వులు జారీ చేసింది.

న్యాయమూర్తి జారీ చేసిన తాత్కాలిక ఉత్తర్వులు మహాసభ మొదలు కావడానికి రెండు లేక మూడు రోజులముందే బొంబాయిలో నాకు అందజేయడం జరిగింది. సంప్రదింపులు జరుపడానికి గాని, సభను వాయిదా వేయడానికి గాని సమయం లేదు. ఈ విషయంపై సభకే నిర్ణయాన్ని వదిలివేయడానికే నిర్ణయించాను.

పోయిన సారి హిందువులు సవాల్ చేసిన విషయాన్ని దృష్టిలో ఉంచుకొని, చెరువు నుండి నీళ్ళు తీసుకొనే హక్కును నిర్ధారించే ప్రత్యేక లక్ష్యంతోనే ఈ సభకు పిలుపునివ్వడం జరిగింది. జిల్లా న్యాయాధికారి మార్గాన్ని బహిరంగ పరిచాడు. కాని ఉపన్యాయమూర్తి ఆచర్యను రద్దుచేస్తూ ఉత్తర్వులు జారీ చేసాడు. సమావేశం జరిగినపుడు, సహజంగానే ఎదురయిన మొట్ట మొదటి ప్రశ్న కోర్టు జారీ చేసిన నిషేధపుటుత్తర్వులను ధిక్కరించి చెరువులోకి ప్రవేశించాలా ? వద్దా అన్నది. అస్పృశ్యుల పట్ల ఇప్పటి దాకా అనుకూలంగా ఉన్న జిల్లా న్యాయాధికారి భిన్నమైన అభిప్రాయం తీసుకొన్నాడు. వ్యక్తిగతంగా సమావేశానికొచ్చిన అతను తన అభిప్రాయాలను స్పష్టంగా వివరించి చెప్పాడు. ఒక వేళ పౌరన్యాయస్థానము నిషేధపుటుత్తుర్వులు జారీ చేయకపోతే అస్పృశ్యులు చెరువులోకి ప్రవేశించే ప్రయత్నానికి సహాయం చేసేవాడినని, కాని ఉపన్యాయమూర్తి ఉత్తర్వులు జారీ చేయడం వల్ల తన పరిస్థితి భిన్నంగా మారిందని చెప్పడం జరిగింది. ఇప్పుడు అస్పృశ్యులను చెరువులోకి వెళ్ళనీయడం వీలుకాదు, ఎందుకంటే ఆచర్య కోర్టు అధికారాన్ని ధిక్కరించే వ్యవహారానికి ప్రత్యక్షంగా మద్దతు తెలిపినట్లవుతుంది. కాబట్టి అస్పృశ్యులు చెరువులోకి ప్రవేశించకుండా ఉత్తర్వులు జారీ చేయకతప్పదు. కోర్టు జారీ

చేసిన నిరోధపు ఉత్తర్వులు లెక్క చేయక అస్పృశ్యులు చెరువులోకి ప్రవేశించడానికే పట్టుబడితే అతను హిందువుల పట్ల అనుకూలంగా ఉన్నట్లు కాక పౌరన్యాయస్థానం జారీ చేసిన ఉత్తర్వులను గౌరవిస్తూ న్యాయస్థానం హెూదాను కాపాడవలసివస్తుంది.

అప్పుడు మహాసభ జిల్లా కలెక్టర్ చెప్పిన మాటలను, అస్పృశ్యులు చేసిన ప్రయత్నానికి హిందువులు చేసిన ప్రతిచర్యను ఆలోచించింది. సమావేశం చివరలో చట్టాన్ని ధిక్కరించడం కన్న చట్టాన్ని ఆచరించడమే మేలని, భద్రమని భావించి, చట్టం ఏమేరకు తమ హక్కులను కాపాడగలుగుతుందో చూడాలనే అభిప్రాయనికి రావడం జరిగింది. న్యాయస్థానం తీర్పు నిచ్చే దాక శాసనోల్లంఘన కార్యక్రమాన్ని నిలిపివేయడానికి నిర్ణయించడమైనది.

ఈ దావాలో హిందువులు ఓడి అస్పృశ్యులు గెలువడం వల్ల శాసనోల్లంఘన కార్యక్రమం తీసుకొనే అవసరం ఎప్పుడూ రాలేదు. శాసనోల్లంఘన కార్యక్రమాన్ని నిలిపి వేసి, చట్టాన్ని అనుసరించడానికి వెనుక ఉన్న ప్రధానకారణం, న్యాయస్థానం తన తీర్పు ద్వారా అస్పృశ్యత అనబడే ఆచారాన్ని గుర్తించి చట్ట బాధ్యత కల్పిస్తుందా లేదా అన్న విషయాన్ని చూడడానికి. సమన్యాయపాలన (rule of law) సూత్రాన్ని అనుసరించి, ఈ ఆచారానికి చట్ట బద్ధత కల్పిస్తే అది అనాది అయినదిగా, నైతికతను, ప్రజా విధానాన్ని వ్యతిరేకించనిదిగా ఉండాలి. అస్పృశ్యుల దృష్టి ననుసరించి ఈ ఆచారం నైతికతకు, ప్రజావిధానానికి వ్యతిరేకమైనది. కానీ న్యాయస్థానం ఆ విధంగా ప్రకటించనంత కాలం దాని వల్ల ఉపయోగం లేదు. అస్పృశ్యత అనే ఆచారం చెల్లనేరదనే నిర్ణయం, అస్పృశ్యులు. తమ హక్కుల కోసం చేసే పోరాటంలో ఎంతో విలువైన విషయం. ఎందుకంటే పౌరవ్యవహారాల్లో అస్పృశ్యత చట్టవ్యతిరేకమవుతుంది. చాదర్ చెరువు వివాదంలో అస్పృశ్యుల గెలుపు ఎంతో గొప్ప విషయం. కాని ఒక రకంగా అది నిరుత్సాహ పరిచే విషయం. బొంబాయి ఉన్నత న్యాయస్థానం అస్పృశ్యత అనే ఆచారం చట్టవ్యతిరేకమైనదని తేల్చలేదు. ఈ దావా హిందువులకు వ్యతిరేకంగా నిర్ణయించడానికి గల కారణం, నేను ఆరోపించిన విధంగా ఈ చెరువు విషయంలో ఈ ఆచారం సనాతనమైనదని నిరూపించలేకపోవడమే. ఆ చెరువు అస్పృశ్యుల కోసం కూడా తెరువ బడింది. కాని అస్పృశ్యులు వాళ్ళకనుకూలంగా గెలుపు సాధించారని అనుకోవడానికి వీలు లేదు. కాని ప్రధానమైన విషయం అస్పృశ్యత అనే విషయం చట్టపరమైన ఆచారమేనా? దురదృష్టవశాత్తు

ఉన్నత న్యాయస్థానం ఈ విషయంపై తీర్పునివ్వకుండా తప్పించుకొన్నది. అస్పృశ్యులు తమ పోరాటాన్ని కొన సాగించాల్సి వచ్చింది.

# III

ఆ తరువాత చరిత్రలో చెప్పుకోదగ్గ ప్రత్యక్ష చర్య నాసిక్ పట్టణంలో కాలారాం దేవాలయం అనేబడే హిందూ దేవాలయంలో ప్రవేశించడం. ఇవి కొన్ని ప్రత్యేకమైన లక్ష్యాలు సాధించడానికి తీసుకొన్న ప్రత్యక్ష చర్యలకు సంబంధించిన సంఘటనలు. హిందూ సామాజిక క్రమానికి చెందిన పునాదుల్లో డైనమేట్లు పెట్టిన ఈ ఉద్యమం లో ప్రత్యక్ష చర్యకు సంబంధించి రెండు కేసులున్నవి. మొదటిది మనుస్మృతి తగుల బెట్టడం, రెండవది చనిపోయిన హిందువుల పశువులను ఎత్తి వేసి, వాటి చర్మం తీయడానికి అస్పృశ్యులు నిరాకరించడం.

1927 డిసెంబర్ 20న మనుస్మృతిని తగుల బెట్టిన సంఘటన మహద్ పట్టణంలో జరిగింది. చాదర్ చెరువు నుండి నీళ్ళు తీసుకునే హక్కును ఖాయపరిచే క్రమంలో జరిగిన ప్రచారంలో భాగంగా ఈ ఉత్సవం జరిగింది. మనుస్మృతిని తగుల బెట్టిన సంఘటన బహిరంగంగా, అందరి ప్రజల సమక్షంలో అస్పృశ్యుల మహాసభలో జరిగింది. మనుస్మృతిని తగులబెట్టడానికి ముందు, ఈ మహాసభ కొన్ని తీర్మానాలు చేసింది. ఈ తీర్మానాలు అస్పృశ్యుల ఉద్యమ చరిత్రలో మైలురాళ్ళలాంటివి. అవి ఈ కింద పేర్కొన బడినవి.

"తీర్మానం 1. హిందువుల హక్కులపై ప్రకటన : సామాజిక అన్యాయాన్ని సహించడం, మత పరంగా తప్పుడు నమ్మకాలను ఆచరించడం, ఆర్థికపరమైన నేరాలను ప్రోత్సహించడమే హిందూ సమాజపు ప్రస్తుత శోచనీయమైన పరిస్థితికి కారణమని ఈ మహాసభ దృఢమైన అభిప్రాయం. హిందు సమాజం దిగజారడానికి కారణం, ప్రజలు మానవునికి పుట్టుకతో నున్న హక్కులేమిటో తెలుసుకోలేకపోవడం, అవి గుర్తించడానికి ప్రయత్నించకపోవడం. స్వార్థపరుల చర్యలను గమనించపోవడం. మానవునికి జన్మతః వచ్చే హక్కులను తెలుసుకొని గుర్తించడం మనిషికి మనిషికీ, వర్గానికి వర్గానికి మధ్య జరిగే ఘర్షణలో అవి తొక్కివేయబడకుండా చూడడం ప్రతీ వ్యక్తి విధి. ఈ మహాసభ

దృష్టిలో అన్యాక్రాంతం చేయదగని మానవునికి జన్మతః వచ్చే హక్కులేమిటో ప్రతీ హిందువుకూ తెలియజేయడానికి ఈ మహాసభ ఈ క్రింది ప్రకటన నివ్వడానికి తీర్మానించింది.

(I) జన్మతః అందరి హిందువుల సామాజిక హోదా ఒక్కటే. ఈ సమానత్వపు సామాజిక హోదా వారు చనిపోయేవరకు ఇవ్వబడిన ధర్మం. సమాజంలో వారు నిర్వహించే విధులను బట్టి వారిలో కొన్ని తేడాలు, విభేదాలుండవచ్చు. అంతమాత్రం చేత అవి వారి సామాజిక హోదాలో విభేధాలు కలిగించలేవు. కాబట్టి ఈ మహాసభ సమాజిక హోదాలో విభేధాలు సృష్టించే ఏ చర్యనైనా రాజకీయ, ఆర్థిక సామాజిక జీవితానికి సంబంధించినది ఏదైనా వ్యతిరేకిస్తుంది.

(ii) అన్ని రకాల రాజకీయ, ఆర్థిక లేదా సామాజిక మార్పుల అంతిమ లక్ష్యం అందిరి హిందువుల సమాన సామాజిక హోదాను దృఢంగా నిలబెట్టడం. ఈ విధమైన దృష్టి కలిగి ఉన్న ఈ మహాసభ, హిందు సామాజిక వ్యవస్థలో అంతర్లీనంగా నున్న శాశ్వత అసమానత్వపు సూత్రాన్ని, దానికి మద్దతు పలికే సాహిత్యాన్ని - అది ప్రాచీనమైనదైనా, ఆధునిక మైనదైనా - దృఢంగా తిరస్కర్తిస్తుంది.

(iii) అన్ని రకాల అధికారం ప్రజల నుండే వస్తుంది. ప్రజలు ఇస్తే తప్ప వర్గాలు లేదావ్యక్తులు అనుభవించే ప్రత్యేకాధికారాలకు చెల్లుబడిలేదు. కావున హిందువుల్లో కొన్ని వర్గాలు అనుభవిస్తున్న మత పరమైన విశేషాధికారాలు వేదాలు, స్మృతులు, పురాణాల్లో ఉన్నవే తప్ప ప్రజలిచ్చినవి కావని ఈ మహాసభ తన అసమ్మతని తెలుపుతున్నది.

(iv) ప్రతీ వ్యక్తికి మాట్లాడే, ఆచరించే హక్కు పుట్టుక తోనే వచ్చే హక్కు. ఇతర వ్యక్తికి చెందిన హక్కులను రక్షించడంకోసం తప్ప ఏ ఇతర లక్ష్యం కోసం కూడా ఈ హక్కుకు పరిమితులు విధించరాదు. ప్రజలు అనుమతిస్తే తప్ప, హిందు శాస్త్రాలు విధించే నిషేధపుటుత్తర్వుల ద్వారా ఈ హక్కుపై పరిమితుల విధించరాదు. కావున మత పరమైన, సామాజిక ఆర్థికపరమైన స్వేచ్ఛపై, హిందువుల ఆలోచనా, ఆచరణలపై ప్రజలచేగాక విధించిన మతపరంగా పరిమితులను ఈ మహాసభ తిరస్కరిస్తుంది.

(v) హిందువులకు జన్మతః వచ్చిన హక్కులను ఒక్క చట్టంతప్ప మరేదీ అడ్డుకోజాలదు. చట్టం ద్వారా ఏదైతే నిషేధించబడదో, చట్టం ద్వారా ఏదైతే బాధ్యత

కాదో దాన్ని నిర్వహించే తిరస్కరించే స్వేచ్ఛ హిందువుకున్నది, అదే విధంగా దాన్ని నిర్వర్తించాలని బలవంత పెట్టే హక్కు ఎవ్వరికీ లేదు. ఈ కారణంచేత ఏ వ్యక్తినీ, ప్రజారహదార్లు, సాముహిక బావులు లేదా చెరువులు, ప్రజాదేవాలయాలు, ఇతర ప్రజాసౌకర్యాలు ఉపయోగించకుండా నిరోధించకూడదు. చట్టపరమైన నిషేధం లేని చోట నిరోధం కలుగ చేసే వ్యక్తులను ప్రజాశత్రువులుగా ఈ సభ భావిస్తుంది.

(vi) చట్టం ఒక వ్యక్తి చేతుల్లో లేదా కొందరు వ్యక్తుల చేతుల్లోని అధికారం కాదు. చట్టం ,మార్పుకోసం ప్రజలు సూచించిన వ్యక్తీకరణ. అయినప్పుడు చట్టాన్ని గౌరవించాలి, అది అందరికీ ఆమోద యోగ్యంగా ఉండాలి, తరతమ భేదాలు లేకుండా అందరికీ సమానంగా వర్తింపచేయాలి. సమాజ లక్ష్యాల కనుగుణమైన సామాజిక విభేధాలు ఒక వేళ అవసరమయితే అవి గుణం మీదనే తప్ప పుట్టుక పై ఆధారపడగూడదు. మొదట సమాజానికి ప్రమాదకారి అయిన, రెండు పుట్టుకపై ఆధారపడిన, మూడు ప్రజాసమ్మతి లేని హిందు కుల వ్యవస్థను ఈ మహాసభ తిరస్కరిస్తుంది". మహాసభ ఆమోదించిన రెండవ తీర్మానం ఈ కింది విధంగా వున్నది.

"తీర్మానం -2: మనువు పేరున ప్రకటించబడిన చట్టాలు, మనువు హిందు స్మృతికారుడన్న విషయం దృష్టిలోకి తీసుకుంటే ధర్మంగా గుర్తించబడినవి – అవి నిమ్నకులాల వ్యక్తులను కించపరిచేవిగా ఉన్నవి. అంతేకాక మానవులుగా వారికి హక్కులు తిరస్కరించి వారి వ్యక్తిత్వాన్ని అణగదొక్కే విధంగా రూపొందించబడినవి. నాగరిక ప్రపంచం మానవులకు గుర్తించిన హక్కులతో వీటితో పోల్చి చూస్తే, ఈ మనుస్మృతి గౌరవింపదగినదికాదని, దీన్ని పవిత్రమైనదిగా గుర్తించకూడదని ఈ మహాసభ అభిప్రాయపడుతున్నది. దీన్ని తీవ్రంగా వ్యతిరేకిస్తూ మతం అనే ముసుగులో సామాజిక అసమానత్వాన్ని పోషిస్తున్న వ్యవస్థకు నిరసనగా, దీని ప్రతిని కాల్చివేయాలని ఈ మహాసభ తీర్మానించడం జరిగింది."

ఈ తీర్మానాలను స్థూల దృష్టితో పరిశీలిస్తే ఈ మహాసభ గైకొన్న మార్గాన్ని గమనించవచ్చు. ఒక ప్రత్యేకమైన తప్పును సరిదిద్దడానికి సమావేశమైన ఈ సదస్సు చిన్న చిన్న తప్పులను సరిదిద్దడంతో సంతృప్తి పడదలుచుకోలేదు. అస్పృశ్యులకు ఒక లక్ష్యాన్ని నిర్ణయించే సమయం ఆసన్నమయిందని ఈ సదస్సు భావించింది. ఇది

విధించిన లక్ష్యం సుదూరమైనది. హిందూ సమాజ వ్యవస్థ సంపూర్ణంగా సంస్కరించబడాలని అస్పృశ్యుల కోరిక. ఈ పునర్నిర్మాణం పురాతన హిందు శాస్త్రాల ఆధారంగా కాకూడదని ఈ సభ ప్రకటించింది. కొత్త పునాదుల లక్షణాలేమైనా హిందువుల మధ్య న్యాయం, సమానత్వం ఆధారంగా, హిందువులకు ఈ పునర్నిర్మాణం పట్ల అనుమానాలేమీ లేకుండా ఇది జరగాలని ఈ సభ పునరుద్ఘాటించింది. ఈ మహాసభ పాత వాటన్నింటిని తిరస్కరించడమే గాక వాటిని కాలరాచి బూడిదగా మార్చేవరకు పోయింది.

ఇది వాల్టేర్ తన కాలంలోని కాథలిక్ చర్చ్‌ను తిరస్కరించిన ఘటనకు ప్రతిధ్వని. మొదటి సారిగా హిందూ సమాజ క్రమాన్ని వ్యతిరేకిస్తూ దాన్ని కాల్చివేయాలని నినదించడం జరిగింది. ఈ తీర్మానాలు నిరపేక్షంగా విప్లవాత్మకమైనవని స్పష్టంగానే తెలుస్తున్నది.

హిందు సమాజ వ్యవస్థ మను స్మృతి అనే శిలపై నిర్మించబడింది. హిందు ధర్మశాస్త్రాల్లో ఇది భాగం కాబట్టి హిందువులందరికి ఇది పవిత్రమైనది. ఇది పవిత్రమైనది కాబట్టి తప్పులేనిది. ప్రతీ హిందువు దాని పవిత్రతను నమ్మి దాని ఉత్తర్వులను పాటిస్తారు. అది కులవ్యవస్థను, అస్పృశ్యతను సమర్థించడమే కాక దానికి న్యాయసమ్మతి కల్పిస్తుంది. మనుస్మృతిని కాల్చివేయడమనేది ఎంతో సాహసోపేతమైన చర్య. అది హిందూత్వమనే కోటపై చేసిన ప్రత్యక్షదాడి. ఫ్రాన్సులో బాస్టిల్ కోట ఎలాగైతే ప్రాచీన రాజరిక వ్యవస్థకు మూర్తీభవించిన అవతారమో అదే విధంగా మనుస్మృతి హిందూ జీవితంలోని అసమాన ఆలోచనకు పునాది, మూర్తీభవించిన చిహ్నం. 1927లో మహద్ పట్టణంలో అస్పృశ్యులు మనుస్మృతిని తగుల బెట్టిన సంఘటనకు చరిత్రలో ఫ్రాన్స్‌లోని బాస్టిల్ కోటను బద్దలు కొట్టి యూరప్ ప్రజలను విముక్తి చేసిన సంఘటన కున్నంత ప్రాముఖ్యత ఉన్నది.

హిందు సమాజవ్యవస్థకు వ్యతిరేకంగా ప్రత్యక్ష్య చర్యకు సంబంధించిన రెండో సంఘటన హిందువులకు చెందిన చచ్చిన పశువులను మోసుకొనిపోయి తోలు తీయడానికి నిరాకరించడం.

అస్పృశ్యత అనే శాపాన్ని తమ మీదికి తెచ్చుకోవడం గురించి అస్పృశ్యులనే విమర్శించడం మనం తరుచుగా వింటూనే ఉన్నాం. ఆరోపణకు గల కారణం అస్పృశ్యులు

అలవరుచుకొన్న వృత్తి – హిందువుల చచ్చిన పశువులను లాక్కుపోయి, వాటి తోలు తీసి వాటి మాంసాన్ని తినడం వల్ల.

అధోతరగతి వాళ్ళ గొప్ప మిత్రుడైనప్పటికీ మద్రాసు ప్రాంతంలోని పరియాల గూర్చి రాస్తూ ఏబ్ దుబోవా (Abe Dubois) ఇలా అంటాడు:

"ప్రధానంగా పరియాల ఆహారపు అలవాట్లు ఇతర స్థానికులు వారి పట్ల అసహ్యం చూపేలా చేస్తాయి. వాసనచే ఆకర్షితులైన వీరు చచ్చిన పశువుల చుట్టూ కుక్కలు, నక్కలు, కాకులు ఇతర మాంసభక్షక జంతువులతో పాటు చేరుతారు. అప్పుడు వారు సగం కుళ్ళిన మాంసాన్ని చచ్చిన పశువు నుండి వేరు చేసి తమ గుడిసెలకు తీసుకుపోతారు. అక్కడ దాన్ని వారు తింటారు, దాని వాసనను తగ్గించకుండా, అన్నం లేకుండానే భుజిస్తారు. ఒకవేళ పశువు ఏ రోగం తోనో చనిపోయినప్పటికీ వారికి పట్టింపులేదు. కొన్ని సార్లు వాళ్ళు ఆవులను, గేదెలను విషప్రయోగం చేసి తమ విందు కోసం చంపుతారు. ఇక వాటిని శుద్ధి చేయడమే మిగులుతుంది. గ్రామంలో చచ్చిన జంతువుల శవాలమీద హక్కు తోటి లేదా పాకీ వాళ్ళది. వాళ్ళు చుట్టుపక్కలున్న పరియాలకు వాటి మాంసాన్ని చవకగా అమ్ముతారు. వాళ్ళు తీసుకొన్న మాంసాన్ని ఒక్కరోజులో తినలేకపోతే దాన్ని ఎండబెట్టి దాచుకొని వారికి ఆహారపు కొరత ఏర్పడ్డప్పుడు వాడుకుంటారు. కొందరు పరియాల ఇళ్ళల్లో భయంకరంగా వేళ్ళాడుతున్న ఈ మాంసపు ఎండుగలను చూడడం ఎవరికైనా ఇబ్బందిగా ఉంటుంది. ఐనప్పటికీ ఆ వాసన పరియాలపై ఏ విధంగాను ప్రభావితం చేయదు. ఆ వాడ నుండి పోతున్న వారెవరైనా వచ్చే వాసనను బట్టి అక్కడ నివసిస్తున్న ప్రజల కులాన్ని చెబుతారు.

"ఇలాంటప్పుడు ఇతర కులాలవాళ్ళు వాళ్ళ పట్ల తిరస్కార భావాన్ని కలిగి ఉండడం ఆశ్చర్యమేముంది? ఈ రకమైన అసభ్యతతో ఎలాంటి సంబంధం పెట్టుకోనందుకు వారిని నిందించవచ్చునా? లేక వారిని మన్నిస్తూ తమకు తాముగా ఒంటరిగా ఉంటూ ప్రత్యేకంగా తమ గుడిసెల్లో నివసించే వాళ్ళను నిందించాలా?"

అస్పృశ్యులు చేపట్టిన వృత్తి వల్ల వాళ్ళకు వ్యతిరేకంగా ఇతర కులాల వాళ్ళలో ఒకరకమైన అసహ్యభావం కలిగిన మాట నిజమే. ఏబ్ గానీ, ఈ కోణం చూపుతున్న

ఇతరులుగానీ రెండు ప్రధానమైన ప్రశ్నలు లేవనెత్తడం మరిచిపోతున్నారు. మొదటిది,అస్పృశ్యులు చచ్చిన జంతువుల మాంసాన్ని ఎందుకు తింటారు? హిందువులు అస్పృశ్యులకు చచ్చిన పశువును తీసి కొని పోయి వాటి చర్మం తీయకుండా, వాటి మాంసం తినకుండ ఉండే స్వేచ్ఛనిస్తారా? అస్పృశ్యులు చచ్చిన జంతువుల మాంసాన్ని ఎందుకు తింటారనే ప్రశ్నకు జవాబు ఇంతకు ముందున్న అధ్యాయాలలో ఇవ్వబడింది.

శుభ్రమైన తాజా మాంసం లభ్యమయితే కుళ్ళిన మాంసం తినడానికెవరూ ఇష్టపడరు. అస్పృశ్యులు కుళ్ళిన మాంసం మీద బతుకుతున్నారంటే దాన్ని ఇష్టపడికాదు. వేరేదేదీ దొరకక, అస్పృశ్యత కారణంగా వారికి వేరే జీవన విధానం కోరుకునే అవకాశం లేదు కాబట్టి. దీన్ని బట్టి విషయం అర్థం చేసుకోగల్గేవాళ్ళకు స్పష్టం గానే అర్థమవుతున్నది. అన్ని రకాల వృత్తులూ వాళ్ళకు మూసి వేయబడినవి. భూమితో వచ్చిన ఉత్పత్తిపై బతుకుదామంటే వారికి భూమి లేదు. వారు చేసుకోగలిగే వ్యాపార మేమీ లేదు. వాళ్ళ ప్రధాన జీవనాధారం గ్రామస్థుల నుండి సేకరించే ఆహారం లేదా వాళ్ళకోసం వదిలిన చచ్చిన పశువుల కుళ్ళిన మాంసం. ఆ చచ్చిన పశువుల మాంసమే లేకపోతే వాళ్ళు ఆకలితో చచ్చిపోతారు. కాబట్టి చచ్చిన జంతువుల మాంసభక్షణ అస్పృశ్యుల తప్పుకాదు. అస్పృశ్యులు చచ్చిన పశువుల కుళ్ళిన మాంసం తింటున్నారంటే అందుకు కారణం హిందువులు వారికి ఓ గౌరవ ప్రదమైన సంపాదనతో కూడిన జీవన విధానమేదీ వదలకపోవడమే.

రెండవ ప్రశ్నకు కూడా జవాబు స్పష్టంగానే ఉన్నది. హిందువుల చచ్చిన పశువులను తీసికొని పోయివాటి చర్మం తీస్తున్నారంటే వారికి వేరే అవకాశం లేకనే. వారు బలవంతంగా ఆ పని చేస్తున్నారు. ఒక వేళ వారాపని చేయ నిరాకరిస్తే శిక్షింపబడతారు. ఆ శిక్ష చట్టపరమైనది. కొన్ని ప్రాంతాల్లో ఈ మురికి పని చేయనిరాకరిస్తే అది ఒప్పందాన్ని ధిక్కరించిన (Breach of Contract) నేరం. కొన్ని ప్రాంతాల్లో దానికి జుల్మానా కట్టాలి. బొంబాయి ప్రాంతంలో అస్పృశ్యులు గ్రామ సేవకులు. గ్రామసేవకులుగా వారు ప్రభుత్వానికే గాక, హిందూ ప్రజలకు గూడా సేవ చేయాలి. దీనికి బదులుగా వారికి భూములివ్వడం జరిగింది. ఆ భూమిని సాగు చేసుకుంటూ, వచ్చిన ఉత్పత్తిపై వారు బతుకుతున్నారు. గ్రామాల్లోని హిందువుల చచ్చిన పశువులను తీసుకొని పోయి

వాటి చర్మం తీయడం కూడా వారి విధుల్లో ఒకటి. ఒకవేళ హిందూ ప్రజలకు అస్పృశ్యులు ఈ సేవలు చేయక పోతే వారికిచ్చిన భూమి జప్తుచేయబడుతుంది. ఆ మురికి పని చేయడమో లేక ఆకలితో చావడమో ఏదో ఒకటి వాళ్ళు ఎంచుకోవాలి.

ఐక్యపరగణాల్లో (United Provinces) పాకీ పని చేసేవాళ్ళు ఆ పని చేయనిరాకరిస్తే అది నేరం. ఐక్య ప్రాంతాల్లోని 1916 నగర పాలిక చట్టం IIలో, ఈ క్రింది అంశాలు పేర్కొనబడినవి.

"సెక్షన్ 201 (1) – "ఆచార రీత్యా ఇళ్ళ లో పాకీ పని చేసేవారు తమ పని సక్రమంగా నిర్వర్తించకపోతే, ఆ ఇంటి యజమాని న్యాయాధికారికి ఫిర్యాదు చేయవచ్చు"

2) "ఆ ఫిర్యాదు తీసుకున్న న్యాయాధికారి విచారణ నిర్వహించాలి. న్యాయాధికారి పాకీ పనివాడి పనితో సంతృప్తి చెందకపోతే లేక పాకీ వాడు సక్రమంగా వచ్చి పాకీ పని చేయకపోతే పది రూపాయల దాకా జుల్మానా వేయవచ్చు. రెండో సారి రుజువయితే పాకీ వాడు ఆ ఇంటిపై ఆచార రీత్యా తనకున్న హక్కును వదులుకోవాలి".

1911 పంజాబ్ నగర పాలిక చట్టం 165వ ప్రకరణం ఇదే విధమైన అంశాన్ని తెలియజేస్తుంది. పంజాబ్ చట్టం ఐక్య పరగణాల చట్టం కన్న ఎంతో ముందున్నది. అయితే ఇక్కడ పాకీ వాడు ఆచారరీత్యా గాక, ఒప్పందాన్ని అనుసరించి పని చేసేవాడు. పంజాబ్ చట్టం ఈ విధంగా తెలుపుతుంది.

"ఏ పాకీ పనివాడైనా (ఆచారరీత్యా పాకీ పని చేసే వాడుగాక) ఇంటిలో సఫాయి పని చేయడానికి ఒప్పందం కుదుర్చుకొన్న వాడు 14 రోజుల నోటీసు లేకుండా, ఇంటి యజమానికి సరి అయిన కారణం చూపకుండా పని బందు చేస్తే, అది రుజువయితే అతనికి పది రూపాయల జుల్మానా శిక్షగా వేయవచ్చు"

"227 – 165 సెక్షన్ ప్రకారం తమ బాధ్యతను వదులు కోవడం గురించి ఉన్నత న్యాయస్థానానికి విన్నవించుకోవచ్చు. కాని ఇతరత్రా విన్నవించ వీలు లేదు".

బలవంతపు శ్రమ చేయించుకోవడానికి వీలుగా వున్న చట్టపరమైన ఆదేశాలను చూస్తుంటే ప్రజలకు ఆశ్చర్యం కలుగక మానదు. నిస్సందేహంగా బానిసత్వానికి,